## FOREWORD

Lt. Col. C. K. Nayudu.

I feel honoured on being asked to write the foreword to this work **PRAPANCHA KREEDA SANGRAHA CHARITRA** by Sri Bommakanti Subba Rao. It is indeed, very creditable for my friend, Sri Bommakanti Subba Rao, for devoting his time in compiling in a concised form, the history of various sports and of men who have made their mark. This effort appears to me first of its kind and perhaps first of its type not only in India but also elsewhere. I must congratulate this young man for his laudable work.

We in India need such works to stimulate and awaken the spirit to enter into sports and sportsmanship with a firm determination to place India at the top, in the map of world sport.

We have wonderful traditions of the past, we maintain them at present and I hope the future will still be better.

**Jai Hind !**

Madras,
2—12—1957

# పీఠిక

లెఫ్టినెంట్ కర్నల్ సి. కె. నాయుడు.

మిత్రులు శ్రీ బొమ్మకంటి సుబ్బారావు తాము రచించిన "ప్రపంచ క్రీడా సంగ్రహ చరిత్ర"కు పీఠిక వ్రాయమని నన్ను కోరడం నన్నెంతో గౌరవించినట్లుగా భావిస్తున్నాను. వివిధ క్రీడల చరిత్రలు, వాటిలో అగ్రగణ్యులైన వారి జీవితాలు ఈ గ్రంథంలో పొందుపరచడానికి వీరు తమ సమయాన్ని వినియోగించడం మెచ్చదగినది. ఇట్టి కృషి బహుశా భారత దేశంలోనే కాక ఇతరత్రా కూడా ప్రప్రథమమనే తోస్తున్నది. ఇట్టి స్తుతిపాత్రమైన గ్రంథం రచించినందుకు వీరిని నేను ప్రశంసించక తప్పదు.

భారత దేశానికి ప్రపంచ క్రీడారంగంలో అగ్రస్థానం సంతరింపజేసే దృఢసంకల్పంతో బాలురు, యువకులు క్రీడలలో ప్రవేశించడానికి, సరసతను అలవరచుకోడానికి మనకు ఇట్టి గ్రంథాలు అవసరం.

క్రీడారంగంలో మనకు అద్భుతమైన సంప్రదాయాలు ఏర్పడి ఉన్నవి; వాటిని రక్షించుకుంటున్నాము; భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉండగలదని ఆశిస్తున్నాను.

మద్రాసు,
2-12-57.

సి. కె. నాయుడు

# అంకితం




**( 1892 — 1942 )**

చిన్నతనంలోనే నన్ను క్రీడోత్సవాలకు, ఉత్తమ చలనచిత్ర ప్రదర్శనాలకు వెంట తీసికొని వెళ్ళి, నాలో సదభిరుచులను చిగురింపజేసిన నా పితృదేవత శ్రీ బొమ్మకంటి రాజగోపాలరావుగారి (సబ్ పోస్ట్‌మాస్టర్, తోట్లవల్లూరు, గన్నవరం, నూజివీడు, నందిగామ) దివ్యస్మృతికి.

— రచయిత

# రచయిత పరిచయం

"పత్రికారచన పసిడిసంకెల" అనేవారు "కులపతి" శ్రీ అడవి బాపిరాజుగారు. ఈ సంకెల సమీపించినవారిని సమ్మోహితులను చేసి, కట్టివేస్తుంది కదలనీయకుండా. అలా సమ్మోహితులై పాలికి వచ్చిన పెద్దపెద్ద పదవులను కాలదన్ని ఈ పసిడి సంకెలలో పడిపోయినవారు శ్రీ బొమ్మకంటి సుబ్బారావుగారు. దీనికి కారణం విద్యార్థి దశలోనే వీరిలో పొటమరించిన రచనాసక్తి పట్టభద్రులై జీవితాంగణంలో అడుగిడిన తర్వాత రచనావ్యాసాంగంగా పరిణితి చెందడమే.

స్పోర్ట్స్, సినిమా వీరి అభిమాన విషయాలు. విద్యార్థిదశలో ఫుట్‌బాల్ వీరి అభిమాన క్రీడ. కనుకనే వీరు శ్రీ అడవి బాపిరాజు గారి సంపాదకత్వంలో వెలువడుతున్న "మీజాన్" దిన పత్రికలో పని చేస్తున్నప్పుడూ, పదేళ్ళుగా "ఆంధ్రప్రభ" లోనూ ఈ శాఖలను ఎంతో దక్షతతో నిర్వహించారు; నిర్వహిస్తున్నారు; క్రీడలపై, చలన చిత్రకళపై అనుపమ వ్యాసాలు మాత్రమేకాక వ్యంగ్యరచనలు, కథలు, నాటికలు అనేకం కూర్చారు; శ్రీ కె. వి. రెడ్డి, B. Sc. (Hons.) గారివద్ద స్టోరీ, స్క్రిప్ట్ రైటరుగా "గౌరవహోదా"లో కొంతకాలం పనిచేశారు; దక్షిణ భారత సినీ టెక్నిషియనుల సంఘంలో యాక్టివ్ సభ్యులుగానూ ఉన్నారు.

శ్రీ సుబ్బారావుగారు సత్యాన్వేషకులు; రచనా వ్యాసంగానికి, రచనా స్వాతంత్ర్యానికి ప్రాణంకన్న హెచ్చువిలువ నిచ్చేవారు. కనుకనే వీరి రచనలో విశిష్ట పరిశోధక దృక్పథం, నిష్పాక్షికత, స్పష్టత పరీవాహంగా ప్రవహిస్తుంటాయి. తెలుగులోనే కాక భారత భాష లన్నిటి లోను — బహుశ ప్రపంచ భాషలలోను తొలి దన దగిన ఈ "ప్రపంచ క్రీడా సంగ్రహ చరిత్ర" ముందున్న మీకు నేను ఏ మాట చెప్పినా, "ముంజేతి కంకణానికి అద్దం చూపడం వంటిదే" అవుతుంది.

— తిరుమల రామచంద్ర.



బొమ్మకంటి సుబ్బారావు

# మనవి మాట

మన పూర్వులు ఆముష్మికానికి ఎంత ప్రాధాన్యమిచ్చినారో, ఐహికానికీ అంతప్రాముఖ్యమే యిచ్చారు. ఆముష్మికానికి శరీరమే కదా సాధనం. "శరీర మాద్యం ఖలు ధర్మసాధనం" అన్నది వారి నమ్మకం. ఈ శరీరం స్వస్థంగాను, దృఢంగాను ఉంటేనే ధర్మసాధనం సాధ్యం. కనుకనే సింహసత్వం - దృఢకాయం అవసర మన్నాడు పతంజలి యోగ సూత్రాలలో. ఈ సింహసంహనత వ్యాయామక్రీడలువినా సంభవమా ?

స్వాస్థ్యరక్షణకు క్రీడలు ఎంత ముఖ్యమైనా, మనదేశపు బుద్ధిజీవులు వీటిని కొంచెం చిన్నచూపు చూడడం ఏమి దురదృష్టమో ? శిల్పుల రూపరచనకు, చిత్రకారుల వర్ణవిన్యాసాలకు, కవుల కల్పనకు - ఒక విధంగా చూస్తే శరీరమే ప్రోది కదా. దానిని దృఢతరం చేసే అపూర్వ వ్యాయామ క్రీడ లంటే నిరీహ ఎందుకో ?

దీనికి కారణం క్రీడాప్రవీణుల ప్రతిభా విశేషాలు శిల్పం వలె, చిత్రం వలె, కావ్యం వలె ఎన్నితరాలకైనా సుస్థిరంగా ఉండకపోవడమేనేమో! నిజమే. లలితకళలతో సమానమైనా వానివలె ఇవి సుస్థిరతను, శాశ్వతతను ఎలా సంతరించుకుంటాయి. ఏ క్షణంలో రికార్డు సాధించినప్పటి ప్రజ్ఞ ఆ క్షణంలోనే సరి. నేటి ప్రతిభ రేపటికి మరుగునపడుతుంది. అందుచేతనే అది చరిత్ర అడుగునపడిపోతున్నది. క్రీడావైభవాన్ని, క్రీడాకారుల కళావిలాసాన్ని గ్రంథరూపేణ శాశ్వతం చేయడానికి జరిగిన ప్రయత్నమూ అల్పం.

క్రీడారంగంలో ఇండియాకు, ఆంధ్రకు ఘనచరిత్ర కలదు. ఆంధ్రుల శక్తియుక్తులు ఇతరులతో పోల్చిచూస్తే తక్కువ కాదు; అయినా వీరికి ప్రచారం చాల తక్కువ. ఇంతేకాదు. ఆంధ్రుల ఘనతను బైటిప్రాంతాల వారే కాక ఆంధ్రులలోనే చాలామంది గమనించి వుండలేదంటే అతిశయోక్తి కాదు. కనుక దేశ విదేశ క్రీడల, క్రీడానిపుణుల చరిత్రలను - ముఖ్యంగా ఆంధ్రక్రీడానిపుణుల సాధనలను తెలిపే ఉద్దేశంతోనే ఈ గ్రంథం రచించాను. గ్రంథ ప్రమాణం మరీ పెచ్చుపెరిగి పోకుండా

వుండడం నిమిత్తం దేశ, విదేశ క్రీడాప్రవీణులలో ఘనచరిత్ర సృష్టించిన వారి గురించి సంగ్రహంగానేమి, దీర్ఘంగానేమి ప్రస్తావించి వున్నాను. ఇదే కారణంపై ఆంధ్రదేశంలో విశేషంగా ప్రచారంలోవున్న క్రీడలు గురించి మాత్రమే ప్రధానంగా ప్రస్తావించాను.

నాటి, నేటి ఆంధ్ర క్రీడాప్రముఖులలో వీలైనంతమంది జీవిత చరిత్రలు సేకరించి, ప్రచురించ గలిగాను. నాకు అందుబాటులో లేని కారణంచేత కొద్దిమంది జీవితచరిత్రలు సేకరించి వుండక పోయినట్లయితే, తగు అవకాశం లభించగానే, అట్టివారిని గురించికూడా తదుపరి|ముద్రణలలో ప్రస్తావించడానికి సిద్ధంగా వున్నాను.

ఇక ఈ పుస్తకం పీఠిక గురించి రెండు మాటలు. ముందుమాట వ్రాసినవారు కొఠారి వంశీకులు.

తెలుగువారు ఎక్కడికి వెళ్ళినా తెలుగు తల్లికి, భారతదేశానికి కీర్తి తెచ్చారు. కొఠారివారి స్వగ్రామం బందరు. ఉప్పెన రోజులలో సి. కె. నాయుడుగారి తాతగారు శ్రీ కొఠారి నారాయణస్వామి నాయుడుగారు మధ్యభారతానికి, అక్కడనుంచి నాగపూర్‌కు బస మార్చారు. వీరికి ఆంధ్రాభిమానం మెండు. 1875 లో నాగపూర్‌లో ఆంధ్ర మహాసభ ఏర్పాటుచేసి, మహాసభ ఆధ్వర్యాన తెలుగు పాఠశాల లను నిర్వహించి, అనేక కుటుంబాలను పోషించారు.

వీరి పుత్రులు శ్రీ వెంకటరామన్న నాయుడుగారు, శ్రీ సూర్య ప్రకాశరావు నాయుడుగారు. పెద్దకుమారుడు (శ్రీ సి. వి. నాయుడు) గొప్ప వక్త. న్యాయశాఖలో ఉన్నత పదవులను నిర్వహించి వున్నారు. చిన్నకుమారుడు (శ్రీ సి. ఎస్. నాయుడు) బారిస్టర్ కేంబ్రిడ్జి యూని వర్శిటీలో శ్రీ రంజిత్ సింహ్‌జీ సహాధ్యాయులు. ఈ క్రీడా నిపుణుడు అక్కడ "హెర్క్యులస్"గా పేరొందారు. రంజిత్ సింహ్‌జీతో క్రికెట్ ఆడేవారు.

శ్రీ సూర్యప్రకాశరావు నాయుడుగారి కుమారులు శ్రీ కనకయ్య నాయుడు (సి. కె. నాయుడు), శ్రీ సుబ్బన్న నాయుడు (సి. ఎస్.

నాయుడు), శ్రీ రంగయ్య నాయుడు (సి. ఆర్. నాయుడు) "సి. కె." ఏడవ ఏటనే క్రికెట్ ప్రారంభించినప్పటినుంచి తండ్రిగారి సలహాలతో వారి మార్గదర్శకత్వంలో ప్రావీణ్యం పెంపొందించుకొంటూ వచ్చారు. యౌవన దశారంభంలో నాయుడుగారు పరుగులో లేడి. 100 గజాల దూరాన్ని 10 సెకండులలో పరుగిడి వున్నారు. అప్పటికది నిజంగా అఖిల భారత రికార్డు. క్రికెట్‌లో ప్రపంచ ఖ్యాతిగడించిన శ్రీ నాయుడు గారు ఎథ్లెటిక్స్, ఫుట్‌బాల్, హాకీ, టెన్నిస్, టేబుల్ టెన్నిస్, పోలో, షూటింగ్, వేట, బిలియార్డ్స్, స్నూకర్, మల్లవిద్యలలోకూడా అద్భుతప్రజ్ఞ గడించివున్న విషయం వారి ఆత్మీయులకు మాత్రమే తెలుసు.

శ్రీ సి. కె. గారి కుమారులు, కుమార్తెలు కూడా తండ్రిగారివలెనె అనేక క్రీడలలో ప్రావీణ్యం గడించివున్నారు. పెద్దకుమారుడు శ్రీ సి. ఎన్. నాయుడు ("బాబ్జీ") క్రికెట్, టేబుల్ టెన్నిస్‌లలో దిట్ట. ఈయన తమ్ముడు ప్రకాష్‌నాయుడు, 13 వ ఏటనే అఖిలభారత జూనియర్ టేబుల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ సాధించిన "బాలకిశోరం."

కొఠారి కుటుంబం క్రికెట్‌కు చేసిన సేవ, ఆంధ్రకు తెచ్చిన ఖ్యాతి అనుపమం. "నాగపూర్ నాయుడు కుటుంబము" వారు షేక్స్‌పియర్ నాటకాలు ప్రదర్శించేవారు. వీరే నాగపూర్‌లో "నాయుడు క్రికెట్ జింఖానా" నిర్వహించారు. 1890-1900 మధ్య ఈ సంస్థ నిర్వహణ వ్యయం ఏడాదికి పది, పదిహేను వేల రూపాయల మధ్య వుండేదంటే "నాయుడు కుటుంబం" క్రికెట్ పట్ల చూపిన ఆసక్తి, ఈ క్రీడాభివృద్ధికి వారు నిర్వహించిన కృషి ఎంత గొప్పదో ఊహించవచ్చు.

ఇటువంటి క్రీడాచరిత్ర గల కొఠారివంశీకులు "పద్మభూషణ్" సి. కె. నాయుడుగారు ఈ గ్రంథమునకు పీఠిక వ్రాయడం నాభాగ్యంగా భావిస్తున్నాను.

ఏడాది శ్రమపై సిద్ధమైన గ్రంథ మిది. దీనిని ముద్రణకు సిద్ధపర చడంలో నాకు సహాయపడి, నాతోపాటు అహోరాత్రం పనిచేసిన మిత్రులు శ్రీ ఏకా వెంకట సుబ్బారావు, శ్రీ ఆమంచర్ల మల్లికార్జునరావు గార్లకు నా నిండు కృతజ్ఞత.

ఈ గ్రంథరచనలో "హిస్టరీ ఆఫ్ గేమ్స్" అనే బ్రిటిష్ గ్రంథం, క్రీడా సంచికలు, ఇంకా క్రింది ప్రముఖుల వ్యాసాలు తోడ్పడినవి.

శ్రీయుతులు కోట రామస్వామి, టంగుటూరి అచ్యుతరామారావు, కొల్లి రంగదాసుచౌదరి, బులుసు వెంకటరమణయ్య, రావూరు కృష్ణస్వామి (ఆంధ్రప్రభుత్వపు రిటైర్డ్ సీనియర్ ట్రాన్స్లేటర్), తటపర్తి సూర్యనారాయణ ("భారతి" లో వ్యాసం), దర్భా వెంకయ్య, సూర్యదేవర అంకినీడు, కె. నరసింహారావు, సిడ్నీస్మిత్ (స్నూకర్ చరిత్ర వ్యాసం) గారలు. వీరందరికీ నా అభివాదాలు.

సులభసారస్వతానికి ఎనలేని గిరాకీవున్న ఈ రోజులలో క్రీడా గ్రంథం ప్రచురించడం ఒకవిధంగా సాహసమే. ఇటువంటి సాహసం చూపి, తెగువతో గ్రంథాన్ని ప్రచురించి, క్రీడాసారస్వత వికాసానికి ప్రాతిపదిక వేసిన కవిరాజ పబ్లిషర్స్కు, ఆ సంస్థ అధిపతి శ్రీ కొసరాజు మాధవయ్యగారికి, ఈ గ్రంథాన్ని సిద్ధపరచడంలో అనేకఘట్టాలలో సలహాలిచ్చి ముందుకు నడిపించిన శ్రీ తిరుమల రామచంద్రగారికి, ఈ పుస్తకమును రచించవలసిందిగా ముందు పురికొల్పిన శ్రీ వేమూరి యోగానంద లక్ష్మీనరసింహారావు గారికి కృతజ్ఞుణ్ణి. ఈ గ్రంథంలోని లైన్ డ్రాయింగులను వేసియిచ్చిన శ్రీ కోదండరామ్ గారికి, ముఖచిత్రం వేసియిచ్చిన శ్రీ దేవిడీగర్ గారికి ధన్యవాదాలు.

ఈ గ్రంథాన్ని పాఠకులు ఆదరించగలరనీ, క్రీడలపై పరంపరగా గ్రంథాలు వెలువరించి క్రీడాసారస్వత వికాసానికి పాటుపడడానికీ విధంగా ప్రోత్సాహ ప్రోద్బలాలివ్వగలరనీ ఆశిస్తున్నాను. పాఠకులు తమ అమూల్యాభిప్రాయాన్ని నాకు తెలుపవలెనని కూడా కోరుతున్నాను.

ఈ నా సారస్వతకృషి ఏదైన కీర్తితెస్తే అది నిజంగా వెళ్ళవలసింది ఈ గ్రంథం రూపొందడానికి కారకులైన ప్రతి ఒక్కరికీ.

153, హామిల్టన్ బ్రిడ్జి రోడ్,
ట్రిప్లికేన్, మద్రాసు - 5

బొమ్మకంటి సుబ్బారావు

# విషయసూచిక

అధ్యాయము ... పుట

అనుబంధము

# అధ్యాయము 1

# వ్యాయామరంగంలో బాలల పాత్ర

వెంపలిచెట్టుకు నిచ్చెనవేసే వారు ఉద్భవించ బోతారనే ఆర్యోక్తి వుంది. ఈ కాలపు బాలబాలికలను చూస్తూవుంటే అనతికాలంలోనే ఇది అక్షరాలా జరిగేటట్లున్నది. వ్యాయామవిద్యపట్ల పాఠశాలల నిర్వాహకులు కాని, "భావి పౌరుల" ఆరోగ్య రక్షణపట్ల ప్రభుత్వం కాని, తలిదండ్రులు కాని తగినంత శ్రద్ధ వహించకపోవడంవల్ల ఈ కాలపు బాలలు ఉసూరుమంటూ నీరసపు దృక్కులు ప్రసరిస్తూ, కళావిహీనులుగా కన్పిస్తున్నారు. కళాశాల విద్యార్థులు కూడా నానాటికి శక్తివిహీనులౌతున్నారు. కొందరికి విద్యయందు అత్యంతాసక్తి, అయితే, క్రీడలలో అభిరుచి నాస్తి. మరికొందరికి సినిమాలపట్ల వుండే ఆసక్తి అటు చదువులయందు, ఇటు వ్యాయామంపట్ల లోపిస్తున్నది.

భారత ప్రధాని నెహ్రూ కూడా లోగడ ఇట్టి అభిప్రాయాన్ని ప్రకటించి వున్నారు. నిన్న మొన్నటి వరకు కళాశాలలు ఉజ్జ్వల భవిష్యత్తు కల క్రీడాప్రవీణులను వేలసంఖ్యలో పరిచయం చేసేవి. వివిధ క్రీడలలోని అగ్రగణ్యులు పెద్ద పోటీలనుంచి విరమించేలోగా వీరు వారి స్థానం అధిష్ఠిస్తూ వుండేవారు. ఆ విధంగా ఆటలలో ఇండియా ప్రమాణం, ప్రావీణ్యం అవిచ్ఛిన్నంగా సాగుతూ వుండేది.

వివిధ క్రీడలలో అగ్రగణ్యులు, ఛాంపియనులు, రికార్డు హోల్డర్లు ప్రథమశ్రేణిగా వుంటే కళాశాలల యువక్రీడోత్సాహికులు ద్వితీయ శ్రేణిగాను, పాఠశాలల బాల ఔత్సాహికులు తృతీయ శ్రేణిగాను వుండేవారు. ప్రథమశ్రేణివారు వయసు మళ్ళి కీర్తిపథం నుంచి తప్పుకొంటూవుంటే ద్వితీయశ్రేణిలోని వారు ప్రథమశ్రేణికి, తృతీయ శ్రేణిలోని వారు ద్వితీయశ్రేణిలోకి పురోగమించి క్రీడాపటంలో ఇండియా గౌరవస్థానాన్ని పరిరక్షిస్తూ వుండేవారు.

అయితే, దురదృష్టవశాత్తూ భారతదేశంలో బ్రిటిష్‌వారి హయాం లోనూ, యిప్పుడూ విద్యాలయాలలో వ్యాయామం, ఆటలు ఒక జాతీయోద్యమంగా నిర్వహించబడలేదు. వ్యాయామక్రీడలలో ఆసక్తి వున్న విద్యార్థులు తమకు తామై ముందుకు వచ్చి, ఉన్న స్వల్పమైన అవకాశాలను వినియోగించుకోనవలసి వస్తున్నది. ఇట్టివారు నూటికి ఇద్దరు ముగ్గురు వుంటే ఘనమే. గ్రిగ్ పోటీలు, అంతర్ పాఠశాలల పోటీలు, అంతర్ రాష్ట్ర పాఠశాలల పోటీలు, అంతర్ కళాశాలల పోటీలు, అంతర్ విశ్వవిద్యాలయాల పోటీలు, వార్షిక పోటీలు మున్నగు వాటిలో పాల్గొని కేవలం స్వశక్తిపైనే ఇంతవరకు పైకి వస్తున్నారు. ప్రతి రాష్ట్రంలోను పాఠశాలల విద్యార్థులకు వ్యాయామ క్రీడలలో నిర్బంధంగా శిక్షణ గరిపే ప్రణాళిక అమలులో లేదు. ఇది ఎంతైనా శోచనీయం.

1953 లో భారత ప్రభుత్వపు ఆరోగ్యశాఖాధ్వర్యాన "రాజకుమారి స్పోర్ట్స్ కోచింగ్ స్కీమ్" ప్రారంభించబడిన లగాయతు పరిస్థితులు ఒక్క వీసం చక్కబడినవి. ఢిల్లీలో 1955 వేసవిలో వారానికి మూడు రోజుల చొప్పున స్కూలు పిల్లలకు వ్యాయామ క్రీడలలో శిక్షణ యిచ్చారు. అప్పుడు మొత్తం 112 మంది బాలికలు, 96 మంది బాలురు ఆ సదవకాశాన్ని వినియోగించుకొన్నారు. ప్రతి రాష్ట్రానికీ, ప్రతి పట్టణానికీ ఇట్టి శిక్షణ సౌకర్యాలు విస్తరిస్తేనే వ్యాయామం ఒక ఉద్యమంగా వ్యాప్తిలోకి వస్తుంది. అప్పుడే బాలల ఆరోగ్య ప్రమాణం వృద్ధిచెంది క్రమక్రమేణా జాతి పటిష్ఠమౌతుంది. వ్యాయామ విద్య ఒక బృహత్ జాతీయ ప్రణాళికగా అమలులో లేనందున పాఠశాలల నుంచి కళాశాలలనుంచి వచ్చేవారు నిర్వీర్యులుగా వుంటున్నారు. భారతదేశ భవిష్యత్తు ఇట్టి శక్తివిహీనులపై ఆధారపడి వున్నదంటే మనల నెంతటి ప్రమాదం ఎదురు చూస్తున్నదో ఊహించవచ్చు.

ప్రతి అభ్యుదయ దేశం — A sound mind in a sound body — "మేధాశక్తిని శారీరక శక్తితో పదును పెట్టాలి" అనే గ్రీక్ సిద్ధాంతం పరమలక్ష్యంగా పెట్టుకొని వ్యాయామ పథకాలను అమలు పరచుకొంటున్నది. బాలురను ఆరోగ్యవంతులను చేసి భవిష్యత్తును సుఖతరం, శుభతరం చేసుకొంటున్నవి.

భారతదేశం నాగరికమైనదైనా జీవనవ్యయ ప్రమాణం చాలా తక్కువైనందున, ఉద్యోగవసతులు అల్పమైనందున విద్యార్థులలో వ్యాయామ విద్యాసక్తి క్షీణించి పోతున్నది. పొట్టకోసమే చదువు. నాలుగు తరగతులు చదువుకొని నాలుగు మార్కులు తెచ్చుకొని బ్రతుకు వెళ్ళమార్చే మార్గం పసితనం నుంచీ చూచుకొనడమే కాని బ్రతుకుకు పునాది అయిన ఆరోగ్యం గురించి శ్రద్ధ వహించలేకపోతున్నారు. ఆరోగ్యవంతమైన జాతికి బాల్యంనుంచే పునాదులు వేయవలసిన ఆవశ్యకతను భారత ప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వాలు కొద్దిగ గ్రహించినా పూర్తిగ గ్రహించినట్లు లేదు.

వ్యాయామ క్రీడలలో శిక్షణ బాల్యంనుంచే యివ్వడం దేశానికి అత్యంతావశ్యకమనీ, ఇది ఇండియాలో చాలా కరువైనదనీ ఇండియా సందర్శించిన విదేశ వ్యాయామ ప్రవీణులు, అధ్యాపకులు విమర్శించి వున్నారు. ఇండియాలో ఏ 18 వ ఏటనో, 20 వ సంవత్సరంలోనో వ్యాయామ క్రీడలపట్ల, ఇతర ఆటల పట్ల మనస్సును పూర్తిగా లగ్నంచేసి, తీవ్రశిక్షణ ప్రారంభిస్తారనీ, తమ దేశాలలో ఆ వయసువారు ప్రపంచ ఛాంపియనులై పోతున్నారనీ ఇండియావచ్చిన జెస్సీ ఓవెన్స్ (అమెరికా పరుగు ప్రవీణుడు, బెర్లిన్‌లో జరిగిన ప్రపంచం ఒలింపిక్ పోటీలలో నాలుగు స్వర్ణపతకాలు పొందిన నీగ్రో. 100 మీటర్ల పరుగులో 20 సంవత్సరాలు ప్రపంచం రికార్డు హోల్డర్) బాబ్ మాథియాస్ (హెల్సింకీ ఒలింపిక్ పోటీలలో డికాథ్లన్ ఛాంపియన్. అమెరికన్ ప్రముఖుడు) రాబర్ట్ రిఛార్డ్స్ (హెల్సింకీ ఒలింపిక్స్‌లో పోల్‌వాల్టు (కాష్ఠసహాయప్లుతి) పోటీలో 15 అడుగుల



జెస్సీ ఓవెన్స్
(అమెరికా పరుగు ప్రవీణుడు)

$4\frac{3}{4}$ అంగుళాల ఎత్తు దూకిన ప్రముఖుడు) ఎమిల్ జటొపెక్ (హెల్సింకీ ఒలింపిక్ పోటీలో మూడు దూరపు పరుగులలో స్వర్ణపతకాలు పొందిన ప్రముఖుడు) ఉద్బోధించినారు.

వ్యాయామ క్రీడలలో భారత యువకులకు శిక్షణ నివ్వడానికై వచ్చిన రష్యను వ్యాయామాధ్యాపకుడు కాంమ్రేడ్ యు జెనీ కుజ్నెట్సోవ్ కూడా ఇట్టి హితవే చెప్పియున్నారు.

"పోటీలలో పతకాలు సంపాదించాలనే లక్ష్యంతో కాక, జాతి ఆరోగ్య ప్రమాణం వృద్ధిపరచాలనే లక్ష్యంతో సమూహ పద్ధతిని (Mass scale) వ్యాయామ క్రీడలలో శిక్షణ నివ్వాలి ... వ్యాయామ క్రీడలలో ప్రావీణ్యం చూపుతున్న స్కూలు విద్యార్థులను ఏరి, 12 వ ఏటనుంచే వారికి అన్ని వ్యాయామ క్రీడలలోనూ శిక్షణ నివ్వాలి. 15 వ ఏటనుంచి ఏదో ఒక వ్యాయామ క్రీడలో ప్రత్యేక శిక్షణ నివ్వాలి. శిక్షకులు అడపాదడపా కాక ఒక సీజన్ (Season) యావత్తు బాలుర తోనే వుండి నిర్ణీత కార్యక్రమం ప్రకారం తర్ఫీదివ్వాలి" అని ఆయన ప్రవచించి వున్నారు.

భారతదేశంలో సమూహ పద్ధతిని కాని, బృహత్ జాతీయోద్యమ స్థాయిలోకాని బాలబాలికలకు వ్యాయామ క్రీడలలో శిక్షణ గరపబడ నందువల్ల, యువకులు ఆలస్యంగా శిక్షణ ప్రారంభించి, ఆ శిక్షణ అయినా తీవ్రంగా అకుంఠిత దీక్షతో కొనసాగించుకొనలేక పోతున్నందు వల్ల ప్రపంచ వ్యాయామ రంగంలో భారతీయులు వెనుకపడి పోతున్నారు. ఆటలలో కూడా ఈ అసౌకర్యం పిండి పీడిస్తున్నది. అభ్యుదయ దేశాలు నిర్ణీత కార్యక్రమంతో వ్యాయామపథకాలు వేసుకొని పురోగమిస్తు న్నందున భారతీయులు మరీమరీ వెనుకపడి పోవలసిన ప్రమాదం పొంచి వున్నదనే చెప్పాలి.

# అభ్యుదయ దేశాల అనుభవాలు

స్వతంత్ర భారతం ఇంకా బాల్యదశలోనే వున్నదని అంగీకరించక తప్పదు. అయితే, అభ్యుదయ దేశాలు ఈవరకే అనుభవాలు గడించి గుణపాఠాలు నేర్చుకొని వున్నవి. వాటిని గుర్తించి, గ్రహించి మన పరిస్థితులకు అనుగుణంగా వెంటవెంటనే కార్యక్రమం నిర్ణయించుకు పోతూవుంటే ఒక దశాబ్దంలోనే ఇండియా ఎంతో పురోగమించ గలదు. అభ్యుదయ దేశాలకు ఇండియాకు క్రీడా రంగంలో వున్న అంతరాన్ని నూటికి 90 వంతులు ఈ స్వల్పకాలంలోనే తగ్గించవచ్చు. అభ్యుదయ దేశాలలో క్రీడారంగంలో బాలకోటి పట్ల చూపబడుతున్న శ్రద్ధాసక్తులు ఈ సందర్భంలో ఎంతైనా గమనార్హమైనవి.

## సోవియట్ యూనియన్



సోవియెట్ యూనియన్‌లో విద్యాబోధనలో భాగంగా వ్యాయామ శిక్షణ విధిగా గరపబడుతుంది. పాఠశాలలలోను, ఇతర విద్యాసంస్థలలోను వ్యాయామవిద్య విధిగా అభ్యసించవలసిన విషయం (Compulsory Subject).

రష్యా అంతటా ఒకే విధమైన వ్యాయామ శిక్షణ ప్రణాళిక (Physical training scheme) అమలులో వున్నది. ప్రభుత్వపు సంస్థలలోనేమి, స్వచ్ఛంద క్రీడా సంస్థలలోనేమి ఒకేవిధమైన వ్యాయామవిద్య గరపబడుతుందన్నమాట.

వ్యాయామంలోను. ఆటలలోను ఒక్కొక్కరి ప్రావీణ్యం లెక్క కట్టడానికి ఈ ప్రణాళికపరంగా (జి. టి. ఓ) పరీక్షలు జరుపబడుతవి.

సాముగరిడీలు (జిమ్నాస్టిక్ ఎక్సర్‌సైజెస్), వివిధములైన దూరములకు పరుగు — ముఖ్యంగా వీటిలో పరీక్షలు (టెస్ట్స్) నిర్వ

హిస్తారు. ఈత, స్కీయింగ్ (మంచుకొండలపై, లోయలలో విహారం) స్కేటింగ్ (మంచుపై ప్రత్యేక పాదరక్షతో పరుగు), ఎత్తు దూకడం, దూరం దూకడం, ఆగి ఆగి దూకడం (హాప్, స్టెప్ అండ్ జంప్) వంటి వాటిలోను, కొన్ని ఆటలలోకూడా ఈ పరీక్షలు నిర్వహిస్తారు. వీటిలో ప్రాథమిక, ప్రథమ, ద్వితీయ అనే మూడు తరగతులు వున్నవి.

14, 15 సంవత్సరాల బాలబాలికలు ప్రాథమిక తరగతి పరీక్షలకు, 16 అంతకుపైబడినవారు ప్రథమ తరగతి పరీక్షలకు అర్హులు. రెండవ తరగతి పరీక్షలకు మొదటి తరగతిలోవాటికంటె ఎక్కువ పోటీలు జరుపబడుతవి. అభ్యర్థులు ఎక్కువ ప్రావీణ్యంకూడా చూపవలసి వుంటుంది. ప్రథమ, ద్వితీయ తరగతుల వారందరికీ ఐదు వ్యాయామ క్రీడలలో పరీక్ష జరుపబడుతుంది. ఇవికాక పురుషులు తాము కోరిన నాలుగు వ్యాయామ క్రీడలలోను లేక ఆటలలోను, స్త్రీలు తాముకోరిన మూడు వ్యాయామ క్రీడలలోను లేక ఆటలలోను ప్రావీణ్యం ప్రదర్శించ వలసి వుంటుంది.

ఈ పరీక్షలలో నెగ్గినవారికి జి. టి. ఓ. (G. T. O.) బ్యాడ్జీలు బహూకరించబడుతవి. ఇవి గెలుచుకొన్నవారు ఆరోగ్య, బలసంపన్న తకు, సహిష్ణుతకు (Endurance) చిహ్నంగా యెంచబడుతారు.

సమూహ ప్రాతిపదికపై వ్యాయామ శిక్షణ నివ్వడంవల్లనూ, 15-16 సంవత్సరాల బాల బాలికలకు, 17-18 సంవత్సరాల యువతీ యువకులకు దేశం మొత్తంపై పోటీలు క్రమం తప్పక జరపడంవల్లనూ రష్యాలో ఛాంపియనులు నిరంతరం అవిచ్ఛిన్నంగా వెలసే అవకాశ మంటున్నది. రష్యాలో రేపు ఛాంపియనులు వుండరేమో నన్న భయం లేదు.

రష్యాలో ప్రస్తుత జాతీయ, అంతర్జాతీయ ఛాంపియనులు ప్రథమ శ్రేణివారైతే (ఫోర్ ఫ్రంట్), 17-18 సంవత్సరాలవారు ద్వితీయ శ్రేణిగా (సెకండ్ లైన్), 15-16 సంవత్సరాలవారు తృతీయశ్రేణిగా (థర్డ్ లైన్), అంతకంటె పిన్న వయస్కులు తర్ఫీదు పొందుతున్న శ్రేణిగా వుంటారు. ప్రథమశ్రేణివారు వయస్సుమళ్లి కీర్తిపథంనుంచి

తప్పుకొంటూవుంటే వారి స్థానంలోకి ద్వితీయ శ్రేణిలోనివారు, ఈ ద్వితీయ శ్రేణిలోకి తృతీయ శ్రేణిలోనివారు అడుగుపెడుతారు. అప్పటికి తర్ఫీదై సిద్ధంగావున్న పిన్నవయస్కులు తృతీయ శ్రేణిలో విజయప్రవేశం చేస్తారు. క్రమ పద్ధతిని, నిర్ణీత కార్యక్రమం ప్రకారం దేశమంతటా ఆటల శిక్షణ, పరీక్షల కార్యక్రమం అమలుపరచబడుతూ వున్నందువల్ల అంతర్జాతీయ పోటీలలో సోవియట్ యూనియన్‌కు ప్రముఖ స్థానం అనేక శతాబ్దాలకైనా పదిలంగానే వుంటుంది. ఛాంపియన్‌షిప్‌ల సంగతి అలావుండగా బాలబాలికలను పటిష్ఠులనుచేసి మొత్తం రష్యనుజాతినే ఆరోగ్య, బల, శక్తి సంపన్నులను చేయడానికి పైబృహత్ ప్రణాళికలు దోహద మిస్తున్నవి. వాటి అమలుకు ప్రభుత్వం ధారాళంగా ఆర్థిక సదుపాయాలను సమకూర్చింది.

1955 బడ్జెట్‌లో రష్యా జాతీయ ఆరోగ్యాభివృద్ధి కార్యక్రమాలకుగాను 22 బిలియన్ రూబుల్స్ ప్రత్యేకించింది. ఇందులో అధికభాగం క్రీడల ప్రచారానికి, అభివృద్ధికి వినియోగించబడింది.

రష్యాలోని వివిధ క్రీడా సంఘాలలో యాక్టివ్ సభ్యులు రెండు కోట్లకు పైగా వుండడమే ఆదేశంలో క్రీడలపట్ల ఆసక్తికి సాక్షి.

## అమెరికా



యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాలోకూడా బాల్యదశనుంచే వ్యాయామక్రీడలలో, ఆటలలో శిక్షణ నివ్వడానికి పెద్దపెట్టున కృషి జరుపబడుతున్నది.

వ్యాయామ క్రీడలలో (Athletics) బాలురకు ప్రోత్సాహ ప్రోద్బలాలు యివ్వడానికి యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా అంతటా 'బాయిస్ క్లబ్స్' వున్నవి. దాదాపు వీటి లక్ష్యాలతోనే న్యూయార్క్ సిటీ పోలీసు ఎథ్లెటిక్ లీగ్ పనిచేస్తున్నది. జూనియర్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ వంటి సంస్థలు టెన్నిస్‌లో బాల బాలికలకు

తగు శిక్షణ నివ్వడానికి ఏర్పాట్లు చేస్తున్నవి. అమెరికా జాతీయక్రీడ అయిన బేస్‌బాల్‌లో బాలురకు సమస్త సదుపాయాలను లిటిల్ లీగ్ వంటి సంస్థలు సమకూర్చుతున్నవి. ఇవికాక బాల్యంనుంచే క్రమశిక్షణ, సంఘీభావం, ఆటపాటలలో ఆసక్తి పెంపొందించడానికి వివిధ ఋతువులలో యువజన శిబిరాలు నిర్వహించబడుతున్నవి. ఒక్క వేసవిలోనే అమెరికా అంతటా దాదాపు 12,000 యువజన శిబిరాలు నిర్వహించబడుతవి. 40,00,000 మందికి పైగా బాలబాలికలు వీటినుంచి ప్రయోజనం పొందుతుంటారు. అనేక రకాల ఆటలు, చేతివృత్తులు, ఈ కేంద్రాలలో నేర్పబడుతవి. అమెరికాలో ప్రత్యేకించి బాల బాలికలకు ఉద్దేశించబడిన క్రీడాసంస్థలు పనిచేసే విధానం పరికించుదాము.

బాయిస్ క్లబ్స్:— అమెరికాలో బాల ఉద్యమాలలో బాలభటోద్యమం తర్వాత చెప్పదగినది "బాయిస్ క్లబ్ ఆఫ్ అమెరికా" సంస్థ కృషి. 1906 లో స్థాపించబడిన ఈ క్లబ్బుకు 300 పైగా అనుబంధ సంస్థలు (స్మాల్ క్లబ్స్) వున్నవి. ఇవి యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా అంతటా అల్లుకొని వున్నవి. ఎనిమిదేండ్లు మొదలు 20 సంవత్సరాల లోపువారు 3,00,000 కు పైగా ఈ క్లబ్బులలో సభ్యులుగా చేరి వున్నారు. సభ్యత్వ రుసుంక్రింద వీరు చాలా కొద్దిమొత్తం చెల్లిస్తారు. అందుకు ప్రతిఫలంగా వీరికి అన్నిరకాల ఆటలలోను, వ్యాయామ క్రీడలలోను శిక్షణ యివ్వబడుతుంది. అంతేకాక నిర్ణీతమైన గడువులలో వైద్య పరీక్షలను, ముఖ్యంగా దంత పరీక్షను జరిపి తగు సహాయం చేస్తారు. అనేక జాతీయ సంస్థలు, నాయకులు విరాళా లిచ్చి తోడ్పడుతారు. వివిధ విద్యలలో ప్రావీణ్యం సంపాదించిన పెద్దలు తమ తీరిక సమయంలో ఈ క్లబ్బులకు వచ్చి ఉచితంగా శిక్షణ నిస్తారు.

న్యూయార్క్ సిటీ పోలీస్ ఎథ్లెటిక్ లీగ్ :— 1936 లో ఈ సంస్థ స్థాపించబడింది. బాయిస్ క్లబ్ పద్ధతినే ఈ సంస్థ బాల బాలికలలో, యువకులలో ఆటలపట్ల ఆసక్తి పెంపొందించడానికి కృషి చేస్తుంది. వేసవికాలంలో పేద బాలురకు ప్రత్యేకంగా ఆటల శిక్షణ శిబిరం నిర్వహిస్తుంది. బాలురకు ఏటా బాస్కెట్ బాల్ పోటీ

లను, యింకా ఫుట్‌బాల్, వాలీబాల్, హాకీ, టేబుల్ టెన్నిస్, ముష్టియుద్ధం వంటి క్రీడలలో పోటీలు జరుపుతుంది.

అమెరికాలో అత్యంత శ్రద్ధ వహించబడుతున్న ఆటలలో టెన్నిస్ ఒకటి. అమెరికన్ ప్రవీణులు పెక్కు సంవత్సరాలలో వింబుల్డన్, డేవిస్ కప్పు ఛాంపియన్ షిప్పులను గెలుచుకొనివున్నారు. అమెరికాలో ఇట్టి ఛాంపియనులే కాక వేల సంఖ్యలో యువకులు ఉన్నత శిక్షణ పొంది నేడో, రేపో అంతర్జాతీయ పోటీలలో గెలుపొంద సిద్ధంగా వున్నారు. ప్రపంచంలోకెల్ల ఒక్క ఆస్ట్రేలియాయే వీరిని మించుతున్నది.

అమెరికాలో 11-14 ఏళ్ళ మధ్యవయసుగల బాలురు టెన్నిస్ ఆటలో మంచి భవిష్యత్తు చూపుతున్నారు. స్వల్పవ్యయంపై ఉన్నత శిక్షణ పొందడానికి విశేషావకాశాలు ఉన్నాయి. ఉచితంగా తగు తర్ఫీదు పొందే సదుపాయాలు కూడా చెయ్యబడి వున్నవి.

యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా అంతటా టెన్నిస్ కోచింగ్ క్లినిక్స్ (టెన్నిస్‌లో శిక్షణ యిచ్చే కేంద్రాలు) వున్నవి. బాల బాలికలకు ఉద్దేశించబడిన వాటిలో వారానికొక రోజు ప్రముఖ ప్రొఫెషనల్ టెన్నిస్ ఆటగాళ్ళు (టెన్నిస్ ఆట వృత్తిగా గలవారు) శిక్షణ నిస్తారు. తడవకు 20 మందికి శిక్షణ యిచ్చి, ఆ తర్వాత ఒక్కొక్కరికి తర్ఫీదు యివ్వబడుతుంది. బాలుని లేదా బాలిక ఆర్థిక స్థితిబట్టి స్వల్ప రుసుంపైగాని, ఉచితంగాగాని శిక్షణ వసతి కల్పించబడుతుంది.

ఈ శిక్షణ కేంద్రాలు విరాళాలపై నిలువగలుగుతున్నవి. ప్రతి పెద్ద శిక్షణ కేంద్రానికి ఒక్కొక్క పోషకవర్గం (Patron Group) వుంటుంది. ఇటువంటి పోషకవర్గం అమెరికాలో మొట్టమొదట 1935 లో స్థాపించబడింది. దక్షిణ కాలిఫోర్నియా టెన్నిస్ అసోసియేషన్ దీనిని స్థాపించింది. బాల బాలికల ఆటల శిక్షణ కేంద్రాలకు విరాళాలు ప్రోగుచేయడంలో 'జూనియర్ ఛాంబర్ ఆఫ్ కామర్స్' వంటి సంస్థలు ప్రత్యేకంగా కృషి చేస్తున్నవి.

లిటిల్ లీగ్ బేస్ బాల్ :— అమెరికాలో బేస్‌బాల్ జాతీయ క్రీడగా పరిగణించబడుతున్నది. 13 ఏండ్ల లోపు బాలురకు, 13–15 సంవత్సరాల వయసుగలవారికి, 16–18 మధ్యవారికి, ఆ పైవారికి బేస్‌బాల్‌లో క్రమపద్ధతిని శిక్షణ నివ్వడానికి దేశమంతటా విడిసంస్థలు వున్నవి. వీటిలో అగ్రగణ్యమైనది లిటిల్ లీగ్ సంస్థ. కార్ల్ స్టాట్జ అనే అమెరికన్ బేస్‌బాల్ ఆటగాడు పెన్సిల్వేనియాలోని విలియమ్ పోర్ట్‌లో 1939 లో దీనిని స్థాపించాడు. 1950 కి 24 రాష్ట్రాలకు లిటిల్ లీగ్ శాఖలు అల్లుకొన్నవి. 8–12 సంవత్సరాలమధ్య వయసుగల బాలురు 15,000 మంది ఈ శాఖలలో చేరి శిక్షణ పొందుతున్నారు. 1955 కు ప్రతి రాష్ట్రానికి 'లిటిల్ లీగ్' ఉద్యమం వ్యాపించింది. ప్రతి ఆగస్టులోను విలియమ్‌పోర్ట్‌లో లిటిల్ లీగ్ బేస్‌బాల్ ఛాంపియన్ షిప్ పోటీలు జరుగుతవి. ఏటి కయ్యే ఖర్చులను 'యునైటెడ్ స్టేట్స్ రబ్బర్ కంపెనీ' భరిస్తుంది. క్రీడాసాధనాల ఉత్పత్తి సంస్థలు సయితం బాలలలో క్రీడాసక్తిని పెంపొందించడం ముదావహం.

యువజన శిబిరాలు :— పేరుకు "యూత్ క్యాంప్స్" అయినప్పటికీ అవి ఎక్కువగా స్కూలు విద్యార్థులకు, ఇతర బాల బాలికలకు ఉద్దేశించబడినవి. 90 సంవత్సరాలుగా అమెరికాలో ఇట్టి శిబిరాలు నిర్వహించబడుతున్నవి. సెలవులలో వివిధ వృత్తులను, కళలను ఈ శిబిరాలలో బాలబాలికలు నేర్చుకొంటారు. ఏ పనికైనా పూనుకొన డానికి, ఏ పనినైనా స్వతంత్రించి చెయ్యడానికి, చిత్రలేఖనం, చేతి వృత్తులు, సంగీతం వంటివి కూడా అభ్యసించడానికి ఈ శిబిరాలలో వసతులు వున్నవి. వారపు సెలవులలోను, వేసవివంటి సెలవుకాలంలోను అమెరికా అంతటా అనేకరకాల యువజన శిబిరాలు నిర్వహించబడు తున్నవి. అమెరికాదేశం మొత్తంపై 12,000 శిబిరాలు వున్నవి. 40,00,000 బాల బాలికలు తమ సెలవులను యిక్కడ గడుపుతారు. వ్యాయామక్రీడలలో, చేతివృత్తులలో ప్రావీణ్యం వృద్ధిపరచుకొంటారు. ఇటువంటి కేంద్రాలవల్ల పిల్లలు మామూలు చదువుల కాఠిన్యంనుంచి తాత్కాలికంగా విముక్తిపొంది జీవితపు విలువలు తెలుసుకొన అవకాశ

ముంటుంది. పిల్లల ఆరోగ్య, మానసిక శక్తుల వృద్ధికి, పిల్లలలో సౌశీల్య భావం, క్రమశిక్షణల అభివృద్ధికికూడా ఈ శిబిరాలు ఎంతైన దోహదకారి అవుతున్నవి.

యువజన శిబిరాల సదుపాయాలు పొందగోరువారి ఆర్థికస్థితినిబట్టి రుసుం నిర్ణయించబడుతుంది.

శారీరక మానసిక శక్తులను పెంపొందించడం ద్వారా జాతిని పటిష్ఠం చేసుకు వస్తున్న దేశాలలో అమెరికా ఒకటని నిస్సందేహంగా చెప్పవచ్చు.



## ఆస్ట్రేలియా



ఆస్ట్రేలియా క్రికెట్, టెన్నిస్, బిలియార్డ్సు, స్నూకర్ ఆటలలోను, పరుగు, ఈత పందెముల లోను ప్రపంచంలో ప్రశంసనీయమైన స్థానం వహిస్తున్నది.

అమెరికావలె ఆస్ట్రేలియా కూడా మహా భాగ్యవంతమైన దేశం. పుష్కలంగా ఆహారం, వినోద విహారాలకు ఎక్కడబడితే అక్కడ సువిశాల ప్రదేశం కల దేశం. ఆస్ట్రేలియా జీవన వ్యయ ప్రమాణం (Standard of Living) ఉన్నతం. ఎవరైనా ఎంతటి వ్యయాలకైనా ఓర్చుకొన గలుగుతారు. అందుచేతనే అచ్చట టెన్నిస్, బిలియార్ల్సు, స్నూకర్‌వంటి విపరీత వ్యయమైన ఆటలు విశేషంగా వృద్ధిలోనికి వచ్చినవి.

అచ్చటి శీతోష్ణస్థితికూడా చాలా ఆనందదాయకమైనది. సంవత్సరంలో కొద్దినెలలుకాక ఏడాది పొడుగునా ఆటపాటలలో నిమగ్నం కావడానికి సానుకూలమైన వాతావరణం అక్కడ వున్నది. ఆస్ట్రేలియన్ బాలబాలికలు, యువతీ యువకులు ఆటలకోసం తహతహ లాడడానికి అక్కడి శీతోష్ణస్థితియే కారణమని సుప్రసిద్ధ ఆస్ట్రేలియన్ టెన్నిస్ ఆటగాడు జాక్ ఆర్కిన్ స్టాల్ ఒక సందర్భంలో చెప్పినారు.






ఎడమనుంచి కుడికి - జాక్ ఆర్కిన్‌స్టాల్ (ఆస్ట్రేలియా టెన్నిస్ ఆటగాడు)

రామనాథన్ కృష్ణన్ (ఇండియా టెన్నిస్ ఆటగాడు)

"ఆస్ట్రేలియాలో ప్రతి స్కూలులో ప్రతి విద్యార్థి విధిగా ఆటలలో పాల్గొంటాడు. స్కూళ్ళలో అన్ని ఆటలలోకి క్రికెట్ ఎక్కువగా ప్రచారంలో వున్నది. క్రికెట్ ఆటద్వారా బాలబాలికలకు 'బాల్ సెన్స్' (Ball sense) వృద్ధి పొందుతుంది. బంతి గమనం, గమ్యం, వేగం క్షణాలలో బాలబాలికలు గ్రహించడం వల్ల ఇతర ఆటలకు కూడా అది ఎంతో కలసివస్తుంది. వీరి అభిరుచులు, ఆశయాలు నెరవేరడానికి కొల్లలుగా అవకాశా లున్నవి. వీటన్నింటికి తోడు ఆస్ట్రేలియనులు పుష్కలంగా పుష్టికరమైన ఆహారానికి నోచుకొన్నారు. అందుచేతనే వివిధ క్రీడలలో ఆస్ట్రేలియనులు ప్రథమ శ్రేణిలో వుండకలుగుతున్నా"రని ఆర్కిన్‌స్టాల్ చెప్పివున్నారు.

ఆస్ట్రేలియాలో దాదాపు ప్రతి యింటి ఆవరణలోను ఒక టెన్నిస్ కోర్టు వున్నదట. బాలబాలికలు వేరొకచోటుకు పోకుండా యింట్లోనే టెన్నిస్ అభ్యసించి, శిక్షణ పొంది ప్రపంచ ఛాంపియనులు కాగలుగుతున్నారు.

దాదాపు ప్రతి ఇంటి ఆవరణలో టెన్నిస్‌కోర్టు మరేదేశంలోనూ లేదట.

8-14 సంవత్సరాల మధ్య వయసుగల బాలురకు టెన్నిస్‌లోను, క్రికెట్‌లోను తగు శిక్షణ నివ్వడానికి ఆస్ట్రేలియా అంతటా కేంద్రాలున్నవి. కొన్ని కేంద్రాలలో పిల్లలకు ఉచితంగా క్రీడా పరికరాలిచ్చి, ఉచితంగా శిక్షణ గరపి ఆయా ఆటలయందు ఆసక్తి ఉత్సాహాలను పెంపొందించుతున్నారు. క్రీడా పరికరాల పరిశ్రమలవారు ఈ కేంద్రాలకు ఆర్థిక, వస్తు సహాయం చేసి తోడ్పడుతున్నారు.

## చెకొస్లొవాకియా

ఇండియాలో 16 వ యేడు దాటినవారుకాని ఆటలలో తీవ్రంగా కృషి చెయ్యకపోవడంపట్ల చెక్ పరుగు ప్రవీణుడు ఎమిల్ జటొపెక్ లోగడ మద్రాసులో ఆశ్చర్యం ప్రకటించారు. చెకొస్లొవాకియాలో ఆరవయేటనుంచే ఆటల పట్ల ఆసక్తి చూపుతారని, తొమ్మిది పదవయేట నుంచి కృషి తీవ్రంగా ప్రారంభించి 16 వ యేడు వచ్చేసరికి జాతీయ రికార్డుల దరిదాపులకు వస్తూ వుంటారనీ ఆయన తెలియజేశారు. బాల బాలికలు విధిగా ఆటలు అభ్యసించడానికి వ్యాయామశిక్షణ పొందడానికి ప్రభుత్వం సమస్తమైన సదుపాయాలు కలుగజేసిందనీ, అంతేకాక అవసరమైన ప్రోత్సాహం సహాయం సమకూర్చుతుందనీ తెలియపరిచారు.



ఎమిలి జటొపెక్
(చెకొస్లొవాకియా దూరపు పరుగు ప్రవీణుడు)

ఇండియా అంతటా యింకా బాలబాలికల పట్ల క్రీడారంగానికి సంబంధించినంతవరకు తగినంత శ్రద్ధ చూపబడడం లేదు.

అఖిల భారత ప్రతిపత్తిపై స్కూలు పిల్లలకు హాకీ, క్రికెట్, తదితర ఆటల పోటీలు జరపడం, దాదాపు ప్రతి పెద్ద పాఠశాలలోను ఏటా గ్రిగ్ పోటీలు జరుపడం, బాలురకు క్రికెట్ వంటి ఆటలలో కొన్ని రాష్ట్రాలలో పోటీలు జరపడం వంటివి వ్యక్తులు, సంఘాలు మాత్రమే చేస్తున్నవిశాని ప్రభుత్వ ప్రతిపత్తిలో అవి నిర్వహించబడడం లేదు.

1956 ఏప్రిల్ మొదటివారంలో కటక్‌లో ద్వితీయ జాతీయ పాఠశాలల క్రీడోత్సవం (నేషనల్ స్కూల్స్ గేమ్స్) జరుపబడింది. మధ్య ప్రదేశ్ బాలురు ప్రథమస్థానం; పెప్సూ, పశ్చిమ బెంగాల్ బాలురు ద్వితీయస్థానం సాధించారు.

బాలికలలో మధ్యప్రదేశ్ వారు అగ్రస్థానం, ఒరిస్సావారు తర్వాతి స్థానం సంపాదించారు. దీనినిబట్టి అన్ని రాష్ట్రాలలోకంటె మధ్యప్రదేశ్‌లో బాలబాలికలు ఉత్సాహవంతులుగా కన్పిస్తున్నారు.

ఇప్పుడిప్పుడే మనదేశంలో క్రీడాసంఘాలు బాల బాలికలకు వేర్వేరు ఆటలలో ఉచితంగా శిక్షణ నివ్వడం ప్రారంభించినవి. ఉత్తర ప్రదేశ్‌లోని టెన్నిస్ అసోసియేషన్‌వారు ఆగ్రా, మీరట్, అలహాబాద్, లక్నో మున్నగు కేంద్రాలలో బాలబాలికలకు ఉచితంగా టెన్నిస్‌లో తర్ఫీదు యిచ్చినట్లు విన్నాము. ఇటువంటి కృషి జరుపుతున్న ఇతర సంస్థలు కూడా అభివందనీయమైనవి.

## ఇండియా కర్తవ్యం

ఏమైనా రష్యాలోవలె ఇండియాలో కూడా బాలబాలికలకు సమూహ ప్రాతిపదికపై ఆటలలో, వ్యాయామక్రీడలలో శిక్షణ నిప్పించడం, అమెరికాలో వలె యువజన శిబిరాలు నిర్వహించడం అత్యంత వాంఛనీయం. ఆస్ట్రేలియాలో వలె ఇండియాలో కూడా స్పోర్ట్స్ పరికరాల పరిశ్రమలు క్రీడోద్యమవ్యాప్తికి చేయూత నివ్వడం ఎంతైనా అభిలషణీయం.

ఇక కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రష్యాలోవలె ఆటలవృద్ధికి తద్వారా బాలల ఆరోగ్యాభివృద్ధికి పెద్ద పెద్ద మొత్తాలను బడ్జెట్టులలో కేటాయించడం మంచిది.

ఇండియా రిపబ్లిక్‌గా అవతరించినమీదట వ్యాయామ క్రీడలపట్ల ఆటలపట్ల ప్రభుత్వపు శ్రద్ధ హెచ్చినదని ఒప్పుకోనక తప్పదు.

ఇండియా ప్రభుత్వం నెలకొల్పిన ఆలిండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్స్, రాజకుమారి స్పోర్ట్స్ కోచింగ్ స్కీమ్ ద్వారా భారతదేశంలో ఆటలు ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్నవి.

అమెరికాలోని మియామీ యూనివర్శిటీలో వ్యాయామక్రీడల ప్రధాన శిక్షకుడు జార్జి ఎల్ రైడర్ మద్రాసులో చెప్పినట్లు ఇండియాలో అభివృద్ధికిరాగల వ్యాయామ క్రీడోత్సాహకులు (ఎమచూర్ ఎథ్లెట్స్) కొల్లలుగా వున్నారు. వారి ఉత్సాహాన్ని సవ్యమార్గాలకు మళ్ళించి, వారు భారతదేశానికి క్రీడారంగంలో కీర్తి ప్రతిష్ఠలు ఇనుమడింప జేయ డానికి కేంద్రప్రభుత్వ సంస్థలు ఇతోధికంగా కృషి చెయ్యవలెను.

అంతర్రాతీయ పోటీలలో ప్రముఖస్థానం కాని, అగ్రస్థానంకాని సాధించడానికి తీవ్రమైన దీక్షాపూర్వకమైన సాధన అత్యవసరం. అందుచేత బాల్యదశనుంచే వ్యాయామ క్రీడలలో, ఆటలలో శిక్షణ ప్రారంభించి, కాలేజిదశలో కూడా దానిని కొనసాగించడం అత్యా వశ్యకం.

బాల్యంలోనే వ్యాయామం పట్ల ఆసక్తి కలుగజేయడానికి ప్రతి స్కూలులోను నిర్ణీతమైన వ్యాయామ విద్యాప్రణాళికను నిర్బంధంగా నైనా అమలు పరచడం అత్యవసరం. ఉపాధ్యాయులు పిల్లల తలి దండ్రులు పాఠాలకేకాక వ్యాయామానికి కూడా ప్రాధాన్య మివ్వాలి. వివిధ విషయాలలో కనీసపు మార్కులు నిర్ణయించినట్లు బాలబాలికల ఆరోగ్యంలోను, వ్యాయామంలోను పరీక్షలుపెట్టి కనీసపు మార్కులు నిర్ణయించాలి. ఈ ఏర్పాట్లు జాతీయ ప్రాతిపదికపై ప్రతి రాష్ట్రంలోనూ, ప్రతి స్కూలులోనూ జరిగినట్లయితే ఒక దశాబ్దానికి భారతజాతి మరింత

పటిష్ఠంగా, ఆరోగ్యవంతంగా రూపొందడానికి గట్టి పునాదులు ఏర్పడగలవు.

ఆలిండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్స్, రాజకుమారి స్పోర్ట్స్ కోచింగ్ స్కీము నిర్వాహకులు పై ఏర్పాట్లకు ఇప్పుడిప్పుడే నాంది పలుకుతున్నారు.

ఈ సంస్థల ఆశయాలు, ఆదర్శాలు, ఇవి యింతవరకు జరిపిన కృషి పరికించుదాము.

## అ ధ్యా య ము 2

# వ్యాయామ రంగంలో యువకుల పాత్ర

జాతీయ, అంతర్జాతీయ క్రీడారంగాలలో భారతదేశం పేరు ప్రఖ్యాతులను ఇనుమడింపజేయడానికి బాల్యదశనుంచి తీసుకోవలసిన శ్రద్ధాసక్తులను ప్రథమాధ్యాయంలో వివరించాను. ఇక కొద్దో గొప్పో ప్రావీణ్యం గడించివున్న యువ వ్యాయామకోవిదుల గురించి యిక్కడ ప్రస్తావిస్తాను.

ఇండియా సందర్శించిన జెస్సీ ఓవెన్స్, బాబ్ మాథియాస్, రాబర్ట్ రిఛార్డ్స్, ఎమిల్ జటొపెక్ వంటి జగత్ప్రసిద్ధ ఎథ్లెట్‌లేమి జార్జి ఎల్. రైడర్, పి. సవోస్టియనోవ్, అలెగ్జాండర్ జరోవ్, ఫ్రాంక్ కాఫ్‌మాన్ వంటి విదేశ క్రీడాధ్యాపకులేమి ప్రపంచ ఛాంపియన్ షిప్ సాధనకు "అడ్డదోవ" లేదన్నారు. భారతీయ యువ క్రీడోత్సాహికులు ప్రపంచం రికార్డులను అధిగమించవలెనంటే ఆ యా క్రీడను బట్టి అను దినం గంటలతరబడి తర్ఫీదుతో ఏళ్ళతరబడి శ్రమించక తప్పదన్నారు. భారతీయులలో ఇట్టి శ్రమకు ఓర్చగల దీక్షాపరులు అనేకమంది వున్నారనీ అయితే వారికి క్రీడాస్థలాలు, ప్రోత్సాహం తగినంత లేకుండా వున్నవని వ్రాశచ్చారు.

మనది పేదదేశ మన్న మాట నిజం. ఆస్ట్రేలియాలో వలె మనకు యింటింటికి టెన్నిస్ కోర్టు లేదు సరికదా నిత్యం వ్యాయామం గరిపేం దుకు అనువైన బహిరంగ ప్రదేశమైనా పట్టణాలలో కరువౌతున్నది. బొంబాయివంటి మహా నగరంలో పేదపరుగు ప్రవీణులు తెల్లవారుజామున బండ్ల రాకపోకలు లేనిసమయంలో ధావనాభ్యాసం (రన్నింగ్ ప్రాక్టీస్) చేసుకొంటున్నారు. మద్రాసువంటి మహా నగరంలో సైక్లింగ్ ప్రవీణులు సూర్యోదయానికి ముందు వీధులలో సైక్లింగ్ ప్రాక్టీసు చేసుకొంటూ వుండడం సర్వసాధారణం.

వ్యాయామక్రీడలలో, ఇతర ఆటలలో పెద్దపెట్టున శిక్షణ నివ్వడానికి, శిక్షణ పొందడానికి ఏడాది పొడుగునా వినియోగింపదగు సమస్త సదుపాయాలు కల క్రీడాంగణాలు (స్టేడియమ్‌లు) చాలా అవసరం. ఇండియాలో ఈ అవసరాన్ని కొంతవరకు తీర్చడానికి "నేషనల్ స్పోర్ట్స్ క్లబ్ ఆఫ్ ఇండియా" కొంత కృషి చేసింది.

## నేషనల్ స్పోర్ట్స్ క్లబ్ ఆఫ్ ఇండియా

అంతర్జాతీయ నిబంధనలకు అనుగుణమైన స్టేడియమ్‌లను నిర్మించడానికి "నేషనల్ స్పోర్ట్స్ క్లబ్ ఆఫ్ ఇండియా" 1950 వ సంవత్సరారంభంలో సంస్థాపించబడింది. 1951 జనవరికి ఈ సంస్థ న్యూఢిల్లీలో నేషనల్ స్టేడియమ్ సిద్ధపరిచింది. 1952 ఏప్రిల్ ప్రాంతాలకు బొంబాయిలో వల్లభభాయి పటేల్ స్టేడియమ్ నిర్మించింది. ప్రతి పెద్ద నగరంలోనూ ఆదర్శ క్రీడాంగణం నిర్మించడం ఈ సంస్థ ఒక లక్ష్యంగా పెట్టుకొన్నది.

నేషనల్ స్పోర్ట్స్ క్లబ్ ఆఫ్ ఇండియా :— ఉద్యమ ప్రారంభకులు శ్రీ ఏ. ఎస్. డిమెల్లో. ఈయన చాలాకాలం ఇండియా క్రికెట్ కంట్రోలు బోర్డు అధ్యక్షులుగాకూడా వ్యవహరించారు. రాజకుమారి స్పోర్ట్స్ కోచింగ్ స్కీమ్ గౌరవ ప్రధానకార్యదర్శి. ఆసియా క్రీడోత్సవ ఉద్యమనాయకులు కూడా వీరే. 1951 మార్చిలో న్యూఢిల్లీలో ప్రథమ ఆసియా క్రీడోత్సవం నిర్వహించారు.

"నేషనల్ స్పోర్ట్స్ క్లబ్ ఆఫ్ ఇండియా" సర్వసదుపాయాలుకల స్టేడియమ్‌లను నిర్మించడమేకాక వివిధ క్రీడలలో శిక్షణ కేంద్రాలను కూడా నిర్వహించింది.

ఈ సంస్థ నిర్వహించిన ముఖ్యమైన శిక్షణ కేంద్రాల వివర మిది:—

వ్యాయామ క్రీడలు :— (ఎథ్లెటిక్స్) 1954 సెప్టెంబర్, అక్టోబర్—కటక్, ఒరిస్సా ఒలింపిక్ సంఘం వ్యాయామికుల (ఎథ్లెట్స్) కోసం ఈ కేంద్రం నిర్వహించబడింది.

1954 నవంబర్—ఢిల్లీలో—పోలీస్ ఎథ్లెట్ లకు.

1954 డిసెంబర్ — మద్రాసులో — మద్రాసు విశ్వవిద్యాలయం వ్యాయామికులకు.

1955 జనవరి—ఫిబ్రవరి—బెంగుళూరు పోలీస్ ఎథ్లెట్ లకు.

జగత్ప్రసిద్ధ ఆంధ్ర వ్యాయామాధ్యాపకులు శ్రీజయంతి సుధాకరరత్నసోగారు ఈ కేంద్రాలలో శిక్షణ నిచ్చారు.

1954 సెప్టెంబర్—అక్టోబర్—విజయవాడలో ఆంధ్ర ఎమెచ్యూర్ ఎథ్లెటిక్ అసోసియేషన్ వ్యాయామికులకోసం శ్రీ ఆర్థర్ డబ్ల్యు. హోవార్డ్ (లక్నోలోని క్రిస్టియన్ కాలేజ్ ఆఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్ ప్రిన్సిపాల్) ఆంధ్ర వ్యాయామికులకు శిక్షణ నిచ్చారు.

1954 డిసెంబర్—హైదరాబాద్ లో—ఉస్మానియా యూనివర్శిటీ వ్యాయామికులకు.

1954 అక్టోబర్ – మార్చి – బొంబాయి వల్లభభాయి పటేల్ స్టేడియమ్లో.

క్రికెట్ :— బొంబాయిలో 1954 నవంబర్ ; న్యూఢిల్లీ - 1954 నంవంబర్ - డిసెంబర్ ; పూనా - 1954 డిసెంబర్ - 1955 జనవరి ; బెంగుళూరు 1955 ఫిబ్రవరి - మార్చి.

టెన్నిస్ :— బొంబాయి, మద్రాసు, కలకత్తా, ఢిల్లీ, బెంగుళూరు, తిరువేంద్రం.

హాకీ :— హాకీలో శిక్షణ కేంద్రం నిర్వహించడానికి ఇండియన్ హాకీ ఫెడరేషన్ కు 12,000 రూపాయలను 1954 ఆగస్టులో మంజూరు చేసింది.

ఫుట్ బాల్ :— 1954 అక్టోబర్ - 1955 మార్చి—బొంబాయి, ఢిల్లీ, బెంగుళూరు, లక్నో.

టేబుల్ టెన్నిస్:- 1954 నవంబర్–డిసెంబర్ – కలకత్తా; 1954 డిసెంబర్ - 1955 జనవరి- మద్రాసు; 1955 జనవరి-ఫిబ్రవరి- ఢిల్లీ; ఫిబ్రవరి-మార్చి - బొంబాయి.

ఆంధ్ర, ఉత్తరప్రదేశ్, మైసూర్, అహమ్మదాబాద్, తిరువాన్కూర్, బొంబాయిలలో శిక్షణతరగతులు మాత్రం నిర్వహించబడినవి. ఇండియా మాజీ ఛాంపియన్ శ్రీ వి. శివరామన్ ఆంధ్ర యువ ఆటగాళ్ళకు శిక్షణ నిచ్చారు.

బాడ్మింటన్:- బాడ్మింటన్ శిక్షణ ప్రణాళిక అమలుపరచడానికి ఇండియా బాడ్మింటన్ అసోసియేషన్‌కు 1954—ఆగస్టులో 8,000 రూపాయలు మంజూరు చేసింది.

నేషనల్ స్పోర్ట్స్ క్లబ్ ఆఫ్ ఇండియా కోచింగ్ సబ్ కమిటీ రూపొందించిన పై శిక్షణ ప్రణాళికలు రాజకుమారి స్పోర్ట్స కోచింగ్ స్కీమ్ సహకారంతో అమలుపరచబడినవి.

ఇక క్రీడాంగణాలు గురించి మరొక్కమాట. యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాలోని స్విట్జ్ సిటీ (Switz City) లో జనాభా 328 కాగా అక్కడ 4500 మందికి సదుపాయాలు కల 'బాస్కెట్ బాల్ ఎరీనా' వున్నట్లు "స్పోర్ట్స ఇల్లస్ట్రేటెడ్" అసోసియేట్ ఎడిటర్ జెరాల్డ్ హోలెండ్ ఒక సందర్భంలో వెల్లడించాడు. ముక్కోటి ఆంధ్రులకు చెప్పదగ్గ ఒక్క ఆదర్శ క్రీడాంగణం అయినా లేకపోవడం ఈ సమయాన ముఖ్యంగా గమనార్హం.

## రాజకుమారి స్పోర్ట్స కోచింగ్ స్కీమ్

స్వతంత్ర భారతంలో సర్వోత్కృష్టమైన స్టేడియమ్‌ల నిర్మాణానికి కృషి జరిగినట్లే యువక్రీడోత్సాహికులకు వారి వారి ఆటలలో ఉన్నత శిక్షణ యిప్పించడానికి శ్రద్ధవహించబడింది. ఇండియా ప్రభుత్వం ముఖ్యంగా ఆరోగ్యశాఖామంత్రిణి శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ ఈ శిక్షణ ప్రణాళికను అమలు పరుస్తున్నది. "రాజకుమారి స్పోర్ట్స కోచింగ్ స్కీమ్" పేరిట వ్యవహరించబడుతున్న ఈ ప్రణాళిక 1953 లో



శ్రీమతి రాజకుమారి అమృతకౌర్
(ఇండియా ప్రభుత్వ
ఆరోగ్యశాఖామంత్రిణి)

ప్రారంభించబడింది. ఇండియాలో ఆటలకు ప్రభుత్వపరంగా ప్రోత్సాహ ప్రోద్బలాలు, సహాయ సహకారాలు ఓంప్రథమంగా లభించడం ఈ ప్రణాళిక పరంగానే.

నేషనల్ స్పోర్ట్సుక్లబ్ ఆఫ్ ఇండియా సంపూర్ణ సహకారంతో రాజకుమారి స్పోర్ట్సు కోచింగ్ స్కీమ్ అమలుపరచబడుతున్నది. ఇండియాలో అమలులో వున్న క్రీడల శిక్షణ పథకాలు జయప్రదం కావడానికి తగు సలహాలు, ఆర్థిక స్తోమతు, సాధన సామాగ్రి సమకూర్చడం రాజకుమారి స్పోర్ట్సు కోచింగ్ స్కీమ్ ప్రారంభకుల ఆశయమై వున్నది.

ఈ ప్రణాళిక నిర్వాహకులు అన్ని ఆటలకంటె వ్యాయామ క్రీడలకు అధిక ప్రాధాన్య మిస్తున్నట్లు తోస్తున్నది. కొద్ది సంవత్సరాలకు గాక దీర్ఘకాల ప్రాతిపదికపై ఈ ప్రణాళిక రూపొందించబడడం మరొక విశేషం. ఇండియా ప్రభుత్వంవారు ఆరోగ్యశాఖ పరంగా ఈ ప్రణాళికను నిర్వహిస్తున్నారు. ప్రణాళిక ఖర్చులకు ప్రభుత్వం దారంగానే ధనం సమకూర్చుతూ వున్నది.

ఈ ప్రణాళిక ముఖ్యలక్ష్యాలివి:

(1) జాతీయ క్రీడాసంస్థలు నిర్వహిస్తున్న ఆటల శిక్షణ కార్యక్రమాలు దిగ్విజయంగా అమలుకావడానికి బహుముఖంగా తోడ్పడి క్రీడారంగంలో భారతదేశ ప్రమాణాన్ని వృద్ధిపరచడం; (2) భారత ప్రజలలో క్రీడలపట్ల అభిరుచి, ఆసక్తి పెంపొందించడం; (3) దేశమంతటా యువకులకు క్రీడల శిక్షణ పాఠశాలలు (కోచింగ్ స్కూల్సు) నెలకొల్పడం; (4) వ్యాయామక్రీడలలోను ఫుట్‌బాల్, హాకీ, క్రికెట్, టెన్నిస్,

టేబుల్ టెన్నిస్, సాముగరిడీలు (జిమ్నాస్టిక్స్), బాడ్మింటన్, వాలీబాల్, బాస్కెట్ బాల్ వంటి ఆటలలోను యువప్రవీణులకు ప్రత్యేక శిక్షణ నివ్వడం.

ఈ ప్రణాళిక క్రింద ఇండియా ప్రభుత్వం ఆరోగ్యశాఖ పరంగా మొత్తం 9,75,000 రూపాయలు ప్రత్యేకించింది. ఇందులో 1956 మార్చి ప్రాంతాల వరకు 5,90,000 రూపాయలు వ్యయపరచబడినవి. 1955-56 లో ప్రత్యేకించబడిన మొత్తం 3,00,000 రూపాయలు, 1956-57 ఆర్థిక సంవత్సరానికి 4,00,000 రూపాయలు కేటాయించబడినవి.

ఈ ప్రణాళికకు ఒక నియమావళి యేమీ రచించబడలేదు. కోచింగ్ కమిటీ ఆధ్వర్యాన ప్రణాళిక అమలుపరచబడుతుంది. ఈ కమిటీలో ఆరోగ్యశాఖా మంత్రిణి శ్రీమతి రాజకుమారి అమృత్ కౌర్, జనరల్ శ్రీ నగేష్, డాక్టర్ పి. సుబ్బరాయన్, శ్రీ జయపాల్ సింగ్ ప్రభృతులు కలరు.

1953 నవంబర్ ప్రాంతాల ఎమచ్యూర్ ఎథ్లెటిక్ ఫెడరేషన్ తమ ప్రవీణులకు ఈ ప్రణాళికపరంగా శిక్షణ నిప్పించింది. సుప్రసిద్ధ ఆంధ్ర వ్యాయామ క్రీడాధ్యాపకుడు శ్రీ జె. ఎస్. రూసో గారిని ప్రణాళిక నిర్వాహకులు శిక్షకునిగా నియమించారు. సర్వీసెస్ స్పోర్ట్స్ కంట్రోల్ బోర్డు, పంజాబ్, పెప్సు ట్రాక్ అండ్ ఫీల్డ్ ప్రవీణులు శ్రీ రూసో గారివద్ద ఉన్నత శిక్షణ పొందారు. మరి



జె. ఎస్. రూసో

నాలుగు నెలలలో 1954 మార్చిలో ఢిల్లీలో జరిగిన జాతీయ క్రీడోత్సవంలో వీరు (ఈ ప్రవీణులు) అధికప్రతిభ ప్రదర్శించడంతో శిక్షణ ప్రణాళిక ప్రాముఖ్యం వెల్లడయింది. ఈ ప్రణాళికపరంగా శిక్షణ పొందినవారిలో తొమ్మండుగురు ప్రథమస్థానం, ఏడుగురు ద్వితీయస్థానం, తొమ్మండుగురు తృతీయస్థానం ఢిల్లీ జాతీయ క్రీడోత్సవంలో సాధించారు.

ఈ విజయాలను పురస్కరించుకొని ఇండియన్ ఒలింపిక్ అసోసియేషన్ కూడా రాజకుమారి స్పోర్ట్సు శిక్షణ ప్రణాళిక సత్ఫలితాలను పొంద దలచింది. ఈ సంస్థ 1954 మే మాసంలో ద్వితీయ ఆసియా క్రీడోత్సవానికి మనిలాకు పంపుతున్న వ్యాయామ క్రీడా ప్రవీణులకు రాజకుమారి ప్రణాళికద్వారా ఉన్నత శిక్షణ నిప్పించినది. శ్రీ రూసో గారు, డాక్టర్ ఆర్థర్ హోవార్డ్ (లక్నో) వ్యాయామికులకు తర్ఫీదు యిచ్చారు. మనిలా క్రీడోత్సవంలో ఇండియా నాలుగు స్వర్ణపతకాలను (నాలుగు పోటీలలో ప్రథమస్థానం) సంపాదించింది. ఇందులో మూడింటిని రాజకుమారి ప్రణాళిక శిక్షితులు సంపాదించడం ప్రణాళిక సాఫల్యానికి మరొక తార్కాణమైంది.

ఆంధ్ర ఎమచ్యూర్ ఎథ్లెటిక్ అసోసియేషన్ కూడా రాజకుమారి శిక్షణ ప్రణాళిక ప్రయోజనాలు పొందడానికి కృషిచేసింది. ఈ సంఘం గౌరవకార్యదర్శి శ్రీ వి. సూర్యనారాయణగారి కృషిఫలితంగా ఈప్రణాళిక ఆధ్వర్యాన విజయవాడలో 1954 సెప్టెంబర్ 26 వ తేదీనుంచి మూడు వారాలపాటు ఒక ఎథ్లెటిక్ కేంద్రం నిర్వహించబడింది. డాక్టర్ ఆర్థర్ హోవార్డు వ్యాయామాధ్యాపకులు ఆంధ్ర వ్యాయామ శిక్షణ కళాశాల విశాలావరణలో ప్రకృతిశోభ మధ్యని ఆంధ్ర యువప్రవీణులు తమ ప్రతిభను మరింత శోభింపజేయ కృషి ప్రారంభించారు.

1954 అక్టోబర్‌లో ఒరిస్సా ఒలింపిక్ అసోసియేషన్ కటక్‌లో తమ ఎథ్లెట్‌లకు, అదే సంవత్సరం నవంబర్‌లో న్యూఢిల్లీలో పోలీస్ ఎథ్లెట్‌లకు, 1955 ఆరంభంలో బెంగుళూరులో యూనివర్శిటీ ఎథ్లెట్‌లకు రాజకుమారి ప్రణాళికపరంగా ఉన్నతశిక్షణ నివ్వబడింది. హైదరాబాద్, తిరువాన్కూర్, జైపూర్, జోధ్‌పూర్, కోటాహ్, ఉదయ

పూర్, బికనీర్, పళని—మున్నగు కేంద్రాలలో కూడా శిక్షణ తరగతులు నిర్వహించబడినవి.

## వారం వారం పరిశీలన

1954 నవంబర్, డిసెంబర్ నెలలలోనే న్యూఢిల్లీలో, నేషనల్ స్టేడియమ్‌లో భారీయెత్తున శిక్షణకేంద్రం నిర్వహించబడింది. వివిధ ఉత్తర రాష్ట్రాలకు చెందిన 160 మంది వ్యాయామికులు ఉన్నత శిక్షణ పొందారు. ప్రతి వారం ప్రతి వ్యాయామప్రవీణుని వేగం రికార్డుచేసి అతని కృషిఫలితాలను పరిశీలించారు. శ్రీ రూసోగారు, డాక్టర్ హూవార్డ్ అధ్యాపకులుగా పనిచేశారు. ఇచ్చట శిక్షణ కార్యక్రమం ముగియగానే దక్షిణ భారత వ్యాయామకోవిదుల సౌకర్యార్థం బెంగుళూరులో ఢిల్లీ పద్ధతిని ఒక కేంద్రం నడిపారు. రైల్వే, సర్వీసెస్, పోలీసు ఎథ్లెట్‌లు, స్కూలు, కాలేజి ఎథ్లెట్‌లు సయితం ఈ సౌకర్యం సద్వినియోగపరచుకొన్నారు.

1954 అక్టోబర్ నుంచి 1955 మార్చి వరకు బొంబాయిలో ఒక శిక్షణ కేంద్రాన్ని రాజకుమారి ప్రణాళిక శిక్షకులు శ్రీ జాల్ పర్దివాలా, శ్రీ బల్దేవ్‌సింగ్ నిర్వహించారు.

1955 వేసవిలో ఢిల్లీలో వారానికి మూడు రోజుల చొప్పున మొత్తం 112 మంది బాలికలకు, 96 మంది బాలురకు వ్యాయామ శిక్షణ నిచ్చారు. శ్రీ జోగీంద్రసింగ్ సైని, శ్రీ రణవీర్‌సింగ్ శిక్షకులుగా వ్యవహరించారు.

1955 జూన్‌లో శ్రీనగర్‌లో వ్యాయామక్రీడా ప్రవీణులకు రాజకుమారి ఆటలశిక్షణ ప్రణాళిక ననుసరించి తర్బీదు యివ్వబడింది.

1956 సెప్టెంబర్‌లో విజయవాడలో ఒక శిక్షణకేంద్రం నిర్వహించబడింది. శ్రీ జె. ఎస్. రూసోగారు ప్రధానాధ్యాపకులు. విశాఖపట్టణంలోని ఆంధ్ర స్పెషల్ ఆర్మ్‌డ్ పోలీస్ ఎథ్లెట్‌లు, పిఠాపురం, కాకినాడ, రాజమండ్రి, శ్రీకాకుళం, పశ్చిమ గోదావరి, తూర్పు గోదా

వరి, కృష్ణ, గుంటూరు కాలేజి, హైస్కూలు ఎథ్లెట్‌లు మొత్తం 45 మంది శిక్షణ పొందారు.

భారతీయ ప్రవీణులచేత శిక్షణ నిప్పించడమే కాక విదేశాలనుంచి ఒలింపిక్ ఛాంపియనులను రప్పించి, వారిచేత అనేక కేంద్రాలలో ప్రదర్శన లిప్పించి, స్వల్పకాల శిక్షణ గరపడానికికూడా ఈ ప్రణాళిక పరంగా ఏర్పాట్లు చేశారు.

100 మీటర్ల పరుగులో 1936 లోనే ప్రపంచం రికార్డును (10.2 సెకండులు) స్థాపించి 20 సంవత్సరాలు అజేయుడుగా వున్న అమెరికన్ నీగ్రో శ్రీ జెస్సీ ఓవెన్స్, 1948 లండన్ ఒలింపిక్స్‌లోను, 1952 హెల్సింకీ ఒలింపిక్స్‌లోను "డికాథ్లన్" (పదిరకాల వ్యాయామ క్రీడలలో పోటీ)లో స్వర్ణపతకం బడసిన అమెరికన్ శ్వేతజాతీయుడు బాబ్ మాథియాస్, కాష్ఠసహాయ ప్లుతిలో (Pole Vault) ప్రపంచంలోకెల్ల ద్వితీయుడైన అమెరికన్ ప్రముఖుడు రాబర్ట్ రిఛార్డ్స్ (ఈయన రికార్డు 15 అడుగుల $4\frac{3}{4}$ అంగుళాలు) 1952 హెల్సింకీ ఒలింపిక్స్‌లో ఐదు వేల మీటర్ల పరుగు, పదివేల మీటర్ల పరుగు మరాథన్ - 26 మైళ్ళ 385 గజాల పరుగు—పోటీలలో గెలుపొందిన చెకోస్లోవాకియా ప్రముఖుడు లెఫ్టినెంట్ కర్నల్ ఎమిల్ జటోపెక్, హెల్సింకి ఒలింపిక్స్‌లోనే ఈటె విసరడంలో (జావిలిన్ త్రో) ప్రప్రథమ స్థానం పొందిన ఎమిల్ సతీ డానా జటోపెక్, రష్యను సాము గరిడీల ప్రవీణులు (Gymnasts) యూసఫ్ బెర్డీవ్ ప్రభృతుల ప్రజ్ఞాప్రదర్శనాన్ని ఈ ఏర్పాటుపరంగా భారతీయులు చూడకలిగారు. వీరి అమూల్య సలహాలను మన ప్రవీణులు కొంతవరకు పొందగలిగారు.

కజ్నెట్సోవ్, జార్జిరైడర్ ఫ్రాంక్ కాఫ్‌మన్ వంటి విదేశప్రముఖుల సహకారం, సలహాలుకూడా మన ప్రవీణులకు లభించినవి.

ఎథ్లెటిక్స్‌లోనే కాక ఇతరక్రీడలలో కూడా విదేశ ప్రముఖులు మనవారికి శిక్షణ యిచ్చివున్నారు.

పి. సవోస్టియనోవ్ ఇండియా ఫుట్‌బాల్ ఆటగాళ్ళకు, బ్రియన్ కెన్నడీ, విక్టర్ బార్నా టేబుల్ టెన్నిస్ ఆటగాళ్ళకు, ఆటకత్తెలకు,



బాబ్ హాప్మన్
(అమెరికా వెయిట్ లిఫ్టింగ్
పితామహుడు)

1955 లో ఇండియాలో పర్యటించిన రష్యను వాలిబాల్ జట్టువెంట వచ్చిన శిక్షకుడు శ్రీ గొలొమొజోవ్ శ్రీ సి. బుచ్చిరామయ్య మున్నగు వాలిబాల్ ఆటగాళ్ళకు, టామీ కానో, బాబ్ హాప్మన్ మున్నగు అమెరికను ప్రముఖులు శ్రీ డి. ఆర్. గోపాల్, శ్రీ కామినేని ఈశ్వర రావు ప్రభృతులకు వెయిట్ లిఫ్టింగ్ లోను, అలెగ్జాండర్ జిరోవ్, యూసిఫ్ బెర్డీవ్‌లు (రష్యా) ఇండియన్ జిమ్నాస్ట్స్‌కు శిక్షణ నిచ్చారు.

1956 మార్చి రెండవ పక్షంలో మద్రాసు వై. ఎమ్. సి. ఏ. కళాశాలలో చెడుగుడు (కబాడీ)లో శిక్షకులకు, ఆటగాళ్లకు శిక్షణతరగతులు నిర్వహించబడినవి. శ్రీయుతులు కృష్ణయ్య, సుబ్బారెడ్డి, తాతారావు, నాగేశ్వరరావు, కృష్ణారావు, ఆంజనేయులు, వెంకటేశ్వరరావు, జయరామరెడ్డి, శివలింగయ్య, వెంకట శివరెడ్డి, వై. ఎన్. రెడ్డి మున్నగు వారు ఈ శిక్షణ సౌకర్యాన్ని పొందారు.

పైన పేర్కొన్న రెండు సంస్థలు - నేషనల్ స్పోర్ట్స్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా, రాజకుమారి స్పోర్ట్స్ కోచింగ్ స్కీమ్—అవతరించడానికి అశేష కృషి జరిపినవారిలో ప్రముఖులు శ్రీ ఏ. ఎస్. డిమెల్లోగారిని ఈ సందర్భంలో అభినందించడం సమంజసం.

## లోపాలు

రాజకుమారి వ్యాయామక్రీడల శిక్షణ ప్రణాళిక దేశవ్యాప్తంగా అమలుపరచబడుతున్నప్పటికీ ఆంధ్రులకు తగినంత ప్రయోజనకరం కావడం లేదు.

టేబుల్ టెన్నిస్, చెడుగుడు, వాలీబాల్, కొన్ని సందర్భాలలో వ్యాయామక్రీడలలో శిక్షణకేంద్రాలు మాండలిక ప్రాతిపదికపై ఏర్పాటు చేయబడుతున్నవి. బెంగుళూరు, మద్రాసువంటి దూర నగరాలకు వచ్చి వారాలతరబడి వుండి శిక్షణపొందే ఆర్థికస్తోమతు ఆంధ్ర ప్రవీణులలో చాలామందికి లేదు. మదరాసు, మైసూరు, కొచ్చిన్-తిరువాన్కూర్, ఆంధ్ర రాష్ట్రాలకు కలిపి శిక్షణ తరగతులు నిర్వహించబడుతున్న సందర్భాలలో ఆంధ్రకు ప్రాతినిధ్యం చాలా తక్కువగా వుంటున్నది.

ఆంధ్రులు చెడుగుడు, వాలీబాల్, వెయిట్ లిఫ్టింగ్ లలో యావద్భారతదేశంలో ప్రథమశ్రేణిలో వుండగలవారు. టేబుల్ టెన్నిస్, బాడ్మింటన్ ఆంధ్రదేశంలో విశేషంగా ప్రచారంలో వున్నవి. అందుచేత పై ఆటలలో ప్రత్యేకించి ఆంధ్రలో శిక్షణ తరగతులు నిర్వహించడం అత్యావశ్యకం.

వ్యాయామ క్రీడలలో దేశం మొత్తంపై అగ్రశ్రేణిని ఆక్రమించగల ఆరోగ్యం, శరీర నిర్మాణం ఆంధ్రుల సొత్తు. ఢిల్లీ, బెంగుళూరులలో పెద్దపెట్టున నిర్వహించినట్లు ఆంధ్రలో కూడా భారీయెత్తున దీర్ఘకాలానికి వ్యాయామ క్రీడలలో శిక్షణ శిబిరం నిర్వహించడం ఎంతైనా అభిలషణీయం.

రాజకుమారి స్పోర్ట్సు శిక్షణ ప్రణాళిక యావద్భారత ప్రాతిపదికపై రూపొందించ బడినప్పటికీ విదేశ ప్రముఖులు, జట్లు ఆంధ్రదేశంపై పురానిచ్చే ఏర్పాట్లు చెయ్యకపోవడం అత్యంత శోచనీయం. రష్యను సాముగరిడీ ప్రవీణులు కాని, అమెరికన్ వెయిట్ లిఫ్టింగ్ ప్రముఖులు కాని, ఓవెన్సు, రిఛార్డ్సు, మాధియస్‌లు కాని అప్పటి ఆంధ్రరాష్ట్రంలో కాలిడనేలేదు. తత్ఫలితంగా ఆంధ్ర క్రీడోత్సాహికులకు తీరని ఆశాభంగం కలిగింది. ముమ్ముందయినా విదేశప్రముఖుల విధానాలను ఆంధ్ర యువక్రీడోత్సాహికులు కళ్ళారా చూచి అనుసరించడానికైనా వసతి కలుగజేయాలి.

రాజకుమారి శిక్షణ ప్రణాళిక ననుసరించి యివ్వబడుతున్న శిక్షణ పెక్కు సందర్భాలలో స్వల్పం. కొలది వారాలలో, పది, పదిహేను

రోజులలో ఎవ్వరూ "పండితులు" కాలేరుకదా! అందుచేత దీర్ఘకాలానికి సమగ్రశిక్షణ నిప్పించే పద్ధతి ఏర్పాటు చేయడం అభిలషణీయం. భారత యువ వ్యాయామ ప్రవీణుల ఆర్థిక దుస్థితిని గమనించి అది వారి శిక్షణకు ఏమాత్రం అవరోధం కాకుండా చేసే బాధ్యతకూడా ప్రణాళిక నిర్వాహకులు వహించాలి.

శిక్షణ పూర్తిఅయిన పిమ్మట శిక్షితులు తమ కాలాన్ని వ్యర్థం చెయ్యక దీర్ఘకాలంపాటు స్వయంగా శిక్షణ విధానాలను అమలు పరచుకోడానికి ప్రణాళిక నిర్వాహకులు సమస్త సదుపాయాలు కలుగజేయాలి. అమిత వ్యయప్రయాసలపై గరపబడిన శిక్షణను వ్యర్థం కానివ్వరాదు. ఇట్టి సౌకర్యాలిచ్చి ఉన్నత శిక్షణ వెంట వెంటనే ఉత్తమ ఫలితా లివ్వటానికి మార్గ మేర్పరచాలి.

క్రీడారంగంలో అద్వితీయ ప్రతిభ ప్రదర్శించినవారిని ఘనంగా సన్మానించే పద్ధతి ఇండియాలో ఇంకా అమలులోకి రాలేదు. సోవియెట్ రష్యాలో ఈ పద్ధతి 1947 లోనే అమలుపరచబడింది. సోవియెట్ జాతీయ క్రీడోత్సవంలో యూనియన్ రికార్డులు అధిగమించినవారికి స్వర్ణపతకాలు బహూకరిస్తుంది. ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలు పొందినవారికి రజత పతకాలు, తదితర బహుమతులు సమర్పిస్తున్నది.

వ్యాయామక్రీడలలో కొన్ని ప్రమాణాలు నిర్ణయించి (వీటిగురించి రష్యా అన్న ఉపఅధ్యాయంలో వివరిస్తాను) వాటిని అందుకొన్నవారికి "మాస్టర్ ఆఫ్ స్పోర్ట్స్", "ఆనర్డ్ మాస్టర్ ఆఫ్ స్పోర్ట్స్ ఆఫ్ ది యు. ఎస్. ఎస్. ఆర్" అనే బిరుదముల నిస్తున్నది. ఉత్తమ వ్యాయామక్రీడాధ్యాపకులకు, శిక్షకులకు "ఎక్సెలెంట్ ఇన్ ఫిజికల్ కల్చర్" అనే బాడ్జి బహూకరిస్తున్నది.

క్రీడారంగంలో అద్భుత ప్రావీణ్యం సంపాదించివున్నవారు మరింత ఉత్సాహంతో ముందడుగు వేయడానికి ఈ బహుమతులు యూతనిస్తవి. ఇండియాలోకూడా ఇటువంటి పద్ధతి—దేశపరిస్థితులకు అనుగుణంగా—ప్రవేశపెట్టడం మంచిది.

ఆటలలో భారత ధ్వజాన్ని అనన్యకీర్తి కెత్తి వయసు మళ్ళగానే ఆర్థిక దుర్బాధకు గురికావలసిన ప్రమాదం చాలామందికి భారత దేశంలో కలుగుతున్నది. దేశానికి కీర్తి ప్రఖ్యాతులు తెచ్చిన ఆటగాళ్ళు "బ్రతికి చెడకుండా" ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పరంగా సహాయం చెయ్యడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. రెడ్ టేపిజంకు బలికాకుండా ఇది త్వరగా కార్యరూపం ధరిస్తే ఎంతైనా ముదావహం.

అఖిల భారతానికి ఖ్యాతి తెచ్చినవారిని భారత ప్రభుత్వం ఆదుకోనాలి. రాష్ట్రానికి వన్నె తెచ్చిన క్రీడా విద్వాంసులకు ఎట్టిలోటు రాకుండా రాష్ట్ర ప్రభుత్వాలు కాపాడాలి.

భారత ప్రభుత్వపు ఆరోగ్యశాఖ పరంగా ఆటలలో, వ్యాయామ క్రీడలలో శిక్షణ సదుపాయాలు కల్పించబడితే విద్యాశాఖ పరంగా క్రీడల పురోభివృద్ధికి "ఆలిండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్స్" కృషిచేస్తున్నది.

"ఆలిండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్స్":— ఇండియాలోని వివిధ క్రీడాసంస్థల ప్రతినిధులు 14-8-54 న్యూఢిల్లీలో మహాసభ జరిపి సమస్తక్రీడల పురోభివృద్ధికి అఖిలభారత సంస్థను నెలకొల్పవలెనని ఇండియా ప్రభుత్వానికి సిఫారసు చేస్తూ తీర్మానించారు. 27-11-54 న "ఆలిండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్స్" రూపొందించబడింది. కేంద్ర విద్యాశాఖా మంత్రి శ్రీ మౌలానా అబుల్ కలామ్ ఆజాద్ ఈ సంస్థకు ప్రారంభోత్సవం జరిపారు.

అప్పటి అఖిలభారత క్రీడాసంస్థల నిర్వహణలో గల లోపాలను సరిదిద్దడం, క్రీడల పురోభివృద్ధికి పాటుపడడం "ఆలిండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్స్" లక్ష్యంగా పెట్టుకొన్నది. కౌన్సిల్ ప్రథమాధ్యక్షునిగా శ్రీ నావల్ హెచ్. తాతాగారిని కేంద్రప్రభుత్వం నామినేట్ చేసింది. విజయనగరం మహారాజ కుమార్ డాక్టర్ విజయ ఆనంద్ గారు, జాతీయక్రీడా సమాఖ్యల అధ్యక్షులు సభ్యులుగా కౌన్సిల్ కు తీసుకోబడినారు.

'ఆలిండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్స్' సలహాసంఘంగా వ్యవహరించాలనీ, జాతీయక్రీడా సమాఖ్యలు (నేషనల్ స్పోర్ట్స్ ఫెడరేషన్స్) స్వయంనిర్ణయాధికారం కలిగ వుండాలని నిర్ణయించబడింది.

కౌన్సిల్ అవతరించగానే భారతదేశంలో క్రీడల, క్రీడావేత్తల స్థితిగతుల గురించి సమగ్రవిచారణ జరిపింది. జాతీయ క్రీడాసమాఖ్యలు నిర్మాణాత్మకంగా ఆలోచించి పథకాలు వేయలేదనీ, స్వార్థపరులైన కార్యకర్తలు ధన, అధికారతృష్ణతో నిరంతరంగా వ్యవహరించారనీ, ఒక్కొక్కవ్యక్తి అనేక పదవులు వహిస్తూ వచ్చినారనీ, సమాఖ్యలకు సంబంధించిన అక్కౌంట్‌లను సరిగా వుంచలేదనీ తత్ఫలితంగా ఇండియాలో క్రీడల ప్రమాణం క్షీణించి పోయిందనీ కౌన్సిల్ అభిప్రాయపడింది. జాతీయ క్రీడాసమాఖ్యల వ్యవహారాలను చక్కబెట్టగల శక్తిస్తోమతులను ఇండియన్ ఒలింపిక్ అసోసియేషన్ పొందివుండీ కూడా అందుకు ప్రయత్నమైనా చెయ్యకపోవడంపట్ల విచారం ప్రకటించింది.

సమాఖ్యల వ్యవహారాలు లోపభూయిష్టంగా వున్నప్పటికీ పాటియాలా వంటి సంస్థానాల అధీశులు, తాతావంటి పారిశ్రామిక వేత్తలు క్రీడావేత్తలను పోషిస్తూనే వచ్చారు. 1928 నుంచి ప్రపంచ హాకీ రంగంలో ఇండియా అజేయంగా వున్న విషయం ఈ సందర్భంలో గమనార్హం.

"ఆలిండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్స్" నిర్మించబడిన ఈ రెండు సంవత్సరాలలోను జాతీయ క్రీడా సమాఖ్యల వ్యవహారాలు కొంతవరకు సంస్కరించబడినవి. ఆటల ప్రమాణం కొద్ది కొద్దిగా పెరుగుతున్నది. అనేక రాష్ట్రాలవారు వివిధదేశాల క్రీడావిద్వాంసుల ప్రజ్ఞాప్రదర్శనాన్ని కళ్ళారా కాంచకలిగారు. ఈ విధంగా ఆటలపట్ల ప్రజల ఆసక్తి ఇసుమంత పెరిగింది.

"ఆలిండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్స్" ఆటల శిక్షకులకు (కోచెస్) ఉన్నతశిక్షణ నివ్వడానికి ఏర్పాట్లు చేస్తున్నది. జాతీయ క్రీడాసమాఖ్యలు శిక్షణ శిబిరాలు నిర్వహించడంలో తోడ్పడుతున్నది. విదేశాలనుంచి స్పోర్ట్సు టీములను జాతీయ క్రీడా సమాఖ్యలు ఆహ్వానించడానికి విద్యాశాఖ ద్వారా గ్రాంటుల నిప్పిస్తున్నది. విదేశాలకు ఇండియన్ స్పోర్ట్సు టీమ్స్‌ను పంపడానికి కూడా ఆర్థికసహాయం చేస్తున్నది.

అఖిల భారత ప్రతిపత్తిపై "ఆలిండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్సు" ఏర్పాటు చేయబడినట్లు అన్ని రాష్ట్రాలలోను రాష్ట్ర ప్రతిపత్తిపై "స్పోర్ట్సు కౌన్సిల్స్" ఏర్పాటు చెయ్యవలెనని సిఫారసు చేసింది. ఇందుకు అనుసరించదగు నియమావళిని (మోడల్ కాన్స్టిట్యూషన్) రాష్ట్ర క్రీడా సంస్థలకు అందజేసింది. శ్రీ పుయ్యూరు కుమారరాజా, శ్రీ దేవత రామమోహనరావు ప్రభృతులు "ఆంధ్ర కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్సు" ఏర్పాటు చేయడానికి కృషి జరుపుతున్నారు.

ఇండియా ప్రభుత్వానికి చెందిన వ్యాయామ విద్యా సలహాసంఘం (సెంట్రల్ అడ్వయిజరీ బోర్డు ఆఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్ అండ్ రిక్రియేషన్) పాఠశాలల విద్యార్థులకు, విద్యార్థినులకు అమలుపరచదగు వ్యాయామ నియమాదులను నిర్ణయించడానికై మూడు ఉపసంఘాలను నియమించింది. ఇవి అందజేసిన సిఫారసులలో కొన్ని త్వరలో అమలు పరచబడవచ్చు.



ఇవాన్ లుబవైన్
(రష్యను వెయిట్ లిఫ్టింగ్ అధ్యాపకుడు)

ఈ సలహా సంఘం సిఫారసు ననుసరించి భారత విద్యాశాఖ భారతదేశ మంతటికీ కలిపి పాటియాలాలో వ్యాయామ కళాశాలను ("నేషనల్ కాలేజి ఆఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్") నెలకొల్పనున్నది.

భారత విద్యాశాఖ సహాయంతోనే ఇండియా వెయిట్ లిఫ్టింగ్ ఫెడరేషన్ రష్యానుంచి వెయిట్ లిఫ్టింగ్, బాడీబిల్డింగ్ అధ్యాపకుడు ఇవాన్ లుబవైన్‌ను రప్పించింది. ఈ ప్రముఖుడు 1956 మే మాసారంభంలో విజయవాడలో ఆంధ్ర ప్రవే

ణులకు ఉన్నత శిక్షణ నిచ్చాడు. మద్రాసు, కలకత్తా, బొంబాయి మున్నగు కేంద్రాలలో కూడా ఆయన శిక్షణశిబిరాలు నిర్వహించారు.

మొదట పేర్కొన్నట్లు ఇండియాకు ఆహ్వానించబడిన విదేశ క్రీడా ప్రవీణులలో చాలామంది ఆంధ్రదేశం వైపు దృష్టిని మరల్చడంలేదు. జాతీయ క్రీడాసమాఖ్యలలో "ఆలిండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్స్" కనుగొన్న లోపాలు ("పాలిటిక్స్") నేటికీ కొన్ని రాష్ట్ర క్రీడాసంఘాలలో కన్పిస్తున్నవి. రాష్ట్రీయ స్పోర్ట్స్ కౌన్సిల్ త్వరగా అవతరించడానికి ఆలిండియా కౌన్సిల్ మరింతగా పూనుకొనడం అత్యావశ్యకం.

అన్నిరాష్ట్ర ప్రభుత్వాలలోను విడిగా స్పోర్ట్స్‌శాఖలు ఇంకా ఏర్పాటు కాలేదు. వీటిని ఏర్పాటుచేసి విడిగా స్పోర్ట్స్ మంత్రిని నియమించడం అభిలషణీయం. రాష్ట్ర వ్యవహారాలను, త్వరగా నిర్మాణాత్మకంగా పరిష్కరించుకోవడానికి రాష్ట్రప్రభుత్వ క్రీడాశాఖలు ఎంతైనా ఉపకరించగలవు.

మైసూరు, ఉత్తర ప్రదేశ్, తిరువాన్కూర్-కొచ్చిన్, పెప్సూ రాష్ట్రాలలో ఈవరకే విడిగా ప్రభుత్వ క్రీడాశాఖ, రాష్ట్ర స్పోర్ట్స్ కౌన్సిల్స్ ఏర్పాటయి వున్నవి. మద్రాస్‌ప్రభుత్వంలో కూడా క్రీడాశాఖ నామమాత్రంగా వున్నది. ఆంధ్రప్రభుత్వం ఈ విషయాలను ముఖ్యంగా గమనించాలి. లోపాలకు అతీతమైన క్రీడాశాఖను ఏర్పాటు చేయాలి.

అంతర్జాతీయ క్రీడారంగంలో ఇండియా ఏదైన ఘనవిజయం సాధిస్తే భారతదేశ మంతటా పండుగ జరిపే ఆచరణ కూడా అమలుపరచాలి. పాకిస్తానీయులు బ్రిటన్‌ను టెస్టు క్రికెట్ పోటీలో ఓడించినప్పుడు పాకిస్తాన్ అంతటా సెలవు ప్రకటించబడింది; ఉత్సవాలు జరుపబడినవి. క్రీడలపట్ల ప్రజల ఆసక్తిని, అభిమానాన్ని ద్విగుణీకృతం చెయ్యడానికి ఇట్టి చర్యలు దోహద మివ్వగలవు.

అంతర్జాతీయ హాకీ రంగంలో ఇండియా 1928 నుంచి అజేయంగా వుంటున్నది. 1928 లో ఆమ్‌స్టర్‌డామ్‌లో జరిగిన ప్రపంచ ఒలింపిక్ హాకీ పోటీలలో ఇండియా హాల్యాని ఫైనల్సులో హాలెండును 3-0

గోలులతో ఓడించి ఛాంపియన్ షిప్ సాధించింది. 1932 లో లాస్ ఏంజిలిస్‌లో జరిగిన ప్రపంచ ఒలింపిక్ పోటీలలో ఇండియా అమెరికాపై 24-1 గోలులతో విజయ మొందింది. 1948 లో లండన్‌లో జరిగిన ప్రపంచం ఒలింపిక్స్‌లో ఆస్ట్రియాను 8-0 గోలులతోను, అర్జెంటీనాను 9-1 గోలులతోను 'చిత్తు' చేసింది. అంతిమ పోటీలో గ్రేట్ బ్రిటన్‌పై 4-0 గోలులతో విజయ మొందింది. హాకీకి సంబంధించి నంతవరకు "గ్రేట్ బ్రిటన్"ను "స్మాల్ బ్రిటన్" చేసింది.

1952, 1956 లలో ప్రపంచం ఒలింపిక్ హాకీ పోటీలలో స్వర్ణపతకాలు గెలుచుకొన్నది. ఇండియా ఒక్క హాకీలోనే యింతటి ప్రతిభ చూపగలిగింది. దీనిని పరిరక్షించడానికి ఇండియా ప్రభుత్వము, అనుబంధ సంస్థలు ప్రత్యేక శ్రద్ధ వహించాలి. హాకీని జాతీయ క్రీడగా పరిగణించాలి. ప్రతి రాష్ట్రంలోను, ప్రతి పాఠశాలలోను హాకీ అభ్యాసానికి ప్రత్యేకపు ఏర్పాట్లు చేయాలి. హాకీలో ప్రావీణ్య పరిరక్షణ జాతీయ నిర్మాణ కార్యక్రమంగా (నేషన్ బిల్డింగ్ ప్రోగ్రామ్) యెంచాలి. ప్రతి బాలుడు, బాలిక హాకీ ఆటను అభ్యసించడానికి కేంద్రప్రభుత్వం సమస్తమైన ప్రోత్సాహ ప్రోద్బలా లివ్వాలి.

ఆంధ్రులు చెడుగుడు, వాలిబాల్, వెయిట్ లిఫ్టింగ్, కండర నిర్మాణం మున్నగు క్రీడలలో విశేష ప్రతిభ గడించి వున్నారు. ప్రతి ఆంధ్ర క్రీడోత్సాహికుడు ఈ క్రీడలలో మరింత ప్రావీణ్యం గడించడానికి, తక్కిన ఆటలలో ఆంధ్రులు భారతస్థాయిని అందుకోడానికి ఆంధ్రప్రభుత్వం సమస్త సదుపాయాలు కలుగజేయాలి.

## అధ్యాయము 3

# ప్రపంచ ప్రాచీనక్రీడలు

## (1) భారతదేశం

భారతదేశం అనాదిగా క్రీడలకు పుట్టినిల్లు. మన పురాణాలలో, చరిత్రలలో అనేకరకాల ఆటలు వర్ణించబడినవి. వీటిలో అనేకం నేటికీ పల్లె, పట్నాలలో ప్రచారంలో వున్నవి.



ప్రాచీన క్రీడలకు ఆధునిక క్రీడలకు ప్రధానమైన భేద మొకటి వున్నది. ప్రాచీనకాలంలో ద్వంద్వయుద్ధం, ధనుర్విద్య వంటివి శాంతి కాలంలో శరీర సౌష్ఠవానికి ఉద్దేశించబడినవి. నిత్య జీవితానికి, జీవికకు కూడా విలువిద్య ఉపయోగించబడేది. యుద్ధకాలంలో శత్రువులను పరిమార్చడానికి ఈ విద్యలే ప్రధానాంగాలుగా వుండేవి.

ఆధునిక క్రీడ లన్నీ బలవృద్ధికే ఉద్దేశించబడినవి. విజ్ఞానశాస్త్రం అవధులు లేకుండా అనుక్షణం అభివృద్ధి పొందుతూ వున్నందువల్ల మానవుని బలదార్ఢ్యాలు పనికిమాలినవై పోయినవి. ఆధునిక యుద్ధకాలంలో మానవుని దేహశక్తికంటె మానసిక శక్తికే విలువ ఎక్కువ. ఇప్పుడు శాంతికాల క్రీడలు యుద్ధంలో ఏవిధంగానూ పనికిరావడం లేదు. ప్రాచీనకాల పరిస్థితులు ఇందుకు పూర్తిగా విరుద్ధం.

రామాయణం :— రామాయణంలో బలప్రదర్శనకు సంబంధించిన గాథలు అనేకం వున్నవి. శ్రీరాములు మహాధనుస్సును విరిచి వేయడం, ధనుర్విద్యతో రాక్షస సంహారం చెయ్యడం వంటి గాథలు అందులో వున్నవి. వీరహనుమాన్ సంజీవిపర్వతాన్నే పెకలించి

వేయడం బలప్రదర్శనకు మచ్చుతునక. నేటికీ ఆంజనేయులు ఆదర్శ బలశాలిగా యెంచబడుతున్నారు. అనేక వ్యాయామ సంస్థలు మారుతి పేరు పెట్టుకొని వ్యాయామంలో ఆయనను ఆదర్శప్రాయునిగా చేసుకొన్నవి.

వానరసైనికులు బండరాళ్ళను ఎత్తి శత్రువులపై విసిరిన ఘట్టాలు అనేకం "రామాయణం"లో అభివర్ణించబడినవి. హనుమంతుడు ద్రోణగిరి పర్వతంలోని ఒక మహాశిలను ఎత్తినట్లు కూడా వర్ణించబడివుంది. నిత్య జీవితంలో అలవాటయితే కాని అట్టి సాహసకృత్యాలు జరుపలేరు కాబట్టి రామాయణకాలంలో బ్రహ్మాండమైన బరువులు లేపడం, విసరడం నిత్య దినక్రీడలలో ఒకటయి వుంటుందని ప్రసిద్ధ క్రీడావిమర్శకులు భావిస్తున్నారు.

రామాయణంలో అనేక మల్లయుద్ధాలుకూడా వర్ణించబడినవి. వాయుపుత్రునికి, ఆయన కుమారుడు మకరధ్వజునికి నిర్విరామంగా దీర్ఘకాలం మల్లయుద్ధం జరిగింది.

మన పురాణాలబట్టి ఆయుగంలో మల్లవిద్య ప్రముఖ వ్యాయామంగా యెంచబడినట్లు తోస్తున్నది. సమస్త వర్ణాల వారు మల్లవిద్య నభ్యసించేవారు.

చెట్లనీడన జనులు ఆసీనులై వుండగా మల్లులు పోరాడేవారనీ క్రీడాంగణాల నిర్మాణానికి మూలోద్దేశం అలనాటి పోరాటాల ఏర్పాట్లేనని ప్రముఖ క్రీడావిమర్శకులు భావిస్తున్నారు. పురాణయుగంలో గదాయుద్ధం, అశనియుద్ధం, కర్రయుద్ధం వంటివి సైనిక కసరత్తులుగా అమలులో వుండేవనీ, ఆకాలపువారు వాటిని ఆచరించి బలసంపన్నులైనారనీ శతాధిక సంవత్సరాలపాటు వారు జీవించకలగడానికి అదే కారణమని కూడా క్రీడావిమర్శకులు అభిప్రాయపడుతున్నారు.

రామాయణకాలంలో బంతులఆట, శబ్దభేదివిద్య అమలులో వున్న నిదర్శనాలు కూడా కలవు. జానకి బాల్యంలో బంతి ఆటవంటి ఆట ఆడేనని రామాయణం చెబుతున్నది. దశరథుడు శబ్దభేదివిద్యలో మేటి,

దశరథుడు వేటకై వెళ్ళగా ఒక మునికుమారుడు తన వృద్ధ తల్లిదండ్రుల దప్పిక తీర్చడంకోసం కడవను ఒక తటాకంలో ముంచుతూ వుండగా ఆ శబ్దంబట్టి ఏనుగు నీరు తాగుతున్నదని దశరథుడు యెంచి శబ్దం వినవచ్చిన దోవను బాణం వేసినట్లు రామాయణం వర్ణించింది.

మహాభారతం :— మహాభారతంలో వీరులు అనేక క్రీడలలో ఉద్దండులుగా వర్ణించబడినారు.

భీముడు మహాబలశాలిగాను, గదాయుద్ధంలో, బాహుయుద్ధంలో అద్వితీయుడుగాను చెప్పబడినాడు. ముష్టియుద్ధంలో కూడా ఈయన మహామేటి.

ధనుర్విద్యలో సవ్యసాచిని మించినవారు లేరు. మత్స్యయంత్ర భేదనం, ఖాండవ దహనం, అంపశయ్యపై భీష్ముని దప్పి తీర్చడం వంటి ఘట్టాలు విలువిద్యలో అర్జుని ప్రతిభను వివరించుచున్నవి. ధర్మరాజు ఖడ్గయుద్ధంలోను, నకులుడు గుర్రపు స్వారీలోను అఖండులు.

100 మంది కౌరవులు, ఐదుగురు పాండవులు బాల్యంలో ద్రోణాచార్యుని వద్ద, కృపాచార్యుని వద్ద బలవృద్ధిక్రీడలు అనేకం అభ్యసించినట్లు మహాభారతం తెల్పుతున్నది. ఇందులోనే, ధనుర్విద్య, ద్వంద్వయుద్ధం, ముష్టియుద్ధం, గదాయుద్ధం, ఖడ్గయుద్ధం, ఈత, స్వారీ, ధావనం, ప్లుతి వంటి అనేక క్రీడలు ప్రస్తావించబడినవి. మహాభారతకాలంలో అద్వితీయ శక్తిమంతుడైన భీముడు నేటి బలశాలురకు కూడా ఆదర్శప్రాయుడై నిలచినాడు.

బావిలో పడిన బంతిని అర్జునుడు బాణంతో కొట్టి, బాణపు వరుసతో పైకి లాగిన సంఘటన ఒకటి మహాభారతంలో వర్ణించబడింది. దీనినిబట్టి బంతిఆట ఆ కాలంలో కూడా వున్నట్లు విదితమౌతున్నది. బంతి ఆట కందుక క్రీడగా వ్యవహరించబడేది.

మహాభారతంలోనే మల్లవిద్యాకోవిదులు అనేకులు వర్ణించబడినారు. కంసుని ఆస్థానంలోనే ముష్టికుడు, చాణూరుడు అనే జగజెట్టీలు వుండేవారట. బాలకృష్ణుడు వారిని చిత్తుచిత్తుగా ఓడించి, "ముష్టికా

సుర, చాణూరమల్లవిద్యావిశారద" బిరుద మార్జించినందున ఆ కాలంలో క్రీడాయోధులు సత్కరించబడేవారని ఊహించవచ్చు.

నియుద్ధక్రీడ, మృగఘాతుక్రీడ, వత్సహరణము, రాసక్రీడ, పీటాక్రీడ, చతురంగం, జలస్తంభనం వంటి విద్యలుకూడా మహాభారత కాలంలో వున్నవి. దుర్యోధనుడు జలస్తంభన విద్యలో ఘటికుడు.

బుద్ధుని జాతక కథలలో కూడా అనేక క్రీడలు వర్ణించబడినవి.

బుద్ధుడు గోలీకాయలు ఆడేవారట. ధనుర్విద్యలో ఈయన శక్తి అపారము. 10 కోసుల దూరానవున్న లక్ష్యాన్ని ఈయన బాణముతో కొట్టెడివారట.

మరికొన్ని ముఖ్యమైన ప్రాచీనక్రీడలను దిగువ ఉదహరిస్తున్నాను :

కృత్రిమ వృషభక్రీడ :—బాలురు ఎద్దువలె బట్ట కప్పుకొని, సింహమువలె చర్మము కప్పుకొని క్రీడిస్తారు. క్రీడసమయంలో పశుపక్షుల ధ్వనులుకూడా పలుకుతారు.

నిలయన క్రీడ :—(1) కొందరు బాలురు దాగి వుంటారు. మరికొందరు వారిని వెతుకుతారు. కొందరు పిల్లలు దొంగలుగా, మరికొందరు అన్వేషకులుగా ఆడుతారు.

(2) బాలురు క్రింది మూడుతరగతులుగా విభక్తులౌతారు. పశుపాలకుడు, పశుచోరుడు, మేషాయితుడు. మేషమయిన బాలకుని పశుచోరుడు ఎత్తుకొని పోతాడు. పశుపాలకుడు వానిని అన్వేషిస్తాడు. ఇది శ్రీకృష్ణుడు "వత్సహరణము"లో ఆడినట్లు భాగవత కథనం.

మర్కటోత్సవక్రీడ :—బాలకులు వానరులవలె చెట్లెక్కి అనేక వృక్షములపైకి ఎక్కుతు దిగుతు తిరుగుతు ఆడుకొంటారు. "భాగవతం" లో ఈ ఆటకూడా పేర్కొనబడింది.

శిక్యాదిఘోషణ క్రీడ :— ఇందులో బంతివంటి దానిని ఒకరికి అందకుండా ఇతరుల వద్దకు విసరబడుతుంది. అతడు అలసి తన వస్తువును కోరినప్పుడు అతని కది కిచ్చివేయబడుతుంది.

అహమహమికాస్పర్శ క్రీడ :— దూరముగానున్న బాలుని ఎవరు ముందుగా ముట్టుకొనెదరో పందెము వేయబడే ఆట ఇది.

భ్రామణ క్రీడ :— ఒక బాలకుడు ఇంకొకని చేయి పట్టుకొని ఊగుచు లేక లేచుచు కూర్చునే ఆట ఇది.

గర్తాది లంఘున క్రీడ :— ఎవ రెంత దూరము పరుగిడగలరో నిర్ణయించడానికి జరిగే పోటీ యిది.

బిల్వాది ప్రక్షేపణ క్రీడ :— తీగెగాని బంతిగాని దారిలో నేలకు తగిలి పుటమించునట్లు విసరడం.

అస్పృశ్యత్వ క్రీడ :— ఒకరిని మరొకరు ముట్టుకొన ప్రయత్నించగా రెండవవారు తప్పించుకొనుటకై ప్రయత్నించే ఆట.

నేత్రబంధ క్రీడ :— (1) వెనుకనుండి వచ్చి కనులు మూయగా వానిని గుర్తించడం; (2) కనులు బట్టతో మూయబడినప్పుడు దాగి యున్న బాలురను వెదకి పట్టుకొనడం; (3) కనులు బట్టతో మూయబడిన వానిని ఇతర బాలకులు వచ్చి స్పృశిస్తూ వుంటారు. బద్ధనేత్రుడు వారలను పట్టుకొనడానికై ప్రయత్నిస్తాడు.

స్పందాందోళికా క్రీడ :— ఊగుతూనే రెండు మూడు ఉయ్యాల లెక్కి ఇంకనూ ఊగుతూ పోతూ వుండడం.

నృపక్రీడ :— ఒకనిని రాజుగా, మరొకనిని మంత్రిగా చేసుకొని పను లొనర్చడం.

హరిణాక్రీడనకము :— లేడివలె దుముకుతూ ఒకడు రెండవ వానికంటె ముందుకు పోవుటకు ప్రయత్నించడం.

వాహ్యావాహక క్రీడ :— పరాజితుని భుజ మెక్కి విజేత నడిపించడం.

దేవ-దైత్య క్రీడ :— కొందరు దేవతలై – కొందరు రాక్షసులై దుమ్ము ఎగురజిమ్ముచు ఆడుతారు. శివాజి ఈ ఆట ఆడినారట. యవను లను పరాజిత మొనర్చినట్లు ఈ ఆట ఆడుతారు.

జలక్రీడ :— చెట్లపైకెక్కి నీటిలోనికి ఉరకడం; ఒకరిపై ఒకరు నీరు చిమ్మడం. కాళిదాసు, భారవి, మాఘుడు చెప్పినట్లు ఈ ఆట స్త్రీ పురుషులలో కూడా కలదు.

కందుక క్రీడ :— (1) బంతి పైకి ఎగురవేయగా రెండవవాడు దానిని పట్టుకొంటాడు. అలా పట్టుకొనలేక పోయినట్లయితే అతడు మొదట బంతి విసరినవాని భుజమెక్కి మరల విసురుతాడు. అప్పుడు ఇతరులు బంతి క్రింద పడకుండానే పట్టుకొంటారు.

(2) ఈ ఆటను బాలబాలిక లందరు ఆడుతారు. భీతునిపైగాని, నేలపైగాని బంతికొట్టి అణచిపెట్టడం.

వనభోజన క్రీడ :— అడవికి వెళ్ళి ఆడడం. అచ్చటనే వంటలు చేసుకొని భుజించడం. దీనినే నేడు 'పిక్నిక్' అని వ్యవహ రిస్తున్నారు.

రాసక్రీడ :— ఇసుక మైదానములలో శ్రీకృష్ణలీలానుకరణము. ఉత్తర హిందూస్థానములోని రామలీల ఇట్టిదే. గుజరాత్ దేశములో "గరబా" నృత్యము ఇంచుమించుగా ఇట్టిదే.

ఛాలిక్య క్రీడ :— ఇందు ఆడేవారలు మధించి హోలీ రోజు లలోవలె పాడుతారు. వాద్యములు మ్రోగిస్తారు. ఇట్టి ఆట పురాణ ములలోకూడా వర్ణించబడి వున్నది.

నియుద్ధక్రీడ :— గ్రుద్దులు గ్రుద్దుచు లేక కుస్తీ దెబ్బలాడుచు ఈయాట ఆడుతారు. జరాసంధ భీముల మధ్య ఈ ఆటవంటిది జరిగింది.

నృత్యక్రీడ :— కొందరు నాట్యము చేస్తారు. కొందరు చప్పట్లు కొట్టుతారు. బాలబాలికలు కలిసిగాని విడివిడిగాగాని ఈ ఆట ఆడుతారు.

అక్షక్రీడ :— మహాభారత కథకు ఆధారభూతమైనది ఈ ఆటయే. ఋగ్వేదములో దీనికి నిషేధము చెప్పబడింది.

మృగఘాత క్రీడ :— వేట పేరుతో ముఖ్యముగా రాజులలో ఈ క్రీడ ప్రసిద్ధమైనది.

పక్షిక్రీడ :— శ్యేనమువలె పక్షులను పట్టడంలో నేర్పుబడే ఆట.

మత్స్యక్రీడ :— నావలపై నెక్కి రాజపుత్రులు చేపలు పట్టడంలో నేర్పే విద్య.

చతురంగ క్రీడ :— నేటి చదరంగము. జూదమువంటి ఆట.

శాలభంజికా క్రీడ :— కర్రబొమ్మలతో లేక గుడ్డలబొమ్మలతో ఆడెడి ఆట.

లతోద్వాహక్రీడ :— చెట్టును తీగను పెంచి యీ రెండింటికి పెండ్లిచేసెడి ఆట. శకుంతల ఇట్లే చేసింది. తులసీబృందా వివాహము ధార్మికకృత్యమని విశ్వాసము.

పీటా క్రీడ :—— చిత్రగుల్ల యను ఒక ఆట. మహాభారతములోని ఆదిపర్వములో ఇది వర్ణించబడింది.

కనకశృంగకోణ క్రీడ :—— పిచకారీతో ఆడడం.

వివాహక్రీడ :—— వరుడు వివాహమునకై వెడలిన తర్వాత స్త్రీలు—వర—వధూ వేషములలో ఆడుతారు.

హల్లిశక్రీడ :—— బాలురు, బాలికలు కూర్చొని వుండగా మండలాకారముగా తిరుగుచూ ఆడే ఆట.

గానకూర్దన క్రీడ :— కొందరు పాడుతు కొందరు దుముకుతు ఆడుతారు.

నౌకాక్రీడ :— నదీతీర నివాసులు నావలు స్వయముగ నడుపుతూ ఆడుతారు. ఇది కాశీపట్టణమున ఇప్పుడునూ జరుగుతున్నది.

మరొకరకపు జలక్రీడ :— జలమధ్యస్థులై భోజనాదులు గావించడం. దుర్యోధనుడు జలస్తంభవిద్య నేర్చియుండెనని మహాభారత కథనం.

వనవిహారక్రీడ :— పూవులేరడం, మాలలుకట్టడం, సామాగ్రి లేనిదే భోజనము తయారుచేయడం. దీనినే పుష్పాపచయ క్రీడ అని వ్యవహరిస్తారు.

ఆమలక ముష్ట్యాది క్రీడ :— పిడికిలి బిగించి అడగడం. చెప్పనిచో లేక తప్పు చెప్పినచో విజేత వానిని ముష్టిప్రహారముతో పరాజితునిగా చేస్తాడు.

దర్దురప్లావ క్రీడ :— మండూకమువలె దుముకుచు పోయెడిఆట.

నాట్యక్రీడ :— నాటక మాడడం.

అలాత చక్రక్రీడ :— కొఱవి వెలిగించి త్రిప్పడం. దానితో ఆకాశంలో అక్షరములు వ్రాయడం.

గదాక్రీడ :— కృత్రిమ గదాయుద్ధము చేయడం. ఇట్లే ధనుః క్రీడ మున్నగునవి.

అశోక పాదప్రహార క్రీడ :— ఒక చెట్టు నలంకరించి నీరు పోసి పెంచడం. ఈ క్రీడను కాళిదాసు వర్ణించారు.

చిత్ర క్రీడ :— విరహావ్యవస్థలలో యక్షునివలె చిత్రములు వ్రాయడం.

కావ్య వినోద క్రీడ :— ఇందులో 'బిందుచ్యుతకము-మాత్రాచ్యుతకము - సమస్యాపూర్తి, ప్రహేళిక, ఖడ్గబంధము, పద్మబంధము' మున్నగు కావ్యరీతులు వచ్చును.

వాజివాహ్యా క్రీడ :— అశ్వముఎక్కి బంతి ఆడడం. గీతా వళిలో తులసీదాసు దీనిని వర్ణించినారు.

కరివాహ్యా క్రీడ :— గజముఎక్కి బంతి ఆడడం.

మృగవాహ్యా క్రీడ :— లేడి-దుప్పుల రథముపై నెక్కి పరుగెత్తుతున్న వ్యక్తిని తాకడం.

గోప క్రీడ :— ఇది రాసక్రీడలోనిదే.

ఘుట క్రీడ :— నెత్తిపై ఎన్నో కుండలు వుంచుకొని నడవడం, నిప్పులపై నడవడం, గడలు తీసుకొని నడవడం. దొమ్మరులు ఇప్పటికీ ఈ క్రీడలో అద్భుత విద్యను ప్రదర్శిస్తూ వున్నారు.

## చరిత్రకందిన క్రీడలు

భారతదేశంలో అనాదిగావున్న క్రీడలలో ముఖ్యమైనవి వేట, చతురంగం, పోలో (వాజివాహ్యాక్రీడ), ధనుర్విద్య, గజపోరాటం, గజములతో యోధుల పోరాటం, వృషభములతో పోరాటం, బొంగరములు త్రిప్పుట, కసరత్తు, యోగవిద్య మున్నగునవి.

పూర్వకాలంలో రాజులు, ప్రజలు తమ దేశ రక్షణకు, తమ రక్షణకు వ్యాయామక్రీడలు అభ్యసించేవారు. కాకతీయుల సామ్రాజ్యంలోను, విజయనగర రాజుల కాలంలోను, మొగలాయిల పాలనలోనూ వ్యాయామవిద్య, క్రీడలు అమితంగా ప్రోత్సహించబడినవి. బాబరు, అక్బరు మొదలైన మొగలాయి పాదుషాలు, కృష్ణదేవరాయలు, శివాజి మొదలైన చక్రవర్తులు సామాజిక వ్యాయామ విధానాలను ప్రోత్సహించారు. వారికాలంలో కర్రసాము, కత్తిసాము, బండలెత్తుట, మల్లవిద్య, యోగవిద్య మున్నగువాటిని ప్రజలు సమూహప్రాతిపదికపై ఆచరించారు.

ముక్త్యాల ప్రాంతములో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సేకరించిన ఒక విగ్రహముబట్టి క్రీడాచరిత్రకు సంబంధించిన ఒక

ముఖ్యాంశం బైటపడినది. ఆ విగ్రహం 12 వ లేక 13 వ శతాబ్దానికి చెందినదై ఉంటుంది. ఒక తురుష్క వీరుడు బల్లెమును చేబూని ఒక మదగజముతో పోరాడుతున్నట్లు ఆ ప్రతిమ వున్నది. ఏనుగుమీద ఇద్దరు వ్యక్తులున్నారు. వారిలో ఒకరు కాకతీయసేనాని జాయ సేనాపతి కావచ్చునేమోనని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు అభిప్రాయ పడినారు. శ్రీనాథుని ఓరుగల్లు పట్టణవర్ణనలో మేషయుద్ధం, కుక్కుట పోరాటములు పేర్కొనబడినవి.

పల్నాటి వీరచరిత్రలో బొంగరములు త్రిప్పుట వ్యాయామ క్రీడగా అభివర్ణించబడింది. కొబ్బరి బొండాములను మించిన పరిణామము కల బొంగరములను పల్నాటి వీరులు విసిరి విసిరి త్రిప్పి త్రిప్పి కొట్టితే మహా శిలలు సయితం డొల్లలు పడేవట. వారి బలసంపన్నత అటువంటిది.

కృష్ణదేవరాయల వెంట గొడుగుపాలుడు ఉండేవాడు. రాయలు గుర్రమెక్కి రివ్వున పోతూవుంటే గొడుగుపాలుడు విశాలఛత్రం పట్టుకొని రాయలుకు ఎండ తగులకుండా అశ్వముతోపాటు ఆమడలకు ఆమడలు లంఘించేవాడట.

విజయనగర రాజుల ఆస్థానములలో మల్లవిద్యాపారంగతులు వుండేవారనీ, వారిని ఓడించిన ఏ దేశపు పహిల్వానులనైనా రాయలు సత్కరించి పంపేవారనీ ప్రతీతి. విజయనగర మల్లయోధులతో పోటీ చెయ్యడానికి ఒకసారి దూరదేశంనుంచి ఒక మల్లుడు వచ్చినాడట. విజయనగర చక్రవర్తి ఆయనకు తగు మర్యాదలు చేసి సహభోజనం ఏర్పాటు చేశారు. పరదేశి నూనె కావాలన్నారట. చక్రవర్తి నువ్వులను పిడికిట బట్టి అక్కడికక్కడే నూనె పిండారు. చక్రవర్తియే యింతటి బలాఢ్యుడైనప్పుడు ఆయన పోషణలో వుండి అనుదినమూ వ్యాయామమాచరించే యోధులు ఇంకెంతటి ఘటికులో అని భయపడి పరదేశి చల్లగా తప్పుకొన్నట్లు ఒక గాథ ప్రచారంలో వున్నది.

మొగలాయి చక్రవర్తుల కాలంలో గజ పోరాటం ఉత్సవక్రీడగా యెంచబడింది. పాదుషా కోట అవతల మైదానంలో మదగజ పోరాటం జరుపబడేది. గజములపై ఇద్దరేసి ప్రవీణులు వుండి గజములను ఉసి

గొల్పేవారు. గజములు పోరాటస్థలి వదలి సామాజికులపై విజృంభించ కుండా సైనికులు గుర్రములపై వుండి పెద్ద పెద్ద కాగడాలతో నిరో ధించేవారు. వేరొకవైపున భటులు గొడ్డళ్ళవంటి సాధనములు పట్టి ప్రమాదములను నివారించేవారు.

పాదుషాల సమక్షంలో బేగంలు పచ్చీస్ పాళీ ఆడిన నిదర్శనాలు నేటికీ ఫతేపూర్ శిక్రి (ఆగ్రా) వంటి చారిత్రక స్థలాలలో కలవు.

వెయ్యేండ్ల క్రితం మణిపూర్‌లో పోలో (గుర్రములపై హాకీ) ఆట ప్రచారంలో వున్నది. అక్బరు కాలంలో అది మహోన్నతస్థితి నందు కొన్నది. బ్రిటిష్‌వారు ఇండియా వచ్చినప్పుడు 'పోలో' పట్ల అమితాసక్తి చూపినారు. సైనికాధికారులు 'పోలో' అభివృద్ధికి పాటుపడ్డారుకూడా. తదనంతరం ఆల్వార్, బికనీర్, భోపాల్, హైదరాబాద్, జయపూర్, జోధ్‌పూర్, కొల్హాపూర్, కోటాహ్, కృష్ణఘడ్, కాశ్మీర్, మైసూర్, పాటియాలా, రాట్లం సంస్థానాధీశులు, బొబ్బిలి, వెంకటగిరి రాజాలు 'పోలో'ను విశేషంగా ప్రచారం చేశారు.

పూర్వకాలంలో ధనుర్విద్య నేర్వని ప్రజలు చాలా అరుదు. వేటకు, ఆహారానికి విలువిద్య ఉపయుక్తమయ్యేది. యుద్ధకాలంలో వైరసంహారానికి విలువిద్య సాటిలేనిది. నేటికీ భిల్లులు, బోదులు పశు పక్ష్యాదులను బాణముల కెరచేసి ఆహారం తెచ్చుకొంటున్నారు. ఈ రోజునకూడా విల్లుతో మత్స్యవేట జరుగుచున్నది.

విలువిద్యలో అఖిల భారత ఖ్యాతి నొందినది ఆంధ్రప్రముఖుడు శ్రీ గుండవరపు అప్పారావు. ఈయన ముప్పాళ్ళ గ్రామస్థుడు. "కలియుగార్జున" బిరుదాంకితుడు.

ప్రాచీన కాలంలో తమిళ ప్రాంతములో వృషభంతో పోరాటం ప్రచారంలో వున్నది. కొన్ని తెగల ద్రావిడులకు వృషభములతో పోరా టం ఒక ఆచారం. ఆ తెగలో కాబోయే పెండ్లికుమారుడు తనశక్తి సాహసాలను ముందే రుజువుపరచుకొనవలెనట. పెండ్లికుమార్తె తరఫు వారు చిన్నతనం నుంచి ఒక వృషభాన్ని మేపి వుంచేవారనీ, కానున్న

పెండ్లికుమారుడు దానితో పోరాడి వశంచేసుకుంటేటే తప్ప వివాహానికి అర్హత పొందేవాడు కాడనీ తెలుస్తున్నది. ఇది క్రీడగామారి ఇప్పటికీ అచ్చటచ్చట అమలులో నున్నది.

పూర్వకాలంలో రాజాదరణతో దేవాలయములలో, కచ్చేరీలలో తాలింఖానాలు నడిపారు. జమీందారులు ఈ సంప్రదాయాన్ని చాల వరకు పరిరక్షించారు. వివిధ వ్యాయామ క్రీడలను ఆటలను సంస్థానాధీశులు, జమీందారులు నిన్న మొన్నటివరకు ప్రోత్సహిస్తూ వచ్చారు.

విశేషించి పాటియాలా సంస్థానం అనేక క్రీడలలో ప్రవీణులను తయారుచేసింది. కొల్హాపూర్ జెట్టీలను గుర్తుకు పుచ్చుకొన్నది. విజయనగరం, బొబ్బిలి; వెంకటగిరి, నూజివీడు రాజాలు, జమీందారులు ప్రతి ఋతువులోను టోర్నమెంట్లు నిర్వహించి క్రీడా వేత్తలను ప్రోత్సహించడమేకాక సత్కరించారుకూడా.

## (2) విదేశాలు

పాశ్చాత్య ఖండాలలో గ్రీక్, రోమన్ రాజ్యాలలో క్రీడలు అనాదిగ ప్రచారంలో వున్నవి.

గ్రీక్, రోమన్ చక్రవర్తులు క్రీడలపట్ల చూపిన ఆదరణలో ప్రధానమైన భేద మొకటి కన్పిస్తున్నది. గ్రీకులు క్రీడలను సుహృద్భావవ్యాప్తి ఉద్యమంగా వినియోగించారు. రోమను చక్రవర్తులు ఆత్మానందంకోసం క్రూర క్రీడలను ప్రోత్సహించారు. రాజమందిరంలో బానిసలమధ్య భయంకర ద్వంద్వయుద్ధాలు జరిపి, వారి దేహాలనుంచి నెత్తురు ప్రవహిస్తుంటే చక్రవర్తులు హర్షధ్వానాలు చేసేవారు. బానిసలు మేకులుకల తొడుగులు ధరించి ముష్టియుద్ధం జరిపేవారు.

ఇతర దేశాల వ్యాయామ క్రీడావేత్తలకంటె గ్రీక్, రోమన్ ప్రవీణులు బహుముఖ, బహువిధ శిక్షణ పొందినట్లుకూడా చరిత్రవల్ల విదితమాతున్నది. ఈ ప్రవీణులు మామూలు కసరత్తులు (జమ్నాస్టిక్

ఎక్సర్‌సయిజస్) చెయ్యడమే కాక విపరీతమైన బరువులు మోయడం, ఎత్తడం, ఇనుపకడ్డీలు వంచడం, ఇసుక మూటలను వ్రేలాడగట్టి పాడవడం, వృషభములను కొమ్ములుపట్టి వెనుకకు నెట్టివేయడంవంటి బలవర్ధక కృత్యాలను చేసేవారు.

వ్యాయామ ప్రవీణులకు క్రిందివాటిలో పోటీలు నిర్వహించ బడేవి.

పరుగు, దూకడం, పళ్ళెము విసరడం, కుస్తీ, ముష్టియుద్ధం. కుస్తీ ముష్టియుద్ధములు మిళితమైన పాన్‌క్రోషియమ్. విశేష శక్తిమంతులైన పురుషులు మాత్రమే పాన్‌క్రోషియమ్‌లో పాల్గొనేవారు. ఇందులో గెలుపొందినవారు ఘనవిజేతలుగా గుర్తించబడేవారు. పోటీదారులు వివస్త్రులై వుండేవారు. వంటికి నూనె మర్దించుకొని గోదాములలోకి దిగేవారు.

## ఒలింపిక్స్

అన్ని క్రీడోత్సవాలలోకి అతి ప్రాచీనమైనది ఒలింపిక్స్. దీని జన్మ స్థలం గ్రీసుదేశం. క్రీస్తు పూర్వం 776 వ సంవత్సరంలో దక్షిణ గ్రీసులోని ఒలింపియా అనే గ్రామంలో ఒలింపిక్ పోటీలు జరుపబడేవని గ్రీక్ చరిత్ర చాటుతున్నది. ప్రజలఐక్య సుహృద్భావం వృద్ధిపరచడమే వాటిలక్ష్యం.

క్రీస్తు పూర్వం 776 లో జరిగిన పోటీలలో ఒక వంటవాడు (cook) ప్రథమస్థానం పొందినాడట. అప్పటినుంచి క్రీస్తుశకం 394 వరకు ఒలింపిక్ విజేతలు గ్రీక్ చరిత్రలో ఉదహరించబడినారు. దీనినిబట్టి దాదాపు 1200 సంవత్సరాల పాటు గ్రీసులో ఒలింపిక్ క్రీడోత్సవాలు అవిచ్ఛిన్నంగా సాగినట్లు విదితమౌతున్నది. ఒలింపిక్ పోటీలు నాలుగేండ్ల కొకసారి జరిగేవి. ఈ నాలుగేండ్ల కాలాన్ని "ఒలింపియాడ్"గా వ్యవహరించే వారు. "ఒలింపియాడ్"లను బట్టి గ్రీకులు సంవత్సరాలు లెక్కకట్టు కొనేవారు. గ్రీకులు ఒలింపిక్ క్రీడోత్సవాన్ని మహా పవిత్రంగా యెంచే వారు. ఒలింపిక్స్ ప్రారంభానికి కొద్దికాలంముందు గ్రీసు అంతటా అన్ని

వర్గాలమధ్య అన్నిరకాల శత్రుత్వం రద్దుచెయ్యబడేది. దేశమంతటా "దైవవిధిత సంధి" (ట్రూస్ ఆఫ్‌గాడ్) అమలు పరచబడేది. అది అమలులో వున్నప్పుడు ఏ వర్గంవారూ ఎట్టి వైరాలు కొనసాగించరాదు.

ఒకసారి స్పార్టన్ (Spartan) తెగవారు దీనిని పాటించనందువల్ల రెండులక్షల రూపాయల మేరకు వారిపై జరిమానా విధించబడింది. క్రీడావేత్తలు పూర్తిగా శిక్షణపొందడానికి కూడా "దైవవిధిత సంధి" పరంగా గడువు లభించేది. పోటీలు ముగిసినమీదట పోటీదారులు స్వస్థలాలు చేరేవరకు ఈ సంధి అమలులో వుండేది. 305 వ ఒలింపిక్స్ జరిగినమీదట రోమన్ చక్రవర్తి ఒక శాసనంద్వారా ఒలింపిక్స్‌ను రద్దు పరిచాడు.

క్రీస్తుపూర్వం 400 వ సంవత్సరంలో గ్రీకులు ఒక రకపు బిలియార్డ్సు ఆడేవారట.

1942 లో ఏథెన్స్‌లో థీమిస్టోకిల్స్ కాలానికి చెందిన శిల్ప మొకటి లభించింది. క్రీస్తుపూర్వం 514-449 సంవత్సరాల మధ్యకాలానికి అది చెందినది. ఇద్దరు ఆటగాళ్ళు వంకర కర్రలు పుచ్చుకొని ఆడుతున్నట్లుగా ఆ శిల్పం వున్నది. దీనినిబట్టి ఆ కాలంలో క్రీడలో హాకీని పోలిన ఆట వున్నట్లు ఊహించబడుతున్నది.

అదే కాలంలో గ్రీసులోని ప్రతి మారుమూల గ్రామంలోను తాలింఖానాలు (జిమ్నాసియమ్‌లు) వుండేవని "మెన్స్ సానా ఇన్ కార్పొరే సానో" (Mens Sana in Corpore Sano) - ఆత్మశుద్ధికి దేహశుద్ధి ఆలంబన—అనే సిద్ధాంతం ఈ సంప్రదాయంనుంచే జనించిందని చరిత్ర చాటుతున్నది.

అమెరికాలోని రెడ్ ఇండియన్‌లు సహస్రాబ్దాలుగా హాకీవంటి ఆటను ఆడుతున్నట్లు చరిత్ర తెల్పుతున్నది.

కెనడాలో అనాదిగా అమలులోవున్న ఆటలలో మోకు పెనుగులాట (టగ్ ఆఫ్ వార్) ఒకటి. రెండు జట్లవాళ్ళు ఒక మోకును చెరి

ఒకవైపు లాగిపట్టుకొని ఎదుటి జట్టును ఒక సూచినుంచి ఈవలకు లాగి వేయడం ద్వారా బలప్రదర్శనం చెయ్యడం ఈ క్రీడ ముఖ్యోద్దేశం. ఈ పోటీ కనడాలో లోగడ విచిత్రంగా పరిణమించింది. 1897 లో కనడాలో రెండు జట్లు రెండుగంటల 10 నిమిషాలపాటు పెనుగులాడినా ఏ పక్షమూ గెలువలేకపోయినదట!

ఇంగ్లండు, స్కాట్లెండులలో 17వ శతాబ్దంలో షటిల్ కాక్ బ్యాడ్మింటన్ వంటిది అమలులో వుండేది. బ్యాటిల్ డోర్ అండ్ షటిల్ కాక్ (Battledore and Shuttle cock) అని అది వ్యవహరించబడేది.

ఫుట్ బాల్ పుట్టుక ఇంగ్లండులోననీ, ఆటస్థలం పరిమితి లేకుండా మైళ్ళకు మైళ్ళ దూరం వుండేదనీ, దోవలో కాలువలు, పొదలు అడ్డు వచ్చినా ఆటగాళ్లు వాటిని దాటేవారనీ తెలుస్తున్నది.

డేగలవేట, గాలిపడగలు, గోల్ఫ్, కర్రయుద్ధం, స్టూల్ బాల్ అనే క్రికెట్ వంటి ఆట, ముష్టియుద్ధం, కత్తియుద్ధం కూడా ఇంగ్లండులో ప్రాచీనకాలంనుంచి ప్రచారంలో వున్న ఆటలు.

కర్రయుద్ధం "సింగిల్ స్టిక్" పేరిట వ్యవహరించబడేది. ఇందులో ఇద్దరు కర్రయుద్ధం చేసేవారు. ప్రత్యర్థి శిరస్సునుంచి మొదట నెత్తురు చిందింపజేసిన వ్యక్తి గెలుపొందినట్లుగా పరిగణించబడేవాడు.

## యూరప్‌లో మొదటి స్టేడియమ్

1736 వ సంవత్సరం జూన్ ఆరవ తేదీన లండన్‌లో జేమ్స్‌ఫిగ్ కు నెడ్ సట్టన్ కు మొట్టమొదటి ముష్టియుద్ధపు పోటీ జరిగినట్లు చరిత్ర చెబుతుంది. ఈ పోటీకిగాను జేమ్స్‌ఫిగ్ చెక్కతో క్రీడాస్థలిని (Sport palace) నిర్మించినాడనీ, 1200 మంది ప్రేక్షకులకు సరిపోయేటంతటిదనీ, యూరప్ అంతటికీ మొట్టమొదటి 'స్పోర్ట్స పాలస్' అదేననీ బ్రిటిష్ చరిత్ర చెబుతుంది.

ఆరోజులలో ముష్టియుద్ధం (Boxing) మిశ్రమ క్రీడ. ప్రత్యర్థులు మొదట కత్తియుద్ధం చెయ్యాలి. క్షతగాత్రుని చేసిన యోధుడు గెలిచినట్లు. ఒక్క అరగంట విశ్రాంతిపిమ్మట కుస్తీ, ముష్టిక్రీడ జరపాలి. ముష్టి ఎట్టి తొడుగులు లేక నగ్నంగా వుంచడం అప్పటి ఆచారం. ఒకరు 'జితోస్మి' అనేవరకు కుస్తీ, ముష్టిక్రీడ జరుపబడేవి. అరగంట విశ్రాంతి. అనంతరం కర్రయుద్ధం చెయ్యాలి. ఈ మూడింటిలోనూ గెలిచితేనే అంతిమ విజయం చేబట్టినట్లు.

16 వ శతాబ్దంలో ఇంగ్లండులో విచిత్రమైన ఆటలు ప్రచారంలో వున్నవి. ప్రతి శని, ఆదివారాలలోను, సెలవు రోజులలోను ఎలుగు — వేట కుక్కలకు పోరాటం, కోడిపందెములు జరుపబడేవట.

భల్లూకము-వేటకుక్కలపోటీ విచిత్రంగా ఉండేది. భల్లూకాన్ని ఒక గుంజకు ఇనుపగొలుసుతో కట్టి ఉంచేవారు. నాలుగైదు కుక్కలను వెంబడి వెంబడి రంగాంగణం (ఎరీనా) లోకి వదిలేవారు. ఒక్కొక్క శునకమూ భల్లూకముచేత గట్టి దెబ్బలుతిని తోక ముడిచేది. కొన్ని కుక్కలు ఎలుగు కాలిని కొరికి, గాట్లువేసి మరీపోయేవి. గాయపడ్డ భల్లూకానికి, వేటకుక్కకు వెంటనే చికిత్సచేసే సదుపాయం ఉండేదట. భల్లూకాలను రంగాంగణానికి ఆనుకొని ఉన్న కొట్లలో ఉంచి మేపేవారట.

కోడిపందెములు ఒక పెద్ద టేబిల్ మీద జరుపబడేవట. టేబుల్ పై రంపపుపొట్టు వేశేవారట.

షేక్స్పియర్ నాటకాలలో మత్స్యవేటలు ఉదహరించబడినవి.

డేగలవేట, గ్రద్దలవేట, జింకలవేట, విలువిద్య కూడా ఆ కాలంలో విశేషంగా ప్రచారంలోవున్న క్రీడలు. రెండవ ఎలిజబెత్ రాణి దుప్పి (Stag) వేటలో మేటి.

ఇంగ్లండు ప్రాచీన క్రీడలలో మరొకటి "బౌలింగ్" వంటిది. అప్పడాలకర్రల పోలిన చెక్కలను సుదూరాన వుంచి బంతులతో వీటిని పడగొట్టడం ఈ క్రీడలోని విశేషం. ఇంగ్లండులో ఈ క్రీడ 13, 14

దశాబ్దాలలో ఉచ్ఛస్థితిలో వున్నది. ఈ క్రీడవల్ల ధనుర్విద్యకు ఆదరణ తగ్గుతుందేమో ననే ఉద్దేశంతో 1336 లో మూడవ ఎడ్వర్డ్ రాజు "బౌలింగ్"ను నిషేధించాడు. ప్రజలకు ఈ క్రీడయందు అభిమానం అసమానం కావడంచేత ఈ క్రీడ నశించలేదు. చాటుమాటుగా ప్రజలు ఆదరిస్తూనే వచ్చారు. 1530 లో ఎనిమిదవ హెన్రీరాజు తన భవనంలో 'బౌలింగ్' ఆటకు తగు వసతులు ఏర్పాటు చేసుకొన్నాడు.

ప్రస్తుతం బౌలింగ్ ఆట అన్నిదేశాలలోకంటె అమెరికాలో విశేషంగా ప్రచారంలో వుంది. ఇప్పుడు అమెరికాలో 60,000 బౌలింగ్ ఆటస్థలాలు వున్నవనీ, వాటిలో దాదాపు రెండుకోట్లమంది అమెరికనులు కాలక్షేపం చేస్తూ వుంటారనీ అమెరికా సమాచారశాఖ భోగట్టా. న్యూయార్క్‌కు వలసవెళ్ళిన డచ్‌వారు ఈ క్రీడను అమెరికాలో ప్రవేశపెట్టినారు.

క్రీస్తు పూర్వం ఐదువేల సంవత్సరం ప్రాంతంలోనే ఈజిప్టులో 'బౌలింగ్' వంటి క్రీడ అమలులో వుండేది. ఆకాలంలో పురుషులు, బాలురు సుదూరాన మోచేతి పొడుగు రాళ్ళను నాటి బండరాళ్ళతో వాటిని కొట్టేడివారు.

గాలిపడగల ఆట 17వ శతాబ్దంలో చైనానుంచి ఇంగ్లండుకు "దిగుమతి" అయినట్లు చారిత్ర కాధారాలు కలవు.

స్కాట్లెండ్‌లో కర్లింగ్, షింటే అనాదిగా ప్రచారంలో వున్న ఆటలు.

కర్లింగ్:—ఈ శీతాకాలపు ఆట 16వ శతాబ్దంలో స్కాట్లెండులో అమలులోకి వచ్చినది. రెండుజట్లు మంచుప్రదేశంపై ఈ ఆటను ఆడుతవి. తొమ్మిది అంగుళాల వ్యాసం కలిగి 40 లేక అంతకంటె ఎక్కువ పౌనుల బరువుకల గుండ్రటి శిలను గోల్ఫ్‌కర్రవంటి కర్రతో నెట్టుకొనిపోయి ఒక సూచి (మార్కు)ని దాటించడం ఈ ఆట ఆడే విధం. ఒక జట్టువారు పురోగమించకుండా రెండవ జట్టు అడ్డుపడుతూ వుంటుంది.

షింటీ :— ఇది హాకీవంటి ఆట. 12 వ శతాబ్దంనుంచి ఈ ఆట స్కాట్లెండులో ప్రచారంలో వున్నది.

హాకీని పోలిన "హర్లీ" అనే ఆట 12 వ శతాబ్ద ప్రాంతాల ఐర్లెండులో ప్రచారంలో వున్నది. ఐరిష్‌వారు "హర్లీ" తమ జాతీయ క్రీడగా యెంచిన రోజులుకూడా వున్నవి.

వంకరకొన గల కర్రలతో (హర్లీలు) బంతిని ఎదుటి గోలు మధ్య గుండా పోనివ్వడం ఈ ఆట పద్ధతి. రెండు జట్లు ఈ పోటీలో పాల్గొనేవి. ఒక్కొక్క జట్టుకు 30 అంతకుమించి కూడా ఆటగాళ్ళు వుండేవారు. ఆటగాడు బంతిని పట్టుకు తీసుకుపోరాదు. కర్ర కొనపై బంతి వుంచి ఎంత దూరమైనా పోవచ్చు. ఈలోగా ప్రత్యర్థి ఎన్నివిధాలుగానైనా నిరోధించవచ్చు; బాధించవచ్చు. ఎక్కువ గోలులు చేసినవారు గెలిచినట్లు.

స్పెయిన్‌లో పెలోటా (Pelota), బిలియార్డ్సు వంటి ఆటలు చాలకాలంగా ఆడబడుతున్నవి.

పెలోటా :— జట్టుకు ముగ్గురుచొప్పున పాల్గొనే వాల్ టెన్నిస్ వంటి బంతి ఆట యిది. ఎత్తయిన గోడకు 25 గజాల దూరంలో ఆటగాళ్ళు నిలబడివుంటారు. వంకరగావుండి దాదాపు మూడు అడుగుల పొడవుగల పూలబుట్టవంటి బుట్టలో పెలోటాను (బంతి) వుంచుతారు. గోడకు నేలనుంచి గజంయెత్తున అడ్డంగా గీత గీయబడి వుంటుంది. ఒక పక్షం ఆటగాడు ఆ గీతకు పైగా బంతిని బుట్టతో విసిరివేస్తాడు. ఫిరంగి గుండు వేగంతో అది పోతుంది. తిరిగి వచ్చినప్పుడు 'బౌండ్' పడినమీదట మిగిలిన ఆటగాళ్ళు బంతిని ఎదురెదురుగా కొట్టుతారు (వాలీయింగ్). అందులో పొరబాటుచేసిన వ్యక్తి ఎదుటి పక్షానికి ఒక పాయింటు యిచ్చినట్లు. ఎక్కువ పాయింట్లు వచ్చినవారు గెలుపొందినట్లు.

బిలియార్డ్సు స్పెయిన్ దేశస్థులు అమెరికాలో ప్రవేశపెట్టినారనీ, 1730 తర్వాత అమెరికనులు బిలియార్డ్సు ఆటను అభివృద్ధి పరచినారనీ చరిత్ర చెబుతున్నది.

"ఆంటోనీ అండ్ క్లియోపాట్రా" నాటకం రెండవ అంకం ఐదవ రంగంలో క్లియోపాట్రా తన పరిచారికను "లెట్ అజ్ టు బిలియార్డ్స్" (Let us to Billiards) (బిలియార్డ్స్‌కు వెళ్ళుదాముర్రా) అని ఆదేశిస్తుంది. దీనినిబట్టి క్లియోపాట్రా కాలంనాడు కూడా బిలియార్డ్స్ ఆట ప్రచారంలో వున్నట్లు ఊహించబడుతున్నది.

ఆస్ట్రేలియాలో ప్రాచీన కాలంలో ముఖ్యంగా ఆదిమవాసులు అవలంబించిన క్రీడలలో ప్రధానమైనది బూమెరాంగ్. బూమెరాంగ్ గట్టి కర్రవంటిది. అడుగు బల్లపరుపుగాను, పైభాగం గుండ్రంగాను వుంటుంది. ముప్పావు అంగుళానికి మించి మందం వుండదు. రెండంగుళాల వెడల్పూ, దాదాపు మూడు అడుగుల పొడవు వుంటుంది. ఆటగాడు చక్రాలు లాగేటట్టుగా బూమెరాంగును మహావేగంతో ఆకాశంలోకి విసురుతాడు. చక్రభ్రమణం కల బూమెరాంగ్ విసిరి వేయబడిన ప్రదేశానికే తిరిగి వస్తుంది. ఇది ఒకవిధం.

రెండవ విధం 'డిస్కస్‌త్రో'ను పోలినది. బూమెరాంగ్‌ను శక్తికొలదీ దూరానికి విసరడం ఈ పద్ధతి.

జపాన్‌లో ప్రాచీనకాలంనుంచి ఆచరించబడుతున్న క్రీడ "జూజిట్సు" అనే వస్తి విధానం. నరాలు బిగించివేయడం ఇందులో ముఖ్యవిశేషం. క్రీస్తుపూర్వం 700 సంవత్సరంనుంచి యిది జపాన్‌లో అమలులో వున్నట్లు చరిత్ర కాధారాలు వున్నవి. పూర్వం జపాన్ రాజకుటుంబీకులకు, సమురాయ్ అనే క్షత్రియవంశీయులకు మాత్రమే ఈ శాస్త్రం నేర్పబడేది. మణికట్టును, కాలి మడమను జూడో పద్ధతిలో మెలివేస్తే ఎంతటివాడైనా జితోస్మి అంటాడు.

## విచిత్ర గాథలు

పాశ్చాత్యదేశాలలో ప్రాచీనుల సహిష్ణుత (ఎండ్యూరెన్స్) గురించి అనేక చిత్రవిచిత్ర గాథలు ప్రచారంలో వున్నవి.

క్రీస్తు పూర్వం 490 ప్రాంతాల డారియస్ అనే పర్షియను ముట్టడి దారుని, అలెగ్జాండర్ ఎదిరించినప్పుడు ఆయన (అలెగ్జాండర్) సేవకులు తమ సర్వాధిపతికి మంచినీళ్ళు తేవడంకోసం 150 మైళ్ళు పరుగిడినారట.

టర్కిష్ సుల్తానులవద్ద వుండే పర్షియను వార్తాహరులు (మెస్సింజర్స్) కాన్స్టాంటినోపుల్ నుంచి ఆడ్రియానోపుల్ కు పరుగెత్తుకు వెళ్ళి వచ్చేవారట. అంటే 220 మైళ్ళ దూరాన్ని రెండు పగళ్ళు, రెండు రాత్రుళ్ళలో పరుగిడేవారు. వీరు వెండి పూసలను బుగ్గను పెట్టుకొనేవారనీ, అవే వారి దప్పి తీర్చేవనీ చరిత్ర చెబుతున్నది.

అయితే మన (హిందూదేశపు) పూర్వీకులు సంసారాలతో సహా కాశీకి నడచి వెళ్ళేవారట. నిన్న మొన్నటివరకు పోస్టుబంట్రోతులు రైలుసౌకర్యాలులేని ప్రాంతాలకు తపాలా సంచులను మోసుకొని శరవేగంతో పరుగిడేవారు. దాదాపు రోజూ వారీవిధంగా శ్రమించేవారు.

బెజ్జా అనే భారతీయ సన్యాసి ఇనుపమేకుల ఉయ్యాలపై కూర్చుని వరుసగా 12 పగళ్ళు, 12 రాత్రిళ్ళు ఊగినట్లు ఒక కథ ప్రచారంలో వున్నది.

ఇటువంటివాటిని బట్టి సహిష్ణుతలో ప్రాచీన భారతీయులు పరదేశీయులకు తీసిపోరనే గట్టిగా చెప్పవచ్చు.

# అధ్యాయము 4

# స్త్రీల ఆటలు

ప్రాచీనకాలంలో స్త్రీలు పురుషులతో సమానంగా క్రీడలలో ప్రావీణ్యం సాధించినట్లు అనేక సాక్ష్యాధారాలు కలవు.

రథసారథ్యంలో, ధనుర్విద్యలో, యుద్ధక్రీడలలో సత్యభామ మేటిగా మన పురాణాలు వర్ణిస్తున్నవి. కైకేయి దశరథుని రథచక్రం ఒరిగిపోకుండా చిటికినవేలు అడ్డుపెట్టిన గాథ ఆమె శక్తి యుక్తి సాహసాలకు, రథసారథ్యంలో నైపుణికి తార్కాణం.



గుర్రపు స్వారీ, ధనుర్విద్య, ఈత, కత్తి యుద్ధం వంటివి ప్రాచీన కాలంలోని స్త్రీల ప్రధాన క్రీడలనీ, రాకుమార్తెలు, మంత్రుల కుమార్తెలు, ఇతరులు వీటిలో పురుషవీరులనే మించేవారనీ ప్రాచీన గాథలు తెల్పుతున్నవి. శాంతికాలంలో రాజు జన్మదినోత్సవంవంటి సందర్భాలలో నిర్వహింపబడే క్రీడోత్సవాలలో స్త్రీలు సయితం తమ ప్రతిభను ప్రదర్శించేవారు. క్రీడలలో తమ ప్రజ్ఞను యుద్ధకాలంలో శత్రుసంహారానికి వినియోగించేవారు. వినోదోత్సవాలలో కోలాటం వంటి ఆటలలో స్త్రీలు పాల్గొనేవారు.

స్త్రీలలో క్రీడా ప్రచారానికి కృషిచేస్తున్న రాజకుమారి అమృత్ కౌర్

ఝాన్సీరాణి అశ్వస్వారీలో మేటి యని మన చరిత్ర చెబుతున్నది. ఖడ్గయుద్ధంలో ఆమె విదేశీయులనే ఓడించివేసింది. ఒంటరిగా పెక్కుమందితో ఒకేసారి పోరాడడంలో ఆమె చూపిన ప్రతిభ ధైర్య సాహసాలు అసమానం. చాంద్ బీబీ, పద్మిని వ్యాయామక్రీడలలో తమ

నై పుణ్యాన్ని యుద్ధ కాలంలో సద్వినియోగపరచి వీరవనితలుగా పేరొందారు.

రుద్రమదేవి, నాయకురాలు ఖడ్గయుద్ధంలో విశేష ప్రతిభా వంతులు.

బ్రిటిష్ పాలన ప్రభావంవల్ల భారతస్త్రీలు ప్రాచీనక్రీడలను నెమ్మదినెమ్మదిగా విసర్జిస్తూ వచ్చారు. బ్రిటిష్‌వారి నిరంకుశ పాలనలో భారతదేశంలో స్త్రీలు వీరశౌర్యాలు ప్రదర్శించే అవకాశాలు సన్నగిల్లినవి. వాటితోపాటు ప్రాచీనక్రీడలు క్రమంగా అంతరించినవి. సాంఘిక జీవితంలో అనేక పరిణామాలు వచ్చి స్త్రీలపై అనేక నిర్బంధాలు విధించబడడంతో స్త్రీలు అస్వతంత్రులై క్రీడలపట్ల ఆసక్తి చూపనేలేక పోయారు. ఎవరైనా ధైర్యం వహించి ముందుకు రాగలిగితే వారి (మహిళా నాయకుల) కార్యక్రమాలు రాజకీయ సాంఘిక రంగాలకు మాత్రమే పరిమిత మయ్యేవి. క్రీడారంగానికి వ్యాపించలేదు.

విద్యారంగంలో ముందుకు వచ్చిన స్త్రీలు వ్యాయభరితమైన క్రీడలను అభ్యసించడం క్రమేణా జరిగింది. ఆంగ్లవిద్యా ప్రభావంకల యువతులకు విదేశ క్రీడలపైనే మోజుపడింది. విద్యావతులైన స్త్రీలు మొదట అలవాటు పడినది టెన్నిస్ ఆటకు. క్రమేణా రింగ్ టెన్నిస్, టేబుల్ టెన్నిస్, ఆడడం ప్రారంభించారు. బాలికలలో విద్యాసక్తి పెంపొంది, సాంఘిక జీవితంలో వారి ప్రతిపత్తి ఎక్కువయిన కొలదీ క్లబ్బులు, ఇతర మహిళా సంస్థలు అవతరించినవి. యువతులు, స్త్రీలు పైఆటలనేకాక చతురంగం, చీట్లపేక (ఇప్పుడీ ఆటలేని యిల్లులేదు) వంటి గృహాభ్యంతర క్రీడలు (ఇన్‌డోర్ గేమ్స్)కూడా అభ్యసించడానికి అవకాశాలు ఇనుమడించినవి. స్కూళ్ళలో గ్రిగ్ పోటీలు, కళాశాలలలో అంతర్కళాశాల, అంతర్రాష్ట్రీ పోటీలు, జాతీయ పోటీలు జరుగుతూ బాలికలు స్త్రీలు కూడా ప్రోత్సహించబడడంతో హాకీ, బేస్‌బాల్, బాస్కెట్‌బాల్ వంటి ఆటలలోను, పరుగు, దూకడంవంటి వ్యాయామ క్రీడలలో సయితం స్త్రీలు ముందుకు వస్తున్నారు. సిమ్లా, శ్రీనగరువంటి చోట్ల స్కేటింగ్, సర్ఫ్ రైడింగ్, వాటర్‌స్కీయింగ్ వంటి క్రీడలలో స్త్రీలు పాల్గొంటున్నారు.

విమాన చోదననుకూడా భారత నారీమణులు అభ్యసిస్తున్నారు.

1956 మే రెండవ తేదీ మధ్యాహ్నం కుమారి ఉష రామచంద్రన్ అనే మద్రాసు ప్రెసిడెన్సీకాలేజి విద్యార్థిని (థర్డ్ఆనర్స్. ఈమె వయస్సు 18 సంవత్సరాలు మాత్రమే.) ఒంటరిగా మద్రాసుపై విమానం నడిపింది. చెన్నరాష్ట్ర వాసులలో విమానం నడిపిన మొట్టమొదటి మహిళ ఈమెయేనట. మద్రాసు ప్రభుత్వం 1955 లో 20 మంది యువతులకు విమానచోదనలో శిక్షణ నిప్పించింది. మద్రాసు ఫ్లయింగ్ క్లబ్ వారు వీరికి శిక్షణ నిచ్చారు.

విజయవాడలో ఆంధ్రఫ్లయింగ్ క్లబ్ నిర్మాణానికి ప్రయత్నాలు జరిగినవి. ఆంధ్రయువతులు ఏ రాష్ట్రయువతులకూ తీసిపోరు. వారికి అవసరమైనదల్లా ప్రోత్సాహము, వసతి. ఆంధ్రప్రభుత్వం ఈ విషయాలను గుర్తించి ప్రోత్సహించడం అత్యవసరం.

ఇండియాలో స్త్రీలు వాలీబాల్, ఫుట్‌బాల్ వంటి 'శ్రమ క్రీడ' లను కూడా ఆడుతున్నారు. హమీదాబాను అనే ఆడవస్తాదు చర్యలు ఆమధ్య భారతదేశంలో సంచలనం కలిగించినవి. ఆమె అనేకమంది పురుష జెట్టీలను కూడా ఓడించింది. అయితే ఇటువంటి క్రీడలు స్త్రీల శారీరక నిర్మాణానికి విడ్డూరమైనవి. ఇట్టివి స్త్రీలమధ్యను మాత్రమే జరిగితే మంచిది. స్త్రీలకు, పురుషులకు మధ్య కుస్తీ ఈ విద్య గౌరవాన్ని కించపరచక మానదు.

అమెరికాలో స్త్రీలు 'ఫ్రీస్టయిల్' కుస్తీ పోటీలలో పాల్గొంటారు. స్త్రీలు పురుషులతో పోటీ చెయ్యరు. స్త్రీలమధ్య కుస్తీ పోటీలయినా న్యూయార్క్ వంటి రాష్ట్రాలలో కొంతకాలం నిషేధించబడినది. ఆ రాష్ట్రాలలో బహిరంగంగా స్త్రీలమధ్య ఫ్రీస్టయిల్ కుస్తీపోటీలు జరుగరాదు. 'ప్రయివేటు'గా జరిగేవాటిని టెలివిజన్‌లో ప్రసారం చేస్తారు!

ఇండియాలో వీలైనంతవరకు స్త్రీలను క్రూరక్రీడలకు దూరంగా వుంచడమే మంచిది. ప్రాచీనకాలపు ధనుర్విద్య బదులు రైఫిల్, తుపాకి ప్రేల్చువంటి ఆటలను, గుర్రపు స్వారీ బదులు విమాన చోదనను నేర్పితే

శాంతికాలానికీ, యుద్ధకాలానికీ అవి పనికిరాగలవు. భారతీయ బాలికలు, యువతులు నాటి గుర్రపుస్వారీ బదులు నేడు సైకిల్ స్వారీ ప్రారంభిం చారు. అది మోటార్ సైకిల్ స్వారీకి, విమాన చోదనవు దారితీయడం అభిలషణీయం.

మహారాష్ట్రదేశంలోను, కేరళలోను పాఠశాలల్లో కర్రయుద్ధం, నకిలి కత్తియుద్ధం నేర్పుతున్నట్లు విన్నాను. ఇట్టి దేశీయ వ్యాయామం కూడా తప్పక ప్రోత్సహించ దగినదే.

అఖిల భారత క్రీడోత్సవాలనుబట్టి చూస్తే ఆధునిక క్రీడలలో స్త్రీలలో బొంబాయి, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, బెంగాల్, మైసూర్, కొచ్చిన్-తిరువాన్కూర్ రాష్ట్రలవారు ఇతరులకంటె ప్రముఖస్థానం వహించివున్నారు.

ఎథ్లటిక్స్‌లో బొంబాయి కన్యలు మేరి లీలారావు (ఈమె ఆంధ్రి - 80 మీటర్ల హార్డిల్స్), మేరీ డిసౌజ (100 మీటర్ల పరుగు, 200 మీటర్ల పరుగు), కొచ్చిన్-తిరువాన్కూర్ కన్య వసంతకుమారి (హై జంప్), మైసూర్ కన్యలు రోసిటాకామత్ (లాంగ్ జంప్), కొలైన్ ఓక్‌సెల్ (డిస్కస్ త్రో), బీహార్ కన్య ఎలిజబెత్ డెవన్ పోర్ట్ (షాట్‌పుట్), ఢిల్లీయువతి మన్‌మోహిని (జావిలిన్ త్రో), 4 × 100 మీటర్ల రిలే పరుగులో ఉత్తరప్రదేశ్ కన్యలు, 1956 లో జరిగిన 17 వ జాతీయ క్రీడోత్సవంలో బ్రాకెట్‌లలో పేర్కొన్న క్రీడలలో అగ్రస్థానం వహించి యున్నారు. నళినిఘోష్ (100 మీటర్ల పరుగు), రూత్ ఐజక్ (200 మీటర్ల పరుగు), నిలిమాఘోష్ (80 మీటర్ల హార్డిల్స్) మున్నగు బెంగాలీ కన్యలు ద్వితీయ, తృతీయస్థానాల్లో ఉన్నారు.

ఆంధ్రి కుమారి మేరి లీలారావు 80 మీటర్ల హార్డిల్స్‌లో ప్రథమ స్థానం పొందటమేకాక 100 మీటర్ల పరుగులో ఇండియా కంతటికీ ద్వితీయ స్థానము, లాంగ్ జంప్‌లో ద్వితీయ స్థానము సంపాదించి ఆంధ్రుల కీర్తిని కాపాడుతున్నారు.

టెన్నిస్‌లో రిటాదావర్ ప్రథమస్థానం వహించినారు.

మధ్యప్రదేశ్ కన్యలు హాకీ ఛాంపియన్‌షిప్‌ను, 1956 డిశంబరులో బొంబాయి కన్యలు టేబుల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్‌ను పొందివున్నారు.

అబలలు కొందరు తాము సబలలమని నిరూపించిన సందర్భాలు కూడా వున్నవి. హమీదాబాను సంగతి పైనే ప్రస్తావించి వున్నాను. రెండు తరాలక్రిందటి కాలానికి చెందిన తారాబాయి గురించి మనం విని వున్నాము. ఈమె మహాశిలను తాళ్ళతో జుట్టుకు కట్టుకొని వంగి, మోకాళ్ళమీద చేతులాన్చి, జానెడెత్తుకు యెత్తేది.

ఈ రోజులలో బలప్రదర్శనకు వన్నెకెక్కినది రీబా రక్షిత్ అనే 'మిస్ బెంగాల్', ఈమె కాలేజి విద్యార్థిని. 112 పౌనుల బరువు మాత్రం



వున్న ఈమె ఛాతీమీద చెక్క వేసుకొని ఏనుగు నెక్కించుకొనడం, ఇనుప ఊచలను గొంతుకకు స్తంభానికి మధ్య పెట్టి వంచడం వంటి బలప్రదర్శనాలు చేస్తుంది. తుపాకి గురిలో దిట్ట. 84 ఆసనాలు వెయ్యగలదు.

జాపనీస్ కుస్తీపద్ధతి జూడో, ఈత, గుర్రపుస్వారీ మున్నగు క్రీడలలో కూడా ఈమె విశేష ప్రతిభ గడించింది. కలకత్తా మహా నగరంలో మోటార్‌సైకిల్ స్వారీకి లైసెన్సు తీసుకొన్న మొట్టమొదటి స్త్రీ ఈమెయే.

ఇక ఈతలో ఇండియాలోకెల్ల అద్వితీయురాలు బొంబాయి కన్య డాలిసజీర్. స్త్రీల జాతీయ ఈత ఛాంపియన్‌షిప్ పోటీలలో బొంబాయి ప్రథమ స్థానము, బెంగాల్ ద్వితీయ స్థానము, మహారాష్ట్ర తృతీయ స్థానము వహించి వున్నవి.

ఆంధ్ర దేశంలో యిప్పుడిప్పుడే కన్యలు క్రీడలపట్ల ఆసక్తిచూపు తున్నారు. 1956 ఫిబ్రవరిలో భీమవరంలో జరిగిన ఆంధ్రరాష్ట్ర తృతీయ

క్రీడోత్సవంలో భీమవరంలోని డబ్ల్యు. జి. బి. కాలేజి విద్యార్థినులు ఎస్. ఎమ్. సోఫియా, టి. కాథరిన్, ఇ. వి. ఎల్ శారద, జి. సౌందర్య వల్లి గారలు, పాలకొల్లు ఎమ్. ఎమ్. ఎస్. కె. ఎస్. ఎమ్. హైస్కూలు విద్యార్థిని పి. పి. ఆర్. దేవిగారు పాల్గొన్నారు. కుమారి సోఫియా స్త్రీల ఛాంపియన్‌షిప్ సాధించారు. హాకీ, టెన్నిస్, టేబులు టెన్నిస్ మున్నగు ఆటలలో ఆంధ్రకన్యలు యింకా ప్రారంభదశలోనే వున్నారు.

1956 సంవత్సరారంభంలో మహిళల ఫుట్‌బాల్ జట్టు ఒకటి ఆంధ్ర దేశంలో పోటీలు జరిపింది. ఆంధ్రకన్యలు ఫుట్‌బాల్ అభ్యసించ డానికి ఇది కొద్దిగానైనా ప్రోత్సాహమిచ్చి వుండవచ్చు.

## వి దే శా లు

అంతర్జాతీయ రంగంలో భారత మహిళా క్రీడాకారిణిలు యింకా ప్రముఖస్థానం వహించలేదు. వ్యాయామక్రీడలలో భారత మహిళలు చాలా వెనుకబడి వుండడం అత్యంత శోచనీయం.

ఉదాహరణకు — నూరుమీటర్ల పరుగులో ఇండియా స్త్రీల రికార్డు 12 . 3 సెకండులు వున్నప్పుడు, ఆసియా రికార్డు 12 . 5 సెకండులు. ప్రపంచం రికార్డు 11 . 3 సెకండులు మాత్రమే.

షాట్‌పుట్ :— ఇండియారికార్డు 33 అడుగుల 3 అంగుళాలు వున్నప్పుడు, ఆసియారికార్డు 40 అడుగుల $4\frac{1}{2}$ అంగుళాలు, ప్రపంచం రికార్డు 53 అడుగల $1\frac{3}{4}$ అంగుళాలు.

డిస్కస్‌త్రో:—ఇండియారికార్డు 92 అడుగుల 10 అంగుళాలు వున్నప్పుడు, ఆసియారికార్డు 140 అడుగుల $7\frac{1}{2}$ అంగుళాలు, ప్రపంచం రికార్డు 187 అడుగుల $1\frac{1}{2}$ అంగుళాలు.

జావిలిన్‌త్రో :— ఇండియారికార్డు 113 అడుగులు, ఆసియా రికార్డు 144 అడుగుల $6\frac{1}{2}$ అంగుళాలు, ప్రపంచం రికార్డు 182 అడుగులు.

స్త్రీలకు సంబంధించినంతవరకు వ్యాయామక్రీడలలో ఆసియాలో కెల్ల జపాన్, ప్రపంచంలో కెల్ల రష్యా అగ్రస్థానము వహించి వున్నవి.

1956 ఏప్రిల్ లో టేబుల్ టెన్నిస్ లో టీమ్ ఛాంపియన్ షిప్ ను రుమేనియా కన్యలు, వ్యక్తి ఛాంపియన్ షిప్ ను జాప్ కన్య టోమిజకోవా గెలుచుకొని వున్నారు.

1956 జూలైలో టెన్నిస్ వింబుల్డన్ ఛాంపియన్ షిప్ ను అమెరికన్ కన్య షిర్లిఫ్రెయ్ గెలుచుకొని వున్నది.

ప్రపంచ హాకీ ఛాంపియన్ షిప్ ను 1956 జూలైలో దక్షిణాఫ్రికా కన్యలు సాధించి వున్నారు.

పాశ్చాత్యదేశాలలో పురుషులు ఆడే క్రీడలలో దాదాపు అన్నీ స్త్రీలు కూడా అభ్యసించి గణనీయమైన ప్రాముఖ్యం పొందివున్నారు. ప్రపంచ క్రీడాకారిణులలో ఏదేశపువారిది అగ్రస్థానమంటే రష్యాదేనని సులభంగా చెప్పవచ్చు. స్పీడ్ స్కేటింగ్, చతురంగం, వ్యాయామ క్రీడలు, వాలీబాల్, స్కీయింగ్ లలో వారు ప్రపంచ ఛాంపియనులు. ఎథ్లెటిక్స్, బాస్కెట్ బాల్, రోవింగ్, డైవింగ్ లలో యూరప్ కంతటికీ ఛాంపియనులు.

అంతర్జాతీయ క్రీడారంగంలో భారత మహిళలు ప్రముఖస్థానం వహించడానికి, భారత క్రీడారంగంలో ఆంధ్ర కన్యలు ప్రముఖస్థానం వహించడానికి భారత, రాష్ట్ర క్రీడా సంస్థలు కనీసం ఐదు సంవత్సరాలయినా పట్టుదలతో పాటుపడవలసి వుంటుంది.

# అధ్యాయము 5

# బాలల ఆటలు



పెద్దల ఆటలలో లేని ప్రత్యేకత ఒకటి పిల్లల ఆటలలో కలదు. బాలల ఆటలలో సంగీత, సాహిత్య, వినోదాలు రసాత్మకంగా మిళితమై వున్నవి. మనకు సంప్రదాయంగా వస్తున్న బాలల ఆట లన్నీ పాటలతో ఆడ బడుతవి. ఉదాహరణకు :

తత్తెం బిత్తెం :

"తత్తెం బిత్తెం — తగడాబిత్తెం
ఏకూచక్రా — ఎలకాపండు
మామిడిముట్టె — మల్లేరేకు
ఆవులుబొయ్యే — రేవుల్లోన
గెజ్జాఘల్ — మొగ్గాదూక్."

ఈ పాట పాడుతూ బాల బాలికలు ఈ ఆటను క్రిందివిధంగా కొనసాగిస్తారు.

కొందరు బాలబాలికలు వర్తులాకారముగా పద్మాసనాసీనులై వుంటారు. "తత్తెం" అన్నప్పుడు ఒక మోకాలును, "బిత్తెం" అన్నప్పుడు మరొక మోకాలును పాట తెలిసిన బాలిక తట్టుతూ పోతుంది. పాట ఏ మోకాలువద్ద అంతమైతే ఆ మోకాలు ముడుచుకోవాలి. తదుపరి తిరిగి పాట, ఆట ప్రారంభమౌతవి. ఒక్కొక్కసారి పాట అంతం కాగానే ఒక్కొక్క మోకాలు ముడుచుకుంటారు. చిట్టచివరకు ఎవరి మోకాలు మిగిలితే వారు వ్యర్థమైనట్లు (ఔట్ అయినట్లు).

ఇదే ఆటను క్రిందిపాటలు పాడుతూకూడా ఆడుతారు.

"గుసగుసనాగా — గుంతానాగా
తప్పిసనాగా — తగిరేబండి
ఎర్యేగుఱ్జాల్ — ఎన్నిట్లాడె
కాకులుబదిరా — కలమందెక్కా
గెజ్జాఘుల్ — మొగ్గాదూక్"

*   *   *   *

"కోకోట్ రంకాయ్ — కొరమట్ రంకాయ్
రంకాయ్ బింకాయ్ — రాముడు తోట
ముత్తిబియ్యం — ములకాజేరు
ఏకూచక్కా — ఎలగా పండూ
గొత్తి గొత్తి — గోరాగొత్తి
కూసమాయ్ — జల్లాయ్
నుల్లాయ్ — కుర్ ..."

చెడు గుడు :

బాలలు చెడుగుడు ఆట ఆడుతూ ద్విపద పాడుతారు. అవి యివి :

(1) అంచి ... బూంచి చందన ... కటాంచి
(2) అత్తాకు ... ఆరాకు సన్న ... బీరాకు
(3) ఓరోరి ... వెంకన్నా పరిగిత్తిరార ... బంకన్నా
(4) ఉచ్చుచ్చు ... ఉరితాడు చెన్నాపట్నం ... చాంతాడు
(5) పందిటిమీద ... పూలకోడి పదారుగ్రుడ్ల ... మ్రింగినకోడి

## అల్లీ ... బిల్లీ :

బాలికలు ఒకరి చేతులను మరొకరు బిఱ్ఱుగా పట్టుకొని వెనుకకు వ్రాలుతూ బ్యాలెన్సు నిలుపుతూ క్రింది పాటలు పాడుతారు. ఈ ఆటను "అల్లీ ... బిల్లీ" అని వ్యవహరిస్తారు.

(1) అల్లీ బిల్లీ ... దండా ఆకాశ ... దండా
(2) పావ్వాను ... మట్ట తిరగేసి ... కొట్టు
(3) రోట్లో ... రూపాయ్ నీ మొగుడు ... సిపాయ్
(4) సాచ్చుక్క సవారిబండి ...
(5) పావ్వాను ... మట్ట తిరగేసి ... కొట్టు ...
(6) రైలుక్రింద ... తేలు నీవుచస్తే ... మేలు
(7) కడవలో ... కందులూ రంగసాని ... మందులూ
(8) ఒంటెద్దు ... బిఱ్ఱు వాయిలాను ... తెఱ్ఱు

## చెమ్మ ... చెక్క :

బాలికలు "చెమ్మ ... చెక్క" ఆట అంటే చెవిగోసుకొంటారు. ఇద్దరేసి బాలికలు ఎగురుతూ, చేతులు పైకెత్తి అరచేతులు తపతప కొట్టుతూ ఆడుతారు. ఆ సమయంలో యిలా పాడుతారు.

చెమ్మ ... చెక్క — చారడేసి ... మొగ్గ
అట్లుపోయి ... రంగ — ఆరగిన్న ... సార
రత్నాల ... పల్లకిలో — రంగులేయ ... రంగా
ముత్యాల ... పల్లకిలో — ముగ్గులేయ ... రంగా
పగడాల ... పల్లకిలో — పందిళ్ళేయ ... రంగా
పందిట్లో ... మా బావ — పెండ్లి ... యాడంగ

రాయలసీమలోని కొన్ని ప్రాంతాలలో పై పాట పాడుతారు. సర్కారు జిల్లాలలో క్రిందిపాట గానంచేస్తారు:

చెమ్మచెక్క, చేరడేసి మొగ్గ
అట్లు పొయ్యంగ, ఆరగించంగ
ముత్యాల చెమ్మచెక్క ముగ్గులెయ్యంగ
రత్నాల చెమ్మచెక్క రంగులెయ్యంగ
పగడాల చెమ్మచెక్క పందిలెయ్యంగ
పందిట్లో మా బావ పెండ్లి చెయ్యంగ
చూచివద్దాంరండి, సుబ్బరాయుడు పెండ్లి
(సూర్యదేవుడి పెండ్లి, చూచి వత్తాం రండి)
మా వాళ్ళింట్లో పెండ్లి, మళ్ళీవద్దాం రండి!
దొరగారింట్లో పెండ్లి, దోచుకు వద్దాం రండి!

రుమాలు ఆట :— బాల బాలికలు చేతులు వెనుకకు పెట్టుకొని వర్తులాకారంగా కూర్చుని వుంటారు. వెనుకకు తిరిగి చూడరాదు. ఒకరు వారి వీపుల వెనకాలె పరుగిడుతూ "వత్తొ త్తి...వారొ త్తి చూచినోళ్ళ... కండ్లల్లో ... చూరొ త్తి" అనే పాట పాడుతూ చల్లగా మెల్లగా పిల్లిలా రుమాలును ఒకరి చేతిలోకాని, వెనుకగా గాని పడవేస్తారు. రుమాలు చేతిలో పడ్డవారు లేచి ప్రదక్షిణం చెయ్యాలి. తిరిగి పై పాట పాడుతూ తిరగాలి. తిరిగి అలానే రుమాలు వెయ్యాలి. రుమాలు పడిన సంగతిని గ్రహించక, కూర్చున్న స్థలంలోనే వుండిపోతే తిరుగుతున్నవారు ఆ బాలుని లేక బాలికను ఆ రుమాలుతో కొట్టుతూ బాలబాలికల చుట్టూ ఒక త్రిప్పు త్రిప్పుతారు. ఒక త్రిప్పు అయినమీదట మొదటి బాలుడు లేక బాలిక (రుమాలు పడవేసినవారు) ఖాళీఅయినచోట కూర్చుంటారు. దెబ్బలు తిన్నవారు తిరుగుతూ తిరిగి చల్లగా మెల్లగా రుమాలు పడ వేస్తారు

సాదు ... గోదు :

బాల బాలికలు గుండ్రంగా నిలుచుని, బారలుగా చేతులు కలుపుకొని, ఒక్కసారి వదలి ఎవరి అరచేతులను వారు వెల్లకిలగాని, బోర్లగాగాని వేస్తారు. వెల్లకిల వేసిన చేతులు బోర్ల వేసిన చేతులుకంటె ఎక్కువగా వుంటే వెల్లకిల వేసినవారు పండినట్లు, బారవిడిచి వెల్లకిలగాని, బోర్లగాగాని చేతులు వేసేటప్పుడు బాల బాలికలు యిలా అంటారు.

సాదు...గోదు
గుండు...టుపాక్...ఫిరంగి

అందరూ పండిపోగా మిగిలినవారు ఓడినట్లు.

వానలో ఆటలు :

వర్షం పడుతున్నప్పుడు పిల్లలు ఇళ్ళ చూరుకింద నిలబడి చినుకులు దోసిళ్ళ పట్టుతూ యిలా పాడుతారు.

(1) తాటాకు బెల్లం బెడతా, దంచు వానా...
(2) వానొచ్చె గంగ, వల్లొత్తు గంగ.

వాన - వల్లప్పలు :

వానలో ఆడుకొనబోయే చెల్లెలును అన్న వారించడంపై ఈ పాట ప్రచారంలో వుంది.

వానా వానా వల్లప్ప
వాకిలి తిరుగూ చెల్లప్ప!
కొండమీది గుండురాయి
కొక్కిరాయి కాలు విరిగె
దానికేమి మందు
వేపాకు పసుపూ
వెల్లుల్లిపాయ
నూనెలోమడ్డి (నూనెమ్మబొట్టు),
నూటొక్కసారి
పూయవోయి నూరి,
పూటకొక్క తూరి

ఒప్పుల కొప్పు :

ఇద్దరు బాలికలు చేతులను కత్తెరవలె కలిపి కాళ్ళను గట్టిగా నేలకు తన్నిపట్టి బిర్రుగా గిర్రుగిర్రున తిరిగే ఆట యిది. అలా తిరుగుతూ యిలా పాడుతారు :

ఒప్పుల కొప్పా, ఒయ్యారి భామ !
సన్నబియ్యం, చాయపప్పు;
చిన్నమువ్వ, సన్నగాజు ;
కొబ్బరికోరు, బెల్లపచ్చు ;
గూట్లో రూపాయి, నీ మొగుడు సిపాయి !
(రోట్లో తవుడు, నీ మొగు డెవడు ?)

కొందరు ఈ క్రింది పాటకూడా పాడుతారు :

చెన్నపట్నం, చెరుకుముక్క ;
నీకో ముక్క, నాకో ముక్క ;
భీముడుపట్నం, బిందెలజోడు ;
నీకో బిందె, నాకో బిందె ;
కాళీపట్నం, కాసులజోడు,
నీకో కాసు, నాకో కాసు !

కాళ్ళా గజ్జీ :

"తత్తెం బిత్తం" ఆట రాయలసీమలో వున్నట్లు, కాళ్ళా గజ్జీ సర్కారు జిల్లాలలో ప్రచారంలో వుంది. బాలికలు ఈ ఆటకు పాడే పాటయిది :

కాళ్ళాగజ్జీ, కంకాళమ్మా; (గంగారమ్మా)
వేగులచుక్కా, వెలగా మొగ్గ ;
మొగ్గాకాదు, మోదుగ నీరు ;
నీరూగాదు, నిమ్మలవారి ;
వారీగాదు, వావింటాకు (కూర) ;

కూరాగాదు, గుమ్మడిపండు ;
పండూగాదు, పాపడి మీసం ;
లింగూ లిటుకు, పందిమాల్ని పటుకు ;
రాజుగారితోట్లో యేమందంటే
పువ్వో, మొగ్గో పుచ్చుకుంటే దెబ్బ ;
కాల్దీసి కడగా బెట్టు.

నాలుగు స్తంభాలాట :

బాలురు విడిగాగాని, బాలికలు విడిగాగాని, బాల బాలికలు కలిసిగాని ఇంటిలో ఆడుకొనే ఆట యిది. మొత్తం ఐదుగురు ఇందులో పాల్గొంటారు.

వెల్లికల, బోర్ల చప్పట్లద్వారా ఒక దొంగను నిర్ణయించి, మిగిలిన నలుగురూ నాలుగు స్తంభాలు పట్టుకొని వుంటారు. దొంగను కవ్విస్తూ ఇద్దరిద్దరు స్తంభాలు మార్చుకొంటూ వుంటారు. ఒకరు మరొక స్తంభం చేరేలోగా "దొంగ" ఆ స్తంభం పట్టుకొంటే "దొర" అయి పోతాడు. పట్టుకోలేకపోయినవాడు "దొంగ" అవుతాడు. ఈ ఆట ఆడుతూ సాధారణంగా యిలా పాడుతుంటారు.

నాలుగు స్తంభాలాటా, నడిమికి తొడిమికి ;
తానక తప్పక, తనపేరేమంటే ;
ఉట్టీమీద బెల్లం, పాట్టికాకర కాయ ;
బావా బావా ! బరుకూ, బరుకూ !
తన్నులు తింటే, తలకొకటి (తలకట్టు)

ఈ ఆటే యిప్పుడు "మ్యాజికల్ ఛెయిర్సు"గా పరిణమించింది. నవయవ్వనులు సయితం వినోదార్థం ఈ ఆట ఆడుతారు. పాట బదులు గ్రామఫోను రికార్డు ఉపయోగించబడుతుంది.

మన బాలబాలికలకు సంప్రదాయ సిద్ధంగా వస్తున్న మరికొన్ని ముఖ్యమైన ఆటలపేర్లను దిగువ పేర్కొంటున్నాను.

గచ్చకాయలు (రాయలసీమలో "పిచ్చల ఆట"గా యిది వ్యవహరించ బడుతుంది) చింతపిక్కలు, గోడింబిళ్ళ (రాయలసీమలో "జిల్లాం గోడి" పేరిట యిది వ్యవహారంలో వుంది) బండి ఆట, దూదుంపుల్ల, గుడు గుడు కుంచం, నెత్తిమీద గోరింక, దాగుడుమూత, బొమ్మలపెండ్లి, దండాడింపు, సంపెగొబ్బె, గొబ్బిళ్ళు, గుమ్మాడమ్మా గుమ్మాడీ, చక్కిలిగింత, తొక్కుడుబిళ్ళ; దొంగవో, దొరవో; చీకటి మోటి కాయి, గోళీకాయలు, చిట్లపొట్లకాయ, తూనిక తానిగ, గుప్పిట గురిగింజ, కొండకోతి, లక్కిబిక్కిదండ, గరసగింజ, సరి-బేసి, పుటచెండు, చాకిమూట, మంటిగుళ్ళు మళ్ళు, పొదుగుళ్ళు, ఉయ్యాల, గంగెద్దులాటలు, కాకెమ్మబుడంగు; నట్టుకోతి, రాతిజారుళ్ళు, తాటాకు చక్రాలు, బంతులు, కోలాటము, చిర్రుబుర్రు, పిల్లగ్రోవులు, గుమ్మడిత్రోవి కూతలు, ఒడ్డువిడుపు, నెట్టుడుకాయి, పులిజూదము (ఇది యువతీ యువకులుకూడా ఆడుతారు.) దాయాలు, సొగటాలు, వామనగుంటలు, వడిగుప్పిగంతులు, తుమ్మెదరేపుళ్లు, కుమ్మరసారె, ఉప్పుబిరి, ఆట్యాపాట్యా, ఉప్పుగోనె.

ఉత్తర దేశంలో : చెడుగుడు వివిధనామాలలో వ్యవహారంలో వుంది. బొంబాయి, మధ్యప్రదేశ్ లలో హు-తు-తు (Hu–tu–tu) అని, పంజాబ్‌లో "కొడ్డి–కొడ్డి" (Koddi–Koddi) అని, బెంగాల్, బీహార్ లలో "డు-డు-డు" (Do–do–do) అని వ్యవహరించబడుతున్నది. కొందరు కూతకూసేటప్పుడు కవిత్వం వెల్లబోస్తారుకూడా. "చల్ కబ్బాడి పోలా, సుల్తాన్ మేరా సాలా" (నేను ఘనమైన దాడి చేస్తాను. చక్రవర్తి నా బావమరదే) అంటూనూ, "చల్ కబాడిపాల్ పాల్, మేరీ మూఛే లాల్ లాల్ (అప్రమత్తతతో నేను దాడిచేస్తాను, నా మీసాలు ఎర్రబారినవి") అంటూనూ గుక్కతిప్పుకోకుండా కూత కూస్తారు.

గోణేబిల్ల ఉత్తరభారతంలో "గూలిదండా"గా వ్యవహరించబడుతుంది. అచ్చట పిల్లలేకాక యువతులుకూడా ఈ ఆటను ఆడుతారు. ఆడుతూ "ఛోటేసే బాలమ్, మోరే అంగానా మెంగిల్లి ఖేలే" (నా యువప్రియుడు నా మందిరములోనే గూలిదండా ఆడుతున్నాడు) అంటూ గానంచేస్తారు.

తెలుగునాడులో "జిల్ల" పోయిన దూరంనుంచి "గుంత" వరకు "కోడితో" (కర్ర) కొలిచేటప్పుడు రాగయుక్తంగా క్రిందివిధంగా లెక్కకట్టుతారు:

(1) ఎక్ టాంగి (2) సత్రాంగి (3) మూలాముష్టి, (4) నాలా గోడ (5) ఐదోగోని (6) ఆరంకి (7) చల్. ఏడు "చల్"లు ఒక బిళ్ళ, ఏడుబిళ్ళలు ఒక గోత్రం, ఏడు గోత్రాలు ఒక చక్రం.

ఈచన్న పర్శిచన్న: ఈ ఆటలో ఒకరి వీపుపై మరొకరు ఎక్కుతారు. ఎక్కినవారు ఎడమచేతితో క్రిందివాని కళ్లు మూసి కుడిచేతి వ్రేళ్లు కొన్ని ముడిచి, కొన్ని తెరచి వుంచుతాడు. తెరచివుంచిన వ్రేళ్ళను క్రిందివాడు సరిగా చెబితే ఆ వెనువెంటనే పైవాడు క్రిందివానిని మోయ వలసి వుంటుంది. ఆట అలా కొనసాగుతుంది. క్రిందివారు గుర్రంగాను, పైవారు రౌతుగాను వ్యవహరించబడుతారు.

దిన్ ఔర్ రాత్: ఆరు పలకల బిల్లతో రెండు జట్లు ఈ ఆటను ఆడుతవి. బిల్లకు ఆరువైపులు వుంటవి. మూడువైపుల తెలుపు, మూడువైపుల నలుపు రంగు పూస్తారు. తెలుపుప్రక్కనే నలుపు వచ్చేటట్లు పూస్తారు. రెండు జట్లూ ఆటస్థలం రెండువైపులా "గోలు"లు పాతి వుంచుకొంటవి. ఆటస్థలి మధ్యలో ఒక గీత గీయబడి వుంటుంది. అచ్చటకు అటువైపు ఐదు అడుగుల దూరంలో ఒక జట్టు, ఇటువైపు ఐదు అడుగుల దూరంలో రెండవ జట్టు నిలబడి వుంటుంది. ఒక జట్టు తమది తెలుపురంగును, రెండవ జట్టు నలుపును ఎన్నుకొంటవి. మధ్యవర్తి బిల్లను పైకి ఎగరవేస్తాడు. తెలుపురంగువైపు పడితే "తెల్లవారు" తమ గోలులవైపు పరుగిడాలి. అప్పుడు నల్లవారు వారిని వెంబడించి పట్టుకో డానికి ప్రయత్నిస్తారు. పట్టుబడ్డవారు 'నల్లవారి'లో చేరాలి. ఒక రంగువారు పూర్తిగా రెండవ రంగువారికి చేరేవరకు ఆట కొనసాగుతుంది. ఈ ఆటలో ఎక్కువగా బాలురు పాల్గొంటారు.

అంధ: ఇది మన దాగుడుమూత వంటి ఆట.

బాలల ఆటలకు ప్రత్యేక సాధనాలు అవసరం లేదు. ఖర్చు లేదు. కాని వీటివల్ల కలిగే వ్యాయామం, ఉత్సాహం, సంఘీభావం పెద్దల ఆటలకు ఏ మాత్రం తీసిపోదు.

విదేశ సంస్కృతి ప్రభావంవల్ల ఇండియాలో బాలబాలికలు స్కిప్పింగ్ (తాడుతో గెంతడం), సీసా (Seesaw) (పొడుగాటి బల్లపై రెండుకొనలన ఇద్దరు కూర్చుని పైకి క్రిందకు ఊగడం) వంటి ఆటలు ఆడుతున్నారు. టెన్నిస్, టేబుల్ టెన్నిస్, రింగ్ టెన్నిస్, బాడ్మిన్టన్, హాకీ, బాల్ త్రో ఆటలు, ఆధునిక వ్యాయామక్రీడలు ఆడుతున్నారు.

## విదేశాలు

విదేశాలలో ముఖ్యంగా పాశ్చాత్య దేశాలలో బాలురు యువకుల ఆటలను సయితం, బాలికలు యువతుల ఆటలను సయితం ఆడుతున్నారు. బాల్యంనుంచి వివిధక్రీడలలో శిక్షణ నివ్వడానికి వసతి వుండడం వల్లనే వారా ఆటలను అభ్యసించ కలుగుతున్నారు. బాలురు ముష్టియుద్ధం కూడా చెయ్యడం, బాలికలు మంచుకొండలపై ప్రత్యేక సాధనాలతో విహరించడం, పసికందులు సయితం ఈత నభ్యసించడం ప్రత్యేకించి గమనించదగినవి.

విదేశాలలో బాలబాలికలు మాత్రమే సాధారణంగా ఆడే ఆటలను రేఖామాత్రంగా దిగువ ఉదహరిస్తున్నాను.

క్రికెట్ బంతిని విసరడం : పాశ్చాత్య దేశాలలోని ప్రతి స్కూలులోను ఈ ఆట విధిగా నేర్పబడుతున్నది.

గాలి పడగలు : చైనాలో ఇది విస్తారం. డెన్మార్క్, బ్రిటన్ వంటి పాశ్చాత్య దేశాలలో కూడా ఇది ఒక ముఖ్య క్రీడగా వ్యాపితమై వున్నది.

లీప్ ఫ్రాగ్ : "దొంగ" అయిన బాలుడు వంగి, నేలకు వ్రేళ్లు ఆన్చివుండగా, "దొర" అతని వీపుమీదుగా ఎగరడం. పాశ్చాత్య దేశాలలోనే కాక భారతదేశంలో కూడా ఈ ఆట బాగా ప్రచారంలో వుంది.

"బుజ్":– కాళ్ళాగజ్జీ వంటి ఆట యిది. ఇందులో బాలబాలికలు వరుసగా కూర్చుని ఒకటి, రెండు, మూడు అంటూ లెక్క వేసుకుపోతారు. ఏడు రాగానే ఏడుకు బదులు "బుజ్" అంటారు. "బుజ్" వచ్చినవారు పండినట్లు.

బ్లైండ్ మ్యాన్స్ బఫ్ (దాగుడుమూత); డేబ్స్ (Dabs) (గచ్చకాయలు వంటి ఆటలు.)

గెస్సింగ్ గేమ్స్ : బాలబాలికలను గుర్తుపట్టే విచిత్రమైన ఆట లివి. తెరమరుగున వుండి ఒక బాలుడు లేక బాలిక తన చేతిని మాత్రమే చూపుతుంది. ఆమె లేక అతడు ఎవరో ఇతరులు గుర్తుపట్టి పేరు చెప్పాలి.

కళ్ళుతప్ప శరీర మంతా కాగితాలతో కప్పుకొని ఒకరు వస్తారు. కళ్ళు పరీక్షించి అత నెవరో పేరు చెప్పాలి. ఇటువంటి ఊహాక్రీడలలో తప్పు చెప్పినవారికి తగు దండన అక్కడికక్కడే యివ్వబడుతుంది.

వర్డ్ బిల్డింగ్ కూడా ఒక ఆటగా పాశ్చాత్య దేశాలలో బాగా ప్రచారంలో వుంది.

అధ్యాయము 6

# ప్రపంచరాజ్యాలలో క్రీడారంగస్థితి : ఎథ్లెట్‌ల పరిచయం

## సోవియట్ రష్యా



అంతర్జాతీయ క్రీడారంగంలో ప్రముఖస్థానం వహించి, మెల్బోర్న్ ఒలింపిక్స్‌లో అమెరికాను వెనుక వేసిన మహా దేశం సోవియట్ యూనియన్. బాల, యువ క్రీడాభిలాషులకు క్రీడాప్రవీణులకు మరే దేశంలో లేని వసతులు రష్యాలో వున్నవి.

క్రీడాసంస్థల ద్వారా సమైక్యమయ్యే సంఘటితమయ్యే హక్కు, సోవియట్ ప్రజలకు యిస్తూ సోవియట్ రాజ్యాంగంలో ఒక ప్రత్యేక నిబంధన వున్నది. ప్రజలు ఈ హక్కులను పొందడానికి వీలుగా దేశమంతటా అనేక క్రీడాస్థలిలు (స్పోర్ట్సు ఏరీనాస్), క్రీడాంగణాలు (స్టేడియమ్స్), ఈతకొలనులు (స్విమ్మింగ్ పూల్స్), మంచు విహార కేంద్రాలు (స్కీయింగ్ సెంటర్స్) మున్నగువాటిని ప్రభుత్వం నిర్మించి యిచ్చింది. సోవియెట్ క్రీడాకారులు, క్రీడాభిలాషులు వీటిని చిల్లిగవ్వ యినా చెల్లించకుండా వినియోగించుకోవచ్చు. అంతేకాక వీరికి సమస్త

సాధన సామగ్రి, క్రీడా పరికరాలు ఉచితంగా సమకూర్చుతుంది. యుద్ధకాలంలో విధ్వంసమైన క్రీడాస్థలాలను, క్రీడాంగణాలను పంచవర్ష ప్రణాళిక పరంగా ప్రభుత్వమే పునర్నిర్మించి యిచ్చింది. ప్రభుత్వమే కాక, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కూడా ప్రజలకు వ్యాయామ శిక్షణ నిప్పించడంలో శ్రద్ధ వహిస్తున్నది. కమ్యూనిస్టు సిద్ధాంత విద్యలో భాగంగా సమూహప్రాతిపదికపై వ్యాయామ శిక్షణ గరపబడుతున్నది.

పెక్కు రాజ్యాలలో క్రీడలు ధనికుల, విద్యావంతుల సొత్తు. సోవియెట్ యూనియన్‌లో క్రీడలు సమస్త శ్రామికుల సొత్తు. దేశమంతటా కల వ్యాయామక్రీడల శిక్షణ శిబిరాలలో వీరు తర్ఫీదు పొందడానికి అవకాశం కల్పించబడింది.

ఇటువంటి శిబిరాలను (ఎథ్లెటిక్ క్లినిక్స్) సద్వినియోగపరచుకొంటున్న యువ క్రీడాభిలాషులు 50 లక్షలకు పైగా వున్నారు.

రష్యాలో క్రీడా ప్రవీణులకు ఇతర వ్యాపకాలేవీ లేవనీ, వారు సమస్తకాలం ప్రావీణ్యాభివృద్ధికి అకుంఠిత దీక్ష వహిస్తారనీ, రాజకీయ నాయకులతో సమానమైన గౌరవం వారికివ్వబడుతున్నదనీ అమెరికన్ క్రీడా నిపుణులు, క్రీడా సంస్థలు ఈ విషయాలను గ్రహించి అనుసరించాలనీ అంతర్జాతీయ ఒలింపిక్ సంఘం అధ్యక్షుడు శ్రీ ఎవరీ బ్రండేజ్ అంతటివారే హెచ్చరించి వుండడం ఈ సందర్భంలో గమనార్హం.

ఎప్పటికప్పుడు కొంగ్రొత్త పద్ధతులలో వ్యాయామ శిక్షణ నివ్వడానికి కూడా సోవియెట్ యూనియన్ కృషి చేస్తున్నది. మాస్కో, లెనిన్‌గ్రాడ్, ట్బిలిసి మున్నగు నగరాలలో వ్యాయామశిక్షణ పరిశోధన సంస్థలు నెలకొల్పబడినవి. శరీర శాస్త్రజ్ఞులు (ఫిజియాలజిస్ట్స్), డాక్టర్లు, వ్యాయామ విద్యాధ్యాపకులు, స్పెషలిస్టులు, శాస్త్రీయ వ్యాయామశిక్షణ విధానాలు గురించి యిక్కడ పరిశీలనలు జరిపి సోవియెట్ క్రీడావేత్తల

ప్రావీణ్యాన్ని ఇనుమడింపజేసే విశిష్ట నవరీతులను కనుగొంటారు. వాటిని వెంటనే వ్యాయామాధ్యాపకులకు, శిక్షకులకు, క్రీడా ప్రవీణులకు తెలియజేస్తారు.

ప్రత్యేకించి క్రీడల గురించి శ్రద్ధవహించడానికి సోవియట్ మంత్రి వర్గం ఒక కమిటీని నియమించి వున్నది. ప్రతి సంవత్సరం బహిరంగ క్రీడాశాలల, బ్రహ్మాండమైన తాలింఖానాల (జిమ్నాసియమ్స్) నిర్మాణానికి ప్రభుత్వం పెద్ద పెద్ద మొత్తాలను మంజూరుచేస్తూ వున్నది. రష్యాలో బ్రహ్మాండమైన తాలింఖానాలు 45 కు మించి వున్నవి. ఇచ్చట తర్ఫీదు పొందేవారు పొందుతూ వుండగా ప్రతి ప్రాథమిక, సెకండరీ పాఠశాలలలోను జిమ్నాస్టిక్స్‌లో శిక్షణ గరపబడుతున్నది. ఆరోగ్య నిర్మాణ మహాకార్యక్రమంగా జిమ్నాస్టిక్స్ రష్యాలో ప్రోత్సహించ బడుతున్నవి.

క్రీడాప్రవీణులను ప్రభుత్వమే సత్కరించే ఆచారాన్ని రష్యను ప్రభుత్వం 1947 లో ప్రవేశపెట్టింది. వ్యాయామక్రీడలలో అగ్రస్థానం వహించిన సోవియెట్ ప్రముఖులకు, వ్యాయామక్రీడలలో సోవియెట్ యూనియన్ రికార్డులను సాధించినవారికి, జాతీయ ఆటల పోటీలలో ప్రథమ, ద్వితీయ స్థానాలు పొందివున్నవారికి ప్రతి సంవత్సరం వారి వారి విజయాలుబట్టి స్వర్ణ, రజత పతకాలను ప్రభుత్వమే బహూకరిస్తున్నది.

## వ్యాయామ దినోత్సవం

ఏటా ఒకరోజున దేశమంతటా "వ్యాయామ దినోత్సవం" (ఫిజికల్ కల్చర్ డే) జరిపే ఆచారాన్ని రష్యనుప్రభుత్వం 1939 లో ప్రారంభించింది. ఆరోజున దేశమంతటా సెలవు ప్రకటించబడుతుంది. ఈ క్రీడా మహోత్సవానికి ప్రధాన కేంద్రం మాస్కో. ప్రతి పట్టణం, గ్రామంలో సయితం క్రీడోత్సవం జరుపబడుతుంది. మాస్కో వుత్సవంలోమటుకు అగ్రశ్రేణిలో వున్న క్రీడాప్రవీణులు మాత్రం పాల్గొంటారు. సోవియెట్ కమ్యూనిస్టుపార్టీ, ప్రభుత్వపు అధినేతలెల్లరు మాస్కో మహోత్సవం వీక్షిస్తారు.

రష్యను క్రీడా ప్రణాళికకు ప్రాతిపదిక సమూహ ప్రతిపత్తిపై క్రీడలను ప్రచారం చెయ్యడం, అభివృద్ధి పరచడమూను. సోవియెట్ యూనియన్‌లోని ప్రతి ఫ్యాక్టరీకి, వ్యవసాయ క్షేత్రానికి, విద్యాసంస్థకు, ఇతర సంస్థలకు క్రీడా సంఘాలు ఏర్పాటు చేయబడి వున్నవి.

రైల్వేపనివారల "లోకోమోటివ్", విమాన నిర్మాణ కార్మికుల "వింగ్స్ ఆఫ్ ది సోవియట్స్", మోటారుకార్మికుల "టార్పెడో" వంటివి రష్యను క్రీడాసమితులలో ప్రముఖమైనవి. సోవియెట్ సోకర్ ఛాంపియన్‌షిప్ పోటీలలో 18,000 టీములకు పైగా పాల్గొంటవంటే రష్యాలో క్రీడోద్యమం ఎంతగా వ్యాప్తమైవున్నదో ఊహించవచ్చు.

రష్యాలో వ్యాయామంలో ప్రావీణ్య సాధనను ప్రోత్సహించడం నిమిత్తం "జి. టి. ఓ" పరీక్షలు పెట్టి యోగ్యతాపత్రాలు సమర్పిస్తున్నట్లు ప్రథమాధ్యాయంలో రష్యాగురించి ప్రస్తావించినప్పుడు వివరించాను. మూడు తరగతులుగా జరిగే ఈ వ్యాయామ పరీక్షలలో నెగ్గినవారికి జి. టి. ఓ. బ్యాడ్జీలు బహూకరిస్తారు. వీటిని సాధించినవారు వ్యాయామ వీరులుగా పరిగణించబడుతారు. "దేశనిర్మాణ కార్యక్రమానికీ, రక్షణకు మేము సిద్ధం" అనే అర్థంవచ్చే రష్యను మాటలకు సంకేతంగా జి. టి. ఓ. అనే పొడిఅక్షరాలు తీసుకోబడినవి.

## "మాస్టర్ ఆఫ్ స్పోర్ట్స్"కు యోగ్యతలు

క్రీడాభిలాషులను జి. టి. ఓ. బ్యాడ్జీల ద్వారా ప్రోత్సహించినట్లు క్రీడాప్రవీణులను "ఆనర్డ్ మాస్టర్ ఆఫ్ స్పోర్ట్స్ ఆఫ్ ది యు. ఎస్. ఎస్. ఆర్." బిరుదుప్రదానం ద్వారాను, వ్యాయామాధ్యాపకులను, శిక్షకులను "ఎక్సలెంట్ ఇన్ ఫిజికల్ కల్చర్" బిరుద సమర్పణ ద్వారాను సత్కరిస్తున్నారు.

వ్యాయామ క్రీడలలో కొన్ని ప్రమాణాలను నిర్ణయించి వాటిని అందుకొన్నవారికి "ఆనర్డ్ మాస్టర్ ఆఫ్ స్పోర్ట్స్ ఆఫ్ ది యు. ఎస్. ఎస్. ఆర్" అనే బిరుదు నిస్తున్నారు. ఆ ప్రమాణాల వివర మిది:

| వ్యాయామ క్రీడ | పురుషులు | స్త్రీలు |
|---|---|---|
| పరుగు | | |
| 100 మీటర్లు | 10.4 సెకండులు | 11.8 సెకండులు |
| 200 ,, | 21.2 ,, | 24.5 ,, |
| 400 ,, | 47.0 ,, | 56.0 ,, |
| 800 ,, | 1 నిమిషం 49 ,, | 2. ని. 10 ,, |
| 1,500 ,, | 3 నిమిషాల 47 ,, | — |
| 5,000 ,, | 14 నిమిషాల 18 ,, | — |
| 10,000 ,, | 29 నిమిషాల 50 ,, | — |
| హర్డిల్సు | | |
| 100 మీటర్లు | 14.2 సెకండులు | — |
| 200 ,, | 23.4 ,, | |
| 400 ,, | 52.0 ,, | |
| 3,000 ,, స్టీపుల్ ఛేజ్ | 8 ని. 54 ,, | — |
| మరాథన్ (పరుగు) | 2 గం. 25 ని. | — |
| లాంగ్ జంప్ | 7.60 మీటర్లు | 5.90 మీటర్లు |
| హైజంప్ | 2.00 మీటర్లు | 1.65 మీటర్లు |
| హాప్ స్టెప్ అండ్ జంప్ | 15.50 మీటర్లు | — |
| పోల్ వాల్టు | 4.40 ,, | — |
| డిస్కస్ త్రో (2 కిలోగ్రాముల బరువు కలది) | 53.00 ,, | 49.00 మీటర్లు |
| జావెలిన్ త్రో (800 గ్రాముల బరువు కలది) | 73.00 ,, | 51.00 ,, |
| హామర్ త్రో (7.25 గ్రాముల బరువు కలది) | 59.00 ,, | — |
| షాట్ పుట్ (7.25 గ్రా. బరువుకల గోళము | 16.50 ,, | 15.00 మీటర్లు |
| 10,000 మీటర్ల నడక (6 మై. 376 గ.) | 44 నిమిషాలు | — |
| 50,000 మీటర్ల నడక (31 మైళ్ళు) | 4 గం. 30 ని. | — |

[ ఒక మీటరు = మూడు అడుగుల 3.91 అంగుళాలు ; ఒక కిలోగ్రామ్ రెండు పౌనులు. గ్రాము కిలోగ్రామ్‌లో వెయ్యోవంతు.]

జిమ్నాస్టిక్స్, తదితర క్రీడలలోకూడా ఒక ప్రమాణం అందుకొన్న వారికి ఈ గౌరవ బిరుదు సమర్పించబడుతుంది.



"ఆనర్డ్ మాస్టర్ ఆఫ్ స్పోర్ట్స్" శ్రీమతి నీనాబొచరోవా.
అసమప్యారలల్ బార్‌పై ప్రజ్ఞాప్రదర్శనం

పై ప్రమాణాలను దృష్టిలో పెట్టుకొని మరి మూడు తరగతులలో కూడా "మాస్టర్ ఆఫ్ స్పోర్ట్స్" బిరుద మివ్వబడుతున్నది. ఇవి ద్వితీయ, తృతీయ, జూనియర్ తరగతులు.

రష్యాలో పెద్ద క్రీడా సంఘాలు ట్రేడ్‌యూనియన్ పద్ధతిపై నడుపబడుతున్నవి. వీటి ఆధ్వర్యంలోనే 1200 స్టేడియమ్‌లు, స్కేయింగ్, వాలీబాల్, బాస్కెట్‌బాల్, టెన్నిస్ మున్నగు క్రీడలకు సంబంధించిన 55,000 జిమ్నాసియాములు నడుపబడుచున్నవి.

సోవియెట్ యూనియన్‌లో వివిధ క్రీడలలో పాల్గొనేవారు రెండుకోట్లకు పైగా వున్నారు. వ్యాయామక్రీడలు అభ్యసిస్తున్నవారే

40,00,000 మందికి పైగా వున్నారు. వీరందరూ సంవత్సరం పొడుగునా శిక్షణ పొందుతారు; లేదా ఆడుతూ వుంటారు; విఘ్నం వుండదు. ఇంత ఎక్కువమంది పోటీదార్లు వున్నందువల్లనే రష్యాలో జాతీయ రికార్డులు ఎప్పటికప్పుడు అధిగమించబడుతూ వుంటవి.

రష్యాలో ఆధునిక ఆటలన్నీ ప్రచారంలో వున్నవి. కాని టేబుల్ టెన్నిస్, ఫీల్డ్ హాకీ వంటి వాటిలో ప్రస్తుతం ప్రపంచ ప్రమాణాన్ని అందుకొన్నవారు లేరు.

జార్ నిరంకుశ చక్రవర్తుల కాలంలో, 1914 లో రష్యనులు ఒక్క ప్రపంచం రికార్డు అయినా సృష్టించలేదు. అప్పటికి అమెరికా 45 ప్రపంచం రికార్డులను చేబట్టి వున్నది. 1948 లో రష్యాలోని 59 ఆల్ యూనియన్ రికార్డులు ప్రపంచం రికార్డులను మించినవి. అప్పటికి అమెరికా 28 ప్రపంచం రికార్డులను నిలబెట్టుకొని వున్నది.

ఇప్పుడు పెక్కు వ్యాయామక్రీడలలోను, కసరత్తులోను, వెయిట్ లిఫ్టింగ్, స్కేటింగ్ లలోని కొన్ని తరగతులలోను, చతురంగంలోను సోవియెట్ క్రీడాకారులు ప్రపంచ ఛాంపియనులు. సోవియట్ క్రీడాకారిణులు స్పీడ్ స్కేటింగ్, చతురంగం, కొన్ని వ్యాయామ క్రీడలు, వాలీబాల్, స్కీయింగ్ లలో ప్రపంచ ఛాంపియనులు. ప్రస్తుతం 200 మంది క్రీడాకారిణులు "ఆనర్డ్ మాస్టర్ ఆఫ్ స్పోర్ట్స్" బిరుదును, 1614 మంది క్రీడాకారిణులు "మాస్టర్ ఆఫ్ స్పోర్ట్స్" బిరుదునూ పొంది వున్నారు.

రష్యా తొలిసారి 15 వ ప్రపంచం ఒలింపిక్స్‌లోనే (హెల్సింకీలో 1952 జులై 19 నుంచి ఆగస్టు మూడవ తేదీవరకు జరిగినవి) పాల్గొన్నది. ఫీల్డ్ హాకీలో తప్ప అన్ని పోటీలలోను పాల్గొన్నది. 38 పోటీలలో ప్రథమస్థానం, 53 పోటీలలో ద్వితీయస్థానం, 15 లో తృతీయ స్థానం సంపాదించింది. పాయింట్లుబట్టి అన్ని రాజ్యాలలోకి ద్వితీయస్థానం సంపాదించింది.

## చతురంగంపట్ల రష్యాశ్రద్ధ

చతురంగంలో ప్రపంచం ఛాంపియన్ శ్రీ మిఖైల్ బొట్వినిక్ రష్యను ప్రముఖుడే. ఈ ఆటలో రష్యా తన అగ్రస్థానాన్ని నిలుపుకొనేందుకు గట్టి పునాదులు వేసి వుంచుకొన్నది.

సోవియెట్ యూనియన్‌లో కనీసం 16,00,000 చతురంగపు ఆటగాళ్ళు కలరు. వీరిలో అంతర్జాతీయ ఖ్యాతి గడించినవారు (ఇంటర్నేషనల్ గ్రాండ్‌మాస్టర్స్) 18 మంది, యూనియన్‌లో ప్రముఖస్థానం వహించినవారు (మాస్టర్స్) 100 మంది.

ప్రపంచం స్త్రీల చతురంగం ఛాంపియన్‌షిప్‌ను కూడా రష్యను - శ్రీమతి ఎలిజవెటా బైకోవా సాధించి వుండడం గమనార్హం.

శ్రీయుతులు స్మయిస్లోవ్, వి. రాగొజిన్, వాసిలిపానోవ్, వై. అవర్‌బాఖ్, బి. స్పాస్కీ, ఎమ్. టైమనోవ్ ప్రభృతులు అంతర్జాతీయ ఖ్యాతి గడించిన చతురంగపు ఆటగాళ్ళు. వీరిలో శ్రీ టైమనోవ్ 1956 లో రష్యా చతురంగపు ఛాంపియన్‌షిప్ సాధించాడు. ఓ. రుబ్జోవా, ఎల్. వోల్పెర్ట్, కె. స్వారికినా ప్రభృతులు చతురంగపు ఆటకత్తెలలో ప్రముఖులు.

ఇప్పుడు రష్యాగా వ్యవహరించబడుతున్న దేశంలో క్రీస్తుశకం 500 వ సంవత్సరంనుంచి చతురంగం ప్రచారంలో వున్నప్పటికీ కార్మిక, కర్షకులలో, ఆఫీసు ఉద్యోగులలో అది ప్రచారంలోకి వచ్చినది 1920 ప్రాంతాలలోనే.

మొట్టమొదటిసారి 1920 లో రష్యను ఛాంపియన్‌షిప్‌ను అలెఖైన్ గెలుచుకొన్నారు.

అప్పటినుంచి చతురంగం ఆటను ప్రభుత్వం ప్రోత్సహిస్తున్నది. జాతీయ వ్యాయామ కార్యక్రమంలో ఈ ప్రణాళిక చేర్చబడింది.

ప్రస్తుతం రష్యాలోని ప్రతి పట్టణంలోను బాలబాలికలకు ఉచితంగా చతురంగపు ఆట నేర్పడానికి శాలలు వున్నవి. అచ్చటి ప్రవీ

ణులు శిక్షణ నిస్తారు. పిల్లలు పెద్దలతో ఆడితే పిల్లల ప్రావీణ్యం పెరుగ గలదు. అందుచేత బాలల చతురంగపు టోర్నమెంటులలో ప్రవీణులు కూడా పాల్గొంటారు. గ్రాండ్ మాస్టర్ లు, మాస్టర్ లు ఆశాలలలో తరచు జరిగే ఎగ్జిబిషన్ పోటీలలో పాల్గొంటారు.

## సోవియట్ ఎథ్లెట్ లు

సోవియెట్ ఎథ్లెట్ లలో ముఖ్యులు దిగువ పరిచయం చేయబడినారు. ఆటలలో అద్వితీయులు ఆ యా ఆటలకు సంబంధించిన అధ్యాయాలలో మున్ముందు పరిచయం చేయబడుతారు.

(శ్రీ) వి. కుక్ : 5,000 మీటర్లు (3 మైళ్ళ 188 గజాలు). 10,000 మీటర్లు (ఆరుమైళ్ళ 376 గజాలు) పరుగులో శ్రీ వి. కుక్ రష్యాలో అద్వితీయుడు.

$6\frac{1}{4}$ మైళ్ళ పరుగు పందెములో ఈయన చెక్ ప్రవీణుడు శ్రీజటోపెక్ ను ఓడించి వేశారు. పారిస్ లో 1956 మార్చి 25 వ తేదీన $6\frac{1}{4}$ మైళ్ళకు జరిగిన పోటీలో ఈయన ఆ దూరాన్ని 29 నిమిషాల 54 సెకండులలో పూర్తిచేసి ప్రథమస్థానం పొందారు. చెక్ ప్రవీణుడు జటోపెక్ 30 నిమిషాల 3 సెకండులలో పూర్తిచేసి తృతీయస్థానం పొందారు.

400 మీటర్ల హర్డిల్స్ లో యూరిలిట్యువ్ ప్రపంచ ఛాంపియన్. ఈయన ఈ దూరాన్ని 50.4 సెకండులలో పూర్తిచెయ్య కలిగారు.

రష్యను హామర్ త్రో ప్రవీణుడు ఎమ్. క్రివొనొసోవ్ ప్రపంచంలో కెల్ల అద్వితీయుడు. ఈయన రికార్డు 211 అడుగుల $8\frac{1}{4}$ అంగుళాలు.

హాప్, స్టెప్, జంప్ లో ప్రపంచం రికార్డును సాధించినది ఎల్. షెర్బకోవ్ అనే రష్యను నిపుణుడు. ఈయన రికార్డు 53 అడుగుల $2\frac{3}{4}$ అంగుళాలు.

శ్రీ ఛుకరిన్ (జిమ్నాస్ట్) 1952 లో ప్రపంచం ఒలింపిక్ పోటీలలో కసరత్తులలో విశిష్టవిధానాలు ప్రదర్శించి నాలుగు స్వర్ణపతకాలు, రెండు రజత పతకాలు సాధించారు. యూసఫ్ బెర్డీవ్, గ్రాంట్



శ్రీ నికొలై పొపొవ్. పారలల్ బార్‌పై ప్రజ్ఞా ప్రదర్శనం

షాగిన్యన్, ఎవిగ్నీ కొరొలోక్వ్, ఎవింజిని లెన్‌స్కీ, లియోనిడ్ జకర్యాన్, నికొలై పొపొవ్, అలెగ్జాండర్ సొబొలెవ్ శ్రీమతులు మరియ గ్రొఖొవిస్కియా, నీనా బొచరొవా, పొలినా డనిలొవా, మెడీజుగేలి, జినైడా కేలివా జిమ్నాస్టిక్స్‌లో ప్రపంచ ఖ్యాతి గడించివున్నారు.

# అ మె రి కా



వ్యాయామ క్రీడలపట్ల, ఆటలపట్ల సోవియెట్ దృక్పథానికీ, అమెరికా దృక్పథానికీ ప్రధానమైన భేద మొకటి వున్నది.

సమూహ ప్రాతిపదికపై శిక్షణ నివ్వడం రష్యనుల లక్ష్యం. అందువల్ల వ్యాయామ విద్యాబోధన ఒక ఆరోగ్య కార్యక్రమంగా జరుపబడుతుందనీ, జాతి యావత్తూ పటిష్ఠంగా రూపొందుతుందని వారి అభిప్రాయం.

అమెరికనులు సమూహ శిక్షణ పద్ధతికంటె వ్యక్తులపట్ల అమిత శ్రద్ధ వహించడం లక్షిస్తారు. ఇందువల్ల అమెరికనులు స్థాపించిన రికార్డులను ఇతరులు అధిగమించాలి అంటే, ఎంతో శిక్షణపొంది వుండాలి. మొదటినుంచి ఉత్తమ, ఉన్నత శిక్షణ పొందుతూవున్న అమెరికన్ ప్రవీణుడు తనకు యివ్వబడుతున్న ప్రత్యేక సౌకర్యాలను సద్వినియోగ పరచుకొని తనకు తానే కొత్తరికార్డులను సృష్టించుకు పోగలుగుతాడు. రష్యాలో అనేకమంది వ్యాయామ ప్రవీణులు ప్రథమశ్రేణిలో వుంటూ వున్నందువల్ల జాతీయరికార్డులు ఎప్పటికప్పుడు కొత్తవి సాధించబడుతవి. అమెరికాలో చాలా కొద్దిమంది మాత్రమే ప్రథమశ్రేణిలో వుంటూ వున్నందువల్ల జాతీయ రికార్డులు అంతత్వరగా - కనీసం రష్యాలో అంత వేగంగా-అధిగమించబడవు.

రష్యాలో క్రీడలను యావత్తూ ప్రభుత్వం కంట్రోలు చేస్తూ వుంటే అమెరికాలో ప్రభుత్వం క్రీడలతో ప్రత్యక్షసంబంధం పెట్టుకొనదు,

ప్రయివేటు సంస్థలు, రాజకీయ, పారిశ్రామిక, చిత్ర, చలన చిత్రకళా వేత్తలు మున్నగువారు వ్యక్తిగత హోదాలో క్రీడల అభివృద్ధికి నిండు హృదయంతో తోడ్పడుతారు. క్రీడల విలువ సమస్త ప్రజలకు తెలిసి నందువల్లనూ, దాదాపు ప్రజలందరూ క్రీడాసక్తులై వున్నందువల్లనూ ఆమెరికాలో క్రీడలకు, క్రీడావేత్తలకు ప్రజల సహకారం, సహాయం సులభంగా లభిస్తున్నది.

మెల్బోర్న్‌లోని ప్రపంచ ఒలింపిక్ పోటీలకు అమెరికన్ జట్టును పంపడానికే అమెరికా ప్రభుత్వం ఆర్థిక సహాయం చెయ్య లేదట. 400 మందికి తగు శిక్షణనిచ్చి పంపడానికి 1,11,00,000 డాలర్లు అవసరమని అంచనా వేయబడింది. అమెరికన్ ఒలింపిక్ కమిటీ విరాళాలు సేకరించింది. టెలివిజన్ ద్వారా విజ్ఞప్తి చేసింది. బింగ్ క్రాస్బీ, బాబ్ హోప్, డానీ కేయీ వంటి సినిమానటులు కూడా విరాళాలు ప్రోగుచేశారు.

అమెరికాలో వ్యాయామక్రీడలు (ఎథ్లెటిక్స్), బౌలింగ్, రగ్బీ, ఫుట్ బాల్, గోల్ఫ, టెన్నిస్, బాస్కెట్ బాల్, మంచుపై ఆటలు, నీటి ఆటలు, షూటింగ్, ధనుర్విద్య, ముష్టియుద్ధం, కుస్తీ బాగా ప్రచారంలో వున్నవి. హాకీకూడా ప్రోత్సహించ బడుతున్నది.

అమెరికాలో బౌలింగ్ ఆలేలు — అప్పడాలకర్రవంటి కొయ్య లను - పిన్స్ (Pins)—వరుసగా నిలబెట్టి దూరంనుంచి పెద్ద బంతితో (బౌలింగ్ బాల్) వాటిని పడగొట్టే ఆట బౌలింగ్. ఈ ఆటకు వసతిగల శాలలు బౌలింగ్ ఆలేలు, విస్తారంగా కలవు. ఆరుబయటి క్రీడలలో విశేషంగా ప్రజాభిమానం చూరగొన్నది మత్స్యవేట. యువజన శిబి రాలలో కాలక్షేపమంటే అమెరికన్ బాలబాలికలు, పిక్నిక్ లంటే యువతీయువకులు చెవికోసుకొంటారు.

1952 ఒలింపిక్ పోటీలలో అమెరికా 40 స్వర్ణపతకాలను, 19 రజతపతకాలను, 17 కంచుపతకాలను సాధించింది. 1948 లో

లండన్‌లో జరిగిన 14 వ ప్రపంచ ఒలింపిక్ పోటీలలోవలె 1952 లో జరిగిన 15 వ ఒలింపిక్ లో కూడా అమెరికా ప్రప్రథమస్థానం పొందింది.

అమెరికాలో వివిధ క్రీడలకు గల ప్రచారం, ఆదరణ దిగువ వివరిస్తున్నాను.

బేస్ బాల్ : ఏడాదిలో 16 మేజర్ లీగ్ పోటీలు, 38 మైనర్ లీగ్ పోటీలు జరుగుతవి. పెద్దపోటీలకు హాజరయ్యేవారు 1,50,00,000 పైగా వున్నారు. చిన్న పోటీలను చూచేవారు 2,33,00,000 వరకూ వుంటారు. మైనర్ లీగ్ పోటీలలో 300 జట్లకు పైగా పాల్గొంటవి.

మత్స్యవేట : ఆరుబయటి క్రీడలలో విశేషంగా ప్రజాభిమానం చూరగొన్నది. కొన్ని ప్రాంతాలలో మత్స్యవేటకు లైసెన్సులు అవసరం. ఇట్టి లైసెన్సులను పొందివున్న వారు-1956 జనవరిలో - 1, 76, 52, 478 మంది. లైసెన్సులు అవసరంలేనిచోట్ల 80,00,000 మందికి పైగా వినోదార్థం చేపలు పట్టుతారు. విమానాలలో సరస్సులకు వెళ్ళి వినోదార్థం చేపలుపట్టే భాగ్యశాలురు వేలసంఖ్యలో వున్నారు.

బౌలింగ్ గేమ్ : పిన్నలలో, పెద్దలలో, యువతీ యువకులలో విశేషంగా ప్రచారంలో వున్న క్రీడ యిది.

1953-54 లో అమెరికా మొత్తంపై 60,000 కు పైగా బౌలింగ్ ఆలేలు వున్నవి. 2,00,00,000కు పైగా ఈ క్రీడతో కాలక్షేపం చేస్తారు. అమెరికా ప్రెసిడెంట్ కార్యాలయం "వైట్ హౌస్"లో కూడా ఒక బౌలింగ్ ఆటస్థలి వున్నది.

బాస్కెట్ బాల్ : దాదాపు ప్రతిరాష్ట్రంలోను, సంవత్సరం పొడుగునా విశేషాదరణ పొందుతున్న క్రీడ యిది. సెకండరీ స్కూల్స్ లోను, కాలేజీలలోను జరిగే బాస్కెట్ బాల్ టోర్నమెంటులే లక్షల సంఖ్యలో సందర్శకులను ఆకర్షిస్తున్నవంటే విద్యార్థుల ప్రావీణ్యం ఉన్నతమని ఊహించవచ్చు. అన్ని రాష్ట్రాలలోకి ఇండియానాలో

బాస్కెట్‌బాల్ ఎక్కువగా ఆదరించబడుతున్నది. 328 మంది జనాభా గల స్విట్జిసిటీలు 4500 మంది ప్రేక్షకులకు వసతి కల బాస్కెట్‌బాల్ క్రీడాంగణం వున్నదట.

1948, 1952 ప్రపంచం ఒలింపిక్ బాస్కెట్ బాల్ ఛాంపియన్ షిప్‌ను అమెరికాయే గెలుచుకొన్నది. అమెరికన్ బాస్కెట్‌బాల్ శిక్షకుడు శ్రీ కాఫ్మన్ ఆంధ్రులకు, ఇతర భారతీయులకు ఉన్నత శిక్షణ నిచ్చి వున్నారు.



అమెరికన్ బాస్కెట్‌బాల్ శిక్షకుడు శ్రీ కాఫ్మన్‌తో శ్రీ పి. వేణుగోపాల్

వేట : వేటకు లైసెన్సులు పొందినవారు 1947—48 లో 1, 11, 00, 000 కు పైగా ఉన్నారు. 1956 ఆరంభంలో వీరి సంఖ్య 150 లక్షలకు పెరిగింది.

అమెరికాలో ప్రచారంలోవున్న విచిత్రమైన ఆటలలో 'మోటార్లతో ఫుట్‌బాల్' ఒకటి. గజం వ్యాసం కల బ్లాడర్‌బంతిని మోటార్ల ముందుభాగంతో లేపుకుపోతూ ఈ ఆటను ఆడుతారు. బంతి మోటారు క్రింద పడి పగిలిపోకుండా, మోటారు ముందుభాగం తగులగానే బంతి ఎగిరేటట్లు ఆడడంలోనే నేర్పు అంతా వున్నది.

మంచుగడ్డపై టెన్నిస్‌ఆట అమెరికాలో విశేషంగా ప్రచారంలోకి వస్తున్న కొత్తఆట. పెద్ద మంచుగడ్డపై, ఒక పాదసాధనాన్ని ఆటగాళ్ళు లేక ఆటకత్తెలు తొడుగుకొని పోటీ

చేస్తారు. బంతి తెల్లగావుంటే తెల్లటి మంచుపై స్పష్టంగా కన్పించదనే ఉద్దేశంతో బంతికి నల్లరంగు పూస్తారు. పురుషులకంటె స్త్రీలు ముఖ్యంగా స్కేటర్‌లు ఈఆటలో విశేషాసక్తి చూపుతున్నారు.

లాన్ టెన్నిస్‌లో అమెరికా, ఆస్ట్రేలియాలు పోటాపోటీగా వుంటున్నప్పటికీ కొంతకాలం అమెరికాదే పైచేయిగా వున్నది. నాడు మెక్‌లేగ్లిన్, మొన్న టిల్డన్, నిన్న ట్రాబర్ట్ ప్రపంచ టెన్నిస్ చరిత్రలో నూతనాధ్యాయాలను ప్రారంభించారు. 1947 నుంచి వరుసగా 1951 వరకూ, 1953, 1955 సంవత్సరాలలోనూ అమెరికన్ ఆటగాళ్ళు వింబుల్డన్ ఛాంపియన్‌షిప్పును గెలుచుకొన్నారు. 1946 నుంచి 1956 వరకు వరుసగా ప్రతిసంవత్సరం అమెరికన్ ఆటకత్తెలే వింబుల్డన్ స్త్రీల ఛాంపియన్ షిప్‌ను సాధించారు.

హాకీలో పురుషులతో సమానంగా స్త్రీలు ఆసక్తి చూపుతున్నారు. ఆధునిక హాకీ అమెరికాలో 1901 లో ప్రవేశపెట్టబడినప్పటికీ 1926 లో గాని బాగా ప్రచారంలోకి రాలేదు. ఒలింపిక్ హాకీ పోటీలలో అమెరికా పాల్గొంటున్నది కాని గత మూడు ఒలింపియాడ్‌లలోను కడకు చతుర్థ స్థానమైనా సంపాదించుకోలేక పోయింది.

నవంబర్, డిసెంబర్‌లలో అమెరికన్ బాలికలు, యువతులు ఇతర ఆటలకంటె హాకీకి ప్రాధాన్యమిస్తారు. అమెరికా అంతటా హాకీ నేర్చిన పడతులు దాదాపు 75,000 మంది వున్నారు.

వెయిట్‌లిఫ్టింగ్‌లో, బాక్సింగ్‌లో పెద్ద తరగతులలో ముఖ్యంగా హెవివెయిట్‌లో అమెరికా అగ్రస్థానం వహిస్తూ వున్నది. నిన్న డబ్ల్యూ డేవిస్, నేడు పాల్ ఆండర్సన్ (హెవివెయిట్స్) వెయిట్‌లిఫ్టింగ్‌లో ప్రపంచంలోకెల్ల అగ్రస్థానం వహించారు. ఒక దశబ్దానికి పైగా జోలూయి, ఒక అర్ధ దశాబ్దంపాటు రాకీ మార్సియానో (ఉభయులు హెవివెయిట్స్) ముష్టియుద్ధంలో ప్రపంచాధిపత్యం వహించారు. మార్సియానో ఇటీవలనే ప్రపంచం బిరుదును వదులుకొన్నాడు.

కుస్తీలో ఇతర విధానాలకంటె "ఫ్రీస్టయిల్" అమెరికాలో ఎక్కువగా ప్రచారంలో వున్నది.

మొత్తంమీద చూచినట్లయితే అమెరికాలో ప్రయివేటు సంస్థలు, క్రీడలలో "తలనెరసిన" వారు వివిధక్రీడల ప్రచారానికి, అభివృద్ధికి ప్రశంసనీయంగా పాటుపడుతున్నారని చెప్పవచ్చు. క్రీడలకు ప్రభుత్వ ప్రత్యక్ష సహాయం లేని కొరతను వీరు తీర్చుతున్నారు.

జెస్సీ ఒవెన్స్ (పరుగు ప్రవీణుడు) హాంక్ పీటర్స్ (టెన్నిస్ ప్రవీణుడు) వంటివారలు శిక్షణసంస్థలు స్థాపించి ధనంకంటె క్రీడకు ప్రాధాన్యమిచ్చి సహాయ పడుతున్నారు. అమెరికాలో చాలామంది వ్యాయామ శిక్షకులు ఉచితంగా పనిచేస్తారట.

అమెరికనులు సినిమాను క్రీడల ప్రచారానికి, అభివృద్ధికి చక్కగా వినియోగించుకొంటున్నారు. ఆర్. కె. ఓ., పారమౌంట్, ఎమ్. జి. ఎమ్. ట్వెన్టియత్ సెంచరీఫాక్స్‌వంటి సంస్థలు వివిధక్రీడలపై చిన్న చిన్న చిత్రాలను నిర్మించి, సినిమాథియేటర్లకు, విద్యాసంస్థలకు సప్లయిచేస్తున్నవి. బాబ్‌మాథియాస్ (1948, 1952 ప్రపంచ ఒలింపిక్ డికాథ్లన్ ఛాంపియన్) వంటి ప్రముఖుల విధానాలను సినిమాతీసి శిక్షితులకు ప్రదర్శించి చూపుతున్నారు. భారత పదిరకాల వ్యాయామ క్రీడలలో వ్యాయామాధ్యాపకులు, ఆరోగ్య, విద్యాశాఖ అధికారులు ఈ మార్గాన్ని అనుసరించడం ఎంతయినా అభిలషణీయం.



దిట్ట — బాబ్‌మాథియాస్

అమెరికనులలోని మరొక విశిష్టత బాల్యదశనుంచే వ్యాయామ వినోదాలలో ఆసక్తి పెంపొందింపజేయడం. ఒక్క వేసవిలోనే అమెరికాలో 12,000 యువజన శిబిరాలు నిర్వహించబడడం, అక్కడ అనేక రకాల వ్యాయామం, వృత్తులు నేర్పబడడం, 40,00,000 మంది బాల బాలికలు వాటి సదుపాయాలను పొందకలుగుతూ వుండడం ఈ కృషి ప్రమాణం భారీయని రుజువు చేస్తున్నవి.

ఇన్నివిధాలుగా అమెరికా క్రీడలలో ప్రముఖస్థానం వహిస్తున్నప్పటికీ ఒక హెచ్చరికను చెయ్యక తప్పదు. మొదటనే దీనిని సూచించి వున్నాను. అంతర్జాతీయ ఒలింపిక్ సంఘం అధ్యక్షుడు శ్రీ అవెరీ బ్రండేజ్ నోటినుంచి వెలువడిన హెచ్చరికే యిది. "40-50 ఏళ్ళ క్రితంలోవలె యిప్పుడుకూడా అమెరికాలో ప్రతి పరిసరానికీ (నైబర్‌హుడ్) ఒక ఎథ్లెటిక్ క్లబ్ వుంటే క్రీడారంగంలో అమెరికా రష్యా గురించి భయపడనక్కరలేదు. రష్యాలోవలె అమెరికాలోకూడా క్రీడాప్రవీణునికి వీరుని ప్రతిపత్తి యివ్వాలి. ఈ 'వీరులకు' రష్యాలో వలె యితర వ్యాపకాలేవీ సుతరామూ వుండరాదు."

## వ్యాయామ క్రీడలు

వ్యాయామ క్రీడలలో (ఎథ్లెటిక్స్) ప్రపంచఖ్యాతి గడించిన అమెరికనులలో ముఖ్యులను దిగువ పరిచయం చేస్తున్నాను.

జెస్సీ ఓవెన్స్ : 100 మీటర్ల పరుగులో అమెరికన్ నీగ్రో జెస్సీఓవెన్స్ 1936 లో స్థాపించిన రికార్డు — 10.2 సెకండులు 20 ఏళ్ళ వరకు అధిగమించబడనే లేదు. 1936 లో బెర్లిన్‌లో జరిగిన ప్రపంచ ఒలింపిక్ పోటీలలో దీనిలోను, మరి మూడింటిలో—200 మీటర్ల పరుగు (20.7 సెకండులు) బ్రాడ్ జంప్, 4 × 100 మీటర్ల రిలేపరుగు పందెములలో-ప్రథమస్థానం వహించాడు. ఈయన ప్రస్తుతం చికాగోలో "సౌత్ సైడ్ బాయిస్‌క్లబ్"కు డైరెక్టరుగా వుంటున్నాడు. అక్కడ దాదాపు 1500 మంది బాలురకు వ్యాయామ క్రీడలలో శిక్షణ నిస్తున్నాడు.

పందెపుగుర్రంతో పరుగిడవలసిందిగా ఆయనను కోరినారట! ఓవెన్స్ 1955 అక్టోబరులో ఇండియాలో పర్యటించాడు. (మూడవ పేజీ చూడండి.)

హారిజన్ డిల్లార్డ్ : 1952 హెల్సింకీ ఒలింపిక్స్‌లో 110 మీటర్ల హైహార్డిల్స్‌ను ఈ నీగ్రో 13.7 సెకండులలో పూర్తిచేసి

ఒలింపిక్ రికార్డు స్థాపించాడు. 1936 పిమ్మట జెస్సీఓవెన్స్ వద్ద శిక్షణ పొంది హార్డిల్స్‌లో ప్రపంచఖ్యాతి గడించాడు. 1948 ఒలింపిక్స్‌లో 100 మీటర్ల పరుగులో ఈయన స్వర్ణపతకం పొందాడు. (10.3 సెకండులు). 220 గజాల హార్డిల్స్‌ను 22.3 సెకండులలో పూర్తి చేశాడు. ఇది ప్రపంచం రికార్డు. 200 మీటర్ల హార్డిల్స్‌ను 22.3 సెకండులలో పూర్తిచేశాడు. ఇదీ ప్రపంచపు రికార్డే. 1955 లో స్పోర్ట్స్ ప్రచారానికి డిల్లార్డ్ జరిపిన కృషికి ప్రశంసా చిహ్నంగా అమెరికన్ ఎమచూర్ ఎథ్లెటిక్ యూనియన్‌వారు ఆయనకు జేమ్స్ ఇ. సల్లివాన్ మెమోరియల్ ట్రోఫీ బహూకరించారు.

జె డేవిస్ : 110 మీటర్ల హార్డిల్స్‌లో హారిజన్ డిల్లార్డ్‌తో పాటు ఒలింపిక్ రికార్డును పంచుకొన్న మరొక అమెరికన్ ప్రముఖుడు జె. డేవిస్. ఈయన హెల్సింకీ ఒలింపిక్స్‌లో 110 మీటర్ల హై హార్డిల్స్‌ను 13.7 సెకండులలో పూర్తిచేశాడు.

డబ్ల్యు. డేవిస్ : 1953 లో 6 అడుగుల $11\frac{1}{2}$ అంగుళాల ఎత్తు దూకి ప్రపంచం రికార్డు సాధించిన యోధుడు డబ్ల్యు. డేవిస్.

షెల్టిన్ : ఎర్నీషెల్టిన్ అనే దక్షిణ కాలిఫోర్నియా యూనివర్శిటీ విద్యార్థి 1956 లో 7 అడుగుల ఎత్తు దూకాడు.

వార్మర్ డామ్ : పోల్‌వాల్ట్‌లో ప్రపంచం రికార్డు అమెరికను వశమై వున్నది. ఆయనే సి. వార్మర్‌డామ్. 1943 లో 15 అడుగుల $7\frac{3}{4}$ అంగుళాల ఎత్తుదూకి ఈయన ప్రపంచం రికార్డు స్థాపించాడు.

ఓబ్రీన్ : "షాట్‌పుట్" లో ఎప్పటికప్పుడు ప్రపంచం రికార్డు స్థాపిస్తున్న అమెరికన్ బలశాలి డబ్ల్యు. పి. ఓబ్రీన్. 1954లో ఈయన 58 అడుగుల $2\frac{1}{4}$ అంగుళాల దూరానికి సీసగోళం విసిరి ప్రపంచం రికార్డు స్థాపించాడు. 1956-వ సంవత్సరారంభంలో 59 అడుగుల $2\frac{5}{8}$ అంగుళాల దూరానికి విసిరి ప్రపంచం రికార్డును అధిగమించాడు. తర్వాత 60 అడుగుల గీటునుకూడా దాటినాడు. 1952 ఒలింపిక్స్‌లో

ఈయన 57 అడుగుల $1\frac{3}{8}$ అంగుళాల దూరానికి విసిరి బంగారుపతకం తెచ్చుకొన్నాడు.

ఎఫ్. గార్డిన్ : 'డిస్కస్ త్రో'లో ప్రపంచం రికార్డు స్థాపించి నదికూడా అమెరికనే. శ్రీ ఎఫ్. గార్డిన్ 1953 లో 194 అడుగుల 6 అంగుళాల దూరానికి 'డిస్కస్' విసిరి చరిత్ర సృష్టించాడు.

ఎఫ్. హెల్డ్ : ఈతను 268 అడుగుల $2\frac{1}{2}$ అంగుళాల దూరానికి విసిరి ప్రపంచం రికార్డు నెలకొల్పిన అమెరికన్ బలాఢ్యుడు ఎఫ్. హెల్డ్. విదేశ ప్రవీణులలో చాలామంది ఈయన రికార్డుకు 10 అడుగుల వెనుకకైనా రాలేకపోయారు !

స్త్రీలు : ఎథ్లెటిక్స్‌లో అమెరికన్ కన్యలు ఒక్క ప్రపంచం రికార్డు అయినా పొందివుండలేదు. 4 × 100 మీటర్ల రిలే పరుగులో మాత్రం ఒలింపిక్ రికార్డు సాధించారు. 1952 ఒలింపిక్స్‌లో శ్రీమతులు ఎమ్. ఫాగ్స్, బి. జాన్స్, జె. మోరియో, సి. హార్టీలు కలసి 400 మీటర్ల దూరాన్ని 45.9 సెకండులలో అంచెలంచెలుగా పూర్తిచేసి స్వర్ణపతకం పొందారు.




## బ్రిటన్



ప్రపంచ క్రీడా రంగంలో ఇటీవల అశేష సంచలనం కలిగించినవి రెండు సంఘటనలు. మైలు దూరాన్ని పురుషులు నాలుగు నిమిషాలలోపు, స్త్రీలు ఐదు నిమిషాలలోపు పరుగిడడం దుస్సాధ్యమనే దుర్భ్రమను తొలగించింది బ్రిటిష్ ప్రవీణులే.

శ్రీ రాగర్ బానిస్టర్ 1954 మే ఆరవ తేదీన మైలు దూరాన్ని 3 నిమిషాల 59.4 సెకండులలో పరుగిడి చరిత్ర సృష్టించాడు. నాలుగు నిమిషాలలోపు మైలును పూర్తిచేసిన మొట్టమొదటి మానవుడే ఈ బ్రిటిష్ వైద్య విద్యార్థి (ఇప్పుడు ఈయన డాక్టర్. రికార్డు సృష్టించినప్పుడు విద్యార్థి.)

మరి కొలది నెలలకే శ్రీమతి డియానా లీథర్ మైలును 4 నిమిషాల 50.8 సెకండులలో పరుగిడి చరిత్రగతిని మార్చివేసింది. ఐదు నిమిషాలలోగా మైలు దూరాన్ని పరుగిడిన మొట్టమొదటి లలితాంగి లీథర్.

పోతే ఆధునిక క్రికెట్ కు రూపురేఖలు దిద్దిన ఘనత బ్రిటన్ ది. ఫుట్ బాల్, దానినుంచి రగ్బీ పుట్టినది బ్రిటన్ లోనే. ముష్టియుద్ధం పుట్టుక కూడా ఇంగ్లండులోనే.

ఇండియాకు సంబంధించినంతవరకు ఇండియన్ "పోలో"కు బ్రిటిషర్ల సహాయం చాలా లభించింది. పోలో ప్రాచ్యక్రీడ అయినప్పటికీ ఇండియాలో అది పునరుద్ధరించబడింది బ్రిటిష్ వారి హయాంలోనే.

1948 లో 14-వ ప్రపంచ ఒలింపిక్స్ కు బ్రిటన్ ఆతిథ్యమిచ్చింది. లండన్ లోని వెంబ్లీస్టేడియమ్ లో ఆ పోటీలు జులై 29 న ప్రారంభమైనవి. మూడు పడవ పందెములలో బ్రిటన్ అగ్రస్థానం వహించి మూడు స్వర్ణ పతకాలు పొందింది. అనధికార అంచనాల ప్రకారం - ప్రతి పోటీలో మొదటి ఆరు స్థానాలను సంపాదించిన వారిని లెక్కలోకి తీసుకొని వేసిన లెక్కబట్టి - అప్పుడు బ్రిటన్ కు ఆరవస్థానం లభించింది.

1952 జులై 19-వ తేదీని హెల్సింకీలోని ఒలింపిక్ స్టేడియమ్ లో 15-వ ప్రపంచం ఒలింపిక్ పోటీలు ప్రారంభించబడినవి. అప్పుడు బ్రిటన్ ఒకే ఒక స్వర్ణపతకం బడసింది. గుర్రపుస్వారీ పందెములలో దూకుడు తరగతి పోటీలో ప్రథమస్థానం పొంది ఆ పతకం సంపాదించింది. మరి

రెండు పోటీలలో ద్వితీయ స్థానం, మరి ఎనిమిది పోటీలలో తృతీయ స్థానం సాధించింది. అనధికారరీత్యా వేయబడిన పాయింట్ల లెక్కబట్టి బ్రిటన్‌ది నవమస్థానం మాత్రమే.

1954 ఆగస్టు ఎనిమిదవ తేదీన వాంకోవర్ (కెనడా) లో జరిగిన ఐదవ బ్రిటిష్ ఎంపైర్, కామన్ వెల్తు క్రీడోత్సవంలో బ్రిటన్ ప్రథమ స్థానం సాధించింది.

ప్రపంచం పోటీలలో బ్రిటిష్‌వారికి పతకాలు తక్కువైనప్పటికీ క్రీడలపట్ల భక్తి ఎక్కువ. బ్రిటన్ యువజనాభాలో కనీసం నాల్గవవంతు ఆటలలో పాల్గొంటారు; లేదా క్రీడోత్సవాలకు హాజరౌతారు.

అసోసియేషన్ ఫుట్‌బాల్, క్రికెట్ బ్రిటిష్‌వారికి అత్యంతాభిమానమైన క్రీడలు. ఇంగ్లీష్ ఫుట్‌బాల్ అసోసియేషన్ అనుబంధ సంస్థలు (ఫుట్‌బాల్ క్లబ్స్) ఇంగ్లండులో దాదాపు 23,000 వున్నవి. ఇవికాక సాయుధదళాలలో, పాఠశాలలలో, విశ్వవిద్యాలయాలలో 9000 కు పైగా ఫుట్‌బాల్ క్లబ్బులు వున్నవి.

శీతకాలంలో వారంవారం ఫుట్‌బాల్ మ్యాచీలు ఇంగ్లండు అంతటా నిర్వహించబడుతవి. వాటిలోనే 7,50,000 యువకులు పాల్గొంటారు. ఇవికాక మామూలుగా జరిగే పోటీలలో (ఇన్‌ఫార్మల్ మ్యాచెస్) వేలకొలది ఆటగాళ్ళు పాల్గొంటారు. ఫుట్‌బాల్ వృత్తిగా గల ఆటగాళ్ళమధ్య నిర్వహించబడే పోటీలకు అశేష జనాకర్షణ కలదు. వీటికి హాజరయ్యే ప్రేక్షకులు సగటున వారానికి పది పది హేను లక్షలకు తగ్గరు.

క్రికెట్ కూడా ఫుట్‌బాల్ అంతగా ప్రచారంలో వుంది. ఒక్క ఇంగ్లండులో చూచినట్లయితే ఫుట్‌బాల్ కంటె కూడా క్రికెట్‌కు ఎక్కువ ఆదరణ కలదు.

స్కాట్లెండ్‌లో ఇంగ్లండులో అంతగా క్రికెట్ ప్రచారంలో లేదు. స్కాచ్‌వారికి గోల్ఫ్ అభిమానక్రీడ. శీతకాలంలో స్కాట్లెండ్ అంతటా రగ్బీ విశేషంగా ఆడబడుతుంది.

వేసవిలో వింబుల్డన్‌లో వార్షిక లాన్ టెన్నిస్ ఛాంపియన్ షిప్ పోటీలు నిర్వహించబడుతవి.

బ్రిటన్ అంతటా ఎమెచ్యూర్ ఎథ్లెటిక్ అసోసియేషన్‌లు వర్థిల్లు తున్నవి.

ఈత, సైక్లింగ్, మోటారింగ్, వేట, షూటింగ్, మత్స్యాన్వేషణ పడవచోదన, విమానచోదన, పర్వతారోహణ మున్నగు బహిరంగస్థల క్రీడలుకూడా బ్రిటన్‌లో బాగా ప్రచారంలో వున్నవి. 1953 మే 29-వ తేదీన ఎవరెస్ట్ శిఖరాన్ని ఆరోహించిన జట్టు బ్రిటిష్‌వారిదన్న విషయం ఈ సందర్భంలో గమనార్హం.

అయితే ఎవరెస్ట్ పేరులయినది మటుకు భారతీయుడు టెన్జింగ్, న్యూజిలెండర్ హిల్లరీ.

ఆస్ట్రేలియా అమెరికాలకు టెన్నిస్‌లో పెద్ద పోటీ వున్నట్టు క్రికెట్‌లో బ్రిటన్ ఆస్ట్రేలియాలకు తీవ్రమైన పోటీవుంది. ఈ రెండు దేశాల మధ్య టెస్టుపరంపరలో రబ్బర్ బ్రిటన్ చేతిలో వున్నది. హాకీలో బ్రిటన్ ఇండియాకు పెద్ద పోటీగా పరిణమిస్తున్నది. లండన్ ఒలింపిక్స్‌లో సెమిఫైనలులో బ్రిటన్ పాకిస్తానును 2-0 గోలులతో ఓడించి అంతిమ పోటీలో ఇండియాతో ఢీకొన్నది. ఇండియా 4-0 గోలులతో ఓడించ కలిగింది.

హెల్సింకీ ఒలింపిక్స్‌లో సెమిఫైనలులోనే బ్రిటన్‌కు ఇండియా తటస్థపడింది. ఇండియా 3-1 గోలులతో గెలుపొందకలిగింది.

కుస్తీ, కత్తియుద్ధం, వెయిట్‌లిఫ్టింగ్, ముష్టియుద్ధం, బాస్కెట్ బాల్, నీటి ఆటలు, మంచు ఆటలుకూడా బ్రిటన్‌లో బాగా ప్రచారంలో వున్నవి. కాని వెయిట్‌లిఫ్టింగ్, ముష్టియుద్ధం వినా తక్కినవాటిలో బ్రిటన్ అగ్రశ్రేణిని అందుకొనడంలేదు. ఇంతకుముందు పేర్కొన్న క్రీడల ప్రవీణులను మున్ముందు ఆయా క్రీడలు ప్రస్తావించబడినప్పుడు పరిచయం చేస్తాను.

# వ్యాయామ క్రీడాప్రవీణులు

ఇక్కడ వ్యాయామక్రీడలలో బ్రిటన్ స్థానం పరికించుదాము.

మొదటనే చెప్పినట్లు వ్యాయామక్రీడలలో చరిత్ర సృష్టించినది శ్రీ రోగర్ బానిస్టర్, శ్రీమతి డియానా లీధర్.

(శ్రీ) బానిస్టర్ : 80 ఏళ్ళకు తొలిసారిగా 1954 మే ఆరవ తేదీన ఈయన ఆక్స్ఫర్డ్‌లో ఒక మైలును నాలుగు నిమిషాలలోపు – మూడు నిమిషాల 59 .4 సెకండులలో పరుగిడిన "బ్రిటిష్ జింక" శ్రీ రోగర్ బానిస్టర్. గత 80 ఏళ్ళలో ఏ ఆరోగ్యచక్రవర్తి ఈ మహత్ క్రీడా విజయాన్ని సాధించి వుండలేదు. పరుగులకు టైమ్ రికార్డు చెయ్యడమనేది అప్పటికి 80 ఏళ్ళక్రితం – 1874 లో – ప్రారంభమైంది. బానిస్టర్ తన 25 వ ఏట మైలుపరుగు రికార్డు సంస్థాపించారు. శ్రీ బానిస్టర్‌లో ముఖ్య విశేషం ఆయన "ఏకలవ్యుడు" కావడమే. ఎవ్వరివద్దనూ ఆయన తర్ఫీదు పొంది వుండలేదు. స్వయంశిక్షణపైనే, 1952 ఒలింపిక్ క్రీడోత్స వంలో శ్రీ బానిస్టర్ 1500 మీటర్ల (1640 గజాల) పరుగు పందెములో పాల్గొని చతుర్థస్థానం పొందాడు. 3 నిమిషాల 46 సెకండులలో ఆయన ఆ దూరాన్ని పూర్తిచేశాడు. వ్యక్తిగతంగా తర్ఫీదు పొందడంలో ఆయన విశ్వాసం అచంచలమైనది.

మైలుపరుగుకు స్వకీర్తితో బానిస్టర్ స్థాపించిన రికార్డు పట్టుదలని 46 రోజులయినా నిలవలేదు. ఆస్ట్రేలియన్ పరుగు నిపుణుడు శ్రీ జాన్ లాండీ 1954 జూన్ 21-వ తేదీన ఫిన్లాండ్‌లోని టుర్కూలో ఒక మైలును 3 నిమిషాల 58 సెకండులకే – బానిస్టర్‌కంటె 1 . 4 సెకం డులు తక్కువకే పరుగిడి ఉపచరిత్ర సృష్టించాడు. లాండీ గొప్పవారా? బానిస్టర్ గొప్పవారా? అన్న ప్రశ్న అంతట ఉద్భవించింది. మరొక మాసమున్నరలోనే ఆ ప్రశ్నకూడా పరిష్కారమై పోయింది.

1954 ఆగస్టు 8-వ తేదీన వాంకోవర్‌లో (కెనడా) ఐదవ బ్రిటిష్ ఎంపైర్, కామన్‌వెల్తు క్రీడోత్సవం జరిగింది. అప్పుడు ఒక మైలు

పరుగు పందెములో బానిస్టర్, లాండీలు ఉభయులూ పోటీచేశారు. బానిస్టర్‌కే ప్రథమస్థానం లభించింది. బానిస్టర్ గమ్యం చేరేసరికి లాండీ కొద్ది గజాల వెనుక వున్నాడు. అప్పుడు బానిస్టర్ మైలును 3 నిమిషాల 58.8 సెకండులలో పూర్తిచేశాడు. లాండీకి అదనంగా 0.8 నిమిషాలు పట్టింది.

శ్రీ బానిస్టర్ డాక్టర్ డిగ్రీ తీసుకొన్నమీదట "ఫస్ట్ ఫోర్ మైల్స్" అనే ఉద్గ్రంథం రచించాడు. అందులో తన అనుభవాలను, విజయ మార్గాలను ఆయన వివరించారు. పుస్తకంపై వచ్చే లాభాలలో సగం బ్రిటిష్ ఎమెచూర్ ఎథ్లటిక్ అసోసియేషన్ నిధికి సమర్పించి భావితరాల వారికి ఉడుతాభక్తి సహాయం చేశారు.

డియానా లీధర్ : 80 ఏళ్ళకు తొలిసారిగా మైలును ఐదు నిమిషాలలోపు పరుగిడిన యోధురాలు డియానాలీధర్. 1954 సెప్టెంబర్ 21-వ తేదీన లండన్‌లోని వైట్‌సిటీలో జరిగిన ఒక అంతర్జాతీయ వ్యాయామక్రీడోత్సవంలో ఈమె ఒక మైలు 4 నిమిషాల 45 సెకండులకే పరుగిడింది. అంతకుముందే ఆమె మైలు పరుగుకు చరిత్ర సృష్టించింది. మైలుదూరానకల గమ్యాన్ని 4 నిమిషాల 50.8 సెకండులకు చేరు కొన్నది. అంతకుముందు ఏ మహిళా ఐదునిమిషాల లోపు పరుగుతో మైలును జయించలేదు. 800 మీటర్ల పరుగు, 1500 మీటర్ల పరుగులలో కూడా ఈమె ప్రపంచంలోకెల్ల అద్వితీయురాలు.

మెక్ బైలి : 100 మీటర్ల పరుగుకు ప్రపంచం రికార్డును ఐదుగురు పంచుకొని వున్నారు. 1951 లో బ్రిటిష్ ప్రముఖుడు ఇ. మెక్ బెయిలి ఈ దూరాన్ని 10.2 సెకండులలో పూర్తిచేసి ఓవెన్స్ రికార్డుతో సమమైనాడు.

బి. హ్యూస‌న్ : 800 మీటర్లు, 1500 మీటర్లు పరుగు పందెములలో బ్రిటన్‌లో కెల్ల ప్రముఖస్థానం వహిస్తున్న యువకుడు శ్రీ బి. హ్యూసన్. ఈయన 1955 లో 800 మీటర్ల దూరాన్ని 1 నిమిషం 47.8

సెకండులలో పరుగెడాడు. ఈ దూరానికి ఒలింపిక్ రికార్డు 1 నిమిషం 49.2 సెకండులు. 1955 లో బ్రిటిష్ అథ్లెట్ లలో అద్వితీయ ప్రతిభ ప్రదర్శించినందుకు శ్రీ హ్యూ్యాసన్ కు బ్రిటిష్ ఎమచూర్ అథ్లెటిక్ అసోసియేషన్ సి. ఎన్. జాక్సన్ మెమోరియల్ కప్పును బహూకరించింది.

క్రిస్ ఛటావే: 1500 మీటర్ల పరుగు పందెములో ప్రథమ శ్రేణిలోని వారిలో శ్రీ సి. ఛటావే ఒకరు. 1500 మీటర్లను ఈయన 3 నిమిషాల 43.6 సెకండులకే పూర్తి చేయకలుగుతున్నారు. ఒలింపిక్ రికార్డుకంటె యిది 1.6 సెకండులు తక్కువ. ఈయన కొంతకాలం ఇండిపెండెంట్ టెలివిజన్ న్యూస్ విలేకరిగా పనిచేశాడు. బి. బి. సి. ఆయనను ఆహ్వానించింది.

శ్రీ కె. వుడ్: 1955 లో ఒక మైలు పరుగుపందెములో పాల్గొంటూ 1500 మీటర్లను (1640 గజాలు) 3 నిమిషాల 44 సెకండులలో పూర్తిచేశాడు.

జి. పిరీ: దూరపు పరుగు పందెములలో ప్రపంచ ప్రసిద్ధి గాంచిన వ్యక్తి శ్రీ జి. పిరీ. 5,000 మీటర్లను 14 నిమిషాల 3.8 సెకండులలోను (ఒలింపిక్ రికార్డు 14 నిమిషాల 6.6 సెకండులు), 10,000 మీటర్లను 29 నిమిషాల 19 సెకండులలోను (ఒలింపిక్ రికార్డు దీనికి 2 సెకండులు తక్కువ) ఈయన పూర్తి చెయ్యకలుగుతున్నాడు.

శ్రీ జె. డిస్లే: హెల్సింకీ ఒలింపిక్ పోటీలలో 3,000 మీటర్ల స్టీపుల్ ఛేజ్ పరుగు పందెములలో కంచుపతకం పొందిన ప్రముఖుడు శ్రీ డిస్లే. 1955 లో ఈరకపు పరుగును ఈయన 8 నిమిషాల 44.2 సెకండులలో పూర్తిచేశాడు. ఈయన ప్రావీణ్యం గుర్తించి 1955 లో బ్రిటిష్ ఎమచూర్ ఎథ్లెటిక్ అసోసియేషన్ హార్వే మెమోరియల్ గోల్డ్ కప్పు బహూకరించింది.

వ్యాయామ క్రీడలలో అమెరికా, రష్యా, ఆస్ట్రేలియాల స్థాయిని బ్రిటన్ అందుకొనే సూచనలు ప్రస్తుతం కన్పించడంలేదు.

# ఆస్ట్రేలియా



లోగడ ఒక సందర్భంలో చెప్పినట్లు ఆస్ట్రేలియా భాగ్యవంతమైన దేశం; తక్కువ జనాభా, ఎక్కువ వైశాల్యంకల ప్రాంతం; అనుకూలమైన శీతోష్ణంకల ప్రదేశం; పుష్టికరమైన ఆహారం పుష్కలంగా లభించే రాజ్యం.

అందుచేతనే ఆస్ట్రేలియా వ్యయభరితమైన బిలియార్డ్స్, స్నూకర్, టెన్నిస్, క్రికెట్ వంటి ఆటలలో జగత్ప్రసిద్ధులను కన్నది. వ్యాయామ క్రీడలలో సయితం కొందరి ఆస్ట్రేలియనుల ఖ్యాతి పృథ్వి వ్యాపితమైనది.

శ్రీయుతులు జో డేవిస్, రాబర్ట్ మార్షల్ (బిలియార్డ్స్), ఫ్రెడ్ డేవిస్, హొరేస్ లింద్రమ్ (స్నూకర్), సెడ్జిమన్, హోడ్ (టెన్నిస్), డోనాల్డ్ బ్రాడ్మన్, మిల్లర్, లింద్వాల్ (క్రికెట్), లాండీ (మైలు పరుగు), శ్రీమతి ఎస్. డి. లాహంటీ (100 మీటర్ల పరుగు), శ్రీమతి ఎమ్. జాక్సన్ (200 మీటర్ల పరుగు) మున్నగు క్రీడా చారిత్రక పురుషులను కన్న దేశం ఆస్ట్రేలియా.

1948 లండన్ ఒలింపిక్స్‌లో ఆస్ట్రేలియా పాయింట్ల అనధికార అంచనా ప్రకారం 11-వ స్థానం సంపాదించింది. హైజంప్‌లోను, పడవచోదనలోను (రోయింగ్) స్వర్ణపతాకాలు సంపాదించింది.

1952 హెల్సింకీ ఒలింపిక్స్‌లో పాయింట్ల అనధికార అంచనా ప్రకారం తిరిగి 11-వ స్థానం సాధించింది. ఆరు స్వర్ణపతాకాలు, రెండు వెండి మెడల్సు, మూడు కంచు పతాకాలు పొందింది.

1954 లో వాంకోవర్‌లో జరిగిన ఐదవ బ్రిటిష్ ఎంపైర్, కామన్ వెల్తు క్రీడోత్సవంలో ఆస్ట్రేలియా ద్వితీయస్థానం వహించింది.

ముందొకమారు పేర్కొన్నట్లు 'పసితనంలో వున్న భవిష్యద్ప్రవీణులను ఏరి శిక్షణ నివ్వాలి' (Catch them Young) అన్న సిద్ధాంతాన్ని

తు. చ. తప్పకుండా ఆచరిస్తున్న దేశాలలో ఆస్ట్రేలియా ఒకటి. అచ్చట స్కూలుదశలోనే ప్రతిబాలుడు, బాలికా క్రీడలు అభ్యసిస్తారు. పసితనంలోనే క్రికెట్ అభ్యసించి బంతి వశంచేసుకొనే (Ball Sense) విధానా లన్నింటిని గ్రహిస్తారు. తర్వాతవారికి ఉన్నత శిక్షణ గరపబడు తుంది. వ్యాయామ క్రీడల విషయంలో కూడా ఇంతే.

బాల బాలికల, యువతీ యువకుల జీవనవ్యయప్రమాణం బట్టి ఉచితంగా, స్వల్పరుసుంపై వివిధ క్రీడలలో శిక్షణనిచ్చే సదుపాయం ఆస్ట్రేలియా అంతటా వున్నది. స్పోర్ట్సు పరికరాలు ఉచితంగా లేదా చౌకగా యివ్వడానికి కూడా ఏర్పాట్లు వున్నవి. ఆస్ట్రేలియాలో దాదాపు ప్రతియింటి ఆవరణలోను ఒక టెన్నిస్ కోర్టు వున్నదంటే అభ్యాసానికి ఎంత అవకాశ మున్నదో వేరే చెప్పనవసరంలేదు.

క్రీడల శిక్షణ ప్రణాళిక సత్ఫలితాలను ఆస్ట్రేలియా పొందుతూనే వున్నది. సెడ్జిమన్, మెర్విన్ రోజ్, రోజ్వాల్, హోడ్, అర్కిన్ స్టాల్ మున్నగువా రంతా ఇట్టి శిక్షణపొందే అగ్రగణ్యులైనారు.





డాన్ బ్రాడ్మన్

బాలుర క్రీడాప్రావీణ్యాన్ని పసికట్టి పైకి తేవడానికి ఆస్ట్రేలియా ఎంతగా శ్రద్ధ వహిస్తుందో బ్రాడ్మన్ జీవితమే చెబుతూంది.

ఆయన చిన్నతనంలో బౌరాల్ (ఆస్ట్రేలియా)లో తనకంటె పెద్దవాళ్ళతో క్రికెట్ ఆడుతూ ఉండేవాడు. బాల బ్రాడ్మన్ అక్కడ బ్యాట్ చేస్తూవుంటే ఆరుగురు యువకులు వరుసగా వెంట వెంటనే గుక్క త్రిప్పుకొనే విరామంకూడా లేకుండా 'బౌల్' చేస్తూ వుండేవారు. .వికెట్ పడకుండా బ్రాడ్మన్ ప్రతి బంతినీ త్రిప్పి కొట్టేవాడట. ఆయన తీక్ష్ణదృష్టి, వేగం చూపరులకు అచ్చెరువు గొల్పింది. అగ్ర ఆటగాళ్ళతో ప్రాక్టీసు యిప్పించడానికి ఆస్ట్రేలియన్ క్రికెట్ సంస్థ మాస్టర్ బ్రాడ్మన్‌ను వెంటనే సిడ్నీకి తీసికొని వెళ్ళింది.

బ్రాడ్మన్ విషయమై అప్పుడు అంతగా శ్రద్ధ వహించి వుండక పోతే ఆయన క్వీన్స్‌లాండ్‌పై 452 పరుగులుచేసికూడా ఔట్ కాకుండా ప్రపంచం రికార్డును సృష్టించి వుండేవారా?

ఆస్ట్రేలియాలో స్త్రీలలో కూడా క్రికెట్ ఆట విశేషంగా ప్రచారంలో వుంది. 1951లో ఆస్ట్రేలియన్ స్త్రీల క్రికెట్ జట్టు బ్రిటన్‌లో పర్యటించింది. ఆస్ట్రేలియాలో స్త్రీల క్రికెట్ సంఘాలు 120 కి పైగా వున్నవి.

## వ్యాయామక్రీడలు – వ్యాయామ క్రీడావేత్తలు

వ్యాయామ క్రీడలలో ప్రపంచఖ్యాతి గాంచిన ఆస్ట్రేలియనుల గురించి పరికించుదాము.

ప్రపంచ వ్యాయామక్రీడలు (ఎథ్లెటిక్స్) గురించి ప్రస్తావించినా, ఆస్ట్రేలియన్ క్రీడాప్రవీణుల గురించి ప్రస్తావించినా వెంటనే జ్ఞాపకం వచ్చే యోధుడు జాన్‌లాండీ.

జాన్‌లాండీ : 1954 జూన్ 21 వ తేదీ జాన్ లాండీ జీవిత చరిత్రలోనేకాక మైలుపరుగు చరిత్రలో కూడా ఒక మైలురాయి. అప్పటికి 45 రోజుల క్రితం బ్రిటిష్ పరుగు ప్రవీణుడు శ్రీ బానిస్టర్ మైలును 4 నిమిషాలలోపు – 3 నిమిషాల 59.4 సెకండులలో – పరుగిడి చరిత్ర సృష్టించారు. క్రీడాచరిత్రకారులు ఆయన గురించి వ్రాస్తున్న చరిత్ర సిరా ఆరకముందే లాండీ తన పేరునూ వ్రాయవలసిన అగత్యాన్ని నిరూపించారు. 1954 జూన్ 21 వ తేదీన ఫిన్లండ్‌లోని టుర్క్యాలో బ్రాషెర్, ఛాటవే ప్రభృతులతో లాండీ మైలుదూరానికి పరుగిడి క్రొత్త ప్రపంచం రికార్డు సృష్టించారు. బానిస్టర్ కంటె 1.4 సెకండులు తక్కువకే మైలును అంఘించారు. లేడిని పోలిన లాండీ మైలుకు తీసుకొన్న కాలం 3 నిమిషాల 58 సెకండులు మాత్రమే.

1954 జూన్ 21 నే మరొక ప్రపంచం రికార్డును లాండీ కించపరిచారు. 1500 మీటర్లను (1640 గజాలు) 3 నిమిషాల 41.8

సెకండులలోనే లాండీ పరుగిడి కొత్త ప్రపంచ రికార్డు స్థాపించారు. రెండు మైళ్ళను 8 నిమిషాల 42.4 సెకండులలో పరుగిడారు.

తరువాత 1954 ఆగస్టులో వాంకోవర్‌లో కామన్‌వెల్తు క్రీడోత్సవంలో ఆస్ట్రేలియన్ దళంతోపాటు పాల్గొన్నారు. మైలు పరుగుపోటీకి బానిస్టర్ కూడా దిగినారు. ఉభయులూ 4 నిమిషాల లోపునే పందెం పూర్తిచేశారు కాని గమ్యం చేరేటప్పటికి లాండీ బానిస్టర్‌కంటె కొద్ది గజాలు వెనుకపడ్డారు. బానిస్టర్ 3 నిమిషాల 58.8 సెకండులలోను, లాండీ 3 నిమిషాల 59.6 సెకండులలోను టేపును త్రోయకలిగారు. లాండీకి అంతకుముందు పాదానికి దెబ్బతగిలి వున్నదట. అయినప్పటికీ అద్భుతమైన వేగంతో పరుగిడారు. లాండీ ప్రచారం కోరని వ్యక్తికాబట్టి తన గాయం గురించి పోటీ జరిగిన చాల రోజులకుగాని చెప్పనేలేదు.

ఫిన్లెండుకు రాకముందు స్వీడెన్‌లోను, ఫిన్లెండులో రికార్డు సృష్టించినమీదట స్విట్జర్లెండులోను లాండీ పర్యటించారు.

1956 జనవరి 28వ తేదీన మెల్బోర్న్‌లోని ఒలింపిక్ పార్కులో ప్రత్యేకంగా మైలుదూరం పరుగిడి నాలుగు నిమిషాల హద్దును, (ఫోర్ మినిట్ బారియర్) తిరిగి అధిగమించారు. ఈసారి 3 నిమిషాల 58.6 సెకండులలో మైలుదూరం పరుగిడారు.

1955 లో మైలు పరుగు పోటీనుంచి లాండీ విరమించారు కాని 1956 లో తిరిగి పాల్గొని రెండుసార్లు '4 నిమిషాల హద్దు'ను పటాపంచలు చేశారు. 1956 లో రెండవసారి, 1956 ఏప్రిల్ 7-వ తేదీన, మైలును 3 నిమిషాల 58.6 సెకండులలో పరుగిడారు. అంటే దీనితో కలిపి మొత్తం నాలుగుసార్లు మైలును 4 నిమిషాలలోపు లాండీ పరుగిడినారన్నమాట.

లాండీ వయస్సు 25 సంవత్సరాలు. విక్టోరియారాష్ట్రంలోని జిలాంగ్ గ్రామర్‌స్కూల్‌లో టీచర్‌గా వుంటున్నారు. శాన్‌ఫ్రాన్సిస్కోలోని పబ్లిక్ రిలేషన్స్‌కంపెనీ ఆహ్వానంపై 1956 మే లో లాండీ అమెరికాలో పర్యటించారు.

"ఫ్లయింగ్ మిల్క్‌మాన్" : వ్యాయామ క్రీడలకు సంబంధించి నంతవరకు ఆస్ట్రేలియనులలో ఇప్పటివారిలో లాండీ తర్వాత చెప్పదగిన వారు "ఫ్లయింగ్ మిల్క్‌మాన్"గా పేరొందిన శ్రీ డేవీ స్టీవెన్స్ అనే విక్టోరియారాష్ట్ర నివాసి. ఆరుమైళ్ళ పరుగులో ఎమిల్ జటోపెక్ రికార్డునే అధిగమించినంతటి యోధుడు ఈయన. 1956 జనవరి 25 వ తేదీన మెల్బోర్న్‌లో ఆరుమైళ్ళ పరుగు పోటీలో పాల్గొంటూ ఆ దూరాన్ని 27 నిమిషాల 54 సెకండులలోనే పూర్తిచేశారు. ఇది ఎమిల్ జటోపెక్ ప్రపంచపు రికార్డుకంటె 5.2 సెకండులు తక్కువ.

ఇదే పందెంలో ఐదుమైళ్ళవరకు చూచినట్లయితే స్టీవెన్స్ అనధికార రీత్యా ప్రపంచపు రికార్డు సృష్టించినట్లే. 23 నిమిషాల 22.2 సెకండులలో ఐదుమైళ్ళను ఆయన దాటారు.

పరుగులోని మొదటి ఘట్టాలలో తోటి ఉజ్జీలను ముందుకు పోనిచ్చి, చివరి రెండు ఘట్టాలలో అద్భుత వేగంతో పరుగిడడం స్టీవెన్స్ విధానం.

స్టీవెన్స్ పాల వ్యాపారి. మెల్బోర్న్ శివార్లకు ఒక చెంప క్షీరం సప్లయి చేస్తునే వేరొక చెంప పరుగులో శిక్షణపొందుతూ వుండేవారు. అందుచేత ఆయనకు "ఎగిరే పాలవాడు" — "ఫ్లయింగ్ మిల్క్‌మాన్" — అనే చిలిపిపేరు పెట్టబడింది. 25 ఏళ్ళ వయసుకల స్టీవెన్స్ ప్రస్తుతం ఒక యాత్రాసంస్థ సేల్స్‌మన్‌గా పనిచేస్తున్నారు.

శ్రీ స్టీవెన్స్ 5000 మీటర్ల (3 మైళ్ళ 188 గజాల) పరుగులో కూడా ఘటికులు. 1955 డిసెంబర్‌లో మెల్బోర్న్‌లోనే ఈయన ఈ దూరపు పరుగులో జగద్విఖ్యాతులైన హంగేరియన్ 'విహంగాలు' లాజ్లో టబోరి, సాండోర్ ఐహారోస్‌లను ఓడించివేశారు. ఈ విజయమే ఆయనకు ప్రపంచఖ్యాతి తెచ్చింది. స్టీవెన్స్ 5000 మీటర్లను 14 నిమిషాల 7.2 సెకండులలో పరుగిడారు. గమ్యంవద్ద ఈతనికంటె 10 గజాలు వెనుకపడ్డ టబోరి ద్వితీయస్థానం, 25 గజాలు వెనుకపడ్డ ఐహారోస్ తృతీయస్థానం పొందారు. హెల్సింకీ ఒలింపిక్స్‌లో ఎమిల్

జటోపెక్ స్థాపించిన రికార్డుకు స్టీవెన్స్ రికార్డు . 6 సెకండులుమాత్రమే హెచ్చు.

స్త్రీలు :- ఎమ్. జాక్సన్ : ఈమె 1952 హెల్సింకీ ఒలింపిక్స్‌లో రెండు స్వర్ణపతకాలు పొందడమేకాక రెండు పరుగు పందెములలో ఒలింపిక్ రికార్డును సృష్టించారు. హెల్సింకీలో ఈమె 100 మీటర్ల దూరాన్ని 11 . 5 సెకండులలోను, 200 మీటర్ల దూరాన్ని 23 . 4 సెకండులలోను లంఘించి ప్రథమస్థానం వహించారు. 23 . 4 సెకండులు ప్రపంచపు రికార్డుకూడా.

మిసెస్ డీలా హంటీ : 100 మీటర్ల పరుగులో ప్రపంచపు రికార్డు హోల్డర్ శ్రీమతి ఎస్. డీలా హంటీ. ఈమె 1955 లో ఈ దూరాన్ని 11 . 3 సెకండులలో పరుగిడి ఈ రికార్డును స్థాపించారు. 200 మీటర్ల పరుగులో ఈమె రికార్డు 24 . 1 సెకండులు. హెల్సింకీ ఒలింపిక్స్‌లో 80 మీటర్ల హార్డిల్స్ పందెములో ఈమె ప్రథమస్థానం వహించారు. 10 . 9 సెకండులలో ఆమె ఆ దూరాన్ని పూర్తిచేశారు.

1956 నవంబర్‌లో 16 వ ప్రపంచం ఒలింపిక్ పోటీలు మెల్బోర్న్‌లో (ఆస్ట్రేలియా) జరిగినవి.

## హంగరీ



వ్యాయామ క్రీడలలోను, టేబుల్ టెన్నిస్, ఫుట్‌బాల్, కత్తియుద్ధం, ముష్టియుద్ధం, కుస్తీ, షూటింగ్ లలోను ప్రపంచ క్రీడాపటంలో ప్రముఖస్థానం వహిస్తున్న దేశం హంగరీ.

హెల్సింకీ ఒలింపిక్స్‌లో హంగరీ తృతీయస్థానం పొందింది. మొత్తం 16 స్వర్ణపతకాలు, 10 రజతపతకాలు, 15 కంచుపతకాలు సాధించింది.

1948 లండన్ ఒలింపిక్స్‌లో కూడా హంగరీ ప్రశంసనీయమైన విజయం చేపట్టింది. అనధికార పాయింట్ల అంచనా ప్రకారం అప్పుడు హంగరీది చతుర్థస్థానం. పది స్వర్ణ పతకాలు సాధించింది.

బెల్లాక్, సిడో‌ల వంటి టేబుల్ టెన్నిస్ ఆటగాళ్ళను, పుస్కాస్, కొక్సిస్ వంటి సాకర్ ఆటగాళ్ళను కన్న దేశం హంగరీ.

పిస్టల్ ప్రేల్పులో జగత్ప్రసిద్ధిగన్న శ్రీ టకాక్స్ కూడా హంగరియన్. ఈయన ఒంటిచేతివాడు. కుడిచేయి లేనే లేదు. లండన్ ఒలింపిక్స్‌లో 25 మీటర్లకు రాపిడ్ ఫైర్ పిస్టల్ ప్రేల్పు పోటీలో ఈయన స్వర్ణ పతకం పొందారు.

ఇక పోతే పరుగు రంగంలో ప్రపంచమంతటా గౌరవించబడుతున్న ఐహారోస్, టబోరీలు హంగెరియనులు.

జగత్ప్రసిద్ధిగాంచిన హంగెరియన్ వ్యాయామ క్రీడా ప్రవీణులలో (ఎథ్లెట్స్) ముఖ్యులు గురించి యిక్కడ ప్రస్తావిస్తాను :

ఐహారోస్ : 1500 మీటర్ల (1640 గజాలు), 5000 మీటర్ల (3 మైళ్ళ 188 గజాలు) పరుగు పందెములు రెండింటిలోను ప్రపంచపు రికార్డులు సాధించినది హంగెరియన్ యువకుడు శ్రీ ఎస్. ఐహారోస్. 1955 లో ఈయన ఈ రెండు రికార్డులను స్థాపించి వున్నారు. 1500 మీటర్లను 3 నిమిషాల 40.9 సెకండులలోను, 5,000 మీటర్లను 13 నిమిషాల 40.6 సెకండులలోను ఈయన పరుగిడారు. 5000 మీటర్లలో ఎమిల్ జటోపెక్‌ను మించినారన్నమాట. జటోపెక్ ఒలింపిక్ రికార్డు 14 నిమిషాల 6.6 సెకండులు. 3 మైళ్ళ పరుగుకు ప్రపంచం రికార్డును ఐహారోస్ స్థాపించివున్నారు. 1954 డిసెంబరు, 1955 జనవరి నెలలలో ఈయన ఆస్ట్రేలియాలో పర్యటించారు. డిసెంబరు 14-వ తేదీన మెల్బోర్న్‌లో రెండు మైళ్ళ పరుగులో ఈయన "ఫ్లయింగ్ మిల్క్‌మాన్" స్టీవెన్స్‌ను (ఆస్ట్రేలియా) ఓడించారు.

శ్రీ ఎల్. టబోరి : 1500 మీటర్ల పరుగులో ప్రపంచపు రికార్డును తోటి దేశస్థుడు శ్రీ ఎస్. ఐహారోస్‌తో పంచుకొన్న హంగేరియన్ యువకుడు శ్రీ ఎల్. టబోరి. 1955 లోనే ఈయన ఈదూరాన్ని 3 నిమిషాల 40.9 సెకండులలో పరుగిడి ప్రపంచం రికార్డును అందుకొన్నాడు. ఈయనకూడా 1954 డిసెంబర్, 1955 జనవరి మాసాలలో ఆస్ట్రేలియాలో పర్యటించారు. 1954 డిసెంబర్ 14 తేదీన మెల్బోర్న్‌లో రెండుమైళ్ళ దూరానికి జరిగిన పరుగుపందెములో స్టీవెన్స్‌ను (ఆస్ట్రేలియా) ఓడించివేశారు.

శ్రీ. జె సెర్మాక్ : హామర్‌ను 200 అడుగులకు మించి విసర కలిగిన దాదాపు డజనుమంది ప్రపంచ యోధులలో శ్రీ జె. సెర్మాక్ ఒకరు. ఒలింపిక్ రికార్డుకంటె 3 అడుగుల 9 అంగుళాలు ఎక్కువ దూరానికి హామర్‌ను ఈయన విసిరారు. 1955లో ఈ ఘనకార్యం సాధించారు. అప్పుడు 201 అడుగుల $8\frac{1}{2}$ అంగుళాల దూరానికి హామర్ విసిరివేశారు.

స్త్రీలు:- శ్రీమతి సెజ్జ్‌మెల్వి : 100 మీటర్ల పరుగులో స్త్రీలకు ఒలింపిక్ రికార్డు 11.5 సెకండులు. హంగరియన్ కన్య వి. సెజ్జ్‌మెల్వి. 1955 లో ఈ రికార్డుతో సమమైనది. ఇదే సంవత్సరంలో ఈమె 200 మీటర్లను 24.1 సెకండులలో పరుగిడింది. ఒలింపిక్ రికార్డుకంటె .7 సెకండులు ఇది ఎక్కువ.

శ్రీమతి గ్యార్మాటి : లండన్ ఒలింపిక్స్‌లో లాంగ్ జంప్‌లో స్వర్ణపతకం పొందిన హంగరి మహిళ ఈమె. 18 అడుగుల $8\frac{1}{4}$ అంగుళాల దూరానికి ఈమె దూకినారు. 14 వ ప్రపంచపు ఒలింపిక్స్‌లో పాల్గొన్న హంగెరియన్ వనితలలో ఈమె ఒక్కతే స్వర్ణపతకం సాధించారు

# స్వీడెన్



ప్రపంచ క్రీడా పటంలో ప్రముఖస్థానం వహిస్తున్న దేశాలలో స్వీడెన్ ఒకటి.

ఫుట్‌బాల్, కుస్తీ (గ్రీకో రోమన్ పద్ధతి), గుర్రపు స్వారీ, దూరపు నడక, కసరత్తు, టెన్నిస్‌లలో ఈ యూరోపియన్ దేశం అనేక మంది అగ్రజులను సృష్టించింది. దూరపు నడకలో స్వీడెన్‌ది ప్రపంచంలోకెల్ల అగ్రస్థానం. స్వీడెన్ అడవుల మయమైన దేశమనీ, గ్రామానికీ గ్రామానికీ, పట్టణానికీ పట్టణానికీ చాలా దూరమనీ, ప్రాచీనులు, నిన్న మొన్నటివారు కూడా ఇంతింత దూరమూ కాలినడకనే పోతూ వుండే వారనీ, అందుచేతనే నడకపందెంలో వారు ప్రపంచంలోకెల్ల అగ్రస్థానం వహించకలుగుతున్నారనీ భావించబడుతున్నది.

స్వీడెన్‌లో అఖిలదేశ క్రీడా సంస్థ పార్లమెంటు పద్ధతిని నిర్వహించబడడం గమనార్హమైనది. వివిధ క్రీడా సంఘాలు "ఇడ్రాట్స్ రిక్స్ డేగ్" (Idrotts Riks Dag) (స్పోర్ట్స్ పార్లమెంట్) కు తమ ప్రతినిధులను ఎన్నుకొంటవి. స్వీడిష్ కామన్సు సభ నిర్వహించబడుతున్న విధంగానే ఈ స్పోర్ట్స్ పార్లమెంటు కార్యక్రమాలు నిర్వహించబడుతవి. దీనినిబట్టి క్రీడలకు స్వీడిష్ ప్రజలు ఎంతటి గౌరవస్థానమిస్తారో ఊహించవచ్చు.

స్వీడిష్ పరుగు ప్రవీణుల, నడక ప్రవీణుల శిక్షణవిధాన మొకటి ప్రత్యేకంగా చెప్పదగింది. సాధారణంగా యూరోపియన్, అమెరికన్ ఎథ్లెట్‌లు 'ట్రాక్' పైనే తర్ఫీదు పొందుతారు. కాని స్వీడిష్ పరుగు, నడక ప్రవీణులు అడవులలోనే తమ విద్యకు మెరుగులు దిద్దుకొంటారు.

అడవులలో సంచారం సంప్రదాయసిద్ధంగా వస్తున్నందున స్వీడిష్ ప్రజలు ఆ సంప్రదాయాన్నే అంటిపెట్టుకొని వున్నారట.

1956 జూన్‌లో 16 వ ప్రపంచ ఒలింపిక్ గుఱ్ఱపుస్వారీ పోటీలు స్టాక్‌హోమ్ (స్వీడెన్ రాజధాని)లో జరిగినవి. ఇతర యూరోపియన్ దేశాలలోవలె స్వీడెన్‌లో కూడా శాస్త్రీయ వ్యాయామం (జిమ్నాస్టిక్స్) ప్రజల అభిమానాన్ని విశేషంగా చూరగొన్నది. శ్రీ పెర్ హెన్రిక్ లింగ్ శాస్త్ర వ్యాయామంలో విశిష్టరీతులను కనిపెట్టి ప్రచారంలోకి తీసుకొని వచ్చారు.

1952 హెల్సింకీ ఒలింపిక్స్‌లో పాయింట్ల అనధికార అంచనా బట్టి స్వీడెన్ చతుర్థస్థానం సాధించింది. 12 స్వర్ణపతకాలు, 12 రజత పతకాలు, తొమ్మిది కంచుపతకాలు సంపాదించింది. 1948 లండన్ ఒలింపిక్స్‌లో రష్యా లేనికారణంగా ద్వితీయస్థానాన్ని సంపాదించింది. అప్పుడు (లండన్ క్రీడోత్సవంలో) రోయింగ్ (పడవచోదన), హాకీ, బాస్కెట్ బాల్‌లలో తప్ప తక్కిన అన్నింటిలోను కనీసం ఐదవ, ఆరవ స్థానమైనా సంపాదించింది.

1948 లో స్వీడెన్ ఒలింపిక్ ఫుట్‌బాల్ ఛాంపియనులు. 1952లో సెమిఫైనల్సులో హంగరియనులచే ఓడించబడినారు. కాని కంచుపతకం సంపాదించారు. కుస్తీలో గ్రీకో రోమన్ పద్ధతిలో ఆ రెండు ఒలింపిక్స్‌లోను స్వర్ణ, రజత పతకాలు సంపాదించింది.

గుర్రపుస్వారీ పోటీలలో (ఏక్వెస్ట్రియన్) 14 వ ఒలింపిక్స్‌లో ఒక టీమ్ ఛాంపియన్‌షిప్‌ను, 15 వ ఒలింపిక్స్‌లో రెండు వ్యక్తిఛాంపియన్ షిప్‌లను సాధించింది. 10 కిలోమీటర్ల నడకలో రెండు ఒలింపిక్స్‌లోనూ స్వీడిష్ యోధుడే స్వర్ణపతకాలు బడశారు.

స్వీడెన్ గురించి ప్రస్తావించినప్పుడు వెంటనే జ్ఞప్తికివచ్చే వ్యక్తి "స్వీడిష్ ఏంజెల్" గా వ్యవహరించబడుతున్న టూర్ జాన్సన్ అనే అమెరికన్ ఫ్రీస్టయిల్ వస్తాదు. షుమారు 47 సంవత్సరాల వయసుగల

ఈ మల్లవీరుడు కింగ్ కాంగ్ అంతటివానిని 1953 లో బొంబాయిలో ఓడించారు. 6 అడుగుల 5 అంగుళాల ఎత్తువుండి, దాదాపు 550 పౌనులు బరువుకల ఈ యోధుడు జన్మించినప్పుడే 14 పౌనుల బరువు వున్నాడట !

భారతీయులకు సుపరిచితులైన స్వీడిష్ ప్రముఖులు బెర్గిలిన్, జాన్సన్ అనే టెన్నిస్ ఆటగాళ్ళు. భారతదేశంలో టెన్నిస్ క్రీడాభివృద్ధికి దోహదమిచ్చిన వారిలో బెర్గిలిన్ ఒకరని నిస్సందేహంగా చెప్పవచ్చు.

## వ్యాయామ క్రీడా వేత్తలు

హార్డ్ మో : స్వీడిష్ వ్యాయామ క్రీడా వేత్తలలో కెల్ల ప్రప్రముఖుడు శ్రీ వి. హార్డ్ మో. ఈ నడక ప్రవీణుడు 5000 మీటర్ల (3 మైళ్ళ 188 గజాలు), 10,000 మీటర్ల (6 మైళ్ళ 376 గజాలు) నడకలో ప్రపంచపు రికార్డులను స్థాపించి వున్నారు.

1945 లో ఈయన నెలకొల్పిన లోకప్రమాణాలు:- 5,000 మీటర్ల నడకకు 20 నిమిషాల 26.8 సెకండులు, 10,000 మీటర్ల నడకకు 42 నిమిషాల 39.6 సెకండులు.

శ్రీ మికేల్సన్ : 10,000 మీటర్ల నడకలో ఒలింపిక్ రికార్డు హోల్డర్ శ్రీ. జె. ఎఫ్. మికేల్సన్ అనే స్వీడిష్ ప్రముఖుడు. హెల్సింకీ ఒలింపిక్స్‌లో ఈయన ఈ దూరాన్ని 45 నిమిషాల 2.8 సెకండులలో నడిచాడు. 1948 లండన్ ఒలింపిక్స్‌లో కూడా ఈయన పాల్గొని స్వర్ణ పతకం సాధించారు. అప్పుడు ఆదూరాన్ని 45 నిమిషాల 3 సెకండులలో పూర్తి చేశారు. అప్పటికి ఒలింపిక్ రికార్డు 46 నిమిషాల 28.4 సెకండులు.

(శ్రీ) జుంగ్రెన్ : 50 కిలోమీటర్ల (31 మైళ్ళ 120 గజాలు) నడకలో 14 వ ఒలింపిక్స్‌లో స్వర్ణపతకం పొందిన యోధుడు ఈయన. 4 గంటల 41 నిమిషాల 52 సెకండులలో ఆదూరం నడిచారు.

# 108
# ఇటలీ



టెన్నిస్, సైక్లింగ్, ఫుట్‌బాల్ లలో ఒకప్పుడు ప్రపంచంలో కెల్ల అగ్రశ్రేణిలో స్థానం వహించిన యూరోపియన్ దేశం ఇటలీ. ఇప్పటికీ ఈ క్రీడలలో అంతర్జాతీయ ఖ్యాతి గడిస్తున్నవారున్నారు కాని అద్వితీయులుమాత్రం వెలయడం లేదు.

ఇటీవలి సంవత్సరాలలో ఇటలీలో బేస్‌బాల్ విశేషంగా ప్రచారంలోకి వచ్చింది. ప్రస్తుతం ఇటలీలో విశేషంగా ప్రచారంలో వున్న, అభిమానించబడుతున్న క్రీడలు సోకర్, సైక్లింగ్.

1948 ఒలింపిక్స్‌లో ఫుట్‌బాల్ పోటీలో ఇటలీ అమెరికాను 9-0 గోలులతో ఓడించింది. అయితే సెమిఫైనలు ముందు ఘట్టంలో డెన్మార్క్ ఇటలీపై 5-3 గోలులతో విజయమొందింది. 1952 ఒలింపిక్స్‌లో ఇటలీ చతుర్థస్థానమైనా పొందలేకపోయింది. ఇందుకు కారణం ఇటలీ అసమర్థత కాదు, ఇటలీ దురదృష్టమే అని చెప్పాలి. ప్రపంచ విఖ్యాతులైన ఇటాలియన్ సోకర్ ఆటగాళ్ళు అంతర్జాతీయ పోటీలలో పాల్గొనడం నిమిత్తం విమానంలో వెళుతుండగా లిస్బన్ వద్ద విమానం కూలిపోయింది. ఇటాలియన్ సోకర్ వీరులెల్లరూ ఘోర దుర్మరణంపాలైనారు. అప్పటినుంచీ ఇటలీ కోలుకోలేకపోయింది.

లండన్ ఒలింపిక్స్‌లోనే సైక్లింగ్ పోటీలలో ఇటలీ రెండు స్వర్ణ పతకాలు సాధించింది. హెల్సింకీలో ఒక స్వర్ణపతకం, ఒక రజతపతకం సంపాదించింది.

ఏటా ఇటలీలో జరిగే సైక్లింగ్ పోటీలలో బెర్గానోలో జరిగే "ట్రోఫియో బరాచీ" పోటీ ఘనమైనది. బార్టాలి, కాపి, మేగ్ని అంతర్జాతీయ ఖ్యాతి గడించిన సైక్లింగ్ ప్రవీణులు.

బాస్కెట్‌బాల్ ప్రచారానికి అభివృద్ధికి విర్టస్ క్లబ్బు, బేస్‌బాల్ ప్రచారానికి, అభివృద్ధికి సెట్టూనో క్లబ్బు విశేషంగా కృషి చేస్తున్నవి.

కత్తియుద్ధం, కుస్తీ, నీటి, మంచు ఆటలుకూడా ఇటలీలో విశేషంగా ప్రచారంలో వున్నవి.

1956 జనవరిలో 16వ ప్రపంచం ఒలింపిక్ పోటీల సందర్భంగా శీతకాలపు (మంచు) ఆటలపోటీలు ఇటలీలోని కార్టినా డాంపెజ్జోలో నే జరిగినవి.

వాటర్ పోలోలో ఇటలీ ప్రపంచంలో ప్రముఖస్థానం వహిస్తున్నది. 1947 లో యూరోపియన్ ఛాంపియన్‌షిప్ సాధించింది. 1948 ఒలింపిక్స్‌లో వాటర్ పోలో పోటీలలో స్వర్ణపతకం గెలుచుకొన్నది ఇటలీ. ఈ దేశమే 1952 ఒలింపిక్స్‌లో తృతీయస్థానం వహించి కంచు పతకం పొందింది. ఇదే పోటీలలో ఇటలీ ఇండియాను 16 - 1 గోలులతో ఓడించివేసింది. వ్యాయామ క్రీడలుకూడా ఇటలీలో దేశవ్యాప్తంగా ప్రచారంలో వున్నప్పటికీ ప్రస్తుతం ప్రపంచంలో కెల్ల అగ్రస్థానం వహించినవారు ఒకరిద్దరికి మించి లేరు.

ఇటాలియన్ వ్యాయామ క్రీడావేత్తలలో మొట్టమొదట చెప్పదగినవారు శ్రీ జి. డోర్డోని. 50 వేల మీటర్ల (31 మైళ్ళ 120 గజాలు) నడకలో ఒలింపిక్ రికార్డును ఈయన స్థాపించి వున్నారు. 1952 లో హెల్సెంకీ ఒలింపిక్ క్రీడోత్సవంలో ఈయన ఈ దూరాన్ని 4 గంటల 28 నిమిషాల 7.8 సెకండులలో నడిచారు.

(శ్రీ)మతి లియోని : 100 మీటర్ల పరుగులో ఈమె దిట్ట. 1955 లో ఈ దూరాన్ని ఈమె 11.8 సెకండులలో పరుగిడింది. ఒలింపిక్ రికార్డుకంటె ఇది .3 సెకండులు మాత్రమే ఎక్కువ.

14వ ఒలింపియాడ్‌లో ఇటలీ మొత్తం ఎనిమిది స్వర్ణపతకాలు సాధించింది. పాయింట్ల అనధికార అంచనా ప్రకారం పంచమస్థానం వహించింది.

15 వ ఒలింపియాడ్‌లో ఇటలీ తిరిగి ఎనిమిది స్వర్ణపతకాలను, తొమ్మిది రజత, మూడు కంచుపతకాలను గెలుచుకొన్నది. పాయింట్ల అనధికార అంచనా ప్రకారం ఇటలీది అష్టమస్థానం.

# ఫిన్లెండ్

ఫిన్లెండ్ భాగ్యవంతమైన యూరోపియన్ దేశం. జీవన వ్యయ ప్రమాణం అచ్చట హెచ్చుగా వుండడంవల్లనే క్రీడా రంగంలో ఫిన్నిష్ ప్రతినిధులు యూరప్‌లో గౌరవస్థానం వహించి వున్నారు. వ్యాయామ క్రీడలలో, వీటిలో ముఖ్యంగా సుదూరపు పరుగులో, కుస్తీ, వెయిట్ లిఫ్టింగ్ వంటి క్రీడలలో ఫిన్నిష్ యోధులు ప్రపంచ మంతటిలోకి కూడా గౌరవ స్థానం సాధించి వున్నారు.

ఇ. మాకినెన్ (హెవీవెయిట్) వంటి వెయిట్ లిఫ్టర్‌ను, హంకాలా, రాన్‌హాలా, గ్రోయెన్‌డాహి వంటి వస్తాదులను కన్న దేశం ఫిన్లెండ్.

1952 లో ప్రపంచం ఒలింపిక్స్‌కు (15 వది) ఆతిథ్యమిచ్చే అదృష్టం ఫిన్లెండుకు దక్కింది. హెల్సింకీలో (ఫిన్లెండ్) 1952 జులై, ఆగస్టులలో 69 దేశాల యోధులు ఒలింపిక్ క్రీడోత్సవంలో పాల్గొన్నారు. ఈ ఒలింపిక్స్‌లోనే ఫిన్లెండు మొత్తం ఆరు స్వర్ణపతకాలను, మూడు రజత, తొమ్మిది కంచు పతకాలను సాధించి అనధికార పాయింట్ల అంచనా ప్రకారం షష్ఠమస్థానం వహించింది.

అంతకుముందు 1948 లో లండన్‌లో జరిగిన ప్రపంచం ఒలింపిక్ పోటీలలో 4 స్వర్ణపతకాలు సాధించి అనధికార పాయంట్ల అంచనా ప్రకారం సప్తమస్థానం సాధించింది.

(శ్రీ) జాన్ సాలో : ఇక ఫిన్నిష్ వ్యాయామ క్రీడావేత్తలు గురించి తలచుకొంటేనే వెంటనే జ్ఞాపకం వచ్చేది శ్రీ జాన్ సాలో. ఈయన 1928 లో లాస్ ఏంజిలిస్ నుంచి న్యూయార్క్‌కు 3422 మైళ్లు పరుగిడినారట. ఒక సంవత్సరం పిమ్మట న్యూయార్క్ నుంచి లాస్ ఏంజిలిస్‌కు పరుగుపై తిరిగి వచ్చినారట. ఇంతటి శక్తిపటిమ కలవాడు బేస్‌బాల్ కోర్టులో ఘోర దుర్మరణంపాలైనాడు. బేస్‌బాల్ ఆట చూస్తూవున్న సమయంలో బంతి గూబకు తగలగా ఆయన మరణించారు.

శ్రీ కార్వోనెన్ : సుదూరపు పరుగులలో ఫిన్నిష్‌వారు జగద్విఖ్యాతి గాంచినారు. మరాథన్ (26 మైళ్ల 385 గజాల దూరానికి పరుగు) లో ప్రపంచ ఖ్యాతి గడించినవారిలో శ్రీ కార్వోనెన్ ఒకరు. అమెరికాలోని మస్సాచుసెట్స్ రాష్ట్రంలోని బోస్టన్‌లో ఏటా జరిగే మరాథన్ పందెం ప్రముఖమైనది. 1954 లో ఇందులో ప్రథమ స్థానం వహించినది శ్రీ కార్వోనెన్. ఆయన 2 గంటల 20 నిమిషాల 39 సెకండులలో ఆ దూరాన్ని పూర్తిచేశారు. వారానికి 100 మైళ్ళ వంతున పరిగెడే జిమ్ పీటర్స్ అంతటి బ్రిటిష్ ప్రవీణుని ఈయన పై పోటీలో ఓడించివేశారు. 1952 ఒలింపిక్స్‌లో పంచమస్థానం పొందారు. 3000 మీటర్ల స్టీపుల్ ఛెజ్‌లో కూడా వీరు దిట్ట.

శ్రీ ఆన్టి విస్కారి : 60 వ వార్షిక బోస్టన్ మరాథన్ పోటీ 1956 ఏప్రిల్ లో జరిగింది. ఫిన్నిష్ ప్రముఖుడు శ్రీ ఆన్టి విస్కారి అందులో అగ్రస్థానం వహించడమేకాక ప్రపంచం రికార్డును కూడా సృష్టించి వున్నారు. ఈయన 26 మైళ్ళ 385 గజాలను 2 గంటల 14 నిమిషాల 14 సెకండులలో పరుగిడారు. అంతకుముందు ప్రపంచపు రికార్డు 1955 లో స్థాపించబడినట్టిది 2 గంటల 18 నిమిషాల 22 సెకండులు. అంతకు ముందు బోస్టన్ రికార్డు 2 గంటల 18 నిమిషాల 51 సెకండులు.

అంతర్జాతీయ ఖ్యాతి గడించి కొందరు ఫిన్నిష్ క్రీడాయోధుల రికార్డులను దిగువ తెల్పుతున్నాను.

శ్రీ పోస్టి : 10,000 మీటర్ల పరుగులో (6 మైళ్ళ 376 గజాలు) ఈయిన దిట్ట. హెల్సింకీ ఒలింపిక్స్‌లో 29 నిమిషాల 51.4 సెకండులలో ఈ దూరం పరుగిడి చతుర్థస్థానం పొందారు.

శ్రీ హ్యాటియనెన్ : జావిలిన్ త్రో ప్రవీణుడు. హెల్సింకీ ఒలింపిక్స్‌లో ఈతను 235 అడుగుల $10\frac{1}{4}$ అంగుళాల దూరం విసిరి కంచుపతకం పొందారు.

(శ్రీ) వి. హెల్‌స్టెన్ : 400 మీటర్ల పరుగులో ఈయన ఘటికులు. 1955 లో ఈ దూరం ఈయన 46.6 సెకండ్లలో పరుగిడారు. ఒలింపిక్ రికార్డు ఇంతకంటె .7 సెకండులు ఎక్కువ.

(శ్రీ) ఎస్. రైనే : 3000 మీటర్ల (1 మైలు 1520 గజాలు) స్టీపుల్ ఛేజ్‌లో ఫిన్లెండులో ఈయన ద్వితీయ స్థానం వహిస్తున్నారు. ప్రథమస్థానం పొందిన శ్రీ పి. కార్వొనెన్ ఒలింపిక్ రికార్డుతో (8 నిమిషాల 45.4 సెకండ్లు) సమమైతే శ్రీ రైనే 8 నిమిషాల 48.0 సెకండులు ఈ దూరానికి తీసుకొంటున్నారు.

(శ్రీ) ఎస్. నిక్కానెన్ : జావిలిన్‌త్రోలో ఒలింపిక్ రికార్డును 1955 లో ఈయన అధిగమించారు. ఈటెను ఈయన 261 అడుగుల $3\frac{1}{2}$ అంగుళాల దూరానికి రువ్వారు. ఒలింపిక్ ప్రమాణం ఇంతకంటె 19 అడుగుల మూడు అంగుళాలు తక్కువ.



## ఫ్రాన్సు



ఫ్రాన్సుకు క్రీడాప్రపంచము ఒకందుకు ఋణపడి వున్నది. ఒలింపిక్ పోటీల పుట్టుక క్రీస్తుపూర్వం 776 వ సంవత్సర మైనప్పటికీ క్రీస్తుశకం 394 లో అవి నిషేధించబడినపిమ్మట వాటిని పునరుద్ధరించినది బారన్ పియరీ డి కౌబెర్టిన్ అనే ఫ్రెంచి దేశస్థుడు. 1892 వ సంవత్సరంలో ఈయన పూనుకొనివుండకపోతే ఇప్పుడు నాలుగేని సంవత్సరాలకు ప్రపంచ ఒలింపిక్ క్రీడోత్సవం జరిగెడిది కాదు; క్రీడలు నేడంతగా అభివృద్ధి చెందివుండెడివి కావుకూడా.

తొలిసారి 1892 వ సంవత్సరంలో ఈయన ప్రాచీన ఒలింపిక్ క్రీడలను పునరుజ్జీవింపజేయవలెనని ప్రతిపాదించారు. 1894 జూన్‌లో పారిస్‌లో వ్యాయామవిద్యా మహాసభ (కాంగ్రెస్ ఆన్ ఫిజికల్ ఎడ్యుకేషన్) జరిగినప్పుడు శ్రీ కౌబెర్టిన్ ప్రతిపాదన చర్చకు వచ్చింది.

ఎజెండాలో ఈ అంశం ప్రధానమైనదేశాదు. వివిధ దేశాలనుంచి ప్రముఖ క్రీడాసంస్థల ప్రతినిధులు ఈ సమావేశంలో పాల్గొన్నారు. శ్రీ కొబెర్టిన్ ప్రతిపాదనను వీరు చర్చించి ప్రాచీన ఆటల పోటీలను పునరుద్ధరించవలెనని ఏకగ్రీవంగా తీర్మానించారు. ప్రాచీన క్రీడోత్స వాలకు గ్రీసు పుట్టినిల్లయినందున మొట్టమొదటి క్రొత్త క్రీడోత్సవం గ్రీసు రాజధాని ఏథెన్స్‌లో జరపడానికి నిశ్చయించారు.

1896 లో ఏథెన్స్‌లో మొట్టమొదటి ఆధునిక ఒలింపిక్ క్రీడోత్స వం జరిగింది. ఒలింపిక్ ఉద్యమాన్ని ప్రచారం చెయ్యడం నిమిత్తం, ఆ వెనువెంటనే అంతర్జాతీయ ఒలింపిక్ కమిటీ నెలకొల్పబడింది. దీనికి కార్యదర్శిగా శ్రీ కొబెర్టిన్ ఎన్నుకోబడినారు. 1900 సంవత్సరములో రెండవ ఒలింపిక్ క్రీడోత్సవం పారిస్‌లో జరిగింది. అప్పుడు అంతర్జాతీయ ఒలింపిక్ సంఘం అధ్యక్షునిగా శ్రీ కొబెర్టిన్ ఎన్నుకోబడినారు.

ఒలింపిక్ ఉద్యమం ప్రారంభదశలో దీక్షతో నిర్వహించబడ లేదు. 1896 లో ప్రారంభమైన ఉద్యమం మరి 30 ఏళ్ళవరకు చాలా మందకొడిగా సాగింది. తానూ, తన అనుచరులు, గ్రీసుకు చెందిన శ్రీ ఎమ్. బికెలాస్, అమెరికన్ ప్రొఫెసర్ శ్రీ డబ్ల్యు. ఎమ్. స్లవోని తప్ప ఒలింపిక్స్ పునరుద్ధరణకు హృదయపూర్వకంగా దీక్ష వహించిన వారు లేరని 1926 లో శ్రీ కొబెర్టిన్ ప్రకటించారు. మధ్యమధ్య అవాంత రాలు వచ్చినా మొత్తంమీద ఒలింపిక్ ఉద్యమం సాగిపోతూనేవున్నది. ఇకముందుకూడా కొనసాగడానికి, ప్రపంచశాంతి పరిరక్షణకు ఒకానొక మార్గంగా ఒలింపిక్స్ నిలవడానికి గట్టి పునాదులు వేయబడినవి. ఇందుకు మూలకారకుడైన ఫ్రెంచిప్రముఖుడు శ్రీ కొబెర్టిన్‌ను కీర్తించనివా రుండరు.

ఫ్రాన్సు పేరు చెప్పగానే టెన్నిస్, సైక్లింగ్ క్రీడలు ఇట్టే స్ఫురణకు వస్తవి. 1927 నుంచి వరుసగా ఐదుసంవత్సరాలు డేవిస్ కప్పును గెలుచుకొన్న దేశం ఫ్రాన్సు. తర్వాత బ్రిటన్, ఆ తర్వాత అమెరికా, అటుపిమ్మట ఆస్ట్రేలియా, అమెరికాలలో ఏదో వొకటి టెన్నిస్ డేవిస్ కప్పును గెలుచుకొంటున్నవి. శ్రీ పాల్ రెమీవంటి

టెన్నిస్ యోధులు నేటికీ ఫ్రాన్సు ప్రాచీనవైభవాన్ని కొంతకు కొంత చాటుతూనే వున్నారు. రేపు ఛాంపియనులు కాగల బాలురు, యువకులు వేలసంఖ్యలో వున్నట్లు ప్రతీతి.

ముష్టియుద్ధం, రగ్బీ, కత్తియుద్ధం, బాస్కెట్‌బాల్, నీటిఆటలు, మంచు ఆటలు, పర్వతారోహణ వంటి క్రీడలుకూడా ఫ్రాన్సులో విశేషంగా ప్రచారంలో వున్నవి.

అన్నిటికంటె సైక్లింగ్ ఫ్రెంచి పౌరులకు అభిమాన పాత్రమైన క్రీడ. ప్రపంచంలోకెల్ల అగ్రగణ్యమైన "టూర్‌డి ఫ్రాన్స్" సైక్లింగ్ పోటీ ఫ్రాన్సులోనే జరుగుతుంది. క్రమ ఘట్టాలలో ఫ్రాన్సుదేశమంతటా చుట్టి రావడం ఈ పోటీలో విశేషం.

1948 ప్రపంచం ఒలింపిక్స్‌లో ఆరు విధాలుగా జరిగిన సైక్లింగ్ పోటీలలో ఫ్రాన్సు మూడింటిని గెలుచుకున్నది.

1952 ప్రపంచం ఒలింపిక్స్‌లో ఎక్కువమంది పాల్గొన్నారుకాని ఫ్రాన్సుకు అసమానకీర్తిని గడించలేకపోయారు.

## వ్యాయామ క్రీడలు

వ్యాయామక్రీడలు (ఎథ్లెటిక్స్) దేశవ్యాప్తంగా ఆదరించబడుతున్నప్పటికీ వాటిలో ప్రపంచంలోకెల్ల అద్వితీయులైన వ్యక్తులు ప్రస్తుతంలో లేరు.

3 × 100 మీటర్ల రిలే పరుగులో మాత్రం ఫ్రెంచియోధులు— అలెగ్జాండ్రెడిజానీ, ఆద్రియర్ నకాచా, జార్జి వాల్లెర్సీలు ప్రపంచం రికార్డు సాధించి వున్నారు.

అంతర్జాతీయ ఖ్యాతిగడించిన ఫ్రెంచి వ్యాయామ క్రీడావేత్తలను దిగువ పరిచయం చేస్తున్నాను.

శ్రీ ఏ. మిమవాన్ : దూరపు, మధ్యదూరపు (మిడిల్ డిస్టెన్స్) పరుగులలో ఈయన ఘటికుడు. 1952 ఒలింపిక్స్‌లో 10,000

మీటర్ల (6 మైళ్ళ 376 గజాలు) పరుగులో రజత పతకం సాధించారు. 29 నిమిషాల 32.8 సెకండులలో ఆదూరాన్ని పరుగిడి ద్వితీయుడుగా వచ్చినారు. ఇదే క్రీడోత్సవంలో 5000 మీటర్ల పరుగులో ద్వితీయ స్థానం వహించారు.' 3 మైళ్ళ 188 గజాలను ఈయన 14 నిమిషాల 7.4 సెకండులలో పరుగిడి జెటోపెక్ తర్వాతస్థానాన్ని వహించారు.

శ్రీ ఎల్. షెవలియర్ : వేగంగా నడవడంలో ఈయన మేటి. గత ఒలింపిక్స్‌లో 10,000 మీటర్ల (6 మైళ్ళ 376 గజాలు) నడకలో ఈయన చతుర్థస్థానం వహించారు. ఆ దూరాన్ని ఆయన 45 నిమిషాల 50.4 సెకండులలో నడిచారు. ప్రథమస్థానం వహించిన వ్యక్తి ఈయనకంటె 11.6 సెకండులు ముందుగా గమ్యంచేరాడు.

శ్రీ పి. ఎల్. మాప్రశాక్ : మరీ తక్కువకాని, మరీ హెచ్చుకాని దూరపు పరుగులో (మిడిల్ డిస్టెన్స్) ఈయన ఘటికుడు. హెల్సింకీ ఒలింపిక్స్‌లో ఈయన 1500 మీటర్ల (1640 గజాలు) దూరాన్ని 3 నిమిషాల 46 సెకండులలో పరుగిడి పంచమస్థానం వహించాడు. అయితే ప్రథమస్థానం వహించిన యోధుడు ఈయనకంటె .8 సెకండులు ముందుమాత్రమే 'టేపు'ను తాకి అనించాడు.

శ్రీమతి ఎమ్. ఓ. ఎమ్. ఆస్టెర్ మెయర్ : 1948 ఒలింపిక్స్‌లో ఫ్రాన్సుకు స్వర్ణపతకం సాధించిన ఏకైక మహిళ ఈమె. రెండు స్వర్ణపతకాలను ఈమె సాధించగలగడం మరొక విశేషం. పుటింగ్ ది వెయిట్, డిస్కస్ త్రోలలో ఈమె ప్రథమస్థానం వహించింది. బరువును ఈమె 45 అడుగుల $1\frac{1}{2}$ అంగుళాల దూరానికి విసిరింది. పళ్ళెమును 137 అడుగుల $6\frac{1}{2}$ అంగుళాల దూరానికి రువ్వింది.

లండన్ ఒలింపిక్స్‌లో ఫ్రాన్సు మొత్తం తొమ్మిది స్వర్ణపతకాలు సాధించింది. అనధికార అంచనా ప్రకారం తృతీయస్థానంవహించింది.

హెల్సింకీ ఒలింపిక్స్‌లో ఫ్రాన్సు ఆరు స్వర్ణపతకాలు, ఆరు రజత, ఐదు కంచుపతకాలు చేబట్టింది. అనధికార అంచనా ప్రకారం ఫ్రాన్సుది సప్తమస్థానం.




## చెకోస్లోవాకియా



ఈ కమ్యూనిస్టు తూర్పు యూరపియన్ రాజ్యం పేరు వినగానే జ్ఞాపకం వచ్చేది జటోపెక్ దంపతులు. హెల్సింకీ ఒలింపిక్స్‌లో వీరుభయులూ చరిత్ర సృష్టించారు. శ్రీ జటోపెక్ మూడు దూరపు పరుగు పందెములలో స్వర్ణపతకాలు పొందడమేకాక ఆమూడింటిలోనూ ఒలింపిక్ రికార్డులు సృష్టించారు. శ్రీమతి డానాజటోపెక్ జావిలిన్ త్రోలో ప్రథమస్థానం వహించడమేకాక అందులో ఒలింపిక్ రికార్డును సృష్టించినది కూడా. ఈ దంపతులు ఒక్కరోజునే జన్మించడం మరొక విశేషం.

1954 వింబుల్డన్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్న జారోస్లావ్ డ్రాబ్నీ జన్మస్థానం చెకోస్లోవాకియా. అయితే, దరిమిలా ఆయన ఈజిప్టులో స్థిరపడినాడు.

మొట్టమొదటి ప్రపంచ స్త్రీల చతురంగం ఛాంపియన్‌షిప్‌ను సాధించినదికూడా చెక్ కన్యయే. వీరామెన్చిక్ (చెకోస్లోవాకియా) 1927, 1930, 1931, 1933, 1935, 1939 సంవత్సరాలలో ప్రపంచ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్నది. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో ఈమె లండన్‌లో ఘోరమైన దుర్మరణానికి గురిఅయినది.

టేబుల్ టెన్నిస్‌లోకూడా చెకోస్లోవాకియా ప్రముఖస్థానం వహిస్తున్నది. ఐ. ఆంద్రియడిస్, ఎల్. స్టయిపెక్ 1955 లో ప్రపంచ డబుల్స్ ఛాంపియనులు. వీరు 1956 లో ద్వితీయ స్థానం పొందినారు.

కసరత్తు, ముఖ్యంగా డ్రిల్లువంటి సమూహ వ్యాయామం చెకోస్లోవాకియాలో విశేషంగా ప్రచారంలోవుంది. చెకోస్లోవాకియా అంతటా సోకోల్ అనే ప్రత్యేకమైన కసరత్తు ఉద్యమం ప్రచారంలో వున్నది. వివిధ క్రీడలలో బాల్యంనుంచే శిక్షణ నిప్పించడం, ప్రోత్సాహకులకు విశేషంగా సౌకర్యాలు కలుగజేయడంవంటి రష్యను సంప్రదాయాలు చెకోస్లోవాకియాలోకూడా అమలులోవున్నవి.

హ్యాండ్ బాల్, ముష్టియుద్ధం, పడవచోదన, వెయిట్ లిఫ్టింగ్, ఫుట్ బాల్, నీటి ఆటలు, మంచు ఆటలు ఈ దేశంలో బాగా ప్రచారంలో వున్నవి.

1948 ఒలింపిక్స్‌లో ఈ దేశపు ప్రతినిధులు ఆరు స్వర్ణపతకాలు సాధించారు. అనధికార అంచనా ప్రకారం ద్వాదశస్థానం ఆక్రమించారు.

1952 హెల్సింకీ ఒలింపిక్స్‌లో ఏడు స్వర్ణపతకాలు, మూడేసి రజత, కంచు పతకాలు సాధించారు చెక్ క్రీడావేత్తలు. అనధికార అంచనా ప్రకారం చెకొస్లొవాకియాది దశమస్థానం.

చెక్ క్రీడానిపుణుల గురించి దిగువ ప్రస్తావిస్తాను.

(శ్రీ) ఎమిల్ జటొపెక్ : దూరపు పరుగులలో ఈయన ప్రజ్ఞ సాటి లేనిది. లండన్ ఒలింపిక్స్‌ద్వారా ఈయన జగద్విఖ్యాతి నొందారు. అప్పుడు ఒక స్వర్ణపతకం, ఒక రజతపతకం గెలుచుకొన్నారు. అప్పుడు 10,000 మీటర్ల (6 మైళ్ళ 376 గజాలు) పరుగులో ప్రథమ స్థానం పొందారు. 29 నిమిషాల 59.6 సెకండులలో ఆ దూరాన్ని పరుగిడారు. అది కొత్త ఒలింపిక్ రికార్డుకూడా. ఇదే ఒలింపిక్స్‌లో 5,000 మీటర్ల (3 మైళ్ళ 188 గజాలు) దూరాన్ని 14 నిమిషాల 17.8 సెకండులలో పరుగిడి రజతపతకం సాధించారు. ప్రథమస్థానం పొందిన బెల్జియన్ జటొపెక్ కంటె .2 సెకండులు ముందుమాత్రమే గమ్యం చేరుకొన్నారు.

14 వ ఒలింపిక్స్‌లో ఒక స్వర్ణపతకం, ఒక రజతపతకం పొంది ఒకే ఒక ఒలింపిక్ రికార్డు నెలకొల్పిన జటొపెక్ మరి నాలుగేళ్ళలో—15 వ ఒలింపిక్స్‌లో తన ప్రజ్ఞా విశేషాన్ని రెండింతలు మూడింతలు చెయ్యగలిగారు. 15 వ ఒలింపిక్స్‌లో మూడు స్వర్ణపతకాలు సాధించడమేకాక ఆ మూడు పోటీలలోను ఒలింపిక్ రికార్డులు సంస్థాపించి వున్నారు. వాటి వివర మిది :

5,000 మీటర్ల పరుగు : 14 నిమిషాల 6 . 6 సెకండులు.
(పూర్వపు ఒలింపిక్ రికార్డు 14 నిమిషాల 17 . 6 సెకండులు.)

10,000 మీటర్ల పరుగు : 29 నిమిషాల 17 సెకండులు.
(పూర్వపు రికార్డు, ఈయన స్థాపించినదే, ఇంతకంటె 42 . 6 సెకండులు ఎక్కువ.)

మరాథన్ : (26 మైళ్ళ 385 గజాల పరుగు) 2 గంటల 23 నిమిషాల 3 . 2 సెకండులు. (పూర్వపు రికార్డు అర్జంటైనా దేశస్థుడు స్థాపించినది 2 గంటల 34 నిమిషాల 51 . 6 సెకండులు.)

ఈయన పాటవం, వేగం పురస్కరించుకొని "హ్యూమన్ లోకమోటివ్" (మానవ రైల్వే ఇంజన్), "రన్నింగ్ మెషిన్" (పరుగిడే యంత్రం) అని ఈయనను వ్యవహరిస్తూ వుంటారు.

శ్రీ జటొపెక్ సాధారణంగా ఉదయమూ, సాయంకాలమూ కూడా పరుగులో తనకు తానుగా తర్ఫీదు అవుతూ వుంటారు. సగటున రోజుకు 20 మొదలు 25 మైళ్ళ వరకూ పరుగిడుతూ వుంటారు. పెద్ద పెద్ద పోటీలకు తయారయ్యేటప్పుడు మాత్రం ఇంకా తీవ్రంగా శిక్షణ తీసుకొంటారు. మెల్బోర్న్ ఒలింపిక్స్‌కు పోనున్న సమయంలో ఏప్రిల్—మే ప్రాంతాలలోనే ఈయన రోజుకు 31 మైళ్లు మొదలు 37 మైళ్ల వరకు పరుగిడినారు.

స్వీడిష్‌వారిలా అడవులలో కాక ట్రాక్‌పైనే తర్ఫీదవుతారు.

శిక్షణ కాలంలో శ్రీ జటొపెక్ విరామ పద్ధతిని (Interval Method) అనుసరిస్తారు. స్వల్ప విరామంలో కాని, అధిక విరామంలో కాని ఒకే దూరాన్ని పదేపదే పరుగిడడమే ఈ పద్ధతి. ఇటువంటి పరుగులో రెండింటికి ప్రాధాన్యం వుంటుంది. ఇందులో ఒకటి వేగం, మరొకటి పాటవం (Endurance). వేగమే పెంచుకోవాలి అని ఆయన అనుకుంటే కొద్దిపాటి దూరాలను కొద్దిమార్లు మాత్రమే తన రికార్డుకు దగ్గరగా పరుగిడుతారు. పాటవమే ప్రధానమైతే అవే దూరాలను ఎక్కువమారులు పరుగిడుతారు. అయితే ఆసందర్భంలో వేగం తక్కువగా వుంటుంది.

సాధారణంగా రోజూ 200 మీటర్ల దూరాన్ని ఐదుసార్లు అమిత వేగముతోను, మరి ఐదుసార్లు తక్కువ వేగంతోను, 400 మీటర్లు 20 సార్లు సామాన్య వేగంతోను పరుగిడుతారు. ఈ నివృత్తిలో రోజూ 20 మైళ్ళ పైచిలుకు పరుగెత్తుతారు. సంవత్సరం పొడుగునా నిర్విఘ్నంగా తర్ఫీదు సాగిస్తారు.

శ్రీ జటొపెక్ వయసు 34 సంవత్సరములు. సైన్యంలో చేరక ముందు 1947 ప్రాంతముల ఈయన ఒక బూట్ల దుకాణంలో పనిచేస్తూ వుండేవారట. డానా తండ్రి ఈయనపై అధికారట! అప్పటికి డానాను ఈయన వివాహం చేసుకోలేదు. శ్రీ జటొపెక్ ప్రస్తుతం చెకొస్లొవాకియా సైనికదళంలో మేజర్‌గా వుంటున్నారు. 1955 నవంబర్‌లో జటొపెక్ దంపతులు ఇండియాలో పర్యటించి ప్రోత్సాహకులకు వ్యాయామ క్రీడలలో విశిష్ట విధానాలను బోధించి వున్నారు.

శ్రీమతి డానా జటొపెక్ : ఈమె బాల్యంనుంచీ హ్యాండ్ బాల్ ఆట అంటే చెవికోసుకొనేది. ఈ ఆటను చెకొస్లొవాకియాలో స్త్రీలు, పిల్లలు ఎక్కువగా ఆడుతారు. వాలీబాల్‌ను ఆడినట్లు చేతితో ఆడుతారు. అయితే ఫుట్‌బాల్ ఆటలోవలె గోల్ వుంటుంది. హ్యాండ్ బాల్ గోలు, ఫుట్‌బాల్ గోలుకంటె చిన్నది. హ్యాండ్‌బాల్ బంతి వాలీబాల్ బంతికంటె బరువుగా వుంటుంది. హ్యాండ్‌బాల్‌లో బంతిని విసరటం వుండడంచేత, డానా ఈ ఆటలో మొదట నేర్పరి అయినది. ఈటెను రువ్వడంలో ఈ ప్రజ్ఞ చాలావరకు ఉపకరించి ఆమెను ప్రపంచ ఛాంపియను చేసినట్లు చెబుతారు. 1952 ఒలింపిక్స్‌లో ఈటె విసరడంలో స్త్రీలలో డానా ప్రథమస్థానం పొందినట్లు పైనే వివరించాను.

డానా విద్యార్థినిగా వున్నరోజుల్లో హ్యాండ్‌బాల్ ఆటలో పేరు గడించింది. 1947 లో తన స్కూలు స్పోర్ట్స్‌క్లబ్బు జట్టుతో విహారానికి వెళ్ళినపుడు ఈటె రువ్వడంలో నేర్పరి అయిన ఒక కన్య డానాను తనకు తోడుగా వుండమన్నది. "ఈటె విసిరిచూడు" అని ఎగతాళిగా ఆమె డానాతో పల్కింది. అంతకు ముందు ఈటె పట్టుకొనని డానా ఒకే తడవలో 35 మీటర్ల దూరానికి విసిరింది. అంతవరకు చెకొస్లొవాకియాలో

స్త్రీల జావిలిన్ త్రో రికార్డు 36 మీటర్లు మాత్రమేనట. హ్యాండ్ బాల్ లో హస్తశక్తియే ఈటె విసరడంలో ఇంతటి ప్రావీణ్యానికి దోహదమిచ్చి నట్లు అప్పుడు అందరూ నిర్ణయించారు. అప్పటినుంచి ఆమె జావిలిన్ త్రోను విడవక అభ్యసించింది.

జటొపెక్ పనిచేస్తున్న బూట్లఫ్యాక్టరీలోనే డానా కూడా పని చేస్తూ వుండేది. ఈ ఫ్యాక్టరీ క్రీడోత్సవంలో డానా 37 మీటర్ల దూరానికి ఈటె రువ్వి జాతీయ రికార్డు స్థాపించింది. జటొపెక్ 3000 మీటర్ల పరుగులో క్రొత్త జాతీయ ప్రమాణం స్థాపించాడు. ఆ సందర్భంలోనే వారిద్దరికీ తొలిసారి పరిచయమైంది. తర్వాత 1948 లో లండన్ ఒలింపిక్స్‌లో ఉభయులూ పాల్గొన్నారు. అయితే డానా లండన్ ఒలింపిక్స్‌లో ఫైనల్సుకైనా రాలేకపోయింది. జూలైలో ఒలింపిక్స్ పూర్తి అయినవి అక్టోబర్ (1948)లో డానా, జటొపెక్‌లు దంపతులైనారు.

1952 ఒలింపిక్స్‌లో వీరుభయులు పాల్గొన్నారు. అప్పుడు డానా జటొపెక్ ఈటెను 50.47 మీటర్లదూరానికి (165 అడుగుల 7 అంగుళాలు) విసిరి స్వర్ణపతకం సంపాదించింది. ఇది ఒలింపిక్ రికార్డు కూడా. పూర్వపు రికార్డు—ఒక ఆస్ట్రియన్ కన్య స్థాపించినది $149\frac{1}{2}$ అడుగులు.

డానా ఇండియాలో పర్యటించినప్పుడు కొన్ని గోష్ఠులలో చెకొస్లొవాకియాలో ఆటలపట్ల ఆసక్తిని వివరించింది. తన మాతృదేశంలో ప్రతిస్త్రీ పురుషుడు, బాలిక, బాలుడు పుష్టిగా ఆరోగ్యంగా బలాఢ్యులై వుండడానికి దీక్షవహిస్తారనీ, అది వారి లక్ష్యాలలో ఒకటనీ చెప్పింది. ఇండియాలో ఆటకత్తెలు, వ్యాయామక్రీడాకారిణులు నేర్పరులైనప్పటికీ బక్కపలచగా వుంటున్నందుకు ఆమె ఆశ్చర్యం ప్రకటించింది. భారత కన్యలు, మహిళలు వ్యాయామ క్రీడలయందు ఆసక్తి చూపనందుకు విచారం వెలిబుచ్చింది. ఇప్పటి క్రీడాకారిణులకు తగు తర్ఫీదు యిస్తే యింకా యింకా వృద్ధిలోనికి రాగలరనే ఆశాభావాన్ని వెలిబుచ్చింది. వ్యాయామ క్రీడలు అభ్యసించడంవల్ల స్త్రీలలో స్త్రీత్వం పోతుందనే అభిప్రాయాన్ని త్రోసిపుచ్చింది. స్త్రీలు తమ ఆరోగ్యానికీ, తమ సంతతి ఆరోగ్యానికీ వ్యాయామక్రీడలను విధిగా అభ్యసించవలెనన్నది.

శ్రీ ఎమ్. మార్క్ : ఈయన అతి బలిష్ఠుడైన హామర్ త్రో యర్. 1956 ఆరంభంలో హామర్‌ను ఈయన 193 అడుగుల 11 అంగుళాల దూరానికి విసిరారు. 1955 లో 200 అడుగుల $10\frac{1}{4}$ అంగుళాలకు విసిరారు. ఇందులో ఒలింపిక్ రికార్డు 197 అడుగుల $11\frac{1}{2}$ అంగుళాలు.

శ్రీ వి. జొనెసెక్ : కొద్దిదూరపు పరుగులలో ఈయన దిట్ట. 1955 లో ఈయన 200 మీటర్లను 20.9 సెకండులలో పరుగిడాడు. ఇందులో ఒలింపిక్ రికార్డు ఇంతకంటె .2 సెకండులు మాత్రమే తక్కువ.

శ్రీ ఎస్. జుంగ్‌విర్త్ : 1500 మీటర్ల పరుగులో ఈయన విశేష ప్రతిభావంతుడు.

శ్రీ ఎమ్. రెహాక్ : హాప్ స్టెప్ అండ్ జంప్‌లో ఈయన ఘటికుడు.

శ్రీ జె. స్కోబ్లా : గుండు విసరడంలో ఈయన ఘటికుడు.

శ్రీ కె. మెర్టా : డిస్కస్ త్రోలో ఒలింపిక్ రికార్డును అధిగమించిన దిట్ట.

శ్రీమతి మొద్రాచోవా : ఎత్తు దూకడంలో ఈమె నేర్పరి.

## నార్వే



యూరప్ క్రీడాపటంలో గౌరవనీయమైన స్థానం వహిస్తున్న దేశం నార్వే.

పడవ చోదన, స్కేటింగ్, వ్యాయామ క్రీడలలో ప్రముఖస్థానమూ, టెన్నిస్, టేబుల్ టెన్నిస్ వంటి క్రీడలలో గౌరవమైన స్థానము వహిస్తున్నది నార్వే.

1956 డేవిస్ కప్పు పోటీలలో నార్వే ఇజ్రాయల్‌ను 4-1 గేములతో ఓడించింది.

నార్వేజియన్ టెన్నిస్ ప్రముఖులు ఎఫ్. సొహోల్, స్జోవాల్ 1955-56 ఇండియాలో పర్యటించారు. అయితే మొదట వీరిని డబుల్స్ పోటీలో శ్రీ ఎమ్. వి. జి. అప్పారావు, శ్రీ ఉదయ కుమార్ గారలు ఓడించి వేశారు.

1956 ప్రపంచ టేబుల్ టెన్నిస్ పోటీలలో నార్వే పాల్గొనలేదు. 1955 స్వేడ్లింగ్ కప్పు పోటీలలో పాల్గొన్నది కాని ప్రముఖ స్థానం వహించలేదు. ఆస్ట్రియా, ఆస్ట్రేలియా, యుగొస్లావియా, బెల్జియమ్‌లచే ఓడించబడినది.

ఫుట్‌బాల్, హాకీలలో నార్వే ప్రపంచంలో తృతీయస్థానమైనా వహించలేదు.

శ్రీ మెన్సన్ ఎర్నెస్ట్ : ఇక వ్యాయామ క్రీడల గురించి తలచుకోగానే ముందు తలపుకువచ్చేది మెన్సన్ ఎర్నెస్ట్. మహా దూరపు పరుగులలో ప్రపంచంలోకెల్ల ఈయన అద్వితీయుడుగా నేటికీ పరిగణించబడుతున్నాడు. పారిస్‌నుంచి మాస్కోకు రెండువారాలలో సగటున రోజుకు 125 మైళ్ళవంతున పరుగిడి చేరినారట. మధ్య వచ్చిన 13 నదులను ఈదినారట.

కాన్‌స్టాంటినోపుల్ (టర్కీ) నుంచి కలకత్తాకు వచ్చి, కలకత్తా నుంచి తిరిగి కాన్‌స్టాంటినోపుల్‌కు మొత్తం 5625 మైళ్ళు పరుగెత్తారు. అనటోలియా, పర్షియా, ఆఫ్ఘనిస్తాన్‌లు దాటి, నిప్పులుచెరిగే ఎండలలో ఎడారులలో సయితం పరుగిడినారు. సగటున రోజుకు 95 మైళ్ళ వంతున 59 రోజులు పరుగిడినాడు.

ఎస్. స్ట్రాండ్లీ : హామర్‌ను 200 అడుగులకు మించి విసిరిన వారిని వ్రేళ్ళపై లెక్కపెట్టవచ్చు. 1953 లోనే ఈయన 204 అడుగుల $7\frac{1}{8}$ అంగుళాల దూరానికి హామర్‌ను విసిరి ప్రపంచ ప్రఖ్యాతులైనారు. ఇందులో ఒలింపిక్ రికార్డు 197 అడుగుల $11\frac{1}{2}$ అంగుళాలు.

శ్రీ ఆర్. నీల్సన్ : హాప్ స్టెప్ అండ్ జంప్‌లో ఈయన నార్వేలో గణుతికెక్కారు. 1952 ఒలింపిక్స్‌లో ఈయన 49 అడుగుల $7\frac{5}{8}$ అంగుళాల దూరానికి గెంతి పంచమస్థానం పొందారు.

శ్రీ ఏ. బాయ్‌సెన్ : ఒక మోస్తరు దూరపు పరుగులో ఈయన ప్రవీణుడు.

శ్రీ ఐ. లార్సెన్ : 3000 మీటర్ల (1 మైలు 1520 గజాలు) స్టీపుల్ ఛేజ్ లో నార్వేలో ఈయన అగ్రస్థానం వహించారు. ఒలింపిక్ ప్రతినిధి.

1948 ఒలింపిక్స్‌లో నార్వే ఒక స్వర్ణపతకం పొందింది. 1952 ఒలింపిక్స్‌లో 3 స్వర్ణపతకాలు, 2 రజత పతకాలుసాధించింది; అనధికార అంచనా ప్రకారం నార్వేది 16 వ స్థానం.




## జర్మనీ



ఫుట్‌బాల్‌లో ప్రస్తుతం ప్రపంచ ఛాంపియనులు పశ్చిమ జర్మనీవారు. 1952 ఒలింపిక్స్‌లో చతుర్థస్థానం మాత్రమే పొందగలిగారు.

యూరప్ భూభాగమైన ఉభయజర్మనీలలో టెన్నిస్, వెయిట్ లిఫ్టింగ్, కుస్తీ, ముష్టియుద్ధము, సైక్లింగ్ క్రీడలు, నీటి ఆటలు, మంచు ఆటలు విశేషంగా ప్రచారంలో వున్నవి.

టెన్నిస్‌లో పశ్చిమ జర్మనీలో ప్రస్తుతం అగ్రస్థానం వహిస్తున్న శ్రీమతి జెహ్డెన్, శ్రీమతి వోగ్లర్ 1956 లో ఇండియాలో పర్యటించి వున్నారు. 1956 ఆరంభంలో మద్రాసులో జరిగిన అఖిలభారత హార్డ్ కోర్ట్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో ఉభయులూ అంత్యదశ చేరుకొన్నారు. అంతిమ పోటీలలో జెహ్డెన్, వోగ్లర్‌ను వోడించింది. 1956 డేవిస్‌కప్పు పోటీలలో జర్మనీ ఐర్లెండును 4-1 గేములతో ఓడిం

చింది. ఎఫ్. ఫెల్డ్ బాష్, ఎఫ్. హ్యూబర్, పి. స్కాల్ ప్రస్తుతం జర్మనీలో ప్రముఖస్థానం వహిస్తున్న టెన్నిస్ ఆటగాళ్ళు.

1955 నవంబరులో పశ్చిమ జర్మనీలోని మ్యూనిక్‌లో ప్రపంచం వెయిట్ లిఫ్టింగ్ ఛాంపియన్‌షిప్ పోటీలు జరిగినవి.

1936 లో ప్రపంచం ఒలింపిక్స్ అవిభక్త జర్మనీ రాజధాని బెర్లిన్‌లో జరిగినవి. హెర్ హిట్లర్ స్వయంగా పోటీలకు హాజరై అనేక విధాలుగా సహాయ మిచ్చినాడట.

వ స్త్రీపేరు చెప్పగానే పశ్చిమ జర్మనీ ఫ్రీస్టయల్ యోధుడు గార్గంతువా జ్ఞప్తికి రాకమానదు. దాదాపు 8 అడుగుల ఎత్తు, దాదాపు 600 పౌనుల బరువు వున్న ఈ వీరుడు కింగ్ కాంగ్ వంటివాళ్ళను చిటికలపై ఓడించివేశారు.

ముష్టియుద్ధంలో మాక్స్ స్కెల్మలింగ్‌ను ప్రపంచం ఎన్నటికీ మరువ జాలదు. 1940 ప్రాంతాల ప్రపంచం హెవి వెయిట్ ఛాంపియన్‌గా వున్న ఈయన జోలూయీవంటి వారిని ఓడించివేశారు. అయితే తిరిగి జరిగిన పోటీలో (రిటరన్ ఫైట్) రెండు నిమిషాలలోగానే లూయీ, స్కెల్మలింగ్‌ను స్పృహ లేకుండా కొట్టివేశారు (K.O.). హిట్లర్ స్కెల్మలింగ్ పట్ల స్వయంగా శ్రద్ధవహించాడు. ముష్టియుద్ధ ప్రవీణుడుగా జర్మనీకి ఆయన తెచ్చిన కీర్తిని హిట్లర్ గుర్తించి ఆయనను సముచితరీతిని సత్కరించి వున్నాడుకూడా.

ఇటీవలివారిలో చెప్పదగినవారు ఐ. బాశెల్. ఫ్లయ్ వెయిట్ తరగతికి చెందిన ఈ ప్రవీణుడు హెల్సింకీ ఒలింపిక్స్‌లో రజతపతకం పొందారు.

దూరపు సైక్లింగ్ పోటీలలో అంతర్జాతీయ ఖ్యాతి గడించిన జర్మను శ్రీ ఇ. జీగ్లర్. గుస్టావ్ అడాల్ఫ్‌ష్మూర్ కూడా ఇందులో విఖ్యాతి గాంచారు.

జర్మనీలో శాస్త్రీయవ్యాయామం (జిమ్నాస్టిక్స్) విశేషంగా ప్రచారంలోవుంది. దీనిని ప్రచారం చెయ్యడానికి "జిమ్నాస్టిక్

సొసైటీ" లున్నవి. టరన్ విరైన్ (Turn Vereine) ఉద్యమం జిమ్నాస్టిక్ ప్రచారోద్యమాలలో ప్రధానమైనది. ఫ్రీడ్‌రిచ్ లుడ్విగ్ జాన్ (Freedrich Ludwig John) ఈ ఉద్యమ సంస్థాపకులు. జాన్ పిమ్మట అడాల్ఫ్‌స్పీస్ ఈ ఉద్యమాన్ని జర్మనీ అంతటా వ్యాపింప చేశాడు.

లీప్జిగ్ వంటి నగరాలలోని ఫిజికల్ కల్చర్‌స్కూల్సు వ్యాయామ విద్యావ్యాప్తికి ఇతోధికంగా కృషి చేస్తున్నవి. వ్యాయామ క్రీడలలో పరిశోధనలు జరపడానికి లీప్జిగ్‌లోని ఫిజికల్ కల్చర్ హైస్కూలులో విడిగా ఒక శాఖ వున్నది. అందులో 1750 మంది వ్యాయామ శిక్షితులకు 240 మంది వ్యాయామ శిక్షకులు ఏటా తర్బీదు యిస్తారు. ఈ సంస్థ లక్షమంది ప్రేక్షకులు పట్టే స్టేడియమ్ వున్నదంటే విద్యాసంస్థకు ఎన్ని సదుపాయాలుకలవో ఊహించవచ్చు.

టేబుల్ టెన్నిస్‌లోకూడా పశ్చిమజర్మనీ ఇప్పుడిప్పుడే పైకి వస్తున్నది. 1956 ప్రపంచం టేబుల్ టెన్నిస్ పోటీలలో పురుషుల పోటీలలో జర్మనీ ఫిలిప్పీన్స్‌ను, స్వీడెన్‌ను, ఆస్ట్రేలియాను ఓడించింది. తన గ్రూపులో తృతీయస్థానం పొందింది.

ఇక జర్మనీ వ్యాయామ క్రీడాప్రవీణుల (ఎథ్లెట్స్) గురించి క్రింద వివరిస్తాను.

కొద్దిదూరపు పరుగులో జర్మనీలో గణుతికెక్కినవారు శ్రీయుతులు యు. నాబ్, ఎమ్. సాండర్, హెచ్. క్లీన్, ఎమ్. పెటర్సన్.

శ్రీ హెచ్. ఫుట్‌రెర్ : కొద్దిదూరపు పరుగులలో జర్మనీలోకెల్ల అగ్రగణ్యుడు.

## స్విట్జర్లెండ్



ఈ యూరోపియన్ దేశం శాస్త్రీయ వ్యాయామంలోను (జిమ్నాస్టిక్స్), సుదూరపు నడక క్రీడలోను, మంచు ఆటలలోను పేరొంది హెల్సింకీ ఒలింపిక్స్‌లో శ్రీ హెచ్.

యూగ్‌స్టర్ అనే స్విస్ ప్రముఖుడు ప్యారలల్ బార్స్‌పై ప్రజ్ఞలో ప్రథమస్థానం వహించి స్వర్ణపతకం పొందారు.

శ్రీ జి. గంధార్ట్ అనే మరొక స్విస్ ప్రవీణుడు అదే పోటీలలో హారిజంటల్ బార్‌పై ప్రజ్ఞలో స్వర్ణపతకం గెలుచుకొన్నారు.

తక్కిన క్రీడలలో స్విస్ ప్రముఖులు ప్రపంచములో ప్రముఖ స్థానం వహించనప్పటికీ స్విజ్జర్లెండ్‌లో వ్యాయామ క్రీడలు, కుస్తీ, షూటింగ్, హాకీ, పడవచోదన, సైక్లింగ్, కత్తియుద్ధం, ముష్టియుద్ధం గుర్రపుస్వారీ ఎక్కువగానే ప్రచారంలో వున్నవి.

1956 డెవిస్‌కప్పు టెన్నిస్ పోటీలలో స్విట్జర్లెండ్ లక్జెంబర్గ్‌ను 3-2 గేములలో ఓడించకలిగింది. శ్రీ బి. డు పాంట్ శ్రీ ఐ. బాలెస్ట్రా, శ్రీ బ్లాండెల్, శ్రీ బూసర్ టెన్నిస్ ఆటలో స్విట్జర్లెండులో కెల్ల ప్రసిద్ధులు.

వ్యాయామ క్రీడలలో ప్రపంచఖ్యాతి గడించిన స్విస్ ప్రముఖులను దిగువ ఉదహరిస్తున్నాను.

శ్రీ ఎఫ్. స్క్వాబ్ : దూరపునడకలో ఈయన ఉద్దండుడు. 10,000 మీటర్ల (6 మైళ్ళ 376 గజాలు) దూరానికి ఈయన రికార్డు 45 నిమిషాల 41 సెకండులు.

శ్రీ. జి. జి. గోడెల్ : ఈయనకూడా సుదూరపు నడకలో నిపుణుడు. 50,000 మీటర్ల (31 మైళ్ళ 120 గజాలు) దూరాన్ని 4 గంటల 48 నిమిషముల 17 సెకండులలో ఈయన నడచినాడు.

లండన్ ఒలింపిక్స్‌లో స్విజ్జర్లెండు ఐదు స్వర్ణపతకాలు సాధించింది. హెల్సింకీ ఒలింపిక్స్‌లో రెండు స్వర్ణపతకాలు, ఆరేసి రజత, కంచుపతకాలు గెలుచుకొన్నది. అనధికార అంచనాబట్టి స్విట్జర్లెండ్ స్థానం 12 వది.

# జమైకా

వెస్ట్ ఇండీస్‌లోని ఈ ప్రాంతం ప్రజలలో అత్యధికులు నీగ్రోలు. నీగ్రోల సొత్తు అయిన పరుగు, ముష్టియుద్ధ క్రీడలలో జమైకా ప్రపంచ ప్రసిద్ధి గన్నది. క్రికెట్ కూడా జమైకాలో బాగా ప్రచారంలో వుంది.

1952 ఒలింపిక్స్‌లో జమైకా రెండు స్వర్ణపతకాలు మూడు రజత పతకాలు సాధించింది. 1948 ఒలింపిక్స్‌లో ఒక స్వర్ణపతకం గెలుచుకొన్నది.

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన జమైకన్ వ్యాయామ క్రీడావేత్తలు గురించి ప్రస్తావిస్తాను.

ఆర్థర్ ఎస్. వింట్ : ఈయన పరుగు ప్రవీణుడు. లండన్ ఒలింపిక్స్‌లో 400 మీటర్ల దూరాన్ని 46.2 సెకండులలో పరుగిడి స్వర్ణపతకం సాధించాడు. హెల్సింకీ ఒలింపిక్స్‌లో 4 × 400 మీటర్ల రిలే పరుగులో జమైకా ప్రథమస్థానం వహించింది. ఇందులోని నలుగురు పరుగు ప్రవీణులలో శ్రీ ఆర్థర్ ఎస్. వింట్ కూడా వున్నారు. వీరి రిలే రికార్డు (3 నిమిషాల 3.9 సెకండులు) ప్రపంచపు రికార్డు.

శ్రీ. హెచ్. హెచ్. మెకెన్లీ : 4 × 400 మీటర్ల రిలే పరుగులో ప్రపంచపు రికార్డు హోల్డర్‌లు నలుగురులోను ఈయన ఒకరు.

శ్రీ. వి. జి. రోడెన్ : 400 మీటర్ల పరుగులో ఒలింపిక్ రికార్డు హోల్డర్. హెల్సింకీ ఒలింపిక్స్‌లో ఈ రికార్డు (45.9 సెకండులు) సంస్థాపించి వున్నాడు. 4 × 400 మీటర్ల రిలేపరుగులో కూడా ఈయన ప్రపంచం రికార్డు హోల్డర్‌లలో ఒకరు.

శ్రీ ఎల్. ఏలయాంగ్ : 4 × 400 మీటర్ల పరుగు ప్రపంచపు రికార్డు హోల్డర్ నలుగురులోను ఈయన ఒకరు.

# బెల్జియమ్

బెనలెక్స్ దేశాలలో ఒకటైన బెల్జియమ్‌లో సైక్లింగ్, వ్యాయామ క్రీడలు, ఈత, కుస్తీ, కత్తియుద్ధం, పడవచోదన, ముష్టియుద్ధం, వాటర్ పోలో, బాస్కెట్ బాల్, టెన్నిస్ ఆటలు ఎక్కువగా ప్రచారంలో వున్నవి. ముఖ్యంగా సైక్లింగ్ లో యూరప్‌లో బెల్జియమ్ గౌరవస్థానం వహిస్తున్నది; ఒలింపిక్స్ లో విడవక స్వర్ణపతకాలను సాధిస్తూ వున్నది. 1948 లో, 1952 లో కూడా దూరపు సైకిల్ పోటీలో బెల్జియమ్ స్వర్ణపతకాలను సాధించింది. శ్రీ ఏ. నొయిడిల్. శ్రీ ఆర్. గ్రొండె లెయర్స్ ఇందులో ప్రసిద్ధులు.

బెల్జియమ్ 1952 ఒలింపిక్స్‌లో బాస్కెట్ బాల్ పోటీలలో సప్తమ స్థానం, వాటర్ పోలో పోటీలలో షష్ఠమసానం వహించింది.

పయామ్, జె. బ్రొకెంట్, జి. మెజ్జి టెన్నిస్‌లో అంతర్జాతీయ ఖ్యాతి గడించారు. పయామ్ ఇండియాలో పర్యటించారు. అయితే ఆయనను కృష్ణన్ వంటి భారతీయ ఆటగాళ్ళు ఓడించారు. మిగిలిన ఇద్దరు 1956 డెవిస్ కప్పు పోటీలలో పాల్గొని స్పెయిన్‌ను 4-1 గేములతో ఓడించారు. ఇక వ్యాయామక్రీడా వేత్తల సంగతి.

**శ్రీ ఆర్. మొయిన్స్ :** వ్యాయామ క్రీడావేత్తలలో శ్రీ ఆర్. మొయిన్స్ బెల్జియమ్‌కే కాక పృథ్వికెల్ల గర్వకారకుడు. 800 మీటర్ల పరుగులో ఈయన ప్రపంచం రికార్డు సంస్థాపించివున్నారు. 1955 లో ఆయన ఆ దూరాన్ని (847 గజాలు) 1 నిమిషం 45 సెకండులలో పరుగిడినాడు. ఈ ప్రపంచపు రికార్డు 1956 మే మొదటి తేదీ వరకు అధిగమించబడలేదు.

14 వ ఒలింపిక్స్‌లో బెల్జియమ్ రెండు స్వర్ణపతకాలు పొందింది. 1952 ఒలింపిక్స్‌లో రెండు స్వర్ణపతకాలు, రెండు రజతపతకాలు గెలుచుకొన్నది. అనధికార అంచనా ప్రకారం బెల్జియమ్‌ది 21 వ సానం.

# డెన్మార్క్



ఈ స్కాండినేవియన్ రాజ్యంలో వ్యాయామ క్రీడలు, ఈత, పడవచోదన, టెన్నిస్, కుస్తీ, కత్తియుద్ధం, సైక్లింగ్, వెయిట్ లిఫ్టింగ్, శాస్త్రీయ వ్యాయామం, ఫుట్‌బాల్, హాకీ విశేషంగా ప్రచారంలో వున్నవి.

పెక్కు పర్యాయములు వింబుల్డన్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో ద్వితీయస్థాన మలంకరించిన శ్రీకర్ నీల్సన్ డెన్మార్క్ దేశస్థుడు. 1956 జనవరిలో కలకత్తాలో ఆసియా టెన్నిస్ ఛాంపియన్‌షిప్‌నుకూడా ఈయన సాధించాడు.

డెన్మార్క్ అంతటా శాస్త్రీయ వ్యాయామం (జిమ్నాస్టిక్స్) విశేషంగా ప్రచారంలో వుంది. శ్రీ నీల్స్‌బుచ్ ఈ విద్యాప్రచారానికి కృషి చేసి వున్నారు.

దూరపు ఈతలో శ్రీమతి ఎల్నా ఆండర్సన్ అంతర్జాతీయ ఖ్యాతి గడించింది. ఈమె ఇంగ్లీష్‌ఛానెల్ (బ్రిటన్, ఫ్రాన్సుల మధ్యవున్నది) ఈతపోటీలలోకూడా పాల్గొన్నది.

ఇక వ్యాయామ క్రీడావేత్తల సంగతి పరికించుదాము :

శ్రీ గున్నార్ నీల్సన్ : డెన్మార్క్‌లోకెల్ల వ్యాయామ క్రీడలలో ప్రసిద్ధిగాంచిన వ్యక్తి జి. నీల్సన్. 1500 మీటర్ల (1640 గజాల) దూరపు పరుగులో ప్రపంచపు రికార్డు హోల్డర్‌లలో ఈయన ఒకరు. 1955 లో ఈయన ఈ దూరాన్ని 3 నిమిషాల 40.9 సెకండులలో పరుగిడాడు. మైలును నాలుగు నిమిషాలలోపు పరుగిడిన మొట్టమొదటి డేన్ కూడా ఈయనే. ఈయన రికార్డు 3 నిమిషాల 59.1 సెకండులు.

శ్రీమతి ఎల్. కెల్స్‌బీ : ఈమె జావిలిన్ త్రోలో ప్రసిద్ధి గాంచినది.

14 వ ఒలింపిక్స్‌లో డెన్మార్క్ ఐదు స్వర్ణపతకాలు సాధించింది.

15 వ ఒలింపిక్స్‌లో రెండు స్వర్ణపతకాలు, ఒక రజతపతకం, మరి రెండు కంచుపతకాలు గెలుచుకొన్నది. అనధికార అంచనా ప్రకారం 15 వ స్థానం.

## హాలెండు

హాకీ ప్రపంచంలో ఇండియా 28 సంవత్సరాల ఆధిపత్యానికి ప్రమాదకరంగా నిలుస్తున్న దేశం హాలెండు అనే నెదర్లెండ్సు.

ఈ యూరోపియన్ దేశం 1952 ఒలింపిక్స్‌లో హాకీలో ద్వితీయ స్థానం, అంతకుముందు ఒలింపిక్స్‌లో తృతీయస్థానం వహించింది.

హెల్సింకీ ఒలింపిక్స్‌లోనే వాటర్‌పోలో క్రీడలో పంచమస్థానం సంపాదించింది.

హాలెండులో ఒక విశేషం వ్యాయామ క్రీడలలో పురుషులకంటె స్త్రీలు ఎక్కువ ఆసక్తి చూపడం. ప్రపంచ పోటీలలో డచ్ స్త్రీలే పురుషులకంటె ఎక్కువగా మాతృదేశానికి కీర్తి తెచ్చారు.

ఉదాహరణకు లండన్ ఒలింపిక్స్‌లో వ్యాయామ క్రీడలలో హాలెండుకు నాలుగు స్వర్ణపతకాలు లభించినవి. మరి దేనిలోను ప్రథమ స్థానం లేదు. ఈ నాల్గింటినీ డచ్ వనితలే సాధించారు. హెల్సింకీ ఒలింపిక్స్‌లో వ్యాయామ క్రీడలలో నెదర్లెండ్సుకు ఏ పతకం రాక పోయినా పంచమ, షష్ఠమ స్థానాలలోనైనా వచ్చినది స్త్రీలే.

హాలెండులో యింకా ఈత, కుస్తీ, సైక్లింగ్, వెయిట్ లిఫ్టింగ్, పడవపోటీ క్రీడ విశేషంగా ప్రచారంలో వున్నవి.

ప్రపంచఖ్యాతి గడించిన డచ్ వ్యాయామ క్రీడావేత్తలను వేళ్ళపై లెక్కపెట్టవచ్చు.

శ్రీమతి బ్లాంకర్స్ కోయెన్ : కొద్ది దూరపు పరుగులో, హార్డిల్స్‌లో ఈమె చరిత్ర సృష్టించింది. 14 వ ఒలింపిక్స్‌లోనే ఈమె నాలుగు స్వర్ణపతకాలు సాధించింది. ఇందులో ఒకటి 4 × 100 మీటర్ల రిలే పరుగు. తక్కిన మూడింటిలో ఆమె ప్రజ్ఞా విశేషాలివి.

100 మీటర్ల పరుగు 11 . 9 సెకండులు; 200 మీటర్ల పరుగు—24 . 4 సెకండులు. అప్పటికి ఒలింపిక్ రికార్డు; 80 మీటర్ల హార్డిల్స్ 11 . 2 సెకండులు. అప్పటికి ఒలింపిక్ రికార్డు; 80 మీటర్ల హార్డిల్స 11 . 2 సెకండులు. అప్పటికి ఒలింపిక్ రికార్డు.

1952 ఒలింపిక్స్‌లోకూడా ఈమె పాల్గొన్నది కాని విజయాలు సాధించలేదు.

1948 లో నెదర్లెండ్సుది దశమస్థానం. 1952 లో 18 వ స్థానం. హెల్సింకీ ఒలింపిక్స్‌లో హాలెండు ఐదు రజతపతకాలు మాత్రం సంపాదించ కలిగింది.

## అర్జెంటీనా

దక్షిణ అమెరికాలోని ఈ స్వతంత్రరాజ్యంలో ఎత్లెటిక్స్, ఈత, కుస్తీ, వెయిట్ లిఫ్టింగ్, ముష్టియుద్ధం, గుర్రపు పందెములు, పోలో, బాస్కెట్ బాల్ మున్నగు ఆటలు విశేషంగా ప్రచారంలో వున్నా. సుదూరపు పరుగులలో అర్జెంటీనావారు గట్టివారు.

అర్జెంటీనా పేరు చెప్పగానే శ్రీ డి. కబ్రేరా జ్ఞాపకానికి వస్తారు. ఈయన లండన్ ఒలింపిక్స్‌లో మరాథన్ (26 మైళ్ళ 385 గజాలు) పరుగు పోటీలో ప్రథమస్థానము పొందినారు. ఈ దూరాన్ని ఆయన 2 గం. 34 నిమిషాల 51 . 6 సెకండ్లలో పరుగిడినారు.

శ్రీ హెచ్. సెల్విట్టీ, శ్రీ యన్. పెర్రారా వెయిట్ లిఫ్టింగ్‌లో ప్రపంచ ఖ్యాతి నొందిన అర్జెంటీనా జాతీయులు. వీ రుభయులూ

హెవీ వెయిట్ తరగతికి చెందినవారు. ఆసెల్విట్టి మెల్బోర్న్ ఒలింపిక్స్‌లో రజతపతకం పొందారు.

లైట్ హెవీ వెయిట్ తరగతికి చెందిన శ్రీ ఏ. పేసెనా, ముష్టియుద్ధంలో పేరొందినాడు.

బాస్కెట్ బాల్ ఆటలో అర్జెంటీనా ప్రపంచ విఖ్యాతి చెందినది. హెల్సింకీ ఒలింపిక్స్‌లో అర్జెంటీనాది చతుర్థ స్థానం.

చతురంగంలో కూడా అర్జెంటీనా ప్రముఖస్థానం వహించింది. మాస్కోలో జరిగిన ప్రపంచ పోటీలలో అది చతుర్థస్థానం సంపాదించింది.




## పోలెండ్



ఈ తూర్పు యూరోపియన్ రాజ్యం రష్యా, చైనాల వలె సమూహ ప్రాతిపదికపై ప్రజలలో వ్యాయామాభివృద్ధికి పాటుపడుతున్నది. లండన్, హెల్సింకీ ఒలింపిక్ పోటీలు రెండింటిలోనూ పోలెండు పాల్గొన్నది. 1955 లో ప్రపంచ యువజనోత్సవాలను పోలెండు నిర్వహించి వున్నది.

వ్యాయామక్రీడలు, ముష్టియుద్ధం, కుస్తీ, వెయిట్ లిఫ్టింగ్, టెన్నిస్, మంచు, నీటి ఆటలు ఈ దేశములో విశేషప్రచారములో వున్నవి.

1956 లో డేవిస్ కప్ టెన్నిస్ పోటీలలో పోలెండ్ ఆస్ట్రియాను ఓడించింది. శ్రీయుతులు వి. స్కొనెకి, ఎ. లిసిస్ పిటెక్, ప్రపంచ ప్రసిద్ధి చెందిన పోలిష్ టెన్నిస్ ఆటగాళ్ళు.

శ్రీ జె. క్రోమిక్ అంతర్జాతీయ ఖ్యాతి గడించిన ఎథ్లెట్. 3,000 మీటర్ల స్టీపుల్ ఛేజ్ లో ఈయన చాలా కాలంవరకూ ప్రపంచములోకెల్ల అద్వితీయుడు. 1955 లో ఈయన 3,000 మీటర్ల స్టీపుల్ ఛేజ్ ను 8 నిమిషముల 40.2 సెకండ్లలో పూర్తిచేసి ప్రపంచం రికార్డు స్థాపించాడు. $6\frac{1}{4}$ మైళ్ళ దూరపు పరుగులో కూడా ఈయన దిట్ట.

# కెనడా

ఈ కామన్ వెల్తు రాజ్యం క్రీడారంగంలో ప్రముఖస్థానం వహించ డానికి అర్థికాది వసతులు పొందివున్నప్పటికి ఆస్థానాన్ని అధిష్ఠించలేక పోతున్నది.

ఈ దేశంలో వ్యాయామక్రీడలు, వెయిట్ లిఫ్టింగ్, హాకీ, కుస్తీ, ముష్టియుద్ధం, గుఱ్ఱపుస్వారీ పోటీలు, నౌకా చోదన మున్నగు క్రీడలు విశేషంగా ప్రచారములో వున్నవి. కెనడా, ఆంధ్రదేశము ఒక క్రీడలో విశేషాభిమానం చూపడం గమనార్హం. తెలుగుదేశంలో ప్రతి ఉత్సవంలోనూ ఎద్దుబండ్ల పోటీలు జరుపబడుతవి. ఎద్దులబండ్లను వేగ ముగా నడపడంలోనూ, ఎద్దులచే ఎక్కువ బరువు లాగించడంలోనూ పోటీలు జరుగుతవి. ఇవి ఆంధ్ర జాతీయ క్రీడలలో ఒకటిగా చెప్ప వచ్చు. కెనడాలో కూడా ఇట్టి జాతీయక్రీడ ఒకటి కలదు. కెనడాలో దాదాపు ప్రతి జాతీయోత్సవంలోనూ ఎద్దులచే హెచ్చు బరువులు లాగించడంలో పోటీలు జరుపబడుతవి. ఇతర క్రీడ లన్నిటికంటె దీనికి అధికంగా ప్రజాకర్షణ వుంటుంది.

లండన్, హెల్సింకీ పోటీలలో కెనడా పాల్గొన్నది. వీటిలో ప్రముఖస్థానం ఏదీ పొందలేదు. శ్రీ హెబర్గ అనే వెయిట్ లిఫ్టర్ అమెరికాకు చెందిన జో డేవిస్ (హెవీ వెయిట్) రికార్డును తొలిసారి అధిగమించి కెనడాకు ఎనలేని కీర్తి సంపాదించారు. 1954 ఆగస్టులో వాంకోవర్‌లో జరిగిన అయిదవ బ్రిటిష్ ఏంపైర్ కామన్‌వెల్తు క్రీడోత్సవంలో కెనడా పాల్గొని తృతీయస్థానం పొందింది. 1956 మే, జూన్ లలో ఆస్ట్రేలియాలో జరిగిన ప్రపంచ స్త్రీల హాకీ పోటీలలో కెనడా మూడు పాయింట్లు సంపాదించి నవమస్థానం పొందింది.

1956 మేలో జరిగిన డేవిస్‌కప్ పోటీలలో కెనడా వెస్టిండీస్‌ను 5-0 మ్యాచిలతో ఓడించింది. శ్రీ ఆర్. బెడార్డ్, శ్రీ హెచ్. రాకన్, శ్రీ డి. ఫాంటానా కెనడాలో ప్రసిద్ధినొందిన టెన్నిస్ ఆటగాళ్ళు. శ్రీ ఫాంటానా 1955-56లో ఇండియాలో పర్యటించాడు.

# యూగోస్లావియా



ఫుట్ బాల్ ఆటలో ప్రపంచంలో ప్రముఖస్థానం వహిస్తున్న దేశం యూగోస్లావియా. లండన్ ఒలింపిక్స్‌లోనూ, హెల్సింక్ ఒలింపిక్స్‌లోనూ ఈ దేశం ద్వితీయస్థానం పొందింది. 1952 లో జరిగిన ప్రపంచ ఒలింపిక్స్‌లో యూగొస్లావియన్లు, ఇండియనులను 10-1 గోలులతో ఓడించి వేశారు. అంతవరకూ భారతీయులు బూట్లకు అలవాటుపడిలేరు. యూగోస్లావియా మనపై అద్భుత విజయం సాధించడానికి భారతీయ ఆటగాళ్ళు బూట్లతో ఆడకపోవడం ఒక కారణంగా ఎంచబడింది. యూగోస్లావియా నేర్పిన పాఠము వల్లనే భారతీయులు బూట్లతో ఫుట్ బాల్ ఆట దీక్షగా అభ్యసించుట ఆరంభించినారు.

వాటర్ పోలో ఆటలో కూడా యూగోస్లావియా జగద్విఖ్యాతి గాంచినది. 15 వ ఒలింపిక్స్‌లో యూగోస్లావియా రజిత పతకం సాధించింది.

శ్రీ పనజ టొవిక్, శ్రీ జె. కేరెటిక్, శ్రీ జె. పల్లాడ, శ్రీ స్లైబిక్ యూగోస్లావియాలో పేరొందిన టెన్నిస్ ఆటగాళ్ళు. వీరు 1956 మేలో జరిగిన డేవిస్ కప్ పోటీలలో ఈజిప్టును 4-1 మ్యాచీలతో ఓడించారు.

శ్రీ బి. డౌగ్ బిక్ జావలిన్ త్రోలో అంతర్జాతీయ ఖ్యాతి గడించిన యూగోస్లావియన్. వ్యాయామ క్రీడలలో యూగోస్లావియా ప్రశంసనీయమైన స్థానం ఏమీ సంపాదించలేదు.

# బ్రెజిల్

వ్యాయామ క్రీడలలోనూ, బాస్కెట్ బాల్, ఫుట్ బాల్ వంటి ఆటలలోనూ ఈ దక్షిణ అమెరికా రాజ్యం ఒక ప్రముఖస్థానాన్ని వహించి వున్నది.

బ్రెజిల్ పేరు చెప్పగానే శ్రీ ఏ. యఫ్. డా. సిల్వా పేరు జ్ఞాపకానికి వస్తుంది. హాప్-స్టెప్ అండ్ జంప్‌లో (అగి, అగి దూకడం) ఈయన ప్రపంచములోకెల్లా అద్వితీయుడు. 15 వ ఒలింపిక్స్‌లో ఈయన మొత్తం 53 అడుగుల $2\frac{1}{2}$ అంగుళముల దూరం అగి అగి దూకి ఒలింపిక్ రికార్డును నెలకొల్పినాడు. 1956 లో 54 అడుగుల 4 అంగుళాల దూరం అగి అగి దూకినాడు. అప్పటికి గుర్తించబడిన ప్రపంచం రికార్డు 53 అడుగుల $2\frac{3}{4}$ అంగుళాలు. మెల్బోర్న్ ఒలింపిక్స్‌లో 53 అడుగుల $7\frac{1}{2}$ అంగుళాల దూరం అగి అగి దూకి స్వర్ణపతకం పొందాడు.

బాస్కెట్ బాల్ పోటీలో బ్రెజిల్ లండన్ ఒలింపిక్స్‌లో కంచుపతకం పొందింది. హెల్సింకీ ఒలింపిక్స్‌లో ఆరవస్థానం సాధించింది.

## న్యూజిలెండ్



ఆస్ట్రేలియాకు దక్షిణంగా గల కామన్ వెల్తు దేశం న్యూజిలెండు. వ్యాయామ క్రీడలకు, క్రికెట్, హాకీ, ఈత, కుస్తీ మున్నగు క్రీడలకు ప్రసిద్ధి చెందినది.

1955-56 లో ఇండియాలో న్యూజిలెండు క్రికెటు జట్టు పర్యటించింది. మొత్తం జరిగిన ఐదు టెస్టుపోటీలలో ఇండియా రెండింటిని గెలుచుకొన్నది. మూడు "డ్రా" అయినవి. న్యూజిలెండుకు ఓటమి సిద్ధించినప్పటికీ రీడ్, సట్క్లిఫ్, లెగ్గాట్ ప్రపంచ తరగతికి చెందినవారని రుజువుపర్చుకున్నారు. న్యూజిలెండులో 1930 నుంచి క్రికెట్ క్రీడపట్ల విశేషాసక్తి చూపబడుచున్నప్పటికి న్యూజిలెండు ఒక్క టెస్టు విజయానికయిననూ నిన్న మొన్నటి వరకు నోచుకొనలేదు. ఇండియాలో న్యూజిలెండు క్రికెట్ జట్టు పొందిన అనుభవం ఒకవిధంగా లాభించింది. స్వదేశానికి తిరిగి వెళ్ళిన పిమ్మట మొదటి టెస్టు విజయం వెస్ట్ఇండీస్‌పై సాధించింది.

హాకీ ఆటలో ఇండియాకు, న్యూజిలెండు గట్టి పోటీగా ఉండగల శక్తి సంపాదించింది. 1955 పూర్వార్ధంలో న్యూజిలెండులో పర్యటించిన ఇండియన్ హాకీజట్టుపై (వాండరర్స్) న్యూజిలెండు విజయం సాధించి వున్నదికూడా. 1956 లో ఆస్ట్రేలియాలో జరిగిన ప్రపంచ స్త్రీల హాకీ పోటీలలో న్యూజిలెండు మొత్తం ఎనిమిది పాయింట్లు సంపాదించి తృతీయస్థానం పొందింది.

1954 ఆగష్టులో వాంకోవర్ లో జరిగిన బ్రిటిష్ ఎంపైర్ కామన్ వెల్తు క్రీడోత్సవంలో న్యూజిలెండుకు పంచమస్థానం లభించింది. ఈ క్రీడోత్సవంలో ఒక యువతి మూడు స్వర్ణపతకములను సాధించింది. ఆమె యెట్టి విలియమ్స్ అనే న్యూజిలెండు నివాసిని. ఆమె స్త్రీల పోటీలలో చక్రప్రక్షేపంలో (డిస్కస్ త్రో), దీర్ఘప్లుతిలో (లాంగ్ జంప్), సీసగోల పాతనంలో (షాట్ పుట్) ప్రథమస్థానం పొందింది.

## ఉరూగ్వే

ఈ దక్షిణ అమెరికా రాజ్యం ప్రపంచ ఫుట్‌బాల్ పటంలో ప్రముఖస్థానం వహించింది. బాస్కెట్‌బాల్ ఆటకూడా ఈ దేశంలో విశేషంగా ప్రచారంలో వున్నది. పడవ చోదన, సైక్లింగ్ వంటి క్రీడలు కూడా ఈ దేశంలో విశేషాభిమానం పొందినవి. హెల్సింకీ ఒలింపిక్స్‌లో ఉరూగ్వే మూడు కంచు పతకాలను పొందింది. అందులో ఒకటి బాస్కెట్‌బాల్ పోటీలో సాధించబడినట్టిది.

## లక్జెంబర్గ్

15 వ ప్రపంచ ఒలింపిక్స్‌లో లక్జెంబర్గ్ ఒకే ఒక స్వర్ణపతకం పొందింది. శ్రీ జె. బార్థిక్ 15,000 మీటర్ల దూరాన్ని 3 నిమిషాల 45 . 2 సెకండ్లలో పూర్తిచేసి ఒలింపిక్ రికార్డునుకూడా స్థాపించాడు.

"బెనెలక్స్" రాజ్యాలలో ఒకటైన లక్జెంబర్గ్‌లో టెన్నిస్ విశేషంగా ప్రచారంలో వున్నది. శ్రీ జి. వెర్థిమ్, శ్రీ జి. వామ్‌పామ్

ఈ దేశపు అగ్ర ఆటగాళ్ళు. 1956 మేలో జరిగిన డేవిస్ కప్ పోటీలలో లక్జెంబర్గ్‌ను స్విట్జర్లెండు 3-2 మ్యాచ్‌లతో ఓడించింది.

## ఆస్ట్రియా



ఈ యూరోపియన్ దేశం ప్రస్తుతం ఏ క్రీడలోనూ ప్రపంచాధిపత్యం వహించి వుండలేదు. అయితే వెయిట్ లిఫ్టింగ్, టెన్నిస్, ఫుట్‌బాల్, టేబుల్ టెన్నిస్, వ్యాయామక్రీడలలో ఆస్ట్రియా అంతర్జాతీయ పోటీలలో పాల్గొంటూ ఇప్పుడిప్పుడే పైకి వస్తున్నది. యువజనోత్సవాలలో ఆస్ట్రియన్ యువకులు ప్రముఖపాత్ర వహిస్తూవున్నారు.

శ్రీ యఫ్. సైకో, శ్రీ యఫ్ హుబ్యాబర్ ఆస్ట్రియాలోకెల్ల ప్రసిద్ధి చెందిన టెన్నిస్ ఆటగాళ్ళు. 1956 మేలో జరిగిన డేవిస్‌కప్ పోటీలలో పోలెండు ఆస్ట్రియాను 3-2 మ్యాచీలలో ఓడించింది.

హెల్సింకీ ఒలింపిక్స్‌లో ఒక రజతపతకాన్ని, ఒక కంచు పతకాన్ని ఆస్ట్రియనులు గెలుచుకొన్నారు.

## ఐర్లెండు

ఉత్తర, దక్షిణ ఐర్లెండు రెండింటిని దృష్టిలో పెట్టుకొన్నట్లైతే హామర్‌త్రోలో ప్రపంచంలోకెల్లా అద్వితీయులయినవారు ఐర్లెండులో లోగడ వెలసిల్లినారని గట్టిగా చెప్పవచ్చు. ఆధునికమయిన హామర్‌ను విసరడంలో (ముద్గర ప్రపాతనం) మొట్టమొదటి రికార్డును సృష్టించినది ఐరిష్ జాతీయుడే. థామస్ మిచెల్ అనే ఐరిష్ ప్రముఖుడు 1888 లో 130 అడుగుల దూరానికి హామర్ విసిరినాడు. ప్రపంచ ఒలింపిక్ పోటీలలో హామర్ త్రో లో మొట్టమొదటిసారి విజయమొందింది కూడా జె. జె. ఫ్లాన్నగాన్ అనే ఐరిష్ ప్రముఖుడే. ఈయన 1900, 1904,

1908 ఒలింపిక్స్‌లలో ప్రథమస్థానం పొందాడు. ఈయన రికార్డు 174 అడుగుల $4\frac{1}{4}$ అంగుళములు. పాట్రిక్ ర్యాన్, డాక్టర్ జెకాలఘాన్, డాక్టర్ బెర్టీ హీలియన్ కూడా ప్రపంచ ప్రసిద్ధి చెందిన హామర్ త్రోయర్లు.

ఐర్లెండులో వ్యాయామక్రీడలే కాక ముష్టియుద్ధం, కుస్తీ, గుఱ్ఱపుస్వారీ, ఫుట్‌బాల్, హాకీ మున్నగు క్రీడలు కూడా విశేషంగా ప్రచారములో వున్నవి.

శ్రీ జె. మాక్నల్లే (ఫ్లయ్‌వెయిట్) అనే ముష్టియుద్ధ ప్రవీణుడు ప్రపంచఖ్యాతి పొందినాడు.

శ్రీ జె. పి. జాక్సన్, శ్రీ హాకెట్ ఐర్లెండులో కెల్లా ప్రసిద్ధి పొందిన టెన్నిస్ ఆటగాళ్ళు. గత మేలో జరిగిన డేవిస్‌కప్ పోటీలలో ఐర్లెండును జర్మనీ 4-1 మ్యాచీలతో ఓడించింది. 1956 లోనే ఆస్ట్రేలియాలో జరిగిన ప్రపంచ స్త్రీల హాకీ పోటీలలో ఐర్లెండు పాల్గొని ఆరుపాయింట్లు సంపాదించుకొని పంచమస్థానం పొందింది.

## స్పెయిన్

ఈ యూరోపియన్ రాజ్యంలో వృషభక్రీడ (బుల్ ఫైటింగ్) ప్రపంచంలో మరెచ్చటా లేనంతగా ప్రచారంలో వున్నది.

ముష్టియుద్ధం టెన్నిస్ గుఱ్ఱపుస్వారీ, షూటింగ్, వెయిట్ లిఫ్టింగ్, కుస్తీ, ఫుట్‌బాల్, వాటర్ పోలో, నీటి మంచు ఆటలు ఈ దేశంలో విశేషంగా ప్రచారంలో వున్నవి. వ్యాయామ క్రీడల్లో స్పెయిన్ ప్రస్తుతం ప్రపంచతరగతికి చెందినవారెవ్వరినీ సృష్టించలేదు'

శ్రీ యి. మార్టినెజ్. శ్రీ జె. యమ్. కౌడర్, శ్రీ ఓలియాగా స్పెయిన్‌లో అగ్రస్థానం వహిస్తున్న టెన్నిస్ ఆటగాళ్ళు. 1956 మేలో జరిగిన డేవిస్ కప్ పోటీలలో బెల్జియమ్ స్పెయిన్‌ను 4-1 మ్యాచీలతో ఓడించింది.

# దక్షిణాఫ్రికా

వ్యాయామక్రీడలూ, ఈత, వెయిట్ లిఫ్టింగ్, సైక్లింగ్, టెన్నిస్, కుస్తీ, ముష్టియుద్ధం, ఫుట్ బాల్, క్రికెట్, బాస్కెట్ బాల్ వంటి క్రీడలు ఈ కామన్ వెల్తు దేశంలో విశేషంగా ప్రచారంలో వున్నవి. ప్రభుత్వపు జాతివిచక్షణ విధానాలవల్ల పెక్కుమంది ఆఫ్రికన్లు విశ్వ ఖ్యాతి పొందలేకపోతున్నారు. ప్రపంచపోటీలలో పాల్గొనడానికి విదేశాలలో పర్యటించడానికి ఈ విచక్షణ విధానం ఆఫ్రికన్ క్రీడా వేత్తలకు పెద్ద అవరోధంగా వున్నది. నిన్న, మొన్నటివరకు అమెరికా అంతటి అభ్యుదయదేశంలోనే టెన్నిస్ ఆటల్లో నీగ్రోలు శ్వేత జాతీయులతో పోటీచేయడానికి అనుమతి వుండేదిగాదు. ఈ నిషేధం తొలగించబడిన పిమ్మటనే నీగ్రో కన్య ఆల్థీ గిబ్సన్ ప్రపంచఖ్యాతి పొంది ఒకే ఏడాదిలో 18 ఛాంపియన్ షిప్ లను సాధించగలిగింది. గోల్ఫ్ లో కూడా అమెరికాలో జాతివిచక్షణ అమలులో వున్నది. ఇప్పుడిప్పుడే అది సడలించబడుతున్నది. అమెరికా క్రీడారంగం లోనే జాతివిచక్షణ ఇంతగా వెఱ్ఱితల లెత్తినప్పుడు దక్షిణాఫ్రికా క్రీడారంగంలో పరిస్థితి ఎంత దుర్భరమో ఊహించవచ్చును. దక్షిణా ఫ్రికానుంచి ఒక ఫుట్ బాల్ జట్టును ఇండియాకు ఆహ్వానించడానికి రెండుమూడేండ్లక్రితం జరిగిన ప్రయత్నములన్నీ చివరిఘడియలో విఫల మయిపోయినవి. ఇందుకు కారణం దక్షిణాఫ్రికా ప్రభుత్వపు జాతి విచక్షణ దృష్టి. శ్వేతేతరులు విదేశాలకు వెళ్ళితే దక్షిణాఫ్రికాలోని దుర్భర పరిస్థితులను చెప్పివేయగలరని ప్రభుత్వం భయపడి క్రీడావేత్తలకు పాస్ పోర్టులు ఇవ్వలేదు; ఇవ్వడంలేదు.

దక్షిణాఫ్రికాలోని ఇప్పటి ఎత్లెట్ లలో ప్రపంచశ్రేణికి చెందిన వారు ప్రస్తుతం లేరు.

దాదాపు పావుశతాబ్దం వెనుకకు పోయినట్లయితే సుదూరపు పరుగులలో చరిత్ర సృష్టించిన ఆర్థర్ న్యూటన్ తలపునకు రాగలరు. 1922 ప్రాంతాల ఈయన దక్షిణాఫ్రికాలో నివసించారు. వృత్తి

వ్యవసాయం. పరుగు పోటీ అంటే ప్రాణం. ఈయన తన 39 వ ఏట సుదూరపు పరుగులలో తనకు తానే తీవ్రంగా శిక్షణ పొందారు. నిప్పు లోళ్ళను తరిమి, తరిమి ఆవిధంగా దూరపు పరుగులలో తీవ్రశిక్షణ పొందినారు. 1923 లో ఈయన 50 మైళ్ళను 5 గంటల 53 నిమిషాలలో పరుగిడారు. 1926 లో దాదాపు 55 మైళ్ళను 6 గంటల 14-3/4 నిమిషాలలో పరుగిడారు. ఈ పరుగులోనే 30 మైళ్ళకు, 40, 50, మైళ్ళకు ప్రపంచం రికార్డు సృష్టించినట్లు చరిత్ర చాటుచున్నది. ఈయన 12 సంవత్సరములు దూరపు పరుగు పోటీలలో పాల్గొన్నారు. ఈ కాలంలో ఈయన పరుగిడిన మైళ్ళ సంఖ్య దాదాపు 10 లక్షల మైళ్ళు. ఈయన మరొక రికార్డు 24 గంటలలో దాదాపు 153 మైళ్ళు పరుగిడడం.

సుదూరపు పరుగులలో ఈ మధ్య చరిత్ర సృష్టించిన మరొక దక్షిణాఫ్రికన్ వాల్ హెవార్డ్. 1953 లో ఈయన 24 గంటలలో 159 మైళ్ళ 386 గజాల దూరం పరుగిడినాడు. అప్పటి కాయన వయస్సు 46 సంవత్సరములట.

సైక్లింగ్ లో కూడా దక్షిణాఫ్రికా ప్రపంచంలో గణుతి కెక్కింది. ఈ దేశపు ప్రవీణులు గత హెల్సింకి ఒలింపిక్స్‌లో రెండు రజతపతకములు పొందారు.

హాకీ ఆటలో దక్షిణాఫ్రికా యువతులు ప్రపంచంలో అగ్రస్థానం వహించి యున్నారు. ఆస్ట్రేలియాలో గత మేలో జరిగిన ప్రపంచ స్త్రీల హాకీ పోటీలో దక్షిణాఫ్రికా 12 పాయింట్లు సంపాదించి ప్రథమస్థానం పొందింది.

టెన్నిస్‌లో ఇవన్ పీర్మాక్, ఫాన్ కట్ శ్రీ గార్డన్ ఫార్బస్, పి. సేగల్ అగ్రగణ్యులు. యువ ఆటగాళ్లు శ్రీ ఫార్బన్ డా జార్స్లోవ్ ద్రాబ్నీని 1956 జూన్‌లో 3 - 6, 6 - 3, 6 - 4 గేములతో ఓడించాడు.

మొదట పేర్కొన్నట్లు శ్వేతేతర క్రీడాసంస్థలు ప్రపంచ క్రీడా సంస్థలచే గుర్తించబడటానికి తీవ్రంగా కృషిచేస్తున్నవి. ప్రపంచ సంస్థల గుర్తింపు పొందడంకోసం శ్వేతేతర క్రీడాసంస్థలు 1956 జూన్‌లో

ఒక నేషనల్ కమిటీని ఏర్పాటుచేసికొన్నవి. 1960 లో జరుగగల ప్రపంచ క్రీడోత్సవంలోనైనా దక్షిణాఫ్రికాలోని శ్వేతేతరులు పాల్గొన డానికి ఈ కమిటీ తీవ్రంగా కృషిచేస్తున్నది.

## దక్షిణాఫ్రికా క్రికెట్ సంఘంలో ఆంధ్రుడు

దక్షిణాఫ్రికాలోని నాన్ యూరోపియన్ క్రికెటు కంట్రోలు బోర్డు శ్వేతేతరులలో క్రికెట్ ప్రచారానికి విశేషంగా కృషిచేస్తున్నది– ఈ బోర్డుకు ఉపాధ్యక్షు పదవి వహిస్తున్న ఆంధ్రప్రముఖుడు శ్రీయస్. జె. రెడ్డిగారు ఈ కృషిలో ప్రముఖపాత్ర వహించడం ఆంధ్రకు గర్వ కారణం.

1955 లో దక్షిణాఫ్రికా క్రికెట్ ఆటగాళ్ళు బ్రిటన్‌లో పర్య టించారు. దక్షిణాఫ్రికా బ్రిటన్‌లకు మొత్తం అయిదు టెస్టుపోటీలు జరుగగా దక్షిణాఫ్రికా రెండింటిలో విజయం పొందింది. మూడింటిలో ఓడిపోయింది. దక్షిణాఫ్రికా జట్టు కెప్టెన్ శ్రీ జి. ఇ. చీతామ్.

## పశ్చిమ ఆసియా, అరబ్ రాజ్యాలు

ఇక పశ్చిమ ఆసియా, అరబ్ రాజ్యాల క్రీడారంగస్థితి పరికించు దాము. స్థూలంగా చూచినట్లయితే ఈ రాజ్యాలు కుస్తీ, ఈత, వెయిట్ లిఫ్టింగ్ వంటి క్రీడలలో ప్రపంచ తరగతికి సమీపంలో వున్నట్లు తోస్తున్నది. పశ్చిమ ఆసియా వస్తాదులు కొందరు ప్రపంచంలో అగ్ర స్థానం వహించివున్నారు కూడా.

## పర్షియా

ఈ అరబ్ రాజ్యం లండన్ హెల్సింకీలలో జరిగిన ప్రపంచ ఒలింపిక్స్‌లోనూ, 1951లో ఢిల్లీలో, జరిగిన ప్రథమ ఆసియా క్రీడోత్సవం లోనూ పాల్గొన్నది. లండన్ ఒలింపిక్స్‌లో కుస్తీ, వెయిట్



లిఫ్టింగ్ లలోనూ, హెల్సింకి ఒలింపిక్స్‌లో వెయిట్ లిఫ్టింగ్ లోనూ ప్రశంసనీయమైన పాత్ర వహించింది. ప్రథమ ఆసియా క్రీడోత్సవంలో పర్షియన్ వెయిట్ లిఫ్టర్‌లు అన్ని తరగతుల్లోనూ (బాన్‌టమ్, ఫెదర్, లైట్, మిడిల్, మిడిల్ హెవీ, లైట్ హెవీ, హెవీ తరగతులలో) ప్రథమస్థానం వహించి స్వర్ణపతకములు పొందినారు. 5,000 మీటర్ల పరుగులో కూడా పర్షియాకు ప్రథమ స్థానం సిద్ధించింది. 1954లో జరిగిన ఆసియా క్రీడోత్సవంలో పర్షియా పాల్గొనలేదు.

1954 అక్టోబరులో వియన్నాలో జరిగిన ప్రపంచం వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో శ్రీ యన్. నమ్‌డ్జో బాంటమ్ వెయిట్ తరగతిలో ద్వితీయ స్థానం, ఇదే తరగతిలో శ్రీ ఎ. మీర్జాయ్ తృతీయ స్థానం పొందారు. లైట్ వెయిట్ తరగతికి చెందిన శ్రీ హెచ్. ఫెర్ధాస్ లైట్ హెవీ వెయిట్ తరగతికి చెందిన శ్రీ హెచ్. రహ్నావర్ధ, మిడిల్ హెవీ వెయిట్ తరగతికి చెందిన శ్రీ యఫ్. కోజాన్ ప్రశంసనీయమైన ప్రజ్ఞాప్రదర్శనం చేశారు. శ్రీ నమ్‌డ్జో నేటికీ రికార్డులపై రికార్డులు సృష్టించుచున్నారు.



## టర్కీ



కుస్తీలో ప్రపంచంలో ప్రముఖస్థానం వహిస్తున్న దేశాలలో టర్కీ ఒకటి. ఈ అరబ్ రాజ్యం లండన్ ఒలింపిక్స్‌లో ఫ్రీస్టయిల్ కుస్తీ పోటీలలో నాలుగు స్వర్ణ పతకాలు, రెండు రజత పతకాలు సాధించింది.

గ్రీకో రోమన్ పద్ధతి కుస్తీలో రెండు స్వర్ణపతకాలనూ రెండు రజత పతకాలనూ సాధించింది. హెల్సింకీ ఒలింపిక్స్‌లో టర్కిష్ మల్లవిద్యా ప్రవీణులు గ్రీకోరోమన్ పద్ధతిలో మిడిల్ వెయిట్, లైట్ హెవీ వెయిట్ తరగతులలో పంచమస్థానం మాత్రమే పొందగలిగారు. ఫ్రీస్టైలు విధానంలో ఫ్లైవెయిట్ తరగతిలో టర్కీ ఒక స్వర్ణపతకాన్ని, మరొక కంచు పతకాన్ని సాధించగలిగింది.

1956 మేలో ఇస్తాంబుల్‌లో గ్రీకో రోమన్ పద్ధతిని ప్రపంచ కుస్తీ పోటీలు జరుగగా 36.5 పాయింట్లు సంపాదించుకొన్న టర్కీ ద్వితీయ స్థానం పొందింది. ప్రథమస్థానం రష్యాది. ఫ్లైవెయిట్ తరగతికి చెందిన శ్రీ ఎర్బాష్ బాంటమ్ వెయిట్ తరగతికి చెందిన శ్రీ యిల్మాజ్ ఈ పోటీలలో టర్కీకి ఘనవిజయాలు సాధించారు.

టెన్నిస్ ఆటలో యస్. బారీ, యస్. ఫెన్‌మెన్, టర్కీలో కెల్ల ప్రసిద్ధి చెందిన ఆటగాళ్లు. 1956 మేలో జరిగిన డేవిస్‌కప్ టెన్నిస్ పోటీలలో హాలెండ్, టర్కీని 5-0 మ్యాచీలతో ఓడించింది. వ్యాయామ క్రీడలుకూడా టర్కీలో ప్రచారంలో వున్నప్పటికీ ప్రపంచ తరగతికి చెందినవారు అక్కడ ప్రస్తుతం లేరు.

## ఈ జి ప్టు

ఈతగాళ్ళకు, వస్తాదులకు, వెయిట్ లిఫ్టర్లకు ఈజిప్టది పెట్టింది పేరు.

ఇంగ్లీష్ ఛానల్ ఈతలో ఈజిప్షియనులు అనేక సంవత్సరములు అగ్రస్థానం పొందారు. అబ్దుల్ హానీఫ్ (ఈయన జననం 1928) 1955లో జరిగిన ఇంగ్లీష్ ఛానల్ ఈతపోటీని గెలుచుకొని బుట్లిన్ కప్ సాధించాడు. యూసెక్ గిర్గిస్, అనే మరొక ఈజిప్షియన్ యువకుడు శ్రీమతి గాబ్రియస్ పెగ్గీ అనే ఈజిప్షియన్ వనితకూడా ఆ పోటీలలో పాల్గొన్నారు.

శ్రీ ఐషామస్ ప్రపంచప్రసిద్ధి చెందిన వెయిట్ లిఫ్టర్. లైట్ వెయిట్ తరగతిలో జర్క్ పద్ధతిలో 338$\frac{1}{4}$ పౌన్ల బరువును ఎత్తి ప్రపంచ రికార్డును సృష్టించాడు.

హెల్సింకి ఒలింపిక్స్‌లో ఈజిప్షియన్ వస్తాదులు గ్రీకో రోమన్ పద్ధతిలో జరిగిన పోటీలలో ఫ్లైవెయిట్ తరగతిలో పంచమ స్థానం, ఫెదర్‌వెయిట్ తరగతిలో తృతీయస్థానం పొందారు. రాజకీయ కారణాలవల్ల ఈజిప్ట్ మెల్బోర్న్ ఒలింపిక్స్‌లో పాల్గొనలేకపోయింది.

టెన్నిస్‌కూడా ఈజిప్టులో విశేషంగా ఆదరించబడుతున్న ఆట. 1954 సంవత్సరంలో వింబుల్‌డన్ ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొన్న శ్రీ డ్రాబ్నీ చెకోస్లొవాకియా దేశస్థుడయినా, నివసిస్తున్నది ఈజిప్టులో. 1956 వింబుల్డన్ పోటీలో ఈయనను ఇండియా అగ్ర ఆటగాడు శ్రీ ఆర్. కృష్ణన్ ఓడించారు.

ఖాదర్ యల్‌దిన్, ఇస్మాయిల్, అలోబాస్ ఈజిప్టులో పేరన్నికగన్న టెన్నిస్ ఆటగాళ్ళు. 1956 మేలో జరిగిన డేవిస్‌కప్ పోటీలలో ఈజిప్టును యూగోస్లావియా 4-1 మ్యాచీలతో ఓడించింది.

ఆఫ్రికా ఖండంలోని ఈ రాజ్యంలో వ్యాయామక్రీడలు (ఎథ్లెటిక్స్) విశేషంగా ప్రచారంలో వున్నా ప్రపంచతరగతిని అందు కున్న అథ్లెట్లు ప్రస్తుతం ఈజిప్టులో లేరు.

## లెబనాన్

ఈ ఆరబ్ రాజ్యంకూడా మల్లవిద్యలో ఖ్యాతినొందింది. హెల్సింకి ఒలింపిక్స్‌లో గ్రీకో రోమన్ పద్ధతి కుస్తీ పోటీలలో బాంటమ్ వెయిట్ తరగతికి చెందిన శ్రీ ఐ. ఛిహాబ్ అనే లెబనీస్ పౌరుడు ఒక రజత పతకాన్ని, వెల్టర్ వెయిట్ తరగతికి చెందిన శ్రీ కె. టాహా ఒక కంచుపతకాన్ని సాధించారు.

వెయిట్ లిఫ్టింగులో మిడిల్ వెయిట్‌కు చెందిన శ్రీ. యమ్. లహానా అంతర్జాతీయ ఖ్యాతి గడించిన యోధుడు. ఈయన మొత్తం లిఫ్ట్ రికార్డు 793$\frac{1}{4}$ పౌన్లు.

# ఆసియా రాజ్యాలు

ఇక ఆసియా దేశాలలో క్రీడారంగ స్థితిని పరికించుదాము.

## జపాన్



ఆసియాలో క్రీడారంగంలో అన్ని దేశాలకంటె జపానుది అగ్రస్థానం. 1954 మేలో మనీలాలో జరిగిన ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలో ట్రాక్ అండ్ ఫీల్డ్, కుస్తీ, ఈత పోటీలలో ప్రథమ స్థానం, షూటింగ్, ముష్టియుద్ధంలలో ద్వితీయ స్థానం. బాస్కెట్ బాల్ పోటీలలో తృతీయ స్థానం జపాన్ సాధించింది. ఇదే క్రీడోత్సవంలో జపాన్ మొత్తం 38 స్వర్ణపతకాలుపొంది ప్రథమ స్థానం వహించింది. 1951 లో ఢిల్లీలో జరిగిన ప్రథమ ఆసియా క్రీడోత్సవంలో జపాన్ ఎథ్లెటిక్స్‌లోనూ, సైక్లింగ్ పోటీలు మూడింటిలోనూ ప్రథమస్థానం పొందింది. బాస్కెట్ బాల్ పోటీలో ద్వితీయస్థానం సాధించింది.

1956 లో జరిగిన ప్రపంచ టేబుల్ టెన్నిస్ పోటీలలో జపాన్ స్వేద్లింగ్ కప్పును (పురుషుల ఛాంపియన్ షిప్ ను) గెలుచుకొన్నది. స్త్రీలకు కార్బిలన్ కప్పుకై జరిగిన ప్రపంచ టేబుల్ టెన్నిస్ పోటీలలో జపాన్ ది తృతీయ స్థానం.

1954-55 లలో కూడా స్వేద్లింగ్ కప్పును జపాన్ గెలుచుకొన్నది. టేబుల్ టెన్నిస్‌లో మొత్తం ఏడు ప్రపంచబిరుదులలో నాల్గింటిని 1956 లో జపాన్ సాధించుకొన్నది. ప్రపంచ ఛాంపియన్ షిప్ ను శ్రీ ఇచిరో ఓగిమోరా, స్త్రీల సింగిల్స్ ఛాంపియన్‌షిప్పును శ్రీమతి టోమీ ఒకోవా పురుషులజంట ఛాంపియన్ షిప్పును శ్రీ ఓగిమోరా, యోషియా టొమిటా గెలుచుకొన్నారు. జపాను గెలుచుకొన్న నాల్గవకప్పు స్వేద్లింగ్ కప్పు.

టెన్నిస్‌లో కూడా జపాన్ ప్రపంచంలో ఒక ప్రముఖస్థానాన్ని వహించి వున్నప్పటికీ 1956 డేవిస్ కప్పు పోటీలలో తలవని తలంపుగా ఇండియాచే ఓడించబడింది. 1956 మేలో జరిగిన డేవిస్ కప్పు తూర్పు మండలం అంతిమ పోటీలో ఇండియా, జపానును 3—2 మ్యాచీలతో ఓడించింది. జపాన్‌లో టెన్నిస్ ఆటగాళ్ళలో అద్వితీయుడు శ్రీ ఆట్స్యూష్ మియంగ్. శ్రీ కె. కామూ మియంగ్ తరువాత చెప్పదగిన గొప్ప టెన్నిస్ ఆటగాడు.

కుస్తీ, వెయిట్ లిఫ్టింగ్, వాలీబాల్, బాస్కెట్‌బాల్, బాడ్మింటన్ మున్నగు క్రీడలు జపానులో విశేషంగా ప్రచారంలో వున్నవి.

15 వ ప్రంపంచం ఒలింపిక్ పోటీలలో జపాన్ పాల్గొన్నది. హెల్సింకీ ఒలింపిక్స్‌లో (15 వ) ఒక స్వర్ణపతకం, ఆరు రజత పతకాలు, ఒక కంచుపతకం సాధించి 13 వ స్థానం పొందింది.

అగ్ర జాపనీస్ ఎథ్లెట్లు గురించి పరిశీలించుదాము.

అరాజ్ కాజ్ : 400 మీటర్ల పరుగులో ఈయన దిట్ట. ఈ దూరాన్ని ఈయన 48.5 సెకండ్లలో పూర్తిచేసి 1954 లో ప్రపంచం రికార్డు స్థాపించాడు.

శ్రీ టెజీమూ మసాగీ : ఈయన లాంగ్ జంప్ ప్రవీణుడు. 1951 లో 23 అడుగుల $5\frac{1}{2}$ అంగుళాల దూరం దూకి ప్రపంచం రికార్డు నెలకొల్పాడు.

1955 "ప్రపంచ శ్రీ" బిరుదుపొందిన వ్యాయామవీరుడు శ్రీ టామీకోనో వంశరీత్యా జాపనీయుడు. వీరి పూర్వీకులు అమెరికాలో స్థిరపడినందున శ్రీ కోనో అమెరికా బాడ్జితో పోటీ చేశాడు.

## కొరియా

అమెరికా ప్రాబల్యంలో ఉన్నందున అంతర్జాతీయ పోటీలలో దక్షిణకొరియా మాత్రమే పాల్గొనకలుగుతున్నది. లండన్, హెల్సింకీ

(ప్రపంచ) ఒలింపిక్స్‌లోనూ, ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలోనూ, దక్షిణ కొరియా పాల్గొన్నది. శ్రీ చూంగ్ ఓ హాంగ్, శ్రీ యూన్ బోక్ సూ అనే కొరియన్లు లండన్ ఒలింపిక్స్‌లో మరాథన్ (26 మైళ్ళ 385 గజాల పరుగు) పోటీలో పాల్గొని పోటీ చివరికంట నిలవకల్గారు.

ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలో కొరియా ఎనిమిది స్వర్ణ పతకాలు సాధించి తృతీయస్థానం పొందింది.

కొరియా గురించి తలచుకోగానే ఇద్దరు అగ్రక్రీడావేత్తలు జ్ఞాపకానికి వస్తారు. వీరిలో మొదటివారు శ్రీ యూ ఇన్ హో. ఈయన బాంటమ్ వెయిట్ తరగతికి చెందిన వెయిట్ లిఫ్టర్. జర్క్ పద్ధతిలో $284\frac{3}{4}$ పౌన్లు ఎత్తి ప్రపంచం రికార్డును సాధించాడు. రెండవ వ్యక్తి శ్రీ సామి లీ. ఈయన వంశరీత్యా కొరియన్. ఈయన పూర్వీకులు అమెరికాలో స్థిరపడినందువలన అమెరికా బాడ్జితో ప్రపంచం డైవింగ్ పోటీలలో పాల్గొంటున్నారు. డైవింగ్‌లో హెల్సింకీ ఒలింపిక్స్‌లో ఈయన స్వర్ణ పతకం పొందారు. 1954-55 లో ఇండియాలో పర్యటించి మన డైవర్లకు శిక్షణ ఇచ్చారు.

టేబుల్ టెన్నిస్, బాడ్‌మింటన్, ఫుట్‌బాల్ మున్నగు ఆటలు కూడా కొరియాలో విశేషంగా ప్రచారంలో వున్నవి. 1956 ఏప్రిల్‌లో జరిగిన ప్రపంచ టేబుల్ టెన్నిస్ పోటీలలో దక్షిణకొరియా పాల్గొన్నది. "బి" గ్రూప్‌లో మొత్తం ఏడు పోటీలలో పాల్గొని ఒకటి మాత్రమే గెలుచుకొని సప్తమస్థానం పొందింది.

వ్యాయామక్రీడలలో కొరియన్ నిపుణుల గురించి పరికించుదాము.

మొదట పేర్కొన్నట్లు సుదూరపు పరుగులలో కొరియన్లు దిట్టలు. శ్రీ వై. సి. చోయీ అనే కొరియన్ హెల్సింకీ ఒలింపిక్స్‌లో చతుర్థస్థానం పొందారు. ప్రథమస్థానం పొందిన వ్యక్తికంటె దాదాపు మూడు నిముషాలు మాత్రమే ఆలస్యంగా ఈ 26 మైళ్ళ 385 గజాల దూరపు గమ్యం చేరారు.

మనీలా క్రీడోత్సవంలో ముష్టియుద్ధంలో తృతీయ స్థానాన్ని, వెయిట్ లిఫ్టింగ్ లో ప్రథమస్థానాన్ని, ఫుట్ బాల్ లో ద్వితీయస్థానాన్ని కొరియా సంపాదించింది.



## ఫిలిప్పిన్స్



ముష్టియుద్ధంలో తక్కువ బరువు తరగతుల వారిలో ప్రపంచంలో పాశ్చాత్య రాజ్యాలకు సరితూగగల ప్రమాణం చూపుతున్న ఆసియా ప్రాంతం ఫిలిప్పిన్స్ ద్వీప సమూహం. ఫ్లై వెయిట్ తరగతిలో శ్రీ టానీ కాంపో, శ్రీ డానీ కిడ్, బాంటమ్ వెయిట్ తరగతిలో శ్రీలియో ఎస్పినోస, శ్రీ లిటిల్ సీజర్, ఫెదర్ వెయిట్ తరగతిలో శ్రీ ఫ్లాష్ ఎలార్డ్ ప్రపంచ తరగతికి చెందినవారని ప్రపంచ బాక్సింగ్ సంస్థ ప్రకటించి వున్నది.

ఫిలిప్పిన్స్ లండన్, హెల్సింకీ ఒలింపిక్స్ లోనూ ప్రథమ, ద్వితీయ ఆసియా క్రీడోత్సవాలలోనూ పాల్గొన్నది. ప్రథమ ఆసియా క్రీడోత్సవంలో హైజంప్ లో ఫిలిప్పిన్స్ ఆసియా రికార్డును (6 అడుగుల $4\frac{1}{4}$ అంగుళాలు) స్థాపించింది.

1954 లో మనిలాలో జరిగిన ఆసియా క్రీడోత్సవంలో ఫిలిప్పిన్స్ 14 స్వర్ణపతకాలు సాధించి ద్వితీయ స్థానం పొందింది. వస్త్రీలో తృతీయ స్థానం, షూటింగ్, బాస్కెట్ బాల్, ముష్టియుద్ధములలో ప్రథమస్థానం, ఈతలో ద్వితీయ స్థానం పొందింది.

1956 ఏప్రిల్ లో టోకియోలో జరిగిన 23 వ ప్రపంచ టేబిల్ టెన్నిస్ పోటీలలో ఫిలిప్పిన్స్ పాల్గొన్నది. 'ఏ' గ్రూపులో ఏడు పోటీలలో పాల్గొని ఒకటి మాత్రమే గెలుచుకొని అష్టమస్థానం వహించింది.

టెన్నిస్, బాడ్‌మింటన్ మున్నగు ఆటలుకూడా ఫిలిప్పైన్స్‌లో విశేషంగా ప్రచారంలో వున్నవి.

## ఆఫ్ఘనిస్తాన్



ప్రథమ, ద్వితీయ ఆసియా క్రీడోత్సవాలలో ఆఫ్ఘనిస్తాన్ పాల్గొన్నది. దేనిలోనూ ఏ పతకమూ గెలుచుకొననప్పటికీ నిరుత్సాహపడక, ఉత్సాహముతో అంతర్జాతీయ పోటీలలో ఈ దేశం పాల్గొనడం ప్రశంసనీయం. ఆఫ్ఘనిస్తాన్ ప్రభుత్వం క్రీడలను బాగా ఆదరిస్తున్నది; ప్రోత్సహిస్తున్నది కూడా. ప్రతి ఏటా ఆగస్టులో ఆఫ్ఘనిస్తాన్ జాతీయ దినోత్సవం నాడు రాజధాని కాబూల్‌లో అంతర్జాతీయ క్రీడోత్సవం నిర్వహిస్తున్నది. 1955 లో ఈ క్రీడోత్సవంలో పాల్గొన్న ఇండియా ఫుట్‌బాల్ జట్టుకు ఆంధ్ర ప్రముఖుడు శ్రీ యమ్. అప్పారావుగారు నాయకత్వం వహించారు. కాబూల్‌లో ఇండియా జట్టు మొత్తం నాలుగు పోటీలలో పాల్గొన్నది. ఇండియా వీటిలో ఒకటి గెలుచుకొన్నది. ఒకటి 'డ్రా' అయినది. రెండింటిలో ఓడిపోయినది. 1956 లో ఆఫ్ఘనిస్తాన్ జాతీయ క్రీడోత్సవానికి ఉస్మానియా యూనివర్సిటీ ఫుట్‌బాల్ జట్టు ఆహ్వానించబడింది. ఈ జట్టులో శ్రీ సీతారెడ్డి, శ్రీ రామారావు అనే ఆంధ్ర ఆటగాళ్లు కలరు. హాకీ, ఎత్లెటిక్స్, కుస్తీ మున్నగు క్రీడలు ఈ దేశంలో విశేషంగా ప్రచారంలో వున్నవి.

## చైనీస్ రిపబ్లిక్

అమెరికా మద్దత్తుతో చాంగ్‌కైషేక్ ఆధిపత్యంలో వున్న నేషనలిస్టు చైనా లండన్ ఒలింపిక్స్‌లోనూ ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలోనూ పాల్గొన్నది. హెల్సింకీ ఒలింపిక్స్‌కు చైనీస్ రిపబ్లిక్ (కమ్యూనిస్టు చైనా) బాస్కెట్‌బాల్, ఫుట్‌బాల్, ఈత పోటీలకు ప్రతినిధులను



పంపింది. క్రమంగా నేమనలిస్టు చైనాకు ప్రపంచ ఒలింపిక్స్‌లో స్థానం పోయే సూచనలు అప్పుడే కన్పిస్తున్నవి. చైనీస్ రిపబ్లిక్ ప్రపంచ టేబుల్ టెన్నిస్ పోటీలలో పాల్గొన్నది. మూడవ గ్రూపులో చైనా మొత్తం ఏడు పోటీలలో ఐదింటిని గెల్చుకొని తృతీయ స్థానం పొందింది. చైనా ఇండియాను 5-3 గేములతో ఓడించిన విషయం గమనార్హం.

కమ్యూనిష్టు చైనాలో సమూహప్రాతిపదికపై క్రీడాప్రచారం జరుగుతున్నది. క్రీడావ్యాప్తిని ప్రభుత్వం సర్వవిధాలా ప్రోత్సహిస్తున్నది. చైనాలో వ్యాయామక్రీడల (ఎథ్లెటిక్స్) ప్రచారానికి ఆల్ చైనా ఎథ్లెటిక్స్ ఫెడరేషన్ కృషి చేస్తున్నది. చైనాలో వెయిట్ లిఫ్టింగ్, ఫుట్‌బాల్, బాస్కెట్‌బాల్, వాలీబాల్, ఈత, జిమ్నాస్టిక్స్, షూటింగ్, ఎథ్లెటిక్స్ మున్నగు క్రీడలు విశేషంగా ప్రచారంలో వున్నవి.

ఆంధ్రరాష్ట్రోదయం పిమ్మట ఇద్దరు ఆంధ్ర యువ క్రీడావేత్తలు చైనాలో పర్యటించడం గమనార్హం. వీరు వాలీబాల్ ఆటగాడు శ్రీ చేకూరు బుచ్చిరామయ్య, వెయిట్ లిఫ్టింగ్ ప్రవీణుడు శ్రీ కామినేని ఈశ్వరరావు. వీరి పర్యటనానుభవాలు బట్టి క్రింది విషయాలు తెలుస్తున్నవి.

చైనాలో వాలీబాల్ ఆటలో సర్వతోముఖ ప్రతిభాశాలురు వందల, వేల సంఖ్యలో వున్నారు. వీరందరూ బూస్టింగ్‌లోనూ, స్పైకింగ్‌లోనూ సమ ప్రతిభావంతులు. పాశ్చాత్య సంప్రదాయాలపై అతి స్వల్పకాలంలో వీరు వాలీబాల్‌లో విశేష ప్రావీణ్యం గడించారు. నేలపై వెల్లకిలా పరుండి బంతిని ఎత్తి ఇవ్వడంలో రష్యనులతర్వాత చెప్ప దగినవారు వీరే. చెక్క చప్టాలపై వాలీబాల్ ఆడడం చైనాలోని విశేషాలలో ఒకటి. చైనాలో ఇండియా వాలీబాల్ జట్టు 1955 నవంబర్, డిసెంబర్‌లలో పర్యటించింది. ఇండియాజటు సభ్యుడుగానే శ్రీ బుచ్చి రామయ్యగారు చైనా సందర్శించారు. ఇండియాజట్టు మొత్తం 10 పోటీలలో పాల్గొన్నది. నాల్గింటిని గెల్చుకొన్నది. అయిదింటిలో

ఓడిపోయింది. ఒకటి ఎటూ నిర్ణయం కాలేదు. ఇండియా వాలీబాల్ ఆటగాళ్ళకు చైనా అంతటా ప్రభుత్వం ప్రజలు విశేషంగా భారీఎత్తున స్వాగతమిచ్చారు. దీనినిబట్టి కూడా చైనాలో క్రీడలపట్ల ప్రభుత్వం, ప్రజల ఆసక్తి, ఉత్సాహము ఊహించవచ్చును.

చైనా యువజనులు క్రీడారంగంలో ఘనవిజయాలు సాధించడానికి ప్రభుత్వం ప్రత్యేక పథకాలను తయారుచేసింది. క్రీడలలో జనబాహుళ్యానికి ఉత్సాహము శ్రద్ధ కల్గించడం ప్రథమ కర్తవ్యమని కమ్యూనిస్టు ప్రభుత్వం ఎంచి ప్రతి గ్రామంలో, పట్టణములో క్రీడాకేంద్రములను నెలకొల్పింది. వాటికి తగినన్ని ఆటస్థలములనుకూడా ప్రత్యేకించింది. శ్రీ కామినేని ఈశ్వరరావుగారు పర్యటించిన ప్రతి చైనీస్ గ్రామం లోనూ యువజన సంఘాలను చూశారు. ఈ సంఘాల తరఫున గ్రామములలోని పాఠశాలల తరఫున సమష్టి వ్యవసాయ కేంద్రముల తరఫున వివిధ క్రీడలకు కావలసిన పరికరములు సాధన సామాగ్రి తెప్పించబడుతున్నవి. ఇవి సరసమయిన ధరలకు ఒకేరేటుకు సప్లయి చేయడానికి ప్రభుత్వం ఏర్పాట్లు, కట్టుదిట్టాలు చేసివున్నది. ప్రతి సంవత్సరము అన్ని క్రీడలలోనూ కొన్ని వేలమంది నిపుణులకు ప్రత్యేకమయిన తర్ఫీదు ఇప్పించి, అట్టి ప్రవీణులను వివిధ కేంద్రములకు ప్రభుత్వం పంపించి, వారిచే అక్కడి ప్రామిసింగ్ ఎథ్లెట్లకు లేదా ఆటగాళ్ళకు తగిన తర్ఫీదు ఇప్పించడం ద్వారా క్రీడారంగంలో దేశము స్థాయిని పెంపొందింప చేస్తున్నది. శిక్షకులకు అయ్యే ఖర్చులు ఆయా ప్రాంత ప్రజాసంఘాలు భరిస్తవి. ఒక ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికుడు క్రీడా శిక్షణ పొందుతున్నపక్షంలో వారి ఖర్చులను ఆ ఫ్యాక్టరీ కమిటీయే భరిస్తుంది. వ్యవసాయ కార్మికులకు కూడా ఇట్టి వసతి వున్నది. ప్రభుత్వంకూడా కొన్ని కొన్ని సందర్భాలలో కొన్ని కొన్ని ఖర్చులను భరిస్తుంది. ఇతరదేశాల క్రీడానిఘణులను ముఖ్యముగా సోవియట్ యూనియన్ నుండి రప్పించి చైనీస్ ఎథ్లెట్లకు, ఆటగాళ్ళకు ప్రత్యేక శిక్షణను ప్రభుత్వమే ఇప్పిస్తున్నది.

ప్రజలు, ప్రభుత్వము స్పోర్ట్సు ఛాంపియన్‌లను విశేషంగా గౌరవిస్తారు. శ్రీ ఈశ్వరరావు పెకింగ్‌లో వున్నప్పుడు జాతీయ క్రీడోత్స

వాలు జరిగినవి. చైనా అధ్యక్షుడు శ్రీ మావ్ సే టుంగ్, ప్రధాని శ్రీ చౌ ఎన్ లై ఈ క్రీడోత్సవానికి హాజరయినారు. శ్రీ ఈశ్వరరావుకు చైనా అగ్రనాయకుల సమీపంలోనే స్థానం ఏర్పాటుచేసి క్రీడావేత్తలను తాము ఎలా గౌరవిస్తున్నదీ ఋజువుపరిచారు.

చైనాలో ప్రతి కళాశాలలోనూ ఉన్నత పాఠశాలలోనూ విద్యార్థులు విధిగా ఏదో ఒక ఆటలో పాల్గొనాలి. విద్యార్థినులు కూడా పాల్గొంటారు. గ్రామాలలో రైతు యువకులు, పెద్దలు, స్త్రీలు సయితం ఆటలలో పాల్గొంటారు.

చైనాలో క్రీడావేత్తలకు ప్రత్యేకమయిన సదుపాయాలు కల్పించబడుతున్నవి. పోటీలలో పాల్గొనే ఆటగాళ్ళకు రైళ్ళలో ప్రయాణాలు చేయునప్పుడు ప్రత్యేక సదుపాయాలు కల్పించబడుతున్నవి. (ఇటీవల బొంబాయిలో ఒలింపిక్ హాకీ ఛాంపియనులకు సర్వెంట్స్ కంపార్టుమెంటు యిచ్చారు!) పోటీలు పూర్తి అయ్యేవరకూ చైనీస్ ఛాంపియనుల ఖర్చులు వారి వారి గ్రామ కమిటీలుగాని, ఫ్యాక్టరీ కమిటీలుగాని మరి ఇతర కమిటీలుగాని భరిస్తవి. పోటీలముందు క్రీడావేత్తలు తమ తమ నైపుణ్యం అభివృద్ధిచేసుకోడానికి ప్రత్యేకమైన సదుపాయాలు పొందుతున్నారు. ఫ్యాక్టరీలలో ఉద్యోగులయిన ఆటగాళ్లు, పోటీలముందు కొన్ని వారాలు రోజుకు కొన్ని గంటలు తక్కువగా పనిచెయ్యడానికి హక్కు పొంది వున్నారు. వ్యవసాయ క్షేత్రాలలో పనిచేయు ఆటగాళ్ళకు కూడా ఈ విధంగానే పని తగ్గించబడుతుంది. ఇన్ని వసతులు, ఇంత ప్రోత్సాహం క్రీడావేత్తలకు లభించుచుండుటవలన చైనాలో ప్రతి సంవత్సరము రికార్డులు అధిగమించబడుచున్నవి. చైనా జాతీయ రికార్డులు ప్రపంచ రికార్డుల స్థాయికి త్వరితగతిని పురోగమిస్తున్నవి.

ప్రపంచ తరగతిని చేరుకున్న చైనీయులు కొందరున్నారు. బాంటమ్‌వెయిట్ తరగతిలో (క్లీన్ అండ్ జెర్క్ రీతి) వెయిట్ లిఫ్టింగ్‌లో ప్రపంచం రికార్డు చెమ్‌జిక్ బుంకాయ్ అనే చైనీయునిదే. చైనీస్ సైన్యానికి చెందిన ఈయన 1956 జూన్‌లో 293.2 పౌన్లు ఎత్తి కొరియన్, అమెరికన్ స్థాపించిన రికార్డులను అధిగమించారు.

ఫుట్ బాల్ ఆటలో ఆసియాలో చైనీయులు ఇండియాకు పెద్ద పోటీ కానున్నారు. 1956 జూన్ లో ఇండియాలో పర్యటించిన చైనీస్ రిపబ్లిక్ ఒలింపిక్ ఫుట్ బాల్ జట్టు మోహన్ బగన్ ను (పశ్చిమ బెంగాలు) 8-1 గోలులతోనూ, మహమ్మడన్ స్పోర్టింగ్ ను (పశ్చిమ బెంగాలు) 3-1 గోలులతోనూ ఓడించింది.

చైనా క్రీడావేత్తలను, వారి విజయాలను స్థూలంగా పరికించిన ట్లయితే క్రీడలలో శాస్త్రీయ పద్ధతులను తు. చ. తప్పకుండా అనుసరిస్తు న్నందువల్ల నూతన్కకాయులైనా వారి కట్టి విజయాలు లభిస్తున్నట్లు విదితమౌతుంది.

చైనాలో టెన్నిస్ ఆట 'యుయినోట్స్రియు' అని వ్యవహరించ బడుతున్నది. ఈ ఆటలో ఆసియా ప్రమాణాన్ని అందుకొనే చైనీయులు ఇంకా కనుపించడంలేదు.

## బర్మా



లండన్ ఒలింపిక్స్ లోనూ, ప్రథమ, ద్వితీయ ఆసియా క్రీడోత్సవాలలోనూ బర్మా పాల్గొన్నది. ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలో (1954) వెయిట్ లిఫ్టింగ్ లో ద్వితీయస్థానాన్ని బర్మా పొందకలిగింది. ఈ దేశంలో ఇంకా ఫుట్ బాల్, కుస్తీ, వ్యాయామ క్రీడలు, హాకీ, ఈత మున్నగు క్రీడలు విశేషంగా ప్రచారంలో వున్నవి.

మనీలా క్రీడోత్సవంలో వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో ఇండియా పాల్గొనని కారణంగా బర్మా వెయిట్ లిఫ్టింగ్ లో స్వర్ణపతకం పొందగలిగింది. ఇందుకు రికార్డులే సాక్ష్యం. మాంగ్ ల్విన్ అనే బర్మీస్ వెయిట్ లిఫ్టర్ (హెవీ వెయిట్) మొత్తం 710 పౌన్లు ఎత్తి ప్రథమ స్థానం పొందాడు. అప్పటికే శ్రీ డి. ఆర్. గోపాల్ (ఇండియా, హెవీ వెయిట్) 780 పౌన్లు ఎత్తు తున్నారు.

# సింహాళం



క్రికెట్, హాకీ, ఫుట్ బాల్, వాలీబాల్, బాస్కెట్ బాల్, టేబుల్ టెన్నిస్, వ్యాయామ క్రీడలు మున్నగునవి ఈ దేశంలో విశేషంగా ప్రచారంలో వున్నవి. ఈ దేశం ఇంకా ఏ గేములోనూ ఆసియా ప్రమాణాన్నయినా అందుకోలేదు.

లంక 14 వ, 15 వ ప్రపంచ ఒలింపిక్స్‌లోనూ, ప్రథమ, ద్వితీయ ఆసియా క్రీడోత్సవాలలోనూ పాల్గొన్నది.

లండన్ ఒలింపిక్స్‌లో వ్యాయామ క్రీడలలో సింహాళం ఒక రజత పతకాన్ని పొందింది. శ్రీ డి. వైట్ అనే సింహాళీయుడు 400 మీటర్ల హార్డిల్స్ పోటీని 51.8 సెకండ్లలో పూర్తిచేసి ద్వితీయస్థానం పొందారు. ప్రథమస్థానం పొందిన అమెరికన్ ఈయనకంటె 7/10 సెకండ్లు మాత్రమే ముందుగా గమ్యం చేరారు.

సింహాళంలో క్రీడావ్యాప్తికి ప్రభుత్వం పాటు పడుతున్నది. ఆసియా టెన్నిస్ పోటీలు నిర్వహించడానికి సింహాళ ప్రభుత్వం జాతీయ టెన్నిస్ సంఘానికి భూరి విరాళం ఇచ్చింది కూడా.

ఇండియాలో జరిగే అంతర్ విశ్వవిద్యాలయ పోటీలలో కొలంబో పాల్గొంటున్నది. సింహాళంలో జరిగిన టేబుల్ టెన్నిస్ పోటీలలో ఆంధ్ర ఆటగాళ్లయిన శ్రీ ఆర్. కె. వి. రమణశాస్త్రి, శ్రీ సి. యస్. ఆర్. ఆంజనేయులు మున్నగువారు పాల్గొన్నారు. ఆంధ్రా యూనివర్సిటీ టెన్నిస్, ఎథ్లెటిక్ ప్రతినిధులు సింహాళంలో జరిగిన టెన్నిస్, ఎథ్లెటిక్ పోటీలలో పాల్గొన్నారు.

1956 మే లో జరిగిన డేవిస్ కప్ లాన్ టెన్నిస్ పోటీలలో ఇండియా సింహాళాన్ని 5-0 మ్యాచీలతో ఓడించింది. ఫెర్డినాండ్స్,

ఎర్నెస్ట్ పింటో, యఫ్. జె. డి. సెరం సింహళంలో ప్రసిద్ధిచెందిన టెన్నిస్ ఆటగాళ్లు.

## ఇండొనీసియా



ఫుట్ బాల్, హాకీ, వాలీబాల్, బాడ్ మింటన్, బాస్కెట్ బాల్, కుస్తీ, వెయిట్ లిఫ్టింగ్, నీటిపోటీలు, టెన్నిస్ మున్నగు ఆటలు ఈ దేశంలో బాగా ప్రచారంలో వున్నవి.

డచ్చివారి నిరంకుశ పరిపాలనలో చాలా కాలం ఉన్నందున ఇండొనీసియాలో క్రీడా ప్రమాణం అభివృద్ధికాలేదు. ఢిల్లీలో జరిగిన ప్రథమ ఆసియా క్రీడోత్సవంలోనూ, మనీలాలో జరిగిన ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలోనూ ఇండొనీసియా పాల్గొన్నది. మనీలా ఒలింపిక్స్‌లో (1954) ఫుట్ బాల్ ఆటలో ఇండొనీసియా తృతీయ స్థానాన్ని పొందింది. ఇదే క్రీడోత్సవంలో వాటర్ పోలో ఆటలో తృతీయస్థానాన్ని, ఈత పోటీలలో పంచమ స్థానాన్ని సాధించింది.

బాడ్ మింటన్ (షటిల్ కాక్) ఆటలో, శ్రీ ఎడ్డి యూసఫ్ ఇండొనీసియాలో ప్రసిద్ధిచెందిన ఆటగాడు.

1956 లో ప్రపంచం ఒలింపిక్ ఫుట్ బాల్ పోటీలలో రష్యా అంతటి జట్టుతో ఇండొనీసియా పోటీచేసి సమవుజ్జీ అయినది. ఒలింపిక్ ఛాంపియన్ షిప్‌ను సోవియట్ యూనియన్ గెలుచుకొన్నది.

## సింగపూర్

బాడ్ మింటన్ ఆటలో ఈ దేశం ప్రపంచ తరగతిలో ఉన్నది. ఊంగ్ పో లిమ్, ఇస్మాయిల్ బిన్ మర్జన్ థామస్ కప్పు పోటీలలో

పాల్గొని ప్రపంచఖ్యాతి పొందారు. వీరుభయులూ మలయా బాడ్ మింటన్ ఛాంపియన్ షిప్‌ను రెండుసార్లు గెలుచుకొని ఉన్నారు.

లండన్, హెల్సింకీ ఒలింపిక్ పోటీలలోనూ, ఢిల్లీ, మనీలా గేమ్సులోనూ సింగపూర్ పాల్గొన్నది. మనీలా క్రీడోత్సవంలో ఈతలో తృతీయస్థానాన్ని, వాటర్ పోలో ఆటలో ప్రథమస్థానాన్ని సింగపూర్ పొందింది.

టేబుల్ టెన్నిస్, ఫుట్ బాల్, బాస్కెట్ బాల్ మున్నగు ఆటలుకూడా సింగపూర్‌లో విశేషంగా ప్రజాభిమానం పొందినవి. 1956 ఏప్రిల్‌లో టోకియోలో జరిగిన ప్రపంచ టేబుల్ టెన్నిస్ పోటీలలో సింగపూర్ 'ఏ' గ్రూపులో మొత్తం ఏడుపోటీలలో పాల్గొని ఒకటిమాత్రం గెలుచుకొని షష్టమస్థానం పొందింది. శ్రీ లో హెంగ్ చూ, శ్రీ పూన్ వెంగ్ హూ ఆసియాలో ఉన్నతశ్రేణి టేబుల్ టెన్నిస్ ఆటగాళ్లుగా పరిగణింపబడినారు. 1955 లో గుంటూరులో జరిగిన నేషనల్ టేబుల్ టెన్నిస్ ఛాంపియన్ షిప్పును శ్రీ హూ గెలుచుకొన్నారు.

## మలయా

షటిల్ కాక్ బాడ్ మింటన్ ఆటలో మలయన్‌లు ప్రపంచంలో అద్వితీయులు. టేబుల్ టెన్నిస్ ఆటలోగూడా మలయా ప్రపంచంలో ఒక ముఖ్యస్థానాన్ని పొందివున్నది.

మలయా బాడ్ మింటన్ ఆటగాడు శ్రీ ఎడ్డి చుంగ్ ప్రపంచ ఛాంపియన్.

మలయాలో ఇంకా ఎథ్లెటిక్స్, వెయిట్ లిఫ్టింగ్, హాకీ, షూటింగ్, నీటి ఆటలు మున్నగునవి విశేషంగా ప్రచారంలో వున్నవి. 1954 లో మనీలాలో జరిగిన ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలో మలయా పాల్గొన్నది. ఇందులో మలయా కనీసం తృతీయస్థానమైనా ఏ పోటి లోనూ పొందివుండలేదు.

## వియత్నామ్

టేబుల్ టెన్నిస్, బాడ్మింటన్ ఆటలలో ఆసియాలో ముఖ్య స్థానం వహిస్తున్న దేశం వియత్నామ్. 1956 ఏప్రిల్‌లో టోకియోలో జరిగిన ప్రపంచ టేబుల్ టెన్నిస్ పోటీలలో వియత్నామ్ "బి" వర్గంలో మొత్తం ఏడు పోటీలలో పాల్గొని అయిదింటిని గెలుచుకొని చతుర్థస్థానం పొందింది. ఇదే టోర్నమెంటులో వియత్నామ్ బ్రిటనును 5-2 గేములతో ఓడించింది. 1954 లో మనీలాలో జరిగిన ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలో వియత్నామ్ పాల్గొన్నది. కాని ఏ క్రీడ లోనూ ప్రముఖస్థానం వహించలేదు.

## పాకిస్తాన్



1947 లో పాకిస్తాన్ ఉదయించినప్పటినుంచి అది క్రీడారంగంలో ఇండియాను వెనుకపడవేయవలెననే అకుంఠిత దీక్షతో కృషిచేస్తున్నది. హాకీలో ఇండియా తర్వాత పీఠం వేసుకొన్నది. లోగడ ధ్యాన్‌చంద్, రూప్‌సింగ్ వంటివారితో ఆడిన శ్రీ ఏ. ఐ. షాదారా పాకిస్తాన్‌కు ఎంతో సహాయం చేశాడు.

టెన్నిస్‌లో ఇఫ్తికర్ అహమ్మద్ పాకిస్తాన్ ఛాంపియన్. భారతదేశం అఖండంగా వున్నప్పుడు ఈయన ఇండియా తరఫున డేవిస్‌కప్ టెన్నిస్ పోటీలలో పాల్గొని ఇండియా కీర్తిని ఇనుమడింప చేశాడు. ప్రస్తుతం ఈయన పాకిస్తాన్ పౌరుడయినప్పటికి క్రీడారంగంలో ఇండియా అభివృద్ధిని హృదయపూర్వకంగా కాంక్షిస్తున్నాడు. 1955-56 లో ఇండియాలో పర్యటించినప్పుడు వివిధ టోర్నమెంటులలో ఈయన ప్రదర్శించిన సహృదయత మరువలేనిది. ఇండియా ఇప్పటి అగ్రఆటగాడు

శ్రీ ఆర్. కృష్ణన్ సర్వీస్‌లో ఎంతో అభివృద్ధి సాధించాలని, ఆస్ట్రేలియా, అమెరికావంటి దేశాలలో వున్న శిక్షణ పొందవలెనని మొదట హెచ్చరించినవారిలో ఈ ఎడమచేతి ఆటగాడు ఒకడు. ఇండియాలో అమృత్ కౌర్ స్పోర్ట్స్ కోచింగ్ స్కీమ్ వంటి క్రీడాప్రణాళికలు అమలుపరచబడి, క్రీడాభివృద్ధికి ప్రభుత్వం పాటుబడడాన్ని ఆయన ఎంతో మెచ్చుకొన్నారు. పాకిస్తాన్‌లో ఇటువంటి క్రీడాపథకాలను ఇకనైనా అమలుపరచడం అవసర మని 1956 ఆరంభంలో ఆయన హెచ్చరించారు.

శ్రీ ఖాన్ సయ్యద్, శ్రీ ఇఫ్తికార్ అహమ్మద్ 1956 డేవిస్ కప్ పోటీలలో పాల్గొన్నారు. శ్రీ యమ్. పీర్‌జాదా అనే మరొక టెన్నిస్ ఆటగాడు పాకిస్తాన్‌లో ప్రసిద్ధి చెందారు. యూనివర్శిటీ ఆటగాళ్లలో దాదాపు పదిమంది ప్రశంసనీయమైన ప్రావీణ్యం ప్రదర్శిస్తున్నారు. పాకిస్తాన్ టెన్నిస్ భవిష్యత్తు వీరిపై ఆధారపడి వున్నది. గత డేవిస్ కప్పు పోటీలలో చెక్‌స్లొవాకియా పాకిస్తాన్‌ను 5–0 మ్యాచీలతో ఓడించింది.

టేబుల్ టెన్నిస్‌లో ఇండియాలో కృషిచేసి, కీర్తిగడించి, జాతీయ ఛాంపియన్‌షిప్ పరంపరగా సాధించిన కుమారి సయ్యద్ సుల్తానా 1956 ఆరంభంలో కరాచీలో ఒక టేబుల్ టెన్నిస్ పోటీలో పాల్గొనడానికై వెళ్ళి ఇక అక్కడనే స్థిరపడిపోయింది. టేబుల్ టెన్నిస్ ఆటగాళ్లలో పాకిస్తాన్‌లో ఆసియా ప్రమాణాల్ని అందుకొనేవారు లేరు.

క్రికెట్‌లో పాకిస్తాన్ ఏడాది ఏడాదికి పురోగమిస్తున్నది. ఈ తొమ్మిదేళ్లలోనే పాకిస్తాన్ ఇండియాతో సమ మయినది. 1956 లో ఎమ్. సి. సీని, ఆస్ట్రేలియాను ఓడించివేసింది. ఇండియా ఆస్ట్రేలియాపై విజయం సాధించలేకపోయింది. దీనినిబట్టి క్రికెట్‌లో పాకిస్తాన్ ప్రతిభ ఇండియాకంటె ఒక వీసం ఎక్కువనే చెప్పవచ్చునేమో!

1954–55 లో పాకిస్తాన్ క్రికెట్‌జట్టు బ్రిటన్‌లో పర్యటించి, లార్డ్సు టెస్టులో బ్రిటన్‌ను ఓడించి, ప్రపంచ క్రికెట్ రంగంలో సంచలనం కలిగించింది. ఫజల్ మహమ్మద్ బౌలింగ్ ప్రతిభ పాకిస్తాన్

విజయానికి ముఖ్యకారణం. అప్పుడు ఫజల్ మహమ్మద్‌ను "పాకిస్తాన్ బెడ్సర్" అని పత్రికలు ప్రశంసించినవి. 1954 లో ప్రపంచపు అయిదు అగ్ర క్రికెట్ ఆటగాళ్ళలో ఫజల్‌ను ఒకనిగా "విజ్డెన్" అంతటి గ్రంథం పేర్కొన్నది. పాకిస్తాన్ క్రికెట్ జట్టు విజయాన్ని పురస్కరించుకొని పాకిస్తాన్ ప్రభుత్వం దేశమంతటా సెలవు ప్రకటించి క్రీడల పట్ల తమ అభిమానాన్ని రుజువుపర్చుకున్నది. పాకిస్తాన్ తన యువ క్రికెట్ ఆటగాళ్ళలో కొందరిని బ్రిటన్‌కు పంపి అక్కడి "ఆల్ఫ్ గొవర్స్ ఇండోర్ క్రికెట్ స్కూల్" లో ఉన్నత శిక్షణ నిప్పించింది. బ్రిటన్ జట్టుపై పాకిస్తాన్ ఒక టెస్టులో విజయమొందడానికి ఈ శిక్షణ చాలవరకు కారణమని భారతీయ క్రికెట్ పెద్దలు కొందరు భావిస్తున్నారు.

భారతదేశ విభజనానంతరం చెలరేగిన మతకల్లోలాల ఫలితంగా ప్రపంచ ప్రసిద్ధ మల్లవిద్యాప్రవీణుడు "పంజాబ్ కేసరి" గామా పాకిస్తాన్‌కు తరలిపోయాడు. ఇమాం బక్స్ కుమారుడు అజామ్ పహిల్వాన్, గామా కుమారుడు యాశీమ్, ఇమాం బక్స్ సోదరుడు హుస్సేనా పాకిస్తాన్‌లోనే స్థిరపడిపోయారు. వీర్కు, షరీఫ్ పహిల్వాన్, అల్లాయార్ ఖాన్ పాకిస్తాన్‌లో మల్లవిద్యా యోధులుగా ప్రముఖస్థానం వహించి వున్నారు.

ఫుట్‌బాల్, బాస్కెట్‌బాల్ మున్నగు ఆటలలో పాకిస్తాన్ ఏడాది ఏడాదికి అభివృద్ధి చెందుతున్నది.

లండన్, హెల్సింకీ ఒలింపిక్స్‌లో పాకిస్తాన్ పాల్గొన్నది. కాని ఒక్క పతకమయినా సాధించలేదు. 1951 లో ఢిల్లీలో జరిగిన ప్రథమ ఆసియా క్రీడోత్సవానికి ఇండియా పాకిస్తాన్‌ను ఆహ్వానించింది గాని పాకిస్తాన్ ఆ ఆహ్వానాన్ని తిరస్కరించింది. 1954 లో మనీలాలో జరిగిన ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలో పాకిస్తాన్ పాల్గొన్నది. ట్రాక్ అండ్ ఫీల్డ్ పోటీలలో తృతీయస్థానం, కుస్తీలో ద్వితీయస్థానం సంపాదించింది. తక్కినవాటిలో తృతీయస్థానమయినా లేదు. ప్రసిద్ధ పాకిస్తాన్ ఎథ్లెట్ల గురించి పరిశీలించుదాము.

(శ్రీ) అబ్దుల్ ఖలీక్ : పాకిస్తాన్‌కేకాక మొత్తం ఆసియాకే గర్వనీయుడు శ్రీ అబ్దుల్ ఖలీక్.

1956 ఆగస్టు 18 వ తేదీన ఎడింబర్గ్‌లో జరిగిన హైలెండ్ గేమ్స్ ఎత్లెటిక్స్ పోటీలలో ఈయన 100 మీటర్ల పరుగు పందెంలో పాల్గొని, 10 . 1 సెకండ్లలోనే గమ్యంచేరి, ప్రపంచం రికార్డును అందుకొన్నాడు. ఈ తరగతి స్పర్థలో ప్రపంచపు రికార్డుతో సమమయిన మొట్టమొదటి ఆసియావాసి అబ్దుల్ ఖలీక్. 1956 మార్చిలో న్యూఢిల్లీలో జరిగిన ఇండియా - పాకిస్తాన్ ఎత్లెటిక్ పోటీలలో ఈ 24 ఏండ్ల పాకిస్తానీ 100 మీటర్లను 10 . 4 సెకండ్లలో పూర్తిచేసి ఆసియా గేమ్స్ రికార్డును అధిగమించారు. ఇదే పోటీలలో 200 మీటర్ల పరుగులో ప్రథమ స్థానం పొందారు. అప్పుడు 21 . 7 సెకండ్లలో ఆ దూరాన్ని పూర్తి చేశారు. ఈయన ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలో కూడా పాల్గొన్నారు.

(శ్రీ) మహమ్మద్ ఇక్బల్ : హామర్ త్రోలో అఖండ కీర్తి వార్జించారు. పాకిస్తాన్ ఒలింపిక్స్‌లో (1956 మార్చి 5) 189 అడుగుల దూరానికి హామర్ విసిరి ఆసియా, కామన్‌వెల్తు రికార్డులను మించారు. ఇండో-పాకిస్తాన్ క్రీడోత్సవంలో (మార్చి 2 వ వారం) 184 అడుగుల 8 అంగుళాల దూరం విసిరారు. సీసగోలపాతనంలో (షాట్ ఫుట్) కూడా ఈయన ఘటికుడు. (ఈయన రికార్డు 45 అడుగుల $5\frac{3}{4}$ అంగుళాలు.)

పాకిస్తాన్ జాతీయ క్రీడోత్సవంలో ఒక విశేషం ఇతర ఇస్లామిక్ దేశాల ప్రతినిధులు కూడా పాల్గొనడం. 1956 మార్చిలో జరిగిన పాకిస్తాన్ క్రీడోత్సవంలో పాకిస్తాన్, ఈజిప్టు, టర్కీ, పర్షియాలనుంచి దాదాపు 800 మంది ప్రవీణులు పాల్గొన్నారు. పాకిస్తాన్ ఎత్లెటిక్ రంగంలో మరొక విశేషం కలదు. పాకిస్తాన్‌లోనే ఎత్లెట్లకు విదేశ అధ్యాపకులచే ఉన్నతశిక్షణ ఇప్పించడమే గాక, బ్రిటన్, ఫ్రాన్స్, ఇటలీ మున్నగు యూరోపియన్ రాజ్యాలలో జరిగే అత్లెటిక్ పోటీలకు కూడా వారి అత్లెట్లను పంపడం గమనార్హం. ఇండియా ఎమెచూర్ అత్లెటిక్ ఫెడరేషన్ ఈ విషయాన్ని ముఖ్యంగా గమనించవలసి వుంటుంది.




# ఇండియా



ప్రపంచ క్రీడారంగంలో ఇండియా కీర్తిప్రతిష్ఠలను ఇనుమడింపచేసిన వారిలో అగ్రగణ్యులు రంజీ (క్రికెట్), గామా (కుస్తీ), కోడి రామమూర్తి (బల ప్రదర్శనం), ధ్యాన్‌చంద్ (హాకీ) గారలు.



రంజీ బ్యాటింగ్‌లో క్రొత్త పుంతను తొక్కిన వ్యుత్పన్నుడు. విదేశాలు—ముఖ్యంగా బ్రిటన్—ఇండియా క్రికెట్ పట్ల దృష్టి సారించడానికి రంజిత్ సింహ్‌జీ ప్రదర్శించిన ప్రతిభ చాలావరకు కారణం.

గామా భారతీయ, పాశ్చాత్య మల్లవిద్యారీతులలో సమప్రతిభావంతుడై జార్జి జిబిస్కో వంటి ప్రపంచ ఛాంపియనులను సయితం ఓడించి వ్యాయామవిద్యలో ఇండియా ఖ్యాతిని ఇనుమడింపచేశారు. వెంబడి వెంబడినే జెట్టీలను చిత్తుచేసే "ఏక్ లంగోటీ" పద్ధతి ఈయనకూ, ఇండియాకూ ఎనలేని ఖ్యాతి తెచ్చినది.

శ్రీ కోడి రామమూర్తి నాయుడుగారు యూరప్‌లో పర్యటించి అక్కడి ఛాంపియన్‌లను క్షణములో ఓడించివేశారు. బలప్రదర్శనంలోనూ, కుస్తీలోనూ, ముష్టియుద్ధంలోనూ ఇంతటి ప్రతిభావంతుని పాశ్చాత్యులు మున్నెన్నడూ చూచివుండలేదట. శ్రీ రామమూర్తి శాకాహారి. మాంసం ముట్టరని ప్రతీతి. శాకాహారి అయినా ఏనుగు ఎంతటి బలసంపన్నమయినదో శాకాహారులయిన మనుజులు కూడా అదేవిధముగా బలాఢ్యులు కాగలరని ఈయన జీవితాంతం వాదిస్తూ వచ్చారు. శాకాహారి అయినందువల్ల కాబోలు భూతదయ కూడా వీరికి

మెండు. స్పెయిన్‌లో పర్యటించినప్పుడు వృషభక్రీడను వీరు చూచినారని, వృషభమును అలసటపెట్టి అలసటపెట్టి కత్తులతో పొడుచుట వీరికి కంటివెంట నీరు తెప్పించినదనీ ఒక కథ ప్రచారంలో వున్నది. శ్రీ నాయుడుగారు చేతిలో రంగులగుడ్డగానీ, బల్లెములుగానీ లేకుండా మదవృషభంతో పోరాడి "చిత్తుచేసెద" ననీ, అప్పటితో ఇక ఈ హింసాత్మక క్రీడకు స్వస్తిచెప్పవలసిందనీ స్పానిష్ ప్రజలకు పదే పదే విజ్ఞప్తి చేసినట్లు కూడా చెబుతారు. మరే యోధులలో లేని వితరణశీలం నాయుడుగారిలో వుండేది. వారు వారి జీవితకాలంలో దానధర్మాలక్రింద ఇచ్చినది కోటిన్నర రూపాయలని అంచనా వేయబడింది. ప్రపంచంలో మరి ఏ క్రీడావేత్త ఇంత ధనం దానం చేశారు?

ఇండియా అనే ఒక దేశం ఉన్నట్లు ఆఫ్రికాలోని పెక్కు ప్రాంతాలవారు తెలుసుకొన్నది శ్రీ ధ్యాన్‌చంద్ వల్లనే. ధ్యాన్‌చంద్ హాకీజట్టు ఆఫ్రికాలో పర్యటించినప్పుడు ఆ 'మంత్రగాని' ఆటకు ముగ్ధులయిన ప్రజలు ఆతడు ఏ దేశపువాడో తెలుసుకోడానికి తహతహలాడినారట. ఇండియా దేశస్థుడని తెలుసుకొని ఆమీదటనే ఇండియా అనే ఒకదేశం వున్నట్లు వారు గ్రహించినారట.



భారతదేశంలో క్రీడారంగం స్థితిని గురించి ఈ గ్రంథంలోనే "వ్యాయామ రంగంలో బాలల స్థితి" – "యువకులకు ప్రభుత్వ ప్రోత్సాహం" – "భారతదేశ ప్రాచీన క్రీడలు" – "స్త్రీల ఆటలు" – "బాలల ఆటలు" అన్న అధ్యాయాలలో వివరించి వున్నాను. వాటిలో ఉదహరించబడని విశేషాలను దిగువ పేర్కొంటున్నాను.

1955 ఆగస్టులో ఇండియాప్రభుత్వం తమకు క్రీడా వ్యాప్తిలోనూ, క్రీడాభివృద్ధిలోనూ, వ్యాయామ విద్యాప్రచారంలోనూ సలహాలు

ఇవ్వడానికై శ్రీ యస్. యమ్. హాడీని "గౌరవ సలహాదారు" గా నియమించింది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో (1956-61) వివిధ క్రీడలలో శిక్షణ నివ్వడం నిమిత్తం కేంద్రాలు నిర్వహించడానికి ఆల్ ఇండియా స్పోర్ట్స్ కౌన్సిల్ ఒక కార్యక్రమాన్ని తయారుచేసింది. దీని ఫలంగా 1956-57 లో 30,00,000 రూపాయలు ఖర్చుపెట్టబడుతుంది. క్రికెట్, హాకీ, ఫుట్ బాల్, కబాడీవంటి క్రీడలలో ఒక్కొక్క రాష్ట్రం నుంచి, ఒక్కొక్క యూనివర్శిటీనుంచి ఒక్కొక్క ప్రతినిధిని తీసుకొని ఆయనకు సంబంధించిన క్రీడలో శిక్షణ నివ్వడానికి ఈ కార్యక్రమం అవకాశమిస్తున్నది. ఏటా ఇట్టి కోచింగ్ క్యాంపులను కౌన్సిలు నిర్వహిస్తుంది. వీటిలో శిక్షణ పొందేవారు విద్యాసంస్థలలో యువ ఆటగాళ్ళకు శిక్షణ నివ్వగలరనీ, యువకులు శాస్త్రపద్ధతిలో శిక్షణ పొందడంవల్ల దేశంలో క్రీడల ప్రమాణం వృద్ధిచెందగలదనీ ప్రభుత్వం భావిస్తున్నది. ఆల్ ఇండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్సు మద్రాసులో టెన్నిస్‌లో శిక్షణకేంద్రాన్ని 1956 ఆగస్టులో నిర్వహించింది. రాష్ట్రాల, విశ్వవిద్యాలయాల ప్రతినిధులకు ఈ కేంద్రంలో టెన్నిస్ కోచింగ్‌లో శిక్షణ ఇవ్వబడినది. శిక్షణ పొందినవారు తమ, తమ రాష్ట్రాలలోనూ, విశ్వవిద్యాలయాలలోను యువ టెన్నిస్ ఆటగాళ్ళకు శిక్షణ నిస్తారు. ఆంధ్రరాష్ట్రం తరఫున శ్రీ మాధవపెద్ది జానకిరామయ్య, ఆంధ్ర విశ్వవిద్యాలయం తరఫున శ్రీ రామారావు శిక్షణ పొందారు. శ్రీ టంగుటూరి అచ్యుతరామారావు ఈ కేంద్రంలో ప్రధాన శిక్షకులుగా వ్యవహరించారు. ఈ కోచింగ్ ప్రణాళికలోనే శ్రీ యు. చంద్రానా టేబుల్ టెన్నిస్‌కు, శ్రీ ధనరాజ్ వాలీబాల్‌కు శిక్షకులుగా నియమించబడినారు. బెంగుళూరులో నిర్వహించబడిన వాలీబాల్ కోచింగ్ కేంద్రంలో శ్రీ వెంకయ్యగారు ఆంధ్రప్రభుత్వ ప్రతినిధిగా శిక్షణ పొందారు.

ద్వితీయ పంచవర్షప్రణాళికకాలంలో క్రీడల అభివృద్ధి కృషిలో భాగంగా ఇండియా అంతటాగల పెద్ద పట్టణాలలో స్టేడియమ్‌లు, క్రీడాకారులకు అతిథిగృహాలు నిర్మించడం ఒక ప్రధాన కార్యక్రమంగా ఇండియా ప్రభుత్వం పరిగణించింది. ఈ అయిదేండ్లలోనూ క్రీడల

అభివృద్ధికి 2 కోట్ల రూపాయలు ప్రత్యేకించింది. ఇందులో 30,00,000 రూపాయలు మొదటి సంవత్సరంలో (1956-57) వ్యయపర్చబడుతవి. క్రీడల అభివృద్ధిపట్ల విశేషంగా శ్రద్ధవహించవలసిందనీ, క్రీడాభివృద్ధి కార్యక్రమాలకు బడ్జెటులలో తగు మొత్తం ప్రత్యేకించవలసిందనీ రాష్ట్రాల ముఖ్యమంత్రులకు కేంద్రవిద్యాశాఖ 1956 ఆగస్టులో ఒక ఆదేశం పంపింది. స్టేడియమ్‌ల నిర్మాణకార్యక్రమానికి తాము ప్రాధాన్య మిచ్చామని వివరించి రాష్ట్రప్రభుత్వాలే ముఖ్యమైన పట్టణాలను ఎన్ను కొని అక్కడ ప్రభుత్వం ఉపయోగంలోలేని భూములను క్రీడాంగణాల నిర్మాణానికి మంజూరు చేయవలసిందని సలహా ఇచ్చింది. పూర్వాంధ్ర రాష్ట్రంలో ఒక్క స్టేడియమ్ అయినా లేదు. ఆంధ్రదేశ యువకు లలో ప్రజ్ఞాప్రాభవాలు కాని, శక్తియుక్తులుకాని కొరవడి లేవనీ సిండర్ ట్రాక్‌లు, శిక్షణకు అవసరమైన సాధనసామాగ్రి సమకూర్చిన ట్లయితే ఆంధ్రులు అనతికాలంలోనే పైకిరాగలరనీ రాజకుమారిస్పోర్ట్సు కోచింగ్ స్కీమ్ ప్రధానశిక్షకులు శ్రీ జయంతి సుధాకర రూసోగారు 1956 సెప్టెంబరులో విజయవాడ సభలో పేర్కొని వున్నారు. విజయవాడలో స్టేడియమ్ నిర్మించడం అవసరమనే అభిప్రాయాన్ని కూడా ఆయన వెలిబుచ్చారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలుకూడా క్రీడాంగణాల నిర్మాణావశ్యకతను గుర్తించివున్నందువల్ల విజయవాడలో ఒక స్టేడియమ్ తప్పక నిర్మించబడడానికి ఆంధ్ర ఒలింపిక్ అసోసియేషన్ తీవ్రంగా కృషిచేయవచ్చు.

1956 అక్టోబరు 2వ తేదీనుంచి 16వ తేదీ వరకు విజయవాడలో బాస్కెట్‌బాల్ కోచింగ్ కేంద్రం ఏర్పాటు చేయబడింది. ప్రథమ ఆసియా క్రీడోత్సవంలో ఇండియా బాస్కెట్‌బాల్ జట్టుకు నాయకత్వం వహించిన శ్రీ ఛోప్రా ఈ కేంద్రంలో ప్రధానశిక్షకులుగా వ్యవహ రించారు. సుప్రసిద్ధ అమెరికన్ బాస్కెట్‌బాల్ శిక్షకుడు శ్రీ ఫ్రాంక్ కాఫ్‌మెన్ 1955లో అజ్మీర్‌లో బాస్కెట్‌బాల్ ఆటగాళ్లకు, శిక్షకు లకు ఉన్నత శిక్షణ నిచ్చివున్నారు. ఆంధ్ర బాస్కెట్‌బాలు ఆటగాళ్లలో శ్రీ ఆర్. వీర్రాజు, శ్రీ ఆర్. విశ్వేశ్వర్రావు గారలు; శిక్షకులలో శ్రీ పానుగంటి వేణుగోపాల్, శ్రీ వి. సూర్యనారాయణమూర్తి గారలు

కాఫ్‌మన్ వద్ద శిక్షణ పొందారు. 1955 లోనే శ్రీ కాఫ్‌మన్ హైద్రాబాద్‌లో కూడా బాస్కెట్‌బాలు ఆటగాళ్ళకు వున్నతశిక్షణ ఇచ్చివున్నారు. ఈ కేంద్రంలో శ్రీ ఐ. భావన్నారావు, శ్రీ కటకంసెట్టి మల్లిఖార్జునరావుగార్లు కాఫ్‌మన్ వద్ద తర్ఫీదు పొందారు.

నవంబర్‌లో ఉస్మానియా విశ్వవిద్యాలయం ఎథ్లెట్లకు ఒక శిక్షణ కేంద్రం నిర్వహించబడింది. ఈ హైద్రాబాద్ కేంద్రంలో కూడా శ్రీ రూసో శిక్షణ నిచ్చారు. శ్రీ రూసోగారు డిసెంబర్‌లో మద్రాసులో యూనివర్సిటీ అథ్లెట్‌లకు ఒక కేంద్రం నిర్వహించారు.

ఇండియాలో సమస్తక్రీడల వ్యాప్తికి కృషిచేస్తున్న సంస్థలు ఆరు కలవు. వీటి వివర మిది.

నేషనల్ స్పోర్ట్స్ క్లబ్ ఆఫ్ ఇండియా :— అధ్యక్షురాలు శ్రీమతి రాజకుమారి అమృత్ కౌర్. ఈ సంస్థ మొదట ఢిల్లీ, బొంబాయి నగరాలలో ఆధునిక క్రీడాంగణాల నిర్మాణానికి కృషిచేసి దరిమిలా ఆటల శిక్షణ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

ఇండియా ఒలింపిక్ ఎసోసియేషన్ :— అధ్యక్షుడు పాటియాలా మహారాజా. ఇండియా మొత్తంపై సమస్త క్రీడలపై మహోన్నతాధికారం (సుప్రీం పవర్) వహిస్తున్న సంస్థ ఇది.

ఎమెచూర్ ఎథ్లెటిక్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా :— అధ్యక్షుడు శ్రీ రాజా భలీంద్ర సింగ్. ప్రత్యేకించి వ్యాయామక్రీడలను (ఎథ్లెటిక్స్) ప్రచారం చేయడం నిమిత్తం ఈ సంస్థ 1946 లో ఇండియన్ ఒలింపిక్ ఎసోసియేషన్ ఆమోదంపై నియమించబడింది. ఈ సంస్థ ప్రథమాధ్యక్షుడు శ్రీ జి. డి. సోంధి. ప్రథమ కార్యదర్శి శ్రీ యస్. అహమ్మద్. ఈ సంస్థ ప్రతిఏడూ అఖిలభారత ప్రతిపత్తిపై ఎథ్లెటిక్ పోటీలు జరుపుతున్నది. ప్రభుత్వ సహాయ సహకారాలతో ప్రతి ఏడూ అగ్ర వ్యాయామక్రీడా వేత్తలకు శిక్షకులకు శిక్షణకేంద్రం నిర్వహిస్తున్నది. ఫెడరేషన్‌కు చెందిన సీనియర్ కోచీలు — శ్రీయుతులు ఏ. డబ్ల్యు. హోవార్డ్, యమ్. సి. ధావన్, మెహర్‌సింగ్, బల్దేవ్‌సింగ్,

టి. డబ్ల్యు. అర్నాల్డు, కుల్దీప్ సింగ్, లెఫ్టినెంట్ కమాండర్ బి. యస్. రెఖీ వివిధ కేంద్రాలలో శిక్షణను ఇచ్చారు. వీరివద్ద శిక్షణ పొందినవారు తమ తమ రాష్ట్రాలలో వ్యాయామక్రీడలలో ప్రమాణాభివృద్ధికి పాటు పడ్డారు. ఆంధ్రా ఎమచూర్ ఎథ్లెటిక్ ఎసోసియేషన్ గౌరవ కార్యదర్శి శ్రీ వి. సూర్యనారాయణగారు ఫెడరేషన్ గౌరవ శిక్షకులలో ఒకరు.

సర్వీసెస్ స్పోర్ట్సు కంట్రోల్ బోర్డ్ :— అధ్యక్షులు ఎయిర్ కమొడోర్ శ్రీ అర్జున్ సింగ్. మొదట 1919 మార్చిలో ఏర్పాటు చేయబడినప్పుడు ఈ బోర్డు ఆర్మీ స్పోర్ట్సు కంట్రోలు బోర్డ్ ఆఫ్ ఇండియా అనే పేరుతో వ్యవహరించబడేది. 1945 ఏప్రిలు మూడవ తేదీన "సర్వీసెస్ స్పోర్ట్సు కంట్రోలు బోర్డు ఆఫ్ ఇండియా" అనే పేరుతో పునర్నిర్మించబడింది. దీని ప్రధాన కార్యాలయం న్యూఢిల్లీలో వున్నది. భారత సైనిక ప్రతినిధులకు క్రింది క్రీడలలో ప్రావీణ్యాభివృద్ధికి ఈ సంస్థ కృషిచేస్తున్నది :— ఎథ్లెటిక్స్, బాస్కెట్ బాలు, ముష్టియుద్ధం, క్రికెట్, ఫుట్ బాలు, గోల్ఫు, జిమ్నాస్టిక్స్, హాకీ, లాన్ టెన్నిస్, స్క్వాష్ రాకెట్స్, ఈత, వెయిట్ లిఫ్టింగ్, కుస్తీ.

ఇండియన్ రైల్వేస్ ఎథ్లెటిక్ ఎసోసియేషన్ :— అధ్యక్షులు శ్రీ కర్నయలుసింగ్. రైల్వేలలో పనిచేసే క్రీడాకారులలో ప్రావీణ్యం అభివృద్ధిపరచడానికి ఈ సంస్థ కృషిచేస్తున్నది. రైల్వే ఆట గాళ్ళకు ఆటల పోటీలు నిర్వహిస్తున్నది.

ఇంటర్ యూనివర్సిటీ స్పోర్ట్సు బోర్డ్ :— అధ్యక్షుడు శ్రీ ఆనంద్ కుమార్. విశ్వవిద్యాలయాలలోని క్రీడాకారుల ప్రావీణ్య వృద్ధికి ఈ సంస్థ కృషిచేస్తున్నది.

ఇక వివిధ క్రీడల అభివృద్ధికి పాటుబడుతున్న ఆ యా అఖిల భారత సంస్థల గురించి ఆ యా క్రీడలలోని అగ్రగణ్యుల గురించి రేఖా మాత్రంగా దిగువ పేర్కొంటాను.

ఇండియా క్రికెట్ కంట్రోల్ బోర్డు :- 1955—56 లో అధ్యక్షులు విజయనగరం మహారాజ కుమార్ డాక్టర్ విజయ- 1928 లో

ఈ సంస్థ నెలకొల్పబడింది. దీనికి అనుబంధంగా ఇండియా అంతటా రాష్ట్ర సంఘాలు కలవు. క్రికెట్ ఆట ప్రచారానికి, అభివృద్ధికే కాక క్రికెటీర్ల, వారి కుటుంబాల భవిష్యత్తును సుఖతరం చెయ్యడానికి బోర్డు ఆర్థిక, ఉద్యోగవసతులను కలుగజేస్తున్నది.

ఓపెనింగ్ బ్యాట్స్‌మన్ ప్రపంచ రికార్డును భారతీయులు సాధించి వుండడం స్వతంత్ర భారతావనికి, క్రికెట్ కంట్రోలు బోర్డుకు గర్వ కారణం. 1956 జనవరిలో మద్రాసులో జరిగిన ఇండియా—న్యూజిలెండ్ టెస్టు క్రికెట్ పోటీలో ఇండియా తొలి బ్యాట్స్‌మన్‌జంట మన్‌కడ్, రాయ్‌లు 413 పరుగులు చేశారు. (వీరి బొమ్మ క్రింద చూడండి).

ఆలిండియా లాన్ టెన్నిస్ ఎసోసియేషన్ :- ఇండియాలో టెన్నిస్ అభివృద్ధికి పాటుబడుతున్న సంస్థ ఇది. ఇండియా ఆరోగ్య శాఖామంత్రిణి శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ 1955-56 సంవత్సరానికి అధ్యక్షురాలు. ఈ సంస్థకు దేశమంతటా రాష్ట్రీయ సంఘాలున్నవి.



శ్రీ కృష్ణన్‌ను ఆస్ట్రేలియాకు పంపి ప్రత్యేకశిక్షణను అఖిల భారతసంస్థ యిప్పించినందువల్ల అంతర్జాతీయ టెన్నిస్‌రంగంలో ఇండియా ప్రతిపత్తి క్రమంగా పెరిగింది. 1956 డేవిస్‌కప్పు తూర్పుమండలం ఫైనలులో ఇండియా జపాన్‌ను ఓడించివేసింది.

ఆలిండియా లాన్ టెన్నిస్ అసోసియేషన్ గౌరవ కార్యదర్శి శ్రీ నల్లంరెడ్డి కృష్ణస్వామిగారు అఖిలభారత ప్రతిపత్తిపైన, రాష్ట్రప్రతిపత్తిపైన కోచింగ్ కేంద్రాలను నిర్వహించి దేశంలో టెన్నిస్ ప్రాపిణ్యాభివృద్ధికి తీవ్రంగా కృషిచేశారు.

వింబుల్డన్ లాన్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో క్వార్టర్ ఫైనల్సు చేరుకొన్న భారతీయులు ఇప్పటికి ఇద్దరే. వీరిలో మొదటివారు శ్రీ యస్. యమ్. జాకబ్. 1925 లో ఈయన ఇండియాకు ఈ కీర్తిని సాధించారు. రెండవ ఆటగాడు శ్రీ గౌస్ మహమ్మద్. 1939 లో ఈయన క్వార్టర్ ఫైనల్సు చేరుకొన్నారు.

టేబుల్ టెన్నిస్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా:—1955-56 సంవత్సరంలో అధ్యక్షురాలు శ్రీమతి రాజకుమారి అమృత్ కౌర్. విక్టర్ బార్నా, బ్రియాన్ కెన్నెడీ వంటి అగ్ర బ్రిటిష్ ఆటగాళ్ళను శిక్షకులను ఇండియాకు రప్పించి భారతీయ ఆటగాళ్ళకు శిక్షణను ఈ సంస్థ ఇప్పించింది. మద్రాసు మున్నగు రాష్ట్రాలవారికి కెన్నడి శిష్యరికం చేసే భాగ్యం లభించింది. కాని ఆంధ్ర టేబులు టెన్నిస్ ఆటగాళ్ళకు విదేశ శిక్షకులచే శిక్షణ నిప్పించడానికి ఫెడరేషన్ ఏర్పాట్లు చేయకపోవడం ఆంధ్రరాష్ట్రం దురదృష్టం. ఇండియా టేబులు టెన్నిస్ ఆటగాళ్ళలో ప్రపంచపోటీలలో క్వార్టర్ ఫైనల్సు చేరుకొన్నది ఒకే ఒకరు. ఆయనే శ్రీ కె. నాగరాజ్ (మైసూర్. ఇప్పుడు రైల్వేస్ ప్రతినిధి). 1956 ఏప్రిలులో టోకియోలో జరిగిన ప్రపంచం టేబులు టెన్నిస్ పోటీలలో ప్రపంచ మాజీ ఛాంపియన్ శ్రీ జానీ లీచ్ వంటి వారలను ఓడించి యువ నాగరాజ్ క్వార్టర్ ఫైనల్సుకు చేరుకొన్నాడు.

ఆలిండియా ఒలింపిక్ ఎసోసియేషనుకు చెందివున్న అఖిలభారత సంస్థలను గురించి దిగువ పేర్కొంటున్నాను.

ఇండియన్ హాకీ ఫెడరేషన్:—1956-57 అధ్యక్షుడు శ్రీ నావల్. హెచ్. తాతా. 1928 నుంచి హాకీ ఆటలో ఇండియన్లు ప్రపంచ ఛాంపియన్లు. ఆ సంవత్సరంలో ఆమ్‌స్టర్‌డామ్‌లో జరిగిన ప్రపంచం ఒలింపిక్స్‌లో ఇండియా హాకీ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొని నాటినుంచి నేటివరకూ ప్రపంచ బిరుదును నిలుపుకొన్నది. ఇండియాలో మొట్టమొదట 1900 లో బొంబాయి, మద్రాసు, కలకత్తాలలో హాకీ క్రమపద్ధతిలో ఆడబడేది. ఇండియన్ హాకీ ఎసోసియేషన్ స్థాపించడానికి 1924 లో కృషి ప్రారంభించబడింది. తుదకు 1925 నవంబరు

ఏడవ తేదీన ఇండియన్ హాకీ ఫెడరేషన్ గ్వాలియర్‌లో స్థాపించ బడింది. 1928 లో ఇండియాకు ప్రపంచ ఛాంపియన్‌షిప్ సాధించిన జట్టుకు ఫీల్డ్ కెప్టెన్ శ్రీ ఇ. పెన్నిగర్. ఈ జట్టులో శ్రీ ధ్యాన్‌ఛంద్ కూడా కలరు.

విదేశాలలో ఇండియా హాకీ జట్టు సాధించిన అద్భుత విజయాల వివరం: 1932 ఒలింపిక్స్‌లో అమెరికాను 24-1 గోలులతో ఓడించింది. 1935 లో ఆస్ట్రేలియాలో పర్యటించినప్పుడు న్యూ సౌత్ వేల్సులోని టామ్వర్త్‌లో న్యూ సౌత్ వేల్సు జట్టును ఇండియా 24 గోలులతో ఓడించింది. శ్రీ రూప్‌సింగ్ ఒక్కడూ 14 గోలులు కొట్టాడు. ధ్యాన్ ఛంద్, రూప్‌సింగ్ లేనిదే ఇండియాకు హాకీ చరిత్రే లేదు.

1956 డిసెంబర్‌లో ప్రపంచం ఒలింపిక్స్‌లో ఇండియా పాకి స్తాన్‌ను ఓడించి హాకీ ఛాంపియన్ షిప్‌ను నిలబెట్టుకొన్నది. ఈ పోటీల వరుసలో ఇండియాకు ఏ దేశమూ ఒక్క గోలూ కొట్టలేదు.

ఆలిండియా ఫుట్‌బాల్ ఫెడరేషన్:—1955—56 సంవత్స రానికి అధ్యక్షుడు శ్రీ పంకజ్ గుప్త. 1937 జూన్ 23 వ తేదీన సిమ్లాలో జరిగిన క్రింది సంస్థల ప్రతినిధుల సమావేశంలో ఆలిండియా ఫుట్‌బాల్ ఫెడరేషన్ నెలకొల్పబడింది. ఇండియన్ ఫుట్‌బాల్ ఎసోసియేషన్, ఆర్మీ స్పోర్ట్స్ కంట్రోల్ బోర్డు నార్త్, వెస్ట్ ఇండియన్ ఫుట్‌బాల్ ఎసోసియేషన్, బీహార్ ఒలింపిక్ ఎసోసియేషన్, వెస్టరన్ ఇండియన్ ఫుట్‌బాల్ ఎసోసియేషన్, మద్రాస్ ఫుట్‌బాల్ ఎసోసి యేషన్, యు. పి. స్పోర్ట్సు కంట్రోల్ బోర్డ్, మైసూరు ఫుట్‌బాల్ ఎసోసియేషన్, ఆజ్మీర్ మేర్వార్ ఫుట్‌బాల్ ఎసోసియేషన్. ఫెడరేషన్ అవతరించకముందు ఇండియాలో ఫుట్‌బాల్ వ్యవహారాలను ఇండియన్ ఫుట్‌బాల్ ఎసోసియేషన్ చక్కబెట్టుతూ ఉండేది. ఇది బ్రిటిష్ ఫుటాబాల్ ఎసోసియేషన్ అనుబంధ సంస్థ. జాతీయ ఫుట్‌బాల్ సంస్థను ఏర్పాటుచేసే లక్ష్యంతో సిమ్లా సమావేశం జరిగింది. అప్పుడే పూర్తి భారతీయ ఫుట్‌బాల్ ఫెడరేషన్ నెలకొల్పబడింది.

బ్రిటిష్, రష్యను ఫుట్ బాల్ ప్రవీణులను ఆహ్వానించి ఇండియన్ ఫుట్ బాల్ ఆటగాళ్ళకు శిక్షణ నిప్పించడం ద్వారాను, పెద్ద టోర్న మెంటులలో బూట్ లతో విధిగా ఆడవలెననే నియమం విధించడం ద్వారాను, ఆటకాలాన్ని ప్రపంచ ప్రమాణానికి అనుగుణంగా పొడిగించడం ద్వారాను ఈ సంస్థ ఇండియాలో ఫుట్ బాల్ ప్రాచీ ణ్యాన్ని పెంపొందించింది. హెల్సింకీ ఒలింపిక్స్‌లో మొదటి (ఫుట్ బాల్) రౌండ్ లోనే ఓడిపోయిన ఇండియా మెల్బోర్న్ ఒలింపిక్స్‌లో సెమి ఫైనల్సుకు చేరుకొనడం, చతుర్థస్థానం వహించడం ఇందుకు తార్కాణం.

బాస్కెట్ బాల్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా :— 1955-56 సంవత్సరానికి ఈ సంస్థ అధ్యక్షులు శ్రీ సి. సి. అబ్రహాం. 1950 లో బొంబాయిలో ఈ అఖిలభారత సంస్థ నెలకొల్పబడింది. ఈ ఆరేండ్లలోనూ ఇండియాలోని దాదాపు ప్రతిరాష్ట్రంలోనూ బాస్కెట్ బాల్ ఆట బాగా వ్యాప్తిలోనికి వచ్చింది. హైదరాబాద్ వంటి ప్రాంతాలలో సయితం యువతులుకూడా ఈ క్రీడను అభ్య సిస్తున్నారు.

శ్రీ ఫ్రాంక్ కాఫ్మన్ (అమెరికన్ బాస్కెట్ బాల్ శిక్షకుడు) వంటి క్రీడా విద్వాంసులను ఈ సంస్థ ఇండియాకు ఆహ్వానించి ఆంధ్ర, హైదరాబాద్, తదితర ప్రాంతాల ఆటగాళ్ళకు, కోచెస్ కు శిక్షణ నిప్పించింది. ఇందువల్ల బాస్కెట్ బాల్ ఆట క్రమ పద్ధతిలో పెంపొందడానికి మార్గమేర్పడింది.

వాలీబాల్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా :— 1951 ఫిబ్రవరి 16 వ తేదీన లూధియానాలో ఈ సంస్థ స్థాపించబడింది. చైనావంటి దేశాలకేకాక, ప్రపంచ పోటీలకు కూడా భారత వాలీబాల్ జట్టును ఈ సంస్థ పంపుచున్నది. శ్రీ యు. గొలుమొబొవ్ (రష్యా) వంటి పెద్దలచే ఆంధ్ర, హైదరాబాద్ తదితర వాలీబాల్ ఆటగాళ్ళకు శిక్షణ నిప్పించింది. 1955-1956 సంవత్సరంలో ఈ సంస్థ అధ్యక్షులు శ్రీ ఎఫ్. సి. అరోరా.

ఇండియన్ వెయిట్ లిఫ్టింగ్ ఫెడరేషన్: 1955-56 లో ఈ సంస్థ అధ్యక్షులు సర్ ఉదయచంద్ర మెహతాబ్ (బర్ద్వాన్). 1935 నవంబర్‌లో ఈ సంస్థ స్థాపించబడింది. (స్వర్గీయ) మహారాజాధిరాజ సర్ బిజాయ్‌చంద్ మెహతాబ్ (బర్ద్వాన్) ఈ సంస్థ ప్రథమాధ్యక్షుడు. ఈ సంస్థకు ముందు 1924 నుంచి కలకత్తాలోని బాగ్ బజార్ జిమ్నాషియమ్ అఖిలభారత వెయిట్ లిఫ్టింగ్ పోటీలను నిర్వహిస్తూ వచ్చింది. జిమ్నాషియమ్ సభ్యులే ఫెడరేషన్‌ను స్థాపించారు. 1951 నుంచి "భారత్ శ్రీ" దేహసౌందర్య పోటీలను కూడా ఈ సంస్థ నిర్వహిస్తూ వున్నది.

1956 లో శ్రీ లుబషైన్ అనే ప్రసిద్ధ రష్యన్ వెయిట్ లిఫ్టింగ్ శిక్షకుడు ఈ సంస్థ ఆహ్వానంపై ఇండియావచ్చి భారతీయ వెయిట్ లిఫ్టర్‌లకు వున్నత శిక్షణ నిచ్చివున్నారు.

ఇంకా స్విమ్మింగ్, సైక్లింగ్, జిమ్నాస్టిక్, రెజ్లింగ్, కబాడీ (చెడుగుడు) ఫెడరేషన్‌లు ఇండియాలో ఆయా క్రీడల వ్యాప్తికి కృషి చేస్తున్నవి.

ఆసియా ఒలింపిక్స్‌ను, ఆసియా క్వాడ్రాంగ్యులర్ (నాలుగు దేశాలు పాల్గొనే) ఫుట్‌బాల్ పోటీలనూ ప్రారంభించిన ఘనత ఇండియాకే లభించింది.

1954 ఆగస్టులో వాంకోవర్‌లో జరిగిన ఐదవ బ్రిటిష్ ఎంపైర్, కామన్‌వెల్తు క్రీడోత్సవంలో ఇండియా పాల్గొన్నది కాని ఒక్క పతకమయినా సంపాదించలేదు.

లండన్‌లో 1948 లో జరిగిన 14 వ ప్రపంచం ఒలింపిక్స్‌లో ఇండియా పాల్గొన్నది. హాకీలో స్వర్ణపతకం పొందింది. 15 వ ప్రపంచం ఒలింపిక్స్‌లో కూడా ఇండియా పాల్గొని రెండు పతకాలను గెలుచుకొన్నది. హాకీలో ప్రథమస్థానం పొందినందుకు స్వర్ణపతకం, కుస్తీలో శ్రీ జాదవ్ విశేష ప్రతిభ చూపినందుకు కంచు పతకం ఇండియాకు లభించినవి. 16 వ ఒలింపిక్స్‌లో ప్రపంచం హాకీ ఛాంపియన్‌షిప్‌ను నిలుపుకొన్నది. ఫుట్‌బాల్ ఆటలో చతుర్థస్థానం పొందింది.

1951 లో ఢిల్లీలో జరిగిన ప్రథమ ఆసియా క్రీడోత్సవంలో ఇండియా పాల్గొని టీము పోటీలలో ప్రథమస్థానం, వ్యక్తి పోటీలలో ద్వితీయస్థానం సంపాదించింది. 1954 లో మనీలాలో జరిగిన ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలో ఇండియా అయిదవస్థానాన్ని పొందింది. ఈ క్రీడోత్సవంలో ట్రాక్ అండ్ ఫీల్డు పోటీలలో ద్వితీయస్థానం "భారత్"కు లభించింది.

1956 ఏప్రిల్ లో న్యూఢిల్లీలో జరిగిన ప్రథమ ఇండో-పాకిస్తాన్ ఎథ్లెటిక్ క్రీడోత్సవంలో 21 పోటీలలోను పదమూడింటిలో ఇండియా, ఎనిమిదింటిలో పాకిస్తాన్ ప్రథమస్థానం పొందినవి.

1956 ఫిబ్రవరిలో పాటియాలాలో పదిహేడవ భారత జాతీయ క్రీడోత్సవం జరుపబడింది. దాదాపు 350 మంది క్రీడాప్రవీణులు ఈ మహోత్సవంలో పాల్గొన్నారు.

వాలీబాల్, ఫుట్ బాల్ ఆటలలో ఇండియా ఆసియా ఛాంపియనులు. 1955 మే లో వాలీబాల్ ఛాంపియన్ షిప్ ను, గత ఆసియా క్వాడ్రాంగ్యులర్ ఫుట్ బాల్ ఛాంపియన్ షిప్ ను ఇండియా గెలుచుకొన్నది.

## భారత వ్యాయామ క్రీడావేత్తలు

ప్రముఖ భారత వ్యాయామ క్రీడావేత్తల (ఎథ్లెట్స్) విజయాలను పరికించుదాము :

శ్రీ వి. కె. రాయ్ :—ఢిల్లీనివాసి. 100 మీటర్ల పరుగులో ఘటికుడు. పాటియాలా జాతీయ క్రీడోత్సవంలో ప్రథమస్థానం పొందారు. అప్పుడు ఈయన రికార్డు 10.8 సెకండ్లు.

(శ్రీ) లావీ పింటో (బొంబాయి):— ఈయనకూడా 100 మీటర్ల పరుగులో ఉద్దండుడు. ఒకప్పుడు ఆసియా రికార్డు హోల్డరు (10.6 సెకండ్లు). ప్రస్తుతం ఇండియా రికార్డు హోల్డరు (10.6 సెకండ్లు). 200 మీటర్ల పరుగులోకూడా ఈయన అద్వితీయుడు

(21.5 సెకండులు). ఢిల్లీలో జరిగిన ప్రథమ ఆసియా క్రీడోత్సవంలో 100 మీటర్లు 200 మీటర్లు పరుగు పోటీలలో గెలుపొంది ఆసియాలో కల్ల అద్వితీయ పరుగు ప్రవీణుడుగా (ఫాస్టెస్ట్ ఏషియన్) పేరొందాడు. ప్రపంచం ఒలింపిక్స్‌లో కొద్దిదూరపు పరుగు పోటీలలో సెమిఫైనల్ చేరుకొన్న మొట్టమొదటి భారతీయుడు ఈయన.

శ్రీ జోగిందర్ సింగ్:—(సర్వీసెస్) ఇండో-పాకిస్తాన్ క్రీడోత్సవంలో 400 మీటర్ల పరుగులో ప్రథమస్థానం పొందాడు. ఈయన రికార్డు 48.8 సెకండ్లు. పాటియాలా జాతీయ క్రీడోత్సవంలో ఇదే పోటీలో ద్వితీయస్థానం పొందారు. ఈయన ప్రస్తుతం ఇండియా రికార్డు హోల్డర్. ఒకసారి 48 సెకండ్లలో 400 మీటర్ల దూరాన్ని పరుగిడి ఇండియా రికార్డ్ స్థాపించారు. 800 మీటర్ల పరుగులోకూడా ఈయన ఘటికుడు. ఇండో పాకిస్తాన్ క్రీడోత్సవంలో ఈ తరగతి పోటీలో ప్రథమస్థానం పొందారు. అప్పుడు ఈయన రికార్డు ఒక నిమిషం 54.9 సెకండ్లు.

శ్రీ చంద్‌రామ్:—(సర్వీసెస్) మెల్బోర్న్ ఒలింపిక్స్‌లో 110 మీటర్ల హార్డిల్స్ పోటీలో ఇండియా ప్రతినిధి. జననం 1934 మే 15. రాజస్థాన్‌లోని మైనానాలో. ఆరడుగుల మూడంగుళాల ఎత్తు వుంటాడు. ఇండో-పాకిస్తాన్ క్రీడోత్సవంలో 110 మీటర్ల హార్డిల్స్ పోటీలో ద్వితీయస్థానం పొందినప్పుడు ఆసియా గేమ్సు రికార్డు కంటె 0.1 సెకండు ముందు — 14.6 సెకండ్లలో పూర్తిచేశారు. పాటియాలా జాతీయ క్రీడోత్సవంలో ప్రథమస్థానం పొందారు.

శ్రీ అజిత్ సింగ్:—(పంజాబ్) జననం 1931 నవంబరు ఐదు. పంజాబ్‌లోని కండిలా గ్రామం. ఎత్తు దూకడంలో ఈయన అద్వితీయుడు. ఇండో-పాకిస్తాన్ క్రీడోత్సవంలో ప్రథమస్థానం (ఆరు అడుగుల $4\frac{3}{4}$ అంగుళాలు) పొందారు. పాటియాలా జాతీయ క్రీడోత్సవంలో ఆరు అడుగుల అయిదు అంగుళాలు ఎత్తు దూకి ఆసియా గేమ్సు రికార్డును స్థాపించారు. మనిలా క్రీడోత్సవంలో ఈయన ఆరు అడుగుల $4\frac{7}{8}$ అంగుళాల ఎత్తు దూకి ఆసియా గేమ్సు రికార్డును స్థాపిం

చాడు. ఈయన తన ఎత్తుకు మించి దూకడం ఒక విశేషం. ఇండో పాకిస్తాన్ క్రీడోత్సవంలో ఇండియా జట్టుకు ఈయన నాయకత్వం వహించారు. హైజంప్‌లో ఇప్పుడు ఇండియా రికార్డు హోల్డర్ (ఆరు అడుగుల ఐదు అంగుళాలు). మెల్బోర్న్ ఒలింపిక్స్‌లో ఇండియా ప్రతినిధి.

శ్రీ నాయక్ రామ్ మెహార్ :— (సర్వీసెస్) లాంగ్ జంప్‌లో ఇప్పటి ఆసియా రికార్డు హోల్డర్. 1956 సెప్టెంబర్ 30 వ తేదీన ఈయన 23 అడుగుల 11 అంగుళాల దూరం దూకి ఈ రికార్డు స్థాపించాడు. ఇండో-పాకిస్తాన్ క్రీడోత్సవంలో, ఈ పోటీలో ద్వితీయ స్థానం, పాటియాలా జాతీయ క్రీడోత్సవంలో ఇదే పోటీలో ప్రథమ స్థానం పొందివున్నారు. ఈయన జననం 1934 మే 24 వ తేదీన గోహాటక్ జిల్లా, భప్రోడాలో.

శ్రీ ప్రద్యుమ్నసింగ్ :— (సర్వీసెస్) షాట్ పుట్‌లో ప్రతిభాశాలి. మనీలా క్రీడోత్సవంలో (1954) సీసగోళమును 46 అడుగుల $4\frac{5}{8}$ అంగుళాల దూరానికి విసిరి ఆసియా గేమ్సు రికార్డును స్థాపించారు. ఇండో-పాక్ క్రీడోత్సవంలో (1956 ఏప్రిల్‌లో) ఇదే పోటీలో 47 అడుగుల $2\frac{1}{2}$ అంగుళాల దూరానికి విసిరి ప్రథమస్థానం పొందడమేకాక ఆసియా రికార్డును కూడా మించారు. పాటియాలా జాతీయ క్రీడోత్సవంలో (1956 ఫిబ్రవరి) కూడా ప్రథమ స్థానం పొంది అప్పటి ఆసియా రికార్డును మించారు. (47 అడుగుల $10\frac{1}{4}$ అంగుళాలు). డిస్కస్ త్రోలో కూడా ఈయన ప్రతిభావంతుడు. ఇండో పాకిస్తాన్ క్రీడోత్సవంలో మొదటివానిగా గెలుపొందారు (148 అడుగుల ఎనిమిది అంగుళాలు). పాటియాలా పోటీలలో కూడా ప్రథమ స్థానం పొందారు. అప్పుడు 151 అడుగుల $6\frac{1}{2}$ అంగుళాల దూరానికి విసిరి అఖిల భారత, అఖిల ఆసియా రికార్డును అధిగమించారు. అంత వరకు అఖిల భారత రికార్డు 149 అడుగుల $6\frac{1}{2}$ అంగుళాలు. ఆసియా గేమ్సు రికార్డు 142 అడుగుల $8\frac{1}{2}$ అంగుళాలు. ఈ రెండింటిని కూడా శ్రీ ప్రద్యుమ్నసింగ్‌యే స్థాపించివున్నారు. 1950 నుంచి మాత్రమే ఆయన ఎథ్లెటిక్స్‌లో తీవ్రంగా కృషిచేస్తున్నారు.

లెఫ్టినెంట్ నాయక్ సర్వన్‌సింగ్ :— (సర్వీసెస్) : ఈటె విసరడంలో చతురుడు. పాటియాలా జాతీయ క్రీడోత్సవంలో ఈయన 192 అడుగుల $\frac{1}{2}$ అంగుళం దూరానికి ఈటె విసిరి అప్పటి భారతీయ రికార్డును (185 అడుగుల $4\frac{1}{2}$ అంగుళాలు) అధిగమించారు.

మెల్బోర్న్ ఒలింపిక్స్‌లో ఎథ్లెటిక్ పోటీలలో క్రిందివారు పాల్గొన్నారు :

సోహన్‌సింగ్ (800 మీటర్ల పరుగు), శ్రీచంద్‌రామ్ (110 మీటర్ల హార్డిల్స్), జగ్దేవ్‌సింగ్ (400 మీటర్ల హార్డిల్స్), అజిత్ సింగ్ (హైజంప్), మిల్ఖాసింగ్ (400 మీటర్ల పరుగు), జగమోహన్ సింగ్ (110 మీటర్ల హార్డిల్స్), సుదర్శన్‌సింగ్ (హాప్ స్టెప్, జంప్), రామ్ మెహర్ (లాంగ్ జంప్), మొహిందర్‌సింగ్ (బ్రాడ్‌జంప్), మేరీ లీలారావు (80 మీటర్ల హార్డిల్సు, 100 మీటర్ల పరుగు).

కుమారి మేరీ లీలారావు (బొంబాయి):— ఈమె ఆంధ్రి. జననం 1941 ఫిబ్రవరి, బొంబాయిలో 80 మీటర్ల హార్డిల్సులోనూ, 100 మీటర్ల పరుగులోనూ ఘటికురాలు. పాటియాలా జాతీయ క్రీడోత్సవంలో 80 మీటర్ల హార్డిల్సును 12.2 సెకండ్లలో పూర్తిచేసి స్వర్ణ పతకం పొందింది. ఇదే క్రీడోత్సవంలో 100 మీటర్ల పరుగులో ద్వితీయస్థానం పొందింది. 1956 లో బెంగుళూరులో జరిగిన అంతర్ విశ్వవిద్యాలయ క్రీడోత్సవంలో 100 మీటర్ల, 200 మీటర్ల పరుగు, 80 మీటర్ల హార్డిల్సు,



లాంగ్ జంప్ పోటీలలో ప్రథమస్థానం పొందింది. భారతీయ వ్యాయామ ప్రవీణులకు శిక్షణ నిచ్చిన అమెరికన్ ఎథ్లెట్ శ్రీ జెస్సి ఓవెన్స్ ఈమె శిక్షణ విధానాన్ని, ప్రజ్ఞను విశేషంగా మెచ్చుకొన్నారు. ఈమె చెకొస్లొవాకియాలో కూడా ఎథ్లెటిక్స్‌లో ఉన్నతశిక్షణ పొంది వచ్చింది. ఈమె ప్రస్తుతం విద్యార్థిని. నృత్య చిత్ర కళలలో అభిరుచి మెండు.

## మేరీ లీలారావు విజయాల సంగ్రహ స్వరూపం :

వరుసగా నాలుగు సంవత్సరాలు ఇంటర్‌స్కూలు ఛాంపియను. 1955లో లాంగ్ జంప్‌లో ఛాంపియన్ (స్త్రీల తరగతిలో). 1955లో ఇంటర్ యూనివర్సిటీ ఛాంపియన్. క్లబ్, ఇంటర్‌స్కూలు, కలేజియెట్, ఇంటర్ కలేజియెట్, ఇంటర్ యూనివర్సిటీ, రాష్ట్ర రికార్డులు మొత్తం 37 స్థాపించివున్నారు. ఇవి ఇంకా అధిగమించబడలేదు. 1956 సెప్టెంబర్‌లో జరిగిన ప్రపంచ విశ్వవిద్యాలయ క్రీడోత్సవంలో 80 మీటర్ల హార్డిల్సులో తృతీయస్థానం పొందారు. మెల్బోర్న్ ఒలింపిక్స్‌లో పాల్గొన్న ఏకైక భారతనారి. $5\frac{1}{2}$ అడుగుల ఎత్తుగల సుందరి.

(శ్రీ)మతి మేరీ డిసౌజా (బొంబాయి) :— కొద్దిదూరపు పరుగులలో ఈమె ఘనతవహించింది. రెండింటిలోనూ ఈమె ఇండియా రికార్డు హోల్డర్. 100 మీటర్ల పరుగుకు ఈమె రికార్డు 12.3 సెకండ్లు. ఆసియా గేమ్సు రికార్డు 12.5 సెకండ్లు అన్న విషయం గమనార్హం. 200 మీటర్లకు ఈమె రికార్డు 25.7 సెకండ్లు. మొదటి రికార్డును 1954 లోనూ రెండవ రికార్డును 1952 లోనూ నెలకొల్పారు. పాటియాలా జాతీయ క్రీడోత్సవంలో రెండింటిలోనూ అద్వితీయురాలు. ఈమె హాకీలో కూడా ప్రావీణ్యం సంపాదించారు. 1953లో బ్రిటన్‌లో పర్యటించిన స్త్రీల హాకీజట్టులో ఈమెకూడా కలదు. ఈమె వయస్సు 25 సంవత్సరాలు.



## ఆంధ్రప్రదేశ్



క్రీడారంగంలో ఆంధ్రకు ఘనచరిత్ర కలదు. బౌద్ధకాలం నుంచి ఆంధ్రదేశంలో వ్యాయామప్రవీణులు సత్కారాలు పొందుతూ, సంఘంలో గౌరవస్థానం వహిస్తూ వున్నారు.

బౌద్ధయుగంలో వ్యాయామకోవిదులు అమితాదరణను, సత్కారాలను పొందినట్లు అమరావతి, నాగార్జునకొండ, గుంటుపల్లి మున్నగుచోట్ల లభించిన శిల్పాలుబట్టి, సూపాలుబట్టి తెలుస్తున్నది. శాతవాహనుల పాలనలో రథచోదనవిద్యలో అగ్రగణ్యునికి మహారాజదర్బారులో సువర్ణాక్షితలతో సుస్వాగతమిచ్చి వజ్రఖచిత ఖడ్గాలను బహూకరించేవారు. కాకతీయులకాలంలో మల్లయుద్ధవిశారదులకు సేనాపతి పదవినిచ్చి సత్కరించేవారు. విజయనగర రాజుల ఏలుబడిలో జెట్టీలు మడులు, మాన్యాలు బహుమతులుగా పొందేవారు.

బ్రిటిష్‌వారి పాలనలో విజయనగరం, బొబ్బిలి, తుని, పిఠాపురం, వెంకటగిరి, రాజోలు, నూజివీడులోని వుయ్యూరు జమీందారు శ్రీ మేకా వెంకటరంగయ్యప్పారావుగారు (శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు ఎమ్.ఎల్.ఏ. గారి తండ్రిగారు), ఎలమర్రు జమీందారు, ఇంకా అనేకమంది జమీందార్లు, ధనాధిపతులు పెద్ద పెద్ద టోర్నమెంటులనుజరిపి తద్వారా క్రీడలను ప్రోత్సహిస్తూ వుండేవారు. క్రీడావేత్తలకు ఉద్యోగాది వసతులు కల్పించి ఆర్థికసమస్యలను వీలైనంతవరకు తగ్గించేవారు. తుని మహారాణి ఆదరణలో శ్రీ కోడి రామమూర్తి నాయుడుగారు సర్కసుకంపెనీ పెట్టి, యూరప్ యాత్ర చేసి ఆంధ్రఖ్యాతిని దేశదేశాలకు చాటినారు. శ్రీ నల్లంరెడ్డి కృష్ణస్వామి (టెన్నిస్), శ్రీ దుగ్గిరాల పూర్ణచంద్రరావు (టెన్నిస్), శ్రీ మాధవపెద్ది జానకిరామయ్య (టెన్నిస్), శ్రీ దండమూడి రాజగోపాల్ (వెయిట్ లిఫ్టింగ్) వంటి వారలు జమీందారుల ఆదరణవల్ల తమ క్రీడాప్రావిణ్యాన్ని వికసింపజేసుకోగలిగారు.

20 వ శతాబ్దపు ద్వితీయ, తృతీయ దశాబ్దాలలో కోరుకొండలో విజయనగరం మహారాజా నిర్వహించిన టోర్నమెంట్సు, ఏలూరులో సయ్యద్ అహమ్మద్ స్మారకార్థం జరుపబడిన టోర్నమెంట్సు, అన్నవరంలో జరుపబడిన సత్యనారాయణస్వామి టోర్నమెంట్సు, వెంకటగిరిలో వెంకటగిరిరాజా టోర్నమెంట్సు ఈ కాలపు జాతీయ క్రీడోత్సవాలకంటె కలకలలాడుతూ వుండేవి.

ఇతర రాష్ట్రాలలో ఆంధ్రులు క్రీడలలో అనన్యప్రతిభ ప్రదర్శించి తాము వున్న రాష్ట్రానికీ ఆంధ్రకూ కీర్తి సాధించారు.

యునైటెడ్ ప్రావిన్సెస్‌లో వున్న విజయనగరం మహారాజ కుమార్ డాక్టర్ విజయ, ఇండోర్ సంస్థానంలో కతారు సోదరులు కర్నల్ సి. కె. నాయుడు, శ్రీ సి. ఎస్. నాయుడుగారలు, మద్రాసులో బుచ్చిబాబు కుటుంబం (శ్రీమస్కిటీర్స్‌గా గణుతికెక్కిన శ్రీయుతులు వెంకటరామానుజులునాయుడు, కోట రామస్వామి, బాలయ్యగారలు శ్రీ బుచ్చిబాబుగారు) క్రికెట్‌లో తెలుగువారికి అశేషఖ్యాతి తెచ్చారు. ఇండియాలో క్రికెట్ శైశవదశలో వున్నపుడు డాక్టర్ విజయ ("విజీ") బ్రిటనునుంచి హాబ్స్‌ను, స్టట్‌క్లిఫ్‌ను ఆహ్వానించి క్రికెట్‌లో ఇండియా ప్రావీణ్యాభివృద్ధికి పునాది వేశారు.

ఇండియా పాల్గొన్న మొట్టమొదటి క్రికెట్ టెస్ట్‌లో (1932, బ్రిటన్‌లో జరిగినది) బ్రిటన్‌తో పోటీచేసిన ఇండియా జట్టుకు నాయకత్వం వహించినది ఆంధ్రప్రముఖుడు కర్నల్ కతారు కనకయ్య నాయుడుగారు.

విదేశాలలో ఇండియా తరపున టెన్నిస్ పోటీలలో పాల్గొన్న వారిలో ఆంధ్రప్రముఖులు ముగ్గురు కలరు. డేవిస్ కప్ పోటీలలో పాల్గొన్నది ఒకే ఒక ఆంధ్రుడు. వారు శ్రీ కోట రామస్వామిగారు. 1922 లో డేవిస్ కప్ పోటీలలో వీరు ఇండియా తరపున పాల్గొన్నారు. మొదటి రౌండ్‌లో ఇండియా రుమేనియాను 5-0 మ్యాచీలతో ఓడించింది. తర్వాత రెండవ రౌండ్‌లో స్పెయిన్‌తో పోటీచేసి 1-4 మ్యాచీలతో ఓడిపోయింది.

శ్రీ నల్లంరెడ్డి కృష్ణస్వామిగారు 1936 లో తూర్పు ఆఫ్రికాలో పర్యటించిన ఇండియా టెన్నిస్‌బృందం సభ్యుడు. "లో క్రాస్ కోర్ట్ వాలీ" లో వీరు అద్వితీయులు. 'వాలీ'ని ఇండియాలో ఉపయోగానికి మొట్టమొదట తెచ్చినది వీరే.

1936 లో తూర్పు ఆఫ్రికాలో భారత ప్రతినిధులుగా పర్యటించిన టెన్నిస్ ఆటగాళ్లలో శ్రీ దుగ్గిరాల పూర్ణచంద్రరావుగారు కూడా కలరు. వీరి ఆటను కీన్యా పత్రికలు వేనోళ్ళ పొగిడినవి.

ఇక ఫుట్ బాల్ ఆటలో అలనాడు ఆంధ్రులు పొందిన విశిష్టతను పరికించుదాము.

1938 లో ఆస్ట్రేలియాలో పర్యటించిన ఇండియన్ ఫుట్ బాల్ అసోసియేషన్ జట్టులో శ్రీ. ఏ. రహీమ్ అనే ఏలూరు ఆటగాడు కలరు. కలకత్తాలోని మహమ్మడన్ స్పోర్టింగ్స్ టీమ్‌లో రైట్ ఇన్‌గా ఆడి ఈయన గొప్ప ఖ్యాతినొందారు. 1954 లో ఆఫ్ఘనిస్థాన్ జాతీయ ఉత్సవాలకు ఇండియా ప్రతినిధులుగా కాబూల్ వెళ్ళిన ఫుట్ బాల్ జట్టుకు ఆంధ్రప్రముఖుడు శ్రీ యమ్. అప్పారావుగారు నాయకత్వం వహించారు. 1953-1954 లో రష్యాలో పర్యటించిన ఇండియా ఫుట్ బాల్ జట్టులో శ్రీ అప్పారావుగారు ప్రముఖస్థానం వహించారు.

అస్వతంత్ర భారతదేశంలో అన్యరాష్ట్రాల ఆహ్వానాన్ని ఆమోదించి వారి ఫుట్ బాల్ టీములలో పాల్గొని గౌరవం పొందిన కొందరు తెలుగువారు :

శ్రీ అత్తిలి (మోహన్ బగన్, కలకత్తా), శ్రీ జి. ఎస్. రాములు (కాలిఘాటా క్లబ్, కలకత్తా), డాక్టర్. సుంకర భోగారావు (వై. ఎమ్. సి. ఏ. బొంబాయి), కెప్టెన్ సుంకర బుచ్చి (బి. ఇ. ఎస్. టి. బొంబాయి).

ఇప్పుడు దురదృష్టవశాత్తు క్రీడారంగంలో ఆంధ్ర వైభవం నానాటికి క్షీణిస్తున్నది. సి. కె.; సి. యస్. లు కాని (క్రికెట్) రామస్వామి, కృష్ణస్వాములు కాని (టెన్నిస్), రహీం, బుచ్చిలు కాని (ఫుట్ బాల్) ఇప్పుడు కానరావడంలేదు. క్రీడలలో అగ్రస్థానం వహించగల పటిమ, శక్తి, శరీరనిర్మాణము ఆంధ్రులలో ఇతర దక్షిణాది వారికంటె చాలా అధికంగా వున్నదనీ, అయితే, తగినంత కృషి, క్రమశిక్షణ అవకాశాలు ఆంధ్రులకు లేకపోతున్నవనీ శ్రీ రామస్వామి, శ్రీ కృష్ణస్వామి, శ్రీ రూసో, శ్రీ సి. యస్. నాయుడుగార్లు పెక్కు సందర్భాలలో పేర్కొనివున్నారు. మద్రాసు కళాశాలకు కల ఆట స్థలాలు వసతులు ఆంధ్రదేశంలో లేవు. మద్రాసులో వంటి స్టేడియములు కాని, ఈతకోనేర్లుగాని తెలుగునాడులో కానరావు. మద్రాసులో

దాదాపు ప్రతి ఆటకు లీగ్ పోటీలు జరుపుతారు. వీటివల్ల స్థానిక జట్లకు ఎంతో ప్రోత్సాహము, అభ్యాసము లభిస్తవి. ఆంధ్రదేశంలో ఇటువంటి పోటీలు కొన్ని క్రీడలలో జరుపబడడమే లేదు. రాష్ట్రపోటీలు ఏర్పాటు చేయువరకూ అర్రులుచాచి కూర్చోవడం వినా ఆంధ్ర ఆటగాళ్ళకు గత్యంతరం లేదు. మద్రాసు క్రీడాసంఘాలు ఇతర రాష్ట్రాలకు, సింహళం వంటి దేశాలకు తమ జట్లను ఎగ్జిబిషన్ మ్యాచీలకోసం పంపుతున్నవి. ఆంధ్రులలో ఇన్‌డ్‌లీఫ్ క్రికెట్ క్లబ్ వంటి ఒకటిరెండు జట్లు మినహాయిస్తే పరదేశాలకు కాదుగదా పరరాష్ట్రాలకు సైతం ఎగ్జిబిషన్ పోటీలకైనా పోవడంలేదు. పోనీ ఇతరరాష్ట్రాల టీములను ఆంధ్రదేశానికి ఆహ్వానిస్తున్నారా అంటే అదీ లేదు. 1955 లో ఇండియాలో పర్యటించిన రష్యన్ వాలీబాల్ జట్టు ఆంధ్రదేశంలో పర్యటించడానికి తమ సంసిద్ధతను ప్రకటిస్తే ఆ అవకాశాన్నయినా ఆంధ్రులు వినియోగించుకొనలేకపోయినారు !

కేంద్ర ప్రభుత్వం స్పోర్ట్సు కోచింగ్ ప్రణాళికలను అమలుపరచినందువల్ల వాలీబాల్, బాస్కెట్‌బాల్ ఆటలలోనూ, వెయిట్ లిఫ్టింగ్‌లోనూ విదేశశిక్షకులనుంచి శిక్షణపొందే అవకాశం ఆంధ్ర ప్రవీణులకు లభించింది. ఎథ్లెటిక్స్, టేబుల్ టెన్నిస్, ఫుట్‌బాల్ వంటి వాటిలో విదేశ శిక్షకులవద్ద పూర్వ ఆంధ్రరాష్ట్రవాసులు శిక్షణ పొందడానికి అవకాశం లేకపోయింది. ఉన్న శిక్షణసౌకర్యాలనయినా కొన్ని ఆంధ్ర క్రీడా సంస్థలు సక్రమంగా వినియోగించుకొనలేదు. 1956 లో మద్రాసులో చెడుగుడులో శిక్షణకేంద్రం నిర్వహిస్తే కేంద్రం ప్రారంభానికి రెండు మూడు రోజుల ముందు ఆంధ్రరాష్ట్రసంఘం అధికారులు పత్రికలలో ప్రకటనలు చేశారు. ప్రకటన చూచుకొని కలకత్తా మెయిల్‌కు సిద్ధంగా రాగల కబాడీఆటగాళ్లు తమను వెంటనే కలుసుకోవాలని వారు ప్రకటించారు. ఇంతటి అల్పవ్యవధిలో ఏ ఆటగాడు ఆర్థికాది ఇబ్బందులను సరిచూచుకొని రాగలడు ?

మరికొన్ని శిక్షణకేంద్రాలలో ఆటగాళ్లకు మరికొన్ని సమస్యలు ఎదుర్కొంటున్నవి. శిక్షణ పొందడానికి ఆటగాళ్ళు కనీసం వంద రూపాయలు వెచ్చించవలసి వుంటున్నది. నెలకు రెండు, మూడు వందల

రూపాయలు సంపాదించుకొంటున్నవారే ఈ వ్యయాన్ని ఈ గడ్డు కాలంలో భరించలేకుండా వుంటుండగా సామాన్య ఆటగాళ్ల గతి ఏమో వేరే చెప్పనవసరంలేదు. చాలామంది వెయిట్ లిఫ్టర్లకు, వస్తాదులకు, ఆటగాళ్లకు ఫలములు భుజించేపాటి ఆర్థిక స్తోమతు అయినా లేదు. అటువంటప్పుడు అదనంగా డబ్బు పెట్టుకొని పరాయిఊళ్ళలోని శిక్షణ కేంద్రాలకు పోగలరా ? కేంద్రప్రభుత్వం లక్షలకు లక్షలు వ్యయపరచి క్రీడాశిక్షణ ప్రణాళికలను నిర్వహిస్తున్నదేకాని ఆటగాళ్ళ ప్రధాన ప్రాథమిక సమస్యలను తగినంతగా గుర్తించడంలేదు. ఆటగాళ్ళ శిక్షణ ఖర్చులన్నింటినీ ప్రభుత్వం భరించిననాడే వారి శిక్షణ ప్రణాళికలు పూర్తిగా సఫలమవుతవి. నిజంగా సార్థక మవుతవి.

పైన పేర్కొన్న చిక్కు లన్నింటిని ఏదోవిధంగా తీర్చుకొని శిక్షణ పొందినవారైనా శిక్షణానంతరం తమ ప్రావీణ్యం నిలుపుకోడానికి వసతులులేక ఇబ్బంది పడుతున్నారు. వీరికి పరికరాలు ఇతర సదుపాయాలు ఉచితంగా గాని నామమాత్రపు ధరలకుగాని ప్రభుత్వం కల్పించడం ఎంతైనా అవసరం. ఈ విషయంలో చైనా, రష్యాలు మనకు ఆదర్శం కావాలి.

ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం ఆంధ్ర క్రికెట్ ఎసోసియేషన్ వంటి సంస్థలకు ధనసహాయం చేస్తూవున్నది గాని ఆంధ్రులు అంతర్జాతీయ పోటీలకు ఎన్నుకోబడి ఆర్థిక కారణాలవల్ల విదేశాలకు వెళ్ళలేకపోతే ఆంధ్రప్రభుత్వం వచ్చి పూర్తిగా ఆదుకోలేదు. ఇండియా చతురంగపు ఛాంపియన్ శ్రీ దర్భా వెంకయ్యగారు మాస్కో చెస్ ఒలింపిక్స్‌కు ఎన్నుకోబడి కూడా వెళ్ళలేకపోవడం ఇందుకు ఒక ఉదాహరణ. 1954 మనీలా ఒలింపిక్స్‌కు ఆంధ్ర వెయిట్ లిఫ్టర్లు శ్రీ డి. ఆర్. గోపాల్, శ్రీ కామినేని ఈశ్వరరావు ఎన్నుకోబడి కూడా విదేశయాత్ర సాగించలేకపోయారు.



వీరిని పంపవలెనని ఒక తెలుగు దినపత్రిక ఆందోళన చేసినమీదట చివరి ఘడియలలో మాత్రం ఒకరిద్దరు మంత్రులు కూడా జోక్యం కలుగజేసికొని

ప్రకటనలు చేశారు. ముందే ఈ అప్రమత్తత వుంటే ఆంధ్రులు మనీలా పోటీలలో పాల్గొని వుండేవారేమో!

పూర్వాంధ్రరాష్ట్రంలో బాడ్‌మింటన్, టెన్నిస్, కబాడీ ఆటలు బాగా అభివృద్ధిపరచడానికి విశేషావకాశాలు వున్నప్పటికి ఆయా క్రీడల నిర్వాహకులు తగినంత శ్రద్ధవహించకపోవడం శోచనీయం. ఆంధ్ర రాష్ట్రం వచ్చినమీదట ఆంధ్రులు జాతీయ కబాడీ ఛాంపియన్ షిప్‌ను పోగొట్టుకొనడం ఇటువంటి అశ్రద్ధకు తార్కాణం. గుంటూరువంటి పట్టణాలలో అనేక కళాశాలలు, పాఠశాలలు వుంటవి. సమర్థులమని ఋజువు పరచుకోగల ఇతర ఆటగాళ్ళుకూడా వున్నారు. విద్యాలయాలలో నేమి, ఇతరచోట్లనేమి వందల, వేల సంఖ్యలో టెన్నిస్ ఆటగాళ్ళను తర్ఫీదుచేసే అవకాశం వున్నప్పటికీ క్రీడాసంఘాలు ఆ అవకాశాన్ని వినియోగించుకొంటున్నట్లు కనబడడంలేదు. కబాడీలో ఆటగాళ్ళ ప్రావీణ్యాభివృద్ధికి ఆంధ్రరాష్ట్రంలో తగినంతకృషి జరుగలేదు; శ్రద్ధ వహించబడలేదు. చతురంగపు ప్రవీణుడు శ్రీ వెంకయ్యగారు మాస్కో వెళ్ళలేకపోవడం ఆంధ్రరాష్ట్రంలోని చతురంగపు ఆట నిర్వాహకులకు మాయని మచ్చ. ప్రభుత్వం సంగతి అలావుండగా, రాష్ట్రక్రీడా సంఘాలు ఇటువంటి ప్రత్యేక సందర్భాలలోనైనా ఆటగాళ్ళను ఆదుకొనలేకపోవడం శోచనీయం.

1953 అక్టోబరు ఒకటవ తేదీన ఆంధ్రరాష్ట్రం అవతరించినమీదట ఆంధ్ర క్రీడావేత్తలకు, యువకులకు తమ తమ ప్రతిభావిశేషాలు ప్రదర్శించడానికి అవకాశాలు హెచ్చినమాట వాస్తవమే. రాష్ట్రక్రీడా సంఘాలు ఏర్పడి, వాటి జండాక్రింద ఆంధ్రులు జాతీయపోటీలలో పాల్గొన్నారు. కొన్ని రాష్ట్రక్రీడాసంఘాలు వచ్చిన అవకాశాలను పూర్తిగా వినియోగించుకొనక అశ్రద్ధ వహించినందుకుమాత్రం చింతిల్లని ఆంధ్రుడు వుండడు.

ఆంధ్రరాష్ట్రోదయం పిమ్మట ఆంధ్రయువకులు డాక్టర్ విజయ, శ్రీ రూసో, కర్నల్ సి. కె. నాయుడు, శ్రీ సి. యస్. నాయడు, శ్రీ యస్. కృష్ణస్వామి వంటి రాష్ట్రేతర ఆంధ్ర క్రీడా ప్రముఖుల

అమూల్యమయిన సలహాలు పొందారు. ఇండియా వాలీబాల్ టీము సభ్యునిగా శ్రీ సి. హెచ్. బుచ్చిరామయ్యగారు చైనాలో పర్యటనకు ఆంధ్ర పంపింది. అయితే హిందూకాలేజి (గుంటూరు) ఎంతో శ్రద్ధ వహించి ఆర్థిక సహాయం చేసినందువల్లనే శ్రీ బుచ్చిరామయ్యగారు చైనాయాత్రకు నోచుకొన్నారు. ఈ కాలేజీలో అగ్ర ఆటగాళ్ళకు కాలేజీ ఫీజు లేకుండా చేయడంవంటి ప్రత్యేక సదుపాయాలు వున్నవి. శ్రీ బుచ్చిరామయ్య, శ్రీ సి. హెచ్. చలమయ్య, శ్రీ యమ్. ఆంజనేయులు వంటి వాలీబాల్ ఆటగాళ్ళు ఈ కాలేజీనుంచి ఉద్భవించారు. ఆటగాళ్ళకు ఆర్థికాది సహాయం చేస్తున్న గుంటూరు హిందూ కాలేజీ కమిటీ వారు, ప్రిన్సిపాల్ శ్రీ వల్లభజోస్యుల సుబ్బారావుగారు, ఫిజికల్ డైరెక్టర్ శ్రీ గురజాల వెంకట నరసింహారావుగారు అభినందనీయులు.

ఆంధ్రరాష్ట్రోదయం పిమ్మట ఆంధ్ర స్నూకర్, బిలియార్డ్స్ యువ ఆటగాడు శ్రీ టి. జి. కృష్ణ సింహళం పోటీలలో పాల్గొనకలిగారు. టేబుల్ టెన్నిస్ ఆటగాళ్ళు శ్రీ ఆర్. కె. వి. రమణశాస్త్రి, శ్రీ సి. యస్. ఆర్. ఆంజనేయులు, మార్కండేయశాస్త్రిగారలు కూడా సింహళం టోర్నమెంటులలో పాల్గొనకలిగారు. ఆంధ్ర టేబుల్ టెన్నిస్ అసోసియేషన్ 1955 లో 18వ జాతీయ అంతర్రాష్ట్ర టేబుల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలను గుంటూరులోనూ, ఆంధ్ర స్టేటు చెస్ ఎసోసియేషన్ 1955 లో జాతీయ చతురంగపు పోటీలను ఏలూరులోనూ నిర్వహించకలిగినవి.

ఆంధ్రరాష్ట్ర తృతీయ వార్షికోత్సవంనాటికి (1956 అక్టోబరు ఒకటి) ఆంధ్రరాష్ట్రం వెయిట్ లిఫ్టింగ్ లోనూ, చతురంగంలోనూ ఇండియాలో ప్రముఖస్థానం వహించి వున్నది.

హైదరాబాద్ ఆదినుంచి క్రీడారంగంలో ఇండియాలో ప్రముఖస్థానం వహించి వున్నది. ఫుట్‌బాల్, క్రికెట్, టేబుల్ టెన్నిస్, సైక్లింగ్, ఈత, బాడ్‌మింటన్‌లలో అగ్రస్థానం వహించిన రోజులు కూడా వున్నవి.



1920 కు ముందు హైదరాదాబాద్‌లో నవాబులు, రాజాలు క్రికెట్ ఆట అభివృద్ధికి విశేషంగా కృషిచేశారు. 1920 నుంచి 1931 వరకు హిందూ, ముస్లిమ్, పార్శీ యువకులు, యూరోపియనులు పాల్గొనే చతుర్వర్గ ఫుట్ బాల్ టోర్నమెంటు హైదరాబాద్‌లో పెద్దపెట్టున నిర్వహించబడినది.



హైదరాబాద్‌లో క్రికెట్ అభివృద్ధికి గట్టి పునాదులు వేసినవారిలో రాజా ధనరాజ్‌గిర్, నవాబ్ మొయిన్ ఉద్‌దౌలా బహదూర్ ముఖ్యులు. వీరు సంస్థానంలో ఏటా క్రికెట్ పోటీలను భారీఎత్తున నిర్వహించడమే కాక విదేశాలనుంచికూడా క్రికెట్ జట్లను ఆహ్వానించేవారు. మొయిన్ ఉద్‌దౌలా గోల్డ్‌కప్ క్రికెట్ టోర్నమెంటులో హాబ్స్, సట్‌క్లిఫె, వజీర్ ఆలీ, డాక్టర్ విజయ వంటి ప్రసిద్ధులు పాల్గొనేవారు. ముష్తక్ ఆలి, అమర్‌నాథ్, అమర్‌సింగ్, మర్చెంట్ వంటివారలు ఓంప్రథమంగా నైపుణి చూపి పైకివచ్చినది ఈ టోర్నమెంటులలోనే అని ఒక వాదం ఉన్నది. గులాం అహమ్మద్, జయసింహ, ముద్దయ్య వంటి క్రికెట్ అగ్రజులను నవ హైదరాబాద్ కన్నది.

హైదరాబాద్ సంస్థానంలో ఫుట్‌బాల్ క్రీడకు ఉక్కు పునాదులు వేసి ప్రోత్సహించినవారిలో శ్రీ సి. వి. పద్మారావు, మహారాజా సర్ కిషన్ ప్రసాద్ బహదూర్, నవాబ్ బెహ్రామ్ ఉద్‌దౌలా గారలు ముఖ్యులు. శ్రీ ఎస్. ఎమ్. హాడి, శ్రీ ఆర్. కె. రావు, శ్రీ వి. గణేష్ రావు, శ్రీ పి. దత్తాత్రేయ, శ్రీ వాసుదేవరావుగారలు పై ప్రముఖులు నిర్వహించిన పెద్ద ఫుట్‌బాల్ టోర్నమెంటులలో పాల్గొని ఖ్యాతిలోనికి వచ్చారు. దక్కనులో చిరకాలంనుంచి బూట్లతో ఫుట్‌బాల్

ఆడబడుతున్నది. ఏలూరు సయ్యాద్ అహమ్మద్ టోర్నమెంటు, బందరు టోర్నమెంటులలో హైదరాబాద్ ఫుట్‌బాల్ జట్లు పాల్గొని ప్రముఖ స్థానం వహించేవి. 1949 నుంచి ఫుట్‌బాల్ ఆటలో హైదరాబాద్ ఇండియాలో ప్రముఖస్థానం వహించి వున్నది.

ఇంకా వరంగల్లు నివాసి శ్రీ జె. పిచ్చయ్య (బాడ్మింటన్), సయ్యాద్ సుల్తానా (ఈమె నిన్న మొన్నటివరకు హైదరాబాద్ నివాసిని. ప్రస్తుతం పాకిస్తాన్‌లో వసిస్తున్నది.) రామకృష్ణ (టేబుల్ టెన్నిస్), అసిఫ్ ఖద్రి (టెన్నిస్), రామస్వామి (సైక్లింగ్), శ్రీనివాసన్ (బాస్కెట్‌బాల్) భారత ప్రమాణాన్ని అందుకొనివున్నారు. వింబుల్డన్ టెన్నిస్ పోటీలలో క్వార్టర్ ఫైనల్స్‌కు చేరుకొన్న మొట్టమొదటి సంపూర్ణ భారతీయుడు, ఇండియా ప్రతినిధులలో రెండవవాడూ అయిన శ్రీ ఘాస్ మహమ్మద్ ప్రస్తుతం ఉస్మానియా యూనివర్శిటీలో క్రీడాధ్యాపకులుగా వుంటున్నారు. వీరివల్ల ఆంధ్రప్రదేశ్ ముఖ్యంగా హైదరాబాద్ టెన్నిస్‌కు ఉజ్జ్వల భవిష్యత్తు కన్పిస్తున్నది. శ్రీ జి. ఎమ్. పెంటయ్యగారు (అఖిలభారత ఫుట్‌బాల్ ఫెడరేషన్ నియమించిన ఫుట్‌బాల్ అధ్యాపకులు) కూడా సికిందరాబాద్ (బొలారమ్) లో వుంటున్నారు. ఫుట్‌బాల్ క్రీడలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యంగా హైదరాబాద్ కీర్తిని ఇనుమడింపజేయడానికి వీరెంతైనా కృషిచెయ్యగలరు.

హైదరాబాద్ ఎమచూర్ ఎథ్లెటిక్ అసోసియేషన్, హైదరాబాద్ రాష్ట్రంలో వ్యాయామక్రీడల ప్రచారానికి, ఎథ్లెటిక్స్‌లో బాలురనుంచి ప్రావీణ్యం పెంపొందించడానికి విశేషంగా కృషి చేస్తున్నది శ్రీ పి. ఎమ్. రెడ్డిగారు (ఎమ్. ఐ. ఇ. ఎమ్. ఏసి. ఎస్. ఐ., ఎమ్. ఎమ్. ఇ. ఏ.) ఈ సంఘం అధ్యక్షులు (1956). వీరి కృషిఫలితంగా ఉస్మానియా యూనివర్శిటీ ఎథ్లెట్‌లు శ్రీ జె. ఎస్. రూసో వంటి ప్రవీణులవద్ద ఉన్నత శిక్షణ పొందారు. ఆంధ్ర, హైదరాబాద్ క్రీడా



పి. ఎమ్. రెడ్డి

సంస్థలు ఏకమై ఆంధ్రఖ్యాతిని ఇనుమడింపజేసే సుదినం దగ్గరలో వున్నదని వీరొక సందర్భంలో పేర్కొన్నారు.

రాజా రామచంద్రారెడ్డిగారు హైదరాబాద్ రాష్ట్ర హాకీ సంఘం అధ్యక్షులు (1956). వీరి శ్రద్ధవల్ల, కృషివల్ల హాకీరంగంలో కూడా హైదరాబాద్ మరింత ఖ్యాతి నొందగలదు.

హైదరాబాద్ రాష్ట్రంలో, మద్రాసులో అంతగా మేలైన క్రీడాంగణాలు లేవు; ఆటస్థలాలు లేవు. అయితే ఆంధ్రరాష్ట్రమంత అధ్వాన్నం కాదు. హైదరాబాద్ నగరంలోని ఫతే మైదానాన్ని విశిష్ట క్రీడాంగణంగా మార్చడానికి తగు అవకాశాలు వున్నవి. క్రీడాంగణం నిర్మాణానికి పథకాలు కూడా తయారు చేయబడినవి. బాడ్మింటన్, టేబుల్ టెన్నిస్, ఇన్‌డోర్ స్టేడియమ్‌లు నిర్మించడానికి శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు ముఖ్యమంత్రిగా వున్నప్పుడు హైదరాబాద్ ప్రభుత్వం 40,000 రూపాయల గ్రాంటుకూడా యిచ్చింది.

బూర్గులవారు స్పోర్ట్సు ప్రచారంపట్ల మిక్కిలి శ్రద్ధవహించారు.

హైదరాబాద్, సికిందరాబాద్‌ల మధ్య ముషీరాబాద్‌లో వున్న టెన్నిస్ స్టేడియమ్‌ను అభివృద్ధిపరచడం కూడా ఎంతైనా ఆవశ్యకం. సికిందరాబాద్ రేస్‌కోర్స్ ప్రాంతాల విశాల మైదానాలు అనేకం వున్నవి. సికిందరాబాద్ పౌరుల క్రీడాసక్తిని తీర్చడానికి అక్కడకూడా క్రీడాంగణాలు నిర్మించడం అవసరం.

హైదరాబాద్‌లో వివిధక్రీడల అభివృద్ధికిగాను బూర్గులవారి ప్రభుత్వం రాష్ట్ర క్రీడాసంస్థలకు ఏటా 15,000 రూపాయలు మంజూరు చేసేది. "క్యాచ్ దెమ్ యంగ్" అనే సూత్రాన్ని (పసితనంనుంచే క్రీడలలో శిక్షణ నివ్వాలనే సూత్రాన్ని) హైదరాబాద్ బాగా అనుసరించింది. పాఠశాలల విద్యార్థులకు క్రికెట్‌లో ప్రావీణ్యం పెంపొందించడానికి ప్రత్యేకంగా శ్రద్ధ వహించింది. ఇది ఎంతైనా ప్రశంసనీయం.

1953 అక్టోబరులో ఆంధ్రరాష్ట్రం అవతరించినమీదట ఆంధ్ర రాష్ట్రంలో వివిధ క్రీడాసంఘాలు ఏర్పడినవి; ప్రభుత్వంకూడా క్రీడలపట్ల కొంత ఆసక్తి చూపింది.

ఆంధ్రరాష్ట్రంలో శాస్త్రీయ పద్ధతిని వివిధ క్రీడలను అభివృద్ధి పరచడానికి నాందిగా ఆ యా క్రీడలలో శిక్షకులకు ఉన్నత శిక్షణ నిప్పించడానికి ఆంధ్రరాష్ట్రప్రభుత్వం 1956 ఏప్రిల్ లో నిర్ణయించింది. ఫుట్ బాల్, క్రికెట్, హాకీ, టెన్నిస్, వాలీబాల్, బాస్కెట్ బాల్, ఎథ్లెటిక్స్ లో కొందరు హైస్కూలు, కాలేజీ వ్యాయామాధ్యాపకులకు ఉన్నత శిక్షణ నిప్పించడానికికూడా సన్నాహాలు చేసింది. ఆంధ్ర క్రికెట్ ఎసోసియేషన్, ఆంధ్ర ఒలింపిక్ ఎసోసియేషన్ వంటి సంస్థలకు ప్రభుత్వం విరాళాలనుకూడా ఇచ్చింది. అగ్ర ఆటగాళ్లకు ప్రత్యేక సెలవు వసతి కల్పించిందికూడా.

## వ్యాయామ క్రీడావేత్తలు

ఆంధ్ర ఎథ్లెటిక్ ప్రవీణుల గురించి పరికించుదాము.

(శ్రీ) జె. యస్. రూసో :— మొత్తం భారతదేశంలో వ్యాయామక్రీడలలో ప్రావీణ్యాభివృద్ధికి పాటుబడుతున్న వారిలో శ్రీజయంతి సుధాకర రూసోగారు ప్రప్రముఖులు. వీరు రాజకుమారి



రూసో, జోగిందర్ సింగ్

స్పోర్ట్సుకోచింగ్ స్కీములో ఎథ్లెటిక్సుశాఖకు డైరెక్టర్. 1952 లో హెల్సింకీలో జరిగిన ప్రపంచం ఒలింపిక్సులో పాల్గొన్న ఇండియన్ ఎథ్లెటిక్ టీముకు, 1954 లో మనీలాలో జరిగిన ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలో పాల్గొన్న ఇండియన్ ఎథ్లెటిక్ స్విమ్మింగ్ జట్లకు వీరు అధ్యాపకులు. 1956 జూన్ నుంచి అక్టోబరు, ఆ పై నెలవరకు బెంగుళూరు, విజయవాడ, హైదరాబాద్ నగరాలలో ఎథ్లెటిక్ ట్రైనింగ్ కేంద్రాలను నిర్వహించారు. 1919 ఏప్రిల్ 15 వ తేదీ బరంపురంలోని తెలుగు కుటుంబంలో శ్రీ జయంతి సుధాకర రూసోగారు జనించారు. ఖల్లికోట్ కాలేజీలో ఇంటర్ మిడియేట్ చదువుతున్నప్పుడు వ్యాయామ క్రీడలలో ఛాంపియన్. 1938-41 వరకు వాల్తేరులోని ఆంధ్ర యూనివర్శిటీ కాలేజిలో బి. యే. (ఆనర్సు) చదువుతున్నప్పుడు ఎథ్లెటిక్ టీముకు కెప్టెన్. క్రికెట్ టీములో ప్రముఖ సభ్యుడు. పై మూడు సంవత్సరాలలోనూ యూనివర్శిటీ కాలేజీస్, ఇంటర్ కాలేజియేట్ ఎథ్లెటిక్ ఛాంపియన్. 1945-46 లో మద్రాసు వై. యమ్. సి. ఏ. వ్యాయామ కళాశాలలో డి. పి. యి. కోర్సు చదివారు. అదే సంవత్సరంలో చెన్నరాష్ట్రం ఎథ్లెటిక్ పోటీలలో పెంటాత్లన్ (అయిదురకాల వ్యాయామ క్రీడలు) ఛాంపియన్ షిప్ సాధించారు. వ్యాయామ విద్యలో విదేశాలలో ఉన్నత శిక్షణ పొందడానికి ఇండియా విద్యాశాఖచే 1947 లో ఎన్నుకొనబడినారు. 1947-49 సంవత్సరాలలో బ్రిటన్ లోని ఎడింబరో కాలేజీలో ఉన్నత వ్యాయామవిద్య నభ్యసించారు. ఎథ్లెటిక్సు, ఈత, ఫుట్ బాల్, క్రికెట్, టెన్నిస్, కుస్తీ, కసరత్తు, ముష్టియుద్ధం మున్నగు క్రీడలలో శిక్షణ విధానాలను బోధించడం గురించి తెలుసుకున్నారు. ఈ కాలేజీ క్రికెట్ జట్టులో ప్రముఖ సభ్యుడు. ఎథ్లెటిక్ జట్టులో కూడా సభ్యుడు. "కలర్" పొందారు. బ్రిటన్ లోని సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ ఫిజికల్ రిక్రియేషన్ లో ఉన్నతవిద్య నభ్యసించారు. సంఘ జీవితంలో వినోదవ్యాసాంగం అన్న విషయంలోనూ, బాస్కెట్ బాల్, టెన్నిస్ ఆటలలోనూ శిక్షణ పొందారు. బర్మింగ్ హామ్ యూనివర్శిటీ, బర్మింగ్ హామ్ కౌంటీ కౌన్సిల్, లండన్ కౌంటీ కౌన్సిల్, లీడ్సు యూనివర్శిటీ, గ్లాస్గో యూనివర్శిటీ, జోర్డన్ హిల్ కాలేజీ, స్కాట్లెండ్

లోని డఫర్ మెయను స్త్రీల వ్యాయామకళాశాలలలో బోధనాపద్ధతులను అధ్యాపకుని హోదాలో పరిశీలించారు. 1949-52 లో అమెరికా యాత్ర సాగించారు. క్రింది విశ్వవిద్యాలయాలలో వ్యాయామ విద్య బోధనాపద్ధతులను, అధ్యాపకుని హోదాలో ఇండియా ప్రభుత్వ ప్రతినిధిగా ఆరు నెలలపాటు పరిశీలించారు.

కొలంబియా యూనివర్శిటీ, న్యూయార్క్ యూనివర్శిటీ, బోస్టన్ యూనివర్శిటీ, స్ప్రింగ్ ఫీల్డ్ కాలేజి, అయోవా యూనివర్శిటీ, మిచిగన్ యూనివర్శిటీ, మిచిగన్ స్టేట్ యూనివర్శిటీ, ఓహియో యూనివర్శిటీ, ఇలియానిస్ యూనివర్శిటీ, ఇండియానా యూనివర్శిటీ, నార్త్ వెస్టరన్ యూనివర్శిటీ.

1949 వేసవికాలంలో వ్యాయామవిద్యలో పరిశోధనలు జరిపారు. వ్యాయామక్రీడల స్పర్థల నిర్వహణ విధానాలను అభ్యసించారు. బాస్కెట్ బాల్ క్రీడలో అత్యున్నత శిక్షణ పొందారు. ఇలియానిస్ యూనివర్శిటీలో రెండున్నర సంవత్సరాలుపాటు పి. హెచ్. డి. సాగించారు. ఇదే యూనివర్శిటీలో ఫుట్ బాల్, టెన్నిస్, ఎథ్లెటిక్స్‌లో శిక్షకులుగా వున్నారు. ఫిజికల్ ఫిట్ నెస్ లేబరేటరీలో పరిశోధనశాఖ సహాయకునిగా రెండు సంవత్సరములు పనిచేశారు. 1952 లో మాతృదేశానికి మరలివచ్చారు. 1952-53-54 సంవత్సరాలలో రాజపుతానా రైఫల్సు ప్రతినిధులకు వ్యాయామ క్రీడలలోనూ ఈతలోనూ వున్నత శిక్షణను ఇచ్చారు. భారత రక్షణదళాలవారికి కూడా 1952—56 మధ్య వ్యాయామ క్రీడలలోనూ ఈతలోనూ వున్నత శిక్షణను ఇచ్చారు. 1953 నుంచి రాజకుమారీ స్పోర్ట్స్ కోచింగ్ స్కీమ్‌లో వ్యాయామక్రీడల శాఖలో ప్రధాన శిక్షకులుగా వుంటున్నారు. ఆల్ ఇండియన్ పోలీసు ఎథ్లెట్లకు గౌరవశిక్షకుడు. ఇండియా ఎథ్లెటిక్, ఈత రికార్డు హోల్డర్‌లలో (పురుషులు) దాదాపు అందరూ వీరివద్ద శిక్షణ పొందినవారే. 15 రాష్ట్రాల ఎథ్లెట్లకు, శిక్షకులకూ, వ్యాయామోపాధ్యాయులకు వీరు ఉన్నతశిక్షణ నిచ్చారు.

క్రీడాంగణాలు, వ్యాయామశాలలు, ఈతకొలనులు నిర్మించడంలో విశేషానుభవం గడించినారు. వ్యాయామక్రీడలు, ఈత, బాస్కెట్

బాల్, టెన్నిస్, క్రికెట్ క్రీడాకారులకు అంతర్జాతీయ ప్రమాణంలో శిక్షణ నివ్వగల అర్హత పొందివున్నారు. 1952 నుంచి రెండువేల రెండువందలమందికి పైగా క్రీడావేత్తలకు, క్రీడాబోధకులకు (టీచర్స్) వీరు శిక్షణ ఇచ్చివున్నారు. ఇండియాలోని వివిధరాష్ట్రాలలో 30 కి పైగా ఎథ్లెటిక్ ట్రైనింగ్ క్యాంప్ లను నిర్వహించి వున్నారు.

శ్రీ ఎమ్. ఎస్. మోహన్ :- పూర్తిపేరు శ్రీరామమోహన్. జననం బందరు. నూజివీడు యస్. ఆర్. ఆర్. హైస్కూలులో విద్య



నభ్యసించారు. తర్వాత మద్రాసు లయోలా, వై. యమ్. సి. ఏ. కాలేజీలలో వున్నతవిద్య నభ్యసించారు. తదుపరి రాయ్‌పూర్‌లోని రాజ్ కుమార్ కాలేజీలో వ్యాయామ విద్యాశాఖాధి నేతగా పనిచేశారు. అప్పుడే స్ప్రింగ్ ఫీల్డ్ (మసాచు సెట్స్, అమెరికా) లో వ్యాయామ విద్యలో ప్రత్యేక పరిశోధనలు జరపడానికై వెళ్ళారు. అమెరికాలో అయిదేండ్లపాటు వ్యాయామ విద్యలో ఉన్నత పరిశోధనలు జరిపారు. డాక్టర్ క్లార్కు, డాక్టర్ కరోవ్విచ్, డాక్టర్ ఎస్లింగర్, డాక్టర్ షే వంటి వ్యాయామశాస్త్రకోవిదులవద్ద పనిచేసి "మాష్టర్", "డాక్టర్" డిగ్రీలను పొందారు. ఇండియాలోకెల్ల వీరే మొట్టమొదటి వ్యాయామ విద్యాపరిశోధకులు. "ఎప్లైడ్ ఫిజియాలజీ" లో వీరు చేసిన పరిశోధనలు అమూల్యమైనవి. శరీరసౌష్ఠవానికి, ముఖ్యంగా ఎగువ భాగాల పుష్టికి వీరు ప్రత్యేక పరిశోధనలుజరిపి, కండరనిర్మాణానికి క్రొత్తపథకం రూపొందించారు. బ్రిటన్, కెనడా, మెక్సికోలు సందర్శించి అక్కడి విద్యాసంస్థలలోని వ్యాయామ విద్యా ప్రమాణాలను పరిశీలించారు. ఇండియాకు తిరిగివచ్చిన పిమ్మట విజయవాడ వ్యాయామ కళాశాల ప్రిన్సిపాల్ గా పనిచేశారు.

శ్రీ నల్లంరెడ్డి వెంకట రామారావు :— జననం 1903 సెప్టెంబర్ 26 వ తేది, గుంటూరు. టౌన్ హైస్కూలు (గుంటూరు) విద్యార్థి. 1912 డిసెంబర్‌లో జరిగిన అయిదవ జార్జి కారొనేషన్ పోటీలలో 100 గజముల పరుగులో గెలుపొంది గడియారం బహుమతిగా పొందారు. మద్రాసు ప్రెసిడెన్సీ గేమ్సులో గుంటూరుజిల్లా ప్రతినిధిగా 100 గజములు, 220 గజములు, 440 గజములు పరుగు పోటీలలోనూ, హైజంప్, లాంగ్ జంప్, హైహర్డిల్స్ (120 గజములు) పోటీలలోను పాల్గొని ప్రథమస్థానం పొందారు.



1924 జనవరి 11 వ తేదీన మద్రాసు యస్.ఐ.ఏ.ఏ. గ్రౌండ్స్‌లో మద్రాసు ప్రెసిడెన్సీ ఒలింపిక్ స్పోర్ట్సు అంతిమపోటీ జరిగినది. అప్పుడు 100 గజములను $11\frac{1}{5}$ సెకండ్లలోనూ, 220 గజములు 24 సెకండ్లలోనూ, 440 గజములను $55\frac{2}{5}$ సెకండ్లలోనూ పూర్తిచేసి ప్రథమస్థానం పొంది ఆంధ్రదేశానికి అద్వితీయ ఖ్యాతిని సాధించారు. అప్పటి మద్రాసు గవర్నర్ లార్డ్ వెల్లింగ్టన్ వీరికి యోగ్యతాపత్రాలు ఇచ్చి స్వయంగా అభినందించారు. 1923 ఢిల్లీలో జరిగిన మొట్టమొదటి ఆల్ ఇండియా ఒలింపిక్స్‌కు శ్రీ రామారావుగారు ఎన్నుకోబడినారు. టెన్నిస్‌లో జాతీయ, అంతర్జాతీయఖ్యాతి గడించిన శ్రీ నల్లంరెడ్డి కృష్ణస్వామిగారు వీరి తమ్ముడు.

శ్రీ వి. సూర్యనారాయణ :—జననం 1927 ఫిబ్రవరి 19. గుడివాడ తాలూకా పసుమర్రు గ్రామం. బందరు నోబుల్ హైస్కూలులో విద్యాభ్యాసం. 1947 లో మద్రాసు వై. యమ్. సి. ఎ. కళాశాలలో వ్యాయామ విద్యాశిక్షణ పూర్తిచేశారు. విద్యార్థిదశలో అన్ని క్రీడలలోను గణుతికెక్కారు.

మద్రాసు వై. యమ్. సి. ఏ. కళాశాలలో చదువుచున్నప్పుడు 1947 లో - చెన్నరాష్ట్ర ఒలింపిక్ పోటీలలో పాల్గొన్నారు. కాలేజీ బాస్కెట్ బాల్, ఫుట్ బాల్ టీము లలో సభ్యుడు. 1952 లో విజయ వాడ వ్యాయామ శిక్షణ కళాశాలలో వ్యాయామాధ్యాపకునిగా చేరారు. 1955 జూలైనుంచి విజయవాడ ఆంధ్ర లయోలా కళాశాలలో అసిస్టెంట్ ఫిజికల్ డైరెక్టర్.



1952 లో అజ్మీరులోని మేయో కాలేజీలో ఎథ్లెటిక్స్ ట్రైనింగ్ పొందారు. శిక్షణానంతరం భారత ఎమెచూర్ ఎథ్లెటిక్ ఫెడరేషన్ గౌరవ శిక్షకులుగా నియమించబడ్డారు. ఈ అర్హత పొందిన మొదటి ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి వీరే. 1953 అక్టోబరులో బెంగుళూరులో నిర్వహించబడిన ఎథ్లెటిక్ ట్రైనింగ్ కేంద్రంలో శ్రీ టెడ్ ఆర్నాల్డుకు సహాయకులుగా పనిచేశారు. 1954 సెప్టెంబర్ 28 నుంచి అక్టోబరు 16 వరకూ డాక్టర్ ఎ. డబ్ల్యు. హోవర్డ్ అధ్వర్యాన విజయవాడలో నిర్వ హించబడిన ఎథ్లెటిక్స్ శిక్షణ కేంద్రంలో శిక్షకులు. 1955 డిసెంబర్ 18 నుంచి 1956 జనవరి 7 వ తేదీవరకు బెంగుళూరులో నిర్వహించబడిన ఎథ్లెటిక్ ట్రైనింగ్ కేంద్రంలో ప్రఖ్యాత అమెరికన్ శిక్షకులు లాయడ్స్ వింటర్, జార్జి రైడర్‌లకు వీరు సహాయకులుగా వున్నారు. భారత ఎమెచూర్ ఎథ్లెటిక్ ఫెడరేషన్ ఆనరరీ సీనియర్ కోచ్ గా కూడా వీరు నియమించబడినారు. ఇట్టి గౌరవం పొందిన మొదటి ఆంధ్రుడుకూడా వీరే. 1954—1956 జాతీయ క్రీడోత్సవాలలో పాల్గొన్న ఆంధ్ర ఎథ్లెటిక్ జట్టుకు శిక్షకులు, మేనేజరు. శ్రీ కె. కామరాజు, శ్రీ పి. సి. కుప్పుస్వామి, శ్రీ కె. ఆల్ ఫ్రెడ్, శ్రీ జి. సత్యనారాయణ వంటి ఆంధ్ర రాష్ట్ర అగ్ర వ్యాయామ క్రీడా ప్రవీణులకు మైసూర్, తిరువాన్కూర్,

బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలో పేరొందిన ఎత్లేట్లకు వీరు శిక్షణ నిచ్చి వున్నారు. 1946 నుంచి భారత వ్యాయామ విద్యా సంఘ సభ్యులు. ఆంధ్రరాష్ట్రం అవతరించినప్పటినుంచి ఆంధ్రరాష్ట్ర ఎమెచ్యూర్ ఎత్లెటిక్ ఎసోసియేషన్ గౌరవ కార్యదర్శిగా పనిచేస్తున్నారు.

శ్రీ కె. ఆల్‌ఫ్రెడ్ :— వయస్సు 20 సంవత్సరాలు. తాడికొండ వాస్తవ్యుడు. వ్యాయామ విద్యాబోధకుడు. 1954 లో రాష్ట్ర ఎత్లెటిక్ పోటీలలో ఛాంపియన్‌షిప్‌ను సంపాదించి రాష్ట్ర గవర్నర్ పతకమును పొందారు. ఆంధ్ర వ్యాయామ కళాశాలలో శిక్షణ పొందారు. 1954 లో జావలిన్ త్రో, హైజంప్‌లలో రాష్ట్ర రికార్డులను స్థాపించారు. ఢిల్లీలో ఏర్పాటయిన జాతీయ పోటీలలో ఆంధ్ర ప్రతినిధి.

శ్రీ జి. సత్యనారాయణ :— వయస్సు 28 సంవత్సరాలు. ఏలూరు వాస్తవ్యుడు. మద్రాసు వై. యమ్. సి. ఏ. వ్యాయామ కళాశాలలో శిక్షణపొంది ప్రస్తుతం వ్యాయామ బోధకులుగా వుంటున్నారు. 200 మీటర్ల, 400 మీటర్ల పరుగులో నిపుణుడు. 1954 సంవత్సరము రాష్ట్ర పోటీలనుంచి జాతీయ పోటీలకు ఎన్నుకోబడినారు. జాతీయ పోటీలలో 200 మీటర్ల పరుగులో సెమిఫైనలు వరకు వచ్చి తర్వాత ఓడిపోయినారు.

శ్రీ జి. వెంకటేశ్వర్లు :— పత్తికొండ వాస్తవ్యుడు. వయస్సు 22 సంవత్సరాలు. దూరపు పరుగులలో దిట్ట. 5000 మీటర్ల పరుగు, 10,000 మీటర్ల పరుగులలో విశేష నైపుణ్యం సంపాదించారు. ముస్ముందు మరాథన్ పరుగు పోటీలలో ప్రకాశించగలరు. రాష్ట్రపోటీలలో 5,000 మీటర్ల 10,000 మీటర్ల పరుగు పోటీలలో ఉత్తమశ్రేణి లోనివారిగా పరిగణింపబడినారు. 1954 లో ఢిల్లీలో జరిగిన జాతీయ పోటీలలో పాల్గొన్నారు.

శ్రీ కె. సైమన్ జాన్ :— వయస్సు షుమారు 25 సంవత్సరములు. పెద్దాపురం వాస్తవ్యుడు. 1955 లో మద్రాసు వై. యమ్.

సి. ఎ. కళాశాలలో వై. యమ్. సి. ఎ. డిప్లమో పొందారు. రాష్ట్ర ప్రభుత్వం పనుపుపై అక్కడ విద్య నభ్యసించారు. రెండు సంవత్సరములనుంచి రాష్ట్రపోటీలలో పాల్గొంటున్నారు. జావలిన్‌ను 166 అడుగుల 4 అంగుళాల దూరం విసిరి క్రొత్త రాష్ట్ర రికార్డు స్థాపించారు. 1956 లో పాటియాలాలో జరిగిన జాతీయ పోటీలలో పాల్గొన్న ఆంధ్ర ఎత్లెటిక్ జట్టుకు నాయకుడు. ఆ పోటీలలో 180 అడుగులు దూరానికి జావలిన్ విసిరి ఏడవ స్థానం పొందారు. షాట్ పుట్, డిస్కస్ త్రోలలో కూడా ప్రవీణుడు.

శ్రీ కె. రామరాజు :— భీమవరం నివాసి. భీమవరం డబ్ల్యు. జి. బి. కాలేజీలో వ్యాయామ బోధకులు. పోల్ వాల్ట్, హైజంప్ లలో రాష్ట్రరికార్డులు స్థాపించి యున్నారు. స్కూలు జీవితంలో గ్రిగ్ మెడల్ సంపాదించారు. 1956 పాటియాలా జాతీయ క్రీడోత్సవంలో పాల్గొన్నారు.

శ్రీ యమ్. బాలస్వామి :— వయస్సు 24 సంవత్సరాలు. నిడుబ్రోలు వాస్తవ్యుడు. 1955 సంవత్సరం రాష్ట్ర పోటీలలో ఛాంపియన్‌షిప్ సంపాదించి రాష్ట్ర గవర్నర్ పతకమును పొందారు. హోప్-స్టెప్ అండ్ జంప్ లోనూ, లాంగ్ జంప్ లోనూ మంచి నేర్పరి. 1956 పాటియాలా జాతీయ క్రీడోత్సవంలో పాల్గొన్నారు. ఆంధ్ర విశ్వ విద్యాలయ ప్రతినిధిగా సింహళంలో జరిగిన ఎత్లెటిక్ పోటీలలో కూడా వీరు పాల్గొన్నారు. చెడుగుడు, వాలీబాల్ ఆటలలో కూడా ప్రావీణ్యం గడించారు.

శ్రీ పి. సి. కుప్పుస్వామి :—— హిందూపురం వాస్తవ్యుడు. ఆంధ్ర స్పెషల్ ఆరమ్‌డ్ పోలీసు ప్రతినిధి. 1956 రాష్ట్ర పోటీలలో రాష్ట్ర ఛాంపియన్‌షిప్‌ను పొంది రాష్ట్ర గవర్నర్ పతకమును సంపాదించారు. దూరపు పరుగులలో కడు ప్రవీణుడు. 1956 పాటియాలా పోటీలలో 5,000 మీటర్ల పరుగులో ఏడవవానిగాను, 10,000 మీటర్ల పరుగులో అయిదవవానిగానూ వచ్చారు. 4,000 మీటర్ల స్టీపుల్



ఆంధ్రరాష్ట్ర ఎథ్లెటిక్ జట్టు: కూర్చున్నవారిలో మధ్య వున్నవారు కప్పుస్వామి. నిలబడి వున్నవారిలో మధ్య వున్నవారు సూర్యనారాయణ (కోచ్) - వారి కుడివైపున వున్నది సైమన్ జాన్.

ఛేజ్‌లో నాల్గవవానిగా వచ్చి తన పూర్వపు రికార్డు అయిన 11 నిమిషాల ఒక సెకండును 10 నిమిషాల 32.2 సెకండ్లకు తగ్గించివేశారు.

శ్రీ పి. సి. జోసఫ్ :— హిందూపురం వాస్తవ్యుడు. ఆంధ్ర స్పెషల్ ఆరమ్‌డ్ పోలీసు ప్రతినిధి. బరువులు విసురుటలో ప్రవీణుడు. రాష్ట్ర రికార్డుల స్థాపకుడు. 1956 పాటియాలా పోటీలలో హేమర్‌ను 126 అడుగుల 7 అంగుళాల దూరానికి విసిరి అయిదవవానిగా వచ్చారు. ఈయన అసలు రికార్డు 128 అడుగుల 11 అంగుళాలు. ఈయన రాంచీలో 1956 ఫిబ్రవరిలో జరిగిన జాతీయ పోలీసు పోటీలలో ద్వితీయస్థానం పొందారు.

శ్రీ కె. బి. బి. గోపాల కృష్ణమూర్తి :— వయస్సు 22 సంవత్సరాలు. కాకినాడ వాస్తవ్యుడు. లాంగ్‌జంప్, హాప్-స్టెప్-

అండ్ జంప్‌లలో రాష్ట్ర రికార్డులను స్థాపించి వున్నారు. పాటియాలా పోటీలకు ఎన్నుకోబడినారు.

శ్రీ డి. సాంబమూర్తి :— విజయవాడ వాస్తవ్యుడు. కొద్ది దూరపు పరుగులలో దిట్ట. 1956 సెప్టెంబరులో ఈయన రికార్డు: 100 మీటర్ల పరుగు 11.6 సెకండ్లు, 200 మీటర్లు: 24.5 సెకండ్లు, బ్రాడ్ జంప్ 19 అడుగుల $\frac{3}{4}$ అంగుళాలు.

శ్రీ డి. దేవదానం :— విశాఖపట్నంలో ఆంధ్ర స్పెషల్ ఆరమ్డ్ పోలీసుదళంలో పనిచేస్తున్నారు. 1956 లో విజయవాడలో జరిగిన ఇన్విటేషన్ పోటీలలో 800 మీటర్ల దూరాన్ని 2 నిమిషాల 5.1 సెకండులలో పరుగిడి క్రొత్తరాష్ట్ర రికార్డును స్థాపించారు. అంత వరకు రికార్డు దీనికంటె .7 సెకండ్లు ఎక్కువ. ఇదే పోటీలలో ఈయన 400 మీటర్ల దూరాన్ని 54.2 సెకండ్లలోనూ, 1,500 మీటర్ల దూరాన్ని 4 నిమిషాల 4.6 సెకండ్లలోనూ పూర్తిచేసి ప్రథమస్థానం పొందారు.

శ్రీ ఐ. ఫుల్లయ్య :- విజయవాడలోని ఆంధ్ర వ్యాయామ శిక్షణ కళాశాలలో అధ్యాపకులు. ఆంధ్రదేశంలో వ్యాయామ క్రీడలలో ప్రావీణ్యాభివృద్ధికి తీవ్రంగా కృషిచేస్తున్న ముఖ్యులలో ఒకరు. 1954 లో ఢిల్లీలో జరిగిన జాతీయ క్రీడోత్సవంలో జంపింగ్ పోటీలకు జడ్జిగా వ్యవహరించారు.

శ్రీయుతులు కె. సత్యనారాయణ; పి. సి. అరుమై; హెచ్. వి. మాయాండి; జి. గులామొహియిద్దీన్; పి. సి. వున్నికృష్ణన్‌లు రాష్ట్ర రికార్డు హోల్డర్స్.

ఇంకా క్రింది ప్రముఖులకు మంచి భవిష్యత్తు కలదు.

శ్రీయుతులు యస్. బెర్నార్డ్, విజయవాడ (100 మీటర్లు, 200 మీటర్లు) సి. హెచ్. యల్లయ్య, (స్పెషల్ ఆరమ్డ్ పోలీసు, విశాఖపట్నం (100 మీటర్లు, 400 మీటర్లు) గోవిందరావు, స్పెషల్. ఆరమ్డ్ పోలీస్, విశాఖపట్నం, (200 మీటర్లు) యమ్. రాధాకృష్ణ

రెడ్డి (విజయవాడ), డి. నారాయణరావు (బందరు) శ్రీ ఆర్. యస్. వేదనాయకం (విజయవాడ) యమ్. శేషగిరిరావు, (విజయవాడ), యస్. పాండురంగారావు, సి. హెచ్. భాస్కరరావు (విజయవాడ), పి. అంజయ్య, విజయవాడ (5,000 మీటర్లు). పి. సూరిబాబు, అమలాపురం (హైజంప్ పోల్ వాల్ట్). పెంచలయ్య, స్పెషల్ ఆరమ్డ్ పోలీస్, విశాఖపట్నం(హాప్ స్టెప్ అండ్ జంప్) రాయపరెడ్డి, గుంటూరు (జావలిన్ త్రో) పి. రత్నం, కాకినాడ (హైజంప్, హాప్ స్టెప్ అండ్ జంప్) వి. సుందరం, స్పెషల్ ఆరమ్డ్ పోలీసు, విశాఖపట్నం (బ్రాడ్ జంప్, హాప్ స్టెప్ అండ్ జంప్, పోల్ వాల్ట్). యమ్. తిరుపతిరాజు, విజయవాడ (జావలిన్ త్రో, డిస్కస్ త్రో) సి. హెచ్. వి. రమణరావు, పిఠాపురం (షాట్ ఫుట్) వై. రామమూర్తి, స్పెషల్ ఆరమ్డ్ పోలీస్, విశాఖపట్నం. (డిస్కస్ త్రో.)

1956 ఫిబ్రవరిలో పాటియాలాలో జరిగిన 17వ నేషనల్ గేమ్సు పోటీలలో క్రింది హైదరాబాద్ ప్రతినిధులు పాల్గొన్నారు.

శ్రీయుతులు బి. వి. సత్యనారాయణ్, అజీజుద్దీన్, మహమ్మద్ ఇబ్రహీం, మహమ్మద్ అబ్దుల్ నయీం, కమల్‌రాం, మసూద్ అహమ్మద్ ఖాన్.

ఆంధ్ర ఎమెచూర్ ఎథ్లెటిక్ ఎసోసియేషన్ ఆంధ్రరాష్ట్రంలో వ్యాయామక్రీడలపై కంట్రోలు వహిస్తున్నది.

1956—57 సంవత్సరానికి ఆంధ్ర ఎమెచూర్ ఎథ్లెటిక్ ఎసోసియేషన్‌కు క్రింది ప్రముఖులు సారథ్యం వహిస్తున్నారు.

ప్రధాన పోషకులు : శ్రీ సి. ఎమ్. త్రివేది ; అధ్యక్షులు : శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ; ఉపాధ్యక్షులు : శ్రీయుతులు ఎస్. ఆంజనేయులు, సి. హెచ్. వి. ప్రసాదమూర్తి రాజా, ఏ. భగవంతరావు గారలు ; గౌరవ కార్యదర్శి : శ్రీ వి. సూర్యనారాయణగారు (ఆంధ్ర లయోలా కాలేజి, విజయవాడ) ; గౌరవ సంయుక్తకార్యదర్శులు : శ్రీ సి. పాపారావుగారు (గుడివాడ) ; శ్రీ బి. సుబ్బారావుగారు (పటమట) ; గౌరవ కోశాధికారి : డాక్టర్. వి. వి. గోపాలరావుగారు ;

సభ్యులు: శ్రీయుతులు టి. వి. సుబ్బయ్య (నిడుబ్రోలు), వి. ఎస్. ఎన్. మూర్తి (విజయవాడ), జె. నారాయణమూర్తి (భీమవరం), ఎమ్. నారాయణమూర్తి, విశాఖపట్నంలోని ఆంధ్ర స్పెషల్ ఆర్మ్‌డ్ పోలీసు కమాండ్‌మెంట్ ప్రతినిధి, రాజమండ్రి ఇండియన్ రైల్వే ఇన్‌స్టిట్యూట్ స్పోర్ట్స్ సెక్రటరీ, వి. బి. బి. కృష్ణారావు (నరసన్నపేట), కె. బాపయ్య (పెనుకొండ), ఏ. వి. సుబ్బయ్య (చాండోల్), ఆర్. ఎస్. ఆర్. శాస్త్రి (వీరవాసరం), కె. రాధాకృష్ణమూర్తి (సిరిపురం), పి. రాజారావు (విజయవాడ), ఎస్. శేషయ్య (పెదసనగల్లు), ఆర్. సి. వి. రమణ (మదనపల్లి), టి. రామదాస్ (కర్నూలు), శ్రీమతి పి. థామస్, నిడుబ్రోలు ఎవర్‌మెర్రీ క్లబ్ కార్యదర్శి.

హిందూపురం, విశాఖపట్టణాలలోని ఆంధ్ర స్టేట్ పోలీస్ క్లబ్, ఏలూరులోని అకేషనల్ ఎత్లెట్స్, భీమవరంలోని స్పోర్ట్స్ అసోసియేషన్, కాకినాడలోని కాకినాడ ఎత్లెటిక్ క్లబ్ పూర్వాంధ్రరాష్ట్రంలో ప్రసిద్ధిచెందిన ఎత్లెటిక్ సంస్థలు.

ఆంధ్ర, హైదరాబాద్ ఏకం కావడంవల్ల అప్పుడే ఒక సత్ఫలితం కలిగింది. ఆలిండియా పోలీస్ ఫుట్‌బాల్ ఛాంపియన్ షిప్‌ను 1956 డిసెంబర్‌లో ఆంధ్ర ప్రదేశ్ గెలుచుకొన్నది.

## ఎత్లెటిక్ రికార్డులు

ప్రపంచం, ఆసియా, ఇండియా, ఆంధ్రస్టేట్, హైదరాబాద్ ఎత్లెటిక్ రికార్డులు క్రింద వరుసగా సంఘటీకరించబడినవి :—

ప్రపంచం, ఆసియా, ఇండియా, ఆంధ్రరికార్డులు 1956 అక్టోబరు 31 తేదీ వరకు సరిచేయబడినవి. హైదరాబాద్ రాష్ట్రానికి సంబంధించినంతవరకు 1956 లో జరిగిన ఆ రాష్ట్ర క్రీడోత్సవంలో ప్రథమస్థానం పొందినవారి ప్రమాణం ఉదహరించబడింది. ఒక ప్రాంతం ప్రమాణాన్ని మరొకప్రాంతం ప్రమాణంతో సరిచూచుకోడానికి మాత్రమే యివి ఉద్దేశించబడినవి.

100 మీటర్ల పరుగు :— 10.1 సెకండులు - విల్లి విలియమ్స్ (అమెరికా) 1956 ఆగస్టు ; 10.1 సెకండులు - అబ్దుల్ ఖలిక్ (పాకిస్తాన్) - 1956 ఆగష్టు ; 10.6 సెకండులు - లావీ పింటో (బొంబాయి) - 1953 ; 11 సెకండ్లు - కిరుపరాజా (మద్రాసు) ; 11.2 సెకండ్లు - అజీజుద్దీన్ (ఉస్మానియా) (రి).

200 మీటర్ల పరుగు :— 20.2 సెకండులు - ఎమ్. ఇ. పాటన్ (అమెరికా) 1949 ; 21.4 సెకండులు - అబ్దుల్ ఖలిక్ (పాకిస్తాన్) - ఏప్రిల్ 1956 ; 21.5 సెకండులు - లావీ పింటో (బొంబాయి) ఫిబ్రవరి - .1956 ; 23.1 సెకండులు - కిరుపరాజా (మద్రాసు) ; 23.5 సెకండ్లు - మహమ్మద్ ఇబ్రహీం (రి) ఉస్మానియా.

400 మీటర్ల పరుగు :— 45.2 సెకండులు - లౌజోన్స్ (అమెరికా) - జులై 1956 ; 48 సెకండులు - జోగిందర్ సింగ్ (సర్వీసెస్ ఇండియా) - 1955 ; 48 సెకండులు - జోగిందర్ సింగ్ (సర్వీసెస్) - 1955 ; 50.9 సెకండ్లు - కిరుపరాజా మద్రాసు ; 52.2 సెకండ్లు - అబ్దుల్ క్వయూమ్ (రి) - ఉస్మానియా.

800 మీటర్ల పరుగు :— 1 నిమిషం 45 సెకండులు - ఆర్ మొయిన్స్ (బెల్జియమ్) 1955 ; 1 నిమిషం 52.5 సెకండులు సోహన్ సింగ్ (సర్వీసెస్, ఇండియా) - 1956 ఫిబ్రవరి ; 1 నిమిషం 52.5 సెకండులు - సోహన్ సింగ్ (సర్వీసెస్) ఫిబ్రవరి 1956 ; 2 నిమిషాల 7 సెకండ్లు - యస్. ఏ. నయీాన్ (హైదరాబాద్) ; 2 నిమిషాల 3.6 సెకండ్లు - బి. చక్రపాణి - ఏ. ఓ. సి.

1,500 మీటర్ల పరుగు :— 3 నిమిషాల 40.9 సెకండులు - ఎస్. ఇహరోస్ (హంగరీ), ఎల్. టబోరి (హంగరీ), జి. నీల్సన్ (డెన్మార్క్) - 1955 ; 3 నిమిషాల 56.2 సెకండులు - చొయి యున్ చిక్ (కొరియా) - 1954 ; 3 నిమిషాల 56.8 సెకండులు - కల్వంతసింగ్ (సర్వీసెస్) - ఫిబ్రవరి 1956 ; 4 నిమిషాల 21.2

సెకండులు - కుప్పుస్వామి, పోలీసు (హిందూపురం); 4 నిమిషాల 22.2 సెకండులు - లచ్చురామ్ (రి) ఏ. ఓ. సి.

5,000 మీటర్ల పరుగు :— 13 నిమిషాల 36.8 సెకండులు - గార్డన్ పిరీ (బ్రిటన్) 1956 జూన్; 14 నిమిషాల 58 సెకండులు - ముబారక్ షా (పాకిస్తాన్) 1956 మార్చి; 15 నిమిషాల 9.4 సెకండులు - రోనక్ సింగ్ (పంజాబ్) - 1936; 16 నిమిషాల 36.9 సెకండులు - కుప్పుస్వామి, పోలీసు (హిందూపురం); 16 నిమిషాల 21.4 సెకండులు - లచ్చురామ్ (రి) ఏ. ఓ. సి.

10,000 మీటర్ల పరుగు :— 28 నిమిషాల 30.4 సెకండులు - వాల్డిమిర్ కుక్ (రష్యా) - 1956 సెప్టెంబర్; 31 నిమిషాల 18.2 సెకండులు - బూటాసింగ్ (సర్వీసెస్, ఇండియా) - 1955; 31 నిమిషాల 18.2 సెకండులు - బూటాసింగ్ (సర్వీసెస్) - 1955; 34 నిమిషాల 35 సెకండులు - కుప్పుస్వామి, పోలీసు, (హిందూపురం); 35 నిమిషాల 6.8 సెకండ్లు - బాలరాజ్, పోలీసు. (రి).

3,000 మీటర్ల స్టీపుల్ ఛేజ్ :—ఎనిమిది నిమిషాల 39.8 సెకండులు - సెమ్యన్ అజిమ్‌చిన్ (రష్యా) - 1956 ఆగస్టు; తొమ్మిది నిమిషాల 15.0 సెకండులు - టకషాషిసుసామో (జపాన్) - 1954; తొమ్మిది నిమిషాల 24 సెకండులు - డాలూరామ్ (సర్వీసెస్) - 1955; 11 నిమిషాల ఒక సెకండు - కుప్పుస్వామి (హిందూపురం).

మెరాథన్ (26 మైళ్ళ 385 గజాల పరుగు) :— రెండు గంటల 14 నిమిషాల 14 సెకండులు - ఆన్‌టి విస్కారి (ఫిన్లెండ్) - 1956 ఏప్రిల్; రెండు గంటల 27 నిమిషాల 17.4 సెకండులు - చోటాసింగ్ (పెప్సూ, ఇండియా) - 1956 ఫిబ్రవరి; రెండు గంటల 27 నిమిషాల 17.4 సెకండులు - చోటాసింగ్ (పెప్సూ) - 1956 ఫిబ్రవరి; మూడు గంటల 17 నిమిషాల 16 సెకండులు - శ్రీకంఠస్వామి, బెంగుళూరు.—

10,000 మీటర్ల నడక :— 42 నిమిషాల 39.6 సెకండులు - వి. హార్డ్‌మో (స్వీడన్) - 1945; 47 నిమిషాల 31 సెకండులు - నాయక్ హర్నాక్‌సింగ్ (సర్వీసెస్, ఇండియా) - 1956 ఫిబ్రవరి; 47 నిమిషాల 31 సెకండులు - నాయక్ హర్నాక్‌సింగ్ (సర్వీసెస్) - 1956 ఫిబ్రవరి; 57 నిమిషాల 22 సెకండ్లు - ఎ. టి. దత్తమూర్తి, మైసూరు.

50 కిలోమీటర్ల నడక :— నాలుగు గంటల 26 నిమిషాల 18.2 సెకండులు - ఏ రోకా (హంగరీ) - 1953; నాలుగు గంటల 47 నిమిషాల 29.6 సెకండులు - అజిత్‌సింగ్ (సర్వీసెస్, ఇండియా) 1956 ఫిబ్రవరి; నాలుగు గంటల 47 నిమిషాల 29.6 సెకండులు - అజిత్‌సింగ్ (సర్వీసెస్) - 1956 ఫిబ్రవరి; అయిదు గంటల 20 నిమిషాల 36.8 సెకండ్లు - ఎ. టి. దత్తమూర్తి - (మైసూరు).

100 మీటర్ల హర్డిల్స్ :— 13.4 సెకండులు - జాక్ డేవిస్ (అమెరికా) - 1956 జూన్; 14.5 సెకండులు - మహమ్మద్ హనీఫ్ మాలిక్ (పాకిస్తాన్) 1956 ఏప్రిల్; 14.6 సెకండులు - శ్రీ చంద్‌రామ్ .(సర్వీసెస్) 1956 ఏప్రిల్; 17.6 సెకండులు - పి. సి. అప్పలస్వామి (హిందూపురం); 16.6 సెకండులు - మసూద్, ఉస్మానియా.

400 మీటర్ల హర్డిల్స్ :— 49.5 సెకండులు - గ్లెన్ డేవిస్ - 1956 జూన్; 53.6 సెకండులు - జగ్దేవ్‌సింగ్ (పంజాబ్ - ఇండియా) - 1955; 53.6 సెకండులు - జగ్దేవ్‌సింగ్ (పంజాబ్) - 1955; 1 నిమిషం 1.3 సెకండ్లు - అరుమై, పోలీసు (హిందూపురం).

హైజంప్ :— 7 అడుగుల అర అంగుళం - సి. డ్యూమాస్ (అమెరికా); 6 అడుగుల 5 అంగుళాలు - అజిత్‌సింగ్ (పంజాబ్, ఇండియా) - 1956 ఫిబ్రవరి; 6 అడుగుల ఐదు అంగుళాలు - అజిత్‌సింగ్ (పంజాబ్) - 1956 ఫిబ్రవరి; 5 అడుగుల $9\frac{1}{2}$ అంగుళాలు.

కె. రామరాజు (భీమవరం); 5 అడుగుల $9\frac{1}{2}$ అంగుళాలు - బి. వి. సత్య నారాయణ్ - పోలీసు.

బ్రాడ్ జంప్ :— 26 అడుగుల $8\frac{1}{4}$ అంగుళాలు - జెస్సీ ఓవెన్స్ (అమెరికా) 1935; 23 అడుగుల 11 అంగుళాలు - నాయక్ రాయ్ మెహార్ (సర్వీసెస్, ఇండియా) - 1956 సెప్టెంబర్; 23 అడుగుల 11 అంగుళాలు - నాయక్‌రాయ్ మెహార్ (సర్వీసెస్) - 1956 సెప్టెంబర్; 21 అడుగుల 3 అంగుళాలు - కె. బి. బి. గోపాలకృష్ణమూర్తి (కాకినాడ); 22 అడుగుల $3\frac{3}{4}$ అంగుళాలు - బి. వి. సత్యనారాయణ్, పోలీసు.

హాప్-స్టెప్ అండ్ జంప్ :— 54 అడుగుల 4 అంగుళాలు - ఏ. ఎఫ్. డసిల్వా (బ్రాజిల్) - 1955; 50 అడుగుల 2 అంగుళాలు - హెచ్. రెబెల్లో (మైసూర్, ఇండియా) - 1948; 50 అడుగుల 2 అంగుళాలు - హెచ్. రెబెల్లో (మైసూర్) - 1948; 41 అడుగుల $6\frac{3}{4}$ అంగుళాలు - కె. బి. బి. గోపాలకృష్ణమూర్తి (కాకినాడ); 41 అడుగుల 5 అంగుళాలు - రామస్వామి (ఉస్మానియా).

పోల్ వాల్ట్ :— 15 అడుగుల $7\frac{3}{4}$ అంగుళాలు - సి. వార్మెర్ డామ్ (అమెరికా) - 1942; 13 అడుగుల 6 అంగుళాలు - సావాదా బంకిచి (జపాన్) - 1951; 12 అడుగుల 3 అంగుళాలు - కె. జార్జి (సర్వీసెస్) - 1953; 10 అడుగుల 6 అంగుళాలు - కె. రామరాజు (భీమవరం); 10 అడుగుల 5 అంగుళాలు - శ్యామ్‌లక్(రి) - ఆర్. ఆర్. సి.

షాట్ పుట్ :— 61 అడుగుల $4\frac{1}{2}$ అంగుళాలు - లెఫ్టినెంట్ పారీ ఓబ్రీన్ (అమెరికా) - 1956 ఆగస్టు; 48 అడుగుల $10\frac{1}{2}$ అంగుళాలు - ప్రద్యుమ్నసింగ్ (సర్వీసెస్, ఇండియా) - 1956 ఫిబ్రవరి; 48 అడుగుల $10\frac{1}{2}$ అంగుళాలు - ప్రద్యుమ్నసింగ్ (సర్వీసెస్) - 1956 ఫిబ్రవరి; 36 అడుగుల $3\frac{1}{2}$ అంగుళాలు - కె. సైమన్ జాన్ (ఆంధ్ర); 39 అడుగుల $1\frac{1}{2}$ అంగుళాలు - కమల్ రామ్ - ఏ. ఓ. సి

డిస్కస్ త్రో :— 194 అడుగుల 6 అంగుళాలు - ఎఫ్. గార్డిన్ (అమెరికా) - 1953; 151 అడుగుల $6\frac{1}{2}$ అంగుళాలు - ప్రద్యుమ్నసింగ్ (సర్వీసెస్, ఇండియా) - 1956 ఫిబ్రవరి; 151 అడుగుల $6\frac{1}{2}$ అంగుళాలు - ప్రద్యుమ్న సింగ్ (సర్వీసెస్) - 1956 ఫిబ్రవరి; 103 అడుగుల $2\frac{1}{2}$ అంగుళాలు - ఉన్నికృష్ణన్, పోలీసు (హిందూపురం); 113 అడుగుల 7 అంగుళాలు - కమల్ రామ్ - ఏ. ఓ. సి.

జావిలిన్ త్రో :— 274 అడుగుల $5\frac{3}{4}$ అంగుళాలు - జనుస్జ సిడ్లో (పోలెండు) - 1956 జూన్; 221 అడుగుల $3\frac{1}{2}$ అంగుళాలు - మహమ్మద్ నవాజ్ (పాకిస్తాన్) - 1956 మార్చి; 192 అడుగుల $\frac{1}{2}$ అంగుళం - సర్వన్ సింగ్ (సర్వీసెస్) - 1956 ఫిబ్రవరి; 166 అడుగుల 4 అంగుళాలు - కె. సైమన్ జాన్ (ఆంధ్ర); 182 అడుగులు — కమల్ రామ్ (రి) - ఏ. ఓ. సి.

హామర్ త్రో :— 218 అడుగుల $10\frac{1}{2}$ అంగుళాలు - హాల్ కానల్లీ (అమెరికా) - 1956 అక్టోబర్ 2; 198 అడుగులు — మహమ్మద్ ఇక్బల్ (పాకిస్తాన్) - 1956 మార్చి; 164 అడుగుల $2\frac{1}{2}$ అంగుళాలు - దేవి దయాళ్ (సర్వీసెస్) - 1956 ఏప్రిల్; 128 అడుగుల 11 అంగుళాలు - పి. సి. జోసఫ్-పోలీసు (హిందూపురం); 127 అడుగుల 9 అంగుళాలు - సంతోష్ సిల్ (రి) - ఏ. ఓ. సి.

(పత్రికలు ప్రకటించకలిగిన వార్తల ఆధారంగా) (రి) = రికార్డు హోల్డర్.

# అధ్యాయము 7

# ఒలింపిక్స్

## (1) ప్రపంచం

ఒలింపిక్ పోటీల పుట్టుక క్రీస్తుపూర్వం 776 వ సంవత్సరము. క్రీస్తుశకం 394 వరకూ ఒలింపిక్ పోటీలు నిర్విఘ్నంగా జరుగుతూ



వచ్చినవి. అదే సంవత్సరంలో ఒలింపిక్ క్రీడోత్సవం నిషేధించబడింది. బారన్ పియరీ డి కాబర్టిన్ అనే ఫ్రెంచి దేశస్థుడు ఒలింపిక్ క్రీడోత్సవాన్ని పునరుద్ధరించడానికి 1892 నుంచి కృషిచేశారు. మరి నాలుగేండ్లకు వీరి కృషి ఫలించి మొట్టమొదటి ఆధునిక ఒలింపిక్ క్రీడోత్సవం 1896 లో గ్రీసు రాజధాని ఏథెన్స్‌లో జరుపబడింది. ప్రాచీన క్రీడోత్సవాలకు గ్రీసు పుట్టినిల్లయినందున మొట్టమొదటి ఆధునిక ఒలింపిక్స్‌ను నిర్వహించే గౌరవం గ్రీసుకే ఇవ్వబడింది.

క్రీడలద్వారా అంతర్జాతీయ సౌభ్రాతృత్వం వ్యాపింపజేయడం ఒలింపిక్స్ లక్ష్యం. ఒలింపిక్స్‌కు చిహ్నం ఐదు చక్రాలు. ఒక్కొక్క చక్రం ఒక్కొక్క ఖండాన్ని సూచిస్తుంది. ప్రపంచ రాజ్యాలు ఈ పోటీలలో పాల్గొనవలసి వున్నందున నాలేండ్ల కొకసారి ప్రపంచ ఒలింపిక్ పోటీలు జరుపబడుతున్నవి. 1896 నుంచి నేటివరకూ — యుద్ధకాలంలోతప్ప నిర్విఘ్నంగా ఒలింపిక్స్ జరుపబడుతున్నవి. రెండవ

ఒలింపిక్ క్రీడోత్సవం 1900 సంవత్సరంలో పారిస్‌లో జరిగింది. తే[illegible] ఒలింపిక్స్ క్రింది నగరాలలో జరిగినవి.

1. 1896 — ఏథెన్స్ (గ్రీసు) 2. 1900 — పారిస్ (ఫ్రాన్సు) 3. 1904 — సెయింట్ లూయీస్ (అమెరికా) 1906 — ఏథెన్స్ (గ్రీసు) ఎక్స్ట్రాపోటీ 4. 1908 — లండన్ (బ్రిటన్) 5. 1912 — స్టాక్‌హోమ్ (స్వీడన్) 6. 1916 — జరుగలేదు. 7. 1920 — ఆంట్వెర్ప్ (బెల్జియమ్) 8. 1924 — పారిస్ (ఫ్రాన్సు) 9. 1928 — ఆమ్‌స్టర్‌డామ్ (హాలెండు) 10. 1932 — లాస్ ఏంజెల్స్ (అమెరికా) 11. 1936 — బెర్లిన్ (జర్మనీ) 12. 1940 — టోకియో (జపాన్) యుద్ధంవల్ల జరుగలేదు. 13. 1944 — హెల్సింకీ (ఫిన్లెండ్) యుద్ధం వల్ల జరుగలేదు. 14. 1948 — లండన్ (బ్రిటన్) 15. 1952 — హెల్సింకీ (ఫిన్లెండ్) 16. 1956 నవంబర్ మెల్బోర్న్ (ఆస్ట్రేలియా) 17. 1960 రోమ్ (ఇటలీ).

ప్రాచీన ఒలింపిక్స్ గురించి "ప్రాచీన క్రీడలు" అన్న అధ్యాయంలోని విదేశ విభాగంలోను (46 వ పేజి), ఆధునిక ఒలింపిక్స్ గురించి ఆరవఅధ్యాయములోని ఫ్రాన్సు విభాగారంభంలోను (112 వ పేజి) వివరంగా ప్రస్తావించాను. స్థలాభావంచేత వాటి నిక్కడ పునఃప్రస్తావించలేదు.

ఇండియా మొట్టమొదట 1920 సంవత్సరములో ఆంట్వెర్ప్‌లో జరిగిన ఏడవ ఒలింపిక్స్‌లో పాల్గొన్నది. సర్ దొరబ్ తాతా (బొంబాయి) ఇద్దరు ఎథ్లెట్‌లను ఈ పోటీలకు పంపారు. 1924 లో పారిస్‌లో జరిగిన ఎనిమిదవ ఒలింపిక్ క్రీడోత్సవానికి తాత్కాలిక ఇండియా నేషనల్ ఒలింపిక్ కమిటీ ఏడుగురు ఎథ్లెట్‌లను పంపింది. వీరికి మద్రాసు వై. యమ్. సి. ఏ. కు చెందిన శ్రీ హెచ్. సి. బక్ నాయకత్వం వహించారు. 1927 లో ఇండియన్ ఒలింపిక్ ఎసోసియేషన్ స్థాపించబడింది. 1928 లో ఆమ్‌స్టర్‌డామ్‌లో జరిగిన తొమ్మిదవ ఒలింపిక్ క్రీడోత్సవంలో ఏడుగురు ఎథ్లెట్‌లు, 15 మంది హాకీ ఆటగాళ్లు కల హాకీజట్టు ఇండియా తరఫున పాల్గొన్నారు. 1928 లో ఇండియా

ప్రపంచ ఒలింపిక్ హాకీ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్నది. నాటినుంచి నేటివరకూ ఆ ఛాంపియన్‌షిప్‌ను నిలబెట్టుకొన్నది. 1932 లో లాస్ ఏంజెల్స్‌లో జరిగిన 10 వ ఒలింపిక్ క్రీడోత్సవంలో నలుగురు ఎథ్లెట్‌లు 15 మంది హాకీ ఆటగాళ్లు, తొలిసారి ఒక ఈతగాడు ఇండియా తరఫున పాల్గొన్నారు. 1936 లో బెర్లిన్‌లో జరిగిన 11 వ ఒలింపిక్ క్రీడోత్సవంలో నలుగురు ఎథ్లెట్లు, 19 మంది హాకీ ఆటగాళ్లు, తొలిసారి ముగ్గురు మల్లవిద్యాప్రవీణులు ఇండియాతరఫున పోటీచేశారు.

1948 జూలైలో లండన్‌లో 14 వ ప్రపంచ ఒలింపిక్స్ జరిగినవి. 59 దేశాలవారు పాల్గొన్నారు.

ఆంధ్ర చరిత్రలో మొట్టమొదటిసారి వెయిట్‌లిఫ్టింగ్ ఛాంపియన్ శ్రీ దండమూడి రాజగోపాల్ ప్రపంచ ఒలింపిక్ (లండన్) పోటీలలో పాల్గొన్నారు.

ఎథ్లెటిక్స్, ఈత, వాటర్‌పోలో, కుస్తీ, వెయిట్ లిఫ్టింగ్, ఫుట్‌బాల్, హాకీ, (21 మంది) ముష్టియుద్ధం, సైక్లింగ్ పోటీలలో ఇండియా పాల్గొన్నది.

15 వ ప్రపంచ ఒలింపిక్స్ 1952 జూలైలో ఫిన్‌లాండ్ రాజధాని హెల్సింకీలో జరిగినవి. 69 రాజ్యాల క్రిడా ప్రవీణులు ఈ పోటీలలో పాల్గొన్నారు. వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో శ్రీ దండమూడి రాజగోపాల్, శ్రీ కామినేని ఈశ్వరరావుగారలు పాల్గొన్నారు. ఇండియా హాకీ ఛాంపియన్ షిప్‌ను నిలబెట్టుకొని ఒక స్వర్ణపతకాన్ని, ఇండియా వస్తాదు శ్రీ జాదవ్ కుస్తీ పోటీలలో తృతీయస్థానాన్ని పొంది కంచు పతకాన్ని సాధించారు. ఈ ఒలింపిక్స్‌లోనే మొట్టమొదటిసారి సోవియట్ రష్యా పాల్గొన్నది. మొత్తం క్రీడోత్సవంలో అమెరికా ప్రథమ స్థానాన్ని, సోవియట్ రష్యా ద్వితీయస్థానాన్ని సాధించినవి.

1956 నవంబరు 22 వ తేదీనుంచి మెల్బోర్న్‌లో 16 వ ప్రపంచం ఒలింపిక్ పోటీలు జరిగినవి. అంతకుముందు ఈ ఒలింపిక్స్‌కు చెందిన మంచు ఆటల పోటీలు ఇటలీలోనూ, గుఱ్ఱపు స్వారీ పోటీలు స్టాక్‌హోమ్ (స్వీడన్) లోనూ జరిగినవి.

16 వ ప్రపంచం ఒలింపిక్ ప్రధాన క్రీడోత్సవానికి మెల్బోర్న్లోని ఒలింపిక్ స్టేడియమ్లో నవంబరు 22 వ తేదీ సాయంకాలం ఎడింబరో డ్యూక్ అధికారరీత్యా ప్రారంభోత్సవం జరిపారు. 69 దేశాలకు చెందిన 4000 మందికిపైగా ఎథ్లెట్లు పోటీలలో పాల్గొన్నారు. ఒలింపిక్ సంప్రదాయం ప్రకారం ఏథెన్స్నుంచి మెల్బోర్న్కు ఒలింపిక్ జ్యోతిని పరుగు ప్రవీణులు అంచెలంచెలుగా తీసుకొనివచ్చి ఒలింపిక్ స్టేడియమ్లో పవిత్ర అఖండజ్యోతిని వెలిగించారు. గ్రీసులో ఏథెన్స్కు 217 మైళ్ల దూరంలో ఉన్న ఒక స్థలంలో 2,730 సంవత్సరాలక్రితం ఒలింపిక్ పోటీలు ప్రారంభమయినవి. అచ్చట సూర్యరశ్మితో ఒలింపిక్ కాగడా వెలిగించి అచ్చటినుంచి ఏథెన్స్, కయిరో, కరాచీ, కలకత్తా, బ్యాంగ్కాక్, సింగపూర్, జకర్తాల మీదుగా ఆస్ట్రేలియాలోని డార్విన్కు 8,545 మైళ్ల దూరానికి— ఈ కాగడా పరుగు ప్రవీణులచేతనూ, విమానాలలోనూ తీసుకొని రాబడింది. డార్విన్నుంచి మెల్బోర్న్వరకూ 2,750 మంది ఆస్ట్రేలియన్ పరుగు ప్రవీణులు, దాదాపు మైలు కొకరు చొప్పున ఈ ఒలింపిక్ జ్యోతిని తీసుకొని వెళ్లారు. ఒలింపిక్ పోటీలు జరిగే ప్రధానమయిన స్టేడియమ్లో అఖండజ్యోతిని ఈ ఒలింపిక్ జ్యోతితో వెలిగించారు. అంతటితో ఒలింపిక్ పోటీలు ప్రారంభమైనట్లు.



గ్రీస్

మెల్బోర్న్ ఒలింపిక్ పోటీలలో నలుగురు ఆంధ్రులు పాల్గొన్నారు. వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో హెవివెయిట్ తరగతిలో శ్రీ దండమూడి రాజగోపాల్గారు, మిడిల్ హెవి వెయిట్ తరగతిలో శ్రీ కామినేని ఈశ్వరరావుగారు, 100 మీటర్ల పరుగులో కుమారి మేరి మేలారావు, 200 మీటర్ల సులువీతలో శ్రీ షంషేర్ఖాన్ పాల్గొన్నారు.

ఇండియా హాకీ, ఫుట్బాల్, ఎథ్లెటిక్స్, జిమ్నాస్టిక్స్, రైఫిల్ షూటింగ్, ఈత, వెయిట్ లిఫ్టింగ్, కుస్తీ పోటీలలో పాల్గొన్నది. మొత్తం 78 మంది క్రీడా ప్రవీణులు పోటీచేశారు. హాకీలో ఇండియా



శ్రీ ఈశ్వరరావు, శ్రీ మూకాన్ అమెరికన్ ఛాంపియన్ పాల్ ఆండర్సన్, శ్రీ డి. రాజగోపాల్

అగ్రస్థానం వహించి స్వర్ణపతకం గెలుచుకొన్నది. ఫుట్‌బాల్‌లో చతుర్థస్థానాన్ని ఇండియా సాధించింది.

వివిధ దేశాల స్థానాలు అవి సాధించిన పతకాల వివరం దిగువ తెల్పుతున్నాను.

(పోటీలలో ప్రథమ స్థానం పొందినవారికి బంగారు పతకం, ద్వితీయ స్థానం సాధించినవారికి రజతపతకం, తృతీయ స్థానం వహించిన వారికి కంచుపతకం బహూకరిస్తారు. దిగువన వరుసగా స్వర్ణ, రజత, కంచుపతకాల వివరం తెల్పుతున్నాను.)

రష్యా 37-29-32, అమెరికా 32-25-17, ఆస్ట్రేలియా 13-8-14, హంగరీ 9-10-7, ఇటలీ 8-8-9, స్వీడన్ 8-5-6, జర్మనీ 6-13-7, బ్రిటన్ 6-7-11, జపాన్ 5-10-5, రుమేనియా 5-4-5, ఫ్రాన్సు 4-4-6, టర్కీ 3-2-2, ఫిన్లెండ్ 3-1-11 పర్షియా 2-2-1, కెనడా 2-1-3, న్యూజిలెండ్ 2-0-0, హాలెండ్ 1-4-4, చెకొస్లొవాకియా 1-4-1, బల్గేరియా 1-3-1, డెన్మార్క్ 1-2-1, ఐర్లెండ్ 1-1-3, నార్వే 1-0-2, మెక్సికో 1-0-1, బ్రాజిల్ 1-0-0, ఇండియా 1-0-0, చిలీ 0-2-2,

బెల్జియమ్ 0-2-0, అర్జెంటీనా 0-1-1, ఐస్లెండు 0-1-0, పాకిస్తాన్ 0-1-0, యూగోస్లావియా 0-3-0, దక్షిణాఫ్రికా 0-0-4, ఆస్ట్రియా 0-0-2, స్విట్జర్లెండు 0-0-1, ఉరుగ్వే 0-0-1, గ్రీసు 0-0-1, బహామాస్ 0-0-1.

అనధికారరీత్యా వేయబడిన పాయింట్ల బట్టి వివిధ దేశాల క్రమ మిది:—

[ఒక్కొక్క పోటీలో ప్రథమస్థానం పొందినందుకు ఏడు పాయింట్లు, ద్వితీయ స్థానానికి ఐదు, తృతీయస్థానానికి నాలుగు, చతుర్థస్థానానికి మూడు, పంచమ స్థానానికి రెండు, షష్టమ స్థానానికి ఒక పాయింటు వంతున లెక్కకట్టబడినవి. స్టాక్‌హోమ్‌లో జరిగిన ఒలింపిక్ గుర్రపుస్వారీ పోటీ ఫలితములు కూడా చేర్చబడినవి ]

(1) రష్యా - 622½ పాయింట్లు, (2) అమెరికా - 497, (3) ఆస్ట్రేలియా - 239½, (4) జర్మనీ - 206, (5) హంగరీ - 193, (6) బ్రిటన్ - 163½, (7) ఇటలీ - 161, (8) స్వీడన్ - 140, (9) జపాన్ - 127, (10) ఫ్రాన్సు - 108½.



ఇండియాకు పది పాయింట్లు వచ్చినవి. హాకీలో ఏడుపాయింట్లు, ఫుట్‌బాల్‌లో మూడు పాయింట్లు సంపాదించింది.

## మెల్బోర్న్‌లో జరిగిన ఒలింపిక్ పోటీల ఫలితాలు

### ట్రాక్ అండ్ ఫీల్డ్ (పురుషులకు జరిగినవి) :

100 మీటర్ల పరుగు :— 1. ఆర్. మారో, (అమెరికా), 10 . 5 సెకండ్లు; 2. డబ్ల్యు. బేకర్, (అమెరికా) 3. హెచ్. హోగన్, (ఆస్ట్రేలియా). 200 మీటర్ల పరుగు :—బాబ్ మారో (అమెరికా) 20 . 6 సెకండ్లు (ర), ఏ. స్టాన్‌ఫీల్డ్, (అమెరికా) డబ్ల్యు

బేకర్, (అమెరికా). 400 మీటర్ల పరుగు :— సి. జెంకిన్స్ (అమెరికా), 46.7 సెకండ్లు, కె. హాస్, (జర్మనీ), వి. హెల్ స్టెన్, (ఫిన్లెండ్), ఐ. ఇజ్నటివ్, (రష్యా). 800 మీటర్ల పరుగు :— టి. కొర్ట్నీ, (అమెరికా), 1 ని. 47.7 సెకండ్లు, డి. జాక్సన్, (బ్రిటన్), ఏ. బాయ్సెన్, (నార్వే). 1,500 మీటర్ల పరుగు:— ఆర్. డిలానీ, ఈరి, 3 నిమిషాల 41.2 సెకండ్లు (రి), డబ్ల్యు. రిక్ట్ జెన్ హైన్ (జర్మనీ) జె. లాండీ, (ఆస్ట్రేలియా). 5,000 మీటర్ల పరుగు :— వి. కట్స్ (రష్యా), 13 నిమిషాల 39.6 సెకండ్లు (రి), జి. పీరీ. (బ్రిటన్), డి. ఇబొట్సన్, (బ్రిటన్). 10,000 మీటర్ల పరుగు :—వి. కట్స్, (రష్యా) 28 నిమిషాల 45.6 సెకండ్లు (రి); జె. కోవాక్స్, (హంగరీ) ఏ. లారెక్స్, (ఆస్ట్రేలియా). 3,000 మీటర్ల స్టీపుల్ ఛేజ్ :— క్రిస్ బ్రాషెర్, (బ్రిటన్) 8 నిమిషాల 41.2 సెకండ్లు (రి); యస్. రోజ్సనియో, (హంగరీ); ఇ. లార్సన్, నార్వే. మరాథన్ పరుగు :—ఏ. మిమూన్, (ఫ్రాన్సు) 2 గంటల 25 నిమిషాలు; ఎఫ్. మిహాలిక్, (యూగోస్లోవియా); వి. కార్డోనెన్, (ఫిన్లెండ్). 110 మీటర్ల హర్డిల్స్ :— యల్. కల్హౌన్, (అమెరికా) 13.5 సెకండ్లు (రి); జె. డేవిస్, (అమెరికా); జె. షాకిల్, (అమెరికా). 400 మీటర్ల హర్డిల్స్ :— గ్లెన్ డేవిస్, (అమెరికా) 50.1 సెకండ్లు (రి); యస్. సదర్న్, (అమెరికా); జె. క్లబ్రత్, (అమెరికా). 20 కిలోమీటర్ల నడక :— యల్. స్పిరెన్, (రష్యా) 1 గంట 31 నిమిషాల 27 సెకండ్లు; ఎ. మికెనాస్, (రష్యా); బి. ఇవనక్, (రష్యా). 50 కిలోమీటర్ల నడక:— నార్మన్ రీడ్, (న్యూజిలాండ్) 4 గంటల, 30 నిమిషాల 42.8 సెకండులు; ఎ. వేగునీ మాస్కిన్ స్కోవ్, (రష్యా); జాన్ జంగ్రెన్, (స్వీడన్). హై జంప్ :— సి. డుమాస్, (అమెరికా) 6 అడుగుల $11\frac{1}{4}$ అంగుళాలు - (రి); సి. పోర్టర్, (ఆస్ట్రే

లియా); ఐ. కచ్కరోవ్, (రష్యా). పోల్ వాల్ట్ :— ఆర్. రిఛార్డ్స్, (అమెరికా) 14 అడుగుల $11\frac{1}{2}$ అంగుళాలు (ఒ); ఆర్. గుటోవిస్కీ, (అమెరికా); జి. రోబనిస్, (గ్రీస్). లాంగ్ జంప్ :— జి. బెల్, (అమెరికా) 25 అడుగుల $3\frac{1}{4}$ అంగుళాలు; జె. బెనెట్, (అమెరికా); జె. వాల్కామా, (ఫిన్లెండ్). హాప్ - స్టెప్ అండ్ జంప్ :— ఏ. ఫిర్రెరా డా సిల్వా, (బ్రాజిల్) 53 అడుగుల $7\frac{1}{2}$ అంగుళాలు (ఒ); వి. ఇర్వర్సన్, (ఐస్‌లాండ్); వి. క్రీర్, (రష్యా). షాట్ పుట్ :— పి. ఓబ్రిన్ (అమెరికా) 60 అడుగుల 11 అంగుళాలు (ఒ); డబ్ల్యు. నీడర్ (అమెరికా); జె. స్కోబ్లా (చెకోస్లొవాకియా). డిస్కస్ త్రో :— అల్. ఒయెర్టర్, (అమెరికా) 184 అడుగుల $10\frac{1}{2}$ అంగుళాలు (ఒ); ఎఫ్. గార్డియాన్, (అమెరికా); డి. కోచ్, (అమెరికా) హేమర్ త్రో :— హెరాల్డ్ కానెల్లీ, (అమెరికా) 207 అడుగుల $3\frac{1}{2}$ అంగుళాలు (ఒ); మిఖైల్ క్రివోనోసొవ్, (రష్యా); అనాటోలీ సమొసెటోవ్, (రష్యా). జావలిన్ త్రో :— ఇ. డానియల్‌సెన్, (నార్వే) 281 అడుగుల $2\frac{1}{4}$ అంగుళాలు (ఒ); జె. సిడ్లో, (పోలెండ్) వి. సి. బొలెంకో, (రష్యా).
[ఒ = ఒలింపిక్ రికార్డు].

## సైక్లింగ్

అన్ని పోటీలకు కలిపి :— (1) ఫ్రాన్సు, (2) బ్రిటన్, (3) జర్మనీ.

## కుస్తీ పోటీలు

## (ఫ్రీ స్టయిల్)

ఫ్లయివెయిట్ తరగతి :— (1) రష్యా, (2) పర్షియా, (3) టర్కీ. బాంటం వెయిట్ :— టర్కీ, పర్షియా, రష్యా.

ఫెదర్ వెయిట్ :— జపాన్, బెల్జియం, ఫిన్లండ్. లైట్ వెయిట్ :— పర్ష్యా, జపాన్, రష్యా. వెల్టర్ వెయిట్ :— బల్గేరియా, టర్కీ, రష్యా. మిడిల్ వెయిట్ :— బల్గేరియా, అమెరికా, రష్యా. లైట్-హెవీ వెయిట్ :— పర్ష్యా, రష్యా, అమెరికా. హెవీ వెయిట్ :— టర్కీ, బల్గేరియా, ఫిన్లండ్.

(గ్రీకో-రోమన్ పద్ధతి)

ఫ్లయి వెయిట్ :—(1) రష్యా, (2) ఇటలీ, (3) టర్కీ. బాంటం వెయిట్ :— రష్యా, స్వీడెన్, రుమేనియా. ఫెదర్ వెయిట్ :— ఫిన్లండ్, హంగరీ, రష్యా. లైట్ వెయిట్ :— ఫిన్లండ్, టర్కీ, హంగరీ. వెల్టర్ వెయిట్ :—టర్కీ, రష్యా, స్వీడెన్. మిడిల్ వెయిట్ :— రష్యా, బల్గేరియా, స్వీడెన్. లైట్ హెవీ వెయిట్ :— రష్యా, బల్గేరియా, స్వీడెన్. హెవీ వెయిట్ :— రష్యా, జర్మనీ, ఇటలీ.

## వెయిట్ లిఫ్టింగ్

బాంటం వెయిట్ :— సి. విన్సీ (అమెరికా) (ప్రెస్ 231.49 పౌన్లు, స్నాచ్ 231.49, జెర్క్ 292.11 పౌన్లు) మొత్తం 754.45 పౌన్లు; వి. స్టొగాగ్ (రష్యా) మొత్తం 743.5పౌన్లు, (231.49 + 231.49 + 281.09); యమ్. నండ్జా (పర్ష్యా) 732.5 పౌన్లు. (220.47 + 225.98 + 286.60).

ఫెదర్ వెయిట్ :— ఐ. బెర్జర్, (అమెరికా) 776.75 పౌన్లు. (236.75 + 236.75 + 303); ఇ. మినావ్ (రష్యా), 754.75 పౌన్లు (253.5 + 225.75 + 281); ఎమ్. జిల్నింకీ, (పోలెండ్) 738 పౌన్లు (231.25 + 225.75 + 281).

లైట్ వెయిట్ :— జె. రైబాక్, (రష్యా) 837 . 5 పౌన్లు (242 . 5 + 264 . 5 + 330 . 5); పి. ఖబేటిడినోవ్, (రష్యా) 821 . (275 . 5 + 242 . 5 + 303); కె. చాంగ్ హీ, (కొరియా) 815 . 25 పౌన్లు (236 . 75 + 248 + 330 . 51).

మిడిల్ వెయిట్ :— ఎఫ్. బుగ్టనోవిస్కీ. (రష్యా) 925 . 93 . (292 + 270 + 363 . 75); పి. జార్జి (అమెరికా) 909. (270 + 281 + 358); ఎ. పిగ్నాటీ (ఇటలీ) 843 పౌన్లు (259 + 259 + 325).

లైట్ హెవీ వెయిట్ :— టూమికోనో, (అమెరికా) 986 . 25 (308 . 5 + 292 + 385 . 75); వి. స్టెపినోవ్ (రష్యా) 942 . 5. 297 . 5 + 286 . 5 + 358 . 25); జె. జార్జి, (అమెరికా) 920 . 25 (264 . 5 + 286 . 5 + 369 . 25).

మిడిల్ హెవీ వెయిట్ :— ఎ. వొరబీవ్ (రష్యా) 1019 . 25 (325 + 303 + 391 . 25): డి. షెప్పర్ (అమెరికా) 975 . 25. (308 . 5 + 303 + 363 . 75); జె. డుబుఫ్ (ఫ్రాన్సు) 937 పౌనులు (286 . 5 + 281 + 369 . 5).

హెవీ వెయిట్ :— పాల్ అండర్సన్ (అమెరికా) 1102 పౌనులు (369 . 25 + 319 . 5 + 413 . 25); హెచ్. సిల్వెటీ (అర్జెంటీనా) 1102 పౌనులు (385 . 75 + 319 . 5 + 396 . 75); ఎ. పిగైనీ, (ఇటలీ) 997 . 25 పౌనులు (330 . 5 + 286 . 5 + 380 . 25). అండర్సన్, సిల్వెటీలు చెరి 1102 పౌన్లు ఎత్తినప్పటికీ అండర్సన్ శరీరపు బరువు తక్కువకావడంచేత ఆయనకు ప్రథమ స్థాన మివ్వబడింది.






## హాకీ

(1) ఇండియా (2) పాకిస్తాన్ (3) జర్మనీ

భారత హాకీ విజేతలు

## ఫుట్ బాల్

(1) రష్యా (2) యుగోస్లేవియా (3) బల్గేరియా

## బాస్కెట్ బాల్

(1) అమెరికా (2) రష్యా
(3) ఉరుగ్వే

జయాపజయాలతో నిమిత్తం లేకుండా, సదాశయంతో సద్భావ వ్యాప్తికి మిత్రుల హోదాలో పోటీ చెయ్యడం ఒలింపిక్స్ పరమ లక్ష్యం. ఇప్పటికంటె ఎక్కువ వేగము, ఇప్పటికంటె ఎక్కువ ఎత్తు, ఇప్పటికంటె ఎక్కువ శక్తి సాధించడమనేది ఒలింపిక్స్ ఆశయం (మోటో). ఆధునిక ఒలింపిక్స్ సంస్థాపకుడు బారన్ పియరీ డి కౌబర్టిన్ ధన్యుడు.



బారన్ పియరీ డి కౌబర్టిన్

## (2) ఆ సి యా

భారతదేశం అస్వతంత్రంగా ఉన్నప్పుడుకూడా క్రీడలద్వారా ఆసియారాజ్యాలమధ్య స్నేహసద్భావాలను వృద్ధిపరచడానికి కృషి చేసింది. శ్రీ జి. డి. సోంధి పూనికపై 1934 మార్చిలో న్యూఢిల్లీలో పశ్చిమ ఆసియాదేశాల ఆటల పోటీలు (వెస్టరన్ ఏషియాటిక్ గేమ్సు) మొట్టమొదటిసారి జరిగినవి. ఆఫ్ఘనిస్తాన్, సింహళం, పాలస్తీనా, ఇండియా ఈ పోటీలలో పాల్గొన్నవి. ద్వితీయ పశ్చిమ ఆసియా క్రీడోత్సవం 1938 లో టెల్ ఆవీవ్‌లో జరుగవలసింది. కాని ప్రపంచ యుద్ధారంభ సూచనల మూలంగా అవి రద్దయిపోయినవి. యుద్ధానంతరం ఇవి పునరుద్ధరించబడలేదు.

1947 లో న్యూఢిల్లీలో అఖిల ఆసియా సంస్కృతీ మహాసభ జరిగినప్పుడు ఆసియాదేశాల ప్రతినిధులను ఇండియా ఒలింపిక్ ఎసోసియేషన్ తరఫున శ్రీ సోంధి కలుసుకొని ఆసియాగేమ్సు ఫెడరేషన్ సంస్థాపనోద్దేశాన్ని ప్రకటించారు. క్రీడారంగంలోకూడా ఆసియా సంఘటితం కావలనే ఆశయాన్ని ప్రకటించారు. నాటినుంచి ఆయనా, పాటియాలా మహారాజా ఇండియా ప్రభుత్వం సహకారంతో మూడు, నాలుగేండ్లబాటు కృషిచేసిన ఫలితంగా ఆసియా క్రీడోత్సవం అవతరించింది. 1951 మార్చిలో ఢిల్లీలోని నేషనల్ స్టేడియమ్‌లో ప్రథమ ఆసియా క్రీడోత్సవం జరిగింది. 11 రాజ్యాలు — ఆఫ్ఘనిస్తాన్, బర్మా, సింహళం, ఇండియా, ఇండొనీసియా, పర్షియా, జపాన్, నేపాల్, ఫిలిప్పైన్స్, సింగపూర్, థాయిలెండ్‌లు ఈ మహోత్సవంలో పాలొన్నవి. చైనీస్ రిపబ్లిక్ కొందరు పరిశీలకులను పంపింది.

ఈ క్రీడోత్సవంలో ఇండియా 10 స్వర్ణ పతకాలు, 10 రజత పతకాలు, ఆరు కంచుపతకాలు పొందింది. జపాన్ 11 స్వర్ణ పతకాలు, 12 రజతపతకాలు, 10 కంచుపతకాలు సాధించి ప్రథమస్థానం వహించింది. ఇండియాది ద్వితీయ స్థానం.

1954 మేలో మనీలాలో ద్వితీయ ఆసియా క్రీడోత్సవం జరిగింది. ఇండియా, జపాన్, ఫిలిప్పైన్స్, సింగపూర్, ఇండొనీసియా, చైనా,

పాకిస్తాన్, కొరియా, హాంకాంగ్ పాల్గొన్నవి. జపాన్ 10 స్వర్ణ పతకాలు, 10 రజత పతకాలు, నాలుగు కంచు పతకాలు సంపాదించింది. ఇండియా నాలుగు స్వర్ణ పతకాలు, మూడు రజత పతకాలు, అయిదు కంచు పతకాలు గెలుచుకొన్నది. జపాన్, ఫిలిప్పైన్స్, కొరియా, ఇండియాలకు ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ స్థానాలు లభించినవి.

శ్రీ దండమూడి రాజగోపాల్, శ్రీ కామినేని ఈశ్వరరావు, శ్రీ చెన్నుపాటి శేషగిరిరావుగారలు ప్రథమ ఆసియా క్రీడోత్సవంలో పాల్గొన్న ఆంధ్రులు. శ్రీ దండమూడి రాజగోపాల్ కంచు పతకాన్ని, శ్రీ ఈశ్వరరావు రజత పతకాన్ని సాధించారు. 1954 మనీలా పోటీలకు ఇండియానుంచి వెయిట్ లిఫ్టర్లు పంపబడలేదు.


శేషగిరిరావు, ఈశ్వరరావు

తృతీయ ఆసియా క్రీడోత్సవం 1958 మే-ప్రాంతాలటోకియోలోజరుగనున్నది. తొలిసారి హాకీ ఆ పోటీలలో చేర్చబడవచ్చు.

1951 వ సంవత్సరపు ఆసియా క్రీడోత్సవం ఆసియా ఒలింపిక్స్‌గా వ్యవహరించబడింది. ఒలింపిక్స్ అన్న పదం ప్రపంచ పోటీలకు మాత్రమే పరిమితం చెయ్యాలనే సంకల్పంతో, అప్పటినుంచి "ఆసియా ఒలింపిక్స్" ఆసియా క్రీడోత్సవంగా వ్యవహరించబడుతున్నది. నాలుగేళ్ళ కొకసారి ఆసియా క్రీడోత్సవం జరుగుతుంది.

## (3) ఇండియా

ఇండియాలో జాతీయ, రాష్ట్రీయ క్రీడోత్సవాలు 1952 ప్రాంతాల వరకూ ఒలింపిక్స్ పేరట వ్యవహరించబడేవి. తర్వాత ఇవి జాతీయ, రాష్ట్రీయ క్రీడోత్సవాలుగా వ్యవహరింపబడుతున్నవి. 1923 లో మొట్ట

మొదటి ఇండియన్ ఒలింపిక్ గేమ్స్ ఢిల్లీలో నిర్వహించబడినవి. అప్పటి నుంచి జరిగిన ఒలింపిక్ పోటీల స్థలాల వివర మిది :—

1923—ఢిల్లీ; 1924—కలకత్తా; 1925—లాహోర్; 1930—అలహాబాద్; 1932—మద్రాసు; 1934—ఢిల్లీ; 1936—లాహోర్; 1938—కలకత్తా; 1940—బొంబాయి; 1942—లాహోర్; 1944—పాటియాలా; 1946—బెంగుళూరు; 1948—లక్నో; 1950—బొంబాయి; 1952—మద్రాసు; 1954—ఢిల్లీ; 1956—పాటియాలా.

ప్రస్తుతం రెండేసి సంవత్సరాలకు ఒకసారి జాతీయ క్రీడోత్సవం నిర్వహించబడుతున్నది.

1956 ఫిబ్రవరి 23, 24, 25, 26 తేదీలలో పాటియాలాలో జరిగిన 17వ నేషనల్ గేమ్సు పోటీలలో దాదాపు 350 మంది క్రీడా ప్రవీణులు పాల్గొన్నారు. ఆంధ్ర వెయిట్‌లిఫ్టర్లు శ్రీ దండమూడి రాజగోపాల్ స్వర్ణపతకాన్ని, శ్రీ బొబ్బా వెంకటేశ్వరరావు (మిడిల్ హెవీ వెయిట్) రజత పతకాన్ని, శ్రీ శ్రీనివాసరావు (మిడిల్ హెవీ వెయిట్) కంచు పతకాన్ని గెలుచుకొన్నారు.

## ఆంధ్ర రాష్ట్రం

1954 జనవరి ఒకటవ తేదీన ఆంధ్ర ఒలింపిక్ ఎసోసియేషన్ ఇండియా ఒలింపిక్ ఎసోసియేషన్‌కు చేర్చబడింది. 1949 లోనే విశాలాంధ్ర ఒలింపిక్ ఎసోసియేషన్ నిర్మించబడినప్పటికి ఆంధ్రరాష్ట్రావతరణ పిమ్మట దాని పేరు ఆంధ్ర ఒలింపిక్ ఎసోసియేషన్‌గా మార్చబడి అఖిలభారతసంస్థ గుర్తింపును పొందింది. 1949 లో విశాలాంధ్ర ఒలింపిక్ ఎసోసియేషన్ విశాలాంధ్ర ఆటల పోటీలను నిర్వహించింది.

సదరన్ రైల్వే ఎథ్లెటిక్ ఎసోసియేషన్, ఆంధ్ర పోలీస్ స్పోర్ట్స్ ఎసోసియేషన్, ఆంధ్ర సర్కిల్ పోస్టల్ అండ్ టెలిగ్రాఫ్ రిక్రియేషన్ క్లబ్ ఆంధ్రరాష్ట్ర సంఘానికి ఎఫిలియేట్ చేయబడినవి.

ఆంధ్రరాష్ట్ర క్రీడోత్సవాలలో ఛాంపియన్‌ల వివర మిది :— 1954 శ్రీ కె. ఆల్‌ఫ్రెడ్ (తాడికొండ); 1955 - శ్రీ యమ్. బాలస్వామి (నిడుబ్రోలు) 1956 - శ్రీ పి. సి. కుప్పుస్వామి (హిందూపురం), ఆంధ్ర స్పెషల్ ఆర్మ్‌డ్ పోలీస్). టీమ్ ఛాంపియన్‌షిప్ సాధించినవారు :— 1954 - ఆంధ్ర వ్యాయామ శిక్షణ కళాశాల (విజయవాడ) - 1955-1956 ఆంధ్ర స్పెషల్ ఆర్మ్‌డ్ పోలీస్, (హిందూపురం). జూనియర్ ఛాంపియన్ షిప్ సాధించిన వారు :— 1954 – కోదండరామయ్య (బందరు), 1955 – బి. హెచ్. నూకాలు (నిడుబ్రోలు), 1956 – బి. యమ్. నూకాలు (వీరవాసరం).

## హై ద రా బా ద్

హైదరాబాద్‌లో రాష్ట్ర ఒలింపిక్ ఎసోసియేషన్ నిర్మాణానికి ఒకచెంప కృషిజరుగుచుండగా వేరొకచెంప ఆంధ్రప్రదేశ్ అవతరించింది.

1956 జనవరిలో హైదరాబాద్ ఎమచూర్ ఎథ్లెటిక్ ఎసోసియేషన్ హైదరాబాద్‌లో "ఒలింపిక్ గేమ్స్"ను నిర్వహించింది. ఆ పోటీలలో ఛాంపియన్‌షిప్‌ను సాధించినవారి వివర మిది :—

పురుషులు : టీమ్ ఛాంపియన్ షిప్ :— ఉస్మానియా యూనివర్శిటీ. వ్యక్తి ఛాంపియన్‌షిప్ :— శ్రీ కమల్‌రామ్ (ఏ. ఓ. సి.); స్త్రీలు : టీమ్ ఛాంపియన్ షిప్ :— ఉస్మానియా యూనివర్శిటీ. వ్యక్తి ఛాంపియన్ షిప్ :— సరోజ్ గోపాలన్.

# అధ్యాయము 8

# వెయిట్ లిఫ్టింగ్

బార్బెల్ వ్యాయామం విదేశీయవిధానమని, దేశీయవిధానం కాదని ఒక దురభిప్రాయం వున్నది. కాని చరిత్ర చూచినట్లయితే వేలసంవత్సరాలనుంచి భారత దేశంలోనూ, చైనాలోనూ ఈ వ్యాయామానికి ప్రాతిపదిక అయిన ఒక వ్యాయామ విధానము అమలులోవున్నట్లు విదిత మవుతున్నది. విజయనగర ప్రాంతంలోని ప్రతి తాలింఖానాలోనూ కానవచ్చే సంగిడీలతో చేసే వ్యాయామం బార్బెల్ వ్యాయామము వంటిదే. ప్రాచీన భారతంలోని వ్యాయామశాలల్లోనూ, దేవాలయాలలోనూ పెద్ద పెద్ద బండలను (సంతోళాలు లేక సంగడిరాళ్ళు) చేతులతో పట్టి పైకెత్తడం వంటి వ్యాయామం జరుపబడేది. సంతోళాలకు మధ్యన చెక్కకట్టు వుండేది. ఒక్కొక్క సంతోళ బరువు అరమణుగునుంచి నాలుగుమణుగులవరకు, ఒక్కొక్కప్పుడు అంతకుమించికూడా వుండేది. సంతోళాలను ఎత్తడం, దించడంతో వ్యాయామంచేసేవారు. బార్బెల్ వ్యాయామానికి ఇది ప్రాతిపదిక.



వెయిట్ లిఫ్టింగ్ భారతదేశంలో కొన్నివేల సంవత్సరాలనుంచి అమలులో వున్నట్లు చారిత్ర కాధారములు కలవు. ఉత్తర హిందూసాన

ములో ప్రతి వ్యాయామ శాలలోను వెయిట్ లిఫ్టింగ్ చేయుటకు "నాల్" అను పరికరము ఉపయోగించేవారు.

1911 వ సంవత్సరంలో "షోల్డరు బ్రిడ్జి" పద్ధతిలో ప్రపంచ రికార్డు 365 పౌన్లు వుండగా దేవీచౌదరి అను కాశీవాసి ఈ "నాల్" పరికరముతో 1200 పౌన్లు లేపకలిగినాడు. దీనిని పాశ్చాత్యులు విశ్వసించక, పరీక్షచేయుటకు ప్రత్యేకంగా లండన్‌నుంచి కాశీకి "డెస్ మాన్ షా" అనునతనిని పంపారు. అతడు దేవీచౌదరిచేత ఆ "నాల్"ను లేపించి, తర్వాత దానిని తూకము వేయగా 1200 పౌనులు వున్నదనీ, దేవీచౌదరి వంటి బలాఢ్యుడు ప్రపంచంలో ఎవ్వరునులేరనీ 1911 లో "హెల్త్ అండ్ స్ట్రెంత్" పత్రిక ఒకవ్యాసంలో వెల్లడించింది. ఇట్టి దృష్టాంతములను బట్టి ఈ వెయిట్ లిఫ్టింగ్ పాశ్చాత్య వ్యాయామము కాదనీ, భారత దేశీయ వ్యాయామమేననీ స్పష్టమౌతున్నది.

సంగిడీలను మెడమీద పెట్టుకొని గుంజీలుతీసి బలాన్ని వృద్ధి పొందించుకొనవచ్చు. యూరోపియన్లు, అమెరికన్లు ఈ పద్ధతిని భారత దేశంనుంచి సేకరించి శాస్త్రీయ పద్ధతులలో అభివృద్ధి పరిచారు. ఇదే బార్బెల్ విధానంగా ప్రపంచమంతటా వ్యాపించివున్నది. ఇప్పటి వెయిట్ లిఫ్టింగ్ రాడ్, ప్లేటును అమలులోనికి తెచ్చి సమస్త అవయవాలకు పుష్టిని కలిగించేటట్లుగా వెయిట్ లిఫ్టింగ్‌ను ప్రచారం చేసిన వారిలో అమెరికాలో శ్రీ బాబ్ హాఫ్మన్ (26 వ పేజీ చూడండి), బ్రిటన్‌లో శ్రీ డబ్ల్యు. ఏ. పుల్లమ్ ముఖ్యులు. ఆంధ్రరాష్ట్రంలో ఆధునిక వెయిట్ లిఫ్టింగ్‌ను ప్రవేశపెట్టి విశేషంగా ప్రచారంలోనికి తెచ్చిన వారిలో శ్రీ కొల్లి రంగదాసు చౌదరి, శ్రీ శిష్ట్లా సోమయాజులు గారలు ముఖ్యులు. భారతదేశంలో ప్రప్రథమంగా ఆధునిక వెయిట్ లిఫ్టింగ్ విధానమును ప్రవేశపెట్టినవారు శ్రీ ఎస్. మజుందార్.

ఇండియాలో వెయిట్ లిఫ్టింగ్ పోటీలను ప్రారంభించినది (1924) బెంగాలీలు. 1936 లో బెర్లిన్‌లో జరిగిన ప్రపంచం ఒలింపిక్ పోటీలలో మొట్టమొదటిసారి ఒక భారతీయ వెయిట్ లిఫ్టర్ పాల్గొన్నాడు.

1951 నుంచి "భారత్ శ్రీ" దేహసౌందర్య పోటీ ప్రారంభించబడింది. 1955 లో ఈ బిరుదును శ్రీ అర్జా జనార్దనరావు సాధించారు. 1951 నుంచి "ఆసియాశ్రీ" శరీరసౌష్ఠవ పోటీలుకూడా జరుపబడుతున్నవి. ఢిల్లీలో జరిగిన మొదటి "ఆసియాశ్రీ" పోటీలో శ్రీ పరిమిళ రాయ్ (కలకత్తా) ప్రథమస్థానం వహించారు.




ఇండియా అంతటిలోనూ వెయిట్స్ లిఫ్టింగ్ క్రీడపై అధికారము వహిస్తున్న సంస్థ ఇండియన్ వెయిట్ లిఫ్టింగ్ ఫెడరేషన్. దీని అధ్యక్షుడు (1956) సర్ ఉదయచంద్ర మెహతాబ్ (బర్ద్వాన్). కార్యవర్గంలో శ్రీ ఎమ్. అర్. అప్పారావు కలరు.



1947 లో శ్రీ ఎమ్. ఆర్. అప్పారావుగారి అధ్యక్షతన విజయవాడలో ఆంధ్ర ఎమచూర్ వెయిట్ లిఫ్టర్స్ ఎసోసియేషన్ స్థాపించబడింది. నాటినుంచి నేటివరకు శ్రీ అప్పారావుగారే అధ్యక్ష పదవిని నిర్వహిస్తున్నారు. పటమట పంచాయితీబోర్డు అధ్యక్షుడు శ్రీ చెన్నుపాటి రామకోటయ్య, శ్రీ గజ్జె వీరరాఘవగుప్త, శ్రీ ఏ. పి. రంగాగారలు ఈ సంస్థానికి విశేషంగా కృషిచేశారు.

ఈ సంఘం కృషి ఫలితంగా ఆంధ్ర వెయిట్ లిఫ్టర్‌లు అమెరికన్ ప్రముఖుడు శ్రీ హాఫ్మన్ వద్దను, సోవియట్ శిక్షకుడు శ్రీ లుబవైన్ (31 వ పేజీ చూడండి) వద్దను ఉన్నత శిక్షణ పొందారు. 1956 మేలో విజయవాడలో ఈ సంఘం తరఫున వెయిట్ లిఫ్టింగ్ శిక్షణ కేంద్రం నిర్వహించబడింది. శ్రీ లుబవైన్ వద్ద 65 మంది ఆంధ్ర వెయిట్ లిఫ్టర్‌లు శిక్షణపొందారు. మద్రాసులో వారివద్ద శ్రీ డి. ఆర్. గోపాల్, శ్రీ బొబ్బా వెంకటేశ్వరరావు గారలు, కలకత్తాలో వారివద్ద శ్రీ కామినేని ఈశ్వర రావుగారు ఉన్నత శిక్షణ పొందారు. స్నాచ్ రీతి వెయిట్ లిఫ్టింగ్‌లో ఈయన నేర్పిన "స్క్వాట్" పద్ధతి (పంగవెయ్యడం కాక, కూర్చొని బరువు నిలపడం) మన ప్రవీణులకు మిక్కిలి లాభించింది. తక్కువ శ్రమతో ఎక్కువ భారమును లేపకల విద్యను ఈయన శిక్షణవల్ల అభివృద్ధి పరచుకొన్నారు. శాస్త్రీయ పద్ధతిలో వెయిట్ లిఫ్టింగ్‌లో ప్రావీణ్యాభి వృద్ధికి శ్రీ లుబవైన్ సలహాలు ఉపయోగించినవి.

ఆంధ్రరాష్ట్రంలో ఇంకా క్రింది సంస్థలు రాష్ట్రసంస్థ అధ్వర్య ములో వెయిట్ లిఫ్టింగ్ ప్రచారానికి కృషి చేస్తున్నవి.

(1) శ్రీ కోడి రామమూర్తినాయుడు స్మారక వ్యాయామశాల, ప్రకృతి చికిత్సాలయం — డైరెక్టర్ శ్రీ కొల్లి రంగదాసు చౌదరి — స్వేచ్ఛానగర్ - కంకిపాడు; (2) ఆంధ్రరాష్ట్ర వ్యాయామ ప్రకృతి శిక్షణకేంద్రం — డైరెక్టర్ శ్రీ డి. ఆర్. గోపాల్, విజయవాడ; (3) శ్రీ సీతారామావధూత యోగవ్యాయామకళాశాల, ప్రకృతి చికిత్సాలయం — డాక్టర్ ఏ. పి. రంగా-పటమటలంక; (4) నేతాజీ సేవాసమితి, గుంటూరు - శ్రీ మోచర్ల శ్రీహరిరావు (5) వైశ్య వ్యాయామసంఘం — డైరెక్టర్ ఆచార్య గత్తె వీరరాఘవగుప్త, గుంటూరు; (6) శ్రీ కన్యకాపరమేశ్వరి వ్యాయామమందిర్, బందరు. (7) శ్రీ హనుమాన్ వ్యాయామశాల, గుడివాడ; (8) మునిసిపల్ వ్యాయామశాల, కాకినాడ (9) శ్రీ కోడి రామమూర్తి వ్యాయామ మందిర్, డైరెక్టర్ "రింగ్ బేబీశాండో" నాగమళ్ళ పైడిరాజు, విజయనగరం; (10) శ్రీ హనుమాన్ వ్యాయామమందిర్, బరంపురం; (11) శ్రీ కమ్ముల అప్పన్నగారి వ్యాయామశాల, ఏలూరు; (12) యోగ

వ్యాయామ ప్రకృతిచికిత్సా కేంద్రం — డైరెక్టర్ శ్రీ లక్ష్మీనారాయణ, ఏలూరు; (13) గౌతమ వ్యాయామమండలి, డైరెక్టర్ — శ్రీ వెంకట రావు, రాజమండ్రి.

## వెయిట్ లిఫ్టర్‌ల పరిచయం

**శ్రీ కొల్లి రంగదాసు చౌదరి:**—జననం 1909 ఏప్రిల్ 16. కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా, అప్పికట్ల గ్రామంలో. బాల్యంలో బలహీనులు. డాక్టర్ అహోబలరావు గారి సలహాపై శాస్త్రీయవ్యాయామంతో తమ హృద్రోగాన్ని జయించడానికి 1928 వ సంవత్సరంలో కృషి ప్రారంభించారు. ఆకాలంలో శాస్త్రీయ వ్యాయామం నేర్పే వారు లేనందువలన శ్రీ జె. పి. ముల్లర్ రచించిన "మై సిస్టమ్" అనే గ్రంథము కొని, వ్యాయామము ప్రారంభించారు. అందులోని



వ్యాయామ విధానాలను అనుసరించిన నాలుగు నెలలలోనే హృదయ దౌర్బల్యవ్యాధి పూర్తిగా నిర్మూలనమయినది. వ్యాయామ విద్యలో ఇంకా ఉన్నతశిక్షణ పొందడం నిమిత్తం 1928 లో కలకత్తాకు వెళ్ళారు. అక్కడ డాక్టర్ వాల్టర్ ఛిటున్ అనే బర్మాదేశస్థుని వద్ద బార్బెల్ వ్యాయామ విధానమును అభ్యసించారు. స్వగ్రామానికి తిరిగి వచ్చిన మీదట వీరు, వీరి మిత్రులు శ్రీ యస్. కె. సోమయాజులుగారు కలకత్తానుంచి బార్ బెల్స్‌ను తెప్పించి వ్యాయామం ప్రారంభించారు. పూర్వాంధ్ర రాష్ట్రంలో బార్బెల్ వ్యాయామం ప్రవేశపెట్టినది శ్రీ కె. ఆర్. చౌదరిగారే. వ్యాయామం మొదలుపెట్టినపుడు వీరి బరువు 95 పౌనులు. ఆరు సంవత్సరములు వ్యాయామం చేసిన తర్వాత వీరిబరువు 160 పౌన్లకు పెరిగింది. అప్పుడు వీరికొలతలు మెడ 15 అంగుళాలు; ఛాతీ–నార్మల్ 43 అం; నడుం 31 అం; దండచెయ్యి 15 అం; ముంజెయ్యి $11\frac{1}{2}$ అం; మణికట్టు $6\frac{1}{4}$ అం; తొడ 23 అం; పిక్క $14\frac{1}{2}$ అం; శిలమండ $8\frac{1}{2}$

అంగుళాలు; ఎత్తు 5 అడుగుల $9\frac{1}{4}$ అంగుళాలు; బరువు 160 పౌనులు. వీరి కొలతలు ఇప్పటికీ ఈవిధంగానే వున్నవి. వ్యాయామానికి ముందు ఎత్తు 5 అ. 5 అం.

1936 లో వీరు అలహాబాద్ వెళ్ళి బార్బెల్ వ్యాయామంలో ప్రసిద్ధిగాంచిన శ్రీ యస్. మజుందార్ గారివద్ద మూడు నెలలు శిక్షణ పొందారు. ఆ సంవత్సరంలోనే శ్రీ దండమూడి రాజగోపాల్ వీరివద్ద శిక్షణ పొందుటకు వచ్చారు. శ్రీ గోపాల్ స్వభావసిద్ధముగా అతి బలాఢ్యుడు. చౌదరిగారి సలహాతో వారి బలం రాణించింది. 1939 లో వీరుభయులూ మద్రాసు వెళ్ళి వ్యాయామ ప్రదర్శనలు ఇచ్చి అనేక బహుమతులు, ప్రశంసా పత్రములు పొందారు. 1940 లో ఉత్తర హిందూస్థానమంతటా — అలాహాబాద్, నాగపూర్, కట్నీ, కలకత్తా, ఢిల్లీ, కాశీ మున్నగు చోట్ల అనేక వ్యాయామ ప్రదర్శనములు ఇచ్చారు. 1941 లో వీరుభయులూ దక్షిణదేశమంతా పర్యటించి వ్యాయామ ప్రదర్శనలిచ్చి అనేక బహుమతులు ప్రశంసాపత్రములు పొందారు.

దక్షిణదేశ పర్యటన నుంచి తిరిగి వచ్చిన పిమ్మట శ్రీ రంగదాసు చౌదరిగారు బొంబాయి వెళ్ళి శ్రీమత్ కువలయానందగారివద్ద కొంత కాలం ప్రాణాయామంలో శిక్షణ పొందారు. ఇదే సమయంలో అమెరికానుండివచ్చి, బొంబాయిలో వ్యాయామశాల స్థాపించిన బిల్ హిల్ గార్డెనర్ వద్ద బార్బెల్ వ్యాయామంలో ఉన్నత శిక్షణ పొందారు. 1942 లో అప్పికట్లలో కోడి రామమూర్తినాయుడు స్మారకయోగ వ్యాయామ ప్రకృతి చికిత్సాలయము స్థాపించారు. 1945 మే రెండవ తేదీ నుంచి ఒక సంవత్సరం పాటు ఈ చికిత్సాలయం గుంటూరుజిల్లా కొల్లిపరలో నడుపబడింది. అచ్చట స్థలమూ, ప్రయాణ సౌకర్యములూ అనుకూలముగా లేనందున 1946 మే మూడవ తేదీన స్వేచ్ఛానగర్ (కంకిపాడు, కృష్ణాజిల్లా) కు చికిత్సాలయం మార్చారు. ఇప్పటికీ ఈ కేంద్రం అత్యంత సమర్థతతో నిర్వహించబడుతున్నది.

1942 నుంచి వీరి వ్యాయామశాలలో కొన్ని వందలమంది వ్యాయామ శిక్షణ పొందారు. దక్షిణ భారతంలో కెల్ల పెద్దదయిన ఈ వ్యాయామ శాలలో అన్ని అధునాతన పరికరములు, గొప్ప గ్రంథాలయం కలవు.

వీరి వ్యాయామశాలను చూచుటకై బొంబాయి, కలకత్తా, మద్రాసువంటి నగరాలనుంచి తీర్థయాత్రగా వ్యాయామవేత్తలు వస్తూవుంటారు.

శ్రీ డి. ఆర్. గోపాల్‌గారు గాక శ్రీ కామినేని ఈశ్వరరావు, శ్రీ వేములపల్లి గోపాలకృష్ణమూర్తి, శ్రీ కొల్లి రాజారామమోహనరావు, శ్రీ బొబ్బా వెంకటేశ్వరరావు, శ్రీ మదుకూరి వెంకటేశ్వరరావు, శ్రీ కాజా వెంకటరత్నం వంటి ప్రముఖులు శ్రీ రంగదాసు చౌదరిగారివద్ద శిక్షణ పొందివున్నారు.

శ్రీ దండమూడి రాజగోపాల్ :— జననం 1916 అక్టోబరు 13వ తేది కృష్ణాజిల్లా గండిగుంట గ్రామంలో. బాల్యం



నుంచి దృఢముగానూ ఉత్సాహముగానూ వుండేవాడు. బాల్యంలో వుయ్యూరుతోటలలో దండీలు, బస్కీలు ఇతర వ్యాయామం ప్రారం

భించారు. 1933 లో వానపాములకు మకాము మార్చారు. అక్కడ శ్రీ శిష్ట్లా సోమయాజులుగారు వెయిట్ లిఫ్టింగ్ ప్రచారం చేస్తుండేవారు. ఆ రోజులలో శ్రీ జాస్తి బాపయ్యచౌదరి, శ్రీ వీరపనేని సుభాష్‌చౌదరి, శ్రీ జి. పున్నయ్య అను నాయీబ్రాహ్మణుడు వెయిట్ లిఫ్టింగ్ అభ్యసిస్తుండేవారు. శ్రీ బాపయ్య, శ్రీ పున్నయ్యగార్ల ప్రోత్సాహంపై శ్రీ రాజగోపాల్ వెయిట్ లిఫ్టింగ్ ప్రారంభించారు. వెయిట్ లిఫ్టింగ్ గురించి ఓ, న, మాలు తెలియని రాజగోపాల్ ఒక్కసారిగా ప్రథమ ప్రయత్నంలోనే క్లీన్ అండ్ జెర్క్ రీతిలో 150 పౌనులు ఎత్తారు! 1939 కల్ల శ్రీ రాజగోపాల్ క్లీన్ అండ్ జెర్క్‌లో 230 పౌన్ల బరువు వరకూ లేపుతూ వుండేవారు. తొలివారి 1939-40 ప్రాంతాల శ్రీ రాజగోపాల్ గారు మద్రాసులో వ్యాయామ, బలప్రదర్శన లిచ్చారు. మద్రాసునుంచి బెంగుళూరువెళ్ళి శ్రీ కె. వి. అయ్యర్ శాండోగారిని కలుసుకొని వారి ప్రశంసలుకూడా పొందారు. 1940 లో శ్రీ రాజగోపాల్, వారి శిష్యులు శ్రీ కొల్లి రంగదాసు చౌదరి, శ్రీ కె. వి. చౌదరి గారలు నాగపూర్, అలహాబాద్, జబల్‌పూర్ మున్నగు నగరాలలో వ్యాయామ ప్రదర్శనలు ఇచ్చి చింతామణి, ఈశ్వరదత్ వంటి పత్రికాధిపతుల ప్రశంసలకు పాత్రులైనారు. డెడ్ లిఫ్ట్‌లో (మోకాళ్ళ వరకూ ఎత్తు పద్ధతి) శ్రీ రాజగోపాల్ గారు 420 పౌన్లు ఎత్తి శ్రీ యస్. ముజుందార్ గారి మన్ననలను పొందారు. 1941 లో దక్షిణదేశయాత్ర చేశారు. 1943 ఆరంభంలో నూజివీడులో ఆంధ్రసారస్వత సభలు జరిగినప్పుడు శ్రీ రాజగోపాల్ గారు బలప్రదర్శనములు ఇచ్చారు. శ్రీ అడివి బాపిరాజుగారు (వీరు గజఈతగాడుకూడా. "హిమబిందు" నవలలో వీరు ప్రాచీన క్రీడల వైభవాన్ని వర్ణించివున్నారు) శ్రీ గోపాల్ ప్రతిభావిశేషాన్ని గొప్పగా కొనియాడారు. తత్ఫలితంగా శ్రీ ఎమ్. ఆర్. అప్పారావుగారు అప్పటినుంచి రాజగోపాల్ విషయమై శ్రద్ధ తీసికొన ప్రారంభించారు. అంతటితో రాజగోపాల్ జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభ



మయినది. 1943 లో వానపాములలో వీరు స్థాపించిన వ్యాయామ సంస్థను శ్రీ ఎమ్. ఆర్. అప్పారావుగారు ప్రారంభోత్సవం జరిపారు.

1944 లో రాజగోపాల్ హైదరాబాద్, పూనా, బొంబాయి నగరాలలో బలప్రదర్శనములు ఇచ్చారు. బొంబాయిలో శ్రీ దారూవాలా అనే వెయిట్ లిఫ్టర్‌ను పరాజితునిచేసి, ఆంధ్రమహాసభచే సన్మానం పొంది శ్రీ బిల్ హిల్ అనే అమెరికన్ ప్రశంసలు పొందారు. "ఇండియన్ టార్జాన్" బిరుదును ఆ సందర్భంలోనే సాధించారు. అంతకుముందు కొన్ని సందర్భాలలో కారు ఆపడంవంటి బలప్రదర్శనలు చేశారు. 1945 లో రాజగోపాల్ తన శిష్యవర్గంతో కలకత్తావెళ్ళి ఆసియాఖండ పోటీలలో పాల్గొని, శరీర సౌష్ఠవ పోటీలో ప్రథమునిగా గెలుపొందారు. వెయిట్ లిఫ్టింగ్‌లో బెంగాల్ రాష్ట్రరికార్డును పతనం చేసివేశారు. కాశీలో సర్ యస్. రాధాకృష్ణగారి అధ్యక్షతన జరిగిన సభలో శ్రీ గోపాల్, శ్రీ కోడి రామమూర్తిగారు మాత్రమే త్రెంచగల్గిన గొలుసును త్రెంచి మన్ననలు పొందారు. 1946 లో బెంగుళూరులో జరిగిన ఒలింపిక్ పోటీలలో మైసూర్ తరఫున పోటీచేసి ప్రథమస్థానం పొందారు. 1947 లో ఇండియా ప్రతినిధిగా బర్మాలో జరిగిన అంతర్జాతీయ వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో పాల్గొన్నారు.

1948 జూలైలో లండన్‌లో జరిగిన ప్రపంచం ఒలింపిక్ పోటీలలో పాల్గొన్నారు. ఆ సందర్భంలోనే (1948 ఆగస్టులో) లండన్‌లోని స్కాలా థియేటర్‌లో జరిగిన "మిస్టర్ యూనివర్స్" (ప్రపంచ శ్రీ) అంగసౌష్ఠవ పోటీలలో పాల్గొన్నారు. తదుపరి ఫ్రాన్స్, స్విట్జర్లెండ్, ఇటలీ, ఈజిప్టు దేశాలలో పర్యటించారు. లండన్‌లో వున్నప్పుడు కామన్‌వెల్తు వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో పాల్గొని చతుర్థస్థానం పొందారు. బాబ్ హాఫ్మన్ (అమెరికా) డబ్ల్యు. పుల్లాం (లండన్) గార్ల వద్దకూడా శిక్షణ పొందారు.

1950 లో విజయవాడకు బస మార్చారు. 1951 లో ఢిల్లీలో జరిగిన ప్రథమ ఆసియా క్రీడోత్సవంలో హెవీవెయిట్ తరగతిలో పాల్గొని తృతీయస్థానం పొందారు. వారు మొత్తం 725 పౌనులు

బరువు ఎత్తారు. అంతకుముందు శ్రీ రాజగోపాల్ గారు 750 పౌనుల బరువు ఎత్తి తన తరగతిలో ఆసియా ఛాంపియన్‌గా పరిగణించ బడినారు కాని ఢిల్లీపోటీలో వెనుకపడినారు. 1952 లో మద్రాసులో జరిగిన జాతీయ పోటీలలో శ్రీ రాజగోపాల్ గారు తొలిసారి ప్రత్యేక ఆంధ్ర జండానీడన ఆంధ్రటీముకు నాయకత్వము వహించి మార్చి పాస్ట్‌లో పాల్గొన్నారు. ఆంధ్రులు జాతీయ ఒలింపిక్ పోటీలలో స్వయం ధ్వజంక్రింద నడవడం ఇదే మొదటిసారి. ఆంధ్రకు ఈవసతిని తెచ్చుటకు శ్రీ రాజగోపాల్ చాల కృషి చేసివున్నారు. అదే సంవత్సరంలో ఫిన్లెండ్‌లో జరిగిన ప్రపంచం ఒలింపిక్ పోటీలకు రాజగోపాల్ గారు వెళ్ళినారు కాని న్యుమోనియా వచ్చినందువల్ల పోటీలలో పాల్గొన లేదు.

1954 లో ఢిల్లీలో జరిగిన జాతీయ పోటీలకు వెళ్ళిన ఆంధ్రప్రతినిధి వర్గానికి శ్రీ గోపాల్ నాయకత్వం వహించారు. వెయిట్ లిఫ్టింగ్ పోటీలో పాల్గొని ప్రథమస్థానం వహించడమేకాక మూడు రికార్డులను కూడా స్థాపించి వున్నారు. అప్పుడు వారి బరువుల వివర మిది: శరీరతూకం $225\frac{1}{4}$ పౌన్లు; ప్రెస్-265; స్నాచ్-250; క్లీన్ అండ్ జెర్క్-305; మొత్తం-820. 1955 లో విజయవాడలో ఆంధ్రరాష్ట్ర వ్యాయామ ప్రకృతి చికిత్సకేంద్రం స్థాపించి వున్నారు. 1956 లో పాటియాలాలో జరిగిన జాతీయ క్రీడోత్సవంలో పాల్గొని ప్రథమస్థానం పొందడమేకాక ఒక క్రొత్తరికార్డునుకూడా స్థాపించారు. అప్పటి బరువుల వివరం: ప్రెస్-270; స్నాచ్-225; జెర్క్-305; మొత్తం-800. ప్రెస్‌లో పూర్వపు రికార్డు-ఈయన స్థాపించినదే $265\frac{1}{2}$ పౌనులు. 1956 నవంబరులో మెల్బోర్న్‌లో (ఆస్ట్రేలియా) జరిగిన 16 వ ప్రపంచం ఒలింపిక్ పోటీలలో పాల్గొన్నారు. వరుసగా మూడు ఒలింపిక్స్‌లో పాల్గొన్న ఆంధ్రుడు ఇప్పటికి వీరే.

శ్రీ కామినేని ఈశ్వరరావు:— వయసు షుమారు 31. స్వగ్రామం భట్లపెనుమర్రు. వెయిట్ లిఫ్టింగ్‌లో ఆసియా రికార్డులన్ని అధిగమించి ఆంధ్రులకు ఎనలేని కీర్తి గడించారు. 1951 లో స్వేచ్ఛా

నగర్‌లోని శ్రీ కొల్లి రంగదాసు చౌదరిగారి వద్ద శిక్షణ పొందడానికి వచ్చారు. అదే సంవత్సరంలో ఢిల్లీలో జరిగిన ప్రథమ ఆసియా పోటీలలో రెండవస్థానం పొందిన భారతీయుడు ఈయన ఒక్కడే. 1952 లో మద్రాసులో జరిగిన నేషనల్ గేమ్సులో ద్వితీయ స్థానము పొందారు. జెర్క్‌లో 305 పౌన్లు ఎత్తి భారత రికార్డును స్థాపించారు. అదే సంవత్సరం జూన్ లో కలకత్తాలో జరిగిన రాజేంద్రా వెయిట్ లిఫ్టింగ్ పోటీలో హెవీవెయిట్ తరగతిలో ఇండియన్ రికార్డులు నాల్గింటిని అధిగమించి ప్రపంచం ఒలింపిక్స్ ప్రతినిధిగా ఎన్నుకోబడినారు.



హెల్సింకీ ఒలింపిక్స్‌కు వెళ్ళినారు గాని ఆహారము, వాతావరణము సరిపడనందున ఆశించినంతగా ఫలితములు ఇవ్వలేదు. 1953 డిసెంబరు 27 వ తేదీన వణుకూరు గ్రామంలో చైనా సాంస్కృతిక రాయబార వర్గంవారి ఎదుట క్లీన్ అండ్ జెర్క్ పద్ధతిలో 330 పౌనులు ఎత్తి అఖిల భారత రికార్డును స్థాపించారు. 1954 లో ఢిల్లీలో జరిగిన నేషనల్ గేమ్స్ పోటీలలో మిడిల్ హెవీ వెయిట్ తరగతిలో పాల్గొని ప్రథమ స్థానం పొందారు (మొత్తం 800 పౌనులు). 1955 లో బందరులో జరిగిన ఆంధ్రరాష్ట్ర పోటీలలో హెవీవెయిట్ తరగతిలో పాల్గొని 860 పౌనులు లేపి అఖిలభారత, ఆసియా రికార్డులను అధిగమించారు (మొత్తం - 860).

1956 జూన్ లో రష్యన్ వెయిట్ లిఫ్టింగ్ అధ్యాపకుడు శ్రీ లుబవైన్ వద్ద కలకత్తాలో ఉన్నత శిక్షణ పొందారు. అంతకుముందు అమెరికన్ వెయిట్ లిఫ్టింగ్ ప్రచారకుడు బాబ్ హాఫ్మన్ సలహాలను పొందారు.

మిడిల్ హెవి వెయిట్ తరగతిలోవుండి, రష్యన్ వద్ద పొందిన శిక్షణ ఫలితంగా వెంటనే 900 పౌనులు ఎత్తకలిగారు (285 + 265 + 350).

ఈ తరగతిలో అప్పటికి ప్రపంచం రికార్డు $1,013\frac{1}{2}$ పౌనులు.

202 పౌనుల బరువు ఉన్నప్పుడు శ్రీ ఈశ్వరరావుగారి శరీరపు కొలతలు ఇవి: మెడ-18 అంగుళాలు; ఛాతీ-నార్మల్-$48\frac{1}{2}$ అం; నడుం-36 అం; దండచెయ్యి-$16\frac{1}{2}$ అం; ముంజెయ్యి-13 అం; మణికట్టు-$7\frac{1}{4}$ అం; తొడ-$27\frac{1}{4}$ అం; పిక్క-16 అం; శీలమండ-$9\frac{1}{4}$ అం; ఎత్తు-5 అడుగుల $6\frac{1}{2}$ అం.

శ్రీ ఈశ్వరరావుగారు వార్సాలో జరిగిన ప్రపంచ యువజన క్రీడోత్సవంలో పాల్గొనడానికై వెళ్ళినప్పుడు ఇతర యూరోపియన్ రాజ్యాలలోకూడా పర్యటించారు. చైనా, రష్యాలలో పర్యటించి వెయిట్ లిఫ్టింగ్ లో విశిష్ట విధానాలను అభ్యసించారు. (151 వ పేజీ చూడండి).

భారతీయులలో ప్రపంచ ప్రమాణం అందుకొన గలవారు శ్రీ ఈశ్వరరావుగారు ఒక్కరేనని శ్రీలుబవైన్ ప్రశంసించి వున్నారు. 1956 నవంబర్ లో మెల్బోర్న్ లో జరిగిన ప్రపంచం ఒలింపిక్ పోటీలలో పాల్గొన్నారు.

డాక్టర్ ఏ. పి. రంగా:—జననం నవంబర్ 28, 1920, కృష్ణాజిల్లా పడమటి లంకగ్రామంలో. బాల్యంలోనే వ్యాయామంలో



అభిరుచి కలిగింది. సాము గరిడీలలో స్వయంగా సాధనలు చేశారు. కర్రత్రిప్పడం, కత్తిసాము, మల్లయుద్ధము, బాకుమస్తీ, విలువిద్య మున్నగు వాటిని అభ్యసించి, స్వయంపండితు పైపల్లెలలో, పట్టణాలలో, నగరాలలో ఆయాక్రీడలలో జరిగే పోటీలలో పాల్గొని ప్రథమ లేక ద్వితీయస్థానం పొంది యోగ్యతా పత్రాలు, స్వర్ణపతకాలు చిన్నతనంలోనే గెలుచుకొన్నారు.

చైనాబ్లాక్ మ్యాజిక్, సైకిల్ ఫీట్స్, అక్రోబాట్స్, జిమ్నాస్టిక్స్ మున్నగు కళలలో గడితేరినవారైనారు. ఆంధ్రదేశంలో అనేకచోట్ల బలప్రదర్శనలు, వ్యాయామ ప్రదర్శనములు జరిపి గవర్నర్ల, జమీందార్ల, మంత్రుల మెప్పు, బహూకృతులు పొందారు. వెనుకబడిన జాతుల పక్షాన 1953 లో సింహపురంలో జరిగిన మహాసభలో "ఆంధ్రభీమ" బిరుదాంకితులైనారు. అవనిగడ్డ పాండురంగారావుగారి యోగ విద్యానైపుణ్యానికి శ్రీ చుండూరు వెంకటరెడ్డిగారు విస్మయ చకితులై మహాసభ జరిపి, మహాజనుల పక్షాన "వ్యాయామ సింహ" బిరుదు ప్రసాదించారు. బరువులు లేపుటలో ఆంధ్రదేశంలోను, భారత దేశంలోను అనేక పోటీలలో పాల్గొన్నారు. బాంటమ్ వెయిట్ తరగతిలో పాల్గొని అనేక ఆంధ్రదేశ పోటీలలో గెలుపొందారు. శరీరసౌష్ఠవ స్పర్థలో కూడా పాల్గొని "ఆంధ్రశ్రీ" బిరుదు పొందారు.

1946 లో మైసూర్‌లో జరిగిన పోటీలలోను, 1948 లో కలకత్తాలో జరిగిన ఏషియాటిక్ వెయిట్ లిఫ్టింగ్ సెలక్షన్ పోటీలలోను బాంటమ్ తరగతిలో పాల్గొని 460 పౌనులు ఎత్తి ఉన్నత స్థానం పొందారు. లక్నో, బొంబాయి, ఢిల్లీ, మద్రాసు, పాటియాలాలలో జరిగిన జాతీయ క్రీడోత్సవాలలో ఆంధ్ర వెయిట్ లిఫ్టింగ్ జట్టులకు నాయకత్వం వహించారు. 1956 లో కలకత్తాకు అమెరికన్ వెయిట్ లిఫ్టింగ్ యోధులు వచ్చినప్పుడు వారితో స్నేహపూర్వక స్పర్థలలో భారతదేశం ప్రతినిధిగా పాల్గొన్నారు. శ్రీ లుబసైన్ వద్ద శిక్షణపొంది వారి ప్రశంసలనుకూడా పొందారు.

పటమటలంకలో వ్యాయామశాల స్థాపించి అనేకమంది యువకులకు ఆధునిక వ్యాయామ శిక్షణ నిస్తున్నారు. యోగాసన, ప్రాణాయామ, సూర్యనమస్కారవిధానాలు కూడా బోధిస్తున్నారు. వీరి పినతండ్రి శ్రీ సీతారామావధూతగారిచే పటమటలంకలో నడుపబడుచున్న యోగ వ్యాయామ ప్రకృతి చికిత్సాలయంలో వ్యాయామోపాధ్యాయులుగానూ, సహవైద్యులుగానూ పనిచేస్తున్నారు. పటమటలంకలోని వీరి "హెల్తుహోమ్" భారతదేశమంతటా ప్రఖ్యాతి చెందింది.

శ్రీ చెన్నుపాటి రామకోటయ్య :— స్వగ్రామం పటమట లంక. వయస్సు 45 సంవత్సరములు. పహిల్వాన్ రామకోటయ్యగారుగా పేరుపొందారు. చిన్ననాటినుంచి వ్యాయామంలో శ్రద్ధాసక్తులుచూపారు. బస్సు డ్రైవర్‌గా పనిచేస్తున్న సమయంలో విజయవాడలో తాలింఖానాలు దండీ, బస్కీ, మల్లయుద్ధం అభ్యసించి అసమానప్రజ్ఞ గడించారు. ఆంధ్రదేశంలో వ్యాయామ కళ ప్రచారానికి వీరు జరిపిన కృషి అత్యంత ప్రశంసనీయం. వ్యాయామ యువకులకు వీరు అనేక విధాలుగా తోడ్పడినారు. జాతీయ పోటీలలో పాల్గొన్న ఆంధ్ర వెయిట్ లిఫ్టింగ్ జట్లకు మేనేజరుగా కూడా వ్యవహరించి వున్నారు.



శ్రీ బొబ్బా వెంకటేశ్వరరావు :— జననం 1933.



స్వగ్రామం కృష్ణాజిల్లా కవుతరం. షుమారు 12 వ ఏట పటమటలంకలో వుంటున్నప్పుడు దేశీయ వ్యాయామంలో ఆసక్తి కలిగింది.

1953 లో జరిగిన ఆంధ్రరాష్ట్ర వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో మొదటిసారిగా (మిడిల్ వెయిట్ తరగతిలో) పాల్గొని మొత్తం 575 పౌనులుఎత్తి ప్రథమస్థానం పొందారు. అప్పుడు వీరి బరువు 150 పౌనులు. 1954 లో అఖిలభారత పోటీలలో పాల్గొన్నారు. శ్రీ కొల్లి రంగదాసు చౌదరిగారి వ్యాయామశాలలో శ్రీ చౌదరిగారివద్ద శిక్షణ, శ్రీ కామినేని ఈశ్వరరావుగారితో కలసి వెయిట్ లిఫ్టింగ్ లో కృషిచేసే మహావకాశం వీరికి కల్గింది. 1956 లో పాటియాలాలో జరిగిన జాతీయ క్రీడోత్సవంలో మిడిల్ హెవీవెయిట్ తరగతిలో పోటీచేసి రజతపతకం పొందారు.

అప్పటి రికార్డు వివరం :—శరీరతూకం 183 పౌనులు; ప్రెస్ 215 పౌనులు; స్నాచ్-185; క్లీన్ అండ్ జెర్క్-275. మొత్తం 675 పౌనులు.

రమ్యను వెయిట్ లిఫ్టింగ్ శిక్షకుడు శ్రీలుబషైన్ వద్ద ఉన్నత శిక్షణ పొందారు. శ్రీ వెంకటేశ్వరరావు పేరొందిన చెడుగుడు ఆటగాడు కూడా.



శ్రీ. ఆర్. సూర్యనారాయణ :— జననం 1932 విజయనగరంలో. చిన్నతనంలోనే వ్యాయామము వీరిని బాగా ఆకర్షించింది.

విజయనగర మండలంలో మిక్కిలి బలశాలిగా ప్రతిభ గడించిన శ్రీ చిప్పాడ పైడితల్లి వీరి అన్నగారు. వీరు సోదరునికి వ్యాయామంలో శిక్షణ ఇచ్చి వున్నారు. తదుపరి శ్రీ నాగమళ్ళ పైడిరాజు శాండోగారు వీరికి వ్యాయామంలో శిక్షణ ఇచ్చి వున్నారు. ఆరువీసముల ఇనుపగొలుసు త్రెంచుటవంటి బలప్రదర్శనములు గావించారు. పారలెల్ బార్, రోమన్ రింగ్స్, యోగాసన పద్ధతులలోకూడా ప్రావీణ్యం గడించారు.

1950 లో వెయిట్ లిఫ్టింగ్ ప్రారంభించారు. 1953 లో ఆంధ్రరాష్ట్ర వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో లైట్ వెయిట్ తరగతిలో పాల్గొని ద్వితీయ స్థానం సంపాదించారు. 1954 లో రాష్ట్ర పోటీలలో లైట్ వెయిట్ తరగతిలో పాల్గొని స్నాచ్ పద్ధతిలో 185 పౌనులు ఎత్తి క్రొత్త రికార్డును స్థాపించి ఢిల్లీ జాతీయ పోటీలకు ఆంధ్ర ప్రతినిధిగా ఎన్నుకోబడినారు. 1956 లో రాష్ట్ర పోటీలలో మిడిల్ వెయిట్ తరగతిలో పాల్గొని ప్రథమ స్థానం పొందారు. స్నాచ్ లోనూ (190 పౌ) క్లీన్ అండ్ జెర్క్ లోనూ (235 పౌ) మొత్తములోనూ (625 పౌ) క్రొత్త రికార్డులు నెలకొల్పారు. అదే సంవత్సరంలో పాటియాలాలో జరిగిన జాతీయ క్రీడోత్సవంలో మిడిల్ వెయిట్ తరగతిలో పోటీచేసి చతుర్థ స్థానం పొందారు. ఢిల్లీ, పాటియాలా జాతీయ క్రీడోత్సవాలలో జిమ్నాస్టిక్స్‌లోకూడా పాల్గొని పారలెల్ బార్, రోమన్ రింగ్స్‌పై అద్భుత ప్రావీణ్యం ప్రదర్శించారు.

శ్రీ వేములపల్లి గోపాలకృష్ణమూర్తి :— వయస్సు 38 సంవత్సరాలు. వీరు 1950 లో శ్రీ కొల్లి రంగదాసు చౌదరిగారి వద్ద వెయిట్ లిఫ్టింగ్ లో శిక్షణ పొందారు. 1952 లో జరిగిన ఆంధ్రరాష్ట్ర వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో మిడిల్ హెవీవెయిట్ తరగతిలో ప్రథమ స్థానం పొందారు. 1952 లో మద్రాసులో జరిగిన జాతీయ పోటీలలో మిడిల్ హెవీవెయిట్ తరగతిలో ప్రథమస్థానం పొందడమేగాక ఒకరీతిలో 230 పౌనులు బరువుఎత్తి అఖిలభారత రికార్డును స్థాపించారు. శ్రీ మూర్తిగారు పేరొందిన చతురంగపు ఆటగాడుకూడా.

శ్రీ చెన్నుపాటి శేషగిరిరావు :— శ్రీ చెన్నుపాటి రామకోటయ్యగారి తమ్ముడు. పిన్ననాటినుండి వ్యాయామంలో అభిరుచి కలిగినది. తొలిసారి 1945 లో



ఆంధ్ర వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో పాల్గొన్నారు. 1947 లో ఏలూరులో జరిగిన ఆంధ్రకుస్తీ పోటీలలో ప్రథమ స్థానం పొంది వెండికప్పును గెలుచుకొన్నారు. 1948 లో లక్నోలో జరిగిన జాతీయ క్రీడోత్సవంలో పాల్గొన్నారు. 1951 లో ఢిల్లీలో జరిగిన ప్రథమ ఆసియా క్రీడోత్సవంలో ఆంధ్ర ప్రతినిధి. 1952లో మద్రాసులో జరిగిన జాతీయ క్రీడోత్సవంలో మిడిల్ వెయిట్ తరగతిలో తృతీయ బహుమతి పొందారు. 1954 లో ఢిల్లీలో జరిగిన జాతీయ క్రీడోత్సవంలో మిడిల్ హెవీ వెయిట్ తరగతిలో తృతీయస్థానం పొందారు. 1956 లో శ్రీ లుబవైన్ వద్ద ఉన్నత శిక్షణ పొందారు. "ఆంధ్రభీమ" డాక్టర్ ఏ. పి. రంగా గారితో కలిసి ఆంధ్రలోనూ, అన్యరాష్ట్రాలలోనూ వ్యాయామ ప్రదర్శనలిచ్చి మన్ననలు పొందారు.

శ్రీ కె. నాగేశ్వరరావునాయుడు:— వయస్సు 22 సంవత్సరాలు. స్వగ్రామం కాకినాడ. అక్కడి పురపాలక వ్యాయామశాలలో వ్యాయామము ప్రారంభించారు. శ్రీ ఏ. పి. రంగాగారివద్ద బార్బెల్ వ్యాయామము, శ్రీ ఏ. జనార్దన్ నాయుడుగారివద్ద కండరవ్యాయామం అభ్యసించారు. 1956 లో విజయవాడలో జరిగిన ఆంధ్రరాష్ట్ర వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో లైట్ వెయిట్ తరగతిలో పాల్గొని ద్వితీయస్థానం పొందారు. 1956 'ఆంధ్రశ్రీ' పోటీలలో ద్వితీయస్థానం పొందారు.

శ్రీ యన్. రామస్వామి :— స్వగ్రామం పటమటలంక. వయస్సు 22 సంవత్సరాలు. డాక్టర్ ఏ. పి. రంగాగారివద్ద ఆసన, సూర్యనమస్కారములు, షట్క్రియలు, ఆక్రొబాట్స్, బావకుస్తీ

షస్తీ, బరువులెత్తుట మొదలగునవి అభ్యసించారు. కలకత్తా, ఢిల్లీ, పాటియాలాలలో జరిగిన జాతీయపోటీలలో ఆంధ్రప్రతినిధి. 1956 రాష్ట్రపోటీలలో ప్రథమస్థానం పొందినప్పుడు వీరి రికార్డుల వివరం : 160 + 175 + 220 = 555 పౌనులు.

శ్రీ బి. ఎ. రమణ :— 18 సంవత్సరముల యువకుడు. విజయనగర వాస్తవ్యుడు. శ్రీ యస్. పైడిరాజు, శ్రీ ఆర్. సూర్యనారాయణగార్లవద్ద వ్యాయామశిక్షణ పొందారు. గుంటూరులో జరిగిన రాష్ట్ర పోటీలలో బాంటమ్ వెయిట్ తరగతిలో తృతీయస్థానం పొందారు.

శ్రీ ఏ. అప్పారావు :— వయస్సు 21 సంవత్సరములు. విజయనగరంనివాసి. నాలుగుసంవత్సరాలనుంచి దేశీయ వ్యాయామం చేస్తున్నారు. శ్రీ యస్. పైడిరాజు, శ్రీ ఆర్. సూర్యనారాయణగార్ల వద్ద వెయిట్ లిఫ్టింగ్ లో శిక్షణ పొందారు.

శ్రీ కె. రామయ్య :— వయస్సు 20 సంవత్సరాలు. తెనాలి తాలూకా వాస్తవ్యులు. మొదట దేశీయవ్యాయామం అభ్యసించారు. తర్వాత ఏ. పి. రంగాగారివద్ద వెయిట్ లిఫ్టింగ్ అభ్యసించారు. తదుపరి పెరవలిగ్రామ ఆయుర్వేద వైద్యులు శ్రీ సీతారామాచారిగారితో కలిసి బాగా బరువులెత్తుట అభ్యసించి శ్రీ కె. ఆర్. చౌదరి, శ్రీ డి. ఆర్. గోపాల్ సలహాలను పాటిస్తూ వృద్ధిలోనికి వచ్చారు. 1956 రాష్ట్ర పోటీలలో ఫెదర్ వెయిట్ లో పాల్గొని ద్వితీయస్థానం పొందారు.

శ్రీ యస్. జలాసుందరరావు:— వయస్సు 17 సంవత్సరాలు. పటమటలంక వాస్తవ్యుడు. రంగా వ్యాయామశాలలో బార్బెల్ వ్యాయామం చేస్తున్నారు. ఆంధ్ర పోటీలలో పెక్కు పర్యాయములు పాల్గొని దండీ, బస్కీ, వెయిట్ లిఫ్టింగ్ లలో విజయం పొందారు. 1956 రాష్ట్ర పోటీలలో ఫెదర్ వెయిట్ తరగతిలో పోటీచేసి తృతీయ స్థానం పొందారు.

శ్రీ బి. నారాయణప్ప :— వయస్సు 18 సంవత్సరాలు. గుడివాడ వ్యాయామశాలలో శిక్షణ పొందుతున్నారు. బందగు,

గుంటూరులలో జరిగిన రాష్ట్ర పోటీలలో దండీ, బస్కీ, శరీర సౌష్ఠవం, బరువులెత్తు పోటీలలో పాల్గొన్నారు.

శ్రీ యమ్. వెంకటేశ్వరరావు:—వయస్సు 30 సంవత్సరాలు శ్రీ డి. ఆర్. గోపాల్, శ్రీ కె. ఆర్. చౌదరి, శ్రీ ఐ. లుబు వైజెల వద్ద బార్బెల్ శిక్షణ పొందారు. ప్రస్తుత నివాసం కేసరపల్లి. 1956 రాష్ట్ర పోటీలలో మిడిల్ వెయిట్ తరగతిలో పాల్గొని ద్వితీయ స్థానం పొందారు.

శ్రీ ఎమ్. అచ్యుతరావు :— వయస్సు 18 సంవత్సరాలు. ఉడిపి జన్మస్థానం. స్థిరనివాసం విజయవాడ. శ్రీ ఏ. పి. రంగా, శ్రీ గోపాల్, శ్రీ లుబ వైజెల వద్ద శిక్షణ పొందారు. ఆంధ్ర ప్రతినిధిగా ఢిల్లీ, కలకత్తా, పాటియాలా జాతీయ పోటీలలో పాల్గొన్నారు. 1956 ఆంధ్రరాష్ట్ర పోటీలలో మిడిల్ వెయిట్ తరగతిలో పాల్గొని తృతీయ స్థానం పొందారు.

శ్రీ వి. ప్రకాశరావు :— వయస్సు 18 సంవత్సరాలు. గన్నవరం తాలూకా పడమరలంకపల్లి గ్రామం నివాసి. శ్రీ ఏ. పి. రంగాగారివద్ద రెండు సంవత్సరములు బార్బెల్ శిక్షణ పొందారు. ఆంధ్ర ప్రతినిధిగా ఢిల్లీ, కలకత్తా, పాటియాలా జాతీయ పోటీలలో పాల్గొన్నారు. 1956 రాష్ట్రపోటీలలో లైట్ హెవీవెయిట్ తరగతిలో పాల్గొని ప్రథమస్థానం పొందినప్పుడు వీరు లేపిన బరువులు 130 + 215 + 225 = 570 పౌనులు.

శ్రీ వి. శ్రీనివాస చౌదరి :—వయస్సు 28 సంవత్సరములు. ప్రస్తుత నివాసం పటమట. శ్రీ ఏ. పి. రంగాగారివద్ద బార్బెల్ శిక్షణ పొందారు. ఢిల్లీ, పాటియాలా జాతీయ పోటీలలో పాల్గొన్నారు. బాబ్ హాఫ్మన్, లుబవైన్‌లవద్ద బార్బెల్ శిక్షణ పొందారు.

శ్రీ కె. సుబ్బారావు నాయుడు :—వయస్సు 21 సంవత్సరములు. కాకినాడ నివాసి. బరువు 230 పౌనులు. శ్రీ డి. ఆర్. గోపాల్

వాప్మన్ లవద్ద ఉన్నత శిక్షణ పొందారు. 1956 రాష్ట్రపోటీలలో పాల్గొని ద్వితీయస్థానం పొందారు.

శ్రీ సి. హెచ్. భాస్కరరావు :— వయస్సు 26 సంవత్సరాలు. పటమటలంక వాస్తవ్యులు. శ్రీ రంగాగారివద్ద వ్యాయామాన్ని అభ్యసించి దండి, బస్కీ, వెయిట్ లిఫ్టింగ్ లలో ప్రావీణ్యం గడించారు. శ్రీ రామకోటయ్యగారి ప్రోత్సాహంతో మల్లవిద్యనుకూడ అభ్యసించారు.

ఆంధ్ర జంఖానావారు నిర్వహించిన ఈతపోటీలలో ఈస్టిండియా స్విమ్మింగ్ ఛాంపియన్ షిప్‌ను పొందారు. చెడుగుడు ఆటలో లెఫ్ట్ కార్నర్‌గా కీర్తిపొందారు.

శ్రీ కొండాలి సుబ్బారావు :— వయస్సు 22 సంవత్సరాలు. ప్రస్తుత నివాసం పటమటలంక. రంగాగారి వ్యాయామశాలలో శిక్షణ పొంది బాంటమ్, ఫెదర్ వెయిట్ తరగతులలో ఆంధ్ర పోటీలలో పాల్గొని విజయములను సాధించుటేకాక క్రొత్త రికార్డులను కూడా నెలకొల్పారు. ఆంధ్ర ప్రతినిధిగా ఢిల్లీ, పాటియాలా జాతీయ పోటీలలో పాల్గొన్నారు.

శ్రీ బి. జాలారావు :— వయస్సు 17 సంవత్సరాలు. దుగ్గిరాల నివాసం. హోటలులో పనిచేస్తూ వ్యాయామం అభ్యసించి గోపాల్‌గారి వద్ద కొంతకాలం బార్బెల్ శిక్షణ పొందారు. ఆంధ్ర పోటీలలో ఫెదర్ వెయిట్ తరగతిలో పాల్గొని గెలుపొందారు.

శ్రీ సి. హెచ్. హనుమంతరావు :— వయస్సు 16 సంవత్సరములు. పటమటలంకలో శ్రీ రంగాగారివద్ద నేవుండి వ్యాయామం అభ్యసించారు. ఆసనములు, దండీ, బస్కీలు, వెయిట్ లిఫ్టింగ్, శరీర సౌష్ఠవము రాష్ట్రపోటీలలో పాల్గొని విజయాలు సాధించారు.

శ్రీ జి. రాధాకృష్ణమూర్తి:— వయస్సు 23 సంవత్సరాలు. తెనాలి వాస్తవ్యులు. రంగాగారి వ్యాయామశాలలో ఆసనాలు అభ్యసించి ఆంధ్రపోటీలలో పెక్క పర్యాయములు గెలుపొందారు.

(శ్రీ) కె. కోటయ్యబాబు:—వయస్సు 33 సంవత్సరములు. గోడవల్లు గ్రామనివాసి. శ్రీ కె. ఆర్. చౌదరి, శ్రీ డి. ఆర్. గోపాల్ గార్లవద్ద బార్బెల్ శిక్షణపొంది శ్రీ రంగాగారితో కలిసి లక్నో, బొంబాయిలలో జరిగిన జాతీయక్రీడోత్సవంలో పాల్గొన్నారు.

(శ్రీ) ఆర్. దేవరాజు :— వయస్సు 26 సంవత్సరములు. కాకినాడ వాస్తవ్యులు. అచ్చటి మునిసిపల్ వ్యాయామశాలలో శ్రీ నాగేశ్వరరావు నాయుడుగారి సహవాసంతో వెయిట్ లిఫ్టింగ్ అభ్యసిస్తూ రంగాగారి శిక్షణ అనుసరించి ఆంధ్రులలో మిడిల్ హెవీ వెయిట్ తరగతిలో పేరుగడించారు.

(శ్రీ) సి. హెచ్. రామస్వామి:— వయస్సు 28 సంవత్సరములు. పటమటలంక నివాసి. దండీ, బస్కీ, కుస్తీ, బరువులెత్తు పోటీలలో పాల్గొని ఆంధ్రలో పెక్కుపర్యాయాలు విజయాలు సాధించారు. వీరు శిక్షణపొందింది రంగాగారివద్ద.

శ్రీ పి. జయంతిలాల్ :—వయస్సు 15 సంవత్సరములు. గుజరాతీ యువకుడు. విజయవాడలో విద్యాభ్యాసంతోపాటు రంగాగారివద్ద వ్యాయామాభ్యాసం చేస్తూ శరీరసౌష్ఠవ పోటీలలోకూడా పాల్గొన్నారు. ఢిల్లీలో జరిగిన జాతీయ పోటీలలో పాల్గొన్నారు.

శ్రీ వి. సీతారామాచార్యులు :—పెరవలి గ్రామ నివాసి. శ్రీ కొల్లి రంగదాసు చౌదరిగారి వ్యాయామశాలలో శిక్షణ పొందారు. 1955 ఆంధ్రరాష్ట్ర వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో మిడిల్ హెవీవెయిట్ తరగతిలో పాల్గొని ప్రథమస్థానం పొందారు. అప్పుడు వీరు ఎత్తిన బరువుల వివరమిది. శరీరతూకం-184; ప్రెస్-165; స్నాచ్-140; జెర్క్-200; మొత్తం 505-పౌనులు.

## విదేశాలలో వెయిట్ లిఫ్టింగ్

వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో మధ్యవర్తులుగా వ్యవహరించి శ్రీ పి. భోజారావు, శ్రీ వి. సుభాష్ చౌదరి, శ్రీ కె. వెంకటరత్నం గారలు ఖ్యాతి పొందారు.

స్థూలంగా చూచినట్లయితే హెచ్చు బరువు తరగతులలో (లైట్ హెవీ, మిడిల్ హెవీ, హెవీ) ఆంధ్రులది మొత్తం భారతదేశంలో ప్రముఖస్థానం.

1956 ఫిబ్రవరిలో పాటియాలాలో జరిగిన జాతీయ క్రీడోత్సవములో ఇండియన్ రైల్వేలకు వెయిట్ లిఫ్టింగ్ టీమ్ ఛాంపియన్‌షిప్ లభించింది. బెంగాల్‌కు ద్వితీయస్థానం, మద్రాసుకు తృతీయస్థానం దక్కినవి.

ఇండియాలోకెల్ల మొట్టమొదటిసారిగా శరీరపు బరువుకంటె రెట్టింపు బరువును ఎత్తినవారు శ్రీ యస్. జి. సేతురామన్ అనే తంజావూరు నివాసి.

వెయిట్ లిఫ్టింగ్‌లో ప్రపంచంలో ప్రథమస్థానానికి పోటీ పడుతున్నవి రష్యా, అమెరికాలు. హెవీ వెయిట్ తప్పిస్తే తక్కిన తరగతులలో అమెరికాను ఓడించగల రష్యన్ ప్రవీణులు కనిపిస్తున్నారు. హెవీ వెయిట్ తరగతిలో ప్రపంచం ఛాంపియన్ శ్రీ పాల్ ఆండర్సన్‌ను ఓడించగల రష్యను ఇప్పటిలో కనుపించడంలేదు. 340 పౌనుల బరువు వున్న ఈతడు ఈజిప్ట్, రష్యా, ఇండియాలలో పర్యటించాడు. ఇండియాలో ఢిల్లీమాత్రమే సందర్శించాడు. ఇండియా వచ్చేటప్పటికి ఈయన మొత్తం 1,175 పౌనులు ఎత్తగలుగుతున్నాడు. గత ప్రపంచం వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో ప్రథమస్థానం పొందాడు.

ఇంకా ఈజిప్ట్, ఆసియా, హాలెండు, జర్మనీ, పర్షియా, కొరియా, కెనడా, లెబనాన్, ఫ్రాన్సు, ట్రినిడాడ్, అర్జంటైనాలు వెయిట్ లిఫ్టింగ్‌లో ప్రపంచంలోకెల్ల ప్రశంసనీయమయిన స్థానం వహిస్తున్నవి.

బ్రిటన్, దక్షిణాఫ్రికా, న్యూజిలాండ్, పాకిస్తాన్, హంగరీ, ఫిన్లెండ్, బర్మా, మెక్సికో, ఇటలీ, ఆస్ట్రేలియా, ఫిలిప్పన్స్, డెన్మార్క్, స్వీడన్, జమైకా, బెల్జియమ్, గయానా, పెరూ, క్యూబా, స్విట్జర్లెండ్‌లలో వెయిట్ లిఫ్టింగ్ విశేషంగా ప్రచారంలో వున్నది.

సోవియట్ యూనియన్‌లో వెయిట్ లిఫ్టింగ్ ప్రవీణులకు ప్రభుత్వం ఇస్తున్న ప్రోత్సాహం సమస్త దేశాలకు ముఖ్యంగా ఇండియాకు,

అటు విదేశ సాధనాలతో దేహసౌష్ఠవం పెంపొందించుకొంటూ ఇటు యోగాసనాలవంటి భారత సంప్రదాయాలలో కండరాలకు వన్నె దేహానికి మెరుగు తెచ్చుకొన్నారు. మొట్టమొదటిసారిగా 1950 లో పెద్ద పోటీలో పాల్గొని పెద్ద బిరుదును శ్రీ అజ్జా ఆర్జించారు. వై. యమ్. సి. ఏ. వారు జరిపిన "మిస్టర్ హెర్క్యులెస్" అంగసౌష్ఠవ పోటీలో పాల్గొని ఆ బిరుదు వహించారు. 1951 లో కలకత్తాలో జరిగిన "భారత్ శ్రీ" పోటీలలో పశ్చిమ బెంగాల్ తరఫున పోటీచేసి తన ఎత్తు తరగతిలో (5 అడుగుల 9 అంగుళాలు, 6 అడుగులు మధ్య ఎత్తు వున్నవారు) ప్రథమస్థానం పొందారు. మొత్తం పోటీలలో (అన్ని తరగతులలో కలిపి చూడగా) ద్వితీయ స్థానం పొందారు. అప్పుడు "భారత్ శ్రీ" బిరుదును శ్రీ పరిమళ రాయ్ అనే బెంగాలీ గెలుచుకొన్నాడు.

1951 లో ఢిల్లీలో జరిగిన ప్రథమ ఆసియాక్రీడోత్సవంలో "ఆసియాశ్రీ" పోటీలో పాల్గొని తనఎత్తు తరగతిలో ఆసియాలోకెల్ల ప్రథమునిగానూ అన్నితరగతులకు కలిపి ఆసియాలోకెల్ల ద్వితీయునిగానూ వచ్చి "కాశ్మీర్ బాకు" బహూకరణపొందారు. శ్రీ పరిమళ రాయ్ "ఆసియాశ్రీ" బిరుదును పొందారు.

1952 లో శ్రీ జనార్దనరావు సౌండ్ ఇంజినీరింగ్ లో డిప్లమో సంపాదించి కలకత్తానుంచి ఆంధ్రదేశానికి తిరిగివచ్చారు. ఆదేసంవత్సరంలో "ఆంధ్రశ్రీ" బిరుదుపొందారు. 1953 లో మద్రాసులో శ్యామలా స్టుడియో సౌండ్ డిపార్టుమెంటులో పనిచేస్తున్నప్పుడు ఉమ్మడి "చెన్నరాష్ట్రశ్రీ" పోటీలలో పాల్గొని ఆ బిరుదునుకూడా సంపాదించారు. ఇంతకుముందు జాతీయక్రీడోత్సవంలో వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో లైట్ హెవీ వెయిట్ తరగతిలో పోటీచేసి వెండిపతకం సంపాదించారు. 1955 లో మద్రాసులో జరిగిన "భారత్ శ్రీ" పోటీలలో బెంగాల్, బొంబాయి, హైదరాబాద్, మద్రాసు, మైసూరు రాష్ట్రాలకు చెందిన 23 మంది ప్రవీణులను ఓడించి "భారత్ శ్రీ" బిరుదును పొందారు. "మత్స్యయంత్రం", "శిలువన ఉన్న ఏసుక్రీస్తు" భంగి

మలు వేయడంలో వీరు అద్వితీయులు. 1956 జాతీయ క్రీడోత్సవంలో పాల్గొన్నారు.

శ్రీ తవ్వా రామారావుగుప్త:— వయస్సు 19 సంవత్సరములు. గుంటూరు వైశ్య వ్యాయామ సంఘములోచేరి కొన్ని సంవత్సరములుగా దేశీయ వ్యాయామములు, సూర్యనమస్కార, ఆసన, బార్బెల్ మున్నగు వ్యాయామములు చేసి శరీరాన్ని బలిష్ఠముగా అందచందాలతో చేసికొనగలిగారు. దండు, బస్కీ, సూర్యనమస్కారములు, ఈత మున్నగు పోటీలలో బహుమతులను పొందగలిగారు. శరీర సౌష్ఠవ పోటీలలో కొన్ని పర్యాయములు ద్వితీయ స్థానం పొందారు. ఆచార్య గత్తి వీరరాఘవగుప్తగారి వ్యాయామ ప్రచారములోనూ, బల ప్రదర్శనములలోనూ పాల్గొంటూ ఆచార్యులవారి వ్యాయామోద్యమానికి చేయూతగా నిలచివున్నారు. 1956 లో "వైశ్యశ్రీ" బిరుదు పొందారు.



శ్రీ కె. దండాసి :—వయస్సు 28 సంవత్సరాలు. ఒరిస్సాలోని బరంపురం వాస్తవ్యులు. బాల్యంనుంచి దండీ, బస్కీ మొదలయిన దేశీయ వ్యాయామములు అభ్యసించారు. ఛెస్ట్ ఎక్స్పాండర్, పారలల్ బార్, రోమన్ రింగ్స్ మొదలయిన వ్యాయామములు కూడా చేశారు. 1949 లో శ్రీ ఏ. పి. రంగాగారి వద్ద శిక్షణ పొందారు. జాతీయ పోటీలలో బాంటమ్ తరగతిలో బరువులెత్తుట లోనూ, శరీరసౌష్ఠవం పోటీలలోనూ ఆంధ్ర ప్రతినిధిగా పాల్గొన్నారు. ఆంధ్రలో 3 సంవత్సరాలు శరీరసౌష్ఠవ పోటీలో పాల్గొని "ఆంధ్రశ్రీ" బిరుదును పొందారు.

కండర నిర్మాణ విద్యలో హైదరాబాద్ రాష్ట్రంలో శ్రీ ఎమ్. యాదగిరి, శ్రీ బెన్ని ఫ్రాన్సిస్, శ్రీ మీర్ ఘజ్నఫర్ ఆలీ, శ్రీ పి. కె. మహానంద్ ప్రఖ్యాతి వహించివున్నారు.

వెయిట్ లిఫ్టింగ్ లో శ్రీయుతులు నరసింగదాస్, ఏ. దినకరరావు, ఫెడ్డీమరత్ (ఫెదర్ వెయిట్), ఖాల్లీలూర్ రెహం, సుబ్రహ్మణ్యం

(లైట్ వెయిట్); బలివాలా, విక్టర్ఫారార్డ్, శ్రీరాములు (మిడిల్ వెయిట్); లీలాకుమార్ లైట్ (హెవీవెయిట్); మసూద్ అలీ, వినోద్ కుమార్ (మిడిల్ హెవీ వెయిట్) హైదరాబాద్ రాష్ట్రంలో గణుతి కెక్కినారు.

శ్రీ మనోహర ఆచే :— "ప్రపంచశ్రీ" పోటీలలో పొల్గొని తనతరగతి (పోటీ)లో ప్రపంచంలో కెల్ల ప్రథమ స్థానం పొందిన భారతీయుడు ఈయన. 1952 లో ఒకటవ గ్రూప్ లో వీరు ఈ అద్వితీయ విజయాన్ని సాధించారు. ఎత్తునుబట్టి మధ్యతరగతికి చెందిన శ్రీ మంతోష్రాయ్కూడా తన తరగతిలో ఇట్టి స్థానం పొంది వున్నారు.

శ్రీ టామీకోనో :— 1955 "ప్ర పం చ శ్రీ" బిరుదు సాధించిన ఈ అమెరికన్ వస్తుతహా జపాన్ వంశీయుడు. వెయిట్ లిఫ్టింగ్ లోకూడా వీరు ప్రపంచఖ్యాతి వహించివున్నారు. మిడిల్ వెయిట్, లైట్ హెవీ వెయిట్ తరగతులలోకూడా వీరు పోటీ చేస్తూ వుంటారు. వీరు లోగడ స్థాపించివున్న ప్రపంచం రికార్డుల వివరం: మిడిల్ వెయిట్:-ప్రెస్-292, జెర్క్-370$\frac{1}{4}$ మొత్తం-903$\frac{1}{2}$ (స్నాచ్ లో రష్యనుది ప్రపంచరికార్డు). లైట్ హెవీ వెయిట్:-ప్రెస్-316$\frac{1}{4}$; మొత్తం, 958$\frac{3}{4}$. స్నాచ్, జెర్క్లలో రష్యనులవి ప్రపంచపు రికార్డులు. 1955 నవంబరు ఒకటవ తేదీకి ఆ రికార్డులు అమలులోవున్నవి. వీరి తాజారికార్డు: 1956 అక్టోబరు 14 వ తేదీన "లైట్ హెవీ వెయిట్" తరగతిలో క్లీన్ అండ్ జెర్క్ పద్ధతిలో 382$\frac{1}{2}$ పౌనులు ఎత్తి ప్రపంచ రికార్డు స్థాపించారు.

1956 లో స్థాపించబడిన కొన్ని ముఖ్యమయిన రికార్డుల వివరం:—

జనవరి :- శ్రీ ఏ. కె. భాషా : (బాంటమ్ వెయిట్) ప్రెస్— 183 పౌనులు. (కొత్తఇండియా రికార్డు). శ్రీ మూాకన్ : (బాంటమ్ వెయిట్) క్లీన్ అండ్ జెర్క్ పద్ధతిలో 245 పౌనులు ఎత్తి అఖిల భారత రికార్డును స్థాపించారు. ఈ ఇద్దరూ చెన్నరాష్ట్రవాసులు.

శ్రీ ఛార్లెస్ వింసీ : (అమెరికా) బాంటమ్ వెయిట్ - క్లీన్ అండ్ జెర్క్ - 290 పౌనులు.

ఫిబ్రవరి :- శ్రీ వి. మూకన్ : (మద్రాసు) బాంటమ్‌వెయిట్ తరగతిలో వీరు మొత్తం 590 పౌనులు ఎత్తి భారత రికార్డును స్థాపించారు. శ్రీ యస్. ఆంబ్రా : (రైల్వేస్, ఇండియా) జెర్క్‌లో 285 పౌనులు ఎత్తి భారత రికార్డును స్థాపించారు. వీరు మొత్తం 710 పౌనులు ఎత్తి మొత్తంలో కూడా క్రొత్త భారత ప్రమాణాన్ని నెలకొల్పారు.

మే :- శ్రీ రావిట్ ఖగూటిడనొ : (రష్యను) లైట్ వెయిట్ తరగతి, ప్రెస్ రీతిలో 270 పౌనులు ఎత్తి క్రొత్త ప్రపంచ రికార్డు స్థాపించారు. శ్రీ సూర్యారి డుగనొ : (రష్యను) లైట్ వెయిట్, స్నాచ్ రీతిలో $300\frac{1}{4}$ పౌనులు ఎత్తి ప్రపంచ రికార్డును నెలకొల్పారు.

శ్రీ చం జక్ బుంకాయ్ : (చైనా) క్లీన్ అండ్ జెర్క్ పద్ధతిలో 293.2 పౌనులు ఎత్తి ప్రపంచం రికార్డు స్థాపించారు.

ఆగస్టు:- శ్రీ ఆన్. కాడీ ఓరో బ్రైల్ : (రష్యా) మిడిల్ హెవీ, స్నాచ్‌లో 313 పౌనులు ఎత్తి ప్రపంచం రికార్డు స్థాపించారు.

(212, 213 పేజీలు చూడండి)

అధ్యాయము 9

# కుస్తీ, దాని అనుబంధ వ్యాయామ విద్యలు

మహాభారత కాలం నాడు మల్లయుద్ధ ప్రవీణులు రాజపోషణలో వుండేవారు. బౌద్ధయుగంలో వ్యాయామప్రవీణులు పొందిన అమితాదరణ సత్కారాలకు ఆకాలం నాటి శిల్పాలు, జాతకకథలు తార్కాణాలు. కాకతీయుల కాలంలో మల్లయుద్ధ విశారదులకు సేనాపతిపదవి నిచ్చి సత్కరించేవారు. విజయనగర రాజుల ఏలుబడిలో జెట్టీలు, మడులు, మాన్యాలు, బహుమతులుగా పొందేవారు. దసరాపండుగకు, మహారాజు జన్మదినోత్సవాలకు పెద్దఎత్తున జరిగే క్రీడోత్సవాలలో కుస్తీపోటీలకు ప్రాధాన్యం వుండేది.



బ్రిటిష్‌వారి హయాములో మహారాజాల, రాజాల, జమీందారుల ఆదరణలో మల్లవిద్య విశేషంగా ప్రచారమయింది. ఉత్తరదేశంలో కొల్హాపూర్‌లోనూ, దక్షిణదేశంలో విజయనగరసంస్థానంలోనూ మల్లులు ఆదరించబడి పోషించబడినారు. జమీందారుల కాలంపోయి ఆంధ్ర రాష్ట్రం ఏర్పడినపిమ్మట, 1954 లో ఆంధ్రరాష్ట్ర ఎమెచూర్ రెజ్లింగ్ ఎసోసియేషన్ స్థాపించబడింది. రాష్ట్రంలో మల్లవిద్యాప్రచారానికి కృషి చేస్తున్న ఈ సంస్థ మూలపురుషులు (స్వర్గీయ) శ్రీ పాపోలు వీర వెంకయ్యగారు, శ్రీ గద్దె వీరరాఘవగుప్తగారు, శ్రీ మోచెర్ల శ్రీహరి రావుగారు. ఈ సంస్థకు తూర్పుగోదావరి, కృష్ణా, నెల్లూరు, గుంటూరు, కడప మొదలయినజిల్లాల మల్లవిద్యాసంఘాలు అనుబంధం చేయబడినవి.

(35, 36, పేజీలుకూడా చూడండి) మల్లవిద్యా యోధులను పరిచయం చేస్తున్నాను.

ప్రొఫెసర్ కోడి రామమూర్తి:—జననం 1880. విజయ నగరం సమీపాన గల వీరఘట్టం అనే గ్రామంలో. చరిత్ర కందినంత



వరకూ వ్యాయామరంగంలో ఆంధ్ర ఖ్యాతిని విదేశాలలో చాటిన వారిలో వీరే ప్రథములు. ఆధునిక యుగంలో ఆంధ్రదేశంలో వ్యాయామ కళను పెంపొందించడానికి కృషి చేసిన వారిలో కూడా వీరే ప్రథములు. వీరి తండ్రి కోడి నారాయణస్వామిగారు కూడా గొప్ప బలవంతులు. విజయ నగరం ప్రాంతాల పోలీస్ శాఖలో వారు పనిచేశారు.

శ్రీ రామమూర్తి నాయుడుగారికి బాల్యమునుంచి చదువుసంధ్య లలో కాక వ్యాయామ విద్యలో ఎక్కువ అభిరుచి ఆసక్తి వుండేవి. నాయుడుగారు మూడవఫారం ఆరుసార్లు తప్పినారట. ఆకాలం లోనే ఆయన గరిడీని స్థాపించి తోటి బాలురతోకూడా సంగడాలు ఎత్తుటవంటి వ్యాయామం ప్రారంభించారు. శ్రీ నాయుడుగారు తమ బలపరాక్రమం తొలుత ప్రదర్శింపచేయడానికి ఒక వృషభం కారణమయినది. ఒక ఎద్దు ఊబిలో దిగబడిపోతే దానిని ఎంతమందయినా పైకి తీయలేకపోయారు. నాయుడుగారొక్కరూ ఎవ్వరి సహాయం లేకుండా ఎద్దును ఊబినుంచి బయటకు లాగినారట.

శ్రీ నాయుడుగారు థర్డుఫారం పూర్తిచేసిన పిమ్మట మద్రాసు డ్రిల్‌మాస్టర్ల కాలేజీలో చదివి అక్కడే డ్రిల్‌మాస్టర్‌గా నియ మితులయినారు. ఆ సమయంలో తుని మహారాణి ఆస్థానంలో పని చేస్తున్న శ్రీ పొట్టి పంతులుగారితో నాయుడుగారికి పరిచయం ఏర్పడింది.

పంతులుగారి ప్రోత్సాహంపై నాయుడుగారు ముష్టియుద్ధం అభ్యసించి మద్రాసులో విజయపరంపర సాధించారు. పంతులుగారి ప్రోత్సాహం పైన ఈజెన్ శాండో అనే జర్మన్ బలశాలిని మించిన బలం సంపాదించాలనే దీక్షతో వ్యాయామం తీవ్రంగా సాగించారు. పంతులుగారి సిఫారసుపై తుని మహారాణి శ్రీ నాయుడుగారు ఒక సర్కస్ నిర్వహించడానికి సహాయం చేశారు. ఈ సర్కస్ ట్రూపు భారతదేశమంతటా ప్రదర్శనలిచ్చింది. క్రమక్రమేణా ఈ సర్కస్ పెద్దదయి మొత్తం 18 వందలమంది పనివారలకు భుక్తి చూపిందట. వీరిలో నూరుమంది భారతీయ వస్తాదులు కలరట. నాయుడుగారివద్ద ముష్టియుద్ధం నేర్చుకొనడానికై వచ్చిన 30 మంది విదేశీయులుకూడా కలరట.

ఒక గ్రామంలో రామమూర్తి నాయుడుగారి సర్కస్ విడిదిచేసి వుండగా పెద్ద తుపాను వచ్చింది. నాయుడుగారు మకాముచేసివున్న గుడారం కూలిపోయింది. ఇంతలోకే ఒక సర్కస్ ఏనుగు త్రెంచుకొని పోయి నాయుడుగారున్న గుడారాన్ని భయంకరంగా త్రొక్కుతూ పోయింది. నాయుడుగారి రొమ్ముపైనుంచికూడా అది నడిచింది. తలవని తలంపుగా అది జరిగినందువల్ల నాయుడుగారికి రొమ్ములో కొద్దిగా నొప్పివేసింది. అయితే అప్పటినుంచి రొమ్ముమీద ఏనుగును ఎక్కించి బలప్రదర్శనం చేయడం ప్రారంభించారు. భారతదేశంలో ఇట్టి బల ప్రదర్శనకు ప్రారంభోత్సవం జరిపినదీ ఆంధ్రవీరుడే. 1907 లో జర్మన్ బలశాలి ఈజెన్ శాండో మద్రాసువచ్చి సవాలుచేశారు. ఆయన సవాలుకు ఇండియాలో ఎవ్వరూ అంగీకరించలేకపోయారు. నాయుడుగారు ఒక్కరూ ప్రతిసవాలు చేశారు. నాయుడుగారు రొమ్ముపై ఏనుగును ఎక్కించుకొనే బలశాలి అని తెలిసి ఈజెన్ శాండో చల్లగా జారుకున్నారట. తదుపరి నాయుడుగారు యూరప్‌లో పర్యటించడానికై వెళ్ళారు. యూరప్ అంతటా బలప్రదర్శనాలిచ్చి అజేయులుగా మాతృదేశానికి తిరిగి వచ్చారు. లండన్‌లో వున్నప్పుడు బ్రిటిషు చక్రవర్తి ఈ "కలియుగ భీమసేను"ని కీర్తించినారట.

నాయుడుగారు స్వచ్ఛమైన శాకాహారని ప్రతీతి. ఏనుగు ఆకు అలములు తిని బలంగా వున్నట్లు మానవుడుకూడా వుండవచ్చుననే

సిద్ధాంతాన్ని ప్రచారంచేసి ఆచరించారు. వీరు హఠయోగాభ్యాసము కూడా చేసేవారని అందువల్లనే అద్వితీయబలసంపద పొందినారని చెప్పు కొనేవారు.

నాయుడుగారి సర్కస్ ఇండియాలోనేకాక ప్రపంచంలోకెల్ల పెద్దదయినదని ప్రతీతి. శ్రీ బాలగంగాధరతిలక్‌వంటి పెద్దలకోరికపై కాంగ్రెస్ మహాసభలలో నాయుడుగారి సర్కస్, ప్రదర్శనలు ఇచ్చింది. మొద్దు యినుపగొలుసును త్రెంచడం, రొమ్ముపై రెండుటన్నుల రాతి బండను పెట్టి బండపై బండరాళ్ళను సమ్మెటలతో పగులకొట్టించడం, నడుముకు రెండుగొలుసులు బిగించి రెండుగొలుసులకు రెండుకార్లు పెట్టి కార్ల వేగం ఎక్కించగా వాటిని నిలిపిపట్టడం వంటి అద్భుత బలప్రదర్శనా లను నాయుడుగారు చేసేవారు. నాయుడుగారి ఛాతీచుట్టుకొలత ఊపిరి బిగపట్టనప్పుడు 48 అంగుళములు; బిగపట్టినప్పుడు 60 అంగుళాలకు పెరిగేది. అడుగు పెంచగలవారు నాటికి, నేటికీ అరుదు. మల్లవిద్యా యోధుల యుక్తులను ఇట్టె పట్టివేయడంలో నాయుడుగారి మేధ చాలా సునిసితమయినది. తనను గాని, తన శిష్యునిగాని కుస్తీలో ఏదేశమువారు ఓడించినా పెద్ద బహుమతి ఇవ్వగలనని నాయుడుగారు అనేకపర్యా యములు సవాలుచేసి వున్నారు. వారి సవాలును దేశ విదేశాలలో ఎవ్వరూ అమోదించ సాహసించలేదు.

నాయుడుగారు గొప్పదాత. రాజులు, మహారాజుల కంటె కూడా వీరు ఎక్కువ దానధర్మాలు చేసివున్నారంటే అతిశయోక్తిగాదు. సర్కస్ పై వీరు ఆర్జించిన దంతయూ బీదలకు పంచిపెట్టారు. మేనాలో ఒక ఊరినుంచి మరొక ఊరికి వెళ్ళుతున్నప్పుడు రూపాయల సంచులను దగ్గర వుంచుకొని మేనాచుట్టూ మూగిన పేదలకు రూపాయలు విసు రుతూ వుండేవారు. సర్కస్ ప్రదర్శనములు ఇచ్చిన ప్రతిచోటా పేద సాదలకు అన్నదానం చేయటమేకాక వారికి వుచితముగా ప్రత్యేక బలప్రదర్శనములు ఇచ్చి ఉత్సాహ పరిచేవారు. ఆ కాలములోనే నాయుడుగారు కొన్ని కోట్ల రూపాయల ధనము ఆర్జించినారని ఒక వాదము ఉన్నది. నాయుడుగారు పదిసంవత్సరములలో $1\frac{1}{2}$ కోటి రూపాయల దానధర్మములు చేసినట్లు వారివద్ద పనిచేసిన గుజరాతీ

గుమాస్తా తెలియ జేశారు. బలశాలురలో ఇంతటి త్యాగమూర్తి నాటికీ, నేటికీ వేరొకరులేరు. లక్షలకు లక్షలు దానధర్మాలు చేసిన నాయుడుగారు అంత్యదశలో మహా దారిద్ర్యం అనుభవించారు. వీరి కష్ట కాలాన్ని తెలుసుకొన్న పండిత మదనమోహన మాలవ్య, కాశీ హిందూ విశ్వవిద్యాలయానికి ఆహ్వానించి గౌరవ వ్యాయామ అధ్యాపకులుగా నియమించి పోషించారు. హిందూ విశ్వవిద్యాలయం ఆవరణలో నిర్మించిన శివాజీ హాలుకి నాయుడుగారి చేతనే ప్రారంభోత్సవం చేయించారు. మల్లవిద్య, ముష్టియుద్ధం బలప్రదర్శనాలలో తొలిసారి భారతదేశానికి విశేష ఖ్యాతిని సాధించిపెట్టిన ఆంధ్రయోధుడు శ్రీ నాయుడుగారు 1938 వ సంవత్సరం జనవరి 16 వ తేదీన (58 వ ఏట) విజయనగరంలో పరమపదించారు. 'కలియుగభీమ', 'ఆంధ్రవీర కంఠీరవ', 'జగదేకవీర,' 'మల్లరాజతిలక' అను బిరుదములు నాయుడుగారు పొందారు.

నాయుడుగారి శిష్యులలో శ్రీ రోళ్ళ సీతారామయ్య నాయుడు, శ్రీ పైడిరాజు గారలు ముఖ్యులు. నాయుడుగారి వద్ద తర్ఫీదుపొందిన ఉత్తరదేశస్థులు తమ పేర్ల చివర రామశబ్దం జోడించుకొని గురుపూజ చేసుకొన్నారు.

శ్రీ రోళ్ళ సీతారామయ్యనాయుడు :— జననం 1895. స్వగ్రామం కాకినాడ సమీపానగల తాళ్ళరేవు. శ్రీరామమూర్తి నాయుడు గారి శిష్యులు. వీరు భారతదేశమంతటా బల ప్రదర్శనాలు ఇచ్చి ఆంధ్ర దేశానికి విశేష ఖ్యాతి తెచ్చారు. రెండు కార్లను ఆపడం, రోడ్డు రోలర్‌ను రొమ్ముపై పోనిచ్చుకోవడం వంటి బలప్రదర్శనలు 1953 వరకు చేశారు. తూర్పు గోదావరిజిల్లాలో వ్యాయామ కళాభివృద్ధికి విశేషంగా కృషిచేసి వున్నారు.

శ్రీ పైడిరాజు :— స్వగ్రామం విజయనగరం. రామమూర్తి నాయుడుగారి శిష్యులు. విజయనగరంలో వ్యాయామశాల స్థాపించి శ్రీ ఆర్. సూర్యనారాయణవంటి యువకులను పైకి తీసుకొని వచ్చారు. భారతదేశమంతటా పర్యటించి రొమ్ముపై ఏనుగును ఎక్కించుకొనడం, రోడ్డు రోలర్‌ను రొమ్ముపైనుంచి పోనిచ్చుకొనడం వంటి ప్రదర్శనములు

చేసి ఖ్యాతిపొందారు ఇప్పటికీ వీరు ఆరోగ్యవంతులై వ్యాయామ ప్రచారం చేస్తున్నారు.

శ్రీ గత్రె వీరరాఘవ గుప్త:— ఆంధ్ర దేశంలో విశేషంగా వ్యాయామప్రచారం చేసిన ముఖ్యులలో శ్రీ గత్రె వీరరాఘవగుప్త గారు ఒకరు. 1897 ఏప్రిల్ 12వ తేదీన గుంటూరులో జన్మించారు. బాల్యంలోనే భక్తి వైరాగ్యములపై మనస్సు మళ్ళింది. రెండుసార్లు తపస్సుకని వెళ్ళగా బంధువులు తిరిగి పట్టుకువచ్చారు. 1924 లో తమ ఆస్తినంతా ధర్మముల పేర వ్రాసి అపకార్యాపహారియై, హిమాలయ పర్వతములకు తపస్సునకు వెళ్ళి, 681 మైళ్లు నడిచారు. హిమాలయా ప్రాంతాలలో ఇతరులకు సహాయం చేయబోయి మంచులోయలో పడగా అడవి జాతులవారు వీరిని రక్షించారు.



హిమాలయ పర్యటన ముగించి వచ్చిన పిమ్మట నిష్కామ్య సేవయే పరమావధి అని ఎంచి, ఆరోగ్యభాగ్యములకు సక్రమ వ్యాయామమే మూలాధారమని నమ్మి, ఆరోగ్యభాగ్యములో వెనుకబడివున్న వైశ్యకులములో వ్యాయామ ప్రచారం చేయ నారంభించారు. దక్షిణ, ఆంధ్ర, హైదరాబాద్ రాష్ట్రాలలో పెక్కు వ్యాయామసంఘాలు స్థాపించి, వ్యాయామశిక్షణ నిచ్చి వేలకొలది వ్యాయామ కళారాధకులకు గురువులుగా పూజింపబడుచున్నారు. 16 వ సంవత్సరంనుంచి నేటివరకూ వ్యాయామం చేస్తున్నారు. యోగ, వ్యాయామ, మల్ల, ముష్టి, జూజిట్సు, ధనుర్విద్య, కట్టి, కత్తి మున్నగు పెక్కు సాములూ, ఆసన ప్రాణాయామాది

పెక్కు విద్యలలో నిపుణత్వం సంపాదించారు. వీరికి 'వైశ్యభీష్మ,' 'వ్యాయామకళా ప్రపూర్ణ', 'అభినవ సవ్యసాచి', 'వ్యాయామ కళోద్ధారక సార్వభౌమ', 'వ్యాయామ విభూషణ' మున్నగు బిరుదములు కలవు. 17 సంవత్సరములనుంచి "వ్యాయామ కళ" పత్రిక నడుపుచున్నారు. వ్యాయామకళ గ్రంథాలయము, వ్యాయామ మహాసభలు స్థాపించినారు. 1947 లో కూడా హిమాలయ యాత్ర చేసివచ్చారు.

వీరి జీవితమంతయూ బ్రహ్మచర్యముతో గడుపుతున్నారు.

శ్రీ బులుసు రామజోగారావు :— శ్రీ కోడి రామమూర్తి నాయుడుగారి తర్వాత ఆకాలంలో చెప్పుకోదగ్గ బలాఢ్యులు వీరు. భారతదేశంలో పెక్కుచోట్ల బలప్రదర్శనములుచేసి ఆంధ్రులకు గౌరవం తెచ్చారు.

శ్రీ కమ్ముల అప్పన్న :— వీరు ఆంధ్రదేశంలో మల్లవిద్యా వ్యాప్తికి విశేషంగా కృషిచేసి వున్నారు. ఆంధ్రదేశంలో స్త్రీలకు వ్యాయామశాలలు చాలా తక్కువ. శ్రీ అప్పన్నగారు ఏలూరులో స్త్రీల కొకటి, పురుషుల కొకటి వ్యాయామశాలను ఇప్పటికీ నడుపుతున్నారు.

శ్రీ పాపోలు వీరవెంకయ్య :— మల్లవిద్యలో వీరు ఆంధ్ర దేశానికి విశేష ఖ్యాతి గడించారు. పంజాబు వస్తాదులను ఎందరినో జయించారు. 1956 లో 99 వ ఏట మరణించేవరకు నిండు ఆరోగ్యముతో వున్నారు.



శ్రీ వెంకయ్యగారు 1857 లో బందరులో జన్మించారు. విద్యాభ్యాస సమయంలోనే వ్యాయామం ప్రారంభించారు. బందరులో సయ్యద్ ఆలిగారివద్ద, తదుపరి శ్రీ కాశీం షరీఫ్ గారివద్ద మల్లవిద్యలో ఉన్నతశిక్షణ పొందారు. శ్రీ వెంకయ్యగారు తమ 21 వ సంవత్సరంలో శివజను పహిల్వానును ఓడించి వేశారు. ఇదే వారి ప్రథమవిజయం. 23 వ

సంవత్సరములో సైయద్ శిలార్‌ను పరాజితుని చేశారు. తదుపరి రంగూన్ ఉమర్, స్వామిదయాళు, పంజాబ్‌వస్తాదు లాల్‌సింగ్, ప్రభుదయాళ్‌లను ఓడించివేశారు. ఇక మల్లవిద్య ప్రచారమునకై బయలుదేరి హైదరాబాద్, బొంబాయి, కనోజ్, లక్నో, కాశీ, కలకత్తా, బరంపురంలలో పేరొందిన వస్తాదులను చిత్తుచేసివేశారు. ఆంధ్రదేశంలో కుస్తీ ప్రదర్శనములు జరిపి అనేక బహుమతులు, ఘంటా హస్తకంకణం, తోడాలు, "ఆంధ్రభీష్మ", "వీరకంఠీరవ" బిరుదులు పొందారు. తర్వాత ధార్వాడ, మీరజ్, కురుడ్‌వాడ్, అమృతసర్, లాహోర్‌లలో పెక్కు కుస్తీపోటీలలో పాల్గొని విజయాలను పరంపరగా సాధించారు. 40 వ సంవత్సరమువరకు మల్లవిద్యా స్పర్థలలో పాల్గొన్నారు. 40 వ ఏటనుంచి గురుస్థానము వహించి మల్లకళను పెంపొందిస్తూ వచ్చారు.

శ్రీ వెంకయ్యగారు మొత్తం 98 పెద్ద కుస్తీ పోటీలలో పాల్గొన్నారు. 93 లో గెలుపొందారు. రెండింటిలో ఓడిపోయారు మూడు పోటీలు ఎటూ పరిష్కారం కాలేదు.

శ్రీ ధవళ కూర్మనాథశర్మ :—(శ్రీ డి. కె. నాథ్). విజయనగరానికి రెండుమైళ్ళ దూరంలోవున్న తాళ్ళపురి వీరి జన్మస్థలం. విజయనగర కళాశాల పాఠశాలలో నాల్గవఫారం చదువుచున్నప్పుడు శ్రీరామజోగారావుగారి బలప్రదర్శనములు చూచి ముగ్ధులై వారంతటి బలవంతులు కావాలనే దీక్షతో వ్యాయామం ప్రారంభించారు. ఏకదీక్షతో యోగ పరిశ్రమ, ప్రాణాయామ సాధన చేశారు. 1922 లో కాశీవెళ్ళి వ్యాయామ ప్రచారం చేశారు. అక్కడ 40 మంది శిష్యులను తయారు చేశారు. 1924 లో రీవా సంస్థానంలో బలప్రదర్శనలు చేసి శరీర పరిశ్రమ ప్రాణాయామములలో అచ్చటి ప్రజలకు విశేషాసక్తి కలిగించారు. ఉదయపూర్, జయపూర్, జోధ్‌పూర్, బిన్స్వారా, ఇండోర్, భరత్‌పూర్, బూందీ, రాయపూర్, రాయఘుడ, గంగాపూర్, సోహాత్, శైలానా మున్నగు ఆ స్థానములలోనూ, మాళవ, కాశ్మీర, ఘూర్జర మండలములలోనూ సంచరించి యోగబల విశేషములను ప్రదర్శించి 'కలియుం

గాళిమన్య', 'దేశరత్న' 'ఇండియన్ యంగెస్ట్ శాండో' 'ఇండియన్ హెర్క్యులస్' బిరుదులను పొందారు.

శ్రీ డి. కె. నాథ్‌గారు మైసూరులోనూ, తదితరచోట్ల చేసిన బ్రహ్మాండమైన ఫీట్స్‌ను దిగువ పేర్కొంటున్నాను.

(1) నిండు బరువుగల మోటారుబస్సును వీపుపైనుంచి పోనిచ్చుకొనడం (2) $\frac{1}{8}$ అంగుళము మందము గల తంతీతీగను త్రెంచడం (3) $\frac{5}{8}$ అంగుళము దళము కల ఇనుప గడారును మెడమీదుగా వంచడం (4) మూడు టన్నులకు లోబడిన భారముకల రోడ్డురోలర్ నెదపై సాగనివ్వడం (5) 800 పౌనుల బరువుకల వస్తువును మెడతో ఎత్తడం (6) పాతిక అంగుళము మందముకల 'S' మార్కు గొలుసును భుజముల ఆధారమున త్రెంచివేయడం (7) ముప్పావు అంగుళము దళముగల ఇనుప గడారును వెన్నుపైనుండి వంచడం (8) 80 పౌనుల బరువును చిటికినవ్రేలుతో తలవరకూ ఎత్తడం (9) రెండు పేకట్ల చీట్లపేకలను ఒక్కసారిగా చించివేయడం (10) రొమ్ముపై ఏనుగను నిలపడం (11) 20 హార్స్ పవర్ గల మోటారుబండ్లు రెండింటిని ఒకేపర్యాయం ఆపడం.

వీరు 1936 నవంబరులో రాజమండ్రిలో పరమపదించారు.

డాక్టర్ అచంట లక్ష్మీపతి :— వయసు 77 సంవత్సరములు. వ్యాయామంచేత కుదిరినవ్యాధి తిరిగిరాదని, మందులవలన కుదిరిన రోగం తిరిగి రావచ్చుననే అభిప్రాయంతో వీరు దీక్షతో వ్యాయామ ప్రచారం సాగిస్తున్నారు. రోగులకు వారిరోగములకు తగినట్లుగా వ్యాయామపద్ధతులను నేర్పించి వారిని ఆరోగ్యవంతులను చేస్తున్నారు.

భారతదేశ వ్యాయామమును మొదట నిరసించిన శ్రీ బక్ అనే అమెరికా దేశస్థునికి (శ్రీ బక్ మద్రాసు వై. యం. సి. యే. వ్యాయామ కళాశాలలో లోగడ వున్నతపదవి వహించారు) దేశీయ వ్యాయామం శాస్త్రీయమని ఋజువుచేసినది శ్రీ లక్ష్మీపతిగారే. 1927 నుంచే వీరు వ్యాయామం నిష్ఠగా ప్రారంభించారు. వీరు ఇప్పటికినీ నిత్యవ్రతముగా వ్యాయామం చేస్తున్నారు. సంపూర్ణ ఆరోగ్యవంతులుగా వున్నారు.

రైలులో చాలాదూరం ప్రయాణంచేస్తున్నా కూడా నిత్యవ్యాయామం విడవరు. విమానంలో ప్రయాణంచేసేటప్పుడు కూడా వ్యాయామ సాధనాలను వెంట తీసుకవెళ్ళుతారు. శ్రీ కోడి రామమూర్తిగారు ఉపయోగించిన ఒక కరేళాను వీరికి, వారి శిష్యులు ఒకరు జన్మదినోత్సవంనాడు బహుమతిగా ఇచ్చినారట. వీరు ఈ కరేళాను మహాప్రసాదంగా యెంచి దానితోనే వ్యాయామం చేస్తున్నారు. సంపూర్ణ ఆరోగ్యం పొర్లి పోతున్న ఈ 77 సంవత్సరాల "యువకుడు" మృత్యువు అంటూ వున్నదా అని ప్రశ్నిస్తూ వుంటారు.

శ్రీ మోచర్ల శ్రీహరిరావు : జననం 1908 డిసెంబర్ 30. స్కూలు జీవితంలోనే దేశీయ వ్యాయామం ప్రారంభించారు. విదేశీయ



వ్యాయామ పద్ధతులకన్న దేశీయ వ్యాయామమే ఉత్తమోత్తమమైనదనీ, దానివలన సంపాదించిన ఆరోగ్యము, బలము మానవునిలో జీవితాంతం వరకూ వుండగలదనీ వీరి సిద్ధాంతము. 1933 లో ఏలూరులో జరిగిన దక్షిణ భారత కుస్తీ పోటీలలో వీరు ఛాంపియన్ షిప్‌ను, వెండి గదను పొందారు. 1934 లో మద్రాసు ఒలింపిక్ కుస్తీ పోటీలలో ఫెదర్ వెయిట్ వర్గములో ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొన్నారు. 1936 లో మద్రాసులో జరిగిన ఒలింపిక్ కుస్తీ పోటీలలో కూడా ఛాంపియన్ షిప్ సాధించారు. లాహోర్‌లో జరిగిన అఖిల భారత ఒలింపిక్ పోటీలకు ఎన్నుకోబడినారు. యోగాసనములను, యోగ వ్యాయామాన్ని కూడా అభ్యసించివున్నారు. 1937 లో ప్రపంచ విఖ్యాత మల్లయోధుడు గామా పహిల్వానును ఆంధ్ర, దక్షిణ ప్రాంతాలకు ఆహ్వానించి పర్యటనను జయప్రదం గావించారు.

శ్రీ శ్రీహరిరావుగారు కుస్తీ పోటీలలో అపజయమనునది ఎరుగరు. విజయపరంపర సాధించిన శ్రీహరిరావు పహిల్వాను శాకాహారి. శ్రీ శ్రీహరిరావుగారు గుంటూరు బ్రాడీపేటలో శ్రీ మారుతీ వ్యాయామ మండలిని స్థాపించి ఉచితముగ వ్యాయామశిక్షణ నిస్తున్నారు.

శ్రీ కొలిపాక ఆదినారాయణశర్మ (ప్రకృతి శర్మ) :— జననం 1915 ఏప్రిల్ 8 వ తేది. స్వగ్రామం గుంటూరు జిల్లా. స్కూలు విద్యార్థిదశలో తండ్రిగారి ఆధ్వర్యంలో దేశీయ వ్యాయామం అభ్యసించారు. 1935 మేలో ప్రకృతివైద్య పట్టాను (డాక్టర్ ఆఫ్ నాచురోపతి) పొందారు. 1949 నుంచి ప్రకృతిచికిత్స, యోగవ్యాయామ ప్రచారం జరుపుతున్నారు. విజయవాడలోని రామదాస్ నగర్‌లో ప్రకృతి ఆశ్రమం నిర్వహిస్తున్నారు. విజయవాడలో సూర్యోపాసన శిబిరాన్ని, న్యూఢిల్లీలోని లోడీ కాలనీలో యోగవ్యాయామ శిబిరాన్ని, నాందేడ్‌లో యోగవ్యాయామ మండలిని నిర్వహించారు. 1956 సెప్టెంబరు, అక్టోబరులలో విజయవాడలో అఖిలాంధ్రయోగ వ్యాయామపరిషత్తు ఆధ్వర్యాన నిర్వహించబడిన యోగవ్యాయామ విద్యాశిక్షణ శిబిరంలో దర్శకులుగా పనిచేశారు. విజయవాడలోని ఆంధ్రవ్యాయామశిక్షణ కళాశాలలో జాతీయ యోగవ్యాయామ కళాధ్యాపకులుగానూ, అఖిలాంధ్ర యోగ వ్యాయామ పరిషత్, ఆంధ్రప్రకృతి ధర్మపరిషత్‌లకు కార్యదర్శిగానూ పనిచేస్తున్నారు.

శ్రీ సజ్జా ముత్యాలుసెట్టి:— జననం 1905 వ సంవత్సరం ఫిబ్రవరినెల 17 వ తేదీ మద్రాసునగరంలో. బాల్యంలోనే వ్యాయామంలో ఆసక్తి కలిగింది. 1915 లో వీరూ, వీరి అన్నగారయిన శ్రీ సజ్జా చెంగల్వరాయసెట్టిగారూ, శ్రీ పమ్మి గోపాలుసెట్టిగారివద్ద వ్యాయామమునూ, సాము మున్నగు విద్యలను మొత్తం 7 సంవత్సరముల పాటు అభ్యసించారు. 21 వ సంవత్సరంలో మల్లవిద్యలో శిక్షణపొందారు. అదే వయస్సులో తిరిమెని అనే గ్రామంలో ఖాదర్ అనే ప్రఖ్యాత మల్లయోధుని 25 నిమిషాలలో ఓడించివేశారు. ఈ విజయంతో వీరికి మద్రాసు పరిసరాలలో పెద్ద పేరు వచ్చింది. తదుపరి చెంగల్పట్టుజిల్లా అంతటా వీరు తమ శిష్యబృందముతో కుస్తీ ప్రదర్శన లిచ్చారు.



రాయి వేసిన తగులకుండా కఱ్ఱత్రిప్పగల సామర్థ్యం పొందడానికై గురువును అన్వేషిస్తూ వీరు చిదంబరం, సియ్యాళి, కుంభకోణం, తంజావూరు, మధుర, సేతు రామేశ్వరం మున్నగు ప్రదేశములలో పర్యటించారు. అదే సందర్భంలో వ్యాయామ ప్రదర్శనలుకూడా ఇచ్చారు. 1927 లో రంగూన్ వెళ్ళి అచ్చటకూడా తమ విద్యను ప్రదర్శించి కీర్తి పొందారు. బర్మాలోకూడా కఱ్ఱనుత్రిప్పే సాధకులు వుండడం చూచినారు. వారితో సహా ప్రజ్ఞాప్రదర్శనం చేశారు. బర్మాలో నాలుగు నెలలు వున్నారు. 1929 లో బొంబాయిలో వ్యాయామ విద్యలో ఉన్నత రీతులు అభ్యసించారు. 1935 లో గుంటూరు మండలంలోని వేటపాలెం వచ్చి వ్యాయామ ప్రచారం ప్రారంభించారు. అనేక మల్లవిద్యా తదితర పోటీలలో పాల్గొని బహుమతులు పొందారు. నెల్లూరు మండలంలోని కందుకూరు, కృష్ణాజిల్లాలోని పెడన, తూర్పు గోదావరిజిల్లా మోరి, నెల్లూరుజిల్లా శింగరాయకొండ గ్రామాలలో వ్యాయామసంస్థలను స్థాపించారు. పై గ్రామములలో అనేక సన్మానాలు కూడా పొందారు. శ్రీ ముత్యాలుసెట్టిగారు వ్యాయామ విద్యకు చేసిన సేవకు ప్రశంసా చిహ్నంగా 1948 నవంబరులో మోరిగ్రామ పెద్దలు వారిని సన్మానించి బంగారు కడియమును, వెండికఱ్ఱను బహుకరించారు. శ్రీ ముత్యాలుసెట్టిగారు సికిందరాబాద్‌లోకూడా వ్యాయామ విద్యా ప్రచారంచేసి వున్నారు. మద్రాసు, గుంటూరు, నెల్లూరు, పశ్చిమ గోదావరి జిల్లాలలో వీరికి సాము, మల్లవిద్యలలో శిష్యులు వందల, వేల సంఖ్యలో వున్నారు.

శ్రీ ముత్యాలుసెట్టిగారు పండిట్ నెహ్రూ, శ్రీ త్రివేదీ, శ్రీ సంజీవరెడ్డి, శ్రీ గోపాలరెడ్డి వంటి పెద్దల సమక్షంలోనూ రాష్ట్రోత్సవాల వంటి ప్రధాన ఉత్సవాలలో విద్యాప్రదర్శనలు చేసి ప్రశంసా పత్రాలు పొందారు. వీరికి క్రింది విద్యలలో విశేష ప్రావీణ్యం కలదు.

వ్యాయామం :—దండెము, బస్కీలు, కర్ర, లోడి, సంత్వాల, డంలోన్, బాణ, చెడి, కత్తి, బాకు, సింగోటా, పట, తాడుపనులు, బాన్‌వెట్, 16 బంతుల చక్రబరాటా, 17 బంతుల అగ్గిబరాటా, 30 రింగులతో చిత్రమయిన పని, కుస్తీ, ముష్టియుద్ధం.

30 రింగులను దేహమున తగిలించుకొని తామరపువ్వు, కుర్చీ, పడకకుర్చీ, నాగపడిగ, బుట్ట, పువ్వులబుట్ట, పులితోకవంటి ఆకారాలలో శరీరమును వంచుటలో వీరిది పెట్టింది పేరు. వ్యాయామం తల్లివంటిదనీ, కుస్తీ రాజువంటి వాడనీ, ముష్టియుద్ధం మంత్రివంటి వాడనీ, కత్తులు, కఱ్ఱలు సైన్యంతో సమానమనీ వీటన్నింటిని నేర్చిన వారు మృత్యుదేవతతో యుద్ధంసల్పి విజయం పొందవచ్చుననీ వీరి అభిమతము. వీరి ముఖ్య శిష్యులలో ఒకరైన శ్రీ బుద్ది కోటీశ్వరుడు గుంటూరుజిల్లా అంతటా సాము విద్యలో పేరొంది బంగారు పతకములు పొందివున్నారు. శ్రీ ముత్యాలు సెట్టిగారు ప్రస్తుతం వేటపాలెంలోని శ్రీ హనుమత్ బల శాల వ్యాయామ సాముసంఘం గురువులుగా కీర్తింపబడుచున్నారు.

శ్రీ లంక సూర్యనారాయణ :— జననం 1927 కాకినాడ. విద్యాభ్యాస సమయములోనే వ్యాయామంలో అభిలాష కలిగింది. విశాఖపట్టణంలోని (కీ॥ శే॥) పసుమర్తి రాజుసెట్టిగారి వ్యాయామ శాలలో శిక్షణ పొందారు. 1949 లో కలకత్తాలో ఉద్యోగం చేస్తూ వుండగా అక్కడి కిదర్‌పూర్ వ్యాయామ సమితిలో దేశీయ వ్యాయామంలోను, వెయిట్ లిఫ్టింగ్ లోను తర్ఫీదు పొందారు. కలకత్తానుంచి కాకినాడకు తిరిగివచ్చినమీదట పురపాలకసంఘంచే ఒక వ్యాయామ సంస్థను నెలకొల్పించారు.

శ్రీ సూర్యనారాయణగారు 1954 లో గుంటూరు నేతాజీ సేవా సమితి నిర్వహించిన వ్యాయామ పోటీలలో పాల్గొని గంటకు 1851 దండెములు తీసి, ఆంధ్రరాష్ట్రమునకు రికార్డు నెలకొల్పారు. 1956 లో పాటియాలాలో జరిగిన జాతీయ పోటీలకు ఆంధ్ర కుస్తీజట్టు మేనేజర్‌గా వెళ్ళారు. అక్కడ కుస్తీ పోటీలకు జడ్జిగా వ్యవహరించారు.

శ్రీ ఆర్. జనార్దన్ :— జననం 1932. బాల్యములోనే వ్యాయామంలో అభిలాష కలిగింది. శ్రీ మోచర్ల శ్రీహరిరావుగారివద్ద గుంటూరులో యోగాసనములు, కుస్తీ, వ్యాయామము అభ్యసించి యోగాసనములలో ప్రత్యేక ప్రావీణ్యం గడించినారు. 1956 లో జరిగిన ఆంధ్రరాష్ట్ర వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో తన వర్గంలో ప్రథములుగా వచ్చివున్నారు.

పేరెన్నికగన్న మరికొందరు ఆంధ్రవస్తాదులు, వారి తరగతులు.

ఫ్లయివెయిట్ : శ్రీ ఇ. సూర్యఅప్పారావు; బాంటమ్ వెయిట్ : శ్రీ పి. గోపాలకృష్ణయ్య; ఫెదర్ వెయిట్ : శ్రీ బి. గోవింద సింగ్; లైట్ వెయిట్ : శ్రీ మహమ్మద్ పాషా; వెల్టర్ వెయిట్ : శ్రీ ఎమ్. సి. కేశవరావు (తూర్పుగోదావరి); హెవివెయిట్ : శ్రీ ఎస్. మోహనరావు, శ్రీ ఆర్. మునుస్వామి (నెల్లూరు); శ్రీ జి. సెల్వపిళ్ళాచార్యులు (బాపట్ల); శ్రీ సుందరరాఘవరాజ్.

శ్రీ మండవల్లి శాండో :— విజయవాడ వాస్తవ్యులు. పూర్తిపేరు మండవల్లి సత్యనారాయణమూర్తి. భారతదేశమంతటా బలప్రదర్శనములు చేసి "కలియుగ భీమ", "భీష్మాచార్య", "అభినవ బలరామ", "వ్యాయామ కళానిధి", "ఆంధ్రకేసరి" మొదలైన బిరుదములను పొంది వున్నారు.

వీరికి విశేషఖ్యాతి తెచ్చిన బలప్రదర్శనము లివి :—

(1) ఇనుప కడ్డీలను కండ్లకు పెట్టి వంచడం (2) ఇనుపకమ్మీని పండ్లతో వంచడం (3) బండిపట్టాను ఛాతిపైపెట్టి నరికించడం (4) బండి పట్టాకాల్చి, ఆర్పి, నెత్తిపైపెట్టి సాగగొట్టించడం (5) 1000 పౌనుల బరువుకల రాతిరోలు ఛాతిపైపెట్టి ధాన్యము దంచనివ్వడం (6) ఛాతిపై రోలుపెట్టి దానిపై పలకలువేసి 25 మందిని ఏక్కించడం (7) మూడు గడ్డపారలతో జడవేయడం (8) యోగసమాధి - 30 నిమిషములు భూమిలో వుండడం (9) మోకులతో బంధించిన శరీరమును విడిపించుకొనడం (10) ఛాతిపై వేల పౌనుల రాతిపై రాయిపెట్టి రాతిని పగులగొట్టించడం.

శ్రీ మండవల్లి శాండోగారు 1956 జూన్ 27 వ తేదీన విజయవాడలో పరమపదించారు.

శ్రీ నల్లగొండ రామచంద్రరావు :— యోగాసన ప్రవీణులు. జననం 1901 ఆగస్టు 27 వ తేదీ. వీరు ఆరంభంలో

ప్రొఫెసర్ యతిరాజు శ్రీనివాసులుగారివద్ద కొన్ని యోగాసనాలు అభ్యసించారు. పిమ్మట "ఆంధ్రవాల్మీకి" వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు) గారివద్ద పలురకములైన యోగాసనములు, ప్రాణాయామములు అభ్యసించారు. దక్షిణభారతదేశమంతటనూ యోగాసనములు ప్రదర్శించారు.

చైనా సందర్శించే ఒక భారత ప్రతినిధివర్గంలో వీరు ఎన్నుకోబడినారు. కొద్దికాలంక్రితం వీరు విజయవాడలోని సత్యనారాయణపురంలో సీతారామాంజనేయ యోగాసన వ్యాయామప్రచారక సంఘం స్థాపించారు. శ్రీ సీతారామాంజనేయ యోగాసన వ్యాయామ టూరింగ్ కళాశాలను కూడా వీరు నిర్వహిస్తున్నారు.

శ్రీ యశ్వంతసిన్హా :— వీరు ఆంధ్రదేశంలో ప్రథమ వ్యాయామ సభను శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారి ప్రోత్సాహముపై ఏర్పాటుచేశారు. "ఆంధ్ర ద్రోణ" శ్రీ ద్రోణంరాజు రామారావు పంతులుగారు ప్రారంభోపన్యాస మిచ్చారు. నూజవీడులోని ఉయ్యూరు జమీందారు శ్రీ వెంకటరంగయ్య అప్పారావుగారు అధ్యక్షత వహించారు.

శ్రీ సిన్హాగారు చిన్నతనములో బాపట్లలో శ్రీ ఆదూరి రాధాకృష్ణమూర్తి గారివద్ద వ్యాయామవిద్య నభ్యసించారు. తరువాత శ్రీ కోడిరామమూర్తి నాయుడుగారికి అంతరంగిక కార్యదర్శిగా ఉండి తమ విద్యకు కొత్తవన్నెలు దిద్దుకొన్నారు. బరోడాలో శ్రీ రాజరత్న, శ్రీ యశ్వంత, శ్రీ గజానన్ మాణిక్యరావుగారలవద్ద కూడా వ్యాయామ విద్య నభ్యసించారు. తదుపరి ఆంధ్రదేశమునకు తిరిగివచ్చి గుంటూరులోను, బెజవాడలోను హనుమత్ వ్యాయామ కళాశాలను స్థాపించారు. శ్రీ గ్రరె వీరరాఘవగుప్త ప్రభృతులు వీరివద్ద విద్య నభ్యసించివున్నారు.

శ్రీ యన్. కాంతారావు :— నెల్లూరు నివాసి. మల్ల విద్యా ప్రవీణుడు, యువకుడు. చెన్నరాష్ట్ర ఒలింపిక్ పోటీలలో ఒకసారి ప్రథమస్థానం వహించినారు. 1955 లో పోలెండులో జరిగిన యువజన క్రీడోత్సవంలో పాల్గొన్నారు. 1956 లో సింహళ యాత్ర చేశారు.

(శ్రీ) తూపాటి సుబ్బయ్య :— దేశీయ వ్యాయామ విద్యావేత్త. "సాముకళోద్ధారక" బిరుదాంకితులు. జననం 1912 జూలై 1 వ తేదీ, వెంకటగిరి టౌన్. వంశపారంపర్యంగా వస్తున్న సామువిద్యను 1930 లో అభ్యసించారు. 1938 లో చెన్నపట్టణంలో రాజప్రతినిధి సమక్షమున తన విద్యను ప్రదర్శించి మెప్పు పొందారు. దరిమిలా గూడూరు ఫిర్కాలో అనేక వందలమందికి సాము విద్య నేర్పారు. 1944 లో చీరాల (దేవాంగపేట) గ్రామంలో విశ్వవిశారద వ్యాయామ సంఘం స్థాపించారు.

(శ్రీ) మానుకూరు రంగయ్య :— దేశీయ వ్యాయామ విద్యావేత్త. "సాముకళా కేసరి" బిరుదాంకితులు. జననం 1914 నవంబర్ 10 వ తేదీ. ప్రస్తుత నివాసం వెంకటగిరి టౌన్‌లోని బంగారుపేట గ్రామం. 1930 లో శ్రీ తూపాటి కొండయ్యగారి గరిడీలో చేరి సాము విద్య నభ్యసించారు. 1938 లో మద్రాసులో రాజప్రతినిధి సమక్షంలో తమ విద్యను చూపి ప్రశంస పొందారు. తదనంతరం గూడూరు, బ్రహ్మదేవి, ముత్తుకూరు, గోపాలపురం (నెల్లూరుజిల్లా), చీరాల దేవాంగపేట మున్నగుచోట్ల సామువిద్యను అనేకమందికి నేర్పినారు.

(శ్రీ) మానుకూరు వెంకటసుబ్బయ్య :— సామువిద్యలో దిట్ట. జననం 1924 ఏప్రిల్ 12. వెంకటగిరిటౌన్ బంగారుపేటగ్రామంలో. శ్రీ తూపాటి కొండయ్యగారి గరిడీలో 1935 లో సామువిద్య నభ్యసించారు. 1938 లో చెన్నపురిలో రాజప్రతినిధి యెదుట విద్య ప్రదర్శించి మన్నన లందుకొన్నారు. 1940 నుంచి సామువిద్యా ప్రచారానికి కృషిచేస్తూ వున్నారు.

దేశీయ వ్యాయామంలో ఇంకా క్రింది యువకులు ఆంధ్ర, మద్రాసు రాష్ట్రాలలో పేరు గడించివున్నారు :—

శ్రీయుతులు కర్ణ పేర్లింగం, కర్ణ వెంకటసుబ్బారావు, ఆళవు సత్యనారాయణ, కర్ణ నాగేశ్వరరావు, చల్లా వెంకటేశ్వరరావు, పేర్నేటి సుబ్రహ్మణ్యం, కర్ణ వెంకటేశ్వరరావు, కర్ణ మల్లిఖార్జున

రావు, బొడ్డు వెంకటసుబ్బారావు, సజ్జా కోటినాగేశ్వరరావు, మాచర్ల కోటిసుబ్బారావు.

(శ్రీ) గామా :— వయస్సు షుమారు 63 సంవత్సరాలు. పాటియాలా సంస్థానంలో మల్లవిద్యాయోధునిగా పైకివచ్చి "రుస్తుమ్ ఏ జమాన్", "పంజాబ్ కేసరి" వంటి బిరుదులను సాధించారు. భారతదేశవిభజన పిమ్మట జరిగిన మతకలహాలలో వీరు పాకిస్తాన్‌కు వెళ్ళిపోయినారు. ఇండియన్, గ్రీకోరోమన్, అమెరికన్ ఫ్రీస్టయిల్, జూజిట్సు మున్నగు మల్లవిద్యారీతు లన్నింటిలోనూ ఉద్దండుడు. "ఏక్ లంగోటీ" పద్ధతి కుస్తీలో వీరిది పెట్టింది పేరు. ఈ విద్యను వీరు విదేశాలలోకూడా ప్రదర్శించారు. ఈ పద్ధతి కుస్తీలో ప్రత్యేకత అయిదుగురి మల్లయోధులతో పోటీచేసి నిర్ణీతకాలంలోనే ఓడించడం. గామా అరగంటలో అందరినీ ఓడించేవారు. అయిదుగురు యోధులు గోదా అంచునే వుంటారు. ఒకరి తర్వాత ఒకరిని వెంట వెంటనే మొత్తం అరగంటలో చిత్తుచేశారన్నమాట. మొదటి జెట్టీని ఓడించడానికి 25 నిమిషాలు పట్టిందనుకోండి. మిగతా



నలుగురిని మిగిలిన 5 నిమిషాలలోనే ఒకరి తర్వాత ఒకరిని చిత్తుచేయాలి. ఈ అద్భుత మల్ల విద్యా ప్రదర్శనాన్ని ప్రపంచములోకెల్ల ఒక్క గామాయే చేయకలిగేవారని అవిభక్త భారతదేశంలో చెప్పుకొనేవారు. 1937 లో వీరు ఆంధ్రదేశంలో మల్లవిద్యా ప్రదర్శన లిచ్చారు. 33 సంవత్సరాలుగా తాను వహించివున్న "రుస్తుమ్ ఏ జమాన్" బిరుదుకు ఎవ్వరూ సవాలు చేయలేదని గామా వాదిస్తున్నారు. 63 ఏండ్ల వృద్ధునితో సవాలుచేయించడం భావ్యంకాదని ఇండియన్ రెజ్లింగ్ ఫెడరేషన్ భావిస్తున్నది.

ఇండియాలో ఇటీవల పర్యటించిన పోలిష్ జెట్టీ శ్రీ జిబిస్కో అన్నగారు శ్రీ జిబిస్కో సిగన్నెవిజ్ (సీనియర్), గామాలు 1910 సెప్టెంబర్‌లో లండన్‌లో మూడుగంటలసేపు పోరాడినా విజయము ఎవ్వరికీ దక్కలేదు. ఆ కాలంలో శ్రీ జిబిస్కో (సీనియర్) ప్రపంచంలో కెల్ల అద్వితీయ మల్లయోధునిగా పరిగణించబడినాడు. నాటి పోటీ గురించి శ్రీ జిబిస్కో చెస్నోకోవ్ అనే సోవియెట్ రచయితకు చెప్పిన క్రింది విషయాలు వస్తాదుగా గామా ఘనతను విస్పష్టం చేస్తవి.

"1910 సెప్టెంబర్ ప్రాంతాల కొంతమంది భారతీయ మల్లవిద్యా ప్రవీణులు బ్రిటన్ వచ్చారు. "పంజాబ్ కేసరి" గామా వారికి నాయకుడు. ఫ్రీస్టయిల్ (కేచ్‌ఏజ్ కేచ్‌కెన్) కుస్తీకి రమ్మని యూరోపియన్ వస్తాదు లందరికీ గామా సవాలు చేశాడు. నేనీ సవాలును అందుకోక తప్పిందికాదు. మా యిద్దరి పోటీకి కాలపరిమితి నిర్ణయించబడలేదు. మొత్తం మూడుసార్లలో రెండుసార్లు చిత్తు చేయించినవారు విజయ మొందినట్లు. నాకు తెలిసినంతవరకు గామా ప్రతిరోజూ తనతోటి వస్తాదులతో రెండుగంటలసేపు అభ్యాసం చేసే వాడు. ఆయన బసచేసిన హోటలువిడిచి బయటకు వెళ్ళేవాడు కాదు. ఒక క్రొత్త లండన్ స్టేడియమ్‌లో మా కుస్తీపోటీ ఏర్పాటుచేయ బడింది. 15,000 మందికి పైగా ప్రేక్షకులను అది ఆకర్షించింది. ఇంత జనం అంతకుముందు ఏ పోటీకి రాలేదు.

నేను ముందూ, తర్వాత గామా గోదాలోకి వచ్చాము. ఆయనది తురుష్కులవలె భయంకరాకారం కాదు. రష్యను వస్తాదులవలె ఆజాను బాహు కాడు. బలసిన, నున్నటి కండరాలలో దాగివున్న ఆయన శక్తిని ఎవరైనా గమనించగలడు. నేను ఎన్నడూ నా పోటీదారుల బలంచూసి భయపడలేదు. ఎందుచేతనంటే నా దండ (జబ్బ) మామూలు మనిషి తొడ పైభాగంఅంత లావుగా వుండేది. గామా శరీరావయవాలు అంత పెద్దవిగావు. కాని ఆయన భుజాలు గుండ్రంగా మాంచి బలంతో వుండేవి.

ప్రారంభంలో గామా నావైపు ఒక్కసారైనా కన్నెత్తి చూడ లేదు. రిఫరీ ఈల వెయ్యగానే మేము గోదా మధ్యకు వచ్చాము.

కరచాలనం చేసుకొన్నాము. గామా బలంగా కరచాలనం చేసినట్లు కనిపించలేదు. కాని ఆయన చేతి బరువు నా కాశ్చర్య మేసింది.

ప్రారంభంనుంచే కుస్తీ హోరాహోరీగా సాగింది. నన్ను మోకాళ్ళమీద కూర్చోబెడేటట్లుగా పడద్రోయగల ప్రతికక్షి అంతకు ముందుగాని, ఈకుస్తీ తరువాతగాని నాకెక్కడా తలపడలేదు. కాని నేనిక్కడో కొత్తవిషయం చూశాను. గామా నన్ను మూడుసార్లు అవిధంగా పడవేశాడు. ఏదో కనబడని కదలికతో, శరీరభారమంతా ఒకప్రక్కకు కేంద్రీకరించి ఒక గట్టి ఊపుతో చేతు లేవో చేశాయి. అంతట నేను నాకాళ్ళక్రింద బాలెన్సుతప్పి మోకాళ్ళమీద పడ్డాను. అలా మూడుసార్లు నన్ను గామా పడత్రోశాడు. మరి లేవడానికి ప్రయత్నించకూడదని అనుకొన్నాను. గామా నామీదపడి పట్టుపట్టనిచ్చాను. గామా తన శరీరబరువు నంతనూ, శక్తినంతనూ పూర్తిగా వుపయోగించుకొని నాపై అద్భుతమైన పట్లు ప్రదర్శించాడు. ఆయనమీద నేను ఆధిపత్యం వహించాలని, ఆయనను నాక్రింద అణచివుంచాలని నేనెంతో ప్రయత్నించాను. ఇంతశరీరం కలవాణ్ణి భారతీయ వస్తాదును నాక్రింద పట్టివుంచలేకపోయాను. గామా రబ్బరులా వుండేవాడు. ఆయన కాళ్ళకూ, చేతులకూ ఎముకలు లేనట్లు అనిపించింది. అవి నాచేతులలోంచి విచిత్రంగా జారిపోయేవి. నా ప్రయత్నాలన్నీ నిష్ఫలమయ్యేవి. ప్రేక్షకులు నవ్వేవారు. నాకు చాలా కోపం వచ్చింది. ఇక మంచీ చెడ్డా ఆలోచించకుండా కసితో ప్రతికక్షి పట్లను కాసుకోడం మొదలుపెట్టాను. ఇంకొక్కమారు గామా నన్ను గట్టిగా పట్టుకోడానికి అవకాశమిస్తే ఇక నాపుట్టి మునిగిందన్నమాటే.

ఒక గంటసేపు కుస్తీ జరిగాక నేను గామాను పైకెత్తి క్రిందకు పడవెయ్యకలిగాను. ఇలా చేస్తానని ఆయన వూహించి వుండడు. ఆయన కుప్పలా కూలి వుంటాడని, ఆయన ఓడిపోయినట్లేనని నేననుకొన్నాను. కాని జడ్జీ యింకోవిధంగా భావించారు. మళ్ళీ కుస్తీ, పట్లులేకుండా సాగింది. తరువాత చీకటిపడడంవల్ల పోటీ నిలిపివేయబడింది. మొత్తం కుస్తీ పోటీ మూడుగంటలు జరిగింది. నా జీవితంలో ఇంత కష్టమైన కుస్తీ నేనెప్పుడూ పట్టలేదు. గామా నిజంగా "పంజాబ్ కేసరి" బిరుదుకు అర్హుడని నేను గుర్తించాను."

తర్వాత కారొనేషన్ సమయంలో ఈజిబిస్కో (సీనియర్) ఇండియాకు ఆహ్వానించబడినారనీ, అప్పుడు గామాకు, వీరికి తిరిగి కుస్తీ పోటీ జరుగగా గామా కొద్దిక్షణాలలో అఖండవిజయం పొందినారనీ చెప్పుకొన్నారు.

గామా ముఖ్యశిష్యుడు ఇమాంబక్స్ కూడా ప్రపంచ ప్రసిద్ధ జెట్టీ. గామా కుమారుడు యాసమ్ కూడా పేరొందిన వస్తాదు. ఈయనా ఇమాంబక్స్ కుమారుడు ఆజామ్ పహిల్వాన్, ఇమాంబక్స్ సోదరుడు హుస్సేనా పాకిస్తాన్ లోనే స్థిరపడిపోయినారు.

శ్రీ జోగిందక్ సింగ్ :— ఇప్పటి భారతీయ వస్తాదులలో అద్వితీయుడు జోగిందర్ సింగ్. పంజాబ్ కు చెందిన ఈ జెట్టీ వయసు





దాదాపు 36 సంవత్సరాలు. 1953 ప్రాంతాల అమెరికాలో పర్యటించారు. అప్పుడు ప్రపంచ ఛాంపియన్ (ఫ్రీ స్టయిల్ లో) లూయిస్ థోయిజ్ తో పోటీచేసి ఆయనను మూప్పతిప్పలు పెట్టారు.

శ్రీ జోగిందర్‌సింగ్ ఇండియన్, అమెరికన్ ఫ్రీస్టయిల్ తరగతి కుస్తీలలో ఘటికుడు. 250 పౌనుల బరువు, ఐదు అడుగుల 11 అంగుళాల ఎత్తు ఉండి ఉక్కుమనిషిలా చిరునగవుతో వుండే జోగిందర్ తన తలతో ఎదుటి జెట్టీ తల బ్రద్దలుకొట్టి, రొమ్ముచీల్చి పౌరుషంతో వెంబడించి "టైగర్" బిరుదు పొందారు. వీరి శిరస్సు ఇనుప గుండుకంటె గట్టిది. కింగ్ కాంగ్ అంతటివారే వీరి తల దెబ్బలకు అల్లాడిపోయారు. "తాచుపాము పట్టుతో" జోగిందర్ సింగ్ ఫ్రీస్టయల్ కుస్తీలో ప్రపంచ ప్రసిద్ధుడైనారు. ఎదుటి జెట్టీని అలసట పెట్టి అతడి మెడను త్రికోణాకార హస్తంలో బిగించి ఊపి ఊపి పడవేస్తే ఇక ఆజెట్టీ కొన్ని నిమిషాలవరకు తెప్పరిల్లలేడు. ఆవిధంగా ఆయన నాక్ ఔట్ విజయాలు సాధిస్తారు.

శ్రీ హర్బాన్స్‌సింగ్ :— విదేశాలలో మల్లయుద్ధంలో భారతీయ ఖ్యాతిని చాటినవారిలో గామా తర్వాత చెప్పదగిన వ్యక్తి



శ్రీ హర్బాన్స్‌సింగ్ (నిలుచుని వున్నవారు). జననం 1912 డిసెంబర్ 2, పంజాబ్ రాష్ట్రంలోని రాయ్‌పూర్ డబ్బాలో. బాల్యంలో చాలా బలహీనంగా వుండేవారు. వీరి తండ్రి న్యూజిలెండ్‌లో స్థిరపడ్డారు. తొమ్మిదవ ఏట హర్బాన్స్ న్యూజిలెండ్ వెళ్ళారు.

అక్కడ 14 వ ఏటనుంచి ముష్టియుద్ధం పోటీలలో పాల్గొన్నారు. 1927 ప్రాంతాల ఇండియాకు (పంజాబ్) తిరిగివచ్చి శ్రీ కిషన్ సింగ్ వద్ద మల్లవిద్య నభ్యసించారు. తర్వాత న్యూజిలెండ్ వెళ్ళారు. మల్లవిద్యలో ఉన్నత శిక్షణ పొందడం నిమిత్తం తిరిగి 1931 లో పంజాబ్ వచ్చారు. జలంధర్ కు చెందిన శ్రీ అల్లాబక్ష్ వద్ద 2, 3 సంవత్సరాలు ఇండియన్, ఫ్రీస్టయిల్ కుస్తీలు రెండింటిలోను తీవ్రమైన తర్ఫీదు పొందారు.

1934 లో విదేశానికి తిరిగి వెళ్లారు. దరిమిలా ఆస్ట్రేలియా, న్యూజిలెండ్, ఫిజీదీవులు, ఫిలిప్పీన్స్, చైనా, బ్యాంగ్ కాక్ లలో అనేక పోటీలలో పాల్గొని విజయమందారు. 1934 లో ఆస్ట్రేలియా ఫ్రీస్టయిల్ కుస్తీ ఛాంపియన్ షిప్ ను, 1935 లో బ్రిటిష్ ఎంపైర్ ఛాంపియన్ షిప్ ను సాధించారు. 1937 లో న్యూజిలెండ్ లోని మనునుయి కేకు వచ్చారు.

ఆదే సంవత్సరంలో ఇండియాకు ఆహ్వానించబడి పెక్కు ఫ్రీస్టయిల్ కుస్తీ పోటీలలో పాల్గొన్నారు. 1937 లో మద్రాసు వచ్చినప్పుడు గామాకు సవాలు పంపారు. అయితే హార్బ్యాన్స్ సవాలును గామా త్రోసివేశారు. 1938 మే లో మద్రాసు ఎస్ప్లనేడులోని వై. యమ్. సి. ఏ. లో జరిగిన భారత ఛాంపియన్ షిప్ (రుస్తుమ్-ఏ-హింద్) పోటీలలో పాల్గొని యూరప్ లో కెల్ల అజేయుడుగా పరిగణించబడిన కింగ్ కాంగ్ ను ఓడించి "రుస్తుమ్-ఏ-హింద్" బిరుదును పొందారు. ఈయనపట్టు అన్నింటిలోకి "ఇండియన్ డెత్ లాక్" ప్రసిద్ధమయినది. ఎదుటి జెట్టీ మోకాళ్ళను పీటముడిగా చుట్టి దానిమధ్య తన కాలును ఇరికించడం ఈ పట్టు రీతి.

(శ్రీ) దారా సింగ్ :—ఫ్రీస్టయిల్ కుస్తీపోటీలో భారత దేశానికి ఏనాటికయినా ప్రపంచ ఛాంపియన్ షిప్ సాధించగల ఇద్దరిలోనూ శ్రీ దారా సింగ్ ఒకరు. ఇంకొకరు శ్రీ జోగిందర్ సింగ్. ఇండియన్, ఫ్రీస్టయిల్ రెండింటిలోనూ వీరు నేర్పరి. జననం 1929, పంజాబు రాష్ట్రంలోని అమృత్ సర్ జిల్లాలోని 'ధరమ్ చాక్' అనే గ్రామం. తొమ్మిదవ ఏటనుంచి వీరు కుస్తీ అభ్యసించారు. తరువాత అమృత్ సర్ లో

ప్రఖ్యాత భారతీయ వస్తాదు శ్రీ హర్నామ్‌సింగ్ వద్ద రెండేళ్లు ఇండియన్ స్టయిల్ కుస్తీలో శిక్షణ పొందారు. "పంజాబ్ సింహం"గా గణుతికెక్కిన మంగల్ సింగ్‌ను ఓడించి దేశప్రసిద్ధు లైనారు. 1947 ప్రాంతాలలో హర్నామ్‌సింగ్ తోపాటు సింగపూర్ వెళ్ళి భారతీయ పద్ధతిలో జరిగిన కుస్తీ పోటీలలో పాల్గొనినారు. అప్పుడే అమెరికన్ ఫ్రీస్టయిల్ కుస్తీపై దృష్టి పడింది. 1948 నుంచి ఫ్రీస్టయిల్ కుస్తీలో శ్రీ హర్నామ్‌సింగ్ వద్దనే శిక్షణపొంది ఒక్క సంవత్సరంలోనే ప్రవీణత పొందారు. 1949 నుంచి 1952 వరకూ దాదాపు 400 మందితో అమెరికన్ పద్ధతిలో కుస్తీపట్టి పెక్కు సందర్భాలలో ఘన విజయాలు సాధించారు. ఆస్ట్రేలియా, న్యూజిలెండ్, సయాం, బర్మా, ఇండోనీసియా, మలయా, లంకలలో పర్యటించి ప్రదర్శన లిచ్చారు. అనేకమంది ముసుగు వీరులను వీరు ఓడించారు. నవ్వుతూ, సునాయాసంగా, న్యాయంగా, మెళ్ళకువలను దిగకుండా పోటీచేయడం వీరి ప్రత్యేకత. ఎదుటి జెట్టీని నిలువెత్తు ఎత్తి గిరగిర త్రిప్పి (ఏరోప్లేన్ స్పిన్) క్రిందపడవేసి 'నాకౌట్' చేయడం వీరి విశిష్ట విధానం.



## మెల్బోర్న్ ఒలింపిక్స్ ప్రతినిధులు

1956 నవంబర్, డిసెంబర్‌లలో జరిగిన 16వ ప్రపంచ ఒలింపిక్ పోటీలలో క్రింది వస్తాదులు ఇండియా ప్రతినిధులుగా పాల్గొన్నారు.

శ్రీ కేసర్‌సింగ్ : వయస్సు 34 సంవత్సరాలు. ఆరడుగుల మూడంగుళాల ఎత్తుగల ఈ వ్యక్తి ఇండియా జట్టుకు శిక్షకుడు; బక్షీష్‌సింగ్ : వయస్సు 32 సంవత్సరాలు. మిడిల్ వెయిట్ వర్గానికి

చెందినవారు. నేషనల్ లైట్ హెవీవెయిట్ ఛాంపియన్; శ్రీ రామ్ స్వరూప్ – (ఫెదర్ వెయిట్), శ్రీ టి. పాండే (బాంటమ్ వెయిట్), శ్రీ దేవీసింగ్ (వెల్టర్ వెయిట్), శ్రీ లక్ష్మీకాంతపాండే (లైట్ వెయిట్), లీలారామ్ (హెవీవెయిట్), శ్రీ బి. డి. ద్వారే (ఫ్లయ్ వెయిట్).

(శ్రీ) కింగ్ కాంగ్ :—వయస్సు షుమారు 46 సంవత్సరాలు. ప్రాచ్య ఖండంలోను, ఒకప్పుడు యూరప్‌లోను అజేయుడుగా పరిగణించబడినారు. ఈ ఫ్రీస్టయిల్ జెట్టీ సాధారణంగా 400 పౌన్ల బరువు ఉంటారు. జననం హంగేరీలో 1910 లో. ఎనిమిదేండ్ల బాలుడప్పుడు స్టంటు సినిమాలు చూసి వాటి నాయకులవలె తాను బలశాలి కావలెనని తీర్మానించుకొన్నారు. తొమ్మిదవ ఏట బుడాపెస్టులోని జిమ్నాషియమ్‌లో చేరి వ్యాయామం ప్రారంభించారు. 18 వ ఏట 1928 లో అమ్‌స్టర్‌డామ్‌లో జరిగిన ప్రపంచ ఒలింపిక్ పోటీలలో హంగిరీ తరఫున పాల్గొని రజతపతకం సంపాదించారు. మరి ఆరునెలలకు కుస్తీ వృత్తిగా స్వీకరించారు. వీరి అసలు పేరు ఎమిలీజియా. 1932 లో కైరోలో 'ఏప్' అనే ఆంగ్లచిత్రం చూచారు. అందులో కింగ్ కాంగ్ అనే భీమబలపాత్రవుంది. ఆపాత్ర పేరునే తను పెట్టుకున్నారు. వీరు మూడు పర్యాయాలు ప్రపంచ పర్యటన చేశారు. ఆరడుగుల ఒక అంగుళం ఎత్తు, 60 అంగుళాల ఛాతీవున్న కింగ్ కాంగ్ కు బాడీ ప్రెస్ పట్టు (ఎదుటి జెట్టీ ఛాతీపై వెల్లికిలాపడి ఆయన రెండు భుజాలు నేలకు అన్పింపచేయడం) ఘనవిజయాలు సాధించింది. వీరు సింగపూర్‌లో స్థిరపడ్డారు. 45 ఏండ్లు నిండగానే కుస్తీపోటీలనుంచి విరమించారు (266 వ పేజీ బొమ్మలో పరుండివున్న వ్యక్తి కింగ్ కాంగ్).

# అధ్యాయము 10

# క్రికెట్

క్రికెట్ కామన్‌వెల్త్ క్రీడగా, క్రీడలలో కెల్ల రాజుగా పరిగణించబడుతున్నది. కొద్దిసంవత్సరాలక్రితంవరకూ, క్రికెట్ ఆటలో ఆస్ట్రేలియా ప్రపంచంలో కెల్ల ఆధిపత్యం వహించినప్పటికి కొలది సంవత్సరాల నుంచి బ్రిటన్ ఆస్ట్రేలియాను త్రోసి రాజని అగ్రపీఠాన్ని అలంకరిస్తున్నది. బ్రిటన్, ఆస్ట్రేలియా టెస్టు పరంపరలో అంతిమ విజయాన్ని బ్రిటన్ తిరిగి సాధించుకొన్నది.



కామన్‌వెల్ రాజ్యాలయిన బ్రిటన్, ఇండియా, పాకిస్తాన్, సింహళం, న్యూజిలెండ్, దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియాలలోనూ, వెస్టిండీస్‌లోనూ క్రికెట్ బహుళ ప్రచారంలో వున్నది. అమెరికా క్రికెట్‌లో చాల వెనుకబడి వున్నది. అక్కడ "ఓవర్"కు ఎన్ని బంతులో చాలామందికి తెలియదట. అక్కడ బాస్కెట్‌బాల్, బేస్‌బా జాతీయ క్రీడలగా ప్రచారమయినకొలదీ క్రికెట్ విలువ తగ్గిపోయినది. కమ్యూనిస్టు రాజ్యాలలోనూ పశ్చిమ యూరప్‌లోనూ క్రికెట్ అంతగా అభివృద్ధిచెందినట్లు కనుపించదు.

ఇటీవలి సంవత్సరాలలో క్రికెట్ రంగంలో పాకిస్తాన్ త్వరితగతిని ఖ్యాతిలోనికి వస్తున్నది. 1956లో పాకిస్తాన్‌లో పర్యటించిన ఆస్ట్రేలియా క్రికెట్ జట్టును పాకిస్తాన్ సునాయాసంగా ఓడించివేయడం ఇందుకొక నిదర్శనం. మన్‌కడ్, మర్చెంట్, సి. కె. నాయుడు

వంటి క్రికెటీర్లను పాకిస్తాన్ సృష్టించకపోయినప్పటికీ క్రమపద్ధతిలో క్రికెట్ వ్యాప్తికి, ఆ ఆటలో ప్రావీణ్యాభివృద్ధికి పాటుబడుతున్నందువల్ల ప్రపంచ క్రికెట్ పటంలో పాకిస్తాన్ ముద్ర నెలనెలకు బలమవుతున్నది. న్యూజిలెండ్, ఎమ్. సి. సి. "ఏ" (బ్రిటన్) క్రికెట్ జట్లను పాకిస్తాన్ సునాయాసంగా ఓడించి వేయకలిగింది. తొమ్మిదేండ్లలో పాకిస్తాన్ ఇంతటి ప్రమాణాన్ని అందుకోడానికి కారణం ఏటా అయిదుగురు లేక ఏడుగురికి లండన్‌లోని "ఆల్ఫ్ గోవర్" స్కూలులో క్రికెట్‌లో ఉన్నత శిక్షణ నిప్పించడమే. 15, 17 సంవత్సరాల మధ్యవయస్సుగల క్రికెట్ ఆటగాళ్ళను అక్కడకు పంపి ఉత్తమ క్రికెట్‌కు పాకిస్తాన్ గట్టి పునాదులు వేస్తున్నది.

ఇండియా ఈ మార్గాన్ని అనుసరించదలచలేదు. మనకు ఫాస్ట్ బౌలర్లు తగినంతమంది లేరు. ఉన్న స్పిన్ బౌలర్లు ఫజల్ మహమ్మద్ (పాకిస్తాన్), ఖాన్ మహమ్మద్ (పాకిస్తాన్) లవలె ప్రతి పోటీలోనూ విడవక ఉన్నతస్థాయి ప్రావీణ్యాన్ని చూపలేకపోతున్నారు. ఇండియాలోని పెద్ద బలహీనత ఇదే. ఆస్ట్రేలియన్ ఆటగాళ్ళలో దాదాపు ప్రతి ఒక్కరూ బ్యాటింగ్‌లోనూ, బౌలింగ్‌లోనూ, ఫీల్డింగ్‌లోనూ నిపుణులు. కాని ఇండియాలో ఎక్కువమంది పై మూడు శాఖలలో ఒకటి రెండింట్లలో మాత్రమే దిట్టలు. కర్నల్ సి. కె. నాయుడుగారు చెప్పినట్లు యువ క్రికెటీర్లనయినా సర్వతోముఖ ప్రతిభాశాలురుగా తయారుచెయ్యనిదే ఇండియాకు క్రికెట్‌లో ఉజ్జ్వల భవిష్యత్తు ఉండబోదు.

క్రికెట్ పుట్టుపూర్వోత్తరాలు :— క్రికెట్ ఆట ట్యూడర్ల కాలంనుంచీకూడా (1485 నుంచి 1603 మొట్టమొదటి బ్రిటిష్ ట్యూడర్ ప్రభువు ఏడవ హెన్రీ) ఆడబడుతున్నప్పటికీ 17 వ శతాబ్దం చివరివరకూ కూడా ఇది కేవలం పిల్లల ఆటగానే గుర్తింపులేకుండా వున్నది. 1744 వరకూ ఆటకు నియమాలు లేవు. బ్యాటు, కూరలుతరిగే చాకు ఆకారంలో ఉండేది. నేల గట్టిగా ఉండేదికాదు, గతుకులు వుండేవి. బౌలర్ చేతిని క్రిందుగా పెట్టి క్రిందినుంచి బంతి వికెట్లకేసి కొట్టేవాడు.

క్రమేణా 'పిచ్' (బౌలర్ ముందుస్థలం) గట్టిచేయబడింది. బ్యాటుకు ఒక ఆకారమంటూ అమలులోకి వచ్చింది. ఈ రెండింటితో బౌలర్ తన బంతిని బౌండ్ వేసి వికెట్‌ను పడగొట్టే ప్రయత్నం ప్రారంభించాడు. ఆసమయంలోనే బ్యాట్స్‌మన్‌ను తికమకపరచడంకోసం బౌలర్ బంతిని సుడిత్రిప్పి (స్పిన్) వేసేవాడు. చేతిలో బంతి పట్టుకొని, బారచాపి, గిరగిర (అడ్డంగా) త్రిప్పి బౌలుచేసే పద్ధతి 1835 నుంచి ఒక నియమంగా అంగీకరించబడింది. దీనితో బౌలర్‌కు వేగము, విసురుశక్తి వృద్ధిచెందుతూ వచ్చినవి. ఆ రోజులలో రెండు వికెట్లతోగాక ఒక వికెట్‌తోనే ఆడేవారు. 'ఫార్వర్డ్ ప్లే' మాత్రం ప్రచారంలో వుండేది. మరికొంత కాలానికి రెండు వికెట్లతో ముందుకువెళ్లి తిరిగివచ్చే పద్ధతి అమలులోకి వచ్చింది. బంతి చేతపట్టి తల పైకెత్తి విసురుగా బౌలుచేయడం (ఓవర్ ఆరమ్ ఫాస్ట్‌బౌలింగ్) 1884 నుంచి నియమంగా ఆమోదించబడింది.

ఆధునిక క్రికెట్ బ్యాట్‌కు రూపమిచ్చినది శ్రీ ఫ్రయ్ అనే బ్రిటిష్ ప్రముఖుడు. లండన్‌లోని మేరిలిబోన్ క్రికెట్ క్లబ్ క్రికెట్ ఆటకు నియమాలను 1787 నుంచి నిర్ణయిస్తూ వున్నది. ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, బ్రిటన్‌లలో స్త్రీలు క్రికెట్‌ను ఆడుతున్నారు. ఒక్క బ్రిటన్‌లో దాదాపు మహిళల క్రికెట్ సంఘాలు నూటికిపైగా వున్నవట.

ఆస్ట్రేలియాలో తప్ప తక్కిన దేశాలలో "ఓవర్" ఆరు విసురులుగా పరిగణించబడుతున్నది. ఆస్ట్రేలియాలో మటుకు ఎనిమిది విసురులు ఒక 'ఓవర్.'

బ్రిటిష్‌వారి పరిపాలనకాలంలో క్రికెట్ ఇండియాలో ప్రవేశపెట్టబడినప్పటికీ తొలిరోజులలో ఆంగ్లేయులు భారతీయులతో కలిసి క్రికెట్ ఆడేవారుకాదు. అది వారికి నామర్దాగా వుండేది. దక్షిణ భారతంలో శ్రీ బుచ్చిబాబు నాయుడుగారు (కోట రామస్వామిగారి తండ్రి) క్రికెట్‌లో తమ విశేష ప్రావీణ్యాన్ని ఆంగ్లేయ అధికారుల ఎదుట ప్రదర్శించి ఆంగ్లేయులుకూడా భారతీయులతో కలిసి ఆడడానికి మార్గమేర్పరచారు.

భారతదేశంలో క్రికెట్ క్రమక్రమంగా ప్రచారంలోకి వచ్చుచున్నప్పుడు డాక్టర్ విజయానంద (విజయనగరం మహారాజకుమార్) పూనుకొని జాక్ హాబ్స్, సట్ క్లిఫే ప్రభృతులను మనదేశానికి ఆహ్వానించి వారిచేత ఎగ్జిబిషన్ పోటీలు ఇప్పించినమీదటనే భారతదేశం క్రికెట్‌లో ప్రావిణ్యాభివృద్ధికి కృతనిశ్చయంతో పనిచేయకలిగింది.

శ్రీరంజిత్ సింహ్‌జీ, శ్రీ అమర్‌సింగ్, శ్రీ సి. కె. నాయుడు ప్రభృతులు విదేశాలలో పర్యటించి ఇండియాకీర్తిని చాటినమీదట ఇండియాకు విదేశాలతో క్రికెట్ సంబంధాలు దృఢతరమైనవి.

స్వతంత్ర భారతావతరణకు పూర్వం శ్రీయుతులు రంజిత్ సింగ్, దులీప్ సింగ్, అమర్ సింగ్, పటౌరీ నవాబ్, సి. కె. నాయుడు, నవనగర్ మహారాజా, ప్రొఫెసర్ దేవదార్, కర్నల్ మిస్త్రీ, విజయనగరం మహారాజకుమార్, మర్చెంట్, ముష్టకి ఆలీ, అమర్ నాథ్, గోపాలన్, రాంసింగ్, సి. యస్. నాయుడు వంటి క్రికెట్ ఆటగాళ్లు ఇండియాకు ఎనలేని కీర్తి సాధించారు.

భారతదేశానికి స్వాతంత్ర్య సంసిద్ధి కలిగినప్పటినుంచి క్రికెట్ జాతీయక్రీడగా దాదాపు దేశమంతటా వ్యాప్తి చెందుతున్నది. ఇండియా వైస్ ప్రెసిడెంట్ డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారు "ఇండియాలో క్రికెట్ జాతీయక్రీడగా నిలచిపోయింది" అని ఒకసందర్భంలో పేర్కొన్నారు కూడా.

బ్యాటింగ్‌లో ఇండియన్లు ప్రపంచపు అగ్రబ్యాట్స్‌మెన్‌కు ఏ మాత్రము తీసిపోరని ఇండియా క్రికెట్ కంట్రోల్‌బోర్డ్ అధ్యక్షుడు (1956) విజయానంద్ పెక్కు సందర్భాలలో చెప్పి వున్నారు. అయితే సమర్థులయిన ఓపినింగ్ బ్యాట్స్‌మన్ (మొదట బ్యాటింగ్ ప్రారంభించేవారు) చాలాకాలం వరకూ లేనందుకు వారు చింతించారు. ఫీల్డింగ్ పూర్వం మరీ అసంతృప్తికరంగా ఉండేదనీ, ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్నదనీ వీరు అభిప్రాయ పడినారు.

స్వతంత్ర భారతావతరణ పిమ్మట క్రికెట్ ఆటలో కలిగిన ముఖ్యమైన మార్పులలో ఒకటి వ్యక్తి శక్తిపైకంటె జట్టు శక్తిపై

విజయానికి ఆధారపడడం. బ్యాటింగ్‌ను ఇటు శక్తి విహీనంగా గాని అటు రాజకీయితోగాని చేసే పద్ధతిపోయి నిలకడగా దీక్షతో చేసే పద్ధతికి ప్రాముఖ్యం వచ్చింది. 1956 అంతంలోగా స్వతంత్ర ఇండియా మొత్తం 42 టెస్టుపోటీలలో పాల్గొన్నది. వీటిలో అయిదింటిని గెలుచుకొన్నది. పదమూడింటిలో ఓడిపోయినది. 24 "డ్రా" అయినవి.

ఇంకా ఈ తొమ్మిదేండ్ల కాలంలోనూ భారతీయులు సాధించిన ఘనవిజయాలు ఇవి.

1956 లో మద్రాసులో మన్‌కడ్, రాయ్‌లు కలిసి 413 పరుగులు చేసి మొదటి బ్యాట్స్‌మన్ జంటకు కొత్త ప్రపంచం రికార్డును సృష్టించారు.

ఇండియాకు మొట్టమొదటి టెస్టువిజయం మద్రాసులో 1951—52 లో ఇంగ్లండ్ జట్టుపై సిద్ధించింది.

స్వతంత్ర భారత క్రికెట్ చరిత్రలో మరొక ముఖ్య సంఘటన "క్రికెట్ కింగ్" కర్నల్ సి. కె. నాయుడుగారికి భారత ప్రభుత్వం "పద్మభూషణ" బిరుదును ఇచ్చి సత్కరించడం. నాయుడుగారి షష్టిపూర్తి నాడు దేశమందలి క్రికెట్ అభిమానులు 23 వేల రూపాయల కానుక సమర్పించారు. కానుకలను సేకరించినవారిలో డా॥ విజయానంద్, శ్రీ కె. వి. గోపాలరత్నం, శ్రీ జడ్. ఆర్. ఇరానీ ముఖ్యులు. ఇండియా వైస్-ప్రెసిడెంట్ డాక్టర్ రాధాకృష్ణగారు ఈ బహుమతిని నాయుడుగారికి సమర్పించారు.

స్వతంత్ర భారతంలో స్వతంత్ర ఆంధ్రరాష్ట్రం అవతరించిన ఫలితంగా ఆంధ్ర క్రికెట్ జట్టు 1953 నుంచి 1956 వరకూ రంజీ ట్రోఫీ జాతీయ క్రికెట్ పోటీలలో స్వంతధ్వజం ఛాయన పోటీచేసే అవకాశం కల్గింది. కర్నల్ సి. కె. నాయుడు, డాక్టర్ విజయ, శ్రీ సి. యస్. నాయుడు, శ్రీ మంత్రేకర్ వంటి క్రికెట్ పెద్దలనుంచి స్వయంగా సలహాలుపొందే అవకాశం ఆంధ్ర యువ క్రికెట్ ఆటగాళ్లకు లభించింది. తొలిసారి 1956 లో గుంటూరులో రంజీట్రోఫీ క్రికెట్ పోటీ జరిగింది.

## విదేశాలలో ఇండియా క్రికెట్ జట్ల పర్యటన

తొలిసారి 1886 లో ఒక పార్శీజట్టు ఇండియానుంచి వెళ్ళి బ్రిటన్‌లో క్రికెట్ పోటీలలో పాల్గొన్నది. ఈ జట్టుకు శ్రీ పటేల్ నాయకత్వం వహించారు. పార్శీజట్టు మొత్తం 28 పోటీలలో పాల్గొని ఒకదానిలోమాత్రం గెలుపొందింది. 19 మ్యాచీలలో ఓడిపోయింది. ఎనిమిది "డ్రా" అయినవి.

తిరిగి 1888 లో రెండవ పార్శీజట్టు బ్రిటన్‌లో పర్యటించింది. శ్రీ పి. డి. కనోవా దీని నాయకుడు. మొత్తం 31 పోటీలు జరుగగా ఎనిమిదింటిలో పార్శీజట్టు విజయమొందింది. 11 లో ఓడిపోయింది. 12 "డ్రా" అయినవి.

1911 లో పాటియాలా మహారాజా టీము వారి నాయకత్వానే బ్రిటన్‌లో పర్యటించింది. మొత్తం 23 మ్యాచీలలో పాల్గొనగా ఆరింటిలో విజయం చేబట్టింది. 15 లో ఓడిపోయింది. రెండు "డ్రా" అయినవి. మొట్టమొదటి అఖిలభారత క్రికెట్ జట్టు 1932 లోనే బ్రిటన్‌లో పర్యటించింది. పోర్‌బందర్ మహారాజా ఈ జట్టుకు నాయకుడు. కర్నల్ కఠారి కనకయ్యనాయుడుగారు 1932 జూన్‌లో లార్డ్సులో జరిగిన మొట్టమొదటి ఇంగ్లండ్—ఇండియా క్రికెట్ పోటీలో ఇండియా జట్టుకు నాయకత్వం వహించారు. ఇండియా ఆటగాళ్లు శ్రీ నిస్సార్, శ్రీ లాల్‌సింగ్ ఈ పోటీద్వారానే ప్రపంచఖ్యాతిని అందుకొన్నారు. అఖిలభారత జట్టు బ్రిటన్‌లో మొత్తం 36 పోటీలు చేయగా 13 లో గెలుపొందింది. తొమ్మిదింటిలో ఓడిపోయింది. 14 "డ్రా" అయినవి.

ఇండియా సందర్శించిన తొలి విదేశీజట్ల జయాపజయాల వివర మిది :—

జి. ఎఫ్. వెర్నన్ జట్టు :- నాయకుడు జి. ఎఫ్. వెర్నన్ - ఇండియాలో పర్యటించినది 1889—90 సంవత్సరంలో. మొత్తం 12 పోటీలలో పాల్గొన్నది. పదింటిలో విజయమొందింది. ఒకదానిలో ఓడిపోయింది. ఒకటి "డ్రా" అయినది.

లార్డ్ హాక్ జట్టు :- కెప్టెన్ - లార్డ్‌హాక్ (1892—1893). పాల్గొన్న పోటీలు 23; వి - 15, ఓ - 2, "డ్రా" - 6.

ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ఆథెంటిక్స్ :- కెప్టెన్ కె. జె. కీ. (1902 — 3). పాల్గొన్న పోటీలు - 19, వి - 12, ఓ - రెండు, "డ్రా" - 5.

ఎమ్. సి. సి. అధికార జట్టు :- కెప్టెన్ - ఏ. ఐ. ఆర్. గిల్లిగన్ ; పాల్గొన్న పోటీలు - 34, వి - 11, "డ్రా" - 23.

(పో = పాల్గొన్న పోటీలు; వి = విజయమొందినవి; ఓ = ఓడి పోయినవి; "డ్రా" = "డ్రా" అయినవి).

ఇండియా పాల్గొన్న టెస్టు క్రికెట్ పోటీల సంగ్రహ స్వరూపం ప్రక్క పుటలో ఉదహరించబడింది.

[సం = సంవత్సరం; ఇం. పో. దే. = ఇండియాతో పోటీచేసిన దేశం; వి = ఇండియాకు విజయాలు; ఓ = ఇండియా ఓడిపోయిన పోటీలు; "డ్రా" = "డ్రా" అయిన పోటీలు; ర = "రబ్బర్" (అంతిమ విజయం సాధించిన దేశం.]

## ప్రపంచ రికార్డులు : ఆంధ్రుల, భారతీయుల ప్రతిభ

టెస్టు క్రికెట్ పోటీలో మొదటి బ్యాట్స్‌మెన్ చేసిన ఎక్కువ పరుగులు :— 1956 జనవరిలో మద్రాసులో ఇండియా, న్యూజిలెండ్‌లకు జరిగిన క్రికెట్ టెస్టుపోటీలో శ్రీ వినుమన్‌కడ్, శ్రీ పంకజ్‌రాయ్ 413 పరుగులు గావించారు.

* ఒకేపోటీలో ఎక్కువ 'ఓవర్స్' చేయడం :— 1944-45 లో హోల్కార్, బొంబాయిలకు జరిగిన పోటీలో శ్రీ సి.ఎస్. నాయుడుగారు (హోల్కార్) 152.5 'ఓవర్స్' (ఓవర్‌కు ఆరు బంతులు) 'బాల్'-చేశారు. అంటే మొత్తం 917 సార్లు 'బాల్' చేశారు.

# ఇండియా పాల్గొన్న టెస్టు క్రికెట్ పోటీల సంగ్రహ స్వరూపం

| సం. | ఇం. పో. దే. | పోటీజరిగినది | వి. | ఓ. | "డ్రా" | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 1932 | బ్రిటన్ | బ్రిటన్‌లో | — | 1 | — | 1 |
| | జట్టుల కెప్టెనులు సి. కె. నాయుడు, డి. ఆర్. జార్డైన్; ర – బ్రిటన్ | | | | | |
| 1933-34 | బ్రిటన్ | ఇండియాలో | — | 2 | 1 | 3 |
| | జట్టుల కెప్టెనులు సి. కె. నాయుడు, డి. ఆర్. జార్డైన్; ర – బ్రిటన్ | | | | | |
| 1936 | బ్రిటన్ | బ్రిటన్‌లో | — | 2 | 1 | 3 |
| | జట్టుల కెప్టెనులు డాక్టర్ విజయ, జి. ఓ. అల్లెన్; ర – బ్రిటన్ | | | | | |
| 1946 | బ్రిటన్ | బ్రిటన్‌లో | — | 1 | 2 | 3 |
| | జట్టుల కెప్టెనులు: పటౌడీనవాబ్, డబ్ల్యు. ఆర్. హామండ్ ర – బ్రిటన్ | | | | | |
| 1947-48 | ఆస్ట్రేలియా | ఆస్ట్రేలియాలో | — | 4 | 1 | 5 |
| | జట్టుల కెప్టెనులు: ఎల్. అమర్‌నాథ్, డి. జి. బ్రాడ్మన్ ర – ఆస్ట్రేలియా | | | | | |
| 1948-49 | వెస్ట్‌ఇండీస్ | ఇండియాలో | — | 1 | 4 | 5 |
| | జట్టుల కెప్టెనులు: ఎల్. అమర్‌నాథ్, జె. డబ్ల్యు. గొడ్డార్డ్ ర – వెస్ట్‌ఇండీస్ | | | | | |

| సం. | ఇం. పో. దే. | పోటీ జరిగినది | వి. | ఓ. | డ్రా. | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 1951_52 | బ్రిటన్ | ఇండియాలో | 1 | 1 | 3 | 5 |
| | జట్టుల కెప్టెనులు : వి. ఎస్. హజారే; ఎన్. డి. హవార్డ్, డి. బి. కార్ గారలు, ర – నిర్ణయంకాలేదు. | | | | | |
| 1952 | బ్రిటన్ | బ్రిటన్‌లో | — | 3 | 1 | 4 |
| | జట్టుల కెప్టెనులు : వి. యస్. హజారే; హట్టన్ ర – బ్రిటన్ | | | | | |
| 1952 | పాకిస్తాన్ | ఇండియాలో | 2 | 1 | 2 | 5 |
| | జట్టుల కెప్టెనులు : ఎల్. అమర్‌నాథ్, ఏ. హెచ్. కర్దార్ ; ర – ఇండియా | | | | | |
| 1953 | వెస్ట్ ఇండీస్ | వెస్ట్ ఇండీస్‌లో | — | 1 | 4 | 5 |
| | జట్టుల కెప్టెనులు : వి. ఎస్. హజారే, జె. బి. స్టాల్ మెయర్; ర – వెస్ట్ఇండీస్. | | | | | |
| 1954_55 | పాకిస్తాన్ | పాకిస్తాన్‌లో | — | — | 5 | 5 |
| | జట్టుల కెప్టెనులు : వి. మన్‌కడ్, ఏ. హెచ్. కర్దార్; ర – నిర్ణయంకాలేదు. | | | | | |
| 1955_56 | న్యూజిలెండ్ | ఇండియాలో | 2 | — | 3 | 5 |
| | జట్టుల కెప్టెనులు : గులాం అహమ్మద్, పి. ఆర్. ఉమ్రిగర్; హెచ్. బి. కేవ్; ర – ఇండియా. | | | | | |
| 1956 | ఆస్ట్రేలియా | ఇండియా | — | 2 | 1 | 3 |
| | జట్టుల కెప్టెనులు పి. ఆర్. ఉమ్రిగర్, ఇవాన్ జాన్సన్ ర – ఆస్ట్రేలియా | | | | | |

ఒకే ఇన్నింగ్స్‌లో ఎక్కువ 'ఓవర్స్' వినియోగించడం :— 1950 లో హైదరాబాద్, హోల్కార్‌లకు క్రికెట్ పోటీ జరిగినప్పుడు శ్రీ గులాం అహమ్మద్ (హైదరాబాద్) 92.3 'ఓవర్స్' (ఓవర్‌కు ఆరుబంతులు) 'బౌల్' చేశారు.

ఒకే భారతీయునిచే పదివికెట్ల విధ్వంసం :— 1954 లో బొంబాయి క్రికెట్ అసోసియేషన్‌కు, పాకిస్తాన్ సర్వీసెస్‌కు క్రికెట్ పోటీ జరిగినప్పుడు శ్రీ ఎస్. పి. గుప్తె (బొంబాయి) ఒకే ఇన్నింగ్స్‌లో పది వికెట్లనూ పడగొట్టారు.

* ఒకే భారతీయునిచే 11 "సిక్సర్స్":— 1926-27 లో బొంబాయిలో హిందువుల జట్టుకు ఎమ్. సి. సి. టీముకు క్రికెట్ పోటీ జరిగినప్పుడు మొదటి జట్టు సభ్యుడు శ్రీ కఠారు కనకయ్యనాయుడుగారు ఒకే ఇన్నింగ్స్‌లో 11 'సిక్సర్స్' (ఒక్కొక్క సిక్సర్‌కు ఆరేసి పరుగులు) కొట్టారు. మరే భారతీయుడు ఇంతటి మహాత్కార్యాన్ని సాధించి వుండలేదు.

ఉత్తమ పోటీలో ఎక్కువ పరుగులు :— 1929-30 లో సిడ్నీలో న్యూసౌత్‌వేల్స్, క్వీన్స్‌లాండులకు క్రికెట్ పోటీ జరిగినప్పుడు మొదటి జట్టు ఆటగాడు శ్రీ డి. జి. బ్రాడ్మన్ 452 పరుగులు చేసి 'ఔట్' కాలేదు.

టెస్టుపోటీలో ఎక్కువ పరుగులు :— ఓవల్‌లో బ్రిటన్, ఆస్ట్రేలియాలకు టెస్టు క్రికెట్ పోటీ జరిగినప్పుడు బ్రిటిష్ ప్రముఖుడు శ్రీ లెన్ హట్టన్ 364 పరుగులు కావించాడు. మొత్తం 13 గంటల 20 నిమిషాలసేపు 'బ్యాట్' చేశారు. ఇంత దీర్ఘకాలం మరెవ్వరూ బ్యాట్ చెయ్యలేదు.

ఒక దేశంతో పోటీలో ఐదు సెంచరీలు :— 1955 లో వెస్ట్ ఇండీస్‌లో ఆస్ట్రేలియా, వెస్ట్ ఇండీస్‌లకు ఐదు టెస్టు క్రికెట్ పోటీలు జరిగినప్పుడు శ్రీ సి. ఎల్. వాల్కాట్ (వెస్టు ఇండీస్) మూడు టెస్టులలో ఐదు సెంచరీలు కొట్టారు. వాటి వివర మిది : మొదటి టెస్టు- 108 ; రెండవ టెస్టు - 126, 110 ; ఐదవ టెస్టు - 155, 110. రెండు టెస్టులలో రెండు ఇన్నింగ్సులోనూ సెంచరీలు కొట్టడంలో కూడా (126, 110; 155, 110) శ్రీ వాల్కాట్‌దే ప్రపంచం రికార్డు.



జట్టుచే ఎక్కువ పరుగులు :— 1926—27 లో మెల్బోర్న్‌లో విక్టోరియా, న్యూసౌత్ వేల్సులకు పోటీజరిగినప్పుడు విక్టోరియా 1107 పరుగులు గావించింది.

జట్టుచే తక్కువ పరుగులు :— 1877 లో ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీకి ఎమ్. సి. సీకి జరిగిన పోటీలో మొదటిజట్టు 12 పరుగులు మాత్రమే గావించింది.

రెండు జట్లు కలిపి ఎక్కువ పరుగులు :— 1948 లో బొంబాయి, మహారాష్ట్రల క్రికెట్ పోటీలో 38 వికెట్లు 2376 పరుగులు చేసినవి.

భారతీయ రికార్డులు : ఆంధ్రుల ప్రతిభ

టెస్టుపోటీలలో ఇండియా రికార్డులు దిగువ తెల్పబడినవి :

ఎక్కువ పరుగులు :— 1956 జనవరిలో మద్రాసులో ఇండియా న్యూజిలెండ్‌లకు జరిగిన క్రికెట్ టెస్టుపోటీలో ఇండియా మూడు వికెట్లకు 537 పరుగులు గావించింది. ఇండియా మరేదేశం జట్టుపై ఇన్ని పరుగులు చేసివుండలేదు.

1948 లో అడిలైడ్‌లో ఇండియా, ఆస్ట్రేలియాలకు జరిగిన పోటీలలో ఆస్ట్రేలియా ఒక ఇన్నింగ్స్‌లో 674 పరుగులు గావించింది. ఇండియాపై మరేదేశమూ ఇన్ని పరుగులు చెయ్యలేదు.

తక్కువ పరుగులు :— 1947 లో బ్రిస్బెన్‌లో ఆస్ట్రేలియాతో పోటీ చేసినప్పుడు ఇండియా 58 పరుగులుమాత్రమే సాధించింది.

1947 లో సిడ్నీలో ఇండియా ఆస్ట్రేలియాలకు జరిగిన మ్యాచ్‌లో ఆస్ట్రేలియా 107 పరుగులు మాత్రమే చేసింది.

ఎక్కువపరుగులు చేసిన ఆటగాళ్లు :— వి. మన్‌కడ్. 1956 లో మద్రాసులో ఇండియా - న్యూజిలెండ్ క్రికెట్‌పోటీలో 231 పరుగులు గావించారు.

1952-53 లో కింగ్‌స్టన్‌లో ఇండియా-వెస్ట్ఇండీస్ మ్యాచ్‌లో శ్రీ ఎఫ్. ఎమ్. వారెల్ (వెస్ట్ఇండీస్) 237 పరుగులు చేశారు.

పిన్నవయసులోనే టెస్ట్‌పోటీలలో పాల్గొన్నవారు :—

ఎస్. ముష్టక్ ఆలీ :— 1933 - 34 లో కలకత్తాలో ఇండియా-బ్రిటన్ మ్యాచీలో పాల్గొన్నప్పుడు వీరి వయస్సు 19 సంవత్సరాల తొమ్మిదిరోజులు మాత్రమే.

* "తల నెరసిన" పిమ్మట టెస్టు క్రికెట్ రంగంలో ప్రవేశించినవారు :— శ్రీ కోట రామస్వామి నాయుడు: 1936 లో మాంచెస్టర్‌లో ఇండియా-బ్రిటన్ టెస్ట్ క్రికెట్‌పోటీలలో

పాల్గొన్నప్పుడు వీరి వయస్సు 40 సంవత్సరాల 37 రోజులు. మరే భారతీయ క్రికెట్ ఆటగాడు ఇంత వయస్సులో తొలిసారి టెస్టు క్రికెట్ పోటీలో పాల్గొని వుండలేదు.

* "విజ్డెన్" సత్కారం :— ప్రపంచంలోని క్రికెట్ గ్రంథాలలోకెల్ల విశిష్టమైనదిగా పరిగణించబడుతున్న "విజ్డెన్" (WISDEN) ఒక్కొక్క సంవత్సరంలో అగ్ర క్రికెటీర్లను ఎన్ను కొంటుంది. ఇలా ఎన్నుకోబడినవారిలో క్రింది భారతీయులు కలరు.

కె. ఎస్. రంజిత్ సింహ్జీ (1896), కె. ఎస్. దులీప్ సింహ్జీ (1929), పటౌడీ నవాబు, సి. కె. నాయుడు (1932), వి. ఎమ్. మర్చెంట్ (1936), వి. మన్కడ్ (1946).

రంజీట్రోఫీ రికార్డులు : ఎక్కువ పరుగులు :— 1943 లో మహారాష్ట్ర, కథియవాడ్ లకు జరిగిన పోటీలో మహారాష్ట్ర ప్రతినిధి శ్రీ బి. బి. నింబాల్కర్ 443 పరుగులు గావించి ఔట్ కాలేదు.

మొదటిసారి పాల్గొన్నప్పుడే ఎక్కువ పరుగులు చేసిన వారు :— శ్రీ జి. ఇ. బి. ఏబెల్ (నార్త్ ఇండియా), 1934 లో ఆర్మీ జట్టుతో పోటీచేసినపుడు 210 పరుగులు గావించారు.

మొదటి వికెట్ రికార్డు:— 273 పరుగులు - 1941 లో నార్త్ వెస్టరన్ ఫ్రాంటీర్ప్రావిన్స్తో నార్త్ ఇండియా పోటీచేసినప్పుడు రెండవ జట్టు మొదటి బ్యాట్స్మన్ జంట శ్రీ జగదీష్లాల్, శ్రీ నాజర్ మహమ్మద్ ఈ రికార్డును సాధించారు.

ఒకే ఇన్నింగ్స్లో అతి తక్కువ పరుగులకు తొమ్మిది వికెట్లు పడగొట్టిన బౌలర్:— శ్రీ ఆర్. ఆర్. వాడ్కర్ 38 పరుగులకు తొమ్మిది వికెట్లు (1937).

* ఒకే సీజన్లో ఎక్కువ వికెట్లు నష్టపరచిన బౌలర్ :— శ్రీ సి. యస్. నాయుడుగారు. 1942 లో బరోడా తరఫున ఆడుతూ

40 వికెట్లు విధ్వంసం చేశారు. అప్పుడు వారి ఓవర్ (అరుసార్లు బాల్ చేయడం), మెయిడెన్ ఓవర్ (బ్యాట్స్మన్ పరుగులుచేయని ఓవర్), బ్యాట్స్మెన్ చేసిన పరుగులు, పడగొట్టిన వికెట్ల వివర మిది: 206.5; 42; 514; 40; సగటు పరుగులు వికెట్ కు 12.85.

ఎక్కువ పరుగులు :— 1945 లో ఇండోర్ లో మైసూర్ తో పోటీచేసినప్పుడు హోల్కార్ ఎనిమిది వికెట్లకు 912 పరుగులు సాధించింది.

తక్కువ పరుగులు :— 1934 లో అమృతసర్ లో నార్త్ ఇండియాతో పోటీచేసినప్పుడు సౌత్ పంజాబ్ 22 పరుగులు మాత్రమే చేసింది.

రెండుజట్లు కలసి చేసిన పరుగులు:- 1948 లో పూనాలో బొంబాయి - మహారాష్ట్ర పోటీలో 38 వికెట్లు 2376 పరుగులు చేసినవి.

1956 అక్టోబరు 31 వ తేదీవరకు ఆంధ్రరాష్ట్రంగా వ్యవహరించ బడ్డ ప్రాంతంలో క్రికెట్ వ్యాప్తికి ఆట అభివృద్ధికి కృషిచేసినది ఆంధ్ర క్రికెట్ అసోసియేషన్. దీని ప్రధాన కార్యాలయం గుంటూరులో వుంది.

1953 జులై 15 వ తేదీన ఈ సంఘం రిజిస్టర్ చేయబడింది. సంఘ స్థాపకులలో శ్రీయుతులు సి. కె. నాయుడు, బి. సి. హెచ్. నారాయణమూర్తి, యస్. వేణునాథరావు, యస్. నారాయణరావు, యం. రామచంద్రరావు, సి. శంకరరావు, పి. అర్. ఏకా, యస్. వి. యస్. స్టాన్లీ, సి. యస్. నాయుడు ప్రభృతులు కలరు.

డాక్టర్ విజయానంద (సంఘ అధ్యక్షులు) శ్రీయుతులు బి. వి. రామానుజం, యం. వీరాస్వామి, డి. యస్. రెడ్డి. డాక్టర్ బి. రామచంద్రరావు, జస్కరన్ భోవాల్కర్, వై. అబద్ధయ్య (గుంటూరు), డాక్టర్ సి. రామదాసు (గుంటూరు), బి. బి. యస్. అర్. కె. వి. రావు, (విజయనగరం), జె. వి. యస్. ధర్మారావు (వెంకటగిరి) గారలు 1956-57 లో ఆంధ్ర క్రికెట్ సంఘం అధికారులు.

## క్రికెట్ ఆటగాళ్ల పరిచయం :

కర్నల్ కఠారి కనకయ్యనాయుడు :— జననం 1895 అక్టోబరు 31 వ తేది. భారత క్రికెట్ చరిత్రలో నాలుగు దశాబ్దాలకు



సి. కె. నాయుడు, సి. ఎస్. నాయుడు

పైగా వీరు ప్రముఖస్థానం వహించి వున్నారు. విజయనగరం మహారాజ కుమార్ చెప్పినట్లు "సి. కె. కంటే రంజీ, దిలీప్, పటౌడీ గొప్ప బ్యాట్సుమెన్ కావచ్చు. కాని కనకయ్యనాయుడు వీరందర్ని మించిన సర్వతోముఖ ప్రతిభాశాలి (అల్ రౌండర్). ఇండియాలో క్రికెట్ ఆట ప్రమాణం పెంపొందటానికి సి. కె. ని మించి మరెవ్వరు కృషి చేసివుండలేదు."

సుప్రసిద్ధ బ్రిటిష్ క్రికెట్ ఆటగాడు శ్రీ జాక్ హాబ్స్ "సి. కె.ను నేను మరువలేను. సర్వతోముఖ ప్రతిభాశాలురలో ఆయనను మించిన వారు లేరు" అని కీర్తించారు.

శ్రీ జార్జి డక్‌వర్త్ సి. కె. ను ప్రపంచపు గొప్ప క్రికెటీర్లలో ఒకరుగా పరిగణిస్తానని నుడివారు. మ్యాటింగ్ వికెట్ పైన, టర్ఫు

వికెట్‌పైన సమప్రతిభతో ఆడగల ప్రపంచపు అగ్ర క్రికెటీర్లలో సి. కె. ఒకరని కీర్తించారు.

ప్రపంచపు అగ్ర బ్యాట్సుమెన్‌లో కనకయ్య ఒకరని డాక్టర్ పి. సుబ్బరాయన్ ప్రశంసించారు.

శ్రీ సి. కె. నాయుడుగారు 1916లో క్రికెట్ ఆటలో ప్రవేశించారు. 1938 వరకు రంజీట్రోఫీ టోర్నమెంటులో సెంట్రల్ ఇండియా జట్టుకు నాయకత్వం వహించారు. 1941 నుంచి 1952 వరకు హోల్కార్ క్రికెట్ జట్టుకు నాయకులు. 1953, 54లో ఆంధ్ర క్రికెట్ జట్టుకు నాయకత్వం వహించారు. 1953 నవంబరులో బెంగుళూరులో ఆంధ్ర–మైసూరు జట్లకు రంజీట్రోఫీ క్రికెట్ పోటీ జరిగినప్పుడు శ్రీ నాయుడుగారు తమ పూర్వ ప్రతిభ ఛాయలను చూపారు. ఆంధ్ర మొదటి ఇన్నింగ్సులో 86 నిమిషాలలో 74 పరుగులు గావించారు. వీటిలో ఒకటి సిక్సర్, 10 బౌండరీలు. (బౌండరీకి 4 పరుగులు).

ఉన్నతశ్రేణి క్రికెట్ పోటీలనుంచి ఇక విరమిస్తున్నానని 1953 నవంబరు 23న ప్రకటించారు.

ఈ 37 సంవత్సరాలు క్రికెట్ చరిత్రలో ఆంధ్ర–ఇండియా గర్వించదగు విజయాలను నాయుడుగారు సాధించారు.

ఇండియా పాల్గొన్న మొట్టమొదటి క్రికెట్ టెస్టు పోటీలో ఇండియా జట్టుకు నాయకత్వం వహించినది శ్రీ నాయుడుగారు. (1932 లో బ్రిటన్‌లో పర్యటించిన ఆల్ ఇండియా జట్టు పాల్గొన్న మొదటి టెస్టు పోటీలో భారతజట్టు నాయకులు.)

బ్రిటన్ పర్యటనలో నాయుడుగారు మొత్తం 1618 పరుగులు గావించారు. లార్డ్సులో యం. సి. సి. జట్టుతో పోటీ చేసినప్పుడు—తొలి ఉన్నతపోటీలోనే 118 పరుగులు గావించి ఔటు కాలేదు. ఈ పర్యటనలో వీరి సగటు పరుగులు 40. సగటున 25 పరుగుల చొప్పున 65 వికెట్లు నష్టపరిచారు.

ఇంతకుముందు 1926_27 లో యం. సి. సి. జట్టు ఇండియాలో పర్యటించినప్పుడు నాయుడుగారు బొంబాయిలో హిందువులజట్టు తరఫున యం. సి. సి. తో ఆడుతూ ఒకే ఇన్నింగ్సులో 11 సిక్సర్స్ కొట్టారు. నాటినుండి నేటివరకూ మరే భారతీయుడు ఇట్టి ప్రతిభను ప్రదర్శించ లేదు. పోటీలో నాయుడుగారు ఎప్పుడు ఉల్లాసంగా కనిపించినా ప్రేక్షకులు 'సిక్సర్ కొట్టండి' అని నినాదాలు చేసేవారు. వారు కోరినదే తడవుగా అతి సులువుగా సి. కె. సిక్సర్ కొట్టుతూ వుంటే ప్రేక్షక మహాశయులు ఆనందపరవశులై "సి. కె. ఈజ్ ఓ. కే." అని మిన్ను ముట్టేలా నినాదాలు చేసేవారు.

1926 బొంబాయి పోటీలోనే నాయుడుగారు 65 నిమిషాలలో 100 పరుగులు, 100 నిమిషాలలో 187 పరుగులు గావించారు. 1932 లో బర్మింగ్ హామ్‌లో వార్విక్ షైరుతో పోటీచేసినప్పుడు నాయుడుగారు 162 పరుగులు గావించారు. వీటిలో ఆరు సిక్సర్స్, పదమూడు బౌండరీలు. ఇదే పోటీలో నాయుడుగారు ఒకసారి బలంకొద్ది బంతిని కొట్టగా ఆటస్థలం ప్రక్కనగల నదిలో బంతి పడిందట !

నాయుడుగారి శైలి, బ్యాటింగ్ విధానము ఇండియనుల బ్యాటింగ్ రీతినే సంస్కరించి వేసింది. శ్రీ నాయుడుగారు తిరిగి 1936 లో బ్రిటన్ లో పర్యటించారు. వీరు ఉన్నత క్రికెట్ పోటీలలో మొత్తం 9810 పరుగులు గావించారు. వీటిలో 21 సెంచరీలు. మొత్తం 295 ఇన్నింగ్సులో పాల్గొన్నారు. పదునాల్గింటిలో ఔట్ కాలేదు. సగటు పరుగులు 34 . 91. వీరు చేసిన ఎక్కువ పరుగులు 200. 1945_46 లో హోల్కార్ బరోడాలకు జరిగిన రంజీట్రాఫీ పోటీలో నాయుడుగారు హోల్కారు జట్టు తరఫున ఆడుతూ జంట సెంచరీలు కొట్టారు. 50 వ ఏట ఆగ్ర క్రికెట్ పోటీలో 200 పరుగులు చేయడం నాయుడుగారి అద్భుతశక్తికి, అద్వితీయమైన పటిమకు తార్కాణం.

బౌలింగులోకూడా నాయుడుగారి ప్రతిభ ప్రశంసనీయం. వీరు తమ క్రికెట్ జీవితంలో 10, 009 పరుగులకు 337 వికెట్లు నష్టపరిచారు. అంటే వీరి వాతపడ్డ బ్యాట్సుమెన్ సగటున 29 . 70 పరుగులు మించి చెయ్యలేదు.

1956 లో భారతప్రభుత్వం శ్రీ కఠారి కనకయ్య నాయుడు గారికి - భారతీయ క్రికెట్ కు వారు చేసిన సేవకు ప్రశంసా చిహ్నంగా - 'పద్మభూషణ్' బిరుదునిచ్చి సత్కరించింది.

డాక్టర్ విజయానంద్ :— జననం 1905 డిశంబరు 28. భారతీయ క్రికెట్ పితామహులలో ఒకరిగా డాక్టర్ విజయానంద్ గారిని పేర్కొనవచ్చు. క్రికెట్ ఆడి, ఆటరీతులను అభివృద్ధిపరచడమే కాక ఆర్థిక సహాయం చేసి, పోటీలకు రేడియోలో ప్రత్యక్ష వ్యాఖ్య చెప్పి, క్రికెట్ సర్వతోముఖాభివృద్ధికి కృషి చేసిన ఆంధ్ర ప్రముఖుడు విజయనగరం మహారాజ కుమార్. ఇండియాలో క్రికెట్ శైశవ దశలో వున్నప్పుడు వీరు తమ ఖర్చుపై ప్రపంచ ప్రసిద్ధ తొలి బ్యాట్సుమెన్ జంట హాబ్స్, సట్క్లిఫే గార్లను, లియరీ కాంస్టెంటైన్ గారలను ఇండియాకు ఆహ్వానించి క్రికెట్ పోటీలను జరిపించారు. వీరి రాకవల్ల ఇండియా క్రికెటీర్లలో నవోత్సాహం వెల్లివిరిసింది.



విజయనగరం మహారాజ కుమార్ కు బాల్యంనుంచి క్రికెట్ ఆటలో ఆసక్తి మెండు. 25 వ ఏటనే క్రికెటీర్ గా పేరొందారు. "విజీ"గా క్రికెట్ రంగంలో కీర్తి గడించారు. 1933_34 లో బెనారసులో యం. సి. సి. జట్టుకు, యు. పి. జట్టుకు జరిగిన పోటీలో వీరి ప్రతిభవల్ల యు. పి. జట్టు విజయమొందింది. 1935_36 లో యు. పి. XI జట్టుకు వీరు నాయకత్వం వహించి అలహాబాద్ లో రైడర్సు XI తో పోటీ చేసి నిమిషానికి పరుగుకంటె ఎక్కువ చొప్పున 40 పరుగులు కావించారు. 1936 లో ఇంగ్లాండ్ లో పర్యటించిన ఇండియా క్రికెట్ జట్టుకు నాయకత్వం వహించారు. అప్పుడు ఎనిమిదవ ఎడ్వర్డు చక్రవర్తి వీరి ఆటను చూచి ముగ్ధులైనారు. విజయానంద్ కు 'సర్' బిరుదు ప్రసాదించారు. యం. సి. సి. ప్రెసిడెంట్ లార్డు సమ్మర్సు 'విజీ'కి యం. సి. సి.

సభ్యత్వ మిచ్చి సత్కరించారు. 1954 ప్రాంతాల డాక్టర్ విజయ రెండు రాష్ట్రాలలోనూ, మొత్తం భారతదేశంలోనూ క్రికెట్ ఆట వ్యాప్తికి సారథ్యం వహించారు. ఆంధ్ర క్రికెట్ అసోసియేషన్, యు. పి. క్రికెట్ అసోసియేషన్ అధ్యక్షులుగా వుండి, ఇండియా క్రికెట్ కంట్రోల్ బోర్డు అధ్యక్షులుగా కూడా ఎన్నుకోబడ్డారు. వీరు ఇండియా క్రికెట్ కంట్రోల్ బోర్డు అధ్యక్షస్థానంలో వున్నప్పుడే విదేశ క్రికెటీర్లచే వివిధ కేంద్రాలలో మన యువకులకు క్రికెట్‌లో ఉన్నత శిక్షణను ఇప్పించే పద్ధతి అమలుపరచారు. కష్టదశలోవున్న క్రికెటీర్లకు సహాయం చేయడానికై ఒక నిధిని వీరు ఏర్పాటు చేసివున్నారు. 1956 ఉత్తరార్థంలో ఆస్ట్రేలియన్ క్రికెట్ జట్టు ఇండియాలో పర్యటించడానికి వీరే ప్రధాన కారకులు.

మహారాజా విజయానంద గజపతిగారి మనుమడైన శ్రీ విజయా నంద్ గొప్ప షికారీ. యు. పి. లోని మీర్జాపూర్ అడవులలో వీరు వందల సంఖ్యలో చిరతపులులను, బెబ్బులులను సంహరించారు.

వీరు గొప్ప దేశభక్తులు. ఆంధ్రాభిమాని. 1942లో ఆంధ్ర మహాసభ అధ్యక్షునిగా సర్. స్టాఫర్డ్స్ క్రిప్స్‌వద్దకు రాయబారం నడిపి ఆంధ్రరాష్ట్ర మిచ్చి తీరవలెనని గద్దించారు. 1937లో యు. పి. ప్రభుత్వంలో న్యాయశాఖామంత్రి పదవి వహించారు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొనడానికి వెళ్ళగా గాంధీమహాత్ముడు వారించి వెనుకకు తీసుకొని వచ్చారు. 1942 'క్విట్ ఇండియా' ఉద్యమంలో కాశీలోని వీరి భవనంలో అనేక రాజకీయ కార్యకర్తలు అజ్ఞాతవాసం గడిపారు. భారతదేశానికి స్వాతంత్ర్యం రాకముందే "సర్" బిరుదు విసర్జించిన తొలి దేశాభిమానులలో డాక్టర్ విజయానంద్ ఒకరు.

శ్రీ కోట రామస్వామి :— జననం 1896 జూన్ 16. మద్రాసు. విద్యాభ్యాసం మద్రాసు వెలెస్లీకాలేజి హైస్కూలు, మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజి. విద్యార్థిదశలో క్రికెట్, టెన్నిస్, హాకీ ఆడేవారు. 1920లో ఉన్నత విద్యాభ్యాసంకోసం కేంబ్రిడ్జికి వెళ్లారు. అక్కడ పెంబ్రోక్ కాలేజీలో వ్యవసాయ పరీక్షకు చదివారు. 1920, 21, 22,



సంవత్సరాలలో కేంబ్రిడ్జి యూనివర్సిటీ తరఫున ఆక్స్‌ఫర్డు యూనివర్సిటీతో టెన్నిస్ పోటీలు జరిపారు. కేంబ్రిడ్జి "బ్లూ" పొందారు. 1922 లో డేవిస్‌కప్పు పోటీలలో ఇండియాజట్టు సభ్యులు. అదే సంవత్సరంలో హాలెండ్‌లో సింగిల్సు, డబుల్సు ఛాంపియన్‌షిప్ సాధించారు. 1922 లోనే ఈస్టుబోర్న్‌లో జరిగిన దక్షిణ ఇంగ్లండ్ టెన్నిస్ పోటీలలో పాల్గొని సింగిల్సు ఛాంపియన్‌షిప్ సాధించారు. 1923 లో శ్రీ సి. హెచ్. కింగ్సువే పార్టనర్‌షిప్‌తో క్వీన్స్‌క్లబ్ డబుల్సు ఛాంపియన్‌షిప్ సాధించారు. ఎడమచేతితో ఆడే శ్రీ రామస్వామిగారి టాప్‌స్పిన్ మహా శక్తిమంతమైనది.

1924 లో ఇండియాకు తిరిగివచ్చారు. వ్యవసాయశాఖ అసిస్టెంట్ డైరక్టర్‌గా నియమితులయ్యారు. ఇండియాకు తిరిగివచ్చిన మీదట టెన్నిస్‌కంటె క్రికెట్‌పట్ల ఎక్కువ ఆసక్తి చూపారు. వీరి తండ్రిగారైన శ్రీ బుచ్చిబాబుగారు పేరొందిన క్రికెట్ ఆటగాడు. యం. యు. సి. స్థాపించి, యం. యు. సి. జట్టుకు నాయకత్వం వహించినవారు. శ్రీ రామస్వామి సోదరులు శ్రీ రామానుజం, శ్రీ బాలయ్యగార్లుకూడా క్రికెట్‌లో పేరు గడించారు. శ్రీ రామస్వామిగారు 1924 - 25 సంవత్సరాలలో రంజీ, ప్రెసిడెన్సీ క్రికెట్ పోటీలలో పాల్గొన్నారు. 1936 లో బ్రిటన్‌లో 'విజీ' నాయకత్వాన పర్యటించిన ఇండియా క్రికెట్‌జట్టులో సభ్యులు. మొత్తం టీములో బ్యాటింగ్ ఆవరేజ్ లో వీరే అగ్రస్థానం వహించారు. వీరు సగటున చేసిన పరుగులు 56 . 7 . 1952 లో వెస్టు ఇండీస్‌లో పర్యటించిన ఇండియా క్రికెట్ జట్టుకు వీరు మేనేజరు. 1947 నుంచి 1950 వరకు, 1952 - 56 వరకు ఇండియా క్రికెట్ కంట్రోలుబోర్డు సెలెక్షన్ కమిటీ సభ్యులు. 1948 నుంచి 1956 వరకు మద్రాసు రాష్ట్ర క్రికెట్ సంఘం ఉపాధ్యక్షులు. 1955 నుంచి ఇండియా బాల్‌బాడ్మింటన్ ఫెడరేషన్ అధ్యక్షులు.

శ్రీ రామస్వామిగారు బెల్జియం, ఫ్రాన్సులలో కూడా పర్యటించారు. వీరు ఎక్కువ చేసిన పరుగులు : 1936 లో లాంక్‌షైర్‌లో పోటీ చేసినప్పుడు 128 పరుగులుచేసి ఔటు కాలేదు. శ్రీ రామస్వామిగారు ఎడమచేతితో బాల్ చేస్తారు. అగ్రశ్రేణి క్రికెట్ పోటీలలో వీరు మొత్తం 737 పరుగులు గావించారు. వీరు సగటున 30 . 70 పరుగులు చేసినారు. టెస్టు క్రికెట్ పోటీలలో వీరు తొలిసారి పాల్గొన్నది 40 వ ఏట. ఇంత పెద్ద వయస్సులో మరే భారతీయుడు టెస్టు క్రికెట్ రంగంలో ప్రవేశించలేదు. 61 వ ఏట కూడా నిండు ఆరోగ్యముతో వున్న శ్రీ రామస్వామి గారు ఇప్పుడు గోల్ఫు ఆడుతున్నారు.

(శ్రీ) సి. యస్. నాయుడు :— జననం 1914 ఏప్రిల్ 19. సి. కె. నాయుడుగారి తమ్ముడు. గూగ్లీ, లెగ్‌బ్రేక్ బౌలర్‌గా వీరు గణుతికెక్కారు. వీరంత శక్తిమంతంగా, పటిష్ఠంగా బ్యాటు చేయగల వారు చాలా అరుదు. విచిత్ర స్థానాలలో ఆటగాళ్ళను పెట్టి ఫీల్డింగ్ జరపడంలో వీరికి వీరే సాటి. బ్యాట్సుమెన్‌కు అతి చేరువలో వుండి ఫీల్డు చేయడంలో వీరి ప్రతిభ విశేషం. ఈ సర్వతోముఖ ప్రతిభాశాలి 1933 లో ఇండియాలో పర్యటించిన బ్రిటిష్ జట్టుతో జరిగిన టెస్టు క్రికెట్ పోటీలో తొలిసారి పాల్గొన్నారు. అప్పటికి వారి వయస్సు 19 సంవత్సరాల 262 రోజులు. 1936 లో బ్రిటన్‌లో పర్యటించిన క్రికెట్ జట్టులో సభ్యులు. 1949-50 లో ఇండియాలో పర్యటించిన మొదటి కామన్‌వెల్తు క్రికెట్ జట్టుతో జరిపిన ఒక పోటీలో శ్రీ నాయుడుగారు 59 పరుగులకు ఐదు వికెట్లు నష్టపరిచారు. 1950-51 లో ఇండియాలో పర్యటించిన రెండవ కామన్‌వెల్తు జట్టుతో జరిగిన ఒక టెస్టు పోటీలో శ్రీ నాయుడుగారు 55 నిమిషాలలో 52 పరుగులు చేశారు.

1936, 45, 46, 47, 49, 50, 51 సంవత్సరాలలో ఇండియా పాల్గొన్న టెస్టు క్రికెట్ పోటీలలో ఇండియా జట్టు సభ్యులు. శ్రీ నాయుడుగారు రంజీట్రోఫీ పోటీలలో బరోడా, హోల్కార్, ఆంధ్ర జట్టులకు ప్రాతినిధ్యం వహించివున్నారు. 1953-54 లో ఆంధ్ర

రంజీ ట్రోఫీ జట్టు సభ్యునిగా మైసూరుతో పోటీచేసి 113 పరుగులకు 6 వికెట్లు నష్టపరిచి ఆంధ్ర రికార్డును నెలకొల్పారు. 1955-56 లో ఆంధ్ర రంజీట్రోఫీ జట్టుకు నాయకులు. కొచ్చిన్-తిరువాన్కూర్‌తో పోటీ చేసినప్పుడు 62 పరుగులు గావించారు.

ఒకే పోటీలో ఎక్కువ ఓవర్లు (ఆరుసార్లు బాల్ చేయడం) వేయడంలో ప్రపంచపు రికార్డు హోల్డరు ఈ ఆంధ్ర ప్రముఖుడే. 1944—45 లో హోల్కార్ - బొంబాయి రంజిట్రోఫీ ఫైనల్ పోటీ జరిగినప్పుడు శ్రీ నాయుడుగారు 152. 5 ఓవర్సు—-అనగా మొత్తం 917 బంతులు వేశారు. అంతవరకూ ప్రపంచపు రికార్డు 1925-26 లో శ్రీ సి. వి. గ్రిమ్మెట్ (దక్షిణ ఆస్ట్రేలియా) నెలకొల్పినది 106 ఓవర్లు. ఆస్ట్రేలియాలో ఓవరు ఎనిమిదిబంతులు గాబట్టి శ్రీ గ్రిమ్మెట్ 848 సార్లు బంతి విసిరినాడన్నమాట. (వీరి చిత్రం 285 వ పేజీలో కలదు.)

శ్రీ రామన్ సుబ్బారావు :— జననం 1932 జనవరి 29. లండనులో స్థిరపడిన ఆంధ్ర బారిష్టరు శ్రీ సుబ్బారావుగారి తనయులు.



శ్రీ సుబ్బారావుగారి (తండ్రి) స్వగ్రామం గుంటూరు. శ్రీ రామన్ సుబ్బారావు ఎడమ చేతితో బ్యాటుచేస్తారు. కుడిచేతితో బాల్ చేస్తారు. లెగ్ బ్రేక్స్‌కు, గూగ్లీస్‌కు ప్రసిద్ధి చెందారు. 1954 లో ఇండియాలో పర్యటించిన సిల్వర్ జ్యూబ్లీ ఓవర్‌సీస్ టీములో వీరు సభ్యులు. బాల్యంనుంచి క్రికెట్ ఆడుతూండేవారు. లండనులోని వెట్టిగిఫ్స్ స్కూలులో చదువుతున్నప్పుడు క్రికెట్ ఆడి పేరొందారు. స్కూలు జట్టుకు కెప్టెన్ కూడా. 1950 లో ఐదు నెలలలోనే 2000 పరుగులకు మించి చేసి 200 వికెట్లు మించి నష్టపరిచి, 1906 లో శ్రీ జి. హెచ్. హస్ట్ నెలకొల్పిన రికార్డును అధిగమించారు. వీరి అన్నగారు శ్రీ స్టాన్లీ సుబ్బారావు కాజావల్స్ జట్టుకు నాయకులు. ఇద్దరు సోదరులు తరచు ఈ జట్టులో ఆడుతుండేవారు.

శ్రీ రామన్ సుబ్బారావు మొట్టమొదటిసారి 1950 లో సర్రే జట్టులో ఆడారు. 1953 లో సర్రే క్యాప్ పొందారు. 1951 నుంచి 1953 వరకు కేంబ్రిడ్జి యూనివర్సిటీ జట్టు ప్రముఖ సభ్యుడు. 1956 జూలైలో కంబైన్డ్ సర్వీసెస్‌కు సర్రేకు జరిగిన క్రికెట్ పోటీలో సర్వీసెస్ జట్టు తరఫున ఆడి 108 పరుగులు గావించారు.

శ్రీ సి. అర్జున్ నాయుడు :— కఠారివారి కుటుంబానికి చెందినవారు. 1953 లో ఇండియాలో పర్యటించిన కామన్‌వెల్తు క్రికెట్ జట్టుతో ఇండియాలో జరిపిన ఒక అనధికార టెస్టు పోటీలో వీరు పాల్గొన్నారు. బౌలరుగాను, బ్యాట్సుమన్‌గా కూడా పేరొందారు. రంజీట్రోఫీ పోటీలలో వీరు హోల్కారు జట్టులో ఆడినారు.

శ్రీ యం. సూర్యనారాయణ్ :—జననం 1930 ఫిబ్రవరి 1. 1953 లో నాగపూరులో కామన్‌వెల్తు క్రికెట్ జట్టుకు ఇండియన్ XI కు జరిగిన పోటీలో ఇండియాజట్టు సభ్యులు. రంజీట్రోఫీ పోటీలలో మద్రాసు జట్టు తరఫున ఆడుతూ, ఫీల్డరుగాను, బ్యాట్స్‌మన్ గాను పేరొందారు.

శ్రీ వెంకటగిరి కుమారరాజా :—జననం 1924 నవంబరు 13. శ్రీ రాజా వెలుగోటి వెంకట శేషవరద రాజగోపాల కృష్ణయాచేంద్రగారు. 1956 - 57 రంజీ ట్రోఫీ టోర్నమెంట్‌లో ఆంధ్రజట్టు నాయకులు. 1954 - 55 ఆంధ్ర రంజీజట్టుకు కూడా వీరు నాయకత్వం వహించారు. 1940 లో వెంకటగిరిలో వెంకటగిరి సంస్థానం క్రికెట్‌క్లబ్ స్థాపించి మద్రాసు క్రికెట్ అసోసియేషన్‌కు అఫిలియేట్ చేయించి, మద్రాసు లీగ్ పందెములలో పాల్గొంటుండేవారు.



ప్రతిఏట మద్రాసు, బెంగుళూరు, తిరుపతి, నెల్లూర్లనుంచి క్రికెట్ జట్టులను వెంకటగిరికి ఆహ్వానించి ఒకటి, రెండు రోజుల పోటీ ఏర్పాటుచేస్తున్నారు. 1949 నుంచి 4 సంవత్సరములు స్వంతజట్టును బెంగుళూరునకు తీసుకొనివెళ్ళి, ఎగ్జిబిషన్ క్రికెట్ పోటీలు జరిపించారు. ఆంధ్రదేశంలో

క్రికెట్ ఆట అభివృద్ధికిగాను, ఉత్తర, దక్షిణ మండలముల క్రికెట్ పోటీ, సాక్ అవుటు క్రికెట్ పోటీలను ఏర్పాటుచేసి, వీటి నిర్వహణకు తగు విరాళాలు ఇచ్చివున్నారు. 1953 - 54 నుంచి 1956 - 57 వరకు ఆంధ్ర రంజీజట్టులో సభ్యునిగాగాని, కెప్టెన్‌గాగాని వున్నారు. వీరికి వేట, సంగీతము, వేదాంత గ్రంథ పఠనంలో ఆసక్తి మెండు. ఇప్పటికి ఆరు పెద్దపులులను, కొన్నివందల ఇతర క్రూరమృగాలను వేటాడివున్నారు. టెన్నిస్, టేబుల్ టెన్నిస్, బిలియార్డ్స్ ఆటలలోగూడా వీరు నేర్పరులు. క్రికెట్ ఆటలో వీరు ప్రదర్శించిన ప్రతిభా విశేషాల సంగ్రహాస్వ రూపమిది. ఎక్కువ పరుగులు - 126 (1953). క్రికెట్ జీవితంలో ఏడు సెంచరీలు సాధించారు. ఎక్కువ వికెట్ల విధ్వంసం - 7 పరుగులకు 7 వికెట్లు.

శ్రీ యడవల్లి అబద్ధయ్య :— జననం 1916 జులై 15. గుంటూరు నివాసి. గుంటూరు టౌన్ హైస్కూలులో చదువుకొనుచున్న



ప్పుడు ఫుట్‌బాల్, హాకీ, బాడ్‌మింటన్, టేబుల్ టెన్నిస్, టెన్నిస్, బాస్కెట్‌బాల్, వాలీబాల్ ఆటలలో పాల్గొనేవారు. అన్ని ఆటలలోకి వాలీబాల్‌లో ఎక్కువ ప్రతిభ చూపారు. 1939-40 లో గుంటూరు ఏ. సి. కాలేజి వాలీబాల్ జట్టుకు నాయకుడు. 1946 లో ఆంధ్రా యూనివర్సిటీ కాలేజీ వాలీబాల్ జట్టు నాయకుడు. ఇంటర్ కాలేజియేట్ టెన్నిస్, వాలీబాల్ పోటీలలో యూనివర్సిటీ కాలేజీకి ప్రాతినిధ్యం వహించారు. 1947-48 లో చెన్నరాష్ట్రం లాన్ టెన్నిస్ ఎసోసియేషన్ కార్యవర్గంలో ఆంధ్రప్రాంత సభ్యుడు. 1953 లో ఆంధ్రరాష్ట్ర ఫుట్‌బాల్ సంఘం సభ్యుడు. 1953 నుంచి ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ సంఘం ఉపాధ్యక్షులు. ఆంధ్ర క్రికెట్ సంఘం ప్రధాన కార్యదర్శిగా వీరు ప్రశంసనీయమైన కృషి నిర్వహిస్తున్నారు. ఇండియా క్రికెట్ కంట్రోలుబోర్డుకు చెందిన రంజీట్రోఫీ సబ్ కమిటీలో సభ్యులు. 1949-51 సంవత్సరాల మధ్య గుంటూరులో

విదేశీయ టెన్నిస్ ఆటగాళ్ళచే ఎగ్జిబిషన్ పోటీలు నిర్వహించడంలో వీరు ఎక్కువ కృషిచేసివున్నారు.

శ్రీ శిఖరం వేణునాథరావు :— జననం 1920 జులై 11 వ తేది - బాపట్ల. స్కూలు దశలో పరుగు, హార్డిల్స్ మున్నగు పోటీల లోనూ, ఫుట్ బాల్, బేస్ బాల్ వంటి ఆట



లలో పాల్గొన్నారు. కొద్ది దూరపు పరుగులు, ఫుట్ బాల్, చెడుగుడు ఆటలలోనూ విశేష ప్రతిభ చూపేవారు. అయిదవ జార్జి సిల్వర్ జూబ్లీ పతకాన్ని సంపాదించారు. పెక్కు క్రీడ లలో విశేష ప్రతిభ చూపినందుకు ఈ బహుమతి ఇవ్వబడినది. 1940 లో మద్రాసు వై. యమ్. సి. ఏ. లో జరిగిన ఒలింపిక్ ఆటల పోటీలలో పాల్గొన్న చీరాల ఫ్రెండ్స్ ఎసోసి యేషన్ క్లబ్ కబాడీ జట్టుకు వీరు నాయకులు. 1947 లో గుంటూరు సిటీ స్టూడెంట్సు యూనియన్ నిర్వహించిన ఫుట్ బాల్ టోర్నమెంటులో వీరికి ప్రత్యేక బహుమతి ఇవ్వబడినది. 1951 లో గుంటూరు రిక్రియేషన్ క్లబ్ స్థాపించారు. ఆంధ్ర క్రికెట్ ఎసోసియేషన్ సంస్థాప కులలో ఒకరు. 1953 వరకూ ఈ సంస్థ ఆర్గనైజింగ్ కమిటి సెక్రటరీ. ఆంధ్రరాష్ట్ర చెడుగుడు సంఘం సంస్థాపకులలో ఒకరు. ఈ సంస్థకు గౌరవ కోశాధికారిగా 1955 వరకూ పనిచేశారు. ప్రస్తుతం ఈ సంఘం కార్యవర్గంలో సభ్యులు. 1955-56 సంవత్సరంలో, ఆంధ్రరాష్ట్ర రెజ్లింగ్ ఎసోసియేషన్ గౌరవ కార్యదర్శి, ఆంధ్రరాష్ట్ర క్యారమ్ ఎసోసియేషన్ గౌరవ కార్యదర్శి, ఆంధ్రా క్రికెట్ ఎసోసియేషన్ ఆనరరీ స్టాటిస్టిషియన్.

శ్రీ యు. యస్. వి. వి. గోపాలరాజు (బాబు) :— జననం ఏప్రిల్ 1926 విజయనగరములో. వీరు మహారాజ కాలేజీ హైస్కూలు (విజయనగరము) లో విద్యాభ్యాసము గావించుచూ నాలుగు సంవత్సరములు పాఠశాల జట్టులో పాల్గొన్నారు. 1946-48 లో



1,000 పరుగులు పూర్తిచేశారు. 1950-51 వ సంవత్సరములో 996 పరుగులు చేశారు. వీరు పడగొట్టిన వికెట్లు 87. 1950-51 లో మహారాజ కాలేజీలో అంతర్ తరగతుల పోటీ లలో 212 పరుగులు చేసి ఔటు కాలేదు. మూడు పోటీలలో మూడు సెంచరీలు వరుసగా చేయుటచే వీరికి ప్రత్యేక పతక మివ్వబడింది. వీరు నార్తుజోన్ జట్టుకు నాయకత్వం వహించి వెంకటగిరిలో జరిగిన పోటీలలో పాల్గొన్నారు. రంజీట్రోఫీ ఆంధ్రజట్టు సభ్యులు.

శ్రీ కొమ్మిరెడ్డి గోపాలకృష్ణ (గోపన్న) :— జననం ఫిబ్రవరి 1932 కాకినాడలో. హైస్కూలులో చదువుచున్నప్పుడు ఫుట్‌బాల్, హాకీ, బాడ్‌మింటన్ ఆడుచుండెడివారు. తర్వాత పి. ఆర్. కాలేజీలో చదువుచున్నప్పుడు కాలేజీ క్రికెట్ జట్టు నాయకులు. అనపర్తి ఐ. యల్. టి. డి. క్రికెట్ క్లబ్‌లో ఆడుచూ 105 పరుగులు చేసి అవుటు కాలేదు. కాకినాడ ఇంజనీరింగ్ కాలేజీతో ఆడుచున్నప్పుడు కూడా 107 పరుగులు చేశారు. అబ్డెన్ మెమోరియల్ పోటీలలో 127 పరుగులు గావించారు. 1958 రంజీ టీమును ఎన్నుకొనడానికై జరిగిన ఒక క్రికెట్ పోటీలో కర్నల్ సి. కె. నాయుడు ఎలివెన్ జట్టులో పాల్గొని 100 పరుగులు చేసి కూడా ఔటు కాలేదు. తరచు సెంచరీలు చేసే ఈ ఆటగాడు రంజీట్రోఫీ ఆంధ్ర జట్టు సభ్యులు. వీరు మీడియమ్ పేస్, హాఫ్ బ్రేక్ బౌలర్. వికెట్ కీపర్ కూడా. కాకినాడలోని కొమ్మిరెడ్డి క్రికెట్ క్లబ్ సభ్యుడు.



శ్రీ రావిగంటి వి. యస్. రామారావు :— జననం 1929, ఫిబ్రవరి 13 వ తేదీ - విజయనగరం. 1949 నుంచి 53 వరకూ



బెంగుళూరు, హైదరాబాద్, మద్రాసు తిరిగి బెంగుళూరులలో జరిగిన యూనివర్శిటీ క్రికెట్ పోటీలలో పాల్గొన్న ఆంధ్ర యూనివర్శిటీ జట్టు సభ్యులు. 1952–53 ఆంధ్ర యూనివర్శిటీ జట్టు వైస్-కెప్టెన్. 1954 లో వెంకటగిరి లోనూ, 1955 లో గుంటూరులోనూ జరిగిన ఆంధ్ర క్రికెట్ ఎసోషియేషన్ క్రికెట్ పోటీలలో ఉత్తరమండలం జట్టులో పాల్గొన్నారు. ఆంధ్ర రంజీ జట్టు సభ్యుడు. బ్యాట్స్‌మన్ గానూ, బౌలర్ గాను గణుతికెక్కారు. సి. ఎస్. నాయుడుగారివద్ద శిక్షణ పొందారు. ఇటీవల ఢిల్లీ వచ్చి ఢిల్లీ క్రికెట్ లీగ్ పోటీలలో పాల్గొన్నారు.

శ్రీ కొమ్మిరెడ్డి వెంకటరమణమూర్తి :— జననం 1938



మార్చి 6 వ తేదీ - కాకినాడ. వీరు 16 వ ఏటనే ఆంధ్ర యూనివర్శిటీ క్రికెట్ జట్టుకు ఎన్నుకోబడినారు. రాజమండ్రిలో జరిగిన ఒక క్రికెట్ పోటీలో బ్యాటింగ్ లో ప్రదర్శించిన అద్వితీయమైన ప్రతిభకు ఒక పతకం బహుమతిగా పొందారు. 1956 లో విశాఖపట్నం మిసెస్ ఏ. వి. యన్. కాలేజీ క్రికెట్ జట్టు నాయకులు. 1956 లోనే రాజమండ్రి గవర్నమెంట్ ఆర్ట్స్ కాలేజీ జట్టుతో ఆడినప్పుడు సెంచరీ సాధించి ఔటు కాలేదు. వీరు, శ్రీ నాయన కలసి 218 పరుగులు చేసి ఔటు కాలేదు.

ఆంధ్ర రంజీ జట్టు సభ్యుడు. మద్రాసులో మద్రాసు క్రికెట్ ఎసోసి. యేషన్ జట్టుతో ఆడి 35, 48 పరుగులు చేశారు. వీరు గూగ్లీ బౌలర్ కూడా. ఉజ్జ్వలభవిష్యత్తు కల యువ ఆటగాడు.

శ్రీ డి. వి. వి. గోపాలరాజు :- జననం 1924 అక్టోబరు 12. 1943 నుంచి 46 వరకూ మహారాజా కాలేజీ హైస్కూలు జట్టు కెప్టెన్. ఆ రోజులలో సగటున 40 పరుగులు చేసేవారు. 1946 నుంచి 48 వరకూ కాలేజీ క్రికెట్ టీము కెప్టెన్. నాలుగు సెంచరీలు సాధించారు. విజయనగరం క్రికెట్ క్లబ్‌కు యమ్. ఆర్. కాలేజీ జట్టుకు మొదటి బ్యాట్స్‌మన్. 1949 లో బ్యాటింగ్‌లో అద్వితీయ ప్రతిభ చూపినందుకు బహుమతి పొందారు. 1953-55 సంవత్సరాలలో ఆంధ్ర క్రికెట్ ఎసోసియేషన్ క్రికెట్ పోటీలలో ఉత్తరమండలం జట్టులో ఆడినారు. రంజీ ట్రోఫీ పోటీలలో మొదటి బ్యాట్స్‌మన్, మీడియమ్ పేస్ బౌలర్.



శ్రీ షఫీ భాయ్ :— జననం 1936 ఫిబ్రవరి 14 వ తేది. విశాఖపట్నం హైస్కూలులో చదువుతున్నప్పుడు తన స్కూలు క్రికెట్ జట్టుకు నాయకుడు. వికెట్ కీపర్. తరువాత ఏ. వి. యన్. కాలేజీ జట్టుకు మొదటి బ్యాట్స్‌మన్, వికెట్ కీపర్. ఈ కాలేజీజట్టు మేజర్ అబ్డెన్ మెమోరియల్ ట్రోఫీని గెలుచుకొనడానికి వీరే ప్రధానకారకులు. అప్పుడు వికెట్ కీపరుగా ఉండి రెండు ఇన్నింగ్స్‌లోనూ 16 మంది బాట్స్‌మన్ ఔటు కావడానికి కారకులైనారు. ఆంధ్రక్రికెట్ ఎసోసియేషన్ దక్షిణమండలం టీము సభ్యుడు. ఆంధ్ర రంజీ జట్టు వికెట్ కీపర్. రాజమండ్రిలోని దానవాయిపేట క్రికెట్ క్లబ్ సభ్యుడు.



శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు (బాబీ) :— వయస్సు 25 సంవత్సరాలు. ప్రస్తుత నివాసం అవనిగడ్డ. సర్వతోముఖ ప్రతిభాశాలి. స్లోబౌలర్. ఫీల్డింగ్‌లో దిట్ట. బౌలింగ్, బ్యాటింగ్‌లకు ఎడమ చేయి అలవాటు. 1953—54 లో రంజీ ట్రోఫీ పోటీలలో శ్రీ సి. కె. నాయుడు నాయకత్వాన పాల్గొన్న మొట్టమొదటి ఆంధ్ర జట్టు సభ్యుడు. అంతకుముందు 1950-51, 1952-53 సంవత్సరాలలో 'రోహింటన్ బరియా' ట్రోఫీ పోటీలలో మద్రాసు యూనివర్శిటీ తరఫున పాల్గొన్నారు. 1951లో మద్రాసులో బ్రిటిష్ క్రికెట్ శిక్షకులు



పైంటర్ హాలోన్‌లవద్ద ఉన్నత శిక్షణ పొందారు. వారి ప్రశంసల నందుకొన్నారు. మద్రాసులోనే శ్రీ ఏ. జి. రామ్‌సింగ్ వద్ద కూడా శిక్షణ పొందారు.

వీరు బాల్యంలోనే క్రికెట్ అభ్యసించ ప్రారంభించారు. 1947-50 వరకూ ఆంధ్రాయూనివర్శిటీ కాలేజీ క్రికెట్ జట్టు సభ్యుడు. 1947 లోనూ 51 లోనూ అబ్డెన్ క్రికెట్ టోర్నమెంటులో బౌలింగ్‌లో అద్వితీయమైన ప్రతిభ చూపినందుకు ప్రత్యేక కప్పు బహుమతి పొందారు. 1952-53 లో రోహింటన్ బరియా టోర్నమెంటులో పాల్గొన్న మద్రాసు యూనివర్శిటీ జట్టు సభ్యుడు.

ట్రిప్లికేన్ క్రికెట్ క్లబ్ సభ్యుడుగా మద్రాసు "ఏ" డివిజన్ లీగ్ పోటీలలో పాల్గొన్నారు. సీనియర్ జోనల్ క్రికెట్ టోర్నమెంటులో ట్రిప్లికేన్ మండలానికి ప్రాతినిధ్యం వహించారు. 1951 అక్టోబరులో కోయంబత్తూరులో మఫుసిల్ కోయంబత్తూరు జట్లకు జరిగిన క్రికెట్ పోటీలలో మఫుసిల్ జట్టు సభ్యులుగా పాల్గొన్నారు.

శ్రీ కె. బి. గోపాలకృష్ణమూర్తి :— నివాసం కాకినాడ, ఆంధ్రరాష్ట్రజట్టు సభ్యులు. పేరొందిన బౌలర్. కొచ్చిన్ తిరువాన్కూరుతో ఆడినప్పుడు 8 ఓవర్లలో మూడు పరుగులకు 5 వికెట్లు నష్టపరిచారు. 8 ఓవర్లలో 5 మెయిడన్ ఓవర్లు (బ్యాట్సుమెన్ ఒక్కపరుగూ చేయలేదు.)

శ్రీ కె. నజురుద్దీన్ :— జననం 1935 ఆగస్టు 16, రాజమండ్రి. విశాఖపట్టణంలోని ఎ. వి. యన్. కాలేజి హైస్కూలు విద్యార్థిగా వున్నప్పుడే — 14వ సంవత్సరంలోనే సెంచరీ కొట్టారు. ఆంధ్ర యూనివర్సిటీ జట్టులోనూ, ఆంధ్ర రంజీ జట్టులోనూ సభ్యులు.

శ్రీ కె. యస్. సుబ్బయ్యా పిళ్ళె :— జననం 1923 నవంబరు 28. మద్రాసులో ఆర్. కె. మిషన్ హైస్కూలులో చదువుతున్నప్పుడు క్రికెట్ ఆట ప్రారంభించారు. ప్రెసిడెన్సీ కాలేజీ క్రికెట్ జట్టు సభ్యులు. 1943-44 సీజన్‌లో నూరు వికెట్లు పడగొట్టారు. ఆంధ్ర రాష్ట్ర జట్టు సభ్యుడు. గుంటూరులోని న్యూ క్రికెట్ క్లబ్ కార్యదర్శి.



శ్రీ యమ్. చిత్తరంజన్ :— జననం 1934 జూన్ 5, విశాఖపట్నం. 1952లో ఆంధ్ర యూనివర్సిటీ క్రికెట్ జట్టు సభ్యులు. 1953లో ఆంధ్రరాష్ట్ర జట్టు ఓపెనింగ్ బ్యాట్స్‌మన్. ఎడమచేతితో బ్యాట్ చేస్తారు. స్లో బౌలర్.



శ్రీ యస్. రామారావు :— భీమవరం నివాసి. ఓపెనింగ్ బ్యాట్స్‌మన్. 1953-54, 54-55, 55-56 సంవత్సరాలలో ఆంధ్ర రాష్ట్ర జట్టు సభ్యులు. 54-55 లో హైదరాబాదులో ఆడినప్పుడు 119 పరుగులు గావించారు. పేరొందిన బౌలరుకూడా.

శ్రీ ఎ. ఆర్. శ్రీధర్ :— వెంకటగిరి నివాసి. 1955-56 లో ఆంధ్రరాష్ట్ర జట్టు సభ్యులు. అదే సంవత్సరంలో కొచ్చిన్ తిరువాన్కూర్‌తో ఆడినప్పుడు 145 నిమిషాలలో 149 పరుగులు గావించారు. వీటిలో ఏడు బౌండరీలు.

ఇంకా క్రిందివారు రంజీట్రోఫీ పోటీలలో ఆంధ్రజట్టు ప్రతినిధులు. శ్రీయుతులు ఎస్. ఎస్. నాయుడు, కాకినాడ. (1953-54); జి. యస్. ఎన్. రాజు, విశాఖపట్నం. (1953-56); ఏ. జె. బ్రాక్, చీరాల. (1953-54); పి. నరసింహన్, విజయవాడ. (1953-54); రాజనీస్వా, విజయనగరం. (1953-54); కె. యస్. కన్నన్, వెంకటగిరి (1954-55); యాచేంద్ర, వెంకటగిరి. (1954-56); ఆర్. జగదీష్, వెంకటగిరి. 1954-55); యం. జె. రామమూర్తి, కర్నూలు. (1954-56); యస్. మస్తాన్ రావు, గుంటూరు. (1954-55); కె. నారాయణరావు, బందరు. (1954-55); కె. సీతారామారావు, గుంటూరు. (1955-56); యం. వి. ఆర్. కృష్ణారావు, విజయనగరం (1955 - 56).



శ్రీ సి. యస్. రావు :— ఢిల్లీలోని ఆంధ్రస్పోర్ట్సుక్లబ్ సభ్యులు. 1956 సెప్టెంబరులో లీగ్ క్రికెట్ పోటీలలో ఢిల్లీ జిల్లా క్రికెట్ సంఘం సభ్యునిగా సమాచారాశాఖా జట్టుతో పోటీచేస్తూ 6 పరుగులకు 9 వికెట్లు నష్టపరిచారు. ఇది ఢిల్లీ లీగ్ పోటీలలో రికార్డు. వీరు మొదట పడగొట్టిన ఆరువికెట్లు చేసిన పరుగులు ఒకటి మాత్రమే.

(శ్రీ) గులాం అహమ్మద్ :—హైదరాబాద్ నివాసి. జననం 1922 జూలై 5 వ తేది. అఫ్ స్పిన్నర్ గా ఇండియాలో ప్రముఖస్థానం



వహిస్తున్న వీరు 1948-49 లో వెస్టిండీస్ జట్టు ఇండియాకు వచ్చినప్పుడు తొలిసారి టెస్టుపోటీకి ఎన్నుకోబడ్డారు. అప్పుడు వీక్స్, వాల్కాట్ అంతటి వారలను అవుట్ చేసి బౌలింగ్ లో విశిష్టస్థానాన్ని ఏర్పరచుకొన్నారు. 1951-52 లో మద్రాసులో బ్రిటిష్ క్రికెట్ జట్టుపై ఇండియా తొలి టెస్టు విజయం సాధించడానికి వీరు, మన్ కడ్ ప్రధానంగా కారకులు. 1952 లో బ్రిటన్ లో పర్యటించారు. అప్పుడు లీడ్సు టెస్టులో 137 పరుగులకు ఏడు వికెట్లు నష్టపరిచారు. అదే సంవత్సరంలో ఇండియాలో పర్యటించిన పాకిస్తాన్ జట్టుకు సింహస్వప్న మైనారు. 1954–55 లో ఇండియాలో పర్యటించిన సిల్వర్ జూబ్లీ క్రికెట్ జట్టు, మద్రాసులో శ్రీ గులాం అహమ్మద్ ప్రతిభవల్లనే ఘోర పరాజయానికి గురి అయినది. ఇండియాజట్టుకు నాయకత్వం వహించిన శ్రీ గులాం అమహ్మద్ మొదటి ఇన్నింగ్స్ లో 55 పరుగులకు 5 వికెట్లు, రెండవ ఇన్నింగ్స్ లో 42 పరుగులకు ఏడు వికెట్లు నష్టపరిచారు. 1955-56 లో ఇండియాలో పర్యటించిన న్యూజిలెండ్ క్రికెట్ జట్టు, హైదరాబాద్ లో పోటీ చేసినప్పుడు శ్రీ గులాం అహమ్మద్ ఇండియా జట్టు కెప్టెన్. 1956 లో ఆస్ట్రేలియాతో పోటీచేసిన ఇండియా జట్టులో వీరు సభ్యులు. 1956-57 లో రంజీట్రోఫీ పోటీలలో హైదరాబాద్ జట్టు నాయకులు. (280 వ పేజీ మొదటి పేరా చూడండి)

(శ్రీ) జయసింహ :— (హైదరాబాదు) పేరొందిన రంజీ ట్రోఫీ క్రికెట్ ఆటగాడు. బౌలింగులోనూ, బ్యాటింగ్ లోనూ ప్రతిభాశాలి. 1956 ఆగస్టులో నిజాం కాలేజీ ఓపినింగ్ బ్యాట్సుమన్ గా

హైదరాబాదు 'ఎ' డివిజన్ క్రికెట్ టోర్నమెంటులో గోల్డెన్ స్టార్సుతో ఆడుతూ 84 నిమిషాలలో 114 పరుగులు గావించారు. ఇదే పోటీలో గోల్డెన్ స్టార్సు వికెట్లు అయిదింటిని 23 పరుగులకే పడగొట్టి తన జట్టు విజయానికి ప్రధానకారకులైనారు.

శ్రీ సుబ్బారావు :— (హైదరాబాదు) బౌలరుగా పేరొందారు. అక్కౌంటెంట్ జనరల్ ఆఫీసు జట్టు సభ్యునిగా 1956 సెప్టెంబరులో ఫ్రండ్సు యూనియన్ క్రికెట్ క్లబ్‌తో పోటీ చేసినప్పుడు ఒక్క పరుగైనా ఇవ్వకుండా ఆరు వికెట్లు నష్టపరిచారు. 'బి' డివిజన్ లీగ్ క్రికెట్ పోటీలో ఈ అద్భుత ప్రజ్ఞా ప్రదర్శనం చేశారు. శ్రీ సుబ్బారావుగారు చేసిన ఓవర్లు నాలుగు. నాలుగూ మెయిడన్ ఓవర్లు.

శ్రీ రంజిత్ సింహ్‌జీ :— జననం 1875 ప్రాంతం. ఇంగ్లండుకు డాక్టర్ డబ్లు. జి. గ్రేస్, ఆస్ట్రేలియాకు విక్టర్ ట్రంపర్ క్రికెట్ పితామహులైనటు ఇండియాకు రంజిత్ సింహ్‌జీ క్రికెట్ పితామహులు. బైరాగులకు, మంత్రగాళ్లకు, ఏనుగులకు ఇండియా నిలయమనే భ్రమతో వున్న ఆంగ్లేయులకు ఇండియా శక్తి సంపదలను తొలుత నిరూపించిన భారతీయ రాకుమారుడు రంజిత్ సింహ్‌జీ. "లెగ్ గాన్స్ స్ట్రోక్" వీరు కనిపెట్టి ప్రపంచ క్రికెటీర్లను ఆశ్చర్య



చకితులను చేశారు. ఏ యితర బ్యాట్సుమెన్ చూడలేనంత వేగంగా బంతి గతిని గమనించి, బంతి తనను సమీపించేవరకు కదలక, మెదలక, క్షణంలోని లక్షోవంతులో బంతి తనను చేరనున్నప్పుడు ఎడమకాలు కొద్దిగా ముందుకు పెట్టి, నడుమువంచి అతి సులువుగా తెలియని మార్గంలో బౌండరీలపై బౌండరీలు సాధించేవారు. అందువల్లనే "రన్ - గెట్ సింహ్‌జీ" (పరంపరగా పరుగులు తెచ్చే సింహ్‌జీ) గా ప్రపంచంలో

గణుతికెక్కారు. 19 వ శతాబ్దం అంతం 20 వ శతాబ్దారంభం ప్రపంచ క్రికెట్ చరిత్రలో రంజిత్ సింహ్‌జీ యుగమని చెప్పవచ్చు.

శ్రీ రంజిత్ కథియవాడ్‌లోని రాజకుమార్ కాలేజిలో క్రికెట్ అభ్యసించారు. తరువాత కేంబ్రిడ్జి యూనివర్శిటీలో విద్య నభ్యసించే నిమిత్తం 1894 ప్రాంతాల ఇంగ్లాండు వెళ్ళినప్పుడు, భారతీయుడుకదా అనే ఉద్దేశంతో వారిని గుర్తించిన వారే లేరు. కేంబ్రిడ్జిలోని 'పార్కర్స్ప్లేస్'లో వీరు ఆకాలపు ప్రొఫెషనల్ అగ్రబ్యాట్స్మెన్‌ను తనతో బౌల్ చేయడానికి నియమించి, బ్యాటింగ్‌లో అద్భుత ప్రజ్ఞను సాధించారు. 1895 లో ససెక్స్ జట్టుకు ఎన్నుకోబడ్డారు. లార్డ్సులో జరిగిన ఒక క్రికెట్ పోటీలో 150 పరుగులు చేసేసరికి, బ్రిటిష్ క్రికెటీర్లందరూ వీరిపైనే దృష్టిని కేంద్రీకరించారు. 1896 లో ఒక సీజన్‌లో ఇంగ్లాండులో 2780 పరుగులు గావించి, గ్రేస్ రికార్డును అధిగమించడంతో ప్రపంచ విఖ్యాతులైనారు. 1899 లోనూ, 1900 లోనూ, మూడేసి వేల పరుగులు చేశారు. 1900లో సగటున ఒక్కొక్క ఇన్నింగ్స్‌కు 87 పరుగులు చేశారు. ఐదుమార్లు డబుల్ సెంచరీలు కొట్టారు. 1897 లో ఆస్ట్రేలియాలో పర్యటించారు.

వీరి ఇతర రికార్డుల వివరం :— ఉత్తమశ్రేణి క్రికెట్ పోటీలో మొత్తం 72 సెంచరీలు కొట్టారు. 1896 లో వీరు సగటున ఇన్నింగ్స్‌కు 57.91 పరుగులు చేశారు. 1900 లో 87.57, 1904 లో 74.17 పరుగులు గావించారు.

మొదటి టెస్టులోనే సెంచరీ సాధించారు. 1896 లో మాంఛెస్టర్‌లో ఇంగ్లాండ్-ఆస్ట్రేలియాలకు టెస్టుపోటీ జరిగినప్పుడు ఇంగ్లాండు జట్టు సభ్యులుగా రంజిత్ 154 పరుగులు గావించారు. ఒకే రోజున ఒకే పోటీలో రెండు సెంచరీలు సాధించిన ఘనతకూడా వారిదే. ససెక్స్ యార్క్‌షైర్లకు పోటీ జరిగినప్పుడు ససెక్స్ ప్రతినిధి రంజిత్ 125, 180 పరుగులు సాధించారు.

(శ్రీ) ఉమ్రీగర్ :— ఇండియా జట్టు నాయకుడు శ్రీ పాలీ రతంజీ ఉమ్రీగర్ క్రికెట్‌లో సర్వతోముఖ ప్రతిభాశాలి. 30 ఏండ్ల

వయసుకలిగి ఆజానుబాహు అయిన ఉమ్రీగర్ తెగించి సాహసించి బ్యాట్ చేయడంలో పేరొందారు. బౌలర్‌గా కూడా క్రీడిస్తారు. తోటి ఆటగాళ్ళను ఫీల్డులో కీలకస్థానాలలో వుంచి ఎదుటిజట్టు ఎక్కువ పరుగులు చెయ్యకుండా నివారించడంలో ఘటికుడు. శ్రీ ఉమ్రీగర్ గుజరాత్ రాష్ట్రవాసి. 1951 - 52 నుంచి ఇండియా పోటీచేసిన ప్రతి క్రికెట్ టెస్టులోను వున్నారు. న్యూజీలెండ్ క్రికెట్ జట్టుతో పోటీచేసినప్పుడు 223 పరుగులు చేశారు. టెస్టు పోటీలో ఇండియన్ రెండు సెంచరీలు కొట్టడం అదే మొదటిసారి.



శ్రీ ఎల్. మంజ్రేకర్ :— 26 సంవత్సరాలు మాత్రమే వయసుకల శ్రీ మంజ్రేకర్ తొందరపాటుకు లోనుకాక స్థిరచిత్తంలో బ్యాట్ చేస్తారు. యువ బ్యాట్స్‌మెన్‌లో అద్వితీయుడు. సర్వతోముఖ ప్రతిభాశాలి కూడా. బ్రిటన్‌లో ఇండియాజట్టు సభ్యుడుగా పర్యటించినప్పుడు - విదేశ పర్యటనకు అది తొలి అనుభవమైనప్పటికీ - 33 ఇన్నింగ్స్‌లో 1059 పరుగులు గావించారు. లీడ్స్ టెస్టులో సెంచరీ కొట్టారు. వెస్టు ఇండీస్‌లో పర్యటించారు. హైదరాబాద్, ఢిల్లీలలో, న్యూజీలెండ్‌తో జరిగిన టెస్టు క్రికెట్ పోటీలలో రెండు డబుల్ సెంచరీలు కొట్టారు. ఆంధ్ర ఆటగాళ్ళకు వీరు శిక్షణ నిచ్చి ఉన్నారు.

శ్రీ డబ్ల్యు. జి. గ్రేస్ :— జననం 1848 జులై 18 వ తేది. (బ్రిటిష్ జాతీయుడు). బ్రిటన్‌కు క్రికెట్ పితామహుడు. 1864 లో తొలిసారి ఉన్నత క్రికెట్ పోటీలో పాల్గొని 170 పరుగులు గావించారు. సౌత్ వేల్సు క్లబ్బుజట్టు సభ్యుడుగా ససెక్సు జట్టుతో పోటీచేసినప్పుడు ఈ విజయం సాధించారు. 1871 లో ఒక సీజన్‌లో 2739 పరుగులు గావించి, రెండువేల పరుగులు మించిచేసిన ప్రపంచపు మొట్టమొదటి బ్యాట్సుమెన్ అయినారు. అదే సీజన్‌లో వీరు ఒక పోటీలో 268 పరుగులు గావించారు. 1874 లో ఒక సీజన్‌లో 1,000 పరుగులుచేసి 100 వికెట్లు పడగొట్టి మొట్టమొదటి ప్రపంచపు రికార్డు స్థాపించారు. 1876 లో

ఎమ్. సి. సి. తరపున కెంట్ తో ఆడుతూ 344 పరుగులు చేశారు. ప్రపంచంలో ఉన్నత క్రికెట్ పోటీలో 300 మించి పరుగులు చేసిన మొట్టమొదటి బ్యాట్సుమన్ వీరే. ఇదే సంవత్సరంలో ఆల్ ఇంగ్లాండు తరపున ఆడుతూ 400 పరుగులుచేసి ఔటుకాలేదు. ఇదీ మొదటి ప్రపంచపు రికార్డే. 1895 మేలో 47 వ ఏట, 22 రోజుల్లో 1,000 పరుగులు చేసి నూరవ సెంచరీ పూర్తిగావించారు.

శ్రీ లెన్ హట్టన్ :— (బ్రిటన్) జననం 1916 జూన్ 23 వ తేది. టెస్టు క్రికెట్ లో ప్రవేశం 1937. 1938 లో నాటింగ్ హామ్‌లో ఆస్ట్రేలియా జట్టుపై పోటీచేసి మొట్టమొదటి సెంచరీ సాధించారు. ఈ ఇంగ్లండు – ఆస్ట్రేలియా టెస్టు పరంపరలోనే ఓవర్‌లో 364 పరుగులు గావించి ప్రపంచపు రికార్డు నెలకొల్పారు. అప్పుడు మొత్తం 13 గంటల 20 నిమిషాలుసేపు బ్యాట్ చేశారు. 16 వ ఇన్నింగ్స్‌తో మొత్తం 1068 పరుగులు పూర్తి చేశారు. 1939 లోనే ఈ రికార్డును అందుకొన్నారు. 1950 లో వెస్టు ఇండీస్‌తో ఓవర్‌లో ఆడినప్పుడు 202 పరుగులు, 1951 లో ఆడిలెడ్‌లో ఆస్ట్రేలియతో ఆడినప్పుడు 156 పరుగులు గావించారు. ఆస్ట్రేలియాపై టెస్టు పరంపరలో విజయమొందిన బ్రిటిష్ జట్టుకు వీరు నాయకులు. వీరు ఉత్తమ క్రికెట్ పోటీలలో మొత్తం 39,950 పరుగులు గావించారు. మొత్తం 23 సార్లు బ్రిటిష్ జట్టుకు నాయకత్వం వహించారు. మరెవ్వరు ఇంగ్లండు జట్టుకు ఇన్నిసార్లు నాయకత్వం వహించలేదు.



శ్రీ డాన్ బ్రాడ్మన్ :— (ఆస్ట్రేలియా) జననం 1908. ఆస్ట్రేలియా క్రికెట్ చరిత్రలో వీరిని మించినవారు లేరు. ప్రపంచ క్రికెటీర్లలో కూడా, నాటికి నేటికి వీరు ప్రప్రథమ శ్రేణికి చెందినవారవుతారు. 1928-29 లో టెస్టుక్రికెట్ రంగంలో ప్రవేశించారు. క్వీన్స్‌లాండులో జరిగిన ఒక ఉన్నత క్రికెట్ పోటీలో 452 పరుగులు గావించి ఔట్ కాలేదు. ఇది ప్రపంచం రికార్డు. బ్రాడ్మన్

ఔటు చేయించడానికి బ్రిటిష్‌వారు 'బాడీలైన్' పద్ధతి ప్రవేశ పెట్టినట్లు ఒకవాదం వున్నది.

బ్రాడ్మన్ రికార్డుల వివరం:— మొత్తం ఉన్నత శ్రేణి క్రికెట్ పోటీలలో 337 ఇన్నింగ్స్‌లలో పాల్గొని 27,984 పరుగులు గావించారు. టెస్టు క్రికెట్ పోటీలలో 80 ఇన్నింగ్స్‌లలో పాల్గొని 6,996 పరుగులు చేశారు. ఒక టెస్టులో 334 పరుగులు చేశారు. 20 సంవత్సరాలు క్రికెట్ రంగంలోవుండి, సగటున 90 పరుగులు చేశారు. మొత్తం 211 సెంచరీలు చేయగా వాటిలో 41 డబుల్ సెంచరీలు, 18 ట్రిబుల్ సెంచరీలు, ఒకటి క్వాడ్రుపుల్ సెంచరీ (400 కు మించి). వీరు 24 సార్లు ఆస్ట్రేలియా జట్టుకు నాయకత్వం వహించారు. 1948 లో చివరిసారి ఇంగ్లాండులో పర్యటించి ఇక ఉన్నత క్రికెట్ పోటీనుంచి విరమించారు. బ్రిటిష్ ప్రభుత్వం వీరికి 'సర్' బిరుదమిచ్చి సత్కరించింది.

శ్రీ ఇవాన్ విలియమ్ జాన్సన్ :— (ఆస్ట్రేలియా). జననం 1919. ఇంగ్లాండు, వెస్టిండీస్, పాకిస్తాను, ఇండియాలలో పర్యటించిన ఆస్ట్రేలియా క్రికెట్ జట్టుకు నాయకులు. వీరు సర్వతోభిముఖ ప్రతిభాశాలి. బ్రాడ్మన్, హాస్సెట్ తరువాత ఆస్ట్రేలియాకు నాయకత్వం వహిస్తున్నారు. క్రికెట్‌కు వీరుచేసిన సేవను ప్రశంసిస్తూ బ్రిటిష్ ప్రభుత్వం వీరికి యం. బి. యి. బిరుద మిచ్చింది.







శ్రీ ఇ. డి. వీక్స్ :—(వెస్టిండీస్) నీగ్రో. ఇండియా, వెస్టిండీస్‌లకు జరిగిన క్రికెట్ పోటీలలో వీరు రెండు సందర్భాలలో డబుల్ సెంచరీలు (207, 207) సాధించారు. మరికొన్ని సందర్భాలలో చేసిన పరుగులలో 194, 162, 101, 161, 128 గణనీయమైనవి.

## రంజీట్రోఫీ విజేతలు

రంజిత్‌సింహ్‌జీ స్మారకార్థం 1934-35 నుంచి జరుపబడుతున్న రంజీట్రోఫీ భారత క్రికెట్ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్న రాష్ట్రాల వివరం దిగువ తెలుపబడింది:

1934-35 — 1935-36 బొంబాయి, 1936-37 నవనగర్ 1937-38 హైదరాబాద్, 1938-39 బెంగాల్, 1939-40—1940-41 మహారాష్ట్ర, 1941-42 బొంబాయి, 1942-43 బరోడా, 1943-44 వెస్టరన్ ఇండియా, 1944-45 బొంబాయి, 1945-46 హోల్కార్, 1946-47 బరోడా, 1947-48 హోల్కార్, 1948-49 బొంబాయి, 1949-50 బరోడా, 1950-51 హోల్కార్, 1951-52 బొంబాయి, 1952-53 హోల్కార్, 1953-54 బొంబాయి, 1954-55 మద్రాసు, 1955-56 బొంబాయి.

# అధ్యాయము 11

# టెన్నిస్

13 వ శతాబ్దంలో టెన్నిస్ మొదట ఫ్రాన్సులో ప్రచారంలోనికి వచ్చినప్పటికీ అంతకుముందుకూడా పర్షియన్లు, ఈజిప్షియన్లు టెన్నిస్ పోలిన ఒక క్రీడను ఆడేవారు. నెట్ పైగా బంతిని కొట్టడం, దానిని తిరగకొట్టడం ఈ క్రీడ రీతి.



13 వ శతాబ్దంలో ఫ్రెంచి దేశస్థులు "జీన్ డి పామే" అనే టెన్నిస్ ఆట ఆడేవారు. చేతితో నెట్టుపైగా బంతిని కొట్టడం, తిరుగగొట్టడం ఈ క్రీడలో విశేషం. 14 వ శతాబ్దంలో ఫ్రాన్సు అంతటా మందిరాలలోనూ, ఆరుబయలులోనూ టెన్నిస్ ఆడబడేది. మందిరాలలో ఆడే టెన్నిస్‌ను "కోర్టె పామే"గాను, ఆరుబయలు ఆడే టెన్నిస్‌ను "లాంగే ఫామే" గాను వ్యవహరించేవారు. ఇంతకు ముందునుంచే ఇంగ్లండులో చేతితో బంతిని కొట్టే ఒక ఆట అమలులో వుండేది. ఆరుబయలులో అయితే యిద్దరిద్దరు, ఇళ్ళలో అయితే ఒక్కరు గోడకేసి ఈ ఆట ఆడేవారు. కేవలం సామాన్య ప్రజలలోనే ఈ ఆట ప్రచారంలో వుండేది. రాజుల దృష్టికి పోనేలేదు. తరువాత తరువాత బ్రిటిష్‌వారు ఫ్రెంచివారినుంచి "కోర్టే పామే" అభ్యసించారు.

ఆరంభంలో వుట్టిఅరచేతితోనే బంతి కొట్టినప్పటికి పోను పోనూ చేతికి రబ్బరు తొడుగు తొడిగి కొట్టేవారు. తరువాత తరువాత రేకెట్ కర్రలు పుచ్చుకొని కొట్టేవారు. మరికొంతకాలానికి వెడల్పు "తల" కల రేకెట్లతో కొట్టడం ప్రారంభించారు.

1600 సంవత్సరంలో ఒక్క పారిస్ నగరంలోనే 1800 టెన్నిస్ కోర్టులు వుండేవట.

18 వ శతాబ్దం నుంచి మందిరాలలో టెన్నిస్ ఆటకు క్షీణదశ పట్టింది. కాని ఆరుబయట టెన్నిస్ విశేషంగా ప్రచారంలోనికి వచ్చింది. 1793 లో "ఫీల్డ్ టెన్నిస్" క్రికెట్ కంటే కూడా ఎక్కువ ప్రచారంలో వుండేది. తిరిగి 19 వ శతాబ్దం లో ఇన్‌డోర్ టెన్నిస్‌కు తిరిగి జీవంవచ్చి వ్యాప్తిచెంద ప్రారంభించింది. 1870 లో అమెరికాలో టెన్నిస్ ప్రవేశపెట్టబడింది. 1874-79 మధ్య టెన్నిస్ ఆటకు కోర్టుల ప్రమాణాది నిర్ణయాలు జరిగినవి.

టెన్నిస్‌కు క్రమబద్ధమైన కోర్టు, నియమనిబంధనలు రూపొందించ బడినమీదట ప్రతి టెన్నిస్ ఆటగాడు ఎక్కువ డిఫెన్సివ్ ఆటను (తను సాహసించి పాయింటు తెచ్చుకోకుండా ప్రత్యర్థి తప్పుపై పాయింటు తెచ్చుకొనే పద్ధతి) అవలంబించేవారు. కొంతకాలానికి ధాటీగా ఎదురు వెళ్ళడం, శక్తిమంతంగా సర్వీస్ చేయడం, నెట్ వద్ద నుంచి ఫిరంగి గుండువలె కొట్టడంవంటి పద్ధతి అమలులోనికి వచ్చింది. ఇప్పుడు ఆధునిక టెన్నిస్ 'పవర్ టెన్నిస్'. ఆటగాని వేగం, దెబ్బ పటిమ, శక్తి, సహిష్ణుతలపై జయాపజయాలు ఆధారపడి వుంటవి. ఆటగానికి సర్వీస్ సగం బలం. వేగం, పురోగమనం, సుడిత్రిప్పి బంతికొట్టడం విజేతలకు ప్రధాన అంగాలవుతున్నవి. ఆస్ట్రేలియాలో శ్రీ హారీ హాప్మన్ టెన్నిస్ ఆటగాళ్ళకు యిస్తున్న శిక్షణవల్ల టెన్నిస్ ఆటలోనే పెద్ద మార్పు వచ్చింది. వీరి వద్ద శిక్షణపొందిన యల్. హోడ్, కె. రోజ్వాల్ ప్రభృతుల సర్వీస్ అద్భుత శక్తిసంపన్నమైనది.

ప్రపంచంలోకెల్ల పెద్ద టెన్నిస్ టోర్నమెంటులుగా చెప్పదగినవి వింబుల్డన్ ఛాంపియన్ షిప్ పోటీలు, డేవిస్ కప్పు పోటీలు. వింబుల్డన్ పోటీలను ఏటా జూనులో వింబుల్డన్‌లో ఆల్ ఇంగ్లండ్ లాన్ టెన్నిస్ అసోసియేషన్ నిర్వహిస్తుంది.

1900 నుంచి డేవిస్ కప్పు ఛాంపియన్‌షిప్ పోటీలు జరుపబడు తున్నవి. శ్రీ డ్వాయిట్ డేవిస్ అనే అమెరికన్ ఈ టోర్నమెంటును సంస్థాపించాడు.

ఈ పోటీలవల్ల ప్రపంచంలోని అగ్ర టెన్నిస్ ఆటగాళ్ళను నిర్ణయించడానికి ఒక ప్రాతిపదిక ఏర్పడింది. 1933 వరకు టెన్నిస్ రంగంలో అశేష ఖ్యాతి గడించినవారు ఎక్కువగా అమెరికా, ఆస్ట్రేలియా, ఫ్రాన్సు, బ్రిటన్‌లకు చెందినవారు. ఈ కాలానికి (1933 వరకు) చెందిన అగ్ర టెన్నిస్ ఆటగాళ్ళుగా క్రిందివారిని చెప్పవచ్చు:

1. డబ్ల్యు. టి. టిల్డన్ (అమెరికా), 2. హెచ్. యల్. డోహెర్టి (బ్రిటన్), 3. యన్. ఇ. బ్రూక్సు (ఆస్ట్రేలియా) 4. డబ్ల్యు. ఇ. జాన్‌స్టన్ (అమెరికా), 5. ఆర్. ఎఫ్. డోహెర్టి (బ్రిటన్), 6. ఎ. ఎఫ్. వైల్డింగ్ (న్యూజిలాండ్), 7. రేనీలాకోస్టీ (ఫ్రాన్సు) 8. హెచ్. కోషే (ఫ్రాన్సు), 9. డబ్ల్యు. ఎ. లార్నెడ్ (అమెరికా), 10. యం. ఇ. మెక్‌లాఫ్లిన్ (అమెరికా).

1933 తరువాత నేటివరకు ప్రపంచప్రమాణం అందుకొన్న టెన్నిస్ ఆటగాళ్ళుగా క్రిందివారిని ఉదహరించవచ్చు:

1. ఫ్రెడ్ పెర్రి (బ్రిటన్), 2. ఎల్స్‌వర్తు వైన్సు (అమెరికా), 3. జె. డి. బడ్జి (అమెరికా), 4. జె. ఎ. క్రామర్ (అమెరికా), 5. ఎఫ్. సెడ్జిమెన్ (ఆస్ట్రేలియా), 6. జె. డ్రాబ్ని (ఈజిప్ట్), 7. టి. ట్రాబర్టు (అమెరికా), 8. కె. రోజ్వాల్ (ఆస్ట్రేలియా), 9. లూయిహోడ్ (ఆస్ట్రేలియా).

ఇదేకాలంలో ప్రపంచప్రమాణం అందుకొన్న ఆటకత్తెలుగా క్రిందివారిని పేర్కొనవచ్చు:

1. హెలన్ జాకబ్స్ (అమెరికా), 2. డి. ఐ. రౌండ్ (బ్రిటన్), 3. ఏ. ఎల్. బ్రో (అమెరికా), 4. డి. జె. హార్టు (అమెరికా), 5. యం. కానలీ (అమెరికా), 6. ఫ్రై (అమెరికా).

## ఇండియా

బ్రిటిష్‌వారి పరిపాలనవల్ల ఇండియాలో టెన్నిస్ కాలుపెట్టింది. మొదటిరోజుల్లో బ్రిటిష్‌వారు మాత్రమే, అదయినా తమమధ్య మాత్రమే,

టెన్నిస్ ఆడేవారు. మరికొంతకాలానికి పెద్ద హోదాకల భారతీయులు కూడా స్వశక్తిపై టెన్నిస్ అభ్యసించగా ఆంగ్లేయులు భారతీయులతో కలిసి ఆడేవారు.

1885 నుంచి పంజాబులోనూ, 1887 నుంచి బెంగాలులోనూ, 1900 నుంచి చెన్నరాష్ట్రములోనూ, 1912 నుంచి బొంబాయిలోనూ టెన్నిస్ ప్రచారంలో వున్నది.

ఇప్పుడు విదేశాలలో మైదానాలలోనూ, క్లే కోర్టులపైన, సిమెంటు కోర్టులపైన, తుదకు మంచుపైన టెన్నిస్ ఆడబడుతున్నది. ఇండియాలో ఎక్కువగా గ్రాస్‌కోర్టు, హార్డుకోర్టు టెన్నిస్ మాత్రమే అమలులో వున్నది. ఉత్తర భారతంలోనూ, ఈశాన్య భారతంలోనూ, లాన్ టెన్నిస్ ప్రచారంలో వున్నది. పశ్చిమ బెంగాలు, ఉత్తర ప్రదేశ్, ఢిల్లీ, పంజాబులలో గ్రాస్‌కోర్టు టెన్నిస్ విశేషంగా ప్రచారంలో వున్నది. హార్డుకోర్టు టెన్నిస్ బొంబాయి, మద్రాసు, ఆంధ్రప్రదేశ్, మైసూరు, కేరళ రాష్ట్రాలలోనూ, బరోడా, ఇండోరులలోనూ ఎక్కువగా ప్రచారంలో వున్నది.

19 వ శతాబ్దాంతములోనూ, 20 వ శతాబ్దం మొదటి పావు శతాబ్దంలోనూ చెన్నరాష్ట్రంలో టెన్నిస్‌లో విశేష ప్రతిభ గడించిన వారిలో శ్రీ నారుమంచి నారాయణమూర్తిగారు, శ్రీ యుతులు కె. పి. లక్ష్మణరావు, నిజెల్ జోన్సు, టి. జి. సింగరవేలు, పి. వి. కృష్ణమూర్తి, రాజఅయ్యర్ ముఖ్యులు.

డబుల్సులో శ్రీ నారుమంచి నారాయణమూర్తి, లక్ష్మణరావు గారలు, కోటరామస్వామి, యం. వెంకటరామానుజులుగారలు, ఎస్. వెంకటరావు, బాలగోపాల్ గారలు పేరుగాంచారు. శ్రీ కోట రామ స్వామిగారు, శ్రీ నల్లంరెడ్డి కృష్ణస్వామిగారితోనూ, శ్రీ లక్ష్మణరావు, మహంతిగారితోను కలిసి (డబుల్సు) ఆడుతుండేవారు. ఇదే కాలంలో పంజాబులో ఎల్. యస్. డియనీ, జగత్ మోహన్‌లాల్, యం. స్లీమ్ (ప్రస్తుతం పాకిస్తాన్ నివాసి) గారలు, బొంబాయిలో డాక్టర్ ఎ. హెచ్. ఫైజీ, ఎ. ఎ. ఫైజీ గారలు విశేష ఖ్యాతి గడించారు.

ఇండియా తొలిసారి 1920 లో అంతర్జాతీయ టెన్నిస్ టోర్నమెంటులో పాల్గొన్నది. ఆ ఏడు డెవిస్‌కప్పు పోటీలలో భారత ప్రతినిధులుగా యల్. యస్. డెయనీ, యం. స్లీమ్ గారలు పాల్గొన్నారు.

1922 లో డేవిస్‌కప్పు పోటీలలో భారత ప్రతినిధిగా శ్రీ కోట రామస్వామిగారు పాల్గొన్నారు. నాటికి, నేటికి, ఈ ప్రపంచ పోటీలో పాల్గొన్న ఆంధ్ర ప్రముఖులు వీరొక్కరే (వీరి జీవిత చరిత్ర క్రికెట్ అనే అధ్యాయంలో చూడనగును.)

రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో చెన్న రాష్ట్రంలో టెన్నిస్‌లో గణుతికెక్కినవారు శ్రీయుతులు టి. బి. బాలగోపాల్, కోటరామస్వామి, నల్లంరెడ్డి కృష్ణస్వామి, దుగ్గిరాల పూర్ణచంద్రరావు, యన్. వెంకట్రావు, యస్. నారాయణరావు, యన్. రామారావు, యం. వి. బాబ్జీ, వై. ఆర్. సావూర్, రాంనాథ్‌రాజా, టి. కె. రామనాథం గారలు.

ఇండియా కిది స్వర్ణయుగంగా చెప్పవచ్చు. గౌస్ మహమ్మద్ ఈ కాలానికి చెందినవాడే. వింబుల్డన్ ఛాంపియన్‌షిప్ పోటీలో క్వార్టర్ ఫైనల్సు చేరుకున్న మొట్టమొదటి సంపూర్ణ భారతీయుడు ఈయనే (1938). నాటికి, నేటికి మరే భారతీయుడు ఈ ఘనతను నోచుకోలేదు. (1925 లో ఇండియా ప్రతినిధి యస్. హెచ్. జాకబ్ వింబుల్డన్ క్వార్టర్ ఫైనల్సు చేరుకున్నారు. కాని వీరు సంపూర్ణ భారతీయులు కాదని పెద్దలు చెబుతారు.)

ఈ కాలంలోనే పంజాబుకు చెందిన శ్రీయుతులు ఎమ్. స్లీమ్, ఎ. మదన్ మోహన్, సోహన్‌లాల్, మన్‌మోహన్ భండారీ, జె. చిరంజీవ, ఎస్. ఎల్. ఆర్. సహానీ, బెంగాలుకు చెందిన పి. యజ్. మెహతా, సి. యల్. మెహతా, ఉత్తర ప్రదేశ్‌కు చెందిన యుధిష్ఠర్ సింగ్, డి. యజ్. కపూర్, కృష్ణప్రసాదు, హైదరాబాదుకు చెందిన యస్. యం. హాడీ, యస్. యం. హుస్సేన్, మైసూరుకు చెందిన బి. రాచప్ప అఖిల భారత ఖ్యాతి గడించారు. టిల్డన్ చెప్పినట్లు, శ్రీ కోట రామస్వామిగారు నుడివినట్లు, భారత టెన్నిస్ చరిత్రలోనే

గాక ప్రపంచ టెన్నిస్ చరిత్రలోనే ఈ కాలం స్వర్ణయుగం. యుద్ధానంతరపు ఆటగాళ్ళలో ఈ కాలపువారి శక్తిస్తోమతలు లోపిస్తున్నవి. సర్వీస్ చేయడం, ముందుకు పరుగిడడం, తొందరపడడం, యుద్ధానంతర ఆటగాళ్ళ లక్షణాలనీ; వివేకం, విజ్ఞత, ఆలోచన వీరిలో లోపిస్తున్నవనీ శ్రీ టిల్డన్ 1950 లో చెప్పివున్నారు.

యుద్ధానంతర భారతీయ ఆటగాళ్ళలో చెప్పదగినవారు బెంగాలుకు చెందిన డి. కె. బోసు, యస్. సి. మిత్రా; పంజాబుకు చెందిన నరేంద్రనాథ్, నరేష్‌కుమార్; బొంబాయికి చెందిన జి. వసంత్; మైసూరుకు చెందిన బి. ఆర్. కపినీపతి; మద్రాసుకు చెందిన ఆర్. కృష్ణన్, యస్. విష్ణుమోహన్, యం. వి. జి. అప్పారావు; ఆంధ్రకు చెందిన శ్రీ మాధవపెద్ది జానకిరామయ్య, శ్రీ యస్. భుజంగరావుగారలు ముఖ్యులు.



ఊర్మిళా థాపర్, రీటాదావర్

శ్రీమతులు రీటా దావర్, ఊర్మిళా సాహె(యు. పి.); అంజనీ దేశాయి, లక్ష్మి మర్చంట్ (బొంబాయి); యల్. వుడ్‌బ్రిడ్జి (మద్రాసు) ఈ కాలంలో అఖిల భారత ఖ్యాతి పొందారు.

అల్హాబాద్, రామచంద్రపురం వంటి పట్టణాలలో నేడు సిమెంట్ టెన్నిస్ కోర్టులు వున్నవి. అయితే విదేశాలలో వలె ఇండియాలో సిమెంట్ కోర్టులపై పెద్ద టోర్నమెంటులు జరపబడడంలేదు.

ఆంధ్రదేశంలో తొలి టెన్నిస్ అగ్ర ఆటగాళ్ళలో శ్రీయుతులు దేశరాజు సార్వ

భీమరావు (ఒంగోలుప్రాంతవాసి), సి. జానకిరామయ్య, సి. సీతారామయ్య, పి. భాష్యం, టి. రామలింగస్వామి, మాధవపెద్ది కాళిదాసు, ఆర్. వి. వి. యస్. ప్రసాద్ ప్రభృతులు ముఖ్యులు. ద్వితీయ ప్రపంచ సంగ్రామం ప్రారంభమయ్యేలోగా ఏలూరు, రాజమండ్రి, విశాఖపట్నం, బందరు, కాకినాడ, నూజివీడు, బెజవాడ, తణుకు, విజయనగరములలో పెద్ద టోర్నమెంటులు జరుగుతుండేవి. పిఠాపురం మహారాజా, వుయ్యూర్యు, ఎలమఞ్చిలి జమీందార్లు, విజయనగరం మహారాజా, సయ్యద్ అహమ్మద్ అభిమానులు ఈ టోర్నమెంటులు జరుపుతూండేవారు.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం గౌసు మహమ్మద్, యుధిష్ఠర్ సింగ్, అర్కి-న్‌స్టాల్ ప్రభృతులు ఆంధ్రదేశంలో పర్యటించి టెన్నిస్ పట్ల ప్రజలలో ఆసక్తి పెంపొందటానికి కారకులయ్యారు.

అప్పటి హైదరాబాద్ సంస్థానంలో జాతీయ, అంతర్జాతీయ ఖ్యాతి గడించిన టెన్నిస్ ఆటగాడు వుండేవాడు. డేవిస్‌కప్పు పోటీలలో పాల్గొన్న శ్రీ యస్. యం. హాడీ హైదరాబాద్ నివాసి.

ఇప్పటి వారిలో అఖిలభారత ప్రమాణాన్ని అందుకొన్న ఆంధ్రప్రదేశ్ ఆటగాడు లేడు. శ్రీ కె. గోపాలరావు (గుంటూరు) శ్రీ ఆసిఫ్ ఖద్రీ (హైదరాబాద్) పేరొందిన యువఆటగాళ్లు. తగుశిక్షణ, ప్రోత్సాహం వుంటే అఖిలభారత ప్రమాణాన్ని అందుకోగల యువఆటగాళ్ళు ఆంధ్రప్రదేశ్‌లో చాలామంది వున్నారు.

## ఆటగాళ్ళ పరిచయం

శ్రీ నల్లంరెడ్డి కృష్ణస్వామి:— జననం 1905 అక్టోబరు 3. ఇండియాలో టెన్నిస్‌లో 'వాలీయింగ్' ను ఘనంగా వినియోగించిన వారిలో మొట్టమొదటివారు శ్రీ నల్లంరెడ్డి కృష్ణస్వామిగారు. స్కూలు, కాలేజిదశలలో ఫుట్‌బాల్ ఆటలో మొదట ఫుల్‌బ్యాక్‌గాను, తరువాత

సెంటర్ ఫార్వర్డ్‌గాను, గుంటూరు, కృష్ణ, గోదావరి, మండలాలలో పేరు గడించారు. కేసరిజట్టు సభ్యులు. కాకినాడ పి. ఆర్. కాలేజిలో చదువు



కొంటున్నప్పుడు టెన్నిస్ ఆట అభ్యసించారు. రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో చదువుకొంటున్నప్పుడు మద్రాసులో జరిగిన విల్సన్ కప్పు ఫుట్‌బాల్ పోటీలలో రాజమండ్రి కాలేజిజట్టు పాల్గొన్నది. ఈ జట్టులో శ్రీ కృష్ణస్వామిగారు సభ్యులు. ఫైనల్సుకు ఈ జట్టు వచ్చింది. మద్రాసు ఫుట్‌బాల్ పోటీలలో పాల్గొన్న మొట్టమొదటి ఆంధ్ర జటు ఇదే. శ్రీ సి. కె. నాయుడుగారు శ్రీ కృష్ణస్వామిగారి ఆటను చూచి మెచ్చుకొన్నారు. మరుసటి సంవత్సరం రాజమండ్రి జట్టు విల్సన్ కప్పు గెలుచుకొన్నది. కాలేజి విద్యానంతరం గుంటూరుకు తిరిగి వచ్చి శ్రీ ఆర్. వి. వి. యస్. ప్రసాద్, శ్రీ కోట రామస్వామిగార్ల ప్రోత్సాహంతో టెన్నిస్‌లో మరింత తీవ్రంగా కృషిచేశారు. మహా వేగంతో ఆడటం, ప్రత్యర్థి వేసే బంతి గమనం అతిత్వరగా తెలుసుకొనడం, పటిష్ఠమైన వాలీయింగ్, సరి అయిన గురి ఈ కాలంలోనే వారికి అలవడినవి.

తదుపరి మద్రాసు లాకాలేజీలో విద్య నభ్యసించారు. ఇంతకు ముందు - 1929లో అప్పటి దక్షిణభారత ఛాంపియన్లయిన శ్రీ ఎక్. వెంకట్రావు, శ్రీ టి. బి. బాలగోపాల్‌గార్లను డబుల్సు పోటీలో శ్రీ కృష్ణస్వామి, శ్రీ ఆర్. వి. వి. యస్. ప్రసాద్‌గారలు సరాసరి గేములలో ఓడించి ఛాంపియన్‌షిప్ సాధించారు. టెన్నిస్‌లో కృష్ణస్వామిగారికి మహావిజయ మిది. అక్నోలో జరిగిన అంతర్విశ్వవిద్యాలయ టెన్నిస్ టోర్నమెంట్‌లో మద్రాసు జట్టుకు వారు నాయకత్వం వహించి ఛాంపియన్‌షిప్ సాధించారు. అంతర్రాష్ట్ర పోటీలలో చెన్నరాష్ట్రం తరుపున, వీరు, శ్రీ రామస్వామిగారు,

శ్రీ బాలగోపాల్ పాల్గొని ఛాంపియన్‌షిప్‌ను సాధించారు. కలకత్తాలో శ్వాత్‌క్లబ్ పోటీలలో పాల్గొనడానికి శ్రీ కృష్ణస్వామిగారు ఆహ్వానించ బడినారు. ఆ రోజులలో ఇది గొప్ప ఘనత. ఫ్రెంచి ఆటగాడు శ్రీ కొషేక కలకత్తాలో వీరు గట్టిపోటీ యిచ్చారు.

లా కాలేజీలో విద్యానంతరం, పిఠాపురం మహారాజాగారికి అంతరంగిక కార్యదర్శిగా వున్నారు. మహారాజాగారు వీరిని టెన్నిస్ ఆటలో ఎంతో ప్రోత్సహించారు. 1930 లో కలకత్తాలో ఫ్రెంచి ఆటగాళ్లతోనూ, 1931 లో బ్రిటిషు జట్టుతోనూ, జపాను జట్టుతోను, 1932 లో ఇటాలియన్ జట్టుతోనూ, 1935 లో యుగోస్లావియా జట్టుతోనూ, 1936 లో మధ్యయూరప్ జట్టుతోనూ శ్రీ కృష్ణస్వామి గారు ఇండియా ప్రతినిధిగా పోటీ చేసివున్నారు. శ్రీ సర్టోరియో (ఇటలీ), శ్రీ హేరన్ (బ్రిటన్) వంటి అగ్ర ఆటగాళ్లను వీరు ఓడించి వేశారు కూడా. శ్రీ పెన్ సెక్, శ్రీ పల్లాడా అనే యుగోస్లావియా ఆటగాళ్లను డబుల్స్ పోటీలో రెండుసార్లు ఓడించగలిగిన భారతీయుడు శ్రీ కృష్ణస్వామిగారొక్కరే. ఒక సందర్భములో శ్రీ బ్రూక్ ఎడ్వర్డ్స్ మరొక సందర్భములో శ్రీ చిరంజీవా శ్రీ కృష్ణస్వామిగారికి పార్ట్నర్‌గా వున్నారు. మొదటి పోటీ లక్నోలోనూ, రెండవ పోటీ బొంబాయి లోనూ జరిగినవి.

ఇంకొక సందర్భంలో శ్రీ కృష్ణస్వామి శ్రీసహానీగార్లు మెంజల్, హెక్ట (చెకొస్లావేకియా) గార్లను ఓడించివేశారు.

1935 లోనూ, 1936 లోనూ, సింహళం సింగిల్స్ ఛాంపియన్ షిప్ సాధించారు. ఈ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్న మొదటి భారతీయుడు వీరే. 1936 లో సింహళంలోనూ, తూర్పు ఆఫ్రికాలోనూ పర్యటించిన ఇండియా టెన్నిస్‌జట్టు నాయకులు.

1935 లో మిస్ కాండిసన్ పార్ట్నర్‌గా శ్రీ కృష్ణస్వామిగారు ఆలిండియా మిక్స్‌డ్ డబుల్స్ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్నారు.

శ్రీ కృష్ణస్వామిగారు వాలీబాల్, బాడ్మింటన్, అథ్లెటిక్స్‌లో కూడా విశేష ప్రతిభ గడించారు. క్రీడా జీవితంలో అనేకవందల

ట్రోఫీలను గెలుచుకొని, పోటీలనుంచి విరమించిన పిమ్మట, బాల, యువ ఆటగాళ్ళకు యిచ్చివేసి వారిని ప్రోత్సహించారు. వీరు చాలా సంవత్సరాలు ఆలిండియా లాన్ టెన్నిస్ సంఘ కార్యదర్శిగా వుండి, దేశంలో అనేక శిక్షణ ప్రణాళికలను అమలు పరిచారు. శ్రీ ఆర్. కృష్ణన్‌కు ఆస్ట్రేలియాలో ఉన్నత శిక్షణ నిప్పించడానికికూడా వీరు ప్రధాన కారకులు.

శ్రీ దుగ్గిరాల పూర్ణచంద్రరావు :— జననం 1909 నవంబరు 2 - తెనాలి. 1926 లో టెన్నిస్‌లో ప్రవేశం. 1928 లో



తొలిసారి విజయవాడలో ఓపెన్ సింగిల్స్ ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొన్నారు. అప్పుడు శ్రీ మాధవపెద్ది జానకిరామయ్యగారిని 6—3, 6—2, 6—1 గేములతో ఓడించారు. 1929 లో లక్నోలో మొట్ట మొదటి అఖిలభారత అంతర్విశ్వ విద్యాలయం టెన్నిస్ ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొన్న మద్రాసు యూనివర్సిటీ జట్టులో సభ్యులు. 1934–35 లో విజయవాడలో జరిగిన ఎగ్జిబిషన్ పోటీలలో ఫోర్డు, జాకబీ వంటి పశ్చిమ ఆస్ట్రేలియా ఆటగాళ్ళతోనూ, పలాడా, పవొలిక్ వంటి యుగోస్లావియన్ ఆటగాళ్ళతోనూ పోటీచేసి పేరొందారు. 1932—33 లో కాశీ హిందూ విశ్వవిద్యాలయం టెన్నిస్ ఛాంపియన్. కాశీలోనే ప్రిన్స్ ఆఫ్ వేల్సు టెన్నిస్ టోర్నమెంటులో కూడా ప్రథమస్థానం పొందారు. 1936 లో కూనూరులో జరిగిన పెద్ద టోర్నమెంటులో శ్రీ వి. పార్థసారథి పార్టనర్‌గా వుండగా శ్రీ పూర్ణచంద్రరావుగారు డబుల్స్ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్నారు. ఈ టోర్నమెంటులోనే మొదటి రౌండ్‌లో శివస్వామి, రామ్‌నాథ్ రాజా వంటి అగ్ర ఆటగాళ్ళను ఓడించారు (డబుల్సు పోటీలో). 1936 లో నైరోబీలో జరిగిన కీన్యా లాన్ టెన్నిస్ ఛాంపియన్ షిప్ పోటీలలో ఇండియా ప్రతినిధిగా పాల్గొన్నారు. అప్పుడు భారత ప్రతినిధివర్గంలో శ్రీ నల్లంరెడ్డి కృష్ణస్వామి (కెప్టెన్), గౌస్ మహమ్మద్ (యు. పి.) సహానీ (పంజాబు),

డి. పూర్ణచంద్రరావుగార్లు కలరు. కీన్యా పోటీల ఫైనల్సులో పూర్ణ చంద్రరావు, గౌస్ మహమ్మద్ గార్లను కృష్ణస్వామి, సహానీగారలు 3—2 సెట్లతో ఓడించారు. శ్రీ పూర్ణచంద్రరావు ప్రభృతులు కీన్యాలోనూ, ఉగండాలోనూ పర్యటించి ఎగ్జిబిషన్ పోటీలు జరిపారు. శ్రీ పూర్ణచంద్రరావుగారి "హాఫ్ వాలీ"ని కీన్యా పత్రికలు విశేషంగా మెచ్చుకున్నాయి. 1938 లో పోర్‌బందర్, మంగుళూరు, హైదరాబాద్‌లలో జరిగిన పెద్ద టెన్నిస్ టోర్నమెంట్లలో ప్రథమ, ద్వితీయ స్థానాలు పొందుతూ వచ్చారు. హైదరాబాద్‌లో డబుల్సు సెమి ఫైనల్సులో శ్రీ జానకిరామయ్యగారి పార్టనర్‌గా శ్రీ పూర్ణచంద్రరావు గారు ఎస్. హాడీ, హుస్సెన్ అంతటి అగ్ర ఆటగాళ్ళను 8–6, 8–6 గేములతో ఓడించారు. ఒకసారి విశాఖపట్నంలో సింగిల్సులో శ్రీ సి. రామస్వామిగారిని ఓడించారు. 1940—47 వరకూ ఉదకమండలం, కొడైకెనాల్ లలో జరిగిన టెన్నిస్ టోర్నమెంటులలో ప్రముఖస్థానం వహించారు. శ్రీ పూర్ణచంద్రరావుగారు, శ్రీ నారుమంచి నారాయణ మూర్తిగారికద్ద టెన్నిస్‌లో విశిష్ట విధానాల నభ్యసించి, ఆంధ్రకు, భారతదేశానికి కీర్తి తెచ్చారు.

శ్రీ పూర్ణచంద్రరావుగారు టేబుల్ టెన్నిస్‌లోకూడా ప్రావీణ్యం గడించారు. ఈ ఆటలో యూనివర్శిటీ ఛాంపియన్‌షిప్‌ను, ఆంధ్రదేశంలో ప్రాంతీయ ఛాంపియన్‌షిప్‌లు గెలుచుకొని వున్నారు. 1939 నుంచి 1950 వరకు పిఠాపురం రాజకుమార్ శ్రీ రాజా రావు వెంకటమహీపతి సూర్యారావు బహద్దూరు గారికి అంతరంగిక కార్యదర్శి. అంతకుముందు మూడు సంవత్సరాలు 'జనవాణి' తెలుగు దినపత్రిక మేనేజరు. 1950 నుంచి "ఆంధ్రప్రభ" అడ్వర్‌టైజ్‌మెంట్ మేనేజరు.

(శ్రీ) నారుమంచి నారాయణమూర్తి:— హాఫ్‌వాలీలో ఇండియాలోకెల్ల అద్వితీయులు. 1910 నుంచి 1925 వరకు టెన్నిస్ ఆటలో దక్షిణభారతంలో వీరు అద్వితీయులుగా పరిగణించబడినారు. తగు అవకాశం ఉండి విదేశాలకు పంపబడితే ప్రపంచప్రమాణం అందు కొన్నట్టివారిగా పరిగణించబడేవారు. శ్రీ మాధవపెద్ది కాళిదాసు,

శ్రీ లక్ష్మణరావు, శ్రీ ఆర్. వి. వి. యస్. ప్రసాద్, శ్రీ మాధవపెద్ది హనుమంతరావు, శ్రీ నంబూరి కృష్ణయ్య ప్రభృతులు శ్రీ నారాయణ మూర్తిగారికి పార్ట్నర్‌గా వున్నారు. వెల్లింగ్టన్ ప్రభువు శ్రీ నారాయణ మూర్తిగారి ఆటను విశేషంగా మెచ్చుకొని వున్నారు. శ్రమ అనేది లవలేశమైనా పడకుండా ప్రత్యర్థిని మూడుచెరువుల నీరు త్రాగించేటట్లు ఆడడంలో నారాయణమూర్తిగారు అద్వితీయులు.

శ్రీ మాధవపెద్ది కాళిదాసు :— జననం 1890. బ్రాహ్మణకోడూరు. 1910-11 సంవత్సరంలో సౌత్ ఇండియా ఎథ్లెటిక్ అసోసియేషన్ మద్రాసులో నిర్వహించిన టెన్నిస్ టోర్నమెంటులో శ్రీ కాళిదాసుగారు, శ్రీ నారుమంచి నారాయణమూర్తిగారు డబుల్స్ ఛాంపియన్‌షిప్ సాధించారు. చెన్నపురిలో ఇంకా అనేక చిన్న పోటీలలో వీరుభయుల కాంబినేషన్ ప్రత్యేకాకర్షణగా వుండేది. 1911 నుంచి 1913 వరకు మద్రాసు లా కాలేజి టెన్నిస్ కెప్టెన్. లా కాలేజి



సింగిల్స్ ఛాంపియన్ షిప్‌ను, శ్రీ నారాయణమూర్తిగారితో కలసి డబుల్స్ ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొని వున్నారు. 1927 లో ఆంధ్ర ఛాంపియన్ షిప్ టోర్నమెంటులో ప్రముఖస్థానం వహించారు. బాపట్లలో న్యాయవాదిగా పేరుగడించినమీదట ఆంధ్ర ఛాంపియన్ షిప్ టోర్నమెంట్లకు పోషకులుగా వున్నారు. వీరి కుమారులలో ఇద్దరు తిరిగి క్రీడారంగంలో పేరుగడించి వున్నారు. పెద్ద కుమారుడు శ్రీ మాధవపెద్ది రామకృష్ణ టెన్నిస్ ఆటలో చక్కటి ప్రావీణ్యం సంపాదించారు. చివరి కుమారుడు ప్రసాద్ టెన్నిస్‌లోను, క్రికెట్‌లోను ప్రజ్ఞ గడించారు.

శ్రీ మాధవపెద్ది కాళిదాసుగారు 1953 లో పరమపదించారు.

శ్రీ నందివాడ వెంకట్రావు :—జననం 1908 తూర్పుగోదావరి జిల్లా. 1922 లో రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో చదువుచుండగా

టెన్నిస్ ప్రారంభించారు. కొన్ని సంవత్సరములు కాలేజీ టెన్నిస్ ఛాంపియన్ షిప్‌ను సాధించి, ఆంధ్రవిశ్వవిద్యాలయ ఇంటర్ కళాశాలల టెన్నిస్ పోటీలలో పాల్గొన్నారు. 1928 లో మద్రాసు లా కాలేజీలో చదువుచుండగా మద్రాసు రాష్ట్ర టెన్నిస్ పోటీలలో పాల్గొని డబుల్సు పోటీలో ద్వితీయ స్థానం పొందారు. తర్వాత ఆరు సంవత్సరాలు మద్రాసు యునైటెడ్ క్లబ్ వారు నిర్వహించిన అఖిలభారత టెన్నిస్ పోటీలలో డబుల్సు ఛాంపియన్‌షిప్ సాధించారు. మద్రాసు క్రికెట్ క్లబ్‌చే నిర్వహించబడిన టెన్నిస్ పోటీలలోకూడా మూడు సంవత్సరాలు అట్టివిజయాలు సాధించారు. వీరు కలకత్తా, ఢిల్లీలలో జరిగిన అంతర్రాష్ట్ర టెన్నిస్ పోటీలలో చెన్నరాష్ట్ర ప్రతినిధిగా పాల్గొనినారు. పై టోర్నమెంట్సులో వీరికి శ్రీ టి.బి. బాలగోపాల్ పార్ట్నర్. 1934 లో మద్రాసు క్రికెట్ క్లబ్ నిర్వహించిన టెన్నిస్ టోర్నమెంటు ఫైనల్సులో వీరు శ్రీ ఎన్. కృష్ణస్వామిగారి పార్ట్నర్ షిప్‌తో బాలగోపాల్, బి. రాచప్పలను ఓడించారు. 1934 లోనే బెజవాడలో జరిగిన ఈస్టిండియా టెన్నిస్ టోర్నమెంటులో సింగిల్సులో, డబుల్సులో ప్రథమస్థానం వహించారు. శ్రీ ఎస్. నారాయణరావుగారు అప్పుడు వీరికి పార్ట్నర్. 1933 నుంచి 1936 వరకు విశాఖపట్నంలో టోర్నమెంటులను గెలుచుకొన్నారు. ఈ అఖిల భారత టెన్నిస్ పోటీలలో వీరికి శ్రీ వి. సాంబమూర్తిగారు (శ్రీకాకుళం), (కీ॥ శే॥) పి. వి. సుబ్బారావుగారు పార్ట్నర్‌లు. 1935, 1936 లలో రాజమండ్రిలో జరిగిన టెన్నిస్ టోర్నమెంటులో సింగిల్సు, డబుల్సు, మిక్సెడ్ డబుల్సు పోటీలలో గెలుపొందారు. డబుల్సులో శ్రీ ఎస్. నారాయణరావుగారు, మిక్సెడ్ డబుల్సులో శ్రీమతి వై. జి. కృష్ణారావుగారు వీరికి పార్ట్నర్‌లు. 1935 లో రాజ



మండ్రిలో న్యాయవాద వృత్తిలో ప్రవేశించు వరకు పెద్ద టోర్నమెంటులలో పాల్గొన్నారు. ఇప్పటికీ నివాసం రాజమండ్రి.

శ్రీ నంబూరి వెంకటకృష్ణయ్య :— జననం 1891 నవంబరు 16. 14 వ ఏట టెన్నిస్ ఆట ప్రారంభించారు. 1915 లో విజయనగరం టోర్నమెంటులో సింగిల్స్ ఛాంపియన్ షిప్ సాధించారు. 1916 లో కాకినాడలో కూడా సింగల్స్ ఛాంపియన్ షిప్ గెలుచుకొన్నారు.

1917 లో శ్రీ కృష్ణయ్య, నారాయణమూర్తి గారలు మద్రాసు ఎస్. ఐ. ఏ. ఏ. టోర్నమెంట్స్‌లో తమ ప్రత్యర్థులు సి. రామస్వామి, వెంకట రామానుజులు గార్లను ఓడించారు.

1932 లో గుంటూరులో జరిగిన టెన్నిస్ పోటీలలో, సింగిల్స్, డబుల్స్ ఛాంపియన్ షిప్పులు సాధించారు. గుంటూరు నివాసి.

శ్రీ బి. సి. హెచ్. నారాయణమూర్తి :— జననం 1901 నవంబరు 30. వీరు విశాఖపట్నం క్లబ్ ఛాంపియన్ షిప్ టోర్నమెంట్సుకు 10 సంవత్సరాలు ప్రధాన కార్య నిర్వాహకులుగా వున్నారు. టెన్నిస్, బిలియార్డ్స్ పోటీలను క్లబ్ నిర్వహించేది. 1932 లో వీరు, డాక్టర్ కె. యస్. రాజు కలసి బరంపురంలో టెన్నిస్ డబుల్స్ ఛాంపియన్ షిప్పును సాధించారు. 1953 - 54 లో అవతరించిన ఆంధ్ర క్రికెట్ అసోసియేషన్ ప్రథమ ఉపాధ్యక్షులు. బిలియార్డ్స్, బాడ్మింటన్ ఆటలలో కూడా ప్రతిభాశాలి. బాడ్మింటన్‌లో వీరిది సెంటర్ స్థానం. 1928 లో అనకాపల్లిలో జరిగిన బాడ్మింటన్ టోర్నమెంట్సులో ప్రఖ్యాతి పొందిన కాశీబ్రదర్సు టీముపై విజయం సాధించారు.



బాడ్‌మింటన్ డబుల్సులో వీరికి పార్ట్నర్ యస్. నారాయణ రావుగారు. వీరుభయులకు రెండు సందర్భాలలో ప్రత్యేక బంగారు పతకాలు బహూకరించబడినవి. ఆంధ్రప్రభుత్వ న్యాయశాఖ కార్యదర్శిగా వీరు పనిచేసి వున్నారు.

శ్రీ మాధవపెద్ది హనుమంతరావు :— జననం 1918 ఫిబ్రవరి. ప్రస్తుత నివాసం గుంటూరు. ఆంధ్రరాష్ట్ర టెన్నిస్ అసోసియేషన్ కార్యకర్త. 1927 లో ఒక పెద్ద టోర్నమెంటు డబుల్స్ ఫైనలులో శ్రీ మాధవపెద్ది హనుమంతరావు, శ్రీ నారుమంచి నారాయణ మూర్తిగారలను శ్రీ చినా, శ్రీ పార్థసారధి గారలు ఓడించారు. 1931-32 లో తెనాలిలో జరిగిన ఒక టోర్నమెంటులో (సింగిల్స్) రన్నర్ అప్. శ్రీ కోట రామస్వామిగారు వీరిని ఐదుసెట్లలో ఓడించారు. నార్త్ క్లబ్ సంస్థాపకులలో ఒకరు. పోషకులుకూడా. క్లబ్‌కు భూవసతి సమకూర్చడంకోసం విరాళమిచ్చి వున్నారు. టెన్నిస్ అంపైర్ గా గణుతికెక్కారు.

శ్రీ ఎస్. నారాయణరావు :— జననం 1909 జూన్ 15 వ తేదీ. 1932 నుంచి 1934 వరకు టెన్నిస్‌లో మద్రాసు ఇంటర్ కలేజియెట్ ఛాంపియన్. 1934 నుంచి 1939 వరకు ఢిల్లీ, లాహోర్, అలీఘర్ లలో జరిగిన భారత విశ్వవిద్యాలయ పోటీలలో మద్రాసు యూనివర్సిటీ ప్రతినిధిగా పాల్గొని గెలుపొందారు. 1935, 1936 లలో శ్రీ సున్న రామారావుగారి పార్ట్నర్‌షిప్‌తో బరోడా ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకున్నారు. 1937లో కలకత్తా హార్డ్‌కోర్ట్ టెన్నిస్ డబుల్సు ఛాంపియన్‌షిప్ సాధించారు. 1938 లో పోర్బందర్ స్టేట్ డబుల్సు ఛాంపియన్‌షిప్ గెలుచుకొన్నారు. అప్పుడు వీరికి శ్రీ ఎమ్. రామారావుగారు పార్ట్నర్. 1941-42 లో శ్రీ ఎన్. రామారావుగారి పార్ట్నర్‌షిప్‌తో కరాచీలో సింధు డబుల్సు ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకున్నారు.



అప్పుడు శ్రీ ఘాస్ మహమ్మద్, శ్రీ సవారాగారలను 6-4, 3-6, 6-2 గేములతో ఓడించారు. 1939 లో బొంబాయిలో సానీ, వై. సింగ్ గారలపై 6-3, 6-4 గేములతో విజయమొంది పశ్చిమ ఇండియా ఛాంపియన్‌షిప్‌ను చేపట్టారు. అప్పుడుకూడా వీరికి శ్రీ నున్న రామారావుగారు పార్ట్నర్.

శ్రీ నారాయణరావుగారు ఇంకా క్రింది డబుల్సు ఛాంపియన్ షిప్‌లను గెలుచుకొన్నారు :

• దక్షిణ భారత ఛాంపియన్ షిప్ (మద్రాసు), హుబ్లి, ధార్వార్, బెల్గామ్, కొల్హాపూర్‌లలో జరిగిన ఓపెన్ టెన్నిస్ టోర్నమెంటులు.

బొంబాయిలో జరిగిన అంతర్రాష్ట్ర పోటీలలోను, సింహళం జట్టుపై జరిగిన పోటీలలోను శ్రీ నారాయణరావుగారు చెన్నరాష్ట్ర ప్రతినిధి. 1935 నుంచి 1942 వరకు ఇండియాలోని ప్రప్రముఖ డబుల్సు ఆటగాళ్ళలో ఒకరు.

శ్రీ నారాయణరావుగారు టెన్నిస్ ఆటలో ప్రవేశించకముందు గొప్ప బాల్ బాడ్మింటన్ ఆటగాడు. గోదావరి జిల్లా కాకీ బ్రదర్స్ షైప్స్ జట్టు సభ్యుడు. ఈ జట్టు 1925-1929 మధ్య దక్షిణభారతంలో అజేయంగా వున్నది. వీరి ప్రస్తుత నివాసం చీరాల.



శ్రీ టి. రామలింగస్వామి :— జననం 1895. రాజమండ్రి నివాసి. బాల్యంలోనే చెడుగుడు, దేశ, విదేశ వ్యాయామం, ఫుట్‌బాల్ ప్రారంభించారు. నింబుల్సు జూనియర్ ఫుట్‌బాల్ టీము సభ్యులు (1906). ఫుట్‌బాల్ ఆటలో ప్రత్యేక ప్రతిభ గడించి రహీం, (బొంబాయి), రెహసాద్ (హైదరాబాదు), సయ్యద్ అహమ్మద్ (ఏలూరు), సుబ్బయ్య ('మోటారుకారు'గా పేరొందిన వారు)

వంటివారలతో మేలుగా ఆడారు. 1909 నుంచి బాడ్మింటన్ తీవ్రంగా అభ్యసించారు; ఎడమచేతితో ఆడుతూ, విశాఖపట్నం జాలీబ్రదర్స్, ప్రెసిడెన్సీ ట్రోఫీలను సాధించారు. ఫ్రంట్ గా లేదా సెంటర్ గా ఆడి, ప్రత్యేక స్వర్ణపతకాల బహుమతి పొందారు. ఫుట్ బాల్, బాడ్మింటన్ లతో పాటు, క్రికెట్ కూడా ఆడేవారు. ఆర్. సి. సి. జట్టుతో ఆడి, ఎడమచేతి మీడియం పేస్ బౌలరుగా పేరు గడించారు. ఫీల్డింగ్ చాలా చలాకీగా చేసేవారు. తరువాత తరువాత టెన్నిస్ అభ్యసించడం ప్రారంభించారు.

మద్రాసులో ఒక ట్రోఫీ గెలుచుకొని, అజేయులుగా పరిగణించ బడుతున్న కాకినాడ నివాసి శ్రీ రామిరెడ్డిగారు శ్రీ రామస్వామిగారిని టెన్నిస్ ఆటలో ప్రోత్సహించారు. 1923లో ఏలూరు సయ్యద్ అహమ్మద్ మెమోరియల్ టోర్నమెంట్సులో టెన్నిస్ ట్రోఫీని తొలిసారి గెలుచు కున్నారు. తరువాత ఏలూరు, రాజమండ్రి, విశాఖపట్నం లలో జరిగిన టెన్నిస్ టోర్నమెంట్లలో సింగిల్సు చాంపియన్ షిప్ ను, బెజవాడ, కాకినాడ, తణుకు, విజయనగరములలో డబుల్సు ఛాంపియన్ షిప్ ను గెలుచుకొన్నారు. వీరికి శ్రీ పి. జగన్నాథరావుగారు పార్టనర్.

1932 లో కాకినాడలో పిఠాపురం మహారాజా నిర్వహించిన ఆలిండియా టోర్నమెంటులో శ్రీ రామస్వామి, శ్రీ జగన్నాథరావు గారలు డబుల్సు బిరుదు పొందారు. 1934 లో విశాఖపట్నంలో ఆలిండియా టెన్నిస్ టోర్నమెంటు సింగిల్సు పోటీలో గెలుపొంది, బంగారు పతక బహుమానం పొందారు. 61 వ ఏట కూడా శ్రీ రామస్వామిగారు రోజుకు రెండు మూడు సెట్లు ఆడుతున్నారు. బిలి యార్డ్స్, హాకీ, పింగ్ పాంగ్ (టేబుల్ టెన్నిస్), వాలీబాల్ వంటి ఆటల్లో కూడా వీరు ప్రావీణ్యం గడించివున్నారు. శ్రీ రామస్వామిగారు మొత్తం 10 ఏళ్ళు ఫుట్ బాల్ ఆటనూ, 35 సంవత్సరాలు బాడ్మిం టన్, 28 సంవత్సరాలు క్రికెట్, 40 సంవత్సరాలు టెన్నిస్ ఆటలను ఆడి వున్నారు. అనేక వందల ట్రోఫీలను గెలుచుకొని వున్నారు.

ప్రస్తుతం వీరు రాజమండ్రిలోనే "స్వామి స్పోర్ట్స్" అనే క్రీడా పరికరాల విక్రయశాలను నిర్వహిస్తున్నారు.

శ్రీ టంగుటూరి అచ్యుత రామారావు :— జననం 1916 రాజమండ్రిలో. 14 వ సంవత్సరంలోనే ఫుట్ బాల్ లోను, బాల్ బాడ్మింటన్ లోను విశేష ప్రతిభ గడించారు. 1934 లో టెన్నిస్ ప్రారంభించారు. అనుభవం పొందినకొలదీ గొప్ప స్ట్రోక్ ప్లేయర్ గా గణుతి కెక్కారు. "రామా స్ట్రోక్ అంతర్జాతీయ ప్రమాణంలో వుంటుంది—మహాశక్తిమంతమైన ఆటగాడు ఆయన" అని శ్రీ ఖాన్ మహమ్మద్ శ్రీ రామారావుగారిని కీర్తించారు. "మహా వేగంగా టెన్నిస్ ఆడడంలో ఇండియాలో నాకు మించినవారు లేరంటారు. కాని రామా నాతో నాకంటె వేగంగా ఆడారు. నేను తడబడ పడ్డాను" అని శ్రీ సుమంత్ మిశ్రా ప్రశంసించారు.



ఆంపన్, రామారావు

శ్రీ రామారావుగారు శ్రీ ఎమ్. ఎస్. కృష్ణమూర్తిగారి పార్ట్నర్ షిప్ తో 1942 లో దక్షిణ భారత ఛాంపియన్ షిప్ ను గెలుచుకొన్నారు. 1945 లో మద్రాసు హార్డ్ కోర్ట్ డబుల్స్ ఛాంపియన్ షిప్ ను గెలుచుకొన్నారు. అప్పుడు వీరికి (స్వర్గీయ) ఎస్. శివస్వామిగారు పార్ట్నర్. 1945—46 లో భారతదేశమంతటా పర్యటించి, అనేక పెద్ద టోర్నమెంటులలో పాల్గొని ఆంధ్రకు ఖ్యాతి తెచ్చారు. శ్రీ యుధిష్ఠిర సింగ్ ఇండియాలోకెల్ల ప్రావీణ్యంబట్టి ఐదవవాడుగా వున్నప్పుడు శ్రీ రామారావుగారితో ఆడి ఓటమి చవిచూచాడు.

శ్రీ రావు మొత్తం నూటికిపైగా పెద్ద టోర్నమెంటులలో పాల్గొన్నారు. 75 కు పైగా ట్రోఫీలను గెలుచుకొన్నారు. వాటిలో పెక్కింటిని బాలురను, యువకులను ప్రోత్సహించేందుకై విరాళంగా ఇచ్చివేశారు.

శ్రీ రామారావుగారు బ్రహ్మచారి. నాటక, సినిమా రంగాలలో కూడా నటునిగా పేరొందారు. 'నా యిల్లు', 'మనవలు పెళ్ళి', 'భక్త రామదాసు' చిత్రాలలో నటించివున్నారు.

శ్రీ రామారావుగారు ప్రస్తుతం రాజకుమారి అమృత్ కౌర్ శిక్షణ ప్రణాళికలో శిక్షకునిగా మద్రాసులో పనిచేస్తున్నారు.

(శ్రీ) పి. ఎల్. నారాయణరావు :— జననం 1923 - జూలై 9. 1938 లో ఆంధ్ర యూనివర్శిటీ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో ద్వితీయస్థానం పొందారు. 1941 లో మద్రాసు యూనివర్శిటీ జట్టు సభ్యులు. 1941 లో అన్నామలై యూనివర్శిటీ ఛాంపియన్. 1944 లో మద్రాసు యూనివర్శిటీ ఛాంపియన్ 1944 లో ఆలిండియా ఇంటర్ యూనివర్శిటీ ఛాంపియన్ షిప్పును గెలుచుకొన్న మద్రాసు యూనివర్శిటీ జట్టు సభ్యులు. 1945—46 లో అఖిల భారత పోటీలకు మద్రాసురాష్ట్ర జట్టు సభ్యులు. 1946 లో ఇండియా అంతటనూ, సింహళంలోనూ పర్యటించారు.

శ్రీ డి. మాధవరావుగారు పార్ట్‌నరుగా వీరు మోరాటువా, కొలంబో మున్నగు నగరాలలో జరిగిన 7, 8 పెద్ద టోర్న మెంటులలో పాల్గొని అంతిమ విజయాలు పొందారు. 1949 లో ఆలిండియా డబుల్సు ఛాంపియన్ షిప్‌ను బొంబాయిలో గెలుచుకొన్నారు. ఈ టోర్న మెంటులోనే నరేష్ కుమార్ (అప్పుడు ఇండియాలో ప్రావీణ్యంబట్టి నాల్గవవారు), వసంత్ గార్లను, జిమ్మి మెహతా, ఆయన పార్ట్‌నరు గార్లను ఓడించారు. శ్రీ నారాయణరావుగారికి శ్రీ మాధవరావుగారు పార్ట్‌నర్. ఇదే టోర్న మెంటులో సింగిల్సు సెమిఫైనల్సులో శ్రీ నరేష్ కుమార్‌ను శ్రీ నారాయణరావుగారు ఓడించారు.

1946 లో బరోడా, హైదరాబాదు, కలకత్తాలలో జరిగిన పెద్ద పోటీలలో పాల్గొని సోహన్‌లాల్, యం. బాజ్జీ వంటివారలపై విజయం

సాధించారు. 1949_50 సంవత్సరాలలో మద్రాసులో జరిగిన మద్రాసు హైకోర్టు టెన్నిసు ఛాంపియన్‌షిప్‌ను, 1951 లో రాజమండ్రిలో జరిగిన పెద్ద టోర్నమెంటులో సింగిల్సు ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొన్నారు. 1952 లో రాజమండ్రిలో చివరిసారి పెద్ద టోర్నమెంట్‌లో పాల్గొని యస్. నారాయణరావు, యస్. రామారావుగార్లను సునాయాసంగా ఓడించారు. అప్పుడు వీరి పార్ట్నర్ శ్రీ డి. మాధవరావుగారు.

మద్రాసులో స్వీడిష్, తదితర విదేశ టెన్నిస్ ఆటగాళ్ళతో ఎగ్జిబిషన్ పోటీలు జరిపి మన్ననలు పొందారు. ప్రస్తుత నివాసం బందరు.

శ్రీ మాధవపెద్ది జానకిరామయ్య :— జననం 1910 — ఏప్రిల్ 5. బాపట్ల బోర్డు హైస్కూలులో చదువుకొంటున్నప్పుడు



కబాడీ, బాడ్మింటన్ ఇంకా గోళీకాయల ఆటలలో నేర్పరి. 1927 లో టెన్నిస్‌లో ప్రవేశం. 1928 నుంచి 32 వరకు గుంటూరు ఎ. సి. కాలేజిలో చదువుతున్నప్పుడు టెన్నిస్‌లో విశేషంగా కృషిచేసి యం. సి. సి.; యస్. ఐ. ఏ. ఏ. వంటి మద్రాసు టోర్నమెంటులలో పాల్గొన్నారు. ఆ రోజులలో గుంటూరు దక్షిణ ఇండియా టెన్నిస్‌కు 'మెక్కా' వంటిది. సి. రామస్వామి, యన్. కృష్ణస్వామి, కె. బ్రహ్మానందరావు గుంటూరులో వుండేవారు. శ్రీ జానకిరామయ్యగారు రోజుకు పది సెట్లు ఆడేవారు. 1928—32 వరకు ఇంటర్ కలేజియేట్ ఛాంపియన్. 1935 నుంచి 38 వరకు ఆంధ్ర జింఖానా (బెజవాడ) నిర్వహించిన టోర్నమెంటులలో సింగిల్సు ఛాంపియన్. 1945 లో తొలిసారి మద్రాసులో ఆలిండియా హైకోర్టు టెన్నిస్ ఛాంపియన్ షిప్ పోటీలు జరిగినవి. చెన్నపురి ఆంధ్ర మహాసభ నిర్వహించిన ఈ పోటీలలో శ్రీ జానకిరామయ్య, శ్రీ భుజంగరావుగార్లు సెమిఫైనల్సులో శ్రీ సుమంత్ మిశ్ర, శ్రీ యుధిష్ఠర్‌సింగ్ గార్లను 6_4, 4_6, 6_4 గేములతో ఓడించారు. ఫైనల్సులో బి. ఆర్. కపనీపతి, ఖలీద్ గార్లను 6_2, 6_2, 6_1

గేములతో ఓడించారు. 1945 మార్చిలో బందరులో జరిగిన దక్షిణ భారత ఛాంపియన్‌షిప్ పోటీలలో జానకిరామయ్య, భుజంగరావుగారలు ఫైనల్సులో ఘౌస్ మహమ్మద్, యుధిష్టర్‌సింగులను 6-4, 2-6, 6-1, 8-6 గేములతో ఓడించారు. ఇంతకుముందు ఇంకా ఆంధ్ర జింఖానా నిర్వహించిన ఈస్టు కోస్టు ఛాంపియన్ షిప్ సింగిల్సు పోటీలను 4 సంవత్సరాల పాటు శ్రీ జానకిరామయ్యగారు గెలుచుకొని వున్నారు. వీరి బ్యాక్‌హాండ్—క్రాస్‌కోర్టు డ్రైవ్ కన్నులపండువుగా వుంటుంది. ప్రస్తుత నివాసం విజయవాడ.

శ్రీ ఎస్. భుజంగరావు :— జననం 1909—బెజవాడలో. 1927 లో గ్రిగ్ మెడలు గెలుచుకొన్నారు. ఫుట్‌బాల్, బాడ్మింటన్ ఆటలలో బాల్యంనుంచే ఆసక్తి వుండేది. తర్వాత టెన్నిస్ అభ్యసించి డబుల్సు పోటీలలో అఖిల భారత ఖ్యాతి పొందారు. 1945 లో ఆలిండియా టెన్నిస్ టోర్నమెంటులో శ్రీ ఎమ్. జానకిరామయ్యగారి పార్టనర్‌షిప్‌తో సుమంత్ మిశ్రా, వై. సింగ్‌లను మద్రాసులో ఓడించారు. 1946 లో మచిలీపట్నంలో దక్షిణ భారత టెన్నిస్ టోర్నమెంటులో శ్రీ జానకిరామయ్యగారి పార్టనర్‌షిప్‌తో ఘౌస్ మహమ్మద్, వై. సింగ్‌లపై విజయం సాధించారు. 1954 లో శ్రీ యన్. రామారావుగారి పార్టనర్‌షిప్‌తో ఆంధ్రరాష్ట్ర టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొని అంతిమపోటీలో శ్రీ ఎస్. విష్ణుమోహన్, శ్రీ సి. రామచంద్రరావుగార్లను ఓడించారు. వీరి డబుల్సు ఆటను విదేశీయ ఆటగాళ్ళయిన శ్రీ బెల్లిన్, జాన్సన్‌లు కొనియాడారు. వీరు పొడగరి. దాదాపు 6 అడుగుల ఎత్తుకల వీరు నెట్ దగ్గర బంతిని స్మాష్ చేయడంలో "స్పెషలిస్ట్"!

టెన్నిస్‌లో ప్రవేశించకముందు వీరు బెజవాడ సి. ఆర్. దాసు ఫుట్‌బాల్ టీములో రత్నశ్రేణిలో ఆడి యావద్భారతఖ్యాతి పొందారు.

శ్రీ ఆర్. జీవన్‌సింగ్ :— వయస్సు సుమారు 44 సంవత్సరాలు. స్వగ్రామం నూజివీడు. 1932 నుంచి 46 వరకు ఫుట్‌బాల్ ఆటగానిగాను, దరిమిలా టెన్నిస్ ఆటగానిగాను పేరొందారు. 1932 లో గ్రిగ్ మెడల్ సంపాదించారు. 1933 లో ఏలూరు అథ్లెటిక్ యూనియన్ జట్టు సభ్యునిగా సయ్యద్ అహమ్మద్ ఫుట్‌బాల్ టోర్నమెంటులో పాల్గొని స్వర్ణపతకం బహుమానం పొందారు. 1936 లో భువనేశ్వరం టోర్నమెంటులో ఏలూరు జట్టు తరపునే ఆడి, కాకినాడ అప్పారావు, రాములు, కన్నయ్య, (ఫార్వర్డ్లు), ఢిల్లీ, ధనయ్య, 'బూలెడ్' విలియమ్సు (మగ్గురు బ్యాకులు) వంటి అగ్ర ఆటగాళ్ళు కల జట్టును ఓడించారు. ఈ పోటీలో చేయబడిన నాలుగు గోల్సును శ్రీ జీవన్‌సింగ్‌గారే సాధించారు. 1938, 39, 40 సంవత్సరాలలో మద్రాసు తిలక్ మోతీ జట్టు సభ్యునిగా దక్షిణభారతమంతటా పేరు గడించారు. 1940 లో బెంగుళూరు, బొంబాయిలలో ఓడిపోని, "రాయల్ వెస్టు కెంట్సు" అనే యూరోపియన్ జట్టుతో తిలక్ మోతీ ఆడినప్పుడు శ్రీ జీవనసింగ్‌గారే గోల్ కొట్టి విజయం సాధించారు. సెంటర్ ఫార్వర్డుగా బాణంవలె దూసుకుపోయి గోలులు కొట్టగల అత్యంత శక్తిమంతులైన కొద్దిమంది ఆటగాళ్ళలో శ్రీ జీవన్‌సింగ్ ఒకరు.



1945 నుంచి టెన్నిస్ ప్రారంభించి, గుంటూరు, ఏలూరు, బెజవాడ, ఒంగోలు మున్నగు పట్టణాలలో జరుగుతున్న పెద్ద టోర్నమెంటులలో పాల్గొన్నారు; పాల్గొంటున్నారు కూడా. ప్రస్తుత నివాసం ఒంగోలు.

శ్రీ జీవన్‌సింగ్ తమ్ములు శ్రీ సుభకరణసింగ్, శ్రీ అర్జున్‌సింగ్, అన్నగారివలె ఫుట్‌బాల్ ఆటలో ప్రశంసనీయమైన ప్రావీణ్యం గడించి వున్నారు. వీరుభయులు, నూజివీడు "రాజ్‌పుట్ స్పోర్టింగ్" ఫుట్‌బాల్ జట్టు సభ్యులు. శ్రీ అర్జున్ 1951 లో మద్రాసు తిలక్ మోతీ జట్టు సభ్యుడుకూడా.

శ్రీ కె. గోపాలరావు :— జననం 1931 మే 10. 1949 లో టెన్నిస్‌లో ప్రవేశం. 1953 లో గుంటూరులో జరిగిన గాంధీ మెమోరియల్ టెన్నిస్ టోర్నమెంటులో ప్రప్రథమంగా సింగిల్స్ ఛాంపియన్‌షిప్ సాధించారు. 1953-55 లో హుబ్లీ, ధార్వార్, రాజమండ్రి, విజయనగరం, గుంటూరులలో జరిగిన టెన్నిస్ టోర్నమెంట్‌లలో విజయం సాధించారు. 1955 లో కలకత్తాలో జరిగిన రైల్వే టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో సదరన్ రైల్వేతరఫున పాల్గొని విజయం సాధించారు. ప్రస్తుత నివాసం గుంటూరు.



శ్రీ యన్. రామారావు :— స్వగ్రామం రాజోలు. మొదట బాడ్మింటన్‌లో సర్వతోముఖ ప్రతిభాశాలి. తరువాత మద్రాసులో ఇంజనీరింగ్ కాలేజీలో చదువుతున్నప్పుడు టెన్నిస్ ఆటలో ప్రావీణ్యం గడించారు. వీరి ఫోర్‌హాండ్‌వాలీ, స్మాష్ అత్యంత శక్తిమంతంగా వుండేవి. శ్రీ ఎస్. నారాయణరావుగారికి పార్టనర్‌గా వుండి ఇండియాలో అగ్ర టెన్నిస్ పురుషజంటలో ఒకటిగా పేరొందారు.

శ్రీ కె. యస్. శాస్త్రి :— స్వగ్రామం ఒంగోలు. గుంటూరు ఏ. సి. కాలేజీలో విద్య నభ్యసించారు. చాలా సంవత్సరాలు ఆంధ్ర యూనివర్శిటీ టెన్నిస్ టీము సభ్యులు. సాధారణ వేగంతో టెన్నిస్ ఆడినప్పటికి ఫోర్‌హాండ్, బ్యాక్‌హాండ్ దెబ్బలలో టాప్‌స్పిన్ ప్రయోగించి ఆంధ్రదేశంలో ఖ్యాతి పొందారు.

శ్రీ మారెళ్ల కృష్ణమూర్తి :— స్వగ్రామం బరంపురం. విజయనగరం మహారాజా కాలేజి విద్యార్థి. 1935-40 మధ్య వుత్తమ టెన్నిస్ ఆటగానిగా ఆంధ్రదేశంలో పేరుగడించిన వీరి ఛాప్‌స్ట్రోక్ అత్యంత ప్రశంసనీయమైనది. బంతిని బాగా ఎత్తుగా వేసి సర్విస్ చేసేవారు. శ్రీ టంగుటూరు అత్యుతరామారావుగారికి పెక్కు పోటీలలో పార్ట్నర్‌గా వున్నారు.

శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు (ఎమ్. ఎల్. ఏ.) :— 1932 నుంచి దాదాపు ఒక దశాబ్దంవరకు టెన్నిస్‌లో చెన్నరాష్ట్రంలో, విశేషించి ఆంధ్రదేశంలో విశేషంగా పేరు గడించినవారు శ్రీ మేకా అప్పారావుగారు. దాదాపు ఆరు అడుగుల ఎత్తుగలిగి వీరునివంటి దేహ నిర్మాణం గల శ్రీ అప్పారావుగారు నెట్టువద్ద ప్రత్యర్థికి సింహస్వప్నం. వీరి సర్విస్, ఫోర్ హాండ్ అత్యంత శక్తిమంతమైనవి.



ఆంధ్రదేశంలో వివిధ క్రీడల వ్యాప్తికి కృషిచేసిన ప్రముఖులలో శ్రీ అప్పారావుగారు ఒకరు. ఆంధ్ర ఒలింపిక్ అసోసియేషన్ సంస్థాపకులు. పెక్కు రాష్ట్ర క్రీడా, సాంస్కృతిక సంఘాలకు అధ్యక్షులు. ఇండియన్ వెయిట్ లిఫ్టింగ్ ఫెడరేషన్ కార్యకర్త.

శ్రీ డి. ఆర్. గోపాల్, శ్రీ మాధవపెద్ది జానకిరామయ్యవంటి వారలు క్రీడారంగంలో గణుతికెక్కడానికి శ్రీ అప్పారావుగారు ఎంతైనా సహాయం చేసివున్నారు.

విద్యావ్యాప్తికికూడా వీరు దానధర్మాల ద్వారా, ఇతరవిధాలగా కృషిచేసివున్నారు. నూజివీడులోని వీరి స్వంత లైబ్రరీలో ఏ సామాన్య

పేరుడైనా పుస్తకాలు తీసుకొని ఉపయోగించుకొనే సౌకర్యం కలిగించిన "జమీందారు" వీరు. ఇట్టి సహృదయతకల 'జమీందార్లు' అరుదు.

శ్రీ ఎమ్. వి. శాస్త్రి :— ఇండియాలోని ఉత్తమ డబుల్సు ఆటగాళ్ళలో ఒకరుగా పేరొందినవారు. దక్షిణ భారతం సందర్శించిన అనేకమంది ఉత్తర భారత ఆటగాళ్ళను వీరు ఓడించివున్నారు.

శ్రీ ఎస్. విష్ణుమోహన్ పార్ట్నర్‌గా వీరు కొద్ది సంవత్సరాల క్రితం మద్రాసు టోర్నమెంటులలో పాల్గొనివున్నారు. అన్ని స్ట్రోక్స్‌లోనూ ప్రజ్ఞావంతులు. ముద్దుపేరు "జింక".

శ్రీ ఎమ్. యస్. అప్పారావు :— ఇంపుగా ఆడడంలో (స్టయిలిష్ గేమ్) వీరికి పెట్టింది పేరు. బ్యాక్‌హాండ్ దెబ్బలో శక్తికి శక్తి, అందానికి అందం కనిపిస్తవి. సర్వీస్ కూడా బలమైనది. ఎమ్. ఆర్. అప్పారావుగారి సోదరుడు. ప్రజోద్యమాలలో ముందడుగు వేసివున్నారు.

శ్రీ ఎమ్. వి. జి. అప్పారావు :— స్థిరచిత్తంతో (స్టెడీ) నేర్పుగా ఆడే శ్రీ అప్పారావుగారు దేశ, విదేశాలలో అనేక పెద్ద టోర్నమెంటులలో పాల్గొనివున్నారు. దాదాపు ప్రతి సంవత్సరం యూరపులో పర్యటించి, అక్కడి పోటీలలో పాల్గొంటూ వుంటారు. 1956 మేలో సర్రే (బ్రిటన్) లాన్ టెన్నిస్ పోటీలలో పాల్గొని ఆస్ట్రేలియా ఆటగాడు శ్రీ కె. మేయరుకు గట్టి పోటీయిచ్చారు. లాన్, హార్డు కోర్టు టెన్నిస్‌లో సమాన ప్రతిభ ప్రదర్శించ గల శ్రీ అప్పారావు 1954లో బుడే (సమ్మర్‌లీజ్) సింగిల్స్ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొని వున్నారు.



బ్రిటిష్‌దీవుల పశ్చిమోత్తర భాగంలోని కారన్‌వాల్‌లో బుడేవుంది. ఈ టోర్నమెంటులో ప్రావ్‌షైర్ ఛాంపియన్ యల్. కర్బి, వార్విక్‌షైర్ అగ్ర ఆటగాడు డి. ఆర్. ఆలివర్, యస్. బి. హాల్‌మన్, బి. ఎ. ఏడమ్సులను ఓడించారు. అప్పారావుగారి ప్రజ్ఞను "ది వెస్టరన్ మార్నింగ్ న్యూస్" వంటి పత్రికలు సయితం ప్రశంసించినవి. 1954 లో పశ్చిమ జర్మనీలో పర్యటించారు. 1955, 56 లలో ఇంగ్లండులో పర్యటించారు. 1956 సంవత్సరాంతంలో సెంట్రలిండియా డబుల్స్ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్నారు. అప్పుడు వీరికి శ్రీ ఉదయకుమార్ పార్ట్‌నర్. 1956 లో టెన్నిస్‌లో ప్రావీణ్యంబట్టి ఇండియాలో చతుర్థస్థానాన్ని, చెన్నరాష్ట్రంలో ద్వితీయస్థానాన్ని అప్పారావుగారు వహించి వున్నారు. ఎమ్. ఆర్. అప్పారావుగారి తమ్ముడు.

శ్రీ ఎస్. విష్ణుమోహన్ :— చెన్నరాష్ట్రం ఆటగాళ్ళలో ద్వితీయుడు. అత్యంత శక్తిమంతమైన సర్వీస్ వీరి ప్రత్యేకత. బ్రిటన్‌లో టెన్నిస్‌లో ఉన్నత శిక్షణ పొందివున్నారు. బ్రిటన్‌లో జరిగిన కొన్ని టోర్నమెంటులలోకూడా పాల్గొనివున్నారు.



1956 లో మద్రాసులో ఆస్ట్రేలియా ఆటగాడు శ్రీ మార్షల్‌ను సునాయాసంగా ఓడించివున్నారు. కొన్ని సంవత్సరాలు పూర్వఆంధ్రరాష్ట్ర ఛాంపియన్. మద్రాసు, గుంటూరులలో జరిగిన కొన్ని టోర్నమెంటులలో శ్రీ ఆర్. కృష్ణన్, సుమంత్ మిశ్రా, ఆస్ట్రేలియా ఆటగాడు శ్రీ ఆర్కిన్‌స్టాల్ వంటి అగ్ర ఆటగాళ్ళకు గట్టి పోటీ యిచ్చివున్నారు.

1956 జూన్‌లో కొడైకెనాల్‌లో జరిగిన టెన్నిస్ టోర్నమెంటులో సింగిల్స్, మిక్సెడ్ డబుల్స్, డబుల్స్ పోటీలను శ్రీ విష్ణుమోహన్ గెలుచుకొనివున్నారు. డ్రాబ్రీ పార్ట్‌నర్ నివాసం మద్రాసు.

శ్రీ సి. రామచంద్రరావు :— రాజమండ్రీలో హిందూ సమాజ్ టెన్నిస్ టోర్నమెంటును వీరు పెక్కు సంవత్సరాలు గెలుచుకొని వున్నారు. 1956 అంతర్రాష్ట్ర టెన్నిస్ టోర్నమెంట్‌లో ఆంధ్ర ప్రతినిధి. 1956 ఫిబ్రవరి లో మద్రాసులో జరిగిన ఆలిండియా హార్డుకోర్టు టెన్నిస్ పోటీలలో శ్రీ రామచంద్రరావు, మిస్. ఎస్. పాల్ గారలు శ్రీ ఆర్క్యిన్‌స్టాల్, శ్రీమతి అంజనీదేశాయిగారలను 6-2, 6-3, గేములతో ఓడించివేశారు. శ్రీ రామచంద్రరావు, ఈస్ట్ గోదావరి ఆటగాడు శ్రీ బాలసుబ్రహ్మణ్యంగారలు 1956 మార్చిలో ఏలూరులో 'సంజీవి మెమోరియల్ టెన్నిస్ టోర్నమెంట్' డబుల్స్ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొని వున్నారు.

* ఆంధ్రదేశంలో యింకా క్రింది ఆటగాళ్ళు ప్రఖ్యాతి గడించి వున్నారు : శ్రీయుతులు హర్షవర్ధనరావుగారు, (బ్రిటిష్‌గుంట టెన్నిస్ టోర్నమెంట్ ఫేమ్.) సి. వి. శాస్త్రి, మహమ్మద్ రజా ఆలీ, కె. యస్. ఐజాక్, ఐ. డబ్ల్యు. శ్యారీ, ఐ. ఆర్. చౌదరి, కె. సత్యనారాయణరావు, యస్. ప్రకాశరావు, కె. వెంకట్రామయ్య, పి. యస్. చక్రవర్తి, యస్. రాఘవ, పి. ముత్యాలనాయుడు, బి. యల్. నరసింహం (వీరందరూ ఒంగోలుప్రాంత వాసులు.) డాక్టర్ సీతారామయ్య కె. బి. సుందరలాల్, డాక్టర్ గున్నేశ్వరరావు, వై. యస్. యస్. మూర్తి, ఎ. ఆర్. బెల్‌గామి, కె. యస్. ఆర్. యల్. యస్. వర్మ, బి. అప్పారావు (వీరందరూ తాడేపల్లిగూడెంప్రాంత వాసులు), యం. వి. రావు (ఛత్రపూర్), ఓ. యస్. శాస్త్రి (శ్రీకాకుళం), వి. యస్. పంతులు (శ్రీకాకుళం), ఏ. సోమేశ్వరరావు (చీరాల), ఆర్. శ్రీహరిరావు (ఏలూరు), ఎమ్. ఎస్. వెంకటేశ్వరరావు (బందరు), జె. వీరభద్రరావు (ఏలూరు), పి. వి. రామారావు (ఏలూరు), జె. వీరభద్రరావు (నెల్లూరు), ఎమ్. మధుసూదనరావు (వాల్తేరు), యు. పాండురంగారావు (ఏలూరు), యం. కృష్ణారావు (ఏలూరు), వి. కృష్ణమూర్తి (ఏలూరు).

హైదరాబాదులో శ్రీయుతులు నరసింహారావు, ఆసిఫ్ ఖద్రి, సజ్జన్, అన్వార్, షఫివుద్దీన్ బాబాఖాన్, ఇజాక్ అబ్రహాం, దాస్,

డాక్టర్ రాజా, డాక్టర్ వెంకట్రావు ప్రభృతులు పేరు గడించి వున్నారు.

శ్రీ ఘౌస్ మహమ్మద్ :—(యు.పి.) జననం 1915 నవంబరు. 1936 నుంచి 46 వరకు 11 సంవత్సరాలు ఇండియా ఛాంపియన్‌గా వుండి, వింబుల్డన్ పోటీలలో క్వార్టర్ ఫైనల్సు చేరుకొన్న మొట్టమొదటి సంపూర్ణ భారతీయుడు శ్రీ ఘౌస్ మహమ్మద్. చక్కటి శరీరసౌష్ఠవం కలిగి నియమ, నిష్ఠలతో జీవితం గడిపిన భారతీయ అగ్ర టెన్నిస్ ఆటగాళ్ళు కొద్దిమందిలోనూ వీరు ఒకరు. 1935 లో శ్రీ వీజ్ వద్ద టెన్నిస్‌లో ఉన్నత శిక్షణ పొందారు. 1936 లో సింహళం, తూర్పు ఆఫ్రికాలలో పర్యటించిన ఇండియా జట్టు సభ్యులు. మధ్యయూరప్, న్యూజిలెండ్, ఫ్రాన్సు, అమెరికా ఆటగాళ్ళతో ఇండియా ప్రతినిధిగా పోటీచేసి వున్నారు. 1938 లో డేవిడ్‌కప్ పోటీలలో పాల్గొన్న ఇండియాజట్టు సభ్యులు. తరువాత క్వీన్స్‌క్లబ్, వింబుల్డన్, ఫ్రెంచి ఛాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొన్నారు. పారిస్ టోర్నమెంటులో, జగత్ప్రసిద్ధి అమెరికన్ ఆటగాడు శ్రీ డోనాల్డు బడ్జి నుంచి ఒక సెట్టు తీసుకొన్నారు. ఆ సీజన్‌లో బడ్జి మరే ఆటగానికి ఒక్క సెట్టయినా ఇచ్చివుండలేదు. 1939 లో వింబుల్డన్ పోటీలో పాల్గొన్నప్పుడు, హంగరీ అగ్ర ఆటగాడు శ్రీ స్జిగెటీని 6-2, 14-16, 1-6, 6-4, 6-4 గేములతో ఓడించి, క్వార్టర్ ఫైనల్సు చేరుకొన్నారు. ఈ పోటీ రెండు గంటల ముప్పై ఐదు నిమిషాలు పట్టింది. ఆ యేటి వింబుల్డన్‌లో ఇంత సుదీర్ఘపు పోటీ మరేది లేదు. క్వార్టర్ ఫైనల్సులో శ్రీ రిగ్స్, శ్రీ ఘౌస్ మహమ్మద్‌ను ఓడించారు. మరుసటి సంవత్సరం డేవిస్‌కప్పు పోటీలలో పాల్గొన్న ఇండియా జట్టుకు నాయకులు.



శ్రీ ఘౌస్ మహమ్మద్ ఘన విజయాలకు ప్రధానకారణం అన్ని శాఖలలోనూ సంపూర్ణ ప్రతిభ గడించివుండడమే. అద్భుతమైన వేగం, యుక్తి, శక్తి, ఉల్లాసము, మహోపటిష్ఠమైన సర్వీస్, మెచ్చదగిన బ్యాక్‌హాండ్ వారి సొత్తు. వీరు క్రింది ప్రముఖ విదేశ ఆటగాళ్ళను ఓడించి వున్నారు. స్టీడ్‌మ్యాన్ (న్యూజిలెండ్), కాలిన్స్ (బ్రిటన్), ఆలిఫ్ (బ్రిటన్), పంసెక్ (యుగోస్లావియా), మిటిక్ (చెకోస్లావాకియా).

శ్రీ సుమంత్ మిశ్రా :—(బెంగాల్) 1946, 1952 సంవత్సరాలలో ఇండియా ఛాంపియన్. వీరుశతఘ్ని గుండువలె బంతి పంపగల శక్తిమంతులు. 1941 లో కలకత్తా యూనివర్శిటీ జట్టు సభ్యుడు. 1944 లో సౌత్ క్లబ్ పోటీల సెమీ-ఫైనల్సులో ఇఫ్తికర్ అహమ్మద్‌ను ఓడించివేశారు. 1945 లో బరోడా ఛాంపియన్ షిప్‌ను, అదే సంవత్సరంలో మద్రాసులో ఆలిండియా ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్నారు. 1946 లో సౌత్ క్లబ్ నిర్వహించిన నేషనల్ ఛాంపియన్‌షిప్ పోటీలలో క్వార్టర్ ఫైనల్సులో ఘౌస్ మహమ్మద్‌ను, సెమిఫైనల్సులో దిలీప్ బోసును, ఫైనల్సులో మన్‌మోహన్‌ను ఓడించివేశారు. తరువాత నాలుగు సందర్భాలలో ఘౌస్ మహమ్మద్‌పై విజయం సాధించారు. 1946 లోనే డేవిస్‌కప్పు పోటీలలో పాల్గొన్నారు. జిమ్మి మోహతా, మన్‌మోహన్‌లతో పాటు అమెరికాలో పర్యటించారు. 1948 లో వింబుల్డన్ పోటీలలో పాల్గొన్నారు.

శ్రీ దిలిప్‌కుమార్ బోస్ - (బెంగాల్) :— 1948, 49 సంవత్సరాలలో ఇండియా ఛాంపియన్. టెన్నిస్‌లోని అన్ని శాఖలలోను ప్రతిభాశాలి. ఒడుదుడుకులు లేక ఆట ఆద్యంతం స్థిరచిత్తంతో ఆడే స్వభావంకలవారు. మంచి కోణాలలో గురిచూచి కొట్టడం, చెయ్యి బాగా పైకెత్తి (ఓవర్‌హ్యాండ్) ఫిరంగిగుండువలె బంతిని కొట్టడం వీరి ఆటలో విశేషం. యూరప్‌లో జరిగిన పెక్కు టోర్నమెంటులలో పాల్గొన్నారు. 1948 సంవత్సరాంతంలో శ్రీ దిలిప్‌బోస్ నేషనల్ లాన్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలో సుమంత్ మిశ్రాను ఓడించారు. వీరి బ్యాక్‌హాండ్ ముచ్చటగా వుంటుంది. ప్రత్యర్థి ఆలోచించడానికి వీలులేనంత వేగంగా బంతులు వేయడంలో వీరికి వీరే సాటి.

శ్రీ నరేష్‌కుమార్ :— యు. పి. కి చెందిన ఈ ప్రముఖ ఆటగాడు బెంగాలులో స్థిరపడ్డారు. కలకత్తా విశ్వవిద్యాలయ విద్యార్థి. 1948 వరకు సామాన్య ఆటగాడు. వీరి టాప్ స్పిన్ నయనానంద కరం. వేగంగా ఆడుతారు. వాలీ గట్టిది. కోర్టులో ఏస్థలంనుంచైనా బంతి, స్మాష్ చేయగలరు. డేవిస్‌కప్పు, వింబుల్డన్ ఛాంపియన్‌షిప్ పోటీలలో భారతజట్టు నాయకులు. 1956 లో ఆసియామండలం ఫైనల్సులో ఇండియా జపాన్‌ను ఓడించడానికి శ్రీ నరేష్‌కుమార్ ప్రతిభయే ప్రధానకారణం. చక్కటి శరీరనిర్మాణం కలవారు. స్వెన్ డేవిడ్సన్‌ను ఓడించివున్నారు. కృష్ణన్, నరేష్‌కుమార్ జంట అత్యంత శక్తిమంతమైనది.

శ్రీ రామనాథన్ కృష్ణన్ :— పిఠాపురం మహారాజా, హైదరాబాద్ టెన్నిస్ శిక్షకుడు శ్రీ నూర్‌మహమ్మద్‌గారల



ప్రోత్సాహంపై ప్రపంచవిఖ్యాతిచెందిన ఈఆటగాని వయస్సు 20 సంవత్సరాలు (1956). వింబుల్డన్ జూనియర్ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్న మొట్టమొదటి భారతీయుడు (1954). అయితే 1954 వరకు వీరుచూపిన ప్రతిభ తరువాత అభివృద్ధి చెందలేదు. సర్విస్, ప్రపంచ ప్రమాణమంత పటిష్ఠంకాదు. వేగం తక్కువ. ఈ రెంటిని పెంపొందించుకొంటే జూనియర్ ఛాంపియన్ వింబుల్డన్‌లో కృష్ణన్ కనీసం సెమిఫైనల్సుకైనా రాగలరు.

శ్రీ కృష్ణన్ తండ్రి శ్రీ రామనాథన్ చెన్నరాష్ట్ర టెన్నిస్ మాజీ ఛాంపియన్. వీరు తన కుమారునికి టెన్నిస్‌లో శిక్షణయిచ్చి పైకి తెచ్చారు. శ్రీ కృష్ణన్ 11 వ ఏట తండ్రివద్ద శిక్షణను శ్రద్ధగా పొందారు. తరువాత నూర్‌మహమ్మద్‌వద్ద తర్ఫీదయినారు. 13 వ ఏట మద్రాసులో ఫిఫ్త్‌ఫారం చదువుతున్నప్పుడు ప్రాన్లీకప్పు గెలుచుకొన్నారు. 1952 లో నేషనల్ జూనియర్ ఛాంపియన్. ఇదే సంవత్సరం మార్చిలో మద్రాసు యస్. ఐ. ఏ. ఏ. టోర్నమెంట్‌లో శ్రీ కృష్ణన్ తన తండ్రి

శ్రీ టి. కె. రామనాథన్‌ను ఓడించారు. 1955, 56 సంవత్సరాలలో వింబుల్డన్ డేవిస్ కప్పు పోటీలలో పాల్గొన్నారు. 1954, 55 సంవత్సరాలలో వీరితోపాటు శ్రీ మిశ్రా, శ్రీ నరేష్‌కుమార్, శ్రీ నరేంద్రనాథ్ కూడా డేవిస్ కప్పు పోటీలలో పాల్గొన్నారు. 1955 లో ఆస్ట్రేలియాలో శ్రీ హారీ హాప్‌మన్ వద్ద శిక్షణ పొందారు. 1956 లో వింబుల్డన్ పోటీలలో సెంటర్ కోర్టులో మొదటి రౌండులోనే శ్రీ డ్రాబ్నీని ఓడించారు. మద్రాసులో మైలాపూర్-అడయార్ల మధ్య కల స్వగృహంలోనే వీరికి టెన్నిస్ కోర్టు వుంది.

సింగపూర్, జపాన్, ఈజిప్ట్, బ్రిటన్, స్విట్జర్లాండ్, ఆస్ట్రేలియా మున్నగు దేశాలలో వీరు పర్యటించివున్నారు. ఈక, స్క్వాష్‌లలో కూడా వీరికి ప్రవేశం కలదు. 1953 నుంచి ఇండియాలో అగ్ర ఆటగానిగా పరిగణించబడుతున్నారు. (12 వ పేజీకూడా చూడండి).

శ్రీ టిల్డన్ (అమెరికా):— శ్రీ రామస్వామిగారు చెప్పినట్లు ప్రపంచ టెన్నిస్‌లో టిల్డన్ వంటివారు పుట్టలేదు. వీరి జననం 1893 ఫిబ్రవరి 10. టెన్నిస్ ఆటలో వీరికి మించిన మేధ మరొకరికి లేదు. 1923, 24, 25 సంవత్సరాలలో వీరు మహోన్నత దశలో వున్నారు. ఆ రేండ్ల పాటు ప్రపంచంలో అద్వితీయులుగా వున్నారు. వీరి సర్వీస్ అద్వితీయమైనది. 1920, 21, 1930 సంవత్సరాలలో వింబుల్డన్ ఛాంపియన్. ఏడేండ్లు అమెరికా ఛాంపియన్ (1920 - 25, 1929). 1920 నుండి 30 వరకు డేవిస్‌కప్పు పోటీలలో



అమెరికా ప్రతినిధి. 1920 - 25 వరకు ప్రపంచపు అగ్ర ఆటగానిగా పరిగణించబడినారు. 1918, 1922 - 27 వరకు అమెరికా క్లేకోర్టు ఛాంపియన్. 1953 లో వీరు నిర్యాణం చెందారు. 1920 నుంచి ఒక

దశాబ్దం ప్రపంచ టెన్నిస్ చరిత్రలో టిల్డన్ యుగంగా పేర్కొన వచ్చు.

శ్రీ హారీ హాప్మన్ :— (ఆస్ట్రేలియా) జననం 1906 డిశంబరు 8. 1934, 1935 లలో వింబుల్డన్ పోటీలలో పాల్గొన్నారు. 1938, 39 సంవత్సరాలలో డేవిస్ కప్పు పోటీలలో ఆస్ట్రేలియా జట్టుకు నాయకుడు. 1950 నుంచి ఆస్ట్రేలియా జట్టుకు నాన్ ప్లేయింగ్ కెప్టన్. సెడ్జిమెన్, ఎల్. హోడ్, కెన్ రోజ్వాల్, మెర్విన్ రోజ్, రామ నాథన్ కృష్ణన్ వంటి వారలకు టెన్నిస్‌లో ఉన్నత శిక్షణ యిచ్చి వున్నారు. సెడ్జిమెన్, మెక్ గ్రెగర్లు ప్రొఫెషనల్సుగా మారినప్పుడు ఆస్ట్రేలియాకు డేవిస్ కప్పు యిక నిలవబోదని ప్రపంచమంతా భావించింది. హాప్మన్ శిష్యులైన హోడ్, రోజ్వాల్‌లు డేవిస్ కప్పును నిలుపుకొని హాప్మన్ శిక్షణ విశిష్టతను ప్రపంచానికి చాటారు.

శ్రీ టోనీ ట్రాబర్ట్ (అమెరికా) :— జననం 1930 ఆగస్టు 16. హార్డుకోర్టు, లాన్, క్లే, సిమెంట్ కోర్టు లన్నింటిపైనా విశేష ప్రతిభతో ఆడిన వ్యక్తి శ్రీ టోనీ ట్రాబర్ట్. 1951, 55 మధ్య డేవిస్ కప్పు పోటీలలో అమెరికా ప్రతినిధి. 1955 లో వింబుల్డన్ ఛాంపియన్. తరువాత ప్రొఫెషనల్‌గా మారినారు.

శ్రీమతి ఆల్థీ గిబ్సన్ :— అమెరికన్ నీగ్రో. న్యూయార్క్ సిటీ నివాసిని. 1956 జనవరిలో కలకత్తాలో ఆసియా ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్నారు. 1956 జూన్‌లో వింబుల్డెన్ స్త్రీల డబుల్స్ ఛాంపియన్ షిప్‌ను సాధించారు. 1956 జులైలో అమెరికన్ గ్రాస్ కోర్టు స్త్రీల ఛాంపియన్ షిప్‌ను, 1956 ఆగస్టులో అమెరికా ఈస్టరన్ గ్రాస్‌కోర్టు స్త్రీల ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొన్నారు. 1956 లో వింబుల్డన్‌లో పాల్గొనేముందు వరసగా 18 ఛాంపియన్‌షిప్‌లు గెలుచుకొన్నారు.

శ్రీ ఎల్. హోడ్ :— (ఆస్ట్రేలియా) వయస్సు 21 సంవత్సరాలు. 1956 లో సెడ్జిమెన్, మెక్‌గ్రెగర్లు ప్రొఫెషనల్సుగా మారినందున



1953 లో ఆస్ట్రేలియాకు డేవిస్ కప్పు నిలవ దేమోనని ప్రపంచం ఆత్రుత చెందినపుడు శ్రీ హోడ్, శ్రీ కెన్‌రోజ్వాల్ తమ విశిష్ట ప్రతిభతో ఆస్ట్రేలియాకు టెన్నిస్ ఛాంపియన్ షిప్‌ను నిలబెట్టివున్నారు.

అతి వేగంగా ఆట ఆడడంలోనూ, అత్యంత శక్తిమంతంగా సర్వీస్ చేయడంలోనూ పటిష్ఠంగా వాలీచేయడంలోనూ హోడ్ అద్వితీయుడు. 1956 లో వింబుల్డెన్ సింగిల్సు ఛాంపియన్‌షిప్‌ను వీరు సాధించి వున్నారు.

## డేవిస్ కప్పు గెలుచుకొన్న దేశాలు

1900 సంవత్సరంలో ఈ అంతర్జాతీయ పోటీలు ప్రారంభించబడినవి. రష్యా తప్ప దాదాపు అన్నిదేశాలు ఈ పోటీలలో యిప్పుడు పాల్గొంటున్నవి.

1956 లో డేవిస్ కప్పును ఆస్ట్రేలియా గెలుచుకొన్నది. అంతిమ పోటీలో ఆస్ట్రేలియా అమెరికాను ఓడించింది.

అమెరికా, యూరప్, తూర్పుమండలాలు అనే మూడు మండలాలుగా డేవిస్ కప్పు పోటీలు జరుగుతవి. 1956 లో తూర్పు మండలములో ఇండియా సింహళం, జపాన్లను ఓడించింది. అంతర్‌మండలం సెమి ఫైనల్సులో అమెరికాచే ఓడించబడింది. శ్రీ కృష్ణన్, శ్రీ నరేష్‌కుమార్, శ్రీ ఉదయకుమార్‌లు 1956—డేవిస్ కప్పు ఇండియా ప్రతినిధులు.

1900 - 1902 : అమెరికా, 1903 - 1906 బ్రిటిష్ ఐల్సు, 1907 - 1911 ఆస్ట్రలేషియా, 1912 బ్రిటిష్ ఐల్సు, 13 అమెరికా, 14 ఆస్ట్రలేషియా, 15 - 18 ప్రపంచయుద్ధం మూలాన పోటీలేదు, 19 ఆస్ట్రలేషియా, 20-26 అమెరికా, 27-32 ఫ్రాన్సు, 33-36 గ్రేట్ బ్రిటన్, 37 - 38 అమెరికా, 39 ఆస్ట్రేలియా, 40 - 45 యుద్ధం

మూలాన పోటీలేదు. 1946 - 49 అమెరికా. ద్వితీయస్థానం ఆస్ట్రేలియా, 1950 - 53 ఆస్ట్రేలియా, (ద్వితీయస్థానం అమెరికా), 54 అమెరికా (ఆస్ట్రేలియా ద్వితీయస్థానం), 55 - 56 ఆస్ట్రేలియా (అమెరికా ద్వితీయస్థానం).

## వింబుల్డన్ పోటీల విజేతలు

ఆల్ ఇంగ్లండ్ లాన్ టెన్నిస్ అసోసియేషన్ ప్రతియేట వింబుల్డన్‌లో (బ్రిటన్) నిర్వహించే ఈ అంతర్జాతీయ లాన్ టెన్నిస్ టోర్నమెంటు ప్రపంచ టెన్నిస్ ఆటగాళ్ళకు మెక్కా వంటిది.

సింగిల్స్ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్న ఆటగాళ్లు— 1877 యస్. డబ్ల్యు. గోరే, 78 పి. ఎఫ్. హడ్రో, 79-80 జె. టి. హార్ట్లీ, 81-86 డబ్ల్యు. రెన్‌షా, 87 హెచ్. ఎఫ్. లాఫర్డ్, 88 ఇ. రెన్‌షా, 89 డబ్ల్యు. రెన్‌షా, 90 డబ్ల్యు. హామిల్టన్, 91-92 డబ్ల్యు. బాడిలే, 93-94 జె. పిమ్, 95 డబ్ల్యు. బాడిలే, 96 హెచ్. ఎస్. మహానీ, 1897-1900 ఆర్. యఫ్. డొహర్టీ, 1901 ఎ. డబ్ల్యు. గోరే, 1902-06 హెచ్. యల్. డోహర్టీ, 1907 యన్. ఇ. బ్రూక్స్, 1908-9 ఎ. డబ్ల్యు. గోరే, 1910-13 ఎ. ఎఫ్. వైల్డింగ్, 14 ఎన్. ఇ. బ్రూక్స్, 15-18 ప్రపంచ యుద్ధంమూలాన పోటీలేదు. 19 జి. యల్. పాటర్‌సన్, 20-21 డబ్ల్యు. టి. టిల్డన్, 22 జి. యల్. పాటర్‌సన్, 23 డబ్ల్యు. ఎమ్. జాన్‌స్టన్, 24 జె. బరోట్రా, 25 ఆర్. లకోస్టే, 26 జే. బరోట్రా, 27 హెచ్. కోషే, 28 ఆర్. లకోస్టే, 29 హెచ్. కోషే, 30 డబ్లు. టి. టిల్డన్, 31 యస్. బి. వుడ్, 32 హెచ్. వి. వైన్స్, 33 జె. హెచ్. క్రాఫర్డ్, 34-36 యఫ్. జె. పెర్రీ, 37-38 జె. డి. బడ్జి, 39 ఆర్. యల్. రిబ్స్, 40-45 యుద్ధంమూలాన పోటీలేదు. 46 వై. పెట్రే (ఫ్రాన్సు), 47 జాక్ క్రేమర్ (అమెరికా), 48 బాబ్ ఫ్లాకెన్‌బర్గ్ (అమెరికా), 49 టెట్ ష్రోడర్ (అమెరికా), 50 బడ్జ్‌పాటీ (అమెరికా), 51 డిక్ సావిట్ (అమెరికా), 52 ఫ్రాంక్ సెడ్జిమన్ (ఆస్ట్రేలియా), 1953 విక్ సీక్సాస్ (అమెరికా)

1954 జారోస్లావ్ డ్రాబ్నీ (ఈజిప్టు), 1955 టానీ ట్రాబర్ట్ (అమెరికా), శ్రీ నీల్సన్ కు (డెన్మార్క్) ద్వితీయస్థానం, 1956-ఎల్ హోడ్ (ఆస్ట్రేలియా). శ్రీ కెన్ రోజ్వాల్ కు (ఆస్ట్రేలియా) ద్వితీయస్థానం.

## ఇండియా ఛాంపియనులు

పురుషుల సింగిల్సు ఛాంపియన్ షిప్ ను గెలుచుకొన్న వారు :— 1946 సుమంత మిశ్రా, 47 జెర్గిల్ (స్వీడన్), 48-49 దిలీప్ బోస్, 50-51 స్వెన్ డేవిడ్ సన్ (స్వీడన్), 52 సుమంత మిశ్రా, 53 ఆర్. కృష్ణన్, 54 జె. ఆర్క్ స్టాల్ (ఆస్ట్రేలియా) 55-స్వెన్ డేవిడ్ సన్ (స్వీడన్), 56 ఆర్. కృష్ణన్.

స్త్రీల సింగిల్సు ఛాంపియన్ షిప్ ను గెలుచుకొన్న వారు :- 1946—48 శ్రీమతి కె. సింగ్, 50 శ్రీమతి డరోతీ హోడ్, 51 ఊర్మిలా థాపర్, 52 శ్రీమతి జాయి మొట్రామ్ (బ్రిటన్), 53—54 శ్రీమతి రిటా డేవర్, 55 శ్రీమతి ఎ. గిబ్సన్, 1956— శ్రీమతి కె. సింగ్.

ఆసియా ఛాంపియన్లు :— 1955—56 పురుషులు : శ్రీ నీల్సన్ (డెన్మార్క్). స్త్రీలు : శ్రీమతి గిబ్సన్ (అమెరికా).

# అధ్యాయము 12

# టేబుల్ టెన్నిస్

టేబుల్ టెన్నిస్ ఆటను 19 వ శతాబ్దంలో ఇండియాలోని బ్రిటిష్ సైనికధికారులు కనిపెట్టినట్లు చరిత్ర చెబుతున్నది. అయితే అదే శతాబ్దంలో బ్రిటన్‌లోని విశ్వ విద్యాలయ విద్యార్థులు ఈ ఆటను కనుగొన్నట్లు మరొక వాదం కూడా ప్రచారంలో వుంది. మొదట 'గాస్సిమా',



తరువాత 'పింగ్ పాంగ్'గా వ్యవహరించబడిన ఈ ఆట 1902 ప్రాంతాల బ్రిటన్, ఫ్రాన్సు, ఆస్ట్రేలియాలలో ప్రచారంలో వున్నది. ఆ తరువాత ఈ ఆట అంతగా ఆచరణలో లేదు. 1920 ప్రాంతాల పూర్వపు పింగ్ పాంగ్ అసోసియేషన్ పునరుద్ధరించబడి టేబుల్ టెన్నిస్ అసోసియేషన్‌గా అవతరించింది. ఈ సంఘానికి బ్రిటన్ కేంద్రం. 1921 నుంచి బ్రిటన్‌లో ఇంగ్లీష్ ఓపెన్ ఛాంపియన్ షిప్ పోటీలు, 1926 నుంచి ప్రపంచ ఛాంపియన్‌షిప్ పోటీలు జరుపబడుతున్నవి. పురుషుల టీమ్ ఛాంపియన్‌షిప్ గెలుచుకొన్నవారికి 'స్వేద్లింగ్ కప్పు', స్త్రీల ఛాంపియన్ షిప్ గెలుచుకొన్నవారికి 'కార్బిలన్ కప్పు' సమర్పించబడుతవి.

ప్రస్తుతం టేబుల్ టెన్నిస్ ఆట జపాన్, రుమేనియా, జర్మనీ, హాంకాంగ్, స్వీడన్, సింగపూర్, ఆస్ట్రేలియా, ఫిలిప్పీన్సు, చెకొస్లోవాకియా, బ్రిటన్, చైనా, వియత్నాం, ఇండియా, అమెరికా, దక్షిణ కొరియా, హాలెండ్, ఆస్ట్రియా, బెల్జియం, డెన్మార్క్, ఫ్రాన్సు, హంగరీ, యుగొస్లావియా, ఈజిప్ట్, ఇటలీ, బల్గేరియా, ఐర్లెండ్, ఫిన్లెండ్, స్పెయిన్, సింహళం, స్విట్జర్లెండు, పోర్చుగల్,

పాకిస్తాన్, లెబనాన్, బ్రాజిల్, మున్నగు దేశాలలో విశేషంగా ప్రచారంలో వున్నది.

అన్నిదేశాలలోకి జపాను ఎక్కువ ప్రపంచ ఛాంపియన్‌షిప్పులను 1956 లో సాధించివున్నది. ఏడు ప్రపంచ ఛాంపియన్ షిప్పులలోనూ నాలుగు జపానువే.

ఒగిమురా, టనాకా, టొమిటా, టమానూ (జపాను), రిఛార్డ్ బెర్గ్‌మెన్, జానీలీచ్, ఆబ్రేస్‌సిమన్స్, విక్టర్‌బార్నా (బ్రిటన్), అంబ్రోయిడీస్, టిరేబా, స్టమ్‌పెక్, స్లార్ (చెకొస్లావాకియా)ఎఫ్. సిడో జె. కోజియన్ (హంగరి), లో హెంగ్ చూ, ఫూంగ్ వెంగ్ హో (సింగపూర్)



ఒగిమురా, టనాకా

ప్రభృతులు ప్రపంచప్రసిద్ధులైన టేబుల్ టెన్నిస్ ఆటగాళ్ళు.

ఇండియాలో శ్రీయుతులు కె. నాగరాజ్, ఎస్. కె. ధాకర్సె, యతిన్ వాస్, కె. రామకృష్ణ, యు. యం. చంద్రానా, టి. తిరువెంగడం, శివరామన్ ప్రభృతులు ప్రపంచ టేబుల్ టెన్నిస్ పోటీలలో పాల్గొని భారతదేశానికి ఖ్యాతి తెచ్చారు. వీరిలో శ్రీ కె. నాగరాజ్ 1956 లో ప్రపంచ పోటీలలో క్వార్టర్ ఫైనల్సు చేరుకొన్నారు. ఇట్టి ఘనతను పొందిన భారతీయుడు ఈయన ఒక్కడే.

స్పాంజి రబ్బరుబ్యాట్ వినియోగంలోనికి వచ్చినపిమ్మట జపాన్‌ను ఓడించే దేశం మరొకటి కనిపించడంలేదు. "పెన్ హోల్డర్ గ్రిప్"తో ఆడే జాపనీయుల ధాటికి బ్రిటన్, మరికొన్ని పాశ్చాత్య, యూరోపియన్ దేశాలు తట్టుకోలేకపోతున్నవి. స్పాంజిబ్యాట్‌ను నిషేధించడానికి బ్రిటన్ తీవ్రంగా కృషి చేస్తున్నది. ప్రపంచ టేబుల్ టెన్నిస్ మాజీ ఛాంపియన్ శ్రీ విక్టర్ బార్నాకూడా ఈ బ్యాట్ నిషేధానికి ప్రచారం

చేస్తున్నారు. స్పాంజిబ్యాట్ అమలులోనికి వచ్చినప్పటినుంచి బ్రిటన్‌లో టేబుల్ టెన్నిస్ ఆటకు క్షీణదశ పట్టిందని, దీనిని నివారించడం కోసమైనా స్పాంజి బ్యాటును నిషేధించాలని అంతర్జాతీయ టేబుల్ టెన్నిస్ ఫెడరేషన్ అధ్యక్షుడు ఇవార్ మాంటాగూ బహిరంగంగా ప్రకటించి వున్నారు.

జపాన్‌లోనే గాక చెకస్లొవాకియా, హంగరీ, ఫ్రాన్సు, యుగోస్లావియా, బ్రాజిల్, స్వీడన్లలో కూడా ఆటగాళ్ళు స్పాంజి బ్యాటును ఉపయోగిస్తున్నారు.

మొదట పేర్కొన్నట్లు టేబుల్ టెన్నిస్ పుట్టుక ఇండియాయే. 1930 ప్రాంతాల బార్నా, బెల్లాక్‌లు, ఇండియా సందర్శించడంతో ఈ ఆటకు విశేషప్రచారం లభించింది. ఇండియా సందర్శించిన మొదట విదేశీ టేబుల్ టెన్నిస్ ఆటగాళ్లు వీరే. మద్రాసులోని 'అమెచ్యూర్ క్లబ్' వీరిచే ఎగ్జిబిషన్ పోటీలు జరిపించింది. వీరు తరువాత ఇండియా సందర్శించినవారు కెలన్, స్జాబడోస్ గారలు.

ఆ రోజులలో చెక్కబ్యాట్లతో "పింగ్ - పాంగ్" ఆడేవారు. 1941 ప్రాంతాలనుంచి "రబ్బరు సర్ఫేస్" కల బ్యాటులు వినియోగంలోనికి వచ్చినవి. వీటి అమలుతో ఆటలో వేగం హెచ్చింది.

ఇక ఈ మధ్య జపాన్ ప్రభావంవల్ల స్పాంజి బ్యాటులకు కాలం వచ్చింది.

భారతీయ టేబుల్ టెన్నిస్ ఆటగాళ్ళకు విక్టర్ బార్నా, బ్రియాన్ కెనడీ ఉన్నత శిక్షణ నిచ్చివున్నారు. బార్నా శిక్షణవల్ల భారత టేబుల్ టెన్నిస్ ఆటలో ఒక పెద్ద మార్పు వచ్చింది. కష్టమైన బంతులను తీయడంలో శ్రమపడి ఎదుటివాని తప్పులతో పాయింట్లు సంపాదించాలనే విధానానికి క్రమంగా స్వస్తి చెబుతున్నారు. "డిఫెన్సుతో" పాటు ధాటిగా దెబ్బతీసి పాయింట్లు సంపాదించే "ఎగ్రసీవ్ ఆటను" భారతీయులు పెంపొందించుకొంటున్నారు.

ఇండియా టేబుల్ టెన్నిస్ ఛాంపియన్ షిప్‌ను సాధించిన మొట్టమొదటి దక్షిణభారతీయుడు, ఆంధ్ర ప్రతినిధి, శ్రీ వి. శివరామన్.

1941 లో వీరు నేషనల్ సింగిల్సు, డబుల్సు ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్నారు. డబుల్సు పోటీలో వీరికి శ్రీ యన్. యం. నాయుడుగారు పార్ట్‌నర్.

ఆంధ్రదేశంలో 1925 నుంచి టేబుల్ టెన్నిస్ ఆట బాగా ప్రచారంలో వున్నది. అప్పటినుంచి ఒక దశాబ్దంవరకు చెన్నరాష్ట్రంలో పేరొందిన టేబుల్ టెన్నిస్ ఆటగాళ్ళలో ప్రముఖులు శ్రీయుతులు దుగ్గిరాల పూర్ణచంద్రరావు, విష్ణుభట్ల సుబ్బారావు, నూరి, సాంబమూర్తి గారలు. 1935—45 మధ్య టేబుల్ టెన్నిస్ ఆటలో ప్రసిద్ధిచెందిన ఆంధ్రులు శ్రీయుతులు ఆర్. హనుమంతరావు, ఎమ్. ఎస్. అప్పారావు, పంతులు, ఏ. ఆర్. కె. మూర్తి, జె. రామారావు, కె. నరసింహారావు, ఆర్. కె. వి. రమణశాస్త్రి గారలు. 1945 తరువాత శ్రీయుతులు పి. భుజంగరావు, బి. యన్. స్వామి, కోకా సూర్యనారాయణరావు గారలు ఆంధ్రదేశంలో ప్రముఖస్థానం వహించారు.

'పింగ్ పాంగ్' గా ఈ ఆట వ్యవహరించబడుతున్న రోజులలో ఆంధ్ర ఆటగాళ్ళు ఎక్కువగా "హాఫ్ వాలీ" ఆట (బంతిపడీపడడంతో కొట్టడం) ఆడేవారు. శ్రీ దుగ్గిరాల పూర్ణచంద్రరావుగారు ధాటిగా ఆడేవారు. సాంబమూర్తిగారు ఛాప్ ప్రయోగించేవారు. రబ్బరు బ్యాటులు ప్రచారంలోనికి వచ్చినపిదప "ఛాపింగ్", "స్పిన్", "డ్రాప్" షాట్లు అమలులోనికి వచ్చినవి. (పూర్ణచంద్రరావుగారి జీవిత చరిత్ర 318 వ పుటలో చూడండి).

ఆంధ్రదేశంలో టేబుల్ టెన్నిస్ ఆట ప్రచారానికి తొలిరోజులలో కృషిచేసినవారిలో ముఖ్యులు విజయనగరం మహారాజా, స్వర్గీయ పి. యస్. విశ్వనాధ అయ్యర్ గారలు. శ్రీ విశ్వనాధ అయ్యర్ గారు బందరు మున్నగుచోట్ల సబ్ కలక్టరుగా పనిచేసినప్పుడు టేబుల్ టెన్నిస్ క్లబ్‌లు ఏర్పాటుచేసి ఆటలో టాప్‌స్పిన్, ఛాప్‌వంటి క్రొత్తరీతులను స్వయంగా ప్రదర్శించి, అవి అమలులోనికి రావడానికి కారకులైనారు. ఆంధ్రరాష్ట్రానికి విడిగా టేబుల్ టెన్నిస్ అసోసియేషన్‌లు ఏర్పాటుచేయడానికి 1946 లోనే కృషి జరిగింది. శ్రీయుతులు ఆర్. హనుమంతరావు, యన్. యస్. ఆర్. పంతులు, కె. నరసింహారావు

స్వర్గీయ పి. యస్. విశ్వనాథ అయ్యర్‌గారల కృషివల్ల 1946 లో ఆంధ్రరాష్ట్ర టేబల్ టెన్నిస్ సంఘం ఏర్పాటు అయింది. (స్వర్గీయ) విజయనగరం మహారాజా దీని అధ్యక్షులు. శ్రీ వి. శివరామన్ ఆంధ్ర ప్రతినిధిగా నేషనల్ టేబుల్ టెన్నిస్ పోటీలలో పాల్గొన్నారు.

బ్రిటన్‌లో జరిగిన ప్రపంచ టేబుల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో మొదటిసారి ఇండియాజట్టు పాల్గొనడానికి ఆంధ్రరాష్ట్ర టేబుల్ టెన్నిస్ అసోసియేషన్ అధ్యక్షులు (స్వర్గీయ) విజయనగరం మహారాజాగారే ధనసహాయం చేసివున్నారు. ఇండియా జట్టులో ప్రముఖస్థానం వహించినది శ్రీ వి. శివరామన్‌గారే. ప్రపంచ టేబుల్ టెన్నిస్ పటంలో ఇండియాకు స్థానం చూపినది ఆంధ్రులే. వారి రాష్ట్ర టేబుల్ టెన్నిస్ సంఘాన్ని 1950 లో ఇండియా టేబుల్ టెన్నిస్ ఫెడరేషన్ రద్దు చేసి వేసింది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన పిమ్మట శ్రీయుతులు ఆర్. కె. వి. రమణశాస్త్రి, సి. యస్. ఆర్. ఆంజనేయులు, బి. యస్. స్వామిగారల కృషివల్ల తిరిగి ఆంధ్రరాష్ట్రానికి విడి టేబుల్ టెన్నిస్ సంఘం ఏర్పాటయింది.


శ్రీ రమణశాస్త్రి

టేబుల్ టెన్నిస్ ఆటలో దాదాపు ప్రపంచ ప్రమాణాన్ని అందుకొన్న ఆంధ్రులు శ్రీ వి. శివరామన్, శ్రీ డి. వి. రెడ్డిగారలు. శ్రీ శివరామన్ అన్ని 'స్ట్రోక్స్'లోనూ దిట్ట. "డిఫెన్స్" "ఎటాక్" రెండింటిలోనూ సమాన ప్రతిభ గడించిన సవ్యసాచి.

శ్రీ జె. వి. సచ్చిదానందరావుగారు అఖిలభారత ప్రమాణాన్ని అందుకొన్న ఆంధ్ర టేబుల్‌టెన్నిస్ ఆటగాడు. 1936 నుంచి 49 వరకు టేబుల్‌టెన్నిస్‌లో ప్రావీణ్యం పెంపొందించుకొని దరిమిలా అగ్రపోటీలనుంచి విరమించుకొన్నారు. శ్రీ కొలెన్, శ్రీ స్జాబడోస్ గారలు మద్రాసు వచ్చినప్పుడు వారికి రావుగారు గట్టి పోటీయిచ్చివున్నారు. ఒక గేములో శ్రీ కొలెన్‌ను ఓడించినారుకూడా. డిఫెన్స్

ఆటలో వీరిని మించిన భారతీయుడు మరొకడు లేడు. ప్రస్తుతం మద్రాసు కార్పొరేషన్ స్టేడియమ్ అధికారిగా వుంటున్నారు.

టేబుల్ టెన్నిస్‌లో ఇండియా ఖ్యాతిని హైదరాబాదు పెంపొందించిందని గట్టిగా చెప్పవచ్చు. 13వ ఏటనే (1949) నేషనల్ ఛాంపియన్ అయి, ప్రపంచ ఛాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొని, 1951లో శ్రీమతి ఎంజలీకా రోజియానో (రుమేనియా) వద్ద ఒక గేము తీసుకొన్న సయ్యద్ సుల్తానా కన్య ఒకప్పుడు హైదరాబాద్ నివాసిని. 1951లో రోజియానోవద్ద మరెవ్వరు గేముతీసికొని వుండలేదు. ఇండియాలో పేరుగడించి, పాకిస్తాన్‌లో స్థిరపడింది.

1956లో ఇండియా టేబుల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ సాధించిన శ్రీరామకృష్ణ కూడా హైదరాబాద్ నివాసే. శ్రీ కె. అల్తాఫ్ ఆలీ, ఫరీద్ ఆలీ హైదరాబాదులో పేరొందిన ఆటగాళ్ళు. శ్రీ అల్తాఫ్ ఆలీ శ్రీ ఎన్. సి. రాఘవన్, శ్రీ బ్రియన్. కనడే వంటివారలను ఓడించివున్నారు.

## ఆటగాళ్ళ పరిచయం

శ్రీ కోకా సూర్యనారాయణరావు :— వయస్సు 21 సంవత్సరాలు. కాకినాడ విద్యార్థి. డిఫెన్స్ ఆటగానిగా పేరొందారు. పోటీలో తరచు వీరు ప్రదర్శించే "బ్యాక్ హాండ్" దెబ్బలు ముచ్చటగా వుంటవి. బంతి గమనాన్ని త్వర త్వరగా గ్రహించడం (ఏంటిసిపేషన్), ఎంతో ఓర్పుతో ఆడడం వీరి విశిష్ట లక్షణాలు.



1956లో గుంటూరులో జరిగిన "ది స్పోర్ట్సు ఓపెన్ ఛాంపియన్ షిప్"ను, పొట్టి శ్రీరాములు స్మారక టేబుల్ టెన్నిస్ ఛాంపియన్ షిప్ పోటీని, కాకినాడలో జరిగిన 'కోకా క్లబ్' టోర్నమెంట్ను గెలుచుకొన్నారు. మద్రాసు లయోలా కాలేజి పోటీలకు కాకినాడ కాలేజి ప్రతినిధి. జాతీయ, అంతర్రాష్ట్ర పోటీలలో ఆంధ్ర ప్రతినిధి.

ఆంధ్ర ప్రముఖ ఆటగాళ్ళలో ద్వితీయుడు. 1956 అక్టోబర్ లో ఒంగోలులో పి. యస్. విశ్వనాథ అయ్యర్ మెమోరియల్ సింగిల్సు ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్నారు.

శ్రీ ఏ. ఆర్. కె. మూర్తి:— వయస్సు 46. ఒంగోలు నివాసి. డిఫెన్సివ్ ఆటగానిగా మొదట పేరొందారు. అనుభవం గడించినకొద్ది ధాటిగా దాడిచేసే ఆట (అగ్రెసివ్)ను అభివృద్ధిపరచుకున్నారు. కోణాలు మార్చుతూ స్థలాలు మార్చుతూ బంతులువేయడం వీరి విశిష్టత. వీరి టాప్ స్పిన్ ఆనందదాయకం. 1955లో ప్రథమ ఆంధ్రరాష్ట్ర ఛాంపియన్‌షిప్ పోటీలో నాన్ మెడలిస్టు బిరుదు సాధించారు. 1949, 53, 54, 55 సంవత్సరాలలో జాతీయ, అంతర్రాష్ట్ర ఛాంపియన్‌షిప్ పోటీలలో ఆంధ్ర ప్రతినిధి.



శ్రీ ఆర్. కె. వి. రమణశాస్త్రి:— జననం 1923 జులై 18 గుంటూరులో. టెన్నిస్, టేబుల్ టెన్నిస్ ఆటలు రెంటింటిలోనూ, ఆంధ్రదేశ మంతటా వీరు కీర్తి గడించి వున్నారు. ఈ రెండు ఆటల ప్రచారానికి వీరు చాల ఎక్కువగా ధనసహాయం చేసివున్నారు కూడా.



12 వ ఏటనే టెన్నిస్ ఆట ప్రారంభించారు. కాకినాడలోని పి. ఆర్. కాలేజీ టోర్నమెంటులో తన స్కూలు ప్రతినిధిగా పోటీ చేశారు. 1937 ఆంధ్రరాష్ట్ర జూనియర్ ఛాంపియన్. 1939 - 40 లో హిందూకాలేజి టెన్నిస్‌టీమ్ నాయకుడు. హిందూకాలేజికి మొదటిసారి స్ట్రాక్‌షీల్డు సాధించిన జట్టులో వీరిది ప్రముఖస్థానం. 1944 - 46 వరకు పూనాలో లాకాలేజి ఛాంపియన్. 1947 నుంచి 50 వరకు గుంటూరు ఇంటర్‌క్లబ్ సింగిల్స్, డబుల్స ఛాంపియన్.

1949 లో గుంటూరులో జరిగిన మద్రాసు ప్రెసిడెన్సీ హార్డు కోర్టు ఛాంపియన్‌షిప్ పోటీలలో మద్రాసు యూనివర్సిటీ ఆటగాడు, శ్రీ వి. రంగనాథన్ గారిని, మద్రాసురాష్ట్ర ఆటగాడు శ్రీ యం. వి. జి. అప్పారావుగారిని ఓడించి వున్నారు. అదే సంవత్సరంలో మదనపల్లిలో జరిగిన టెన్నిస్ టోర్నమెంట్‌లో ఎ. ఇ. ఓవన్ అంతటి అగ్ర ఆటగానిని ఓడించారు.

వీరి ఫోర్‌హాండ్ డ్రైవ్ కన్నులపండువుగా వుంటుంది. బ్యాక్ హాండ్ కోత ఎంతైనా మెచ్చదగింది.

1450 నుంచి పెద్ద టెన్నిస్ టోర్నమెంటులలో పాల్గొనడంలేదు. టేబుల్ టెన్నిస్ పోటీలలో వీరి ముఖ్య విజయాలివి:

1944-46 పూనా లా కాలేజి ఛాంపియన్. 1950 లో సింహళంలో జరిగిన ఇండియా జాతీయ, అంతర్రాష్ట్ర టేబుల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొన్న ఆంధ్రరాష్ట్ర జట్టుకు నాయకుడు.

1953 నుంచి పెద్ద టోర్నమెంటులలో పాల్గొనడం లేదు. 1955-57 లో రాష్ట్రసంఘం ఉపాధ్యక్షులు. 1955 లో గుంటూరులో 18 వ జాతీయ, అంతర్రాష్ట్ర టేబుల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలు జరపడానికి ప్రధాన కారకులైన వారిలో వీరొకరు.

శ్రీ సి.ఎస్. ఆర్. ఆంజనేయులు :— వయస్సు 38 సంవత్సరాలు. 1947 లో వానా, అండ్రియుడిస్‌ల ఎగ్జిబిషన్ పోటీ చూచిన మీదట టేబుల్ టెన్నిస్ ఆటలో ఆసక్తి కలిగింది. 1948 లో టేబుల్ టెన్నిస్ అభ్యసించడం ప్రారంభించారు. 1!'49 లోనే మద్రాసులో ప్యారిస్ రిక్రియేషన్ క్లబ్ టోర్నమెంటులో నాన్ మెడలిస్టు ట్రోఫీని గెలుచుకున్నారు. దానిని సాధించిన మొదటి ఆంధ్రులు వీరే. అదే సంవత్సరంలో హైదరాబాద్‌లో జరిగిన జాతీయ పోటీలలో ఆంధ్రరాష్ట్ర జట్టు



కెప్టన్. 1950 లో కొలంబోలో జరిగిన జాతీయ పోటీలలో ఆంధ్ర జట్టులో ప్రముఖ సభ్యుడు. పి. కె. పార్థసారధి, ఐ. అర్జునన్, యన్. యం. నాయుడు, వి. నరసింహన్ గారలను ఓడించి వున్నారు. శివరామన్, యన్. సి. రాఘవన్ గారలు శ్రీ ఆంజనేయులు గారిని 4 గేములలో గాని ఓడించలేకపోయారు. ప్రస్తుతం రాష్ట్రకార్యదర్శిగా టేబుల్ టెన్నిస్ వ్యాప్తికి, అభివృద్ధికి కృషి చేస్తూ వున్నారు. 1953, 54, 55 సంవత్సరాలలో జాతీయ పోటీలలో ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి. ఆంధ్రదేశంలోని అగ్ర డబుల్సు ఆటగాళ్ళలో వీరొకరు. శ్రీ బి. యస్. స్వామి, శ్రీ కె. సూర్యనారాయణరావు, శ్రీ జి. ప్రసాద్ గారలు వివిధ సందర్భాలలో పార్ట్నర్లుగా వుండగా వీరు ఆంధ్రదేశంలో పెక్కు డబుల్సు పోటీలను గెలుచుకొని వున్నారు. 3 వ ఆంధ్రరాష్ట్ర డబుల్సు ఛాంపియన్‌షిప్‌ను సాధించివున్నారు.

శ్రీ పి. వి. భుజంగరావు:—వయస్సు దాదాపు 25 సంవత్సరాలు. ధాటిగా బంతికొట్టి పాయింట్లు సంపాదించడంలో శక్తిమంతుడు.



1953 లో జాతీయ, అంతర్రాష్ట్ర పోటీలలో ఆంధ్ర ప్రతినిధి. హైదరాబాదు ఆటగాడు అల్తాఫ్ ఆలీని అప్పుడు ఓడించి, చంద్రానా, వ్యాసు లకు గట్టి పోటీ యిచ్చి వున్నారు. 1945 లో మద్రాసు ఓపెన్ టోర్నమెంటులో ఫైనల్సు చేరుకొని జాన్. కె. జాన్‌చే ఓడించబడినారు. మద్రాసు టోర్నమెంటులో ఫైనల్సు చేరుకున్న మొదటి ఆంధ్రుడు వీరే. బ్రిటిష్ ప్రముఖుడు శ్రీ కెనడీవద్ద శిక్షణపొందారు. వీరిని కెనడీ మెచ్చుకొని ఉన్నారు.

శ్రీ బి. నరసింహస్వామి :- వయస్సు దాదాపు 28 సంవత్సరాలు. 1949 లో టేబుల్ టెన్నిస్ ఆట ప్రారంభించారు. శక్తిమంత



మైన ఫోర్ హ్యాండును, బలమైన ఛాప్‌ను సాధించారు. శ్రీ విక్టర్ బార్నా వద్ద శిక్షణపొంది వారి సలహాప్రకారం ఆటరీతినే మార్చివేసు కొన్నారు. ఫోర్‌హ్యాండుకే విశేష ప్రాధాన్య మిస్తూ బ్యాక్‌హాండ్ ఫ్లిక్స్‌ను ప్రయోగించడం లోనూ, అద్యంతం ఒకే ప్రమాణంలో పోటీ చేయడంలోనూ, ఎక్కువ కృషిచేసి సత్ఫలితాలను సాధించారు. శ్రీ ఎ. ఆర్. కె. మూర్తి, హైదరాబాదు అగ్రఆటగాడు శ్రీ ఖర్షిద్ ఆలీ వంటి వారలను ఓడించివేశారు. 1950, 53—55 సంవత్సరాలలో జాతీయ, అంతర్రాష్ట్ర పోటీలలో ఆంధ్రప్రతినిధి. శ్రీ కె. నాగరాజ్ వద్ద ఒకగేము తీసుకొని వున్నారు. ఒక డబుల్సు సెమిఫైనల్సులో మురుగేష్ పార్ట్‌నర్‌గా వుండగా వీరు శ్రీ కె. నాగారాజ్, శ్రీ తిరువెంగడంగార్లను ఓడించి వున్నారు. ఆంధ్రరాష్ట్రంలో అజేయులు.

శ్రీ ఆర్. వి. అప్పారావు :—వయస్సు దాదాపు 19 సంవత్సరాలు. ప్రథమ ఆంధ్రరాష్ట్ర జూనియర్ ఛాంపియన్‌షిప్‌ను 1953 లో గెలుచుకొని వున్నారు. 1953—54 లలో జాతీయపోటీలకు ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి. ఆంధ్రలో జరిగిన మూడు టోర్నమెంటులలో మూడు డబుల్సు ఛాంపియన్‌షిప్‌లను గెలుచుకొన్నారు. అప్పుడువీరు శ్రీ కె. సూర్యనారాయణరావుగారి పార్ట్‌నర్. 1956 లో కాకినాడలో జరిగిన మొదటి టోర్నమెంటులో ఆంధ్రరాష్ట్ర అగ్రఆటగాడు శ్రీ ఎ. ఆర్. కె. మూర్తిగారిని ఓడించి ఫైనల్సు



చేరుకున్నారు. మద్రాసు లయోలాకాలేజి టేబుల్ టెన్నిస్ పోటీలలో కాకినాడ పి. ఆర్. కాలేజి ప్రతినిధిగా పాల్గొన్నారు. వీరి ఫోర్

హ్యాండ్, ఆటలో వేగం మద్రాసు క్రీడాభిమానుల ప్రశంసలు అందుకొన్నవి. టెన్నిస్, బాడ్మింటన్ ఆటలలో కూడా పేరు గడించి వున్నారు.

శ్రీ గోపరాజు ప్రసాద్ :— జననం 1936 - జూలై 10 గుంటూరు. మొదట క్రికెట్ ఆటగానిగా పేరొందారు. 1953 లో టేబుల్ టెన్నిస్ ఆట ప్రారంభించారు. శ్రీ వి. శివరామన్ వద్ద శిక్షణ పొంది, ఫోర్‌హ్యాండ్ హిట్టర్‌గా వారి ప్రశంస కూడా పొందారు.



1955, 56 లలో మద్రాసు లయోలా కాలేజి టోర్నమెంటులలో హిందూ కాలేజి ప్రతినిధి. 1953—55 సంవత్సరాలలో కాలేజి ఛాంపియన్. భుజంగరావు, ఆంజనేయులుగార్లకు పార్ట్నర్‌గా వుండి పెక్కు పోటీలలో గెలుపొందారు.

శ్రీ డి. మార్కండేయశాస్త్రి :— వయస్సు దాదాపు 26 సంవత్సరాలు. మొదట టెన్నిస్ తరువాత శ్రీ సి. యస్. ఆర్. ఆంజనేయులు, ఎ. ఆర్. కె. మూర్తిగార్ల వద్ద టేబుల్ టెన్నిస్ అభ్యసించారు. 1950 లో కొలంబోలో జరిగిన జాతీయ, అంతర్రాష్ట్ర పోటీలలలో పాల్గొన్నారు. 1954 లో ఒక పోటీలో శ్రీ ఆర్. కె. వి. రమణశాస్త్రి గారిని ఓడించి వున్నారు. 1955 లో విజయవాడలో 'రెయిన్‌బో క్లబ్' టోర్నమెంట్ సింగిల్సు ఛాంపియన్‌షిప్ గెలుచుకొని వున్నారు. జాతీయ పోటీలలో ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి.



శ్రీ వి. దక్షిణామూర్తి :— వయస్సు దాదాపు 26 సంవత్సరాలు. 1954 లో టేబుల్ టెన్నిస్ ప్రారంభించారు. మరుసటి సంవత్సరంలో గుంటూరు ఎల్. వి. ఆర్. అండ్ సన్సు క్లబ్ సింగిల్స్, డబుల్స్, టైటిల్సు గెలుచుకొన్నారు. 1955 లో సీనియర్ సింగిల్స్ పోటీలలో ద్వితీయస్థానం, డబుల్సు పోటీలలో ప్రథమస్థానం వహించారు. 1956 లో పొట్టి శ్రీరాములు మెమోరియల్ టోర్నమెంటులో శ్రీ కె. భాస్కర్ గారితో కలసి ఆడి డబుల్సు ఛాంపియన్‌షిప్ గెలుచుకొన్నారు. సింగిల్సులో క్వార్టర్ ఫైనల్సులో శ్రీ. ఎ. ఆర్. కె. మూర్తిగారిని ఓడించి వున్నారు. టేబుల్ టెన్నిస్ ఆట అన్నిశాఖలలోను ప్రతిభ గడించి వున్నారు. ఫోర్ హ్యాండ్‌కే ఎక్కువ ప్రాధాన్య మిస్తారు.



శ్రీ కె. భాస్కర్ :— వయస్సు దాదాపు 16 సంవత్సరాలు. రేపల్లె నివాసి. 14 వ ఏట టేబుల్ టెన్నిస్ ప్రారంభించి తదనంతరం శ్రీ సి. యన్. ఆర్. ఆంజనేయులుగారి సలహా ప్రకారం ఆటను అభివృద్ధిపరచుకొన్నారు. జాతీయ పోటీలలో ఆంధ్ర జూనియర్ ప్రతినిధి. 1956 లో శ్రీ దక్షిణామూర్తిగారితో కలిసి ఒక టోర్నమెంటులో సీనియర్ ఫైనల్సు చేరుకొన్నారు. మరుసటి టోర్నమెంటులోనే డబుల్సులో ప్రథమస్థానం, సింగిల్సులో ద్వితీయ స్థానం సాధించారు.



శ్రీ బి. సాంబశివరావు :— వయస్సు దాదాపు 30 సంవత్సరాలు. 1953 లో టేబుల్ టెన్నిస్ ప్రారంభించారు. 1954 లో నాన్ మెడలిస్టు ఫైనల్సునకు, సీనియర్ సింగిల్సు ఫైనల్సు చేరుకొన్నారు. ఒకే టోర్నమెంటులో రెండు తరగతులలో పైకివచ్చిన మొదటి ఆట

గాడు. శ్రీ ఎ. ఆర్. కె. మూర్తి, శ్రీ సి. యస్. ఆర్. ఆంజనేయులు గార్లను ఓడించివున్నారు. జాతీయ పోటీలలో ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి.

శ్రీ మద్ది సుబ్బారావు :— నివాసం గుంటూరు. స్థానిక టోర్నమెంటులలో సింగిల్సు పోటీలలో గెలుపొందివున్నారు. 1956 లో మద్రాసు లయోలాకాలేజి టోర్నమెంటులో హిందూకాలేజి ప్రతినిధిగా పాల్గొనివున్నారు.

ఆంధ్రదేశంలో ఇంకా క్రింది టేబుల్ టెన్నిస్ ఆట గాళ్లు ఖ్యాతి గడించి వున్నారు :

శ్రీయుతులు పి. నాగేశ్వరరావు, సి. హెచ్. గోపాలకృష్ణ, పి. హెచ్. బాబా, సి. హెచ్. వి. రాఘవరావు, బి. శేషగిరిరావు, వి. వెంకట రమణయ్యనాయుడు, కె. యస్. సుబ్రహ్మణ్యం, యం. కృష్ణ మూర్తి, వి. కోటయ్య, వి. హరిబాబు, యం. యస్. శాయి, ఐ. డబ్ల్యు. చారి, కె. అర్జునరావు, సి. ఆర్. బి. రావు, మధుసూధన్, పి. సింగయ్య, పి. వెంకట్రామ్, యం. వెంకటరమణ, సి. భగవంతశాస్త్రి, కె. వెంక టేశ్వర్లు, ఎ. రాధాకృష్ణరావు, కె. వి. కృష్ణస్వామి, కె. ఎ. సుబ్రహ్మణ్యం, వి. వి. యస్. శర్మ, సి. హెచ్. గోపాలకృష్ణమూర్తి, జి. సీతాపతిరావు, సి. భరతశాస్త్రి. (వీరంతా ఒంగోలు పోటీలలో పాల్గొని వున్నారు); శ్రీ పి. తిలక్ (రేపల్లె); శ్రీ కె. శేషాచలం, శ్రీ ఆంథోనిక్రిజ్ (గుంతకల్లు); శ్రీ గోపాలుని కైలాసపతిరావు(గుంటూరు).

1956 మార్చిలో టోక్యోలో జరిగిన ప్రపంచ టేబుల్ టెన్నిస్ పోటీలకు శ్రీయుతులు కె. నాగరాజ్, యతిన్ వ్యాస్, యన్. కె. ధాకర్సే, కె. రామకృష్ణ, యు. యం. చంద్రానా, శ్రీమతులు మీనా పరండే, రాకెల్ జాన్, ప్రిస్కానూనెస్ ఎన్నుకోబడ్డారు.

టేబుల్ టెన్నిస్ వ్యాప్తికి కృషిచేస్తున్న సంస్థలు, వ్యక్తులు :

సి. వి. యన్. రీడింగ్ రూం (ఒంగోలు), హైదరీ క్లబ్ (ఒంగోలు), టవున్ హాల్ క్లబ్ (బాపట్ల), ఆఫీసర్సు రిక్రియేషన్ క్లబ్ (తెనాలి),

యల్. ఆర్. యం. క్లబ్ (తెనాలి), యల్. వి. ఆర్. అండ్ సన్సు క్లబ్, గుంటూరు రిక్రియేషన్ క్లబ్, గాంధిజీ మెమోరియల్ టోర్నమెంట్ కమిటీ, హిందు కాలేజి నార్త్ క్లబ్, రైల్వే ఇన్‌స్టిట్యూట్, యన్. జి. జి. ఓ. అసోసియేషన్, యూత్ లీగ్, ఆఫీసర్సు క్లబ్, హిందు కాలేజి స్టాఫ్ క్లబ్, ది స్పోర్ట్సు టోర్నమెంట్సు (ఈ సంస్థలన్నీ గుంటూరు లోనివి), ఆంధ్ర జింఖానా, రైల్వే ఇన్‌స్టిట్యూట్, ఫమ్సు రిక్రియేషన్ క్లబ్, కెయిన్‌బో క్లబ్ (ఇవన్నీ విజయవాడ సంస్థలు), ఎ. ఆర్. ఆర్. (అల్లూరు), శ్రీరామా క్లబ్ (కొత్తపల్లి), జగన్నాథరావు మెమోరియల్ టి. టి. క్లబ్ (చిత్రాడ), కోకా క్లబ్ (కాకినాడ), కృష్ణా అసోసి యేషన్ (కె. సి. వర్క్సు), వైజాగ్ క్లబ్ (విశాఖపట్నం), హిందు సమాజ్ టోర్నమెంట్సు (రాజమండ్రి), గుడివాడ క్లబ్ (గుడివాడ), లిటరరీ అసోసియేషన్ (కాకినాడ), ఆంధ్ర మెడికల్ కాలేజి (విశాఖ పట్నం), ప్రొగ్రెసివ్ ఆర్ట్సు అసోసియేషన్ (కర్నూలు), సిటీ క్లబ్ (విజయనగరం), పొట్టి శ్రీరాములు మెమోరియల్ టోర్నమెంట్ కమిటీ (గుంటూరు), జింఖానా క్లబ్ (వేటపాలెం), టెన్నిస్ క్లబ్ (రేపల్లె).

శ్రీయుతులు జె. చంద్రమౌళి, యస్. యం. ఖుద్దూస్, డి. భాస్కర్ రావు, ఎస్. పూర్ణచంద్రరావు, జె. భువాల్కా, కె. వి. శేషగిరి రావు, శ్రీమతి యం. ఇజాక్.

## ప్రపంచ ఛాంపియనుల వివరం :

1926 - 27 డాక్టర్ ఆర్. జాకొబీ (హంగరీ); 1927 - 28 జె. మెక్లోవిట్స్ (హంగరీ); 1928 - 29 ఎఫ్. జె. పెర్రీ; 1929 - 30 జి. వి. బార్నా (హంగరీ); 1930 - 31 ఎమ్. స్జబడోస్ (హంగరీ); 1932 - 35 జి. వి. బార్నా (హంగరీ); 35 - 36 ఎస్. కోలార్; 36 - 37 ఆర్. బెర్గమెన్ (ఆస్ట్రియా); 37 - 38 బి వా నా (చెకొస్లొవాకియా); 38 - 39 ఆర్. బెర్గమెన్ (ఆస్ట్రియా); 40 - 46 యుద్ధంమూలాన పోటీలేదు; 46 - 47 బి. వానా (చెకొస్లో వాకియా); 47 - 48 రిఛార్డ్ బెర్గమెన్ (బ్రిటన్); 48 - 49 జానీలీచ్

(బ్రిటన్); 49 - 50 రిఛార్డ్ బెర్గమెన్ (బ్రిటన్); 50 - 51 జానీలీచ్ (బ్రిటన్); 51 - 52 హెచ్. సెటోహ్ ; 52 - 53 యఫ్. సిడో (హంగరీ) ; 53 - 54 ఐ. ఓగిమురా (జపాను); 54 - 55 శ్రీటోషియాకి టనాకా (జపాన్) ; 55 - 56 ఐ. ఓగిమురా (జపాన్).

1955-56 లో శ్రీమతి టోమీ ఓకోవా ప్రపంచ స్త్రీల ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొన్నది.

రుమేనియా ఆటగత్తె శ్రీమతి ఎంజలీకా రోజియనో 1949-50 నుంచి 54-55 వరకు ప్రపంచ స్త్రీల ఛాంపియన్. 55-56 లో ఈమెను శ్రీమతి కియోకో టనాకా అనే జపాన్ ఆటకత్తె రెండవ రౌండులోనే ఓడించివేశారు.

## భారత ఛాంపియన్లు

1938, 39 ఎమ్. అయూబ్; 1940 ఇజాక్ అవాన్; 41 వి. శివ రామన్; 42 కె. హెచ్. కపాడియా; 43 యు. యం. చంద్రానా; 44 హెచ్. అరన్‌సన్ (అమెరికా); 45 కెన్ స్టాన్లీ (బ్రిటన్); 46 వి. శివరామన్; 47 బాహిమిల్ వానా; 48, 49 యు. యం. చంద్రానా; 50 కె. జయంత్; 51 టి. తిరువేంగడం; 52 కె. జయింత్; 53 ఎస్. కె. ధాకర్సే; 54 యు. యం. చంద్రానా; 55 కె. రామ కృష్ణ; 56 జి. ఆర్. దివాన్ (బొంబాయి).

1956 లో స్త్రీల ఛాంపియన్‌షిప్‌ను శ్రీమతి మీనాపరందే; జూనియర్ ఛాంపియన్‌షిప్‌ను మాష్టర్ జె. సి. వోరా (బొంబాయి) గెలుచుకొన్నారు. పురుషుల టీమ్ ఛాంపియన్‌షిప్‌ను బొంబాయి ఆటగాళ్లు (ఎస్. ఆర్. ఇరానీ; ఎస్. కె. ధాకర్సే; వై. ఎన్. వ్యాస్; జి. ఆర్. దివాన్; ఎస్. వి. రంగరాజ్), స్త్రీల టీమ్ ఛాంపియన్ షిప్‌ను బొంబాయి ఆటకత్తెలు (ఐరిన్ పీటర్స్, జాయి డిసౌజ్, ప్రిస్కా నూనెస్) జూనియర్ టీమ్ ఛాంపియన్‌షిప్‌ను ఢిల్లీబాలురు (ఇందర్ ప్రకాష్; కిషన్ ముబాయి; ఎస్. కె. శ్రీనాధ్; సుబీర్ సేన్) గెలుచు కొన్నారు.

శ్రీ కె. నాగరాజ్ :— లోగడ మైసూరు ప్రతినిధి. ప్రస్తుతం రైల్వే ప్రతినిధి. డిఫెన్సు ఆటలో అద్వితీయుడు. 1956 మార్చిలో టోక్యోలో జరిగిన ప్రపంచ టేబుల్ టెన్నిస్ పోటీల మూడవ రౌండులో ప్రపంచ మాజీ ఛాంపియన్ శ్రీ జానీలీచ్‌ను (బ్రిటన్ 21-11 21-12, 12-21, 21-18 పాయింట్లతో) ఓడించారు. నాల్గవ రౌండులో జపాన్ ఆటగాడు శ్రీ ఎస్. ఎమాడాను ఓడించి క్వార్టర్ ఫైనల్సు చేరుకున్నారు.

శ్రీ యతిన్ వ్యాస్ :— స్పిన్‌లో ప్రతిభాశాలి. టోక్యో ప్రపంచ పోటీలలో సైమింగ్ ఘూ, అనే చైనా ఆటగానిని ఓడించి చుంగ్‌చిన్‌సింగ్ అనే హాంకాంగ్ ఆటగానిచే ఓడించబడినారు. ఈ 24 సంవత్సరాల యువకుడు 1955 సంవత్సరాంతంలో హంగరీ, సింగపూర్‌లపై టెస్టు పోటీలలో ఇండియా విజయమొందడానికి ప్రధాన కారకు లయ్యారు. బొంబాయి, బెంగుళూరులలో జరిగిన ఈ పోటీలలో సిడో, కొజియన్, చు, హో లు పాల్గొనివున్నారు. ఈ పోటీలలో వ్యాస్ ఓటమి ఎరుగడు.

శ్రీ కె. రామకృష్ణ (హైదరాబాద్) :— వయసు 19 సంవత్సరాలు. 1955-56 లో ఇండియా ఛాంపియన్. టోక్యో ప్రపంచ పోటీలలో కవోఐపింగ్ అనే చైనా ఆటగానిని ఓడించి మైవాన్‌హువా అనే వియత్నామీస్ ఆటగానిచే ఓడించబడినారు. 1955 లో ఆఫ్ఘనిస్తానులో ఎగ్జిబిషన్ పోటీలు యిచ్చివున్నారు. చక్కటి ఫోర్‌హ్యాండ్ కల ఈ ఆటగాడు ధాటిగా దెబ్బతీసి పాయింట్లు సంపాదిస్తారు.

శ్రీ బ్రియాన్ కెనడీ (బ్రిటన్):— వయస్సు సుమారు 24 సంవత్సరాలు. 1952 లో బ్రిటనులోని అగ్ర ఆటగాళ్ళలో నాల్గవవాడు. 1954 లో ఢిల్లీ, మద్రాసు, బొంబాయిలలో మన ఆటగాళ్ళకు ఉన్నత శిక్షణ నిచ్చివున్నారు. 16 వ ఏట టేబుల్ టెన్నిస్ ప్రారంభించిన శ్రీ కెనడీ రాయల్ వైమానికదళ ప్రతినిధిగా ఇంగ్లీష్ ఓపెన్ ఛాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొని తొలి ప్రయత్నంలోనే ఫైనల్సు చేరుకొన్నారు. స్వేద్లింగ్ కప్పు పోటీలలో పాల్గొన్నారు. ఫ్రెంచి, ఓపెన్, మిక్స్‌డ్ డబుల్సు పోటీలను గెలుచుకొని వున్నారు. బ్రిటిష్

ప్రతినిధిగా 20 పోటీలలో పాల్గొన్నారు. ప్రతి శిక్షితునిపట్ల అమితమైన శ్రద్ధ తీసుకొని గ్రిప్, ఫుట్ వర్క్ బాగా చెప్పి ఇండియా అభిమానం చూరగొన్నారు.

శ్రీ జానీ లీచ్ (బ్రిటన్):— 1948-49, 50-51 లలో వీరు ప్రపంచ ఛాంపియన్. మొదట పేర్కొన్న పోటీలో చెకోస్లావాకియా ఆటగాడు వానామ్, రెండవ పోటీలో ఆండ్రిడీస్‌ను ఫైనల్సులో ఓడించారు. "డిఫెన్స్", "ఎటాక్" రెండింటిలోను ప్రతిభాశాలి. అతి కష్టమైన బంతిని తీసుకొని ఆ వెను వెంటనే అంత కష్టంగానూ ధాటీగాను కొట్టడంలో వీరు నేర్పరి. వీరు ఇండియాలో పర్యటించి వున్నారు.

శ్రీ ఇవాన్ ఆండ్రిడీస్:– (చెక్‌స్లొవాకియా) జననం 1924. 13 ఏటనుంచి టేబుల్ టెన్నిస్ ఆటలో ప్రవేశం. ఐరిష్, రుమేనియన్, ఆస్ట్రియన్, డచ్, ఇండియన్ ఛాంపియన్ షిప్‌లను గెలుచుకొన్నారు. రెండు ప్రపంచ పోటీలలో ద్వితీయస్థానం పొందివున్నారు. చెకోస్లావాకియా ఛాంపియన్‌షిప్‌నుతొమ్మిదిసార్లు సాధించి వున్నారు. డిఫెన్సివ్ ఆటలో వీరిది పెట్టింది పేరు. భారతీయ ఆటగాళ్ళకు శిక్షణ యిచ్చివున్నారు.

శ్రీ ఫెరెన్స్ సిడో (హంగరీ) :— 200 పౌన్ల బరువు, 6 అడుగుల ఎత్తుగల శ్రీ ఫెరెన్సు సిడో 1952-53 లో ప్రపంచ ఛాంపియన్. స్థూలకాయుడైనప్పటికీ అమిత వేగంతో ఆడగల ప్రతిభాశాలి. వీరి దెబ్బలు అతి పటిష్టమైనవి. కుడి, ఎడమలు రెండు వైపులా బంతులను చక్కగా తీయగల నేర్పరి. డిఫెన్సులో కూడా దిట్ట. సుడులు తిరుగుతూ బంతిపోయే విధంగా ఫోర్‌హ్యాండ్ దెబ్బ కొట్టగల శ్రీ సిడో, బెర్గమెన్, లీచ్ వంటి అగ్ర ఆటగాళ్ళను ఓడించి వున్నారు. గుంటూరు, మరికొన్ని భారతీయ నగరాలలో జరిగిన టేబుల్ టెన్నిస్ టోర్నమెంటులలో పాల్గొని వున్నారు.

శ్రీమతి ఆంజెలీకా రోజియానో (రుమేనియా) :— ఆరుసార్లు ప్రపంచ స్త్రీల ఛాంపియన్. ఈ ఆరువేళ్లలోను 17 ప్రపంచపు పోటీలను గెలుచుకొన్నారు. 1956 ప్రపంచ పోటీలలో శ్రీమతి ఎల్లా జెల్లర్‌తో కలిసి ప్రపంచ స్త్రీల డబుల్సు ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్నారు.

# అధ్యాయము 13

## హాకీ

ప్రాచీన క్రీడలలో హాకీ ఒకటి. మధ్య అమెరికాలోని 'అజ్టెక్స్', ఉత్తర అమెరికా 'రెడ్ ఇండియన్' జాతివారు అనాదిగా హాకీని పోలిన ఆటను ఆడుతూండేవారు.




ఐదవ శతాబ్దానికి చెందిన ఒక గ్రీక్ కార్వింగ్‌లో యిద్దరు పురుషులు వంకర కర్రలు పట్టుకొని ఆడుతున్నట్లుగా వున్నది. ఇది హాకీని పోలిన ఆట అని నిస్సందేహంగా చెప్పవచ్చు. స్కాట్లెండ్‌లో 16 వ శతాబ్దంలో 'ఐస్ హాకీ'ని పోలిన కర్లింగ్ అనే శీతకాలపు ఆట ప్రచారంలో వుండేది. మంచుప్రదేశంలో ఈ ఆటను రెండుజట్లు ఆడేవి. 9 అంగుళాల వ్యాసం కలిగి, 40 లేక అంతకంటే ఎక్కువ పౌన్ల బరువుకల గుండ్రటి శిలను కొనవంకరకల గోల్ఫుకర్రవంటి కర్రతో నెట్టుకొనిపోయి, ఒక సూచిని దాటించడం ఈ ఆట పద్ధతి. ఒక జట్టు పురోగమించకుండా మరొక జట్టు అడ్డుపడుతూ వుండేది. 12 వ శతాబ్దంనుంచే స్కాట్లెండ్‌లోనే "షింటీ" అనే హాకీవంటి ఆట ప్రచారంలో వున్నది.

ఐర్లెండ్‌లో 12 వ శతాబ్దం ప్రాంతాల జాతీయక్రీడగా ఎంచబడిన 'హార్లీ' కూడా హాకీని పోలిన ఆటే. హార్లీలతో (వంకర కొనగల కర్రలతో) బంతిని ఎదుటిజట్టు "గోలు" గుండా పోనివ్వడం ఈ ఆట రీతి. జట్టుకు 30, అంతకు మించికూడా ఆటగాళ్ళు వుండేవారు.

ఇంగ్లండ్ ట్యూడర్ల పరిపాలనలో వున్నప్పుడు (1485 - 1603) 'షింటీ'ని పోలిన క్లబ్స్ లేక "హారల్ బ్యాట్" అనే ఆట ప్రచారంలో

వుండేది. దీనినే బ్రిటన్‌లోని వివిధప్రాంతాలలో "షిన్నావ్స్", "కాలింగ్", "బాడిన్స్", "డాడార్ట్స్", "బ్యాండీ" అనే పేర్లతో వ్యవహరించేవారు. విక్టోరియన్లు ఈ ఆటకు కొన్ని నియమాలు ఏర్పాటు చేశారు. దరిమిలా "బ్యాండీ" అన్న పేరుమాత్రమే వ్యవహారంలో వుండేది. అటుతర్వాత "హాకీ" అన్న పేరు స్థిరమైనది.

కర్రలతో బంతికొట్టే ఒక ఆటను అతి ప్రాచీనకాలంలో పర్షియన్లు ఆడినట్లు చరిత్ర చెబుతున్నది.

ఇంగ్లండులో 1857 ప్రాంతాల క్రికెట్ బంతితోనూ, ఇదమిత్థమైన ప్రమాణంలేని ఓక్ కర్రలతోనూ "హాకీ" ఆడేవారు. ఆ రోజులలో ఫార్వర్డ్ లైనులో 8 మంది వుండేవారు. 4 గురు ఇన్ సైడ్ ఫార్వర్డ్‌లు కుడి, ఎడమల ఇద్దరేసి వుండేవారు. హాఫ్ బ్యాకులు యిద్దరు వుండేవారు. ఎదుటిజట్టు ఫార్వర్డ్‌లు సులభంగా దూసుకొనిపోకుండా నివారించడం నిమిత్తం ఒక ఇన్ సైడ్ ఫార్వర్డ్‌ను హాఫ్‌బ్యాక్ గా నియోగించే పద్ధతి తదనంతరం అమలులోనికి వచ్చింది. 1886 లో త్రికార్వర్టర్ బ్యాక్ పద్ధతి ప్రవేశపెట్టబడింది. దరిమిలా ఫార్వర్డ్‌ల సంఖ్య ఆరుకు తగ్గించబడింది. 1889 నుంచి 5 గురు ఫార్వర్డ్‌లు, ముగ్గురు హాఫ్ బ్యాకులు, ఇద్దరుఫుల్ బ్యాకులు, ఒక గోల్ కీపర్ వుండేపద్ధతి అమలులోనికి వచ్చింది. ఇప్పటికీ ఈ పద్ధతి అమలులో వున్నది.

హాకీ ఆట మొదట యూరప్ లో బాగా ప్రచారమైనది. 1907 లో ఇంగ్లండు, ఫ్రాన్సులకు మ్యాచి జరగడంతో అంతర్జాతీయ పోటీలు ప్రారంభమైనవి. తొలి పోటీలో జర్మనీ, బెల్జియం, డెన్మార్క్, స్పెయిన్, ఆస్ట్రియా, హాలెండ్, స్విట్జర్లాండులు పాల్గొన్నవి. క్రమేణా న్యూజిలెండు, దక్షిణాఫ్రికా, జపాను వంటి దూర దేశాలకు సైతం హాకీ వ్యాపించింది. 1886–1925 మధ్య హాకీ నియమాలు తగు విధంగా మార్చబడుతూ వచ్చినవి.

1928 నుంచి ప్రపంచ ఛాంపియనులైన భారతీయులకు హాకీ ఆటను పరిచయం చేసినది ఆంగ్లేయులు. 1880 ప్రాంతాల ఇండియాలో ఆంగ్లేయులు హాకీని ప్రవేశపెట్టారు. అంతకుముందు ఇండియాలో

"ఖిడ్డో-ఖుండీ" అనే ఆట ప్రచారంలో వుండేది. దూదిబంతిని వంకర కర్రలతో నెట్టుకుపోవడం ఈ ఆట రీతి. ఆంగ్లేయులు హాకీ ఆటను ప్రవేశ పెట్టిన మీదట దేశంలోని పలు ప్రాంతాలలో హాకీక్లబ్బులు, హాకీ సంఘాలు ఏర్పడి, ఆటను ప్రచారం చేస్తూ వచ్చినవి. 1925 నవంబరు 7 వ తేదీన ఇండియా హాకీ ఫెడరేషన్ నెలకొన్న మీదట క్రమ పద్ధతిని దేశంలో హాకీ ఆటలో భారతీయుల ప్రావీణ్యం పెంపొందించబడు తున్నది.

ఇండియా తొలిసారి 1928 లో ప్రపంచ ఒలింపిక్ ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొన్నది. ఆమ్‌స్టర్‌డామ్‌లో ఆ ఒలింపిక్స్ జరిగినవి. 1956 నవంబరులో మెల్బోర్న్ ప్రపంచ ఒలింపిక్ పోటీలవరకు ప్రతి ఒలింపిక్స్‌లోనూ ఇండియా తన హాకీ ఛాంపియన్‌షిప్‌ను నిలబెట్టుకొంటూ వచ్చింది. 1928 లో పాల్గొన్న ఇండియాజట్టుకు శ్రీ పెన్నిగర్ నాయకత్వం వహించారు. అప్పుడు ఫైనల్సులో హాలెండును 3-0 గోలు లతో ఇండియా ఓడించింది (168 వ పేజీ కూడా చూడండి). 1956 లో మెల్బోర్న్‌లో జరిగిన ఒలింపిక్ క్రీడోత్సవంలో ఇండియా హాకీ జట్టుకు శ్రీ బల్బీర్‌సింగ్ నాయకత్వం వహించారు. ఫైనల్సులో ఇండియా పాకిస్తానును ఒకే ఒక గోలుతో ఓడించింది. అంతకుముందు ఆఫ్ఘనిస్తానును 14 గోలులతోను, అమెరికాను 16 గోలులతోను, సింగపూరును 6 గోలులతోను, జర్మనీని ఒకే ఒక గోలుతోను ఓడించింది. ఇండియాకు ఏ దేశము ఒక్క గోలూ చెయ్యలేకపోవడం ఇండియా ఘనతకు తార్కాణం. ఒక్క గోలు అయినా 'తినని' దేశం మరేదిలేదు.

పాకిస్తాన్, జర్మనీ, హాలెండ్, బ్రిటన్, న్యూజిలెండ్‌లు హాకీలో తమ ప్రావీణ్యాన్ని త్వరితగతిని పెంపొందించుకొంటూ వస్తున్నవి. ఇండియాలో ఇప్పుడు ఒక్క ధ్యాన్‌చంద్‌గాని, ఒక రూప్‌సింగ్‌గాని లేకపోయినప్పటికీ హాకీలో ప్రావీణ్యప్రమాణం మరీ తగ్గలేదు. ఇతర దేశాల అభివృద్ధిని గమనించి భారతీయులవలెనే దగ్గరి ప్యాసులతో ఆడే టెక్నిక్‌ను అభివృద్ధిపరచుకొంటున్న పాకిస్తాన్‌నుంచి రాగల ప్రమా దాన్ని గుర్తించి ఇండియా ఇప్పటినుంచే శిక్షణకార్యక్రమాన్ని ఏకదీక్షతో కొనసాగించి, అనుక్షణం అప్రమత్తతతో వుంటేనేతప్ప ప్రపంచ ఛాంపియన్‌షిప్‌ను నిలుపుకొనడం చాలా కష్టమౌతుంది.

ఇండియా సర్వీసెస్ జట్టు 1926 లో న్యూజిలెండ్‌లో పర్యటించింది. విదేశ యాత్ర చేసిన ఈ మొట్టమొదటి ఇండియా హాకీ జట్టులో శ్రీ ధ్యాన్‌చంద్ కలరు. ప్యారిస్‌లో జరిగిన ఎనిమిదవ ఒలింపియాడ్‌లో హాకీ మినహాయించబడింది. అంతకుముందు లండన్ ఒలింపిక్స్‌లోనూ, 1920 లో ఆంట్వెర్ప్ ఒలింపిక్స్‌లోనూ హాకీ ఛాంపియన్ షిప్‌ను బ్రిటన్ గెలుచుకొన్నది. 1928 ఆమ్‌స్టర్‌డామ్ ఒలింపిక్స్‌లో హాకీని చేర్చడానికి ఇండియా తీవ్రంగా కృషిచేసి విజయమొందింది. తొలిసారి ఆమ్‌స్టర్‌డామ్ ఒలింపిక్స్‌లో ఇండియా పాల్గొని తొలి ప్రయత్నంలోనే ఛాంపియన్‌షిప్‌ను సాధించింది.

ఆంధ్రదేశంలో దాదాపు 21 సంవత్సరాలనుంచి మదనపల్లిలో హాకీ ఆట అభివృద్ధికృషి జరుగుతున్నది. ఆంధ్రరాష్ట్రం అవతరించక ముందుకూడా ఆంధ్రరాష్ట్రానికి విడిగా ఒక హాకీసంఘం ఏర్పాటు చేయడానికి మదనపల్లిలో కృషిజరిగింది. రాష్ట్రావతరణ పిమ్మటగాని అది ఫలించలేదు. 1953 అక్టోబరులో ఆంధ్రరాష్ట్రం అవతరించిన శుభ సమయంలో శ్రీ ఎమ్. పాండురంగంగారు మదనపల్లెలో ఆంధ్రరాష్ట్ర హాకీ టోర్నమెంటును నిర్వహించివున్నారు. 1955 లో మద్రాసులో జరిగిన నేషనల్ హాకీ ఛాంపియన్‌షిప్ పోటీలలో ఆంధ్రజట్టు తొలిసారి పాల్గొని ప్రశంసనీయంగా ఆడింది. ఒరిస్సాను ఓడించి, ఢిల్లీకి గట్టిపోటీ యిచ్చి ఓడిపోయింది.

1930 ప్రాంతాల ఏలూరు సయ్యద్ అహమ్మద్ టోర్నమెంటులలోనూ, బందరు, రాజమండ్రి, కాకినాడ, గుంటూరు, తిరుపతి వంటి పట్టణాలలోను హాకీ పోటీలు జరుపబడేవి. పూర్వపు అగ్ర హాకీ ఆటగాళ్ళలో శ్రీయుతులు: బాబు, మోహన్ ప్రభృతులు ముఖ్యులు.

జాతీయ ఛాంపియనుల వివరం -

1928 యు. పి; 1930 రైల్వే; 1932 పంజాబ్; 1934 టోర్నమెంటు నిర్వహించబడలేదు; 1936 బెంగాల్; 1938 బెంగాల్; 1940 బొంబాయి; 1942 ఢిల్లీ; 1944 బొంబాయి; 1945 భోపాలు

(ఇప్పటినుంచి ఏటా పోటీలు జరుగుతున్నవి); 1946 పంజాబ్; 1947 పంజాబ్; 1948 భోపాల్; 1949-51 పంజాబ్; 1952 బెంగాల్; 1953 సర్వీసెస్; 1954 పంజాబ్; 1955 మద్రాసు, సర్వీసెస్ (జాయింట్ హోల్డర్లు), 1956 సర్వీసెస్.

## హాకీ ఆటగాళ్ళ పరిచయం

శ్రీ పి. శ్రీనివాసులు :— నివాసం చిత్తూరు. ప్రస్తుతపు హాకీ ఆటగాళ్ళలో మంచి భవిష్యత్తు కల ఈ యువకుని వయస్సు 25 సంవత్సరాలు. 1947-48లో తిరుపతి శ్రీ వేంకటేశ్వర కాలేజీజట్టు నాయకుడు. 1955లో మదనపల్లి, తిరుపతి హాకీ టోర్నమెంటులలో వీరి జట్టు విజయమొందింది. ఫార్వర్డ్‌గా పేరొందారు. జాతీయ పోటీలలో ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి.

శ్రీ ఎమ్. ఆనందరాజ్ సుందరం :— ఆంధ్రరాష్ట్ర హాకీ సంఘం గౌరవకార్యదర్శిగా వుంటూ దేశంలో హాకీ క్రీడాభివృద్ధికి విశేషంగా పాటుపడుతున్నారు. ఆటగాళ్ళలో క్రమశిక్షణ పెంపొందడానికి వీరు చేసినకృషి ప్రశంసనీయం. మద్రాసు వై. యం. సి. ఏ. వ్యాయామ శిక్షణ కళాశాలలో అధ్యాపకునిగా పనిచేసి ప్రిన్సిపాల్ (స్వర్గీయ) శ్రీ సి. సి. అబ్రహాం ప్రత్యేక ప్రశంసలను అందుకొన్నారు. మద్రాసులో ప్రభుత్వ ఆధ్వర్యాన మాజీసైనికులకు వ్యాయామ శిక్షణ తరగతులను నిర్వహించివున్నారు. బెంగుళూరులో ఐదేళ్ళకు



పైగా వై. యం. సి. ఏ. వేసవికాలపు వ్యాయామ శిక్షణ కేంద్రంలో అధ్యాపకులుగా వున్నారు. త్రిలోకేకార్ హాకీ టోర్నమెంటు స్థాపకులు. ఇండియన్ ఒలింపిక్స్‌ను (1946) ఇండో-సిలోన్ యువజన క్రీడోత్సవాన్ని (1947) ఏర్పాటుచేసిన ప్రముఖులలో ఒకరు. 1952-53 లో మద్రాసు ఒలింపిక్ అసోషియేషన్ కార్యదర్శి. గ్రామాలలో

క్రీడోత్సవాలు నిర్వహించడంలో కూడా విశేషానుభవం గడించి వున్నారు. మదనపల్లి థియోసాఫికల్ కాలేజి ఫిజికల్ డైరక్టర్‌గా యువకుల క్రీడలలో ఎంతో ప్రోత్సాహం యిస్తున్నారు.

శ్రీ ఎం. ఏ. ముత్తన్న :— కూర్గురాష్ట్రంలోని మెర్కారాలో జననం. వీరు ఆంధ్రరాష్ట్ర పోలీసు హాకీ జట్టు సభ్యులు. 1954, 55 సంవత్సరాలలో జోనల్ టోర్నమెంటులలో ఆంధ్రరాష్ట్ర పోలీసు హాకీ టీము సభ్యులు—నాయకులు. 1955 - 1956 లో నిర్వహించబడిన జాతీయ హాకీ ఛాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొన్న ఆంధ్రరాష్ట్రజట్టుకు కెప్టెన్.



వీరు పోలీసు డిపార్టుమెంటులో చేరకమునుపు కూర్గ వాండరర్స్‌జట్టులో ఆడుతుండేవారు.

శ్రీ సి. జి. వెంకటేష్ :— జననం 1933 - మార్చి 7. అనంతపురం నివాసి. హైస్కూలు విద్యార్థిగా వున్నప్పుడే గ్రిగ్ టోర్నమెంట్స్‌లో హాకీ, క్రికెట్ ఆటల్లో పాల్గొన్నారు. 1953-54 లలో ఇంటర్ కలేజియెట్ హాకీ పోటీలలో కాలేజీ జట్టుకు నాయకత్వం వహించారు. 1955-56 లలో మద్రాసులో జరిగిన అఖిలభారత ఇంటర్ యూనివర్సిటీ హాకీ టోర్నమెంట్‌లో పాల్గొన్న ఆంధ్ర యూనివర్సిటీ హాకీ జట్టుకు కెప్టెన్. 1956 లో ఆంధ్రరాష్ట్ర జట్టు సభ్యుడు.



శ్రీ ఆర్. దేవ ఆభరణం :— జననం 1933 ఆగస్టు 23. కర్నూలు నివాసి. స్కూలు విద్యార్థిగా ఉన్నప్పుడు జిల్లా హాకీ, క్రికెట్, ఫుట్‌బాల్ పోటీలలో పాల్గొన్నారు. 1952 లో కడపలో జరిగిన రీజినల్ ఇంటర్ డిస్ట్రిక్ట్‌స్పోర్ట్సులో కర్నూలుజిల్లా తరపున

పాల్గొన్నారు. అప్పుడు వీరు శ్రీ డి. యస్. రెడ్డి ఛాంపియన్ గోల్డు మెడల్ బహుమతిని సాధించారు. 1953 లో గ్రిగ్ మెడలు పొందారు. 1956 లో ఆంధ్రరాష్ట్ర జట్టు సభ్యుడు.

శ్రీ ఇ. దశరథరామారావు (ఇ. డి. రామారావు) :— జననం 1923 డిసెంబరు 26 కాకినాడలో. 1948 లో జరిగిన సురాజ్ మల్ల హాకీ టోర్నమెంటులోనూ, 1950 లో జరిగిన యస్. వి. యస్. ఆర్. మెమోరియల్ హాకీ టోర్నమెంట్ లోనూ పాల్గొన్న పోర్ట్ జట్టు సభ్యులు.

1951, 53 సంవత్సరాలలో ఇంటర్ కలేజియెట్ పోటీలకు పి. ఆర్. కాలేజి ప్రతినిధి. 1948 - 52 సంవత్సరాలలో గుంటూరులో జరిగిన 'గుంటూరు హాకీ టోర్నమెంట్' లో పాల్గొన్న కాకినాడ ఎలివెన్ జట్టు సభ్యులు. 1955 లో బొంబాయి గోల్డుకప్పు హాకీ టోర్నమెంట్సులో పాల్గొన్న ఆంధ్ర హాకీజట్టు సభ్యుడు. 1956 లో జాతీయపోటీలలో ఆంధ్రప్రతినిధి.

శ్రీ జి. ఏ. సత్తార్ :—జననం 1933 మార్చి 29 మదనపల్లిలో. ఎనిమిదవ ఏట వీరు హాకీ ప్రారంభించారు, పెద్దాపార్లు గ్రిగ్ మెమోరియల్ పోటీలలో పాల్గొన్నారు. కాలేజీలో విద్యాభ్యాసం చేస్తున్న కాలంలో ఇంటర్ కలేజియెట్ టోర్నమెంట్ లో పాల్గొన్నారు. 1956 లో ఆంధ్రయూనివర్సిటీ హాకీ జట్టులో రైట్ హాఫ్ బ్యాక్. రాష్ట్రజట్టుసభ్యులు. ఇంకా త్రిలోకేకార్, బాబూ మెమోరియల్, మోహన్ మెమోరియల్ టోర్నమెంటులలో పాల్గొని వున్నారు.



శ్రీ కె. వెర్రిస్వామి :— జననం 1928 అనంతపురం. స్కూలువిద్యార్థిగా వున్నప్పుడు హాకీ, ఫుట్ బాల్, క్రికెట్, బాడ్మింటన్ ఆడేవారు. గత ఎనిమిది సంవత్సరాలలో ఆంధ్రదేశంలో

జరిగిన పెద్ద టోర్నమెంట్లలో పాల్గొన్న అనంతపురం XI జట్టు సభ్యులు. 1956 ఆంధ్రరాష్ట్ర జట్టులో రైట్ ఎక్స్ట్రీమ్.

శ్రీ బి. సామ్యూల్ పాల్ :— జననం 1931 జులై 1. స్వస్థలం చిత్తూరు. గ్రిగ్ మెమోరియల్ పోటీలలో బహుమతులు పొంది



వున్నారు. చిత్తూరు, తిరుపతి, మదనపల్లి, వెల్లూరు, మద్రాసులలో జరిగిన పెద్ద హాకీ టోర్నమెంట్లలో పాల్గొని వున్నారు. పోలీసు శాఖలో చేరిన తరువాత వీరు డిస్ట్రిక్ట్ పోలీసు స్పోర్ట్సు, రేంజి పోలీసు స్పోర్ట్సు, ఆంధ్రరాష్ట్ర పోలీసు స్పోర్ట్సులో పాల్గొన్నారు. పై పోటీ లన్నింటిలోను వీరి జట్టు ట్రోఫీలను సాధించింది. 1955 లో మద్రాసులో జరిగిన ఆలిండియా పోలీసు జోనల్ టోర్నమెంట్ లో పాల్గొన్న ఆంధ్రరాష్ట్ర పోలీసుజట్టు సభ్యులు. 1956 లో ఆంధ్రరాష్ట్ర హాకీజట్టు ప్రతినిధి.

శ్రీ బి. వి. సుబ్బారెడ్డి :— జననం 1932 ఆగస్టు 15. బాల్యంలోనే హాకీఆటను ప్రారంభించారు. వరుసగా ఐదు సంవత్సరాలు గ్రిగ్ స్పోర్ట్సులో పాల్గొన్నారు. తరువాత మదనపల్లి త్రిలోకేకార్ హాకీ టోర్నమెంట్ లో పాల్గొన్నారు. చిత్తూరు మోహన్ మెమోరియల్ టోర్నమెంట్, తిరుపతి బాబు మెమోరియల్ టోర్నమెంట్, బొబ్బిలి టోర్నమెంట్ (అనంతపురం) వంటి పెద్ద టోర్నమెంటులలో పాల్గొని వున్నారు తరువాత అంతర్ విశ్వవిద్యాలయ, అంతర్ కళాశాలల పోటీలలో పాల్గొనివున్నారు. మద్రాసు, జలంధర్ జాతీయ పోటీలలో ఆంధ్ర ప్రతినిధి. బొంబాయి ఇన్విటేషన్ హాకీ టోర్నమెంటులోకూడా పాల్గొనివున్నారు. లెఫ్టఅవుట్, సెంటర్ హాఫ్ స్థానాలలో ఆడుతారు.

శ్రీ ఆర్. లక్ష్మణరావు :— నివాసం విశాఖపట్నం. 1951—53 సంవత్సరాలలో ఆంధ్ర యూనివర్శిటీ కాలేజీల హాకీ జట్టు నాయకుడు. బొంబాయి గోల్డుకప్పు హాకీ పోటీలలోను, నేషనల్ హాకీ ఛాంపియన్ షిప్ పోటీలలోను ఆంధ్ర జట్టు సభ్యులు.

శ్రీ జి. యం. యస్. దాస్ :— జననం 1933 - ఆగస్టు 15.



1952—53 సంవత్సరాలలో గుంటూరు హిందూ కాలేజీ హాకీ జట్టు నాయకులు. 1952 లో అఖిలభారత అంతర్విశ్వ విద్యాలయ హాకీ టోర్నమెంటులో పాల్గొన్న ఆంధ్రజట్టు నాయకులు. గుంటూరు గ్రీన్సు హాకీ ఎసోసియేషన్ జట్టు కెప్టెన్. ఈ జట్టు 1955, 56 సంవత్సరాలలో గుంటూరు నేతాజీ హాకీ టోర్నమెంటును గెలుచుకొన్నది.

శ్రీ యస్. వెంకటేశ్వరరావు :— జననం 1932 నవంబరు 28. 1952 లో అంతర్విశ్వ విద్యాలయ పోటీలలో ఆంధ్ర ప్రతినిధి. 1952 లో ట్రాక్ అండ్ ఫీల్డు పోటీలలో హిందూ కాలేజి ఛాంపియన్. గుంటూరు గ్రీన్సు హాకీ అసోసియేషన్ జట్టు సభ్యులు. ఈ జట్టు 1955, 56 సంవత్సరాలలో గుంటూరు నేతాజీ హాకీ టోర్నమెంటును గెలుచుకొన్నది.



ఆంధ్రదేశంలో ఇంకా క్రింది ఆటగాళ్లు పేరు గడించి వున్నారు :

రామానుజం, నవమణి (పోలీసు ప్రతినిధులు); యం. నారాయణ (హిందూపురం), డాక్టర్ రామమోహనరావు (ఆంధ్రడైనమోస్ క్లబ్, రాజమండ్రి), సూర్యప్రకాష్ (హిందూపురం), రామమొదలి, మహమ్మద్ షరీఫ్, బాలగంగాధరం (చిత్తూరు), ఆర్. యమ్. కృష్ణారావు (తిరుపతి), మహమ్మద్ హుస్సేన్, సి. సూర్యనారాయణరెడ్డి, పి. యస్. రామకృష్ణారెడ్డి (మదనపల్లి). శ్రీ ఎస్. సత్యనారాయణ (గుంటూరు గ్రీన్స్ హాకీ జట్టు సభ్యులు.)

ఆంధ్రరాష్ట్రంలో హాకీ క్రీడావ్యాప్తికి కృషిచేస్తున్న కార్యకర్తలు :

శ్రీయుతులు టి. యస్. రఘునాథరెడ్డి, బి. బి. రాజేంద్రప్రసాద్, డాక్టర్ ఆర్. రామమోహనరావు, ఆర్. సి. వెంకటరమణ, టి. యస్. కృష్ణారెడ్డి, నసీర్ అహమ్మద్, (అనంతపురం), సి. పి. దొరైస్వామి, (చిత్తూరు), సురేంద్రనాథ్ రెడ్డి (కడప), బాలసుందరం (కర్నూలు), ఎన్. వెంకట్రామిరెడ్డి (గూడూరు), డాక్టర్ రామదాసు (గుంటూరు), కృష్ణబాబు (బందరు), మాదిరెడ్డి సుబ్బారావు (కాకినాడ), రజారియో, ఆర్. ఎల్. రావు (విశాఖపట్నం), సి. ఆర్. రెడ్డి, కల్యాణిరావు (స్టేట్ పోలీసు) గారలు.

హైదరాబాద్ స్టేట్ హాకీ ఆటగాళ్ళ పేర్లు దిగువ తెల్పబడినవి :

శ్రీయుతులు ఆలీఖాన్, ఫ్రాన్సిస్, (గోలుకీపర్లు), లియాకలీ, మాధవరావు, రామదాసు (బ్యాక్సు), మహమ్మద్ (సీనియరు), ఆంటిక్, సత్యనారాయణ, విన్సెంట్ ఫ్రాన్సిస్, (హాఫ్‌బ్యాకులు), సుసైరాజ్, వెంకటేష్, మహమ్మద్ (జూనియరు), జగదీష్ సింగ్, మంకయ్య, మైకేల్, వీరాస్వామి (ఫార్వర్డులు).

హైదరాబాద్ రాష్ట్ర హాకీసంఘానికి శ్రీ అహమ్మద్ మొహియుద్దీన్ గౌరవకార్యదర్శి (1956).

హైదరాబాదులోని మరికొందరు ప్రముఖ ఆటగాళ్ళ వివర మిది :

శ్రీయుతులు అబ్దుల్లా (ఔట్ సైడ్ లెఫ్ట్, సెంట్రలు రైల్వే సికిందరాబాదు), దక్షిణామూర్తి (లెఫ్ట్ బ్యాక్, సెంట్రలు రైల్వే, సికింద్రాబాదు), పెరల్ (ఇ. యం. ఇ. సెంటర్, సికింద్రాబాద్), ఖుద్దూస్, సాదత్ (వీరుభయులు బొంబాయి ఇన్విటేషన్ హాకీ పోటీలలో పాల్గొన్నారు. అప్పటి హైదరాబాదు జట్టుకు శ్రీ టి. హనుమంతరావుగారు నాయకత్వం వహించియున్నారు.) శ్రీ ఉమాపతి (లెఫ్ట్ఇన్-

ఆర్. టి. డి), లక్ష్మణ్ (సెంటర్ ఫార్వర్డ్ ఆర్. టి. డి), ఫజ్లుల్లా (పోలీసు).

ఆంధ్ర దేశంలో హాకీ ప్రచారానికి కృషి చేస్తున్న సంస్థలు :—

ఆంధ్ర డైనమోస్ క్లబ్ (రాజమండ్రి), మచిలీపట్నం హాకీ అసోసియేషన్, గుంటూరు గ్రీన్స్ హాకీ అసోసియేషన్, ది యంగ్ మెన్స్ హాకీ క్లబ్ (కాకినాడ), టవున్ ఎథ్లెటిక్ ఎసోసియేషన్ (చిత్తూరు), చిత్తూరు హాకీ అసోసియేషన్, తిరుపతి హాకీ అసోసియేషన్ ఎ. టి. కాలేజి, మదనపల్లి; మదనపల్లి అథ్లెటిక్ అసోసియేషన్, అనంతపురం అథ్లెటిక్ క్లబ్, వై. యం. సి. ఎ. కర్నూలు, హిందుస్తాన్ షిప్ యార్డు రిక్రియేషన్ క్లబ్ (విశాఖపట్నం), యంగ్ మెన్ ఎథ్లెటిక్ ఎసోసియేషన్ (గూడూరు), కడప ఎథ్లెటిక్ ఎసోసియేషన్, ఆంధ్ర పోలీసు నెల్లూరు, శ్రీకాకుళం, తూర్పుగోదావరి, అనంతపురం, చిత్తూరు ఇంటర్ స్కూల్స్, డిస్ట్రిక్ట్ అసోసియేషన్స్.

శ్రీ ధ్యాన్‌చంద్ :— హాకీ "మంత్రగాడు"గా (హాకీ విజార్డ్) హాకీఆటలో ప్రపంచంలోకెల్ల అద్వితీయుడుగా పరిగణించబడిన శ్రీ ధ్యాన్‌చంద్ ఉత్తమశ్రేణి హాకీ పోటీలలో రెండువేల గోలులకు పైగా చేసివున్నారు. న్యూజిలెండ్, ఆస్ట్రేలియా, ఆగ్నేయాసియా, చైనా, జపాను, తూర్పుఆఫ్రికా, యూరప్, అమెరికాలలో హాకీ ఛాంపియన్ షిప్ పోటీలలో పాల్గొని వున్నారు. ఆమ్‌స్టర్‌డామ్ (1928), లాస్ ఎంజిలెస్ (1932), బెర్లిన్ (1936) లలో జరిగిన ప్రపంచం ఒలింపిక్ హాకీ పోటీలలో పాల్గొనివున్నారు.



శ్రీ ధ్యాన్‌చంద్ 1922లో హాకీఆటలో ప్రవేశించారు. 1924లో పంజాబ్‌లో ఆర్మీజట్టులో వీరు ఆడుతున్నప్పుడు ఎదుటిజట్టు ధ్యాన్‌చంద్ జట్టుకు మూడుగోలులు చేసివున్నది. ఆట మరి మూడునిమిషాలు మాత్రమే మిగిలివున్నది. అప్పుడు కమాండింగ్ ఆఫీసరు ఆందోళనపడి 'ధ్యాన్‌చంద్! నీవే రక్షించాలి' అని అభ్యర్థించారు. శ్రీ ధ్యాన్‌చంద్ సమధికోత్సాహంతో విజృంభించి వెంట వెంటనే మూడు గోలులు చేసివేశారు. చివరి నిమిషంలో నాల్గవగోలు కూడా సాధించారు. ఘోర పరాజయం పొందుతున్న ఆర్మీజట్టు అంతిమ క్షణంలో ధ్యాన్‌చంద్ "మంత్రతంత్రం"వల్ల 4– 3 గోలులతో ఘనవిజయం సాధించింది. అప్పటినుంచి ధ్యాన్‌చంద్ "హాకీ మంత్రగాని"గా గణుతికెక్కారు.

శ్రీ ధ్యాన్‌చంద్ సాధించిన ఎక్కువ గోలుల వివరం:— 1932 - ఒలింపిక్స్, అటుపిమ్మట జరిగిన విదేశయాత్రలో ఇండియా మొత్తం 338 గోలులు చేయగా ధ్యాన్‌చంద్ ఒక్కరు 133 గోలులు సాధించారు. 1935లో న్యూజిలెండ్, సింహళం, ఆస్ట్రేలియాలలో పర్యటించినప్పుడు ఇండియా మొత్తం 584 గోలులు చేయగా ధ్యాన్‌చంద్ ఒక్కడు 201 కొట్టారు. 1947 లో తూర్పు ఆఫ్రికాలో ఇండియా జట్టు మొత్తం 285 గోలులు చేయగా ధ్యాన్‌చంద్ ఒక్కరు 65 గోలులు సాధించారు. రామబాణంవలె దూసుకుపోయి ఏకోణంలోనుంచైనా గోలు చెయ్యగలగడం వీరి విశిష్టత. వీరు కెప్టెనుగా వుంటే జట్టు సభ్యులందరకీ మోడల్ !

శ్రీ రూప్‌సింగ్ :— ధ్యాన్‌చంద్ సోదరుడు. వీరుభయుల కాంబినేషన్ వంటిది మరొకటి లేదని ప్రతీతి. ఇన్‌సైడ్ లెఫ్ట్‌గా ఆడేవారు. అమితమైన వేగము, బంతిపై చక్కటి కంట్రోలు, సూటైన గురి. వీరి ప్రత్యేకతలు. మహమ్మద్ జఫార్, రూప్‌సింగ్ కాంబినేషన్ కూడా గొప్పదిగా చెప్పేవారు.

శ్రీ రూప్‌సింగ్ విదేశ పర్యటనలో చేసిన ఎక్కువగోలుల వివరం: 1932 ఒలింపిక్స్ పర్యటన సందర్భంలో 94. న్యూజిలెండ్, సింహళం, ఆస్ట్రేలియాలలో 1935 లో పర్యటించినప్పుడు మొత్తం 185. 1936 బెర్లిన్ ఒలింపిక్స్ సందర్భంలో జరిగిన పర్యటనలో 44 (అన్నగారికంటె నాలుగే తక్కువ).

పూర్వపు ఆటగాళ్ళలో శ్రీ పెన్నిగర్ (సెంటర్ హాఫ్, పంజాబ్), దారా (ఫార్వర్డు, పంజాబ్, ప్రస్తుతం పాకిస్తాను నివాసి), స్వర్గీయ మహమ్మద్ జఫార్ (ఫార్వర్డు, పంజాబ్), అలెన్ (గోల్ కీపర్, బెంగాలు), గోపాలన్ (సెంటర్ హాఫ్ మద్రాసు) ప్రపంచ ప్రమాణాన్ని అందుకొన్నారు. ఈ తరం తరువాత శ్రీ త్రిలోచనసింగ్ (ఫార్వర్డు పంజాబ్), శ్రీ కిషన్ లాల్ (బొంబాయి), శ్రీ బాబు(కె డి.సింగ్. యు.పి.), శ్రీ మహ్నాసింగ్ (సర్వీసెస్) ప్రపంచ ప్రమాణాన్ని అందుకొన్నారు.

1956 లో మెల్బోర్న్‌లో ప్రపంచ ఒలింపిక్ హాకీ ఛాంపియన్ షిప్‌ను నిలబెట్టిన భారత జట్టులో క్రింది ఆటగాళ్లు కలరు: శ్రీ యుతులు బల్బీర్‌సింగ్ (కెప్టెన్, సెంటర్ ఫార్వర్డు), ఆర్. యస్. జెంటిల్ (ఫుల్ బ్యాక్), ఆర్. ఫ్రాన్సిస్ (గోల్ కీపర్), యస్. డబ్ల్యు. క్లాడియస్ (హాఫ్ బ్యాక్), జి. పెరుమాళ్ (హాఫ్ బ్యాక్), అమర్ కుమార్ (హాఫ్ బ్యాక్) ఉద్దంసింగ్ (ఇన్ సైడ్ ఫార్వర్డు), రఘుబీరలాల్ (ఔట్ సైడ్ రైట్) బక్షీష్‌సింగ్ (ఫుల్ బ్యాక్) హరదయాళ్ సింగ్ (ఇన్ సైడ్ ఫార్వర్డు) బాలకిషన్ సింగ్ (ఫుల్ బ్యాక్), గురుసేవక్ సింగ్ (హాఫ్ బ్యాక్) ఓ. పి. మల్హోత్రా (హాఫ్ బ్యాక్), ఆర్. యస్. భోలా (అవుట్ సైడ్ లెఫ్ట్) హరిపాల్ కౌశిక్ (ఇన్ సైడ్ ఫార్వర్డు, గురుదేవ్ సింగ్ (ఇన్ సైడ్ రైట్) శంకర్ లక్ష్మణ్ (గోల్ కీపర్) చార్లెస్ స్టీవెన్ (అవుట్ సైడ్ రైట్),

(శ్రీ) బల్బీర్ సింగ్ :— జననం 1924 - అక్టోబరు 10. జలంధర్‌లో. ధ్యాన్ చంద్ తరువాత ధ్యాన్‌చంద్ అంతటివాడు. పట్టభద్రుడు. 1945 లో ఖాల్సా కాలేజీ హాకీజట్టు నాయకుడు. పంజాబ్ యూనివర్సిటీ జట్టు కెప్టెను. 1948 లో ఇండియా ఒలింపిక్ జట్టు సభ్యుడు. 1949 లో నేషనల్ హాకీ ఛాంపియన్‌షిప్ సాధించిన పంజాబ్ జట్టు నాయకుడు. 1950 లో కాబూలు వెళ్ళిన ఇండియా జట్టు సారథి. 1952 లో ఇండియా ఒలింపిక్ జట్టు సభ్యుడు. 1954 లో ఆస్ట్రేలియా, న్యూజిలెండులలో పర్యటించిన ఇండియా హాకీజట్టు



సభ్యుడు. సింగపూరు, మలయాలలో ఈయన నాయకత్వంక్రిందనే ఇండియా జట్టు పర్యటించింది. జలంధర్‌లో పోలీసు ఇనస్పెక్టరుగా నియమితులైనారు. పంజాబ్ రాష్ట్రానికి వీరు తెచ్చిన కీర్తికి ప్రశంసా చిహ్నంగా పంజాబ్ ప్రభుత్వం వీరిని గౌరవ డిప్యూటి పోలీసు సూప రింటెండెంట్‌ను చేసింది.

శ్రీ ఉద్ధంసింగ్ :— జననం 1928 ఆగస్టు 4. జలంధర్ సమీపాన కల సాగార్‌పూర్‌లో. వడివడిగా గోలులు కొట్టడంలో ధ్యాన్‌చంద్, రూప్‌సింగ్‌తో దాదాపు సమానుడు. 1948 నుంచి పంజాబ్ హాకీజట్టు సభ్యుడు. 1949లో ఆఫ్ఘనిస్తాను వెళ్ళిన ఇండియా జట్టు సభ్యుడు. 1952లో ఇండియా ఒలింపిక్ హాకీజట్టు సభ్యుడు. 1954 లో పంజాబ్ హాకీజట్టు కెప్టెను. 1955లో పోలెండ్‌లో పర్య టించిన ఇండియా హాకీజట్టు సభ్యుడు.

హాలెండ్, బెల్జియం, బ్రిటను, జర్మనీ, జపాను, అమెరికా, పాకిస్తాను, ఆఫ్ఘనిస్తాను, కీన్యా, ఆస్ట్రేలియా, న్యూజిలెండ్, సింగపూర్, మలయా, పోర్చుగల్, ఈజిప్టులు హాకీ ఆటలో ప్రశంసనీయమైన ప్రావీణ్యం సంపాదించినవి.

1956 జూన్ లో ఆస్ట్రేలియాలో జరిగిన అంతర్జాతీయ స్త్రీల హాకీ ఛాంపియన్‌షిప్ పోటీలలో క్రింది దేశాలకు ప్రక్కన ఉదహ రించిన స్థానాలు లభించినవి :

1. దక్షిణాఫ్రికా 2. ఇంగ్లండు 3. న్యూజిలెండ్ 4. ఆస్ట్రేలియా 5. ఐర్లెండ్ 6. అమెరికా 7. హాలెండ్ 8. స్కాట్లెండ్ 9. కెనడా 10. ఇండియా.

ఇండియా జట్టులో శ్రీమతి మేరి డిసేనా అత్యంత ప్రతిభా పూర్వకంగా ఆడినది. ఇండియా జట్టుకు శ్రీమతి వై. స్మిత్ నాయకత్వం వహించింది.

ఇండియా స్త్రీల హాకీ ఛాంపియన్ షిప్‌ను 1956 లో మధ్య ప్రదేశ్ వనితలు గెలుచుకొని వున్నారు.

# అధ్యాయము 14

# ఫుట్ బాల్

ప్రాచీన గ్రీకులు, రోమనులు బంతిని తన్నడం, విసరడం వంటి ఒక ఆట ఆడేవారు. 12 వ శతాబ్దంలో కార్నివాల్ లో ఇప్పటి రగ్బీ వంటి ఆట ఒకటి ప్రచారంలో వుండేది. బంతిని విసరడం, పట్టుకొని పోవడం వంటి ఆట యిది. 14 వ శతాబ్దంలోనూ, బహుశా అంతకు ముందుకూడా ఇప్పటి ఫుట్ బాల్ వంటి ఆట అమలులో వుండేది. ఒక గోలుకు మరొక గోలుకు మధ్య మైళ్ళ దూరం వుండేది. ఈ దూరంలో పొదలు, కాలువలు, అడవులు, గోడలుకూడా వుండేవి. వీటినన్నింటిని దాటి బంతి ఆట ఆడేవారు. ఆ రోజులలో గుండ్రటి చెక్కబంతిని ఉపయోగించేవారట. టామ్ ఫీన్నీ అనే అతడు చెక్క గోళాలను తన్నుతూ పోయేవారు. ఫీన్నీ పూర్వీకులు మెక్సికోలోని భారతీయ సంతతివారట. వీరు నాలుగంగుళాల వ్యాసంకల చెక్క బంతులను తన్నుతూ ఆట ఆడేవారు. బూట్లు వుపయోగించేవారుకాదు. ఫుట్ బాల్ ఆటస్థలం గోలుకు గోలుకు మధ్య దూరం మూడుమైళ్ళు!



ఎలిజబెత్ కాలంలో తోలుబంతి ప్రచారంలోకి వచ్చినది. తరువాత బంతిని విసరడానికంటే, పట్టుకుపోవడానికంటే తన్నడానికి ప్రాధాన్యం వచ్చింది. 19 వ శతాబ్దం ద్వితీయభాగంలో ఫుట్ బాల్ ఆటకు నియమ నిబంధనలు రూపొందించబడినవి. అప్పటినుంచి ఫుట్ బాల్ ఆట గౌరవనీయమైన క్రీడగా పరిగణించబడింది కూడా.

ఫుట్ బాల్ ఆటలో మొదట ఇంగ్లండు ప్రపంచంలోకెల్ల అగ్రస్థానం వహిస్తూవచ్చింది. ఇప్పుడు రష్యా, దక్షిణ అమెరికా రాజ్యాలు, యుగోస్లావియా, హంగరీ, బల్గేరియా, పోలెండు కొన్ని పశ్చిమయూరప్ రాజ్యాలు ప్రపంచ సాకర్ పటంలో ప్రముఖస్థానం వహించి వున్నవి.

1950 లో బ్రాజిల్ లో జరిగిన ప్రపంచ ఫుట్ బాల్ పోటీలో ఉరుగ్వే, జులెస్ రిమ్మెట్ ట్రోఫీని గెలుచుకొంది. 1954 లో జరిగిన ప్రపంచం ఫుట్ బాల్ పోటీలో జర్మనీ హంగరీని ఓడించి ట్రోఫీని సాధించింది. అంతకుముందు విజేతలు: 1930 - ఉరుగ్వే, 1934, 38 - ఇటలీ, 1950 వరకు పోటీలు లేవు. నాలుగేళ్ల కొకసారి పోటీ జరుగుతుంది.

1936 లో ప్రపంచం ఒలింపిక్ ఫుట్ బాల్ ఛాంపియన్ షిప్ ను ఇటలీ, 1948 లో స్వీడన్, 1952 లో హంగరీ, 1956 లో సోవియట్ యూనియన్ గెలుచుకొన్నవి.

ఇండియా తొలిసారి 1948 లో ప్రపంచ ఒలింపిక్ పోటీలలో పాల్గొన్నది. బెంగాల్ ప్రముఖుడు శ్రీ టి. ఆవో ఇండియాజట్టుకు నాయకత్వం వహించారు. మొదటి పోటీలోనే ఫ్రాన్సు ఇండియాను 2-1 గోలులతో ఓడించింది. 1952 ఒలింపిక్స్ లో ఇండియాజట్టుకు బెంగాల్ ప్రముఖుడు శ్రీ మన్నా నాయకత్వం వహించారు. మొదటి పోటీలో నే యుగోస్లావియా ఇండియాను 10 - 1 గోలులతో ఓడించివేసింది. మన ఆటగాళ్ళు బూట్లులేకుండా ఆడడం ఒక పెద్దలోపమై వున్నది. 1954-55 నుంచి భారతీయులు బూట్లతో ఆడడం ప్రారంభించారు. అంతేకాక అంతర్జాతీయ నిబంధనలకు అనుగుణంగా ఆటకాలాన్ని 60 నిమిషాల నుంచి 90 నిమిషాలకు పెంచడానికి తీర్మానం జరిగింది. మొదట 70 నిమిషాలఆట అమలులోనికి తెచ్చి క్రమేణా 90 నిమిషాలకు పెంచడానికి కృషిజరుగుతున్నది. ఆటస్థల విస్తీర్ణంకూడా అంతర్జాతీయ ప్రమాణానికి అనుగుణంగా పెంచబడింది. ఈ మార్పుల ఫలితంగా ఇండియాలో ఫుట్ బాల్ ఆటలో ప్రావీణ్యం పెరిగింది. 1956 ప్రపంచ ఒలింపిక్స్ లో ఇండియా తిరిగి యుగోస్లావియాతో పోటీచేసి పటిష్ఠమైన జట్టుగా నిలబడగలిగింది.

సెమిఫైనల్సు వరకు వచ్చి చతుర్థస్థానాన్ని పొందింది. ఇండియాజట్టుకు శ్రీ ఎస్. బెనర్జి నాయకులు.

ఇండియాలో పర్యటించిన స్వీడిష్, ఆస్ట్రియన్, రష్యన్ ఫుట్‌బాల్ జట్లు త్రీ బ్యాక్ డిఫెన్సు పద్ధతిని అవలంబించినవి. దీనివల్ల రక్షణశ్రేణి పెట్టనికోటలా మరింత పటిష్ఠమౌతున్నది. ఇండియాలో కూడా ఈ పద్ధతిని అవలంబించడానికి కృషి జరుగుతున్నది.

ఆసియాలో ఇండోనీసియా, ఇండియాతో సమానంగాను, ఇండియాను మించికూడా ఫుట్‌బాల్ ఆటలో పైకివస్తున్నది. నాలుగు ఆసియా దేశాలకు (ఇండియా, పాకిస్తాన్, బర్మా, సింహళం) జరిగే "ఆసియా క్వాడ్రాంగులర్" ఫుట్‌బాల్ పోటీ 1952 నుంచి వరుసగా ఇండియాయే గెలుచుకొంటున్నది. 1951 లో జరిగిన ప్రథమ ఆసియా క్రీడోత్సవంలో ఫుట్‌బాల్ ఛాంపియన్‌షిప్‌ను ఇండియాయే గెలుచుకొన్నది. 1954 లో జరిగిన ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలో ఇండియాను ఇండోనీసియా ఓడించివేసింది. ఆసియా ఛాంపియన్‌షిప్‌ను చైనా గెలుచుకొన్నది. ద్వితీయస్థానం దక్షిణకొరియాకు, తృతీయ, చతుర్థ స్థానాలు బర్మా, ఇండోనీసియాలకు లభించినవి.

ఇండియాలో ఫుట్‌బాల్ ఆట బ్రిటిష్‌వారిద్వారా పరిచయమైనది. ఇండియా జట్టు తొలిసారి 1924 లో విదేశపర్యటన చేసింది. జావాలో పోటీచేసింది. దరిమిలా అనేక దేశాలలో పర్యటించింది. విదేశాలలో ఇండియా ప్రతినిధులుగా పోటీచేసిన ఆంధ్ర ఫుట్‌బాల్ ప్రముఖులు శ్రీయుతులు ఎమ్. అప్పారావు (కాకినాడ), ఎ. రహీం (ఏలూరు), సుంకర హనుమంతరావు (రాజమండ్రి) గారలు. అనేక విదేశజట్లుకూడా ఇండియాలో పర్యటించినవి. మొట్టమొదటిసారి 1936 లో చైనీస్ ఒలింపిక్ ఫుట్‌బాల్ జట్టు ఇండియాలో పర్యటించింది.

ఇండియా ఫుట్‌బాల్ ఫెడరేషన్ పూనుకొనకమునుపే ఆంగ్లో ఇండియన్లు, హైదరాబాద్ సిటీ పోలీసులు, విశాఖపట్నం పోర్టు ట్రస్టు ఆటగాళ్లు బూట్లతోనే ఫుట్‌బాల్ ఆడేవారు. ఆంధ్రదేశమంతటా ఫుట్‌బాల్ టోర్నమెంట్లు చాలాకాలంగా జరుపబడుతున్నవి. ఏలూరు

సయ్యద్ అహమ్మద్ టోర్నమెంట్స్, నూజివీడు, బందరు, రాజమండ్రి, కాకినాడ, విశాఖపట్నంలలో జరిగిన టోర్నమెంట్లు వీటిలో పెద్దవి. 1938 ప్రాంతాల ఒక్క ఆంధ్రజట్టే జాతీయఛాంపియనులంత ప్రతిభావంతులై వుండేది. దురదృష్టవశాత్తు నానాటికి ఈ ప్రమాణం పడిపోయింది. ఆ రోజులలో పరరాష్ట్రాలలో ఆడిన కెప్టెన్ బుచ్చి, జి. యస్. రాములువంటి వారలుగాని, ఆంధ్ర టైగర్ శ్రీ వల్లభజోస్యుల కృష్ణమూర్తి, 'గన్ షాట్' కృష్ణారావు నాయుడు వంటి వారలు గాని, విజయవాడ సి. ఆర్ దాస్ టీమ్ వంటిదిగాని ఈనాడు ఆంధ్రలో లేకపోవడం విచారనీయం. ఈనాటికీ ఆంధ్రదేశంలో ప్రతిభావంతులైన ఫుట్ బాల్ ఆటగాళ్లు కొరవడిలేరు. వారి శక్తియుక్తులను సక్రమమార్గంలో పెంపొందించడానికి తగినంత కృషే లేకపోతున్నది.

ఆంధ్రరాష్ట్ర అవతరణ సమయంలో 1953 సెప్టెంబరు 21 వ తేదీన ఆంధ్రరాష్ట్ర ఫుట్ బాల్ సంఘం రాజమండ్రిలో స్థాపించబడినది. ఈ సంఘావతరణకు పాటుపడినవారిలో శ్రీయుతులు దేవత రామమోహనరావు, ఎమ్ వి. కృష్ణ, ఎమ్. రామకృష్ణరావు, డాక్టర్ ఎన్. రామచంద్రరావు, సుంకర భాస్కరరావు గార్లు ముఖ్యులు. 1954 లో తొలిసారి ఆంధ్రజట్టు శ్రీ సుంకర హనుమంతరావుగారి నాయకత్వాన సంతోష్ ట్రోఫీ జాతీయ ఛాంపియన్ షిప్ పోటీలలో పాల్గొన్నది. అతికష్టంపై బీహార్ ఆంధ్రను ఓడించింది.

అదినుంచి హైదరాబాద్ ఫుట్ బాల్ ఆటలో ఇండియాలో ప్రథమశ్రేణిలో వుంటూవచ్చింది. ఆసియా, ప్రపంచం పోటీలలో పాల్గొన్న ఇండియాజట్టులలో హైదరాబాద్ ప్రతినిధులు విధిగా వుంటున్నారు. 1956 లో నేషనల్ సోకర్ (సంతోష్) ట్రోఫీని హైదరాబాద్ తొలిసారి గెలుచుకొన్నది.

1954 లో హైదరాబాద్ పోలీసులు, రోవర్స్ కప్పు, డ్యూరెండు కప్పు గెలుచుకొని వున్నారు. 1954 లోనూ, 1955 లోనూ ఉస్మానియా యూనివర్సిటీ అంతర్ విశ్వవిద్యాలయ ఫుట్ బాల్ ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొని వున్నది.

## ఆటగాళ్ళ పరిచయం

శ్రీ సుంకర హనుమంతరావు :— జననం 1925 మార్చి 31వ తేది. చెన్నరాష్ట్ర ఫుట్ బాల్ జట్టుకు నాయకత్వం వహించి ఇండియా ప్రతినిధిగా రెండుసార్లు విదేశపర్యటన చేశారు. నివాసం రాజమండ్రి. లెఫ్ట్ ఇన్ గా ప్రసిద్ధిచెందినారు. రెండు కాళ్ళతోనూ సమ ప్రతిభతో ఆడగల వ్యక్తి. పందెపు గుఱ్ఱంవలె పురోగమించి బాణంవలె దూసుకుపోగల శ్రీ హనుమంతరావుగారికి 1953 లో "ఆంధ్రా బ్లూ" బిరుద మివ్వబడింది. శ్రీ రావుగారు 1945, 46 లలో మద్రాసు యూనివర్శిటీ ఫుట్ బాల్ జట్టు నాయకులు. 1946 లో వీరి జట్టు లాహోర్ లో ట్రోఫీని గెలుచుకొన్నది. 1944, 45 సంవత్సరాలలో చెన్నరాష్ట్ర ఫుట్ బాల్ జట్టు సభ్యులు. 1951, 53 సంవత్సరాలలో జాతీయ ఫుట్ బాల్ పోటీలలో చెన్నరాష్ట్ర జట్టు నాయకులు. 1949 లో సింహళంలో పర్యటించిన ఇండియా జట్టులోనూ, 1951 లో దూర ప్రాచ్య రాజ్యాలలో పర్యటించిన ఇండియా జట్టులోను సభ్యులు. ఆంధ్రరాష్ట్ర అవతరణ జరిగినప్పటినుంచి జాతీయ పోటీలలో ఆంధ్రజట్టు నాయకులు. వీరి అన్నగారలు కెప్టెన్ బుచ్చి, డాక్టర్ భోగారావు, డాక్టర్ రామచంద్రరావుగారలు కూడా ఫుట్ బాల్ ఆటలో అఖిల భారతఖ్యాతి పొందారు.





శ్రీ జి. యస్. రాములు :— జననం 1912, జనవరి 12. కాకినాడ నివాసి. 1926 నుంచి 28 వరకూ ఫుట్ బాల్, హాకీ, క్రిగ్ పోటీలలో గణుతి కెక్కారు. 1927 నుంచి 1929 వరకూ రాజమండ్రి కేసరి క్లబ్ సభ్యులుగాఉండి రాజమండ్రిలో జరిగిన పి. టి. కృష్ణారావు

అండ్ తిలక్ మెమోరియల్ హాకీ, ఫుట్‌బాల్ పోటీలలో పాల్గొన్నారు. వీరి జట్టు అంతిమ విజయం సాధించింది. 1929 — 1930 లలో "యంగ్ జెమ్స్ క్లబ్" (మచిలీపట్నం) సభ్యులుగా ఉంటూ వైజాగ్ గోల్డుకప్ టోర్నమెంటు, స్టార్ ఎత్లెటిక్ టోర్నమెంటు (కాకినాడ), జటప్రోలుకప్ (మద్రాసు) పోటీలలో పాల్గొని విజయాలు చేబట్టారు. 1930 నుంచి 1934 వరకూ అనేక టోర్నమెంటులలో పాల్గొని వైజాగ్ గోల్డు కప్, కాకినాడ కబీర్ కప్, రాయపూర్ గోల్డు క్రాస్ షీల్డు సాధించారు. 1930 లో కాకినాడలో పెదకాపు మెమోరియల్ ఫుట్‌బాల్ క్లబ్‌ను స్థాపించారు. 1932 లో "ఆంధ్రా ఛాంపియన్" బిరుదు వీరికి సమర్పించబడింది. 1935 లో బెంగుళూరు పోటీలలో పాల్గొన్నప్పుడు వీరి ఆటను చూచి కలకత్తా "కాళీఘట్ క్లబ్" వారు వీరిని తమజట్టులో ఆడమని కోరినారు. 'కాళీఘట్ క్లబ్' టీములో లెఫ్ట్ ఇన్ స్థానం వహించి కలకత్తా కస్టమ్స్ క్లబ్ జట్టుపై రెండు గోలులు కొట్టి మన్ననలు పొందారు. తర్వాత కలకత్తా మహమ్మడన్స్ క్లబ్‌లో కూడా ఆడి విశేషప్రజ్ఞను ప్రదర్శించారు. బెంగాల్ అంతటా ప్రఖ్యాత ఆటగాడుగా ప్రసిద్ధిపొందారు. 1935 నుంచి 1940 వరకూ కాళీఘట్ క్లబ్ జట్టులో ఆడుచూ అలహాబాద్, అజ్మీర్, చంద్రనగర్, లక్నో మున్నగు పెద్ద పట్టణములలో జరిగిన టోర్నమెంట్లలో పాల్గొని అఖిల భారత ఖ్యాతి పొందారు. 1939 లో వీరొక కలకత్తా జట్టులో సభ్యత్వం వహించి కమరాగనీస్ అనే మిలిటరీజట్టుతో ఆడి ఆరుగోలులు సాధించి కలకత్తావాసులను ఆశ్చర్యచకితులను చేశారు. వీరి ఆటను మెచ్చుకొని కలకత్తా బాటాకంపెనీవారు వీరికి ఉద్యోగము ఇచ్చారు. తరుపరి రాములుగారు కాళీఘట్ క్లబ్‌ను వదలివేసి, ఈస్టుబెంగాలు జట్టులో చేరారు.

1945 లో కలకత్తానుంచి బసమార్చి స్వగ్రామమయిన కాకినాడకు తిరిగివచ్చారు. అక్కడి పి. ఆర్. కాలేజి ఆటగాళ్ళకు ఉన్నతశిక్షణ నిచ్చారు. 1952 లో ఆంధ్రయూనివర్సిటీ ఫుట్‌బాల్ జట్టుకు శిక్షకులు. తరుపరి పెదకాపు మెమోరియల్ క్లబ్ ఆటగాళ్ళకు ఉన్నత శిక్షణ నిచ్చారు. ఈక్లబ్ జట్టు కర్నూలు గోల్డుకప్‌ను గెలుచుకొన్నది. కర్నూలు

పురజనుల కోరికపై రాములుగారు ఎగ్జిబిషన్ పోటీలోపాల్గొని ప్రేక్షకు లను విస్మయచకితులను చేశారు. వీరికి ప్రత్యేక రజతపాత్రను కూడా అప్పుడు బహూకరించారు. శ్రీయుతులు అప్పారావు, బుచ్చి, హనుమంత రావు, సుదర్శనరావు కీ॥ శే॥ భద్రయ్య, శేషగిరిరావు, బాషారాజువంటి అనేకమంది అగ్రఆటగాళ్ళు వీరివద్ద శిక్షణపొందివున్నారు. వీరు కల కత్తాలో కూడా యువకులకు మంచిశిక్షణ నిచ్చివున్నారు.

వీరు రైట్ ఫార్వర్డ్ తప్ప మిగిలిన స్థానాలన్నింటిలోనూ చక్కగా ఆడగలరు. అందుచేత "మాష్టర్ ఆఫ్ గేమ్" అని పత్రికలు వీరిని ప్రశంసించినవి.

శ్రీ ఎస్. వరహాలు :— జననం 1932. విశాఖపట్నం నివాసి. బి. యన్. రైల్వే ఉద్యోగంలో చేరినప్పుడు కలకత్తాలో లీగ్, షీల్డ్ పోటీలల్లో పాల్గొని పైకి వచ్చారు. 1953 లో అంతర్ రైల్వే టోర్నమెంటును గెలుచుకొన్న బి. యన్. రైల్వేజట్టు సభ్యులు. ఇండియా ఫుట్ బాల్ అసోసియేషన్ జట్టుతో ఆడిన ఆల్ ఇండియా రైల్వేస్ జట్టు సభ్యుడు. లక్నోలో రైల్వేజట్టు తరఫున సిటీ క్లబ్ తో పోటీ చేసినప్పుడు ఆరు గోలులు, అలహాబాద్ ఎలెవన్ తో పోటీ చేసి నప్పుడు 4 గోలులు కొట్టారు. కలకత్తా ఆర్యన్ క్లబ్, ఈస్ట్ బెంగాల్ ఐ. ఎఫ్. ఏ. లకు కూడా ఆడినారు. కాలికట్ టోర్నమెంట్ లో అద్వితీయ ఆటగానిగా ప్రత్యేక కప్పు బహుమతి పొందారు.

శ్రీ యర్రంసెట్టి వెంకట కృష్ణారావు ("గన్ షాట్ నాయుడు") :— జననం 1905 డిసెంబర్ 24. ఎథ్లెటిక్స్, హాకీ, బాడ్మింటన్, ఫుట్ బాల్ ఆటలలో 1916 నుంచి దాదాపు రెండు దశాబ్దాలపాటు ఆంధ్రదేశంలో కీర్తిప్రఖ్యా తులను గడించి వున్నారు. బెంగుళూరు, మైసూర్, కాలికట్, కోయంబత్తూరు, విరుధ్ నగర్, తిరుచీరపల్లి, మద్రాసు, హైదరాబాద్, బందరు, ఏలూరు, కాకినాడ, రాజమండ్రి,



విశాఖపట్నంలలో జరిగిన పెద్ద ఫుట్ బాల్ టోర్నమెంటు లన్నింటిలోను పాల్గొని గోలులు కొట్టడంలో దిట్టగా పేరొందారు.

హైస్కూలు విద్యార్థిగా వున్నప్పుడు ఎత్లెటిక్స్, ఫుట్ బాల్, హాకీ, బాడ్మింటన్ ఆటలు ఆడేవారు. 1921 లో బందరులో కొద్ది దూరపు పరుగులకు ఛాంపియన్ షిప్ మెడలు గెలుచుకొన్నారు. ఫ్రెండ్స్ యూనియన్, ఫుట్ బాల్ క్లబ్, వాలిబ్రదర్స్ ఫుట్ బాల్ క్లబ్, ముస్లిమ్స్ బాడ్మింటన్ క్లబ్, యంగ్ జెమ్స్ బాడ్మింటన్ క్లబ్, నోబుల్ కాలేజి ఫుట్ బాల్ క్లబ్ జట్లలో ప్రముఖస్థానం వహించి దసరా సంఘం ప్రెసిడెన్సీ ఫుట్ బాల్ టోర్నమెంటు (బందరు), ప్రెసిడెన్సీ బాడ్మింటన్ టోర్నమెంటు (గుడివాడ) వంటి పెద్ద పోటీలలో పాల్గొన్నారు.

1923-28 మధ్య కాలేజి విద్యార్థిగా వున్నప్పుడు 1924 నుంచి వరుసగా మూడు సంవత్సరాలు నోబులు కాలేజి ఆల్ రౌండ్ ఎత్లెటిక్ ఛాంపియను బంగారుపతకం గెలుచుకొన్నారు.

నోబులు కాలేజి ఫుట్ బాల్ జట్టుకు నాయకత్వం వహించారు. ఇతరజట్లలో కూడా సభ్యత్వం వహిస్తూ దుగ్గిరాల రామమూర్తి మెమోరియల్, క్రిసెంట్, దసరా సంఘం ఫుట్ బాల్ (బందరు), సయ్యద్ అహమ్మద్ ప్రెసిడెన్సీ ఫుట్ బాల్ (ఏలూరు), క్రిసెంట్, మోహన్ క్లబ్, ప్రియన్ బాడ్మింటన్ (బందరు), ఆలిండియా ఫుట్ బాల్ (విజయనగరం), పెంట్లాండ్ ఎత్లెటిక్ స్పోర్ట్సు క్లబ్, సుబ్రహ్మణ్యం ప్రెసిడెన్సీ ఫుట్ బాల్ (విశాఖపట్నం), బెల్స్ కప్ ఫుట్ బాల్ (బందరు), నారాయణ మెమోరియల్ ఫుట్ బాల్ (బెజవాడ), కైజర్ హింద్ హాకీ (బందరు), రాజరత్నం మెమోరియల్ హాకీ (గుంటూరు), రాఘవరావు మెమోరియల్ బాడ్మింటన్ (బందరు), ఆలిండియా బాడ్మింటన్ (విశాఖపట్నం), తిలక్ మెమోరియల్ ఫుట్ బాల్ హాకీ (రాజమండ్రి), దసరా హాకీ (విజయనగరం), వడ్డి కేశవరావు మెమోరియల్ గోల్డ్ కప్ పోటీలలో పాల్గొని ప్రథమ, ద్వితీయ స్థానాలు పొందారు. ఈ టోర్నమెంటులలో వీరు కొత్తగా ఫ్రెంజ్ మెమోరియల్

ఫుట్ బాల్ క్లబ్, మోహన్ ఎక్స్ ప్రెస్ ఫుట్ బాల్ క్లబ్ (ఏలూరు), బెజవాడ టీమ్ (బెజవాడ), నోబుల్ కాలేజీ క్లబ్ లకు ప్రాతినిధ్యం వహించి పాల్గొన్నారు.

1932 - 33 లో మద్రాసు వై. ఎమ్. సి. ఏ. కాలేజి ఫుట్ బాల్ జట్టుకు నాయకత్వం వహించి అంతర్కళాశాలల ఫుట్ బాల్ టోర్నమెంటును, తద్వారా విల్సను కప్పును గెలుచుకొన్నారు. ఈజట్టు మూడు మ్యాచీలలో పాల్గొని మొత్తం 24 గోలులు చేసింది. వీటిలో 17 నాయుడు గారు అద్భుత ప్రజ్ఞతో సాధించినట్టివే. అప్పటినుంచి వారిని "గన్ షాట్ నాయుడు"గా ఫుట్ బాల్ అభిమానులు వ్యవహరిస్తూ వచ్చారు. 1934-35 లో వీరు ప్రముఖపాత్ర వహించిన బందరుజట్టు యంగ్ మెన్స్ క్లబ్ దక్షిణభారత జెటొప్రోలు ఫుట్ బాల్ టోర్నమెంటును (మద్రాసు), నేషనల్ ఛాంపియన్ షిప్పును (విరుధ్ నగర్) ఈస్టుఇండియా ఫుట్ బాల్ టోర్నమెంటును (బెజవాడ) గెలుచుకొన్నది. వీరి యంగ్ జెమ్స్ క్లబ్ జట్టు (బందరు) కాకినాడలో ఆలిండియా కబీర్ ఫుట్ బాల్ ఛాంపియన్ షిప్ సాధించింది. వీరు 1950 నుంచి నరసరావుపేట లోని ఎస్. ఎస్. ఎన్. కాలేజి ఫిజికల్ డైరక్టర్ గా వుంటున్నారు.

శ్రీ సుంకర భాస్కరరావు :— 'బొచ్చి'గా ఫుట్ బాల్ వర్గాలలో ప్రసిద్ధి చెందిన ఈ పట్టభద్రుడు స్కూలు, కాలేజీ దశలలో పెద్ద ఫుట్ బాల్ టోర్నమెంటులలో పాల్గొని దాదాపు ఒక దశాబ్దంగా ఆంధ్రదేశంలో ఫుట్ బాల్ ఆట వ్యాప్తికి గణనీయమైన కృషిచేస్తున్నారు. అన్నతమ్ములవలె వీరు వడిగల ఆటగాడు. రాజమండ్రి నింబుల్స్ అంతటి పెద్ద జట్లలో ప్రముఖస్థానం వహించారు. ఆంధ్ర రాష్ట్ర ఫుట్ బాల్ అసోసియేషన్ అవతరించక ముందు రాజమండ్రిలో ఫుట్ బాల్ టోర్నమెంటులు నిర్వహించి, రాష్ట్రావతరణపిమ్మట రాష్ట్రసంఘ కార్యవర్గంలో కార్యదర్శి, కోశాధికారి వంటి పదవులు వహించి తమ బాధ్యతలను



చక్కగా నిర్వహించవున్నారు. జాతీయ పోటీలలో ఆంధ్రరాష్ట్రజట్టుకు మేనేజరుగా వ్యవహరించారు కూడా.

(శ్రీ) ఎమ్. అప్పారావు :—జననం 1915 మే 19. కాకినాడ నివాసి. 1929 లో వీరు పాల్గొన్న స్కూలుజట్టు గ్రిగ్ మెమోరియల్ టోర్నమెంటు గెలుచుకొన్నది. 1932 నుంచి 1936 వరకూ పెదకాపు మెమోరియల్ ఫుట్‌బాల్ క్లబ్ జట్టు సభ్యులుగా ఉంటూ రామచంద్రాపురం, దవళేశ్వరం, రాజమండ్రి, ఏలూరు మొదలగు ప్రాంతాలలో పెద్దపోటీలలో పాల్గొని విజయాలు చేబట్టారు. కోయంబత్తూరు, విరుధనగర్, తంజావూరు మొదలగు ప్రాంతాలలో జరిగిన ఫుట్‌బాల్ పోటీలలోకూడా పాల్గొని విజయం గావించారు. రాములుగారి ప్రోద్బలముచే వీరు కలకత్తా వెళ్ళి వారితోపాటు 1937 నుంచి 1940 వరకూ కాలీఘట్ క్లబ్ జట్టులో ఆడారు. రాములుగారితో పాటు వీరు కూడా 1941 లో ఈస్టు బెంగాలు జట్టులో సభ్యులుగా చేరారు. అదే జట్టులో సభ్యులుగా వుంటూ ఐ. ఎఫ్. ఏ. షీల్డ్ టోర్నమెంటులో 1942 నుంచి 1945 వరకూ, 47, 49, 50-52 సంవత్సరాలలో పాల్గొన్నారు. 1950లో ఈస్టు బెంగాలుజట్టుకు నాయకత్వం వహించి ఐ. యఫ్. ఏ, డూరాండ్ ట్రోఫీలను గెలుచుకొన్నారు. 1944-46 సంవత్సరాలలో బెంగాలురాష్ట్ర జట్టు సభ్యులు. ఈస్టు బెంగాలుజట్టుకు నాయకత్వం వహించి 1946 లో తిరువేంద్రం, కలకత్తా టోర్నమెంటులను, 1949 లో రోవర్స్, 1950 లో డూరాండ్ కప్పులను గెలుచుకొన్నారు. 1950 లోనే లీగ్, ఐ. ఎఫ్. ఏ. ఛాంపియన్‌షిప్‌లను కూడా వీరి జట్టు సాధించింది. 1954 లో ఆఫ్ఘనిస్తాను సందర్శించిన భారత ఫుట్‌బాల్ జట్టుకు నాయకులు.

1948 లోను, ఆపిమ్మటా చైనీస్, స్వీడిష్ జట్టులతోకూడా వీరి టీము పోటీచేసివున్నది.

రైట్ ఇన్ స్థానంలో ఆడి "బాడీజెర్క్"లో అసమానులుగాను, "పాలిషర్ ఆఫ్ ది ఫుట్‌బాల్"గాను ప్రసిద్ధి చెందారు.

శ్రీ ఎ. రహీమ్ :— జననం 1915 ఏలూరులో. వీరు రైట్ ఇన్‌గా అఖిలభారతఖ్యాతి నొందిన గొప్ప ఫుట్‌బాల్ ఆటగాడు. వీరు బెజవాడలో చదువుచుండగానే ఫుట్‌బాల్ ఆటయందు మంచి ప్రావీణ్యము సంపాదించారు. 1935 నుంచి మహమ్మడన్ స్పోర్టింగ్ క్లబ్ (కలకత్తా) జట్టు సభ్యులు. వీరి ప్రతిభవల్లనే ఈటీము 1936 లో లీగ్ ఛాంపియన్‌షిప్పును, ఇండియన్ ఫుట్‌బాల్ అసోసియేషన్ (ఐ. ఎఫ్. ఏ.) షీల్డును గెలుచుకొన్నది. 1938 లో ఆస్ట్రేలియా పర్యటించిన అఖిల భారత ఫుట్‌బాల్ జట్టు సభ్యులు. గురిలోనూ, సులువుగా గోలు చెయ్యడంలోనూ వీరికివీరే సాటి. ప్రస్తుత నివాసం కలకత్తా.

శ్రీ గురజాల వెంకట నరసింహారావు :— నివాసం గుంటూరు. బాల్యంలోనే ఫుట్‌బాల్ ఆటలో ప్రవేశం. ప్రిగ్ పోటీలలో పాల్గొన్నారు. 1926 లో నెల్లూరు వి. ఆర్. కాలేజీలో చదువుకుంటున్నప్పుడు అప్పటి, అంతకుపూర్వ విద్యార్థులతో ఫుట్‌బాల్ జట్టు ఏర్పరచి వెంకటగిరిలో జరిగిన ఒక పెద్ద టోర్నమెంటులో ప్రథమస్థానం వహించి కృష్ణ విగ్రహం బహుమతి పొందారు. 1928 లో గుంటూరు టౌన్ ఫుట్‌బాల్ జట్టులో సభ్యులుగా చేరి ఏలూరులో జరిగిన అఖిలభారత సయ్యద్ అహమ్మద్ ఫుట్‌బాల్ టోర్నమెంటులో పాల్గొని గణుతి కెక్కారు. అప్పుడు ఆ రోజులలో ప్రసిద్ధి నొందిన హైదరాబాద్ ఎలెవెన్ హంటర్సు జట్టును అంతిమ పోటీలో ఓడించి ఫుట్‌బాల్ వర్గాలలో సంచలనం కలిగించారు. తర్వాత గుంటూరు టౌన్ టీమ్‌కు నాయకత్వం వహించి 1932 లో తిరిగి సయ్యద్ అహమ్మద్ షీల్డును చేబట్టారు. వీరికి బంగారు పతకములు కూడా బహూకరించబడినవి. అదేసంవత్సరము వీరు గుంటూరు ఏ. సి.

కాలేజి ఫుట్‌బాల్ జట్టుకు నాయకులు. ఆంధ్ర విశ్వవిద్యాలయ ఫుట్‌బాల్ జట్టుకు కూడా సారథ్యం వహించారు. వీరు గుంటూరు జట్టుకు నాయకత్వం వహించి దక్షిణ మండలములో జరిగిన అనేక ఫుట్‌బాల్ పోటీలలో పాల్గొన్నారు. 1935—36 లో మద్రాసు వై. యమ్. సి. ఏ. కాలేజీ జట్టు సభ్యునిగా అంతర్ కళాశాలల పోటీలలో పాల్గొన్నారు. తర్వాత అన్నామలై విశ్వవిద్యాలయంలో వ్యాయామ విద్యాబోధకులుగా చేరారు. 1938 నుంచి గుంటూరు హిందూకాలేజీలో వ్యాయామ విద్యాచార్యులు. వీరి ప్రోత్సాహముతో వందలకొలది ఆటగాళ్ళు పైకి వచ్చారు. (183 వ పేజీకూడా చూడండి).

శ్రీ సుంకర కృష్ణారావు (కెప్టెన్ బుచ్చి) :— జననం 1922 అక్టోబర్ 2. బొంబాయి వై. ఎమ్. సి. ఏ. జట్టులో ఇన్‌సైడ్ లెఫ్ట్ స్థానంలో ఆడి అఖిలభారత ఖ్యాతి పొందారు. వీరి స్వగ్రామం రాజమండ్రి. బాల్యంలో టెన్నిస్ బంతితో బజార్లలో "ఫుట్‌బాల్" ఆడుతూ వుండేవారు. 18 వ ఏట అన్నామలై ఫుట్‌బాల్ టీము సభ్యుడు. మద్రాసు, మైసూరు, బెంగుళూరు మొదలగు పెద్ద పట్టణాలలోని పోటీలలో పాల్గొన్నారు. వీరు కలకత్తా ఐ. యఫ్. ఏ. జట్టు సభ్యునిగా డెనిస్ కాంప్టన్ ఎలెవెన్ (బ్రిటిషు) జట్టుతో పోటీచేసి ప్రసిద్ధిచెందారు. మూడు సంవత్సరాలు కలకత్తా మోహన్ బగన్ జట్టు సభ్యులు. ఆజట్లలోనేకాక దక్షిణ కమాండ్ ఫుట్‌బాల్ జట్టుకు నాయకత్వం వహించి జబల్పూర్ సబ్ ఏరియా టోర్నమెంటు గెలుచుకొన్నారు. మొట్టమొదటి సర్వీసెస్ ఫుట్‌బాల్ జట్టుకు (1949) నాయకత్వం వహించి నేషనల్ ఛాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొన్నారు. పాలస్తీనా జట్టుతో పోటిచేసిన బొంబాయి ఎలెవెన్ టీము సభ్యుడు. అంతకుముందు మద్రాసు మెరీనా క్లబ్, విజయవాడ రైన్‌బో జట్టులలో ఆడారు. అఖిలభారతజట్టులో సభ్యునిగా వుండి మొగున్స్ అనే బొంబాయి జట్టుతో పోటీచేశారు. బొంబాయి



వై. యమ్. సి. ఏ. జట్టులో సభ్యులుగావుంటూ బొంబాయిలో మోహన్ బగన్‌ను ఓడించారు. ఈజట్టు సతీరంజన్ షీల్డు, నాద్‌కర్ని కప్పు, దాస్ కప్, హిట్‌రిచెస్ షీల్డ్‌లను గెలుచుకొన్నది. బొంబాయి, బి. ఇ. ఎస్. టి. టీములలోకూడా పాల్గొని "బుచ్చి ది గ్రేట్" గా ఘనత పొందారు.

బుచ్చి సాధారణంగా తోటి ఫార్వర్డ్‌ల సహకారం తీసుకోరు. ప్రత్యర్థిచుట్టూ ప్రదక్షిణంచేస్తూ బంతివిడవక పరంపరగా గోలులు కొట్టడంలో అద్వితీయులు. వీరు హాకీలోకూడా నేర్పరులు.

డాక్టర్ సుంకర భోగారావు ("చిట్టి") :— జననం 1929 ఆగస్టు 4. నివాసం రాజమండ్రి. మునిసిపల్ హైస్కూలు ఫుట్‌బాల్ జట్టు సభ్యులు. రాజమండ్రి నింబుల్స్ జట్టు సభ్యులు. బెజవాడ, తణుకు, కాకినాడ, గుంటూరు, నూజివీడు మొదలగు ప్రాంతాలలో ఈజట్టు ఆడి విజయములు సాధించింది. వీరు పుదుచ్చేరి, మద్రాసు, క్వయిలన్ మొదలగు పట్టణాలలో జరిగిన పోటీలలోకూడా పాల్గొన్నారు. రైన్‌బోక్లబ్ (విజయవాడ) జట్టు సభ్యులు. బొంబాయి వై. యమ్. సి. ఏ. జట్టులో ఆడి కలకత్తా మోహన్ బాగన్‌జట్టును ఓడించారు. యుద్ధకాలంలో వీరు ఇటాలియన్ జట్టుతోఆడి ప్రత్యేక మన్ననలు పొందారు. ఇంకా వృద్ధిలోనికి వచ్చుచుండగానే కారు ప్రమాదములో చిక్కుకొనగా వారికాలు తెగగొట్టవలసి వచ్చింది.



శ్రీ పి. కన్నయ్య :—జననం 1911 నవంబరు 9. 1927లో సీనియర్ ఫుట్‌బాల్ టోర్నమెంటులో ప్రవేశం. అఖిలభారత పోటీలు పెక్కింటిలో పాల్గొన్నారు. 1939 లో కలకత్తాలో జరిగిన బ్రెబార్న్ మెమోరియల్ ఫుట్‌బాల్ పోటీలలో పాల్గొన్నారు. 1940 లో చెన్న రాష్ట్ర పోటీలలోకూడా పాల్గొన్నారు. 1941 లో కలకత్తా లీగ్‌పోటీ



లలో కాలికట్ ఫుట్‌బాల్ జట్టులో పాల్గొని విశేషఖ్యాతి పొందారు. 1950 వ సంవత్సరము వరకూ భారతదేశంలోని ముఖ్యమైన టోర్నమెంటులలో పాల్గొని ఆటుపిమ్మట పెద్ద పోటీల నుంచి విరమించుకొన్నారు. ఆంధ్రా సర్వీస్ కమీషన్ డిప్యూటీ సెక్రటరీ అయిన శ్రీ టంగుటూరి గోపాలకృష్ణారావుగారివద్ద వీరు మొదట తర్ఫీదుపొంది వున్నారు.

శ్రీ నల్లగొండ రామమూర్తి :— జననం 1922 నవంబరు 9, బెంగుళూరులో. వీరు ఫుట్‌బాల్, హాకీ ఆటలలో ప్రావీణ్యం సంపాదించారు. కొంతకాలము తర్వాత వీరు పోటీలయందు పాల్గొనుట విరమించి ఆయా క్రీడల ప్రచారానికై కృషి చేస్తున్నారు. భారతదేశంలో ప్రసిద్ధినొందిన ఆర్యన్ జింఖానా క్లబ్‌ను వీరు స్థాపించి వున్నారు. అఖిలభారత ఫుట్‌బాల్ ఫెడరేషన్ సభలలో పాల్గొని వున్నారు. మైసూరురాష్ట్ర హాకీ, ఫుట్‌బాల్, ఎథ్లెటిక్, బాక్సింగ్ సంఘాల కార్యకర్త. బర్మా, సింహళం, మలయా, హాంకాంగ్‌లలో పర్యటించిన ఆర్యన్ జింఖానా క్లబ్‌జట్టు మేనేజరు.



శ్రీ దేవత రామమోహనరావు :— జననం 1910. వీరు హైస్కూలు, కాలేజి విద్యార్థిగా వుంటున్నప్పుడు ఫుట్‌బాల్, హాకీ, టెన్నిస్ ఆటలలో మంచి ప్రావీణ్యం చూపారు. ప్రస్తుతం ఆటగాళ్ళకు ఉద్యోగాది విషయాలలో సహాయం చేస్తూవున్నారు. ఆంధ్రదేశంలో చాలా టోర్నమెంటులు విజయవంతంగా నిర్వహించివున్నారు. ఆంధ్రులకు తొలి ఫ్లడ్‌లైట్ ఫుట్‌బాల్ టోర్నమెంటును నిర్వహించారు. ఆంధ్రరాష్ట్ర ఫుట్‌బాల్ సంఘం అధ్యక్షులు. నివాసం రాజమండ్రి.

శ్రీ ఎస్. వి. నరసింహారావు :— జననం 1905 - డిసెంబరు 10, వెంకటగిరిలో. 1928 లో మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాల టెన్నిస్ జట్టు నాయకులు. వీరే అంతర్ కళాశాలల ఛాంపియన్ కూడా. 1932 లో మద్రాసు వై. యమ్. సి. ఏ. కాలేజీలో శిక్షణ పొందారు. 1942 లో రిఫరీగా వీరిని మద్రాసు ఫుట్ బాల్ ఎసోసియేషన్ గుర్తించింది. 1929 లో మద్రాసురాష్ట్ర ఒలింపిక్స్‌లో 50, 100 గజముల పరుగు పోటీలలో ప్రథమస్థానం పొందారు. వీరు 18 మారులు రక్తదానాలు చేసి 1955 వ సంవత్సరము కేంద్ర ప్రభుత్వ ఆరోగ్యశాఖా మంత్రిచే బంగారు పతకం బహూకృతి పొందారు. ఆంధ్రరాష్ట్ర ఫుట్ బాల్ రిఫరీల సంఘ కార్యదర్శి. ఫుట్ బాల్ రంగంలో "సరసూ"గా ప్రసిద్ధి పొందారు.

శ్రీ ఎమ్. రామన్ నాయుడు :— జననం 1904 సెప్టెంబర్ 6 మచిలీపట్నంలో. 1922 లో సీనియర్ ఫుట్ బాల్ టోర్నమెంటులలో ఓంప్రథమంగా పాల్గొన్నారు. 1931 నుంచి 1936 వరకు రైల్వే ఫుట్ బాల్ జట్టు నాయకులు. అంతకుముందు శ్యామ్ మెమోరియల్ ఫుట్ బాల్ క్లబ్ (ఏలూరు), ఎథ్లెటిక్ ఎసోసియేషన్ (ఏలూరు), ప్రేమ్‌జీ మెమోరియల్ ఫుట్ బాల్ క్లబ్ (విశాఖపట్నం), వీనస్ క్లబ్ (గుంటూరు), పిచ్చయ్య ఫుట్ బాల్ క్లబ్, మినర్వా ఫుట్ బాల్ క్లబ్ (మద్రాసు) జట్ల సభ్యునిగా పేరొందారు. కొన్ని ఆంధ్రజట్లు మద్రాసు రాష్ట్రపోటీలలో పాల్గొనుటకు దారి చూపించారు. వీరు 1936లో పెద్ద పోటీలనుంచి విరమించారు. అప్పటినుంచి టోర్నమెంటులు నిర్వహిస్తూ, యువకులకు శిక్షణ యిస్తూవున్నారు. రష్యను ప్రముఖుడు శ్రీ సవస్టినోవ్ వద్ద మద్రాసులో ఉన్నతశిక్షణ విధానములను అభ్యసించారు. వీరు మద్రాసురాష్ట్ర సంఘం వారిచే గుర్తింపబడిన రెండవ తరగతి అంపైర్ కూడా.

శ్రీ కె. శ్రీనివాస్ :— జననం 1928 మార్చి 5. 1946-47 లో అంతర్విశ్వవిద్యాలయ ఫుట్ బాల్ పోటీలలో



పాల్గొన్నారు. 1949-50 లో ఆంధ్రయూనివర్సిటీలో జనరల్ కెప్టెన్, స్పోర్ట్సుఛాంపియన్. 1946 నుంచి 1950 వరకూ అనేక ఫుట్ బాల్, హాకీ టోర్నమెంటులలో పాల్గొని ప్రసిద్ధి పొందారు. వీరి స్థానం హాఫ్ బ్యాక్. 1954, 55 లలో అంతర్రాష్ట్రీ పోలీస్ హాకీ, ఫుట్ బాల్ పోటీలలో ఆంధ్రరాష్ట్రీ జట్టు సభ్యులు. 1954 నుంచి 56 వరకూ తూర్పు గోదావరి జిల్లా పోలీస్ హాకీ, ఫుట్ బాల్ జట్టులకు నాయకత్వం వహించి ఆంధ్రరాష్ట్రంలో జరిగిన నార్త్ రేంజి టోర్నమెంటులలో గెలుపొందారు.

శ్రీ యెల్లేపెద్ది బాలకృష్ణమూర్తి :— జననం 1932, రాజోలులో. చిన్నతనమునుంచి ఎచ్చట ఫుట్ బాల్ పోటీలు జరిగినసూ శ్రద్ధగా తిలకించుచుండేవారు. ప్రసిద్ధ ఆటగాడయిన శ్రీ వేదాంతం బాలకృష్ణమూర్తిగారి వద్ద ఫుట్ బాల్ ఆటను నేర్చుకొన్నారు. 1943 లో హైస్కూలు ఫుట్ బాల్ జట్టు సభ్యులుగా ఉండి ఒంగోలులో జరిగిన గుంటూరుజిల్లా ఆటల పోటీలలో పాల్గొని షీల్డ్ సాధించారు. 1951 లో గుంటూరు హిందూకాలేజీ జట్టు నాయకులు. 1952 లో గుంటూరులో జరిగిన



ఒక ఎగ్జిబిషన్ పోటీలో దురదృష్టవశాత్తు క్రిందపడి చెయ్యి దెబ్బతిన్నది. అయినా లెక్కచెయ్యక 1954-56 లలో కూడా హిందూకళాశాల ఫుట్ బాల్ జట్టుకు నాయకత్వం వహించి అన్ని ఫుట్ బాల్ పోటీలలోనూ పాల్గొన్నారు. గుంటూరు "కృష్ణా మెమోరియల్ ఫుట్ బాల్ క్లబ్" స్థాపకులు. నంద్యాల, నెల్లూరు, విజయవాడ మొదలగు పట్టణాలలో జరిగిన పెద్ద ఫుట్ బాల్ టోర్నమెంటులలో పాల్గొన్నారు.

1954 నుంచి ఆంధ్రరాష్ట్ర ఫుట్‌బాల్ సంఘం సభ్యులు. ప్రస్తుత నివాసం గుంటూరు.

శ్రీ బృందావనం శేషగిరిరావు :—జననం 1930. బాల్యం భీమవరంలో గడిచింది. స్కూలు విద్యార్థిగా వున్నప్పుడు ఫుట్‌బాల్, బాస్కెట్‌బాల్ ఆటలలో ఎక్కువ ఆసక్తి చూపారు. 1948 లో ఏలూరు బాడేటి మెమోరియల్ ఫుట్‌బాల్ టోర్నమెంటులో పాల్గొని ప్రత్యేక కప్పును బహుమతిగా పొందారు. 1951, 52 లలో ఆంధ్ర విశ్వ విద్యాలయజట్టు సభ్యులు. 1949-50 నుంచి 1952 వరకు కాకినాడ ఇంజనీరింగ్ కాలేజి బాస్కెట్‌బాల్ జట్టు సభ్యుడు. 1949 లో ఆంధ్ర విశ్వవిద్యాలయ అంతర్ కళాశాలల బాస్కెట్‌బాల్ టోర్నమెంటు ఫైనల్స్‌లో కాకినాడ పి. ఆర్. కాలేజీ జట్టుతో పోటీచేసినప్పుడు ఒక్కరు 32 పాయింట్లు సాధించారు. ఆ పోటీలో ఆ జట్టు మొత్తం సాధించిన పాయింట్లు 48. 1952 వరకు వీరిజట్టు అంతర్కళాశాల బాస్కెట్‌బాల్ ట్రోఫీ గెలుచుకున్నది. వీరు ప్రథమ ఆంధ్రరాష్ట్ర ఫుట్‌బాల్ జట్టు సభ్యులు (1954). కలకత్తాలో 1954 లో జరిగిన ఎనిమిదవ నేషనల్ బాస్కెట్‌బాల్ పోటీలలో పాల్గొనిన ఆంధ్రరాష్ట్ర జట్టుకు నాయకులు.



వీరికి టెన్నిస్ ఆటలోకూడా మంచి ప్రావీణ్యంకలదు. 1951 లో టెన్నిస్ ఆట ప్రారంభించారు. 1951-52 సంవత్సరము ఇంజనీరింగ్ కాలేజీ ఛాంపియన్. 1954, 55 లలో మదనపల్లి టెన్నిస్ టోర్నమెంటు విజేతలు. 1947-48 లో భీమవరం కాలేజి ఎథ్లెటిక్ ఛాంపియన్. 1950-51, 1951-52 లలో కాకినాడ ఇంజనీరింగ్ కాలేజి ఎథ్లెటిక్ ఛాంపియన్. 1951-52 అత్యుత్తమ క్రీడాప్రవీణుని కప్పు వీరికి బహూకరించబడింది. 1948 లో క్రికెట్ ప్రారంభించారు. 1948-52 సంవత్సరాలలో కాకినాడలో 'ఫీల్డర్' గా పేరొందారు.

శ్రీ బృందావనం బాపిరాజు :— జననం 1932. భీమవరం హైస్కూలు ఫుట్ బాల్ జట్టు సభ్యులు. భీమవరం కాలేజీలో చదువు



చున్నప్పుడు (1952) కళాశాల వార్షిక పోటీలలో పాల్గొని బంగారు పతక బహూకృతి పొందారు. 1952 లో ఆంధ్రవిశ్వవిద్యాలయ ఫుట్ బాల్ జట్టు సభ్యులు. సింహాళం జట్టుతో పోటీచేసి నప్పుడు వరుసగా మూడుగోలులు ("హ్యాట్రిక్") సాధించారు. తర్వాత పూనా విశ్వవిద్యాలయ టీముతో పోటీచేస్తూ మరొక "హ్యాట్రిక్" సాధించారు. 1953 లో వీరు ఆంధ్ర యూని వర్శిటీ జట్టు సభ్యులు. 1954 లో ఆంధ్ర ఎలివెన్ జట్టుకు ఎన్నికై మద్రాసులో నేతాజీక్లబ్ (మద్రాసు)టీమును 4-1 గోలులతో ఓడించారు. అందులోనూ వీరు "హ్యాట్రిక్" సాధించారు. 1953 లో బొంబాయిలో జరిగిన రోవర్స్ కప్ ఫుట్ బాల్ టోర్నమెంటులో పాల్గొని మొదటి రౌండ్ లో అఖిలభారత ప్రసిద్ధినొందిన డైన్ మోస్ ను ఓడించారు. అందులోనూ వీరు "హ్యాట్రిక్" సాధించగా బొంబాయి పత్రికలు వీరిని పొగడినవి.

1955 లో ఆంధ్ర యూనివర్శిటీ ఫుట్ బాల్ జట్టు నాయకులు. అదే సంవత్సరము ఆంధ్ర యూనివర్శిటీ బాస్కెట్ బాల్ జట్టులో కూడా సభ్యులు. 1955 లో రోవర్స్ కప్పు పోటీలలో పాల్గొన్న విశాఖ పట్నం స్పోర్ట్స్ మెన్ క్లబ్ జట్టు సభ్యులు. 1955 వ సంవత్సరంలో ఆంధ్రరాష్ట్ర ఫుట్ బాల్ జట్టు సభ్యులు.

శ్రీ సుంకర వెంకట రమణారావు :— జననం 1937, జూన్ 22 రాజమండ్రిలో. 1950 వరకూ విశాఖపట్నం ఫుట్ బాల్ టోర్నమెంటు కమిటీవారిచే మూడు ప్రత్యేక బహుమతులను పొందారు. "స్పోర్ట్స్ మన్ క్లబ్" (విశాఖపట్నం) ఫుట్ బాల్ జట్టు సభ్యునిగా 1955 లో బొంబాయిలో జరిగిన రోవర్స్ కప్ టోర్నమెంటులో పాల్గొ

న్నారు. 1952, 1953 లలో మద్రాసు పచ్చయప్పా కాలేజీ జట్టు గోల్ కీపర్. "గ్రాస్ హాపర్స్" జట్టులో కూడా ఆడారు. 1955, 1956 లలో ఆంధ్రరాష్ట్ర జట్టు సభ్యులు. 1955 లో ఆంధ్రా మెడికల్ కాలేజీ జట్టు సారథి. 1956 లో ఆంధ్ర యూనివర్సిటీజట్టు నాయకులు.

శ్రీ భద్రయ్య :— జననం - 1922 ప్రాంతాల. స్వగ్రామం విజయవాడ. స్కూలు, కాలేజి జీవితంలోనే నూజివీడు, విజయవాడవంటి పట్టణాలలో జరిగిన ఫుట్ బాల్ పోటీలలో పాల్గొని గణుతికెక్కారు. మైసూర్ రోవర్స్‌కు లెఫ్ట్‌బ్యాక్‌గా ఆడేవారు 1942 - 43 లో సంతోష్ ట్రోఫీ పోటీలలో పాల్గొన్న చెన్నరాష్ట్రం జట్టులో సభ్యుడు. 1943-44 బెంగుళూరు అర్యన్ జింఖానాజట్టు సభ్యునిగా ఐ. యఫ్. ఎ. షీల్డ్ పోటీలలో పాల్గొన్నారు. ఇదే సంవత్సరంలో సింహళంలోని సాకర్ టోర్నమెంటులో పాల్గొన్నారు. 1954 లో మద్రాసులో జరిగిన నేషనల్ ఫుట్ బాల్ పోటీలలో ఆంధ్రజట్టు వైస్ కెప్టన్. లెఫ్ట్ బ్యాక్‌గా ఆడినారు. ధైర్యంగా ఎదిరించడం, మనిషిని కాపుకాయడం, తలతో బంతిని ఎటుకైనా కొట్టగలగడం వీరి ఆటలో ప్రత్యేకత. శరీరం ఉక్కువంటిది. 1955 ఆగస్టులో వీరు కృష్ణానది పడవప్రమాదంలో దుర్మరణం పాలైనారు.

శ్రీ ఎమ్. జగన్నాథరావు :— జననం 1919 కాకినాడలో. వీరి బావగారయిన శ్రీరాములుగారివద్ద ఫుట్ బాల్ ఆటలో తర్ఫీదు పొందారు. పెనుగొండ, కాకినాడ, మద్రాసు మొదలగు నగరాలలో జరిగిన టోర్నమెంటులలో పాల్గొన్నారు. 1946 లో శ్రీ ఎమ్. అప్పారావుగారితో కలసి ఈస్ట్ బెంగాల్ జట్టుతో ఆడారు. 1956 లో కర్నూలులో జరిగిన ఫుట్ బాల్ టోర్నమెంటులో విజయం పొందిన జట్టు సభ్యులు. ప్రస్తుత నివాసం కాకినాడ.

శ్రీ గిడుతూరి సూర్యం :— (గిడుతూరి కనక సూర్యనారాయణ) జననం 1920 జనవరి 17 బెజవాడ. స్కూలు జీవితంలో సాకర్,



చెడుగుడు, బాడ్మింటన్, వాలీబాల్ ఆటల లోనూ, ఎథ్లెటిక్స్‌లోనూ చక్కటి ప్రవేశం సంపాదించారు. 1935 లో సి. ఆర్. దాస్ 'బి' ఫుట్ బాల్ జట్టు సెంటర్ హాఫ్. 1939 లో విజయవాడ హిందూ హైస్కూలు జట్టుకు నాయకత్వం వహించి బందరులో గ్రిగ్ మెడల్ సాధించారు. సి. ఆర్. దాస్ 'ఎ' ఫుట్ బాల్ జట్టులో కూడా పాల్గొని రజతపాత్ర బహుమతి పొందారు. చెడుగుడులో కోపుస్థానంలోనూ, బాడ్మింటన్‌లో రైట్ బ్యాక్ గానూ, అనేక టోర్నమెంటులలో పాల్గొని అనేక బహుమతులు పొందారు. ఆంధ్ర క్యారమ్స్ టోర్నమెంటులలో స్వర్ణపతకాలు గెలుచు కొన్నారు. 1939-44 మధ్య కాలేజి సాకర్, వాలీబాల్ టోర్నమెంటులలో పాల్గొని బహుమతులు పొందారు. 1945-46 లో సికింద్రాబాద్ యం. ఇ. యస్. వాలీబాల్ జట్టు సభ్యునిగా కెప్టన్ రాజు నాయకత్వాన మిలిటరీ వాలీబాల్ టోర్నమెంటులలో పాల్గొని విజయం చేబట్టారు. వీరి సర్విస్ మహాశక్తిమంతమైనది. 1935-40 మధ్య టెన్నిస్, టేబుల్ టెన్నిస్ ఆటలలో పేరు గడించారు. ఈ ఆటల్లో కూడా వీరి సర్విస్ విశిష్టమైనది.

శ్రీ జి. కె. సూర్యం పత్రికారచయిత, కవి, చిత్రకారుడు, గాయకుడు, నటుడు. రేడియో నాటికల పోటీలో ప్రభుత్వ బహుమతి పొంది వున్నారు. 1956 లో ఢిల్లీలో నాటక పోటీలలో ట్రోఫీలు గెలుచుకొని వున్నారు. ప్రస్తుత నివాసం ఢిల్లీ నగరం.

బొమ్మకంటి సుబ్బారావు :— ఈ పుస్తకం రచయితను. ఇతరులు నన్ను గురించి రచించేటంతటి ఆటగానిని కాదుకాబట్టి నా గురించి నేనే కొద్ది వాక్యాలు వ్రాసుకొంటాను.

జననం 1924 జూన్ 14 కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా గొల్లనపల్లి గ్రామంలో. 1932 ప్రాంతాల నూజివీడులో ఒక ప్రయివేటు ఎలి

మెంటరీ స్కూలులో చదువుకొంటున్నప్పుడు ఆరోగ్యవారం సందర్భంలో స్కూలులోకెల్ల ఆరోగ్యవంతుడైన విద్యార్థికి బహుమతి యివ్వదలచారు. నన్నే ఆరోగ్యవంతుడైన విద్యార్థిగా నిర్ణయించి డజను పెన్సిళ్ళకట్ట బహుమతిగా యిచ్చారు. అప్పటినుంచి ఆటలలో ఆసక్తి కలిగింది. దరిమిలా ఎస్. ఆర్. ఆర్. హైస్కూలులో చేరినప్పుడు వార్షికోత్సవ పోటీలలో నా తరగతిలో కొద్ది దూరపు పరుగులలో ప్రథమునిగా వచ్చాను. అప్పటినుంచి పరుగు అంటే భలే ఇష్టం. ఆ రోజులలో వారంలో కొద్దిరోజులు ఉదయంపూట కంపల్సరీ డ్రిల్లు ఉండేది. డ్రిల్లుక్లాసుకు ఆలస్యంగా వచ్చేవారు స్కూలు భవనం చుట్టు



(1942 లో)

మూడుసార్లు పరుగెత్తాలి. అదీ వారికి 'శిక్ష'. చాలామంది ఆ పరుగును కఠినశిక్షగా యెంచేవారు. కాని నా కది అమితానందంగా వుండేది. బాగా పరుగెత్తాలనే అభిలాషతో, కావాలని డ్రిల్లు తరగతికి ఆలస్యంగా వెళ్లేవాణ్ణి.

సెకండ్ ఫారమ్ చదువుచుండగా ఫుట్ బాల్ ఆట ప్రారంభించాను. మొట్టమొదటి రోజునే, బంతి అందుకొన్న ఐదు నిమిషాలలో గోలు చేశాను. అది నా కెంతో ఉత్సాహ మిచ్చింది. అప్పటినుంచి 1942 లో గుంటూరు ఏ. సీ. కాలేజీలో బి. ఏ. మొదటి తరగతి చదివే వరకు విడవక ఫుట్ బాల్ ఆడుతూ వుండేవాణ్ణి. చిన్న సోకర్ టోర్నమెంటులలో పాల్గొని కంచుగ్లాసు, బొందుపుస్తకాలు, పెన్నువంటి చిన్న చిన్న బహుమతులు పొందాను. పెద్ద పెద్ద బహుమతులు పొందకపోయినప్పటికీ నేను కొన్ని ప్రత్యేకతలు సాధించ కలిగాను. లెఫ్ట్ఇన్ (ఫార్వర్డ్) గా

ఆడేవాణ్ణి. ఎడమకాలును కుడికాలును కూడా సమప్రజ్ఞతో ఉపయోగించ కలిగేవాణ్ణి. సబ్ జూనియర్‌గా వున్నప్పుడు జూనియర్ టీములోకి, జూనియర్‌గా వున్నప్పుడు సీనియర్ టీములోకి నన్ను ఎన్నుకొనేవారు. గంటసేపు ఫుట్‌బాల్ ఆడి, ఆ పిమ్మట నే ఫుట్‌బాల్ గ్రౌండ్ చుట్టూ మూడు లేక నాలుగు పర్యాయాలు పరిగెత్తేవాణ్ణి. గంట ఆడినపిమ్మట చాలామంది శోష వచ్చి పడిపోయేవారు. గంట ఆడినపిమ్మట కూడా పరుగెత్తడం ద్వారా పటిమను, శక్తిని పెంపొందించుకొనేవాణ్ణి. ఆటగానిగా వున్నంత కాలమూ శరీరం ఉక్కులాగా వుండేది. 20 మైళ్ళ వేగంలో పోతున్న బస్సునుంచి దూకినా నాకు పెద్ద దెబ్బలు తగులలేదంటే శరీరం ఎంత గట్టిగా వుండేదో ఊహించవచ్చు.

దసరాపండగలకు నూజివీడులో ఉయ్యూరు, ఎలమర్రు జమీందార్లు ఫుట్‌బాల్, టెన్నిస్, కుస్తీ మున్నగు పోటీలు పెద్దయెత్తున నిర్వహించే వారు. మా తండ్రి శ్రీ రాజగోపాలరావుగారు వాటికి నన్ను వెంట తీసుకొనివెళ్ళి నాలో క్రీడాసక్తిని పెంపొందించారు.

1939_41 లో గుంటూరు హిందూ కాలేజీలో ఇంటర్ చదువుతున్నప్పుడు నేను గోల్ కీపర్‌గా వున్న హాకీ టీము (1941 లో అని జ్ఞాపకం) కాలేజీ టోర్నమెంటును గెలుచుకొన్నది. రింగ్ టెన్నిస్ పోటీలలో కూడా పాల్గొనేవాణ్ణి.

నాడూ, నేడూ క్రీడారంగ స్థితిని పోల్చి చూచుకుంటే నాకొక్కటే విచారం కలిగిస్తుంది. ఆ రోజులలోనే ఇప్పటివలె స్పోర్ట్స్ కోచింగ్ స్కీములు వుంటే జీవితమంతా క్రీడాకారునిగా వుండేవాణ్ణి. అంతకుమించిన ఆనందం నాకు వేరొకటి వుండేదికాదు.

బొమ్మకంటివారి వంశమే ఆటలలో గొప్పది. వేలు విడిచిన నా పెద్దన్నగారు బొమ్మకంటి వెంకట తిరుమల శర్మ సోకర్ గోల్ కీపర్‌గాను, డిఫెండర్‌గాను కృష్ణా మండలంలో గణుతికెక్కారు.

నా స్వంతఅన్నగారు శ్రీ బొమ్మకంటి హనుమంతరావుగారు (ఎమ్. ఏ., బి. ఎస్. సి.) సోకర్, టెన్నిస్ రెండింటిలోను అద్భుత ప్రజ్ఞావంతులు. కాలేజి విద్యార్థిగా నున్నప్పుడు కాలేజి ఫుట్‌బాల్ టీములో

సెంటర్ ఫార్వర్డుగా వుండి ప్రముఖ టోర్నమెంటులను గెలుచుకొన్నారు. కాలేజి టెన్నిస్ కెప్టెన్.

నా చిన్నితమ్ముడు బొమ్మకంటి రామారావు (ఓ. ఎస్. సి.) స్కూలు, కాలేజివిద్యార్థిగా వున్నప్పుడు ఫుట్ బాల్ పోటీలలో పాల్గొని గ్లాసులు, పెన్నులు, పళ్ళెరములు వంటి బహుమతులు పొందాడు.

మా చిన్నతనంలో నూజివీడు ఫుట్ బాల్ కు 'మెక్కా'గా వుండేది. నూజివీడు వాతావరణం సోకిన ప్రతి ఒక్కరికీ క్రీడలలో ఇంతో, అంతో ఆసక్తి వుండకమానదు.

1956 లో జాతీయఫుట్ బాల్ ఛాంపియన్ షిప్ పోటీలలో పాల్గొన్న ఆంధ్రజట్టు సభ్యులు :- ఫోటోలో ముందు నిలుచున్నవారి, తరువాత కూర్చున్నవారి ఎడమ నుంచి కుడివరుస ప్రకారం పేర్లు దిగువ తెల్పబడినవి.



ఆంధ్రరాష్ట్ర ఫుట్ బాల్ జట్టు

శ్రీయుతులు రంధి వరహాలు (లెఫ్ట్ హాఫ్) వయస్సు సుమారు 24 సంవత్సరాలు. విశాఖపట్నం స్పోర్ట్సు మెన్ క్లబ్ సభ్యుడు.

1953 లో బొంబాయి రోవర్స్ కప్పు పోటీలలో విశాఖపట్నం జట్టు తరఫున పాల్గొన్నారు. 1954 జాతీయ ఫుట్ బాల్ పోటీలలో కూడా ఆంధ్రప్రతినిధి; టి. శంకరం (లెఫ్ట్ బ్యాక్) విశాఖపట్నం, సుంకర భాస్కరరావు (మేనేజరు), డి. అప్పలరెడ్డి (రైట్ బ్యాక్), యస్. వెంకటరమణరావు (సెంటర్), చాగంటి శ్రీరాములు (రైట్ హాఫ్) వయస్సు సుమారు 25. 1954 లో పెదకాపు మెమోరియల్ క్లబ్ జట్టు కెప్టెన్. 1953-54 లో ఆంధ్ర యూనివర్సిటీజట్టు రైట్ ఫుల్ బ్యాక్, 1954 లో ఆంధ్రరాష్ట్రజట్టు సభ్యుడు; సుంకర హనుమంతరావు (కెప్టన్) లెఫ్ట్ ఇన్; సి. హెచ్. దక్షిణామూర్తి (సెంటర్ హాఫ్) జి. వి. కె. మూర్తి (గోల్); ఎ. అరుల్ దాస్ (రైట్ ఇన్) రాజమండ్రి రైల్వేస్పోర్ట్సు క్లబ్ ప్రతినిధి; బి. ఆనందరావు (లెఫ్ట్ ఔట్) విజయవాడ స్పోర్టింగ్ యంగ్ స్టర్స్ ప్రతినిధి; అత్తర్ పాషా (రైట్ ఔట్).

(శ్రీ) ఎస్. సంకు :— వయసు దాదాపు 30. విజయవాడ సి. ఆర్. దాస్ జట్టు సభ్యుడు. 1948 లో మద్రాసు జటప్రోల్ కప్పు పోటీలలో తిరుచునాపల్లి స్పోర్టింగ్ యంగ్ స్టర్స్ తరఫున పాల్గొన్నారు. 1954 లో ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి. వీరు లెఫ్ట్ ఇన్ గా పేరు గడించారు.

(శ్రీ) జామి అప్పారావు :—వయస్సు సుమారు 32 సంవత్సరాలు. విశాఖపట్నం స్పోర్ట్సుమెన్ క్లబ్ జట్టు సభ్యులు. రోవర్స్ కప్పు ఐ. యఫ్. ఎ. పోటీలలోనూ, మద్రాసు, రాయపూరు టోర్నమెంటులలోనూ పాల్గొన్నారు. 1954 లో ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి.

(శ్రీ) అబ్దుల్ రసూల్ :— వయస్సు సుమారు 28 సంవత్సరాలు. గో. కర్నూలు ఫుట్ బాల్ క్లబ్ జట్టు సభ్యులు. సికింద్రాబాద్, బళ్ళారి, మధుర మున్నగు పట్టణాలలో జరిగిన పెద్ద టోర్నమెంట్ లలో పాల్గొని వున్నారు. 1954 లో ఆంధ్రరాష్ట్రజట్టు సభ్యులు.

(శ్రీ) అజీజ్ :— వయస్సు 23 సంవత్సరాలు. ఔట్ సైడ్ రైట్. కర్నూలు ఫుట్ బాల్ క్లబ్ సభ్యుడు. మధుర, బెంగుళూరు,

బళ్ళారి టోర్నమెంటులలో పాల్గొనివున్నారు. 1954 లో ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి.

శ్రీ బి. హనుమంత కుమార్ :— వయస్సు సుమారు 22 సంవత్సరాలు. లెఫ్ట్ ఎక్స్ ట్రీమ్. ఆదోని మర్చంట్స్ ఫుట్‌బాల్ క్లబ్ జట్టులోనూ, ఉస్మానియా యూనివర్సిటీ జట్టులోను ఆడివున్నారు. 1954 లో ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి.

శ్రీ అలాఫ్ ఖాన్ :— వయస్సు సుమారు 26 సంవత్సరాలు. కర్నూలు ఫుట్‌బాల్ క్లబ్‌జట్టు సభ్యుడు. లక్నో, హైదరాబాద్, మద్రాసులలో జరిగిన పెద్దపోటీలలో పాల్గొనివున్నారు. మద్రాసు యూనివర్సిటీజట్టు సభ్యులు. 1954 లో ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి.

శ్రీ తోహరుల్లా ఖాన్ :— వయస్సు సుమారు 39 సంవత్సరాలు. మద్రాసు యూనివర్సిటీ గోల్ కీపర్, కెప్టెన్. చెన్నరాష్ట్ర ఫుట్‌బాల్ జట్టు సభ్యులు. నెల్లూరు రైజింగ్ స్టార్సు జట్టు సభ్యుడు. ఈ జట్టు వీరినాయకత్వంలో ఒక ఏడాది జటప్రోల్, యం. యు. సి. కప్పులను గెలుచుకొన్నది. వీరు మంచి బాడ్మింటన్ ఆటగాడుకూడా. ప్రస్తుతం నెల్లూరు వి. ఆర్. కాలేజిలో ఫిజికల్ డైరక్టర్.

క్రింది ఫుట్‌బాల్ ఆటగాళ్లు తమతమ మండలాలలో పేరుగడించి వున్నారు :— శ్రీయుతులు ఎస్. వరహాలు (క్రింది చిత్రం. వీరి విజయ చరిత్ర 381 వ పేజీలో చూడనగును), మార్గనా సూర్యనారాయణ (విశాఖ మండలం), కె. సుదర్శనరావు (ఆంధ్ర యూనివర్శిటీ కాలేజెస్ ఫిజికల్ డైరెక్టర్), "ఎడ్డి", టి. కె. వెటరన్ సోదరులు (సి. ఆర్. దాస్ టీం విజయవాడ), కెప్టెన్ ఎన్. వి. ఎస్. రామారావు, "గుణపం" అనే డి. వి. నరసింహారావు, ఇబ్రహీం, చలమయ్యాచారి (వీరందరిదీ నూజివీడు), సూరయ్య (రాజమండ్రి), హబీబుల్లా (బందరు), కామేశ్వర



రావు (వెటరన్, విజయవాడ), అజీం (వెటరన్, రాజమండ్రి) తాతయ్య నాయుడు (వెటరన్, వైజాగ్) ఎమ్. బాబురావు (విశాఖపట్నం),



టి. సీతారామ్ (విశాఖపట్నం), సి. హెచ్. ప్రసాద్. (విజయనగరం), సి. హెచ్. పోతారెడ్డి (కాకినాడ), కె. డాము. (కాకినాడ), ఎ. తాతారావు (కాకినాడ), అబ్దుల్ రోనే (విజయవాడ) ఎల్. పుల్లయ్య (రాజమండ్రి), యస్. ఎమోస్ (కావలి), వి. యస్. రాబర్ట్సన్ (కావలి), అబ్దుల్ జబ్బార్ (గుంటూరు), యస్. జబ్బార్ (నంద్యాల), వి. రంగారావు (వెటరన్, కలకత్తా కాలిఘాట్ టీము సభ్యులు), వి. హనుమంతు (ఏలూరు).

శ్రీయుతులు కె. నాగేశ్వరరావు, అబ్దుల్ హాయి, కె. బాలన్, పి. వెంకటేశ్వరరావు, జి. కృష్ణారెడ్డి, యస్. జగన్మోహనరావు, యస్. భాస్కరరావు, ఎ. రజాక్, ఎ. రామమోహనరావు, కె. వెంకటేశ్వరరావు, కె. యస్. మల్లికార్జునరావు – వీరందరూ విజయవాడ యంగ్ బ్లూస్ జట్టు సభ్యులు.

శ్రీయుతులు మెట్లపల్లి సూర్యనారాయణరావు (వీరపనేని గూడెం) గొల్లనపల్లి నీలాచల వెంకటేశ్వరరావు (గొల్లనపల్లి), దామరాజు లక్ష్మణ రావు ("తాత"–నూజివీడు) ఎస్. ప్రకాశరావు (నూజివీడు హైస్కూలు వ్యాయామోపాధ్యాయుడు) వీరందరు నూజివీడు టోర్నమెంటులలో పాల్గొన్నారు.

శ్రీయుతులు చెన్నకేశవులు, పార్థసారధి, కైరుద్దీన్, సుబ్బయ్య, ఈశ్వరయ్య, పన్నీఖాన్, గులాం అహమ్మద్ ఖాన్, టామీ, రహిమాన్ ఖాన్, ఖలీద్ – వీరందరూ కర్నూలు ఫుట్ బాల్ అసోసియేషన్ జట్టు సభ్యులు.

శ్రీయుతులు సిద్దేశ్వరప్ప, నజీర్, వెంగల్, ఇస్మాయిల్, తంబి, ఆరోగ్యస్వామి, భాస్కర్, ప్రసాద్, రత్తన్ లాల్, రమణ, దేవానందం–వీరందరూ కర్నూలు మర్చంట్స్ జట్టు సభ్యులు.

శ్రీయుతులు కరీం, మహమ్మదాలీ, ఇస్మాయిల్, విఠల్ రావు, బషీర్ అహమ్మద్, గులాం అహమ్మద్, బాషా, షఫీ, గనీ, రవూఫ్, వీరన్న - వీరందరూ కర్నూలు మోటారు స్పోర్టింగ్ జట్టు సభ్యులు.

శ్రీయుతులు ఎ. ప్రతాప్, లోహిదాస్, గజ్జలు, గంగాధర్, చుక్కన్న, కాంతారావు, మోహన్ సింగ్. వీరందరు పెదకాపు మెమోరియల్ జట్టు సభ్యులు.

ఆంధ్ర ఫుట్ బాల్ ఎసోసియేషన్ కార్యకర్తలు :— శ్రీ దేవత రామమోహనరావు, శ్రీయుతులు పూడి వీరరాఘవయ్య (గూడూరు), పోతుల వీరభద్రరావు (రాజమండ్రి), దంటు భాస్కర రావు (కాకినాడ). దొడ్ల రామచంద్రారెడ్డి (చిట్రగుంట), ఎస్. భాస్కర రావుగారు వరఫ్ బొచ్చి, (రాజమండ్రి), డి. అప్పారావు (కాకినాడ), పి. హెచ్. కుమారస్వామి (కాకినాడ), వి. సత్యనారాయణ (విశాఖ పట్నం), ఎమ్. సుబ్బారావు (కాకినాడ), వి. సాలమన్ రాజు (ఏలూరు), ఏ. రాజగోపాలరావు (విజయవాడ), వై. బాలకృష్ణమూర్తి (గుంటూరు), ఎమ్. ఏ. తహేర్ (నంద్యాల), యస్. ప్రకాశం (కావలి), ఎమ్. వి. రాఘవులు (ధవళేశ్వరం), మహమ్మద్ హుస్సేన్ (కర్నూలు), ఎన్. వి. నరసింహం గారలు.

ఆంధ్రదేశంలో ఫుట్ బాల్ క్రీడాభివృద్ధికి పాటుపడు తున్న సంస్థలలో ముఖ్యమైనవాటి పేర్లివి :—స్పోర్ట్సు మెన్ క్లబ్, హిందూస్థాన్ షిప్ యార్డ్, సుబ్బయ్య మెమోరియల్, డైనమోస్ ఫుట్ బాల్ క్లబ్, మార్నింగ్ స్టార్ ఫుట్ బాల్ క్లబ్, పోలార్ స్టార్, ఈస్టర్న్ రైల్వే వి. యస్. ఎ. సర్కార్స్, మెడికల్ యునైటెడ్ క్లబ్, (ఇవన్నీ విశాఖపట్నంలోనివి), పెదకాపు మెమోరియల్ ఫుట్ బాల్ క్లబ్, స్పోర్టింగ్ ఎసోసియేషన్, యంగ్ బ్లూస్, యంగ్ జమ్స్, ఎలెవన్ హంటర్స్ ఫుట్ బాల్ క్లబ్, ది యంగ్ మెన్ క్లబ్, రాఘవయ్య మెమోరియల్ ఫుట్ బాల్ క్లబ్, కాకినాడ XI ఫుట్ బాల్ క్లబ్, ఓగిరాల సుబ్బారావు మెమోరియల్ ఫుట్ బాల్ క్లబ్, హనుమంతరావు మెమోరియల్ ఫుట్ బాల్ క్లబ్, భగత్ సింగ్ మెమోరియల్ ఫుట్ బాల్ క్లబ్,

సూర్యా జింఖానా ఫుట్‌బాల్ క్లబ్ (ఇవన్నీ కాకినాడలోనివి), రైల్వే స్పోర్ట్సు క్లబ్, యంగ్ నింబుల్సు క్లబ్, నింబుల్సు క్లబ్, తవ్వాల రంగారావు నాయుడు మెమోరియల్ క్లబ్, బ్రదర్స్ క్లబ్, దేవతా శ్రీరామమూర్తి మెమోరియల్, ఆర్యన్స్, వీర్ని లచ్చయ్య మెమోరియల్, కేసరి, డాక్టర్ యస్. స్వామినాయుడు మెమోరియల్, ఎథ్లెటిక్ ఎసోసియేషన్, డైనమోస్, దానవాయిపేట ఫుట్‌బాల్ క్లబ్ (ఇవన్నీ రాజమండ్రిలోనివి). నీరుకొండ వెంకట రామారావు మెమోరియల్ (వంగలపూడి), ధవళేశ్వరం ఫుట్‌బాల్ క్లబ్ (ధవళేశ్వరం), యంగ్ మెన్ రిక్రియేషన్ క్లబ్, యంగ్ మెన్ ఎథ్లెటిక్ ఎసోసియేషన్, యూత్ క్లబ్ (ఇవి గూడూరులోనివి), లింగమూర్తి ఫుట్‌బాల్ క్లబ్, ఏ. బి. యస్. ఫుట్‌బాల్ క్లబ్ (నిడదవోలు), యంగ్ బ్లూస్ ఫుట్‌బాల్ క్లబ్, సి. ఆర్. దాస్ మెమోరియల్ ఫుట్‌బాల్ క్లబ్, స్పోర్టింగ్ యంగ్ స్టార్స్, రైన్ బో (ఇవి విజయవాడలోనివి). ఎథ్లెటిక్ ఎసోసియేషన్ (ఏలూరు), బ్లాక్ షర్ట్సు (ఏలూరు), కృష్ణా మెమోరియల్ (గుంటూరు), వై. యం. ఏ. (నంద్యాల), కస్తూరిబా గోల్డు కప్పు (కర్నూలు), గ్రాస్ హాపర్స్ (కర్నూలు), కర్నూలు ఫుట్‌బాల్ అసోసియేషన్, బ్యాచిలర్స్ ఫుట్‌బాల్ క్లబ్, బ్రదర్స్ క్లబ్, గౌరి సోమల్సు క్లబ్ (ఇవి విజయనగరంలోనివి), జాలీ ఫ్రెండ్స్ ఎసోసియేషన్, దామోదర మెమోరియల్ (బిట్రగుంట), విశోదయ (కావలి), సాగర్ మెమోరియల్ (మూలసాగరం), యంగ్ జమ్స్ (గుత్తి), మచిలీపట్నం ఫుట్‌బాల్ అసోసియేషన్ (మచిలీపట్నం), కబీరా ఫుట్‌బాల్ క్లబ్ (పిఠాపురం), యంగ్ బ్లూస్ (సామర్లకోట), కె. బి. కె. శాస్త్రి మెమోరియల్ (గుడివాడ), స్పోర్టింగ్ ఎసోసియేషన్ (భీమవరం).

## హైదరాబాదు

శ్రీ జి. యమ్. పెంటయ్య :—జననం 1930, జూన్ 13 హైదరాబాద్‌లో. హైస్కూలులో చదువుచుండగానే ఫుట్‌బాల్,



హాకీ ఆటలలో మంచి ప్రావీణ్యం సంపాదించారు. రెండు సంవత్సరములు హైస్కూలు సోకర్ జట్టు నాయకులు. ఒక సంవత్సరము ఎథ్లెటిక్స్ ఛాంపియన్.

1950 లో వీరు యస్. యస్. రైల్వే జట్టు సభ్యులు. 1951 లో ఖర్గపూర్‌లోనూ, 1952 లో కలకత్తాలోనూ జరిగిన అంతర్ రైల్వే పోటీలలో పాల్గొన్నారు. 1952 లో హైదరాబాద్ హంటర్స్ జట్టు సభ్యులు. మైసూరు సోకర్ టోర్నమెంటును ఈ జట్టు గెలుచుకొన్నది. అదే సంవత్సరము వీరు హైదరాబాద్ ఫుట్‌బాల్ ఎసోసియేషన్ జట్టుకు ఎన్నికయి యమ్. యు. సి. గోల్డుకప్ టోర్నమెంటులోనూ (మద్రాసు), ఐ. యఫ్. ఏ. షీల్డు టోర్నమెంటులోనూ పాల్గొన్నారు. 1952 లో హైదరాబాద్‌రాష్ట్ర జట్టు సభ్యులు. తర్వాత రెండు సంవత్సరములు రోడ్ ట్రాన్స్‌పోర్ట్ సోకర్ జట్టు సారథి. చాలా టోర్నమెంట్సులో విజయములు సాధించారు. పాకిస్తాన్ జట్టుతో పోటీచేసి ఒక గోలుతో గెలుపొందిన హైదరాబాద్ ఎలివెన్ జట్టులోకూడా వీరు ఉన్నారు. 1954 లో సికిందరాబాద్ ఎసోసియేషన్ ఎలివెన్‌జట్టు సభ్యునిగా స్టాఫర్డ్‌కప్పు పోటీలలోను, 1953 లో హైదరాబాద్ హంటర్స్‌టీము సభ్యునిగా నాగ్జీ అమీజి సోకర్ టోర్నమెంటులలోనూ పాల్గొని ఖ్యాతినొందారు. 1955 లో వెహికల్ డిపో జట్టులో సభ్యులుగా వుండి యమ్. యు. సి. గోల్డుకప్ (మద్రాసు) టోర్నమెంటు గెలుచుకొన్నారు. డ్యూరాండ్, డి. సి. యమ్. టోర్నమెంటులలోకూడా పాల్గొన్నారు.

1956 లో సంతోష్ ట్రోఫీ పోటీలలో పాల్గొన్నారు. తిరువాన్కూరు జట్టుకు శిక్షణ యిచ్చారు. ప్రస్తుతం వీరు అఫిషియల్ కోచ్. వీరు చాలా పొడగరి. వాలీబాల్ ఆటలోకూడా పేరొందారు.

శ్రీ ఎర్రయ్య :— జననం 1917. హైదరాబాద్ సిటీ పోలీస్ గోలీగా చాలాకాలం వున్నారు. 10 వ ఏటనే సోకర్

ఆటలో ప్రవేశం. 1938 లో హైదరాబాద్ కంబైన్డు ఎలివెన్ జట్టు సభ్యుడు. అప్పుడు ఐ. ఎఫ్. ఏ. షీల్డు పోటీలలో పాల్గొన్నారు. 1944 లో అంతర్రాష్ట్ర పోటీలలో హైదరాబాద్ ప్రతినిధి. 1953 వరకు హైదరాబాద్ సిటీపోలిస్ ప్రతినిధి. పెనాల్టీ కిక్కులను ఆపడంలో వీరు హైదరాబాదులోకెల్ల అద్వితీయుడు.

శ్రీ ఎస్. ఖ్వాజా అసీజుద్దీన్ (అజీజ్) :— 12 వ ఏట నుండి సోకర్ ఆట ప్రారంభించారు. వీరు లెఫ్టుబ్యాక్ గాను, రైటు బ్యాక్ గాను ఆడగలరు. 1949 నుంచి హైదరాబాద్ రాష్ట్ర సోకర్ జట్టు తరఫున నేషనల్ ఛాంపియన్ షిప్ పోటీలలో పాల్గొంటున్నారు. 1951 లో ఆఫ్ఘనిస్తాన్ లో పర్యటించిన ఇండియా జట్టు సభ్యుడు. ఇదే సంవత్సరంలో జరిగిన ఆసియా సోకర్ టోర్నమెంటులో పాల్గొన్న ఇండియా జట్టు సభ్యుడు. 1951 లో దూరప్రాచ్య దేశాలలో పర్యటించిన ఇండియా జట్టు సభ్యుడు. 1952 లో హెల్సింకీలో జరిగిన ఒలింపిక్స్ లో పాల్గొన్న ఇండియా జట్టు ప్రతినిధి. 1952, 53, 54 సంవత్సరాలలో జరిగిన ఆసియన్ క్వాడ్రాంగ్యులర్ సోకర్ టోర్నమెంటులలో పాల్గొన్న ఇండియా జట్టు ప్రతినిధి. 1955 లో వీరు ఇండియా జట్టు ప్రతినిధిగా రష్యాలో పర్యటించారు.

శ్రీ షేక్ అబ్దుల్ లతీఫ్ :— వయస్సు 23. రైట్ బ్యాక్ గాను, లెఫ్టుబ్యాక్ గాను ఆడగలరు. 12 వ ఏటనే ఫుట్ బాల్ ఆట ప్రారంభించారు. 1952 నుంచి నేటివరకు జాతీయ పోటీలలో హైదరాబాద్ ప్రతినిధి. 1954-55 లలో జరిగిన నాలుగు ఆసియా ఫుట్ బాల్ టోర్నమెంటులో పాల్గొన్న ఇండియా జట్టు ప్రతినిధి.

శ్రీ అహమ్మద్ హుస్సేన్ :— వయస్సు 24 సంవత్సరాలు. వీరు గోల్ కీపరుగాను, హాఫ్ బ్యాక్ గాను ఆడుతారు. 1952, 53, 54, 56 లలో జాతీయ పోటీలలో హైదరాబాద్ ప్రతినిధి. 1955 లో ఆఫ్ఘనిస్తాన్ లో పర్యటించిన ఇండియాజట్టు సభ్యుడు.

శ్రీ నూర్ మహమ్మద్ :— వయస్సు 29. గడిచిన పదమూడేండ్లనుంచి జాతీయ ఫుట్ బాల్ పోటీలలో హైదరాబాద్

ప్రతినిధి, వీరు 13వ ఏటనుంచే సోకర్ ఆట ఆడేవారు. లెఫ్ట్‌బ్యాక్‌గాను ఆడగలరు. దూరప్రాచ్య దేశాలలో పర్యటించిన ఇండియాజట్టు సభ్యులు (1951). హెల్సింకీ ఒలింపిక్స్‌లో పాల్గొన్న ఇండియాజట్టు సభ్యులు (1952). 1954లో రష్యాలో పర్యటించిన ఇండియాజట్టు సభ్యులు.

ముందు తెలిపిన నలుగురు, మెల్బోర్న్ ఒలింపిక్ పోటీలలో పాల్గొన్న ఇండియా సోకర్‌జట్టు సభ్యులుకూడా.

ఫుట్‌బాల్ ఆటలో ఈ క్రింది ప్రముఖులు హైదరాబాదులో ఖ్యాతిగడించి వున్నారు.

శ్రీయుతులు సీతారెడ్డి, ధనరాజ్, రామారావ్. వీరు 1956 లో ఉస్మానియా యూనివర్సిటీ జట్టు సభ్యులు. శ్రీ యుతులు రామస్వామి, ఇబ్రహీమ్ ఆలీ, అజీజ్, లతీఫ్, అజీం, నూర్‌అహామ్మద్, హుస్సేన్, కలీం, యూసఫ్‌ఖాన్, మోయిన్, యస్. హనుమంతరావు, నారాయణ్, కణ్ణన్, బలరామ్, జుల్ఫికర్, యూసఫ్. వీరు 1956లో సంతోష్ ట్రోఫీకి హైదరాబాద్ ప్రతినిధులు. శ్రీ మాధవరెడ్డి - 1956 లో రోవర్స్ కప్పు పోటీలలో పాల్గొన్న ఉస్మానియా యూనివర్సిటీ కెప్టన్.

శ్రీయుతులు సత్యనారాయణరెడ్డి, మన్సూర్, సయ్యద్‌ఫుల్లా ఖాన్, మహామ్మద్ షరీఫ్, జి. సముదాని, అబ్దుల్ రహీంఖాన్, మహామ్మద్, సాలే, దొరస్వామి, మహామ్మద్ అలీ, వహీద్ ఖాన్. వీరు గద్వాల్ రాయల్స్ (హైదరాబాద్) జట్టు సభ్యులు.

శ్రీయుతులు డి. నారాయణ, జె. పి. శంకరరావు, సి. హరి, జె. రామలింగం, యస్. వేణుగోపాల్, సామ్యూల్ వెస్లే, రియాజ్ అహామ్మద్, దేవదాస్, ఎమ్. వి. ఎల్లయ్య, బి. మల్లప్ప - వీరు సికింద్రాబాద్ సెంట్రల్ రైల్వే జట్టు సభ్యులు.

శ్రీయుతులు జి. యమ్. మోహన్, సర్దార్‌ఖాన్, ఫోర్వెన్, ఇమామ్, రాజేశ్వరరావు, కాంతిరాజ్, నయిమ్, లక్ష్మారెడ్డి, కరీం, శఫియాజ్, ఉమర్ - హైదరాబాద్ గ్రాస్ హోపర్స్ జట్టు సభ్యులు.

మెల్బోర్న్లో ఒలింపిక్ పోటీలలో ఇండియాజట్టు సభ్యుల పేర్లను దిగువ తెల్పుతున్నాను :—

శ్రీయుతులు పి. తంగరాజ్ (సర్వీసెస్ గోలుకీపర్), శంకర్ నారాయణ్ (బొంబాయి, గోలుకీపర్), అబ్దుల్ రహమాన్ (బెంగాలు, బ్యాక్), యస్. ఖ్వాజా అసీజుద్దీన్ (హైదరాబాద్), షేక్ అబ్దుల్ లతీఫ్ (హైదరాబాద్), యం. కెంపయ్య (బెంగాలు), మహమ్మద్ అబ్దుల్ సలాం (బెంగాలు), నిఖిల్ కుమార్‌నందా (బెంగాలు), అహమ్మద్ హుస్సేన్ (హైదరాబాద్), నూర్ మహమ్మద్ (హైదరాబాదు), ప్రదీప్‌కుమార్ బెనర్జి (బెంగాలు), సమీర్ బెనర్జి (బెంగాలు, కెప్టెన్), కృష్ణచంద్రపాల్ (బెంగాలు), కృష్ణస్వామి కిట్టు (బెంగాలు), యం. కన్నయన్ (బెంగాలు), నెవిలి స్టీవిన్ జోసఫ్ డీసౌజా (బొంబాయి) బలరామ్ (హైదరాబాద్).

శ్రీ సమీర్ బెనర్జి :—(బెంగాలు) వయస్సు 23 సంవత్సరాలు. 9 ఏటనుండి సోకర్ ఆట ప్రారంభించారు. వీరు ఇన్ సైడ్ రైట్‌గాను, సెంటర్ ఫార్వర్డ్‌గాను ఆడగలరు. 1953-56 వరకు జాతీయ పోటీలలో బెంగాలుజట్టు సభ్యులు. 1954 లో జరిగిన ఆసియన్ రాజ్యాల టోర్నమెంటులో పాల్గొన్న ఇండియాజట్టు ప్రతినిధి. మెల్బోరన్ పోటీలలో ఇండియాజట్టు సారథి.

శ్రీ సైలన్ మన్నా :— (బెంగాలు) జననం 1924. హజారాజిల్లాలోని బెటూర్. రక్షణశ్రేణి ఆటగాళ్ళలో వీరిని మించిన వారు ఇండియాలో అరుదు. తనగోలునుంచి ఎదుటిగోలు సమీపానికి బంతిని తన్నగల బలశాలి, నేర్పరి. విదేశాలలో పర్యటించిన ఇండియా జట్ల నాయకులు. రెండవ ఆసియాగేమ్సు పోటీలలో ఇండియాజట్టు సారథి. వీరి నాయకత్వంలో బెంగాలు చాలాసార్లు సంతోష్ ట్రోఫీని గెలుచుకొన్నది.

(శ్రీ) సంజీవ :— (బొంబాయి) వాలీబాలు ఆటగానినిమించి ఎత్తు ఎగిరి స్ప్రింగ్ యాక్షనుతో బంతిని అడ్డగించే గోలుకీపర్ శ్రీ సంజీవ. పొడగరి కాకపోయిన ఏ కోణంలో వచ్చేబంతినైనా ఇట్టేగమనించి లంఘించి ఆపగల శక్తిమంతుడు. 1936 లో సోకర్ ప్రారంభించారు. కర్ణాటక్ స్పోర్టింగ్ అసోసియేషన్ జట్టులో ఐదేండ్లపాటు ఆడారు. 1942 లో వెస్టరన్ ఇండియా ఎథ్లెటిక్ ఎసోసియేషన్ జట్టు సభ్యులు. 1945 నుండి 49 వరకు బొంబాయిరాష్ట్ర జట్టు సభ్యుడు. 1948 లో ఒలింపిక్స్‌లో ఇండియాజట్టు సభ్యులు. 1949 లో ఆఫ్ఘనిస్తాన్ సింగపూర్, మలయాలలో పర్యటించారు. 1954 లో ఈయన నాయకత్వానగల బొంబాయి సోకర్ జట్టు సంతోష్ ట్రోఫీని గెలుచుకొన్నది. దాదాపు 33 సంవత్సరాల వయస్సుగల శ్రీ సంజీవ జన్మస్థలం మంగుళూరు.

శ్రీయుతులు వెంకటేష్, మేవాలాల్, అహమ్మద్‌ఖాన్, చందన్‌సింగ్, (బెంగాలు), పురాణ్‌బహుద్దూర్, (సర్వీసెస్) ప్రభుతులు కూడా ఫుట్‌బాల్ ఆటలో విశేషఖ్యాతి గడించివున్నారు.

(శ్రీ) ఇగార్ నెట్టో (రష్యా) :— వయసు 27. 1954-55 లో ఇండియాలో పర్యటించిన రష్యా సోకర్ జట్టు నాయకుడు. కాలేజీ విద్యార్థిగా వున్నప్పటినుంచి దాదాపు 12 సంవత్సరాలుగా సోకర్ ఆడుతున్నారు. వీరు వింగ్ హాఫ్. "ఆనర్డ్ మాష్టర్ ఆఫ్ స్పోర్ట్సు" బిరుదు సాధించివున్నారు. మాస్కో స్పార్టాక్సు జట్టు సభ్యునిగా ఇంగ్లండులో పర్యటించివున్నారు.



శ్రీ స్టాన్లీ మాత్యూస్ (బ్రిటన్) :— బాల్యదశలోనే సోకర్ ఆటలో అభిరుచి గలిగిన ఈఆట గాడు తన జీవితంలో మొత్తం 77 సార్లు ఇంగ్లండు జట్టు సభ్యునిగా పోటీచేసి వున్నారు. 15వ ఏట స్టోక్ సిటీ జట్టు సభ్యుడు. 19వ ఏట - 1934 లో మొట్టమొదటిసారి ఇంగ్లండు జట్టులో స్థానం సంపాదించారు. ఇంగ్లండు, ఇటలీ పోటీలలో పాల్గొన్నారు. "మిస్టర్ ఫుట్‌బాల్", "పీటర్



ప్యాన్ ఆఫ్ సోకర్", "విజార్డ్ ఆఫ్ ది డ్రిబుల్" గా పేరొందారు. ప్రొఫెషనల్‌గా మారిన పిమ్మట ఈ ఫార్వర్డుకున్న ప్రాధాన్యం బ్రిటన్‌లో మరెవ్వరికి లేకపోయినది. దక్షిణాఫ్రికాలో ఒక్క పోటీలో పాల్గొంటే పదివేల రూపాయలు ఇవ్వడానికి ఒక టోర్నమెంటు నిర్వాహకులు సిద్ధపడ్డారు. 20వ శతాబ్దంలో వీరిని మించిన సోకర్ ఆటగాడు మరొకడు లేడని లండన్‌లోని నేషనల్ స్పోర్టింగ్ క్లబ్ నిర్ణయించి వీరిని ఘనంగా సన్మానించింది.

1946 లో ఈరైట్ వింగర్ అగ్ర ఆటగాడుగా ("ప్లేయర్ ఆఫ్ ది ఇయర్") నిర్ణయించబడి సత్కరించబడినారు. ఎదుటి ఆటగానికి తానొక మార్గంలో వెళ్లుతున్నట్లు సూచించి వేరొక మార్గంలో దూసుకు పోయి గోలులు కొట్టడంలో వీరు అద్వితీయులు.

శ్రీ ఫెరన్స్‌పుస్కాస్ (హంగేరి) :— జననం 1926 బుడాపెస్టులో. బాల్యంలోనే ఫుట్‌బాల్ ఆట ప్రారంభించారు. కిస్‌పెస్ట్ అథ్లెటిక్‌క్లబ్ శిక్షకుడు. శ్రీ నాన్‌డోర్ హ్యూక్స్‌వద్ద శిక్షణ పొందారు. 1945 లో తొలిసారి అంతర్జాతీయ పోటీలో పాల్గొని వున్నారు. అప్పుడు ఆస్ట్రియాతో పోటీచేసిన హంగరీ సోకర్ జట్టు

సభ్యులు. 1952 లో హెల్సింకి ఒలింపిక్ సాకర్ ఛాంపియన్ షిప్‌ను హాంగరీ గెలుచుకోవడానికి వీరే ప్రధాన కారకులు.

జాతీయ ఛాంపియన్ల వివరం :

1941 : బెంగాలు, 1942 - 43 పోటీ జరుగలేదు; 1944 : ఢిల్లీ; 1945 : బెంగాలు; 1946 : మైసూరు; 1947 : బెంగాలు; 1948 ఒలింపిక్ సంవత్సరం - పోటీ జరుగలేదు; 1949 : బెంగాలు; 1950 : బెంగాలు; 1951 : బెంగాలు; 1952 : మైసూరు; 1953 : బెంగాలు; 1954 : బొంబాయి; 1955 : సర్వీసెస్; 1956 : హైదరాబాద్.

# అధ్యాయము 15

# వాలీబాల్

అలనాడు వాలీబాల్ ఆట చేతితో ఆడే టెన్నిస్ వంటిది. చాలాకాలం క్రిందట చేతితో టెన్నిస్ ఆడినట్లు తేలిక ఫుట్‌బాల్‌తో ఒక ఎత్తు నెట్టుపై వాలీబాల్ ఆడేవారు. జట్టుకు పదేనిమంది కూడా వుండేవారు.

వాలీబాల్ పుట్టుక అమెరికాలో. 1895 లో వ్యాయామ శాలలలో (జిమ్నాషియమ్) ఈ ఆట ఆడేవారు. వై. యం. సి. ఏ. వారు యూరప్‌లో వాలీబాల్ ఆటను ప్రచారం చేశారు. ఫ్రాన్సు, ఇటలీ, చెకోస్లోవాకియా, పోలెండులలో ఈ ఆట చాలాకాలంనుంచి ప్రచారంలో వున్నది. తరువాత బ్రిటన్‌లో వాలీబాల్ ప్రవేశ పెట్టబడింది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలోనే ఈ ఆట బ్రిటన్‌లో ప్రచారంలోనికి వచ్చినట్లు తెలుస్తున్నది.



సోవియట్ రష్యాకూడా వాలీబాల్ ఆటలో ప్రపంచంలో కెల్ల ప్రముఖస్థానం వహిస్తున్నది. నాలుగేండ్ల కొకసారి ప్రపంచ వాలీబాల్ ఛాంపియన్‌షిప్ పోటీలు జరుపబడుతున్నవి. 1952 లో మాస్కోలో జరిగిన ప్రపంచ పోటీలలో రష్యా ప్రథమస్థానం వహించింది. ఈ పోటీలలో పాల్గొన్న ఇండియాజట్టుకు శ్రీ సోమనాథ్ నాయకత్వం వహించారు. శ్రీ హెచ్. పి. కోహిలి శిక్షకుడు.

1956 ఆగస్టు, సెప్టెంబరులలో పారిస్‌లో మూడవ ప్రపంచ వాలీబాల్ ఛాంపియన్ షిప్ పోటీలు జరిగినవి. రష్యా తిరిగి ఛాంపియన్

షిప్‌ను గెలుచుకొన్నది. శ్రీ కుల్దీప్ ఛోప్రా (ఢిల్లీ) నాయకత్వాన ఇండియా జట్టు ఒకటి ఈ పోటీలలో పాల్గొన్నది. ఇండియా తన గ్రూప్‌లో మొత్తం ఐదు మ్యాచీలలో పాల్గొని మూడింటిని గెలుచుకొన్నది. తన గ్రూపులో ప్రథమస్థానం వహించింది.

ఇండియా పాల్గొన్న పోటీల ఫలితా లివి:— పశ్చిమ జర్మనీపై విజయం: 15—0, 15—2, 15—5 పాయింట్లు; లగ్జెంబర్గ్ పై గెలుపు: 15—2, 15—3, 15—2; టర్కీపై విజయం: 15—6, 15—6, 15—6; బ్రాజిల్ చే ఓటమి: 15—6, 6—15, 4—15, 15—11, 4—15; చైనాచే పరాజయం: 5—15, 9—15, 15—10, 7—15.

భారతీయ ఆటగాళ్ళు అటు స్పైకింగ్ గాని ఇటు లిఫ్టింగ్ గాని ఏదో ఒక్కటి మాత్రం, లేదా ఆటలోని కొద్ది శాఖలలో మాత్రమే ప్రావీణ్యం గడించి వున్నందున విజయ పరంపర చేబట్టలేకపోయారు. రష్యా అనుసరిస్తున్న కొత్త టెక్నిక్‌ను ఇండియా ఎంత చప్పున అవలంబిస్తే అంత మంచిది. రష్యాలో ప్రతి వాలీబాల్ ఆటగానికి ఆటలోని అన్ని శాఖలలోనూ తీవ్ర శిక్షణ నిస్తారు. రష్యన్ ఆటగాళ్ళు సర్వతోముఖ ప్రతిభాశాలురు.

ఇండియా జట్టులో స్పైకింగ్‌లో శ్రీ ఛోప్రా, బూస్టింగ్‌లో శ్రీ మోహన్ సింగ్ (ఢిల్లీ) నేర్పుగా ఆడినారు. తరువాత చెప్పదగిన వారు శంకర్ నారాయణ్ (మైసూర్), రిషి, (ఢిల్లీ), దీనానాథ్ తివా (యు. పి.) గార్లు. ఇండియా జట్టులో ఇంకా క్రింది సభ్యులు కలరు: శ్రీయుతులు సత్ గురుదయాళ్ (పంజాబ్) అవినాష్ చంద్రా (పంజాబ్) సర్దారీలాల్ (పంజాబ్) అలోక్ చంద్రా (బెంగాలు), బుర్హాన్ (సర్వీసెస్), నాయర్ (సర్వీసెస్), అధికారన్ (మద్రాసు), అమర్జిత్ సింగ్ (పెప్సూ).

1955 లో ప్రథమ ఆసియా వాలీబాల్ ఛాంపియన్‌షిప్ పోటీలు జరిగినవి. అంతిమ పోటీలలో జపానును ఇండియా ఓడించి ఆసియాబిరుదు సాధించింది. ఇండియా జట్టులో క్రింది ఆటగాళ్ళు కలరు: శ్రీయుతులు జె. ఎస్. బావా, కులదీప్ ఛోప్రా; జోగీంద్రసింగ్ (యు. పి.),

హెర్నాక్ సింగ్, దిలీప్ మండల్, తిలక్‌రాజ్, మోహన్‌లా సింగా, అవినాష్ చంద్రా, సత్‌గురుదయాళ్.

ఇండియాలో వాలీబాల్ ఆట క్రమప్రచారం క్రమాభివృద్ధి 1951 లో ప్రారంభమైనది. 1952 లో ఇండియా వాలీబాల్ ఫెడరేషన్ తొలిసారి జాతీయ వాలీబాల్ ఛాంపియన్‌షిప్ పోటీలను నిర్వహించింది. మద్రాసులో జరిగిన ఈ టోర్నమెంటులో మైసూరు, పాటియాలాను 15 - 13, 15 - 7, 16 - 14 పాయింట్లతో ఓడించింది. 1953 నుంచి స్త్రీల వాలీబాల్ ఛాంపియన్‌షిప్ పోటీలు జరుగుతున్నవి. మొదటి టోర్నమెంటులో యు. పి. ఢిల్లీని ఓడించి బిరుదు సాధించింది.

జాతీయ ఛాంపియన్‌ల వివరం :— 1952 - మైసూరు; 1953 - ఢిల్లీ (పురుషులు), యు. పి. (స్త్రీలు) ; 1954 - పంజాబు (పురుషులు), యు. పి. (స్త్రీలు); 1955 - పంజాబు (పురుషులు), యు. పి. (స్త్రీలు), 1956 - 57 సర్వీసెస్ (పురుషులు).

1955 లో కీవ్ స్పార్టాక్ అనే రష్యన్ వాలీబాల్ జట్టు ఇండియాలో పర్యటించింది. ఈ జట్టుకు, ఇండియా జట్టుకు మొత్తం 3 టెస్టుపోటీలు జరిగినవి. ఇండియా రెండు టెస్టులలో గెలుపొంది, అంతిమవిజయాన్ని (రబ్బర్) సాధించింది. మొదటి టెస్టులో భారతీయ బృందానికి శ్రీ తిలక్‌రాజ్, రెండవ టెస్టుకు శ్రీ సులేమాన్, మూడవ టెస్టుకు గురుదేవ్‌సింగ్ నాయకత్వంవహించారు. ఈ పరంపరలో గురుదేవ్ సింగ్, సత్‌గురుదయాళ్ అత్యద్భుతమైన ప్రజ్ఞను ప్రదర్శించారు.

1955 నవంబరులో చైనాలో ఇండియా వాలీబాల్ జట్టు ఒకటి పర్యటించింది. ఈ జట్టులో శ్రీ సి. హెచ్. బుచ్చిరామయ్య (ఆంధ్ర), శ్రీ ఖలీద్ (హైదరాబాద్) గారలు కలరు. మొత్తం పది పోటీలలో ఇండియా నాలింటిని గెలుచుకొన్నది. ఐదింటిలో ఓడిపోయింది. ఒక పోటీ ఫలితం నిర్ణయం కాలేదు. చైనాలో పర్యటించిన ఇండియా జట్టులో ఇంకా క్రింది ప్రముఖులు కలరు : శ్రీయుతులు కులదీప్ చోప్రా (ఢిల్లీ), గురుదేవ్‌సింగ్ (ఢిల్లీ), సుర్జిత్‌సింగ్ (పెప్సూ), నోయిక్‌రాజ్ (కొచ్చిన్-తిరువాన్కూర్), అరుణాచలం (మద్రాసు), ఎ. ఘోష్

(పశ్చిమబెంగాలు), సి. భల్లావాలా (గుజరాత్), విద్యాసాగర్ (పంజాబ్), సర్దారీలాల్ (పంజాబ్), ఓంప్రకాష్ (ఢిల్లీ) గారలు.

ఆంధ్రరాష్ట్రావతరణ పిమ్మట శ్రీ టి. రత్తయ్య, శ్రీ కె. శివ ప్రసాద్ ప్రభృతుల కృషిపై ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ సంఘం ఏర్పడింది. అప్పటినుంచి జాతీయ పోటీలలో ఆంధ్రరాష్ట్ర ప్రతినిధులు పాల్గొంటున్నారు.

1938-39 ప్రాంతాలలో వాలీబాల్ ఆంధ్రరాష్ట్రంలో బాగా ప్రచారంలోనికి రావడం ప్రారంభమైనది. అయితే అప్పటికి అంతర్జాతీయ నియమములను పాటించడమంటూ లేదు. 1939 లో శ్రీ శ్యామరాక్ అనే ప్రముఖ లంక ఆటగాడు గుంటూరువచ్చి వాలీబాల్ పోటీలలో పాల్గొన్నారు. ఆయన అప్పటి ఆటగాళ్లకు ఆధునిక పద్ధతులు బోధించి వారి ప్రావీణ్యాన్ని పెంపొందించారు. ఆయనవద్ద శిక్షణపొందిన శ్రీ గౌస్ మహమ్మద్ వాలీబాల్ ఆటను శాస్త్రీయపద్ధతిలో ప్రచారం చేస్తూ వచ్చారు. ఇట్టి కృషిచేసిన వారిలో శ్రీ యం. శ్రీరాములుగారు కూడా ముఖ్యులు.

1956 డిశంబరులో అలహాబాదులో జరిగిన జాతీయ వాలీబాల్ ఛాంపియన్‌షిప్ పోటీలలో శ్రీ చేకూరి బుచ్చిరామయ్యగారి నాయకత్వాన ఆంధ్రరాష్ట్రజట్టు పాల్గొన్నది. ఈ జట్టులో ఇంకా క్రింది ఆటగాళ్లు కలరు: శ్రీయుతులు ఎమ్. ఆంజనేయులు, వి. శీతారామయ్య, పి. వి. రమణరావు, సి హెచ్. బలరామ్‌దాసు, టి. వెంకటేశ్వర్లు, పి. శౌరయ్య, పి. యూసఫ్‌ఖాన్, సి. ఆదివిష్ణు, అడివిరెడ్డి, వెంకటేశ్వర్లు, ఎమ్. వెంకటేశ్వరరావు.

అలహాబాద్ జాతీయ పోటీలలో హైదరాబాద్‌జట్టు తరఫున క్రింది ఆటగాళ్లు పాల్గొన్నారు:—

శ్రీయుతులు ఆర్. యన్. ఎల్లారావ్ (కెప్టెన్), యన్. యం. గద్రీ (వైస్ కెప్టెన్), వెంకట్రామిరెడ్డి, దయాకర్‌రెడ్డి, కృష్ణ, ఖలీద్, ఖలీల్, బలరామ్, సదిక్ యాసిన్, నందన్‌సింగ్, షబ్బీర్.

ఆంధ్రులకు వాలీబాల్ ఆటకు అవసరమైన శరీర నిర్మాణం వున్నది. వారి శక్తి యుక్తులను ఒక విదేశ శిక్షకుడు సరియైన మార్గంలో పెట్ట గలిగితే ఆంధ్ర అనతికాలంలోనే జాతీయ ఛాంపియన్‌షిప్‌ను గెలుచు కొనగలదు.

భారత వాలీబాల్ సంస్థ అంతర్జాతీయ వాలీబాల్ పోటీలకు ఇండియా జట్లను పంపుతూ యువ ఆటగాళ్ళను ప్రోత్సహిస్తూ ఉండడం హర్షణీయం.

ఇటీవలి వాలీబాల్ ఆటగాళ్ళలో యింకా వెంకటేష్, ఛడ్డా (ఢిల్లీ), సత్‌ప్రకాష్, అమర్‌చంద్, జయగోపాల్, మాదస్వామి, సులేమాన్, యస్. ఛటర్జీ అంతర్జాతీయ ఖ్యాతి గడించారు.

వాలీబాల్ ఆటలో యింకా చెకోస్లొవాకియా, బల్గేరియా, రుమేనియా, అమెరికా, హంగరీ, ఫ్రాన్సు, పోలెండు, లెబనాన్, ఇజ్రాయల్, ఫిన్లెండ్ ప్రపంచంలో ప్రముఖస్థానం వహిస్తున్నవి.

## ఆటగాళ్ళ పరిచయం

శ్రీ గౌస్ మహమ్మద్ :— జననం 1922. వీరు గుంటూరు హిందూకాలేజి హైస్కూలు విద్యార్థిగా వుంటూ 1939 వరకూ



హైస్కూలు హాకీ జట్టులోనూ, డాక్టరు సి. రామదాసుగారి నాయకత్వమున వున్న గుంటూరు టవున్ హాకీ క్లబ్ టీము లోనూ ప్రముఖస్థానం వహించారు. ఆంధ్రరాష్ట్రములో జరిగిన అనేక పోటీలలో పాల్గొన్నారు. ఆ రోజులలోనే ఆంధ్రలో వాలీబాల్ క్రమంగా ప్రచారమౌతున్నది. అప్పుడు బంతిని రెండుచేతుల వ్రేళ్ళతో బిగించిన పిడికిలితో కొట్టుతూ వుండేవారు. ఆ కాలంలోనే సింహళ ఆటగాడయిన శ్రీ శ్యాము రాక్ గుంటూరు వచ్చి వాలీబాల్ ఆటకు మెరుగులు దిద్దారు. చాలా మందికి ఆటలో ఆసక్తి కలిగించారుకూడా. ఆటలో ఈపరకే ప్రవేశం

వున్న వారికి నవ్యరీతులలో తర్ఫీదును ఇచ్చారు. శ్రీ శ్యామరాక్, అప్పటికే పేరు గడించివున్న శ్రీ యమ్. శ్రీరాములుగార్ల ప్రోత్సాహముతో శ్రీ గౌస్ రెండు సంవత్సరములలో వాలీబాల్ ఆటలో ప్రావీణ్యం గడించారు. వీరు హాకీ జట్టులో సభ్యునిగా రాజమండ్రి పోటీలకు వెళ్ళగా అచ్చట శ్రీ శ్యామరాక్ వాలీబాల్ జట్టులో ఒక ఆటగాడు తక్కువయినందున శ్రీ గౌస్‌గారికి స్థానము ఇచ్చినారు. ఆ సంవత్సరము వారి జట్టులో బాగా ఆడి ప్రజల మన్ననలు పొందారు. 1939 నుండి గుంటూరు హిందూకాలేజి హైస్కూలు వాలీబాల్ జట్టుకు నాయకత్వం వహించి వరుసగా ఆరు సంవత్సరములు కప్పును గెలుచుకొన్నారు. తర్వాత గుంటూరు టవున్ వాలీబాల్ టీములో ప్రముఖ ఆటగాడుగా, ఆంధ్రరాష్ట్రంలో అనేక పోటీలలో పాల్గొని విజయము సాధిస్తూ ఉమ్మడి చెన్నరాష్ట్ర ఒలింపిక్ ఆటలలో అనేక సంవత్సరములు పాల్గొని నారు. 1946 లో వాలీబాల్, హాకీ ఆటలనుండి విరమించారు. అప్పటి నుంచి రిఫరీగా వాలీబాల్ ఆట క్రమాభివృద్ధికి సేవచేస్తున్నారు.

శ్రీ వడ్లమూడి సీతారామయ్య :— జననం 1924 - గుంటూరులో. గుంటూరు హిందూ కాలేజీ హైస్కూలులో చదువు



చున్నప్పుడు బాడ్‌మింటన్, వాలీబాల్ ఆటలు ప్రారంభించారు. హైస్కూలు బాడ్‌మింటన్ జట్టు నాయకులు. 1939 లో పెద్ద వాలీ బాల్ పోటీలలో పాల్గొని ప్రత్యేక బహుమతులు పొందివున్నారు. 1944 లో కోయంబత్తూరులో జరిగిన వాలీబాల్ పోటీలలోను, 1945, 46 లలో మద్రాసు ఒలింపిక్ పోటీలలోను పాల్గొన్నారు. 1949 లో ఆంధ్రా ఎమెచూర్ ఎథ్లెటిక్స్ ఎసోసియేషన్ (గుంటూరు) వాలీబాల్ జట్టులో సభ్యులుగా వుండి మద్రాసులో జరిగిన ఒలింపిక్ పోటీలలో పాల్గొని ఫైనల్సులో ఓడిపోయినారు. 1949లో ఆంధ్రా ఎమెచూర్ ఎథ్లెటిక్స్ ఎసోసియేషన్ వాలీబాల్ జట్టు సభ్యులుగా వుండి, నెల్లూరులో జరిగిన అఖిలభారత వాలీబాల్ పోటీలలో పాల్గొని విజయ్యాగా[illegible]

గుంటూరు మండలంలో వాలీబాల్ ఆటలో ప్రావీణ్యాభివృద్ధికి కూడా వీరు పాటుపడ్డారు. శ్రీ బుచ్చిరామయ్యవంటి ఆటగాళ్ళకు తర్ఫీదు యిచ్చివున్నారు. ఆంధ్ర, మద్రాసు, హైదరాబాద్ ప్రాంతాలలో జరిగిన పెద్ద వాలీబాల్ టోర్నమెంటులలో వీరి ఆధ్వర్యాన ఆంధ్ర ఎమెచూర్ ఎథ్లెట్సు అసోసియేషన్ జట్టు పాల్గొన్నది. వీరు అనేక ప్రత్యేకమైన బహుమతులు పొందారు. ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ జటులో కూడా ప్రముఖస్థానం వహించారు.

శ్రీ చేకూరి బుచ్చిరామయ్య :— జననం 1930 అమృతలూరు (తెనాలి తాలూకా). హైస్కూలులో చదువుచుండగనే కిందుగుంట ఎథ్లెటిక్ ఛాంపియన్ షిప్‌ను సంపాదించారు. వీరు నాలుగు సంవత్సరములు గుంటూరు హిందూకాలేజి వాలీబాల్ జట్టులో ప్రముఖస్థానం వహించి, మద్రాసు లయోలా కాలేజీ పోటీలలోనూ, అంతర్ కళాశాలల పోటీలలోనూ విజయము గాంచారు. వీరు కాలేజీ వాలీబాల్ జట్టులో నేగాక బాస్కెట్‌బాల్, కబాడీ, టెన్నిస్, క్రికెట్, బాడ్‌మింటన్ జట్లలో కూడా స్థానం వహించారు. వీరు ఆంధ్ర దేశములో జరిగిన అనేక వాలిబాల్, కబాడీ పోటీలలో పాల్గొని అనేకసార్లు విజయములు గాంచారు. 1953 లో వరంగల్లులో జరిగిన అఖిలభారత రషీద్ మెమోరియల్ వాలీబాల్, బాస్కెట్‌బాల్ పోటీలలో కూడాపాల్గొన్నారు. గుంటూరు ఆంధ్రా ఎమచూర్ ఎథ్లెట్స్ ఎసోసియేషన్ జట్టు సభ్యునిగా మద్రాసు ఒలింపిక్స్‌లో పాల్గొన్నారు. 1954 లో హిందూకాలేజీ వాలీబాల్ జట్టుకు నాయకత్వం వహించి మద్రాసు లయోలా, ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ పోటీలలో ఘనవిజయము గాంచి ప్రజల మన్ననలు పొందారు. అదే సంవత్సరము ఆంధ్ర విశ్వవిద్యాలయ వాలీబాల్ జట్టుకు నాయకత్వం వహించి బెంగుళూరులో జరిగిన దక్షిణమండల అంతర్ విశ్వవిద్యాలయ పోటీలలో పాల్గొన్నారు.



ఆంధ్ర విశ్వవిద్యాలయ కబాడీ జట్టుకుకూడా ఎన్నికయినారు. వీరి వాలీబాల్ ఆటను మైసూరు దినపత్రికలు ప్రశంసించి, వీరిని "స్మాష్ మాష్టర్" అని పొగిడినవి. వీరు ఆ సంవత్సరం ఆంధ్రరాష్ట్ర వాలీ బాల్ జట్టు సభ్యులుకూడా.

రష్యా వాలీబాల్ టీము హిందూదేశములో పర్యటించుటకు రాగా, వారితో మద్రాసులో పోటీచేసిన భారతీయజట్టు సభ్యులు. 1955 లో చైనాలో పర్యటించిన అఖిలభారత వాలీబాల్ టీమ్‌సభ్యులు. 1956 జనవరిలో జరిగిన ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ పోటీలలో గుంటూరు ఎమెచూర్ ఎత్లెట్స్ ఎసోసియేషన్ జట్టుకు నాయకత్వం వహించి అంతిమవిజయం చేబట్టారు. 1956 లో ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ జట్టు నాయకుడు. మద్రాసులో రష్యను ప్రముఖునివద్ద వాలీబాల్ క్రీడలో ఉన్నతశిక్షణ పొందారు. ట్రాక్ అండ్ ఫీల్డు పోటీలలోకూడా ప్రథమ స్థానం వహించియున్నారు.

శ్రీ చెరుకూరి చలమయ్య :— జననం 1929 కృష్ణా జిల్లాలో. 1946 లో గుంటూరు హిందూకళాశాలలో చేరారు. 4, 5 సంవత్సరములు హిందూకళాశాల వాలీబాల్ జట్టుకు నాయకత్వం వహించారు. వీరు వాలీబాల్‌లోనే గాక కబాడి, బాస్కెట్ బాల్ ట్రాక్ అండ్ ఫీల్డులలోకూడా నేర్పరులు. వీరి నాయకత్వములోవున్న హిందూ కాలేజి వాలీబాల్ జట్టు మద్రాసు లయోలాకాలేజీ వాలీబాల్ పోటీలలోనూ,



ఆంధ్రవిశ్వవిద్యాలయం అంతర్‌కళాశాల పోటీలలోనూ అపజయము అనునది ఎరుగదు. 1949 లో మద్రాసు ఒలింపిక్స్‌లో వాలీబాల్ పోటీలకు గుంటూరు ఎమెచూర్ ఎత్లెట్స్ జట్టుకు నాయకత్వం వహించి చివరి ఘట్టములో ఓడిపోయినారు. అఖిలభారత వాలీబాల్ జట్టులో ఎన్నికయినారు. ఈ ఘనతపొందిన ప్రథమ ఆంధ్రులు వీరే. శ్రీ చలమయ్య ఆటస్థలములో నిలబడితేచాలు ఎదుటివారి గుండెలు

పగులునట్లు వుండెడిది. వీరు చాలా పొడగరి. గొప్ప హిట్టర్. నెల్లూరులో ఒక పెద్ద వాలీబాల్ టోర్నమెంటులో పిన్నలను నాయకత్వం వహించి ఆ రోజులలో గొప్పపేరు సంపాదించివున్న శ్రీ ధర్మరాజు జట్టును ఓడించివేశారు. 1954 లో ఆంధ్ర వాలీబాల్ జట్టు నాయకులు. వీరు ఆంధ్ర, మద్రాసు, హైదరాబాద్, తిరుకొచ్చి మొదలగు రాష్ట్రములలో పెద్ద వాలీబాల్ టోర్నమెంటులలో పాల్గొని దాదాపు ప్రతి సందర్భము లోను ఘనవిజయం సాధించారు. 1956 లో ఆంధ్రరాష్ట్ర జట్టుకు ఎన్నికయినారు.

శ్రీ కోసరాజు వెంకయ్య :— జననం 1925 జులై. తెనాలి సమీపంలోని తురుమెళ్ళ గ్రామంలో. హైస్కూలు విద్యార్థిగ



నున్నప్పుడే ఆటలలో ఆసక్తి చూపు తుండెడివారు. ఆటలలో కెల్ల వాలీ బాల్ లో ఎక్కువ ప్రావీణ్యం గడించారు. చాలా సంవత్సరములు స్కూలు వాలీబాల్ జట్టుకు నాయకత్వం వహించి జిల్లా ఆటల పోటీలలో పాల్గొన్నారు. విద్యానంతరం వీరు బెంగుళూరు హిందూస్తాన్ ఎయిర్ క్రాఫ్ట్ ఫ్యాక్టరీలో చేరి, ఫ్యాక్టరీ వాలీబాల్ జట్టుకు ఎన్నికయినారు. బెంగుళూర్ ఎయిర్ క్రాఫ్ట్ జట్టు సభ్యునిగా 1945 లో బెంగు ళూరులో ఒలింపిక్ పోటీలలో పాల్గొనినారు. తర్వాత 1950-51 లో మద్రాసు వై. యమ్. సి. ఏ. కాలేజీలో విద్యార్జన నిమిత్తం చేరినారు. కాలేజీ జట్టు తరపున మద్రాసులో జరిగిన లయోలా కాలేజి టోర్నమెంట్సు లోనూ, మద్రాసురాష్ట్ర ఒలింపిక్స్‌లోనూ పాల్గొన్నారు. విద్యానంతరం తురుమెళ్ళ బోర్డు హైస్కూలులో వ్యాయామ శిక్షకులుగా ప్రవేశిం చారు. 1953లో గుంటూరు ఎమచూర్ ఎత్లెట్స్ ఎసోసియేషన్ జట్టు సభ్యునిగా, వరంగల్లులో జరిగిన ఆలిండియా రషీద్ మెమోరియల్ వాలీబాల్ పోటీలలో పాల్గొన్నారు.

1954 లో ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ జట్టు నాయకులు, 1955 లో ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ జట్టు సభ్యులు. వీరు ఆంధ్ర ప్రభుత్వముచే ఎన్నికయి 1956 జూలైలో బెంగుళూరులో కేంద్ర ప్రభుత్వంచే నిర్వహించబడిన వాలీబాల్ శిక్షణ కేంద్రంలో ఉన్నత శిక్షణ పొందారు. ఆంధ్రరాష్ట్రంలోని ఆటగాళ్ళకు శిక్షణ ఇచ్చుటకు ఇందుమూలముగా అర్హత పొందారు. ఆంధ్ర యువ ఆటగాళ్ళు వీరి సహాయం ఎంతో పొందవలసివున్న తరుణంలోనే మృత్యుదేవత వీరిని దూరంచేసింది. 1957 లో ఫ్లూ వ్యాధికి గురై పరమపదించారు.

శ్రీ చెరుకూరి బలరాం :— జననం 1931, కృష్ణాజిల్లా ప్రాటుకూరు గ్రామంలో. 1948 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం అంతర్కళాశాల వాలీబాల్ పోటీలను గెలుచుకొన్న గుంటూరు హిందూ కాలేజి జట్టు సభ్యులు. 1949-50 మద్రాసు ఒలింపిక్స్ వాలీబాల్ పోటీలలో పాల్గొన్న ఆంధ్రా ఎమెచూర్ ఎథ్లెటిక్స్ ఎసోసియేషన్ (గుంటూరు) జట్టు సభ్యులు. ఈ జట్టు ద్వితీయస్థానం వహించింది. అదే సంవత్సరములో హిందూ కాలేజి వాలీబాల్ జట్టు నాయకులు. శ్రీ బుచ్చిరామయ్య, చలమయ్య ప్రభృతులు కల జట్టుకు నాయకత్వం వహించి మద్రాసు లయోలా కాలేజీ వాలీబాల్ పోటీలలో పాల్గొని ఛాంపియన్ షిప్‌ను సాధించారు. తరువాత అంతర్ కళాశాల, అంతర్విశ్వవిద్యాలయాల పోటీలలో కూడా పాల్గొని విజయాలు సాధించారు.

1953 లో వరంగల్లులో జరిగిన ఆలిండియా రషీద్ మెమోరియల్ వాలీబాల్ పోటీలలో కూడా పాల్గొన్నారు. 1953-54 లో ఆంధ్ర రాష్ట్ర వాలీబాల్ జట్టు సభ్యులు. ఆంధ్ర, మద్రాసు, హైదరాబాద్ రాష్ట్రములలో జరిగిన ఇంకా అనేక పెద్ద పోటీలలో కూడా పాల్గొని వున్నారు. 1956 జనవరిలో జరిగిన ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ పోటీలలో విజయముగాంచిన ఎమెచూర్ ఎథ్లెటిక్స్ ఎసోసియేషన్ జట్టు సభ్యులు.

శ్రీ పి. వి. రమణరావు :— జననం 1933, గుంటూరు జిల్లా జిల్లా పాఠశాల పోటీలలో గుంటూరు హిందూ కాలేజి




హైస్కూలు జట్టులో అనేకసార్లు చెడుగుడు, వాలీబాల్, బాస్కెట్ బాల్ పోటీలలో పాల్గొన్నారు. 1953—54 లలో హిందూ కళాశాల వాలీబాల్ జట్టు సభ్యులు. మద్రాసు లయోలా కాలేజి పోట్రీలలోనూ, ఆంధ్ర విశ్వవిద్యాలయ అంతర్ కళాశాల పోటీలలోనూ పాల్గొన్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ, ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ జట్టులలో కూడా సభ్యులు. ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ పోటీలలో విజయము గాంచిన హిందూకాలేజి (గుంటూరు) జట్టు సభ్యులు కూడా. అదే సంవత్సరము అఖిలభారత వాలీబాల్ జట్టుకు ఎన్నికై కలకత్తాలో జరిగిన త్రయలు పోటీలలో కూడా పాల్గొన్నారు.

1955 లో వీరు ఆంధ్రవిశ్వవిద్యాలయ వాలీబాల్ జట్టుకు నాయకత్వం వహించి దక్షిణమండల పోటీలలో ఫైనల్సువరకు వచ్చారు. వీరు ప్రాతినిధ్యం వహించిన మూడు సంవత్సరములూ ఆంధ్ర విశ్వవిద్యాలయ వాలీబాల్ షీల్డును గుంటూరు హిందూ కాలేజి జట్టుకే దక్కించారు. వీరు ఆంధ్రదేశములో జరిగిన అనేక వాలీబాల్ పోటీలలో పాల్గొని ప్రసిద్ధిగాంచారు.

వీరి కింకా ఎథ్లెటిక్స్, బాస్కెట్ బాల్, ఫుట్ బాల్, కబాడీలలో కూడా మంచి ప్రవేశ మున్నది. 1954 లో ఆంధ్ర విశ్వవిద్యాలయ ఎథ్లెటిక్స్ పోటీలలో పాల్గొని జావలిన్ విసురుటలో క్రొత్త యూనివర్సిటీ రికార్డును స్థాపించారు.

శ్రీ టి. రత్తయ్య :— జననం 1914 గుంటూరులో. చిన్నతనమునుంచి అన్ని ఆటలలో ప్రవేశ మున్నది. అన్ని ఆటలలోకి



వాలీబాల్‌లో ప్రవేశము ఎక్కువ. ఆంధ్రదేశములో జరిగిన అనేక వాలీబాల్ పోటీలలో పాల్గొన్నారు. 1953 లో ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ ఎసోసియేషన్ గౌరవ కోశాధికారిగా ఎన్నికయినారు. గుంటూరు రిక్రియేషన్ క్లబ్ స్థాపకులు. ఆ క్లబ్బు తరఫున రెండు పెద్ద టోర్నమెంటులు కూడా నడుపుచున్నారు. ఆంధ్రరాష్ట్ర కబాడీ, క్రికెట్ సంస్థలను స్థాపించుటలో సహాయపడినారు. ఆంధ్ర టేబుల్ టెన్నిస్ ఎసోసియేషన్ ఉపాధ్యక్షులు. గుంటూరులో నేషనల్ టేబుల్ టెన్నిస్ పోటీలు నిర్వహించడంలో కూడా తోడ్పడివున్నారు.

శ్రీ కస్తల శివప్రసాద్ :— జననం 1924 కస్తలగ్రామంలో. 11 వ ఏట నుంచి వీరికి వాలీబాల్ ఆటలో ఆసక్తి కలిగింది. పాఠశాల, కళాశాల వాలీబాల్ జట్టులోవుండి అనేక పోటీలలో పాల్గొన్నారు. 1958 నుంచి ఆంధ్రా వాలీబాల్ ఎసోసియేషన్ కార్యదర్శి. శ్రీ అడవి బాపిరాజుగారి శిష్యత్వమువల్ల వీరికి చిత్రకళలో కూడా ప్రవేశమున్నది.

శ్రీ ఎమ్. ఆంజనేయులు :— వయస్సు షుమారు 27 సంవత్సరములు. వాలీబాల్ ఆటలో సర్వీస్‌లో గొప్ప ప్రావీణ్యం గడించివున్నారు. 1952-53 సంవత్సరములలో గుంటూరు హిందూ కాలేజీ వాలీబాల్ జట్టు నాయకులు. వీరు ఆ రెండు సంవత్సరములు మద్రాసు లయోలా కాలేజీ వాలీబాల్ పోటీలలో పాల్గొన్నారు. రెండు సంవత్సరములు ఆంధ్ర విశ్వవిద్యాలయ వాలీబాల్ షీల్డును కూడా గుంటూరు హిందూ కాలేజీకి నిలబెట్టారు. 1953 లో ఆంధ్ర విశ్వవిద్యాలయ వాలీబాల్ జట్టు కెప్టెన్. 1953_54 లలో ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ జట్టు సభ్యులు. 1956 లో ఆంధ్ర వాలీబాల్ జట్టు నాయకులు.

శ్రీ టి. వెంకటేశ్వర్లు :— జననం 1929 గుంటూరులో. హిందూకాలేజీ హైస్కూలు వాలీబాల్ జట్టులోవుండి అనేకసార్లు



గుంటూరుజిల్లా వాలీబాల్ పోటీలలో పాల్గొని విజయములు గాంచారు. 1949 లో మద్రాసు లయోలాకాలేజీ వాలీబాల్ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్న గుంటూరు హిందూకాలేజిజట్టు సభ్యులు. 1949-50 లో ఆంధ్రవిశ్వవిద్యాలయ అంతర్ కళాశాలల పోటీలలోకూడా పాల్గొన్నారు.

ఇవియేగాక ఆంధ్రరాష్ట్రములో జరిగిన అనేక వాలీబాల్ పోటీలలో ఆంధ్ర ఎమెచూర్ ఎథ్లెట్స్ ఎసోసియేషన్ జట్టు సభ్యులుగా పాల్గొన్నారు.

తర్వాత వీరు తంతి తపాలాశాఖ ఉద్యోగములో ప్రవేశించి మద్రాసులో జరిగిన మద్రాసు రీజనల్ పోటీలలో పాల్గొన్నారు. 1956 జనవరిలో జరిగిన ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ పోటీలలో విజయము గాంచిన గుంటూరు ఎమెచూర్ ఎథ్లెట్సు ఎసోసియేషన్ టీము సభ్యులు.

శ్రీ మల్లిశెట్టి సుబ్బారావు :— వయస్సు షుమారు 23 సంవత్సరములు. స్వగ్రామం గుంటూరు. వీరు అనేక సంవత్సరములు గుంటూరు హిందూకాలేజీ హైస్కూలు వాలీబాల్, బాస్కెట్‌బాల్ జట్టులలోనూ, గుంటూరుజిల్లా పోటీలలో పాల్గొని విజయాలు పొందారు. 1953 లో మద్రాసు లయోలా కాలేజీ పోటీలలోనూ, ఆంధ్ర యూనివర్సిటీ తరఫున దక్షిణ మండల అంతర్ విశ్వవిద్యాలయ పోటీలలోనూ, గుంటూరు ఎమెచూర్ ఎథ్లెట్స్ అసోసియేషన్ జట్టు సభ్యులుగా ఆలిండియా రషీద్ మెమోరియల్ వాలీబాల్ పోటీలలోనూ (వరంగల్లు) పాల్గొన్నారు. ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ జట్టులో ఎన్నికయి ఢిల్లీలో జరిగిన ఒలింపిక్స్‌లో పాల్గొన్నారు. 1954 లో కూడా లయోలా కాలేజీ అంతర్విశ్వ విద్యాలయ వాలీబాల్ పోటీలలోనూ పాల్గొని విజయం సాధించారు. వీరే తరువాత ఆంధ్ర యూనివర్సిటీ వాలీబాల్ షీల్డునూ, రాష్ట్ర వాలీబాల్ ఛాంపియన్‌షిప్‌ను హిందూకాలేజి జట్టుకు సాధించారు. ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ జట్టు సభ్యులుకూడా.

(శ్రీ) పెమ్మరాజు రాధాకృష్ణమూర్తి :— జననం 1931 నవంబరు. స్కూలు విద్యార్థిగా నున్నప్పుడు జిల్లా వాలీబాల్, కబాడీ, కొకో, సోకర్ పోటీలలో పాల్గొన్నారు. 1948-50 సంవత్సరములలో గుంటూరు ఎ. సి. కాలేజీ, వాలీబాల్ టీములో కూడ విశ్వ విద్యాలయ పోటీలలో పాల్గొన్నారు. 1950-52 లలో బెనారెస్ హిందూ యూనివర్సిటీలో చదువుచూ వాలీబాల్ జట్టులో సభ్యత్వం వహించారు. 1955-56 లో ఆంధ్రా యూనివర్సిటీ వాలీబాల్ జట్టు వైస్ కెప్టెన్. ఆంధ్రా యూనివర్సిటీ కాలేజి వాలీబాల్ జట్టుకు నాయకత్వం వహించి అంతర్ కళాశాలల పోటీలలో సెమీఫైనల్సు వరకూ వచ్చారు.

టెన్నిస్‌లో కూడా ప్రావీణ్యం సంపాదించారు. 1950-51 లో బెనారెస్ హిందూ యూనివర్సిటీ జూనియర్ టెన్నిస్ ఛాంపియన్.

ఆంధ్రలో ఇంకా క్రింది ఆటగాళ్ళు పేరుగడించి వున్నారు: శ్రీయుతులు ఐ. రామకోటేశ్వరరావు (చీరాల), కె. ఆర్. కె. ప్రసాద్ (ఏలూరు), వి. వి. యస్. ప్రసాద్‌రావు (గుంటూరు), సి హెచ్. నరహరిరావు (విజయనగరం), మహమ్మద్ కాసీం (గుంటూరు), సి. హెచ్. కృష్ణమూర్తి (గుంటూరు), సి. హెచ్. వి. సుబ్బారావు (నరసరావుపేట), బి. సుబ్బారెడ్డి (వాల్తేర్), సి. మల్లికార్జునరావు (గుంటూరు). వీరందరూ 1956 లో ఆంధ్ర యూనివర్సిటీ వాలీబాల్ జట్టు సభ్యులు. ఈ జట్టు స్టాండ్‌బైలుగా శ్రీ కె. వెంకటేశ్వరరావు (గుంటూరు), యస్. డి. మృత్యుంజయరావు (కాకినాడ), హెచ్. జయపాల్ (శ్రీకాకుళం) నిర్ణయించబడినారు.

శ్రీయుతులు సి. ఎస్. ఎడ్వర్డ్ (గుంటూరు), శ్రీ ఎ. వి. కామేశ్వరరావు—వీరుభయులు 1956 లో లయోలా కాలేజి టోర్నమెంటులో పాల్గొన్న గుంటూరు హిందూ కాలేజి జట్టు సభ్యులు.

హైదరాబాద్‌లో క్రింది ఆటగాళ్ళు పేరొంది వున్నారు: శ్రీయుతులు శాంతయ్య, గోవర్ధన్, పద్మారావు, సుబ్బారావు, విశ్వనాథం, గంధయ్య—వీరందరు ఆర్. ఆర్. సి. జట్టు సభ్యులు. వజీద్ హుస్సేన్, ఐ. స్లీవాయీ—వీరుభయులు 1956 ఫిబ్రవరిలో పాటియాలాలో జరిగిన జాతీయ వాలీబాల్ ఛాంపియన్‌షిప్ పోటీలలో హైదరాబాద్ ప్రతినిధులు.

# అధ్యాయము 16

# బాస్కెట్ బాల్

1891 లో బాస్కెట్‌బాల్ ఆట అమెరికాలో కనుగొనబడింది. స్ప్రింగ్ ఫీల్డుకు చెందిన డాక్టర్ జేమ్సు నైస్మిత్ ఈ ఆటను కనుగొన్నాడు.



తరువాత వై. యం. సి. ఎ. వారు ఈ ఆటను త్వరత్వరగా ప్రపంచమంతటా వ్యాపింపజేశారు. పాశ్చాత్య దేశాలలోనూ, జపాను వంటి ప్రాచ్య దేశాలలోనూ, ఆరుబయటూ, మందిరాలలోనూ బాస్కెట్‌బాల్ ఆడబడుతున్నది. చెకోస్లావికియా, రష్యా, అమెరికాలు ప్రస్తుతం ప్రపంచంలో ప్రముఖ స్థానం వహించి వున్నవి. మొదటి రోజుల్లో అమెరికా ప్రపంచాధిపత్యం వహించి వుండేది. 1950 లో అర్జెంటైనా ప్రపంచఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్నది. 1948 లండన్ ఒలింపిక్స్‌లో అమెరికా, ఫ్రాన్స్, బ్రాజిల్ ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలు సంపాదించినవి. అప్పుడు అమెరికా జట్టులో ఆరడుగుల ఆరంగుళాల ఎత్తు కలవారు ఐదుగురు, ఏడు అడుగులు ఎత్తుగల వ్యక్తి ఒకరు వున్నారట. 1952 లో జరిగిన ప్రపంచ ఒలింపిక్ క్రీడోత్సవంలో బాస్కెట్ బాల్ ఆటలో అమెరికా, రష్యా, ఉరుగ్వేలు అదే వరుసన మొదటి మూడుస్థానాలు సంపాదించినవి. 1956 లో మెల్బోర్న్‌లో జరిగిన ప్రపంచ ఒలింపిక్ క్రీడోత్సవంలో బాస్కెట్‌బాల్ ఆటలో వివిధ దేశాల స్థానాలివి :— (1) అమెరికా, (2) రష్యా, (3) ఉరుగ్వే, (4) ఫ్రాన్సు, (5) బల్గేరియా, (6) బ్రాజిల్, (7) ఫిలిప్పీన్స్, (8) చిలీ, (9) కెనడా,

(10) జపాన్, (11) ఫార్మోజా, (12) ఆస్ట్రేలియా, (13) సింగపూర్, (14) కొరియా, (15) థాయిలెండ్.

బాస్కెట్ బాల్ "టచ్ మీ నాట్" ఆట. ఆటగాళ్లు, ఒకరి నొకరు ముట్టుకోకుండా ఆడవలసిన అతి నిరపాయకరమైన ఆట యిది. ఫుట్ బాల్, బేస్ బాల్ సీజన్లమధ్య, శీతాకాలంలో క్రీడాశాలలలో ఆడడానికి ఈ ఆట మొదట ఉద్దేశించబడినది. బాస్కెట్ బాల్ కనుగొన్న డాక్టర్ నైస్మిత్ ఈ ఆట చాలా నిరపాయకరంగా కొనసాగ వలెనని లక్షించినాడు. వీరు మొదట ఫుట్ బాల్ బంతిని, పీచుతొట్లను ఆటలో వినియోగించేవారు. మొదట్లో జట్టుకు 40 మొదలు 50 మంది ఆటగాళ్లు వుండేవారు. బంతి వేయడానికి తొట్లు 10 అడుగుల ఎత్తులో వుండేవి. తొట్లలోనుంచి బంతి జారిపడేదికాదు. తొట్టిలోనే వుండిపో యేది. "గోలు" కాగానే నిచ్చెన ఉపయోగించి తొట్టినుంచి బంతి తీసేవారు. క్రమక్రమేణా జట్టు సభ్యులసంఖ్య తొమ్మిదికి తగ్గింది. కొద్ది ఆటస్థలంలో 18 మంది ఆటగాళ్ళు శరవేగంతో ఆడడం చాలా చిక్కుగా వున్నందున జట్టుసంఖ్య ఏడుకు, చివరకు ఐదుకు తగ్గించ బడింది. జట్టుకు ఐదుగురు వంతున పాల్గొన్న మొట్టమొదటి కాలేజి పోటీ 1897 మార్చి 20 తేదీన 'యేల్' యూనివర్సిటీ (అమెరికా) లో నిర్వహించబడింది. అప్పుడు 'యేల్' - 'పెన్సిల్వేనియా' జట్లకు పోటీ జరిగింది.

ఇక ఆసియాసంగతి చూచినట్లయితే 1900 లో ఫిలిప్పీన్స్లో ఈ ఆట ప్రచారంలో వున్నట్లు చరిత్ర చెబుతున్నది. 1920 కల్లా దూర ప్రాచ్య రాజ్యాలన్నింటిలోనూ బాగా ప్రచారంలో వున్నది. ఆసియా లోకెల్లా ఫిలిప్పీన్స్ బాస్కెట్ బాల్ ఆటలో ప్రథమస్థానం వహిస్తున్నది. 1951 లో ప్రథమ ఆసియా క్రీడోత్సవంలో ఫిలిప్పీన్స్ ప్రథమ స్థానం సంపాదించింది. అప్పుడు అమెరికనులంత ప్రతిభాపూర్వకంగా ఫిలిప్పీన్స్ ఆటగాళ్ళు ఆడినారు. జపానుకు ద్వితీయ స్థానం లభించింది. 1954 లో జరిగిన ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలో కూడా ఫిలిప్పీన్స్కు ప్రథమస్థానం లభించింది. చైనా రెండవ స్థానాన్ని పొందింది.

ఇండియాలో దాదాపు నలభైఆరు ఏళ్లుగా బాస్కెట్‌బాల్ ఆట ప్రచారంలో వున్నది. 1955 లో శ్రీ ఫ్రాంక్ కాఫ్మన్ 1956 లో శ్రీ సామ్ ఫాక్స్ అనే అమెరికన్లు భారతీయ ఆటగాళ్లకు ఉన్నత శిక్షణ నిచ్చినందువల్ల ముప్ముందు ఇండియా కనీసం ఆసియాలోనైనా ప్రముఖస్థానం వహించవచ్చు. వాలిబాల్ జట్టువలె బాస్కెట్‌బాల్ జట్టుకూడా విరివిగా అంతర్జాతీయ పోటీలలో పాల్గొన డం అవసరం. శ్రీ సి. శ్రీనివాసన్ అనే హైదరాబాద్ ఆటగాడు అంతర్జాతీయ ప్రమాణాన్ని అందుకొనివున్నట్లు శ్రీ సామ్‌ఫాక్స్ అభి ప్రాయపడ్డారు. ఈ 23 ఏళ్ళ యువకుడు బాస్కెట్‌బాల్ ఆటలోని కిటుకు లన్నింటిని పూర్తిగా తెలుసుకొని అద్భుతంగా ఆడుతున్నట్లు ఆయన చెప్పివున్నారు గూడా. ఈయన తరువాత చెప్పదగినవారు మైసూరు ఆటగాడు, ఆలిండియా కెప్టను అయిన శ్రీపాండురంగారావుగారు.

ఇండియాలోని అన్ని రాష్ట్రాలలోకి మైసూరు బాస్కెట్‌బాల్ ఆటలో ప్రముఖస్థానాన్ని వహిస్తున్నది. 1956 డిశంబరులో మైసూరు వరుసగా ఐదవసారి జాతీయ ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొన్నది. అప్పుడు ఫైనలులో ఢిల్లీని 53—39 పాయింట్లతో ఓడించింది. మైసూర్ జట్టులో క్రింది ఆటగాళ్ళు కలరు :—

శ్రీయుతులు పాండురంగారావు, వి. యస్. అప్పయ్య, యు. బి. నాయక్, డి. యస్. భరద్వాజ్, బి. యస్. లక్ష్మీనారాయణ్, బి. కె. రాజశేఖర్, బి. యస్. శ్రీకాంతయ్య, యం. ఎ. ఆళ్వార్, ఎ. యం. శ్రీవత్స, ఆర్. యస్. మాధవమూర్తి, టి. పుట్టుస్వామి, యం. కె. నరసింహ అయ్యంగార్.

1956 లో స్త్రీల ఛాంపియన్ షిప్‌ను బెంగాలు గెలుచుకొన్నది. హైదరాబాద్‌ను బెంగాలు ఫైనలులో 39-31 పాయింట్లతో ఓడించింది. బెంగాల్ జట్టులో శ్రీమతి మెయినే, శ్రీమతి జె. గాడ్‌ఫ్రీ; హైదరా బాద్ జట్టులో శ్రీమతి ఆర్. బి. మెలో, శ్రీమతి బి. ఆర్మ్‌స్ట్రాంగ్ అతి నేర్పుగా ఆడినారు.

అమెరికన్ మిషనరీలు 46 ఏళ్ళ క్రితం బాస్కెట్ బాల్ ఆటను ఇండియాలో ప్రవేశపెట్టినప్పటినుంచి అది క్రమంగా ప్రచారమౌతూ వచ్చినా 1950 నుంచిగాని క్రమపద్ధతిని ఈ ఆట అభివృద్ధి ప్రారంభం కాలేదు. ఆ సంవత్సరంలో బొంబాయిలో నెలకొల్పబడిన ఇండియా బాస్కెట్ బాల్ ఫెడరేషన్ ఈ ఆట అభివృద్ధికి పాటుపడింది.

మొట్టమొదటి జాతీయ బాస్కెట్ బాల్ ఛాంపియన్ షిప్ పోటీని 1934 లో న్యూఢిల్లీలో ఇండియన్ ఒలింపిక్ అసోసియేషన్ నిర్వహించింది.

ఆంధ్రరాష్ట్రంలో 1951-52 వరకు కూడా బాస్కెట్ బాల్ దాదాపు రగ్బీ ధోరణిలో సాగేది. బంతి తీసుకొని వెళ్ళేవారిని వెనుక నుంచి ఆపి ఎదుర్కొనడం వంటివి ఆరోజులలో చెల్లేవి! ఆధునిక పద్ధతులలో బాస్కెట్ బాల్ ఆటను ఆంధ్రలో ప్రవేశపెట్టినది శ్రీ విత్తనాల వెంకటేశ్వరరావుగారు. వీరు మద్రాసులో ఆధునిక పద్ధతులను గ్రహించి తూర్పుగోదావరి జిల్లాలో ప్రప్రథమంగా వాటిని ప్రచారం చేశారు. ఆంధ్రరాష్ట్రం అవతరించిన పిమ్మట ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ సంఘం నెలకొల్పబడింది. 1954 ఫిబ్రవరి 2 వ తేదీన విజయవాడలో ఈ సంస్థ అవతరించింది. శ్రీయుతులు దోర్బల శేషాద్రి శాస్త్రి (విజయవాడ), పసల సూర్యచంద్రరావు (తాడేపల్లిగూడెం), నల్లా రెడ్డినాయుడు (అమలాపురం), మాకాని గోపాలస్వామి నాయుడు (విజయవాడ), కె. పురుషోత్తమరెడ్డి (కర్నూలు), పానుగంటి వేణు గోపాల్ (విజయవాడ) ప్రభృతులు ఈ సంస్థ స్థాపనకు కృషిచేసి వున్నారు. 1954 నుంచి జాతీయ పోటీలలో ఆంధ్ర పాల్గొంటున్నది.

1956 సంవత్సరాంతంలో తిరువేంద్రంలో జరిగిన జాతీయ బాస్కెట్ బాల్ పోటీలలో ఆంధ్ర జట్టుకు శ్రీ ఎల్. ఆర్. కె. మూర్తి నాయకత్వం వహించారు. ఆంధ్రరాష్ట్ర జట్టులో ఇంకా క్రిందివారికి స్థాన మివ్వబడింది: శ్రీయుతులు డి. జోసఫ్, ఆర్. వెంకటపతిరాజు, టి. ప్రసాదరావు, జి. కె. గోఖలే, పి. అబ్బులు, యన్. వి. యస్.

నాయుడు (అమలాపురం), ఆర్. వీరరాజు, ఆర్. విశ్వేశ్వరరావు, (పిఠాపురం), వై. రామలింగం, కె. రాధాకృష్ణమూర్తి (గుంటూరు), కె. శ్రీరాములు (కొత్తపేట).

జాతీయ బాలుర బాస్కెట్ బాల్ పోటీలలో పాల్గొనడానికి క్రింది బాలురు ఎన్నికైనారు:— కె. జానకిరామయ్య (కెప్టెన్) ఎస్. భవానిశంకరం, ఎమ్. వీరేశ్వరరావు (అమలాపురం), ఎ. రఘునాయకులు, కె. జయన్న (కొత్తపేట), ఆర్. తిరుపతిరావు, జె. వెంకట్రావు (పిఠాపురం), జి. వెంకటేశ్వర్లు (గుంటూరు).

1956 లో చెన్నరాష్ట్రం పోటీలలోను, మద్రాసు లీగ్ పోటీలలోను, ఆంధ్రరాష్ట్ర పోటీలలోను పాల్గొన్న ఏకైక ఆంధ్ర ఆటగాడు శ్రీ ఏశా వెంకట సుబ్బారావుగారు. (క్రింద వీరి బొమ్మ కలదు)



బాస్కెట్ బాల్ ఆటలో హైదరాబాద్ ప్రముఖస్థానం వహిస్తున్నది. పురుషులకంటే స్త్రీలు జాతీయ పోటీలలో గణుతికెక్కుతున్నారు. 1955 లో స్త్రీల జాతీయ ఛాంపియన్ షిప్‌ను హైదరాబాద్ గెలుచుకొన్నది. హైదరాబాద్ సంస్థానంలో బసాలత్ రాజకుమారుడు స్త్రీలలో ఈ ఆట ప్రచారానికి విశేషంగా కృషి చేసివున్నారు. శ్రీ సామ్‌ఫాక్స్‌చే కీర్తించబడిన శ్రీ శ్రీనివాసన్ హైదరాబాద్ ఆటగాడే.

1956 సంవత్సరాంతంలో జరిగిన జాతీయ పోటీలలో సెమి ఫైనలులో హైదరాబాద్‌ను మైసూరు ఓడించింది.

శ్రీయుతులు ఎ. వి. యస్. సంపత్ కుమార్, రాజా లక్, బి. ఆర్. నందా, మెహిది, కమల్, సి. పున్నురాజ్, జి. ముబెచిర్ హైదరాబాద్‌లో పేరు గడించిన ఆటగాళ్లు.

బాస్కెట్‌బాల్ ఆట పొడుగరుల ఆట గాబట్టి ఆంధ్రదేశంలో దీర్ఘకాయులైన ఆటగాళ్ళకు ప్రత్యేక ఉన్నతశిక్షణ నిప్పించినట్లయితే అనతికాలంలోనే ఆంధ్ర మొత్తం దేశంలో ప్రముఖస్థానం వహించగలదు. ప్రస్తుతం ఆంధ్ర సీనియర్లకంటే జూనియర్లు జాతీయపోటీలలో ప్రశంసలు పొందివున్నారు.

## ఆటగాళ్ల పరిచయం

శ్రీ విత్తనాల వెంకటేశ్వరరావు :— అమలాపురం వాస్తవ్యులు. 1948-49 లో మద్రాసు వై. యమ్. సి. ఏ. కళాశాలలో వ్యాయామశిక్షణ పొందారు. వీరు ప్రస్తుతం అమలాపురం పాఠశాలలో వ్యాయామ శిక్షకులుగా పనిచేస్తున్నారు.



1953-54 లో ప్రథమ ఆంధ్రరాష్ట్ర బాస్కెట్‌బాల్ జట్టుకు నాయకత్వం వహించి ఢిల్లీలో జరిగిన నేషనల్ బాస్కెట్‌బాల్ పోటీలలో పాల్గొన్నారు. తర్వాత 1954-55 లో కూడా ఆంధ్రరాష్ట్ర బాస్కెట్‌బాల్ జట్టు సభ్యులుగా కలకత్తాలో జరిగిన నేషనల్ పోటీలలో పాల్గొన్నారు. 1955-56 లో కూడా రాష్ట్ర జట్టు సభ్యులుగా హైదరాబాదులో జరిగిన జాతీయ పోటీలలో పాల్గొన్నారు.

మొట్టమొదటగా ఆంధ్రలో ఆధునిక బాస్కెట్‌బాల్ ఆటను అభివృద్ధిలోనికి తెచ్చినవారు వీరే. వీరు కాలేజీ పాఠశాలల జట్లకు

శిక్షణ యిచ్చి అనేకపోటీలలో అవి విజయముగాంచుటకు తోడ్పడు తున్నారు.

శ్రీ రెడ్డిపల్లి వీర్రాజు :— జననం 1935 పిఠాపురములో. పాఠశాలలో చదువుచుండగానే బాస్కెట్ బాల్ ఆట ప్రారంభించారు.






1953-54 లో ప్రథమ ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ పోటీలలో వీరు పిఠాపురం రిక్రియేషన్ క్లబ్బు తరపున పాల్గొని, రాష్ట్రజట్టుకు ఎన్నికైనారు. 1955 లో విజయవాడ వ్యాయామ కళాశాలలో శిక్షణ పొందారు. అదే సంవత్సరము వీరు ప్రఖ్యాత అమెరికా శిక్షకుడు శ్రీ ఫ్రాంక్ కాఫ్మన్ వద్ద అజ్మీర్ లో శిక్షణపొందారు. అచ్చట కోచింగ్ కేంద్రంలో జరిగిన ఎగ్జిబిషన్ పోట్రీలో శ్రీ కాఫ్మన్ జట్టులో ఎన్నికయి ప్రఖ్యాత జట్టయిన సర్వీసెస్ తో ఆడి విజముగాంచినారు. వీరి ప్రతిభను శ్రీ కాఫ్మన్, అఖిలభారత బాస్కెట్ బాల్ జట్టు నాయకు లయిన శ్రీ రణబీర్ ఛోప్రాగారలు ఎంతో కొనియాడారు.

1955 - 56 లో ఫిఠాపురం క్లబ్బుజట్టు తరపున అమలాపురంలో జరిగిన ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ పోటీలో పాల్గొని, రాష్ట్రజట్టుకు ఎన్నికైనారు. వీరి టీము ద్వితీయస్థానం వహించింది. హైదరాబాద్ లో జరిగిన జాతీయ పోటీలలో పాల్గొన్నారు. ఆసియా పోటీలకు పోనున్న ఆల్ ఇండియా బాస్కెట్ బాల్ జట్టులో ఆంధ్ర టీమునుంచి వీరు ఎన్నికైనారు. 1956 అక్టోబరులో విజయవాడలో జరిగిన బాస్కెట్ బాల్ కోచింగ్ కేంద్రంలో శిక్షకులుగా పనిచేసి శ్రీ రణబీర్ ఛోప్రా గారిచే "ఫ్రీత్రో"లో (నిరవరోధంగా బంతివేయడం) ప్రతిభకు రజత పాత్రను బహుమానంగా పొందారు.

శ్రీ పానుగంటి వేణుగోపాల్ :— జననం అక్టోబర్ 1925 రాజమండ్రిలో. పాఠశాల, కళాశాల విద్యార్థిగా వున్నప్పుడే బాస్కెట్ బాల్, హాకీ, టెన్నిస్, బాడ్మింటన్, క్రికెట్ పోటీలలో పాల్గొన్నారు.

1947 - 48 లో మద్రాసు వై. యమ్. సి. ఏ. వ్యాయామ కళాశాలలో శిక్షణ పొందినారు. 1948లో రెండు మాసములు మద్రాసు, పరసువాకం పాఠశాలలలో వ్యాయామ బోధకులుగానూ, 1948 సెప్టెంబరు నుంచి 1952 సెప్టెంబరు వరకూ అనంతపురం ఇంజనీరింగ్ కళాశాలలో ప్రధాన వ్యాయామ అధ్యాపకులుగాను పనిచేశారు.

1952 లో విజయవాడలోని ఆంధ్ర వ్యాయామ కళాశాలలో వ్యాయామ అధ్యాపకులుగా చేరారు. 1953 లో ప్రథమ ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ సంస్థకు కార్యదర్శిగా ఎన్నికయినారు. అప్పటినుండి ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ జట్టును ఎన్నుకొనడంలోను, జాతీయ పోటీలలో అది క్రమశిక్షణతో పాల్గొనడంలోను ప్రముఖపాత్ర వహించారు. అంతేకాక ఆయా జట్ల ఆటగాళ్ళకు ఉన్నతశిక్షణ నిచ్చి, మేనేజరుగా కూడా వ్యవహరించి వున్నారు. వీరు రాజకుమారి అమృత్ కౌర్ కోచింగ్ స్కీమ్ క్రింద నిర్వహించబడిన ఉన్నతశిక్షణ కేంద్రములలో శిక్షణపొంది మొదటి తరగతి శిక్షకులుగా ఉత్తీర్ణులైనారు. 1955 లో అజ్మీర్‌లో జరిగిన అఖిలభారత బాస్కెట్ బాల్ కోచింగ్ కేంద్రంలో ప్రఖ్యాత అమెరికా బాస్కెట్ బాల్ శిక్షకు లయిన శ్రీ ఫ్రాంక్ కాఫ్మన్ వద్ద శిక్షణ పొందారు. 1954 లో ఆంధ్రరాష్ట్ర ఒలింపిక్ ఎసోసియేషన్‌కు సహాయ కార్యదర్శిగా ఎన్నుకోబడినారు. 1956 అక్టోబరు 2 నుంచి 16 వ తారీకు వరకూ విజయవాడలో నిర్వహించబడిన బాస్కెట్ బాల్ శిక్షణకేంద్రంలో శిక్షకులుగా వ్యవహరించారు.

కేంద్రప్రభుత్వ విద్యాశాఖవారిచే నిర్వహించబడిన కోచింగ్ కేంద్రంలో ఆంధ్రరాష్ట్రం తరఫున పాల్గొన్నారు.

శ్రీ ఎన్. వి. యస్. నాయుడు :— అమలాపురం నివాసి. వీరు విజయనగరం యమ్. ఆర్. కాలేజీలో విద్య నభ్యసించు



చుండగా పెరియాపలంలో కొన్ని బాస్కెట్‌బాల్ పోటీలలో పాల్గొన్నారు. 1953లో యస్. కె. బి. ఆర్. కాలేజీ (అమలాపురం) బాస్కెట్‌బాల్ జట్టు వైస్ కెప్టెన్; ఆంధ్ర బాస్కెట్‌బాల్ జట్టు వైస్ కెప్టెన్ కూడా. 1954 లో "లైట్ ఆఫ్ ఆంధ్రా" అమలాపురం జట్టుకు నాయకత్వం వహించి ఆంధ్రరాష్ట్ర బాస్కెట్‌బాల్ పోటీలో విజయ మొందారు. ఆ సంవత్సరము ఆంధ్ర రాష్ట్ర జట్టు సభ్యులు. 1955 లో ఆంధ్రరాష్ట్ర జట్టు నాయకులు.

శ్రీ ఏకా వెంకట సుబ్బారావు :— జననం డిసెంబరు 1931, గుంటూరులో. 1942 లో గుంటూరు యమ్. జి. హైస్కూలులో



చేరారు. 1949 లో యమ్. జి. హైస్కూలు బాస్కెట్‌బాల్ జట్టుకు ఎన్నికైనారు. ఈ టీము గుంటూరుజిల్లా పోటీలలో ద్వితీయస్థానం వహించింది. అప్పటినుంచి బాస్కెట్‌బాల్ ఆటపై అభిమానము ఎక్కువై ప్రత్యేక కృషి ప్రారంభించారు. జిల్లా ఆటల పోటీలలో హైస్కూలు తరఫున ఇతర అన్ని గేమ్సులలో కూడా పాల్గొన్నారు. 1951 లో గుంటూరు బ్లూస్ బాస్కెట్‌బాల్ జట్టుకు ఎన్నికై గుంటూరు గాంధీజీ మెమోరియల్ బాస్కెట్‌బాల్ పోటీలలో పాల్గొని విజయము గాంచారు. 1952 లో

గుంటూరు హిందూ కాలేజీలో చేరి బాస్కెట్‌బాల్ జట్టుకు ఎన్నికై ఆంధ్రా యూనివర్సిటీ 'డి' జోను పోటీలో ఫైనల్సులో ఓడిపోయినారు. అదే సంవత్సరము మరల గాంధీజీ మెమోరియల్ బాస్కెట్‌బాల్ పోటీలలో పాల్గొని విజయము గాంచారు. 1953 లో కాలేజీ బాస్కెట్‌బాల్ జట్టు నాయకులు. కాకినాడలో జరిగిన ఆంధ్ర యూనివర్సిటీ అంతర్కళాశాలల బాస్కెట్‌బాల్ టోర్నమెంటులో వీరి జట్టు ద్వితీయస్థానం సంపాదించింది. కాలేజీ తరఫున టెన్నిస్ సింగిల్సులో కూడా ఆంధ్ర యూనివర్సిటీ పోటీలలో పాల్గొనడానికి ఎన్నిక అయినారు. కాలేజీ టెన్నిస్ డబుల్సు ఛాంపియన్‌గా కూడా వచ్చారు. 1953 లో విజయవాడలో జరిగిన ప్రథమ ఆంధ్రరాష్ట్ర బాస్కెట్‌బాల్ పోటీలలో పాల్గొన్న గుంటూరు ఎమచూర్ ఎథ్లెటిక్సు ఎసోసియేషన్ జట్టు సభ్యులు. అదే సంవత్సరము వరంగల్లులో జరిగిన ఆలిండియా రషీద్ మెమోరియల్ బాస్కెట్‌బాల్ పోటీలలో కూడా పాల్గొన్నారు. ఆ సంవత్సరమునుంచి ఎమచూర్ ఎథ్లెటిక్సు ఎసోసియేషన్ బాస్కెట్‌బాల్ జట్టులో శ్రీ కొణిదెన రాధాకృష్ణమూర్తిగారికి రక్షణశ్రేణిలో కుడి భుజంగా వుంటున్నారు. 1954 లో తణుకులో జరిగిన ఆంధ్రరాష్ట్ర బాస్కెట్‌బాల్ పోటీలలో కూడా పాల్గొన్నారు. 1955 లో మరల గుంటూరు హిందూ కళాశాలలో ప్రవేశించి మద్రాసులో జరిగిన లయోలా కాలేజీ పోటీలలో పాల్గొన్నారు. ఆంధ్రా యూనివర్సిటీ అంతర్కళాశాలల బాస్కెట్‌బాల్ టోర్నమెంటులో నర్సరావుపేటలో జరిగిన 'డి' జోన్ పోటీలలో విజయమొందింది, అనంతపురంలో జరిగిన ఫైనలు జోన్ పోటీలలో ఓడిపోయినారు.

1956 లో మద్రాసులో ప్రముఖ జట్టయిన "మాంబళమ్ యూత్స్‌క్లబ్"లో సభ్యుడుగా చేరినారు. మద్రాసులో జరిగిన సిటీ బాస్కెట్‌బాల్ ఛాంపియన్‌షిప్ లీగ్ పోటీలలో పాల్గొని కమ్యూనిటీ రిక్రియేషన్ క్లబ్బును, వై. యమ్. సి. ఏ., ఎగ్మూర్ ఫ్రెండ్స్‌క్లబ్ జట్లను ఓడించి మద్రాసులో ప్రముఖజట్టయిన మద్రాసు సేవనల్సుతో 38 - 29 పాయింట్లతో ఓడిపోయినారు. మరల వెపేరి వై. యమ్. సి. ఏ. లో జరిగిన మద్రాసు సిటీ బాస్కెట్‌బాల్

ఛాంపియన్ షిప్ పోటీలలో కూడా "మాంబళమ్ యూత్స్ క్లబ్" జట్టులో పాల్గొని మొదటి రౌండులో ఎగ్మూర్ ఫ్రండ్స్ యూనియన్ ను 33 – 21 పాయింట్లతోనూ, రెండవ రౌండు వెపరీ వై. యమ్. సి. ఏ. ను 38 – 18 తోనూ ఓడించి సెమిఫైనల్సులో మద్రాసులో ప్రసిద్ధిచెందిన ఏస్ బాస్కెట్ బాల్ జట్టుతో ఓడిపోయినారు. ఇప్పటివరకూ మద్రాసులో జరిగిన అన్ని పోటీలలోనూ రక్షణ, పురోగమన శ్రేణులు రెండింటిలోను ఆడి ప్రజల మన్ననలు పొందారు. 1956 లో మద్రాసు, ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ పోటీలలో పాల్గొన్నారు. ఈ గ్రంథాన్ని సిద్ధపరచడంలో సహాయపడినారు.

శ్రీ అడుసుమల్లి దత్తాత్రేయులు :— జననం 1931 గుంటూరులో. హిందూకళాశాల హైస్కూలు విద్యార్థిగా వున్నప్పుడే



వాలీబాల్, బాస్కెట్ బాల్ ఆటలలో మంచి ఆసక్తి చూపారు. జిల్లా, వార్షికోత్సవ పోటీలలో పాల్గొన్నారు. 1951 లో మద్రాసు లయోలా కాలేజి వాలీబాల్ పోటీలో విజయము గాంచిన గుంటూరు హిందూ కళాశాల జట్టు సభ్యులు. విశ్వవిద్యాలయము నిర్వహించిన కళాశాలల వాలీబాల్ పోటీలలో విజయముగాంచిన హిందూ కళాశాల జట్టు సభ్యులు. 1952 లో కూడా వీరు హిందూ కళాశాల తరఫున వాలీబాల్, బాస్కెట్ బాల్ పోటీలలో పాల్గొన్నారు. వీరి జట్టు ఆంధ్ర విశ్వ విద్యాలయ కళాశాలల వాలీబాల్ పోటీలలో ప్రథమస్థానం పొందింది. 1952 లో గుంటూరు గాంధీజీ మెమోరియల్ బాస్కెట్ పోటీలలో విజయముగాంచిన "గుంటూరు బ్లూస్" జట్టు సభ్యులు. 1953 లో వరంగల్లులో జరిగిన ఆలిండియా బాస్కెట్ బాల్ పోటీలలో పాల్గొన్నారు. అప్పుడు గుంటూరు ఎమచూర్ ఎథ్లెట్స్ ఎసోసియేషన్ జట్టు సభ్యులు. ప్రథమ ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ పోటీలలో పాల్గొని ఆంధ్రరాష్ట్ర జట్టుకు ఎన్నికయినారు. 1955 లో అమలాపురంలో జరిగిన ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ పోటీలలోకూడా పాల్గొన్నారు. ఇవియే గాక అనేక వాలీబాల్ పోటీలలో కూడా పాల్గొని వున్నారు.

శ్రీ కొమ్మపూడి గోపాలకృష్ణ గోఖలే :— జననం 1929 అమలాపురంలో. వీరు బోర్డు హైస్కూలు (అమలాపురంలో) విద్యనభ్యసించుచున్నంతకాలమూ సాఫ్ట్‌బాల్, బాస్కెట్ బాల్, వాలీబాల్ జిల్లా పోటీలలో పాల్గొన్నారు. పి. ఆర్. కాలేజీ (కాకినాడ) లో చదువుచున్నప్పుడు కూడా వీరు బాస్కెట్ బాల్, వాలీబాల్, హాకీ, క్రికెట్ పోటీలలో పాల్గొన్నారు. 1948-49 లో పి. ఆర్. కాలేజి (కాకినాడ) వాలీబాల్ జట్టు నాయకులు. ఆసంవత్సరము ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాలల పోటీలలో వీరి వాలీబాల్ జట్టు రన్నర్స్ అప్ గా వచ్చింది. రెండవ ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ పోటీలలో పాల్గొనిన యస్. కె. ఆర్. క్లబ్ (అమలాపురం) జట్టు నాయకులు. వీరిజట్టు ద్వితీయస్థానం సంపాదించింది. ఆ సంవత్సరము వీరు ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ జట్టుకు వైస్ కాప్టెన్ గా ఎన్నుకోబడినారు. 1955-56 మద్రాసు లాకాలేజీ బాస్కెట్ బాల్, ఫుట్ బాల్ జట్టులో ప్రముఖస్థానం వహించి పెద్ద టోర్నమెంటులలో పాల్గొన్నారు. 1956 లో ఆంధ్రరాష్ట్ర జట్టులో ప్రముఖస్థానం వహించారు.



శ్రీ దాసరి రాధాకృష్ణమూర్తి :— జననం 1936 గుంటూరులో. గుంటూరు ఎమ్. జి. హైస్కూలు బాస్కెట్ బాల్ జట్టులో సభ్యులుగావుండి జిల్లాపోటీలలో పాల్గొన్నారు. 1952, 1953 లలో హిందూకళాశాల బాస్కెట్ బాల్ జట్టు సభ్యులు. 1953 లో ఆంధ్ర రాష్ట్ర పోటీలలో "గుంటూరు బ్లూస్" జట్టు తరఫున ఆడి రాష్ట్ర జట్టుకు ఎన్నికయినారు. 16 వ సంవత్సరంలోనే రాష్ట్రజట్టుకు ఎన్నిక కావడం ప్రశంసనీయం. 1954 లో కూడా రాష్ట్ర ఆటగాడు.

వీరు ఆంధ్ర, మద్రాసు, హైదరాబాద్ ప్రాంతాలలో జరిగిన పెద్ద బాస్కెట్ బాల్ టోర్నమెంటులలో పాల్గొని వున్నారు. 1955లో ఆంధ్ర విశ్వవిద్యాలయ బాస్కెట్ బాల్ జట్టులో సభ్యులు.

శ్రీ దేవరపల్లి జోసఫ్ :— జననం 1935 అక్టోబరు అమలాపురంలో. స్కూలు విద్యార్థిదశలోనే ఆటలలో ఆసక్తి చూపారు.



1952 లో ఎస్. కె. బి. ఆర్. కాలేజి (అమలాపురం) బాస్కెట్ బాల్ జట్టులో సెంటర్ ఫార్వర్డ్. 1953 లో అమలాపురం జట్టులో సభ్యులుగా వుండి మద్రాసురాష్ట్ర బాస్కెట్ బాల్ పోటీలలో పాల్గొన్నారు. మరుసటి సంవత్సరము ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ పోటీలను గెలుచుకొన్న "లైట్ ఆఫ్ ఆంధ్రా" (అమలాపురం) జట్టు సభ్యులు. ఆ సంవత్సరము జాతీయ బాస్కెట్ బాల్ పోటీలలో ఆంధ్ర ప్రతినిధి. 1955 లో ఎస్. కె. బి. ఆర్. కాలేజి (అమలాపురం) జట్టు సభ్యులుగా వుండి ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాలల పోటీలలోనూ, ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ పోటీలలోనూ విజయం గాంచారు. ఆంధ్రరాష్ట్ర, ఆంధ్ర విశ్వవిద్యాలయ జట్లలో కూడా స్థానం వహించారు. 1956 లో మద్రాసు లయోలా కాలేజీ పోటీలలో పాల్గొన్న అమలాపురం కాలేజి జట్టు సభ్యులు; జాతీయ పోటీలలో ఆంధ్ర ప్రతినిధి.

శ్రీ కొణెదెన రాధాకృష్ణమూర్తి :— జననం 1932 గుంటూరులో. గుంటూరు హిందూకాలేజి హైస్కూలులో చదువుచుండగనే



గుంటూరు బ్లూస్, ఎమెచూర్ ఎథ్లెట్స్ ఎసోసియేషన్ టీములలో సభ్యత్వం వహించి వాలీబాల్, బాస్కెట్ బాల్ టోర్నమెంటులలో పాల్గొన్నారు. ఆరు సంవత్సరాల నిర్విరామకృషితో ఆంధ్రరాష్ట్ర జట్టులో స్థానం వహించకలిగారు. 1951, 52 లలో గుంటూరులో జరిగిన గాంధీజీ మెమోరియల్ బాస్కెట్ బాల్ పోటీలలో విజయమొందిన గుంటూరు బ్లూస్ జట్టు సభ్యులు. 1953, 54, 55 లలో వరంగల్లు,

విజయవాడ, తణుకు, అమలాపురంలలో జరిగిన ప్రధానమైన బాస్కెట్ బాల్ పోటీలలో పాల్గొన్నారు. అప్పుడు గుంటూరు ఎమచూర్ ఎథ్లెట్స్ ఎసోసియేషన్ జట్టు సభ్యులు. 1954, 1955 లలో ఆంధ్రరాష్ట్ర జట్టు సభ్యులు. 1955 లో గుంటూరు హిందూకాలేజి బాస్కెట్ బాల్ జట్టుకు నాయకత్వం వహించి మద్రాసు లయోలా కాలేజీ పోటీలలో పాల్గొన్నారు. అదే సంవత్సరము ఆంధ్ర విశ్వవిద్యాలయ బాస్కెట్ బాల్ జట్టుకు ఎన్నికైనారు. 1956 లో ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ పోటీలలో విజయ మొందిన ఎమచూర్ ఎథ్లెట్స్ ఎసోసియేషన్ జట్టు సభ్యులు.

శ్రీ ఎల్. రామకృష్ణమూర్తి :— జననం ఏప్రిల్ 1935 చిరుతపూడిలో (తూర్పుగోదావరిజిల్లా). 1949-50 లో జిల్లా ఆటల పోటీలలో అమలాపురం హైస్కూలు జట్టులో పాల్గొని 800 మీటర్ల పరుగులో ప్రథమస్థానం పొందారు. వీరున్న సోకర్ జట్టుకూడా విజయము గాంచింది. తరువాత యస్. కె. బి. ఆర్. కాలేజీలో ప్రవేశించి కాలేజీ బాస్కెట్ బాల్ జట్టులో ఎన్నికయినారు. రెండు సంవత్సరములు ఆంధ్ర విశ్వవిద్యాలయ అంతర్ కళాశాల బాస్కెట్ బాల్ పోటీలలో కాలేజి తరఫున పాల్గొని విజయమొందారు. అందులో ప్రతి సంవత్సరము ఎక్కువ పాయింట్లు సాధించి మన్ననలు పొందారు.



1952, 53 లలో చెన్నరాష్ట్ర క్రీడోత్సవంలో బాస్కెట్ బాల్, దూరపు పరుగు పోటీలలో పాల్గొనినారు. 1953 లో విజయవాడ ఇన్విటేషన్ బాస్కెట్ బాల్ పోటీలలో విజయమొందిన అమలాపురం జట్టు సభ్యులు. ఆ రెండు సంవత్సరములూ కాలేజీ ఛాంపియన్. 1954 లో ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ ఛాంపియన్ షిప్

సాధించిన కె. ఆర్. సి. జట్టు సభ్యుడు. 1954, 55, 56 లలో జాతీయ పోటీలలో ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి. 1956 లో అమలాపురం కాలేజీ జట్టు తరఫున మద్రాసు లయోలా కాలేజీ బాస్కెట్ బాల్ పోటీలలో పాల్గొన్నారు. 1956 అక్టోబరులో విజయవాడలో జరిగిన బాస్కెట్ బాల్ శిక్షణ కేంద్రంలో శిక్షణపొంది వెండి కప్పును బహుమతిగా పొందారు.

శ్రీ వై. రామలింగం :— జననం 1934 గుంటూరులో. గుంటూరు ఎమ్. జి. హైస్కూలులో చదువుచున్నంతకాలమూ జిల్లా



పోటీలలో బాస్కెట్ బాల్, చెడుగుడు, పరుగు పందెములందు పాల్గొన్నారు. రెండు సంవత్సరములు గుంటూరుజిల్లా పోటీలలో 100 మీటర్ల పరుగు, $\frac{1}{4}$ మైలు పరుగు, హార్డిల్సులో ప్రథములుగా వచ్చారు. 1952, 53 లలో గుంటూరు గాంధీజీ మెమోరియల్ బాస్కెట్ బాల్ పోటీలలో విజయమొందిన గుంటూరు బ్లూస్ జట్టు సభ్యులు. 1953, 54 లలో ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ పోటీలలో పాల్గొన్న ఎమచూర్ ఎథ్లెట్స్ ఎసోసియేషన్ జట్టు కెప్టెన్. 1953-55 లలో ఆంధ్రరాష్ట్ర జట్టు సభ్యులు. వీరింకా అబ్దుల్ రషీద్ టోర్నమెంటులో (వరంగల్లు) పాల్గొనివున్నారు. 1954 లో ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ పోటీలలో పాల్గొనిన ఎమచూర్ ఎథ్లెట్స్ ఎసోసియేషన్ జట్టు నాయకులు. 1955 లో ఆంధ్రరాష్ట్ర వాలీబాల్ ఛాంపియన్‌షిప్ సాధించిన ఎమచూర్ ఎథ్లెట్సు ఎసోసియేషన్ జట్టు సభ్యులు.

శ్రీ గద్దె రాజాస్వర్జన్ :— గుంటూరు వాస్తవ్యులు. వయస్సు షుమారు 25 సంవత్సరములు. బాల్యంలోనే బాస్కెట్ బాల్ ప్రారంభించారు. 1949 లో విజయవాడలో జరిగిన ఆంధ్ర ఒలింపిక్స్‌లో బాస్కెట్ బాల్ పోటీలో పాల్గొన్న "గుంటూరు బ్లూస్" సభ్యులు. 1952, 53 లలో గుంటూరు గాంధీజీ మెమోరియల్ బాస్కెట్ బాల్

ఛాంపియన్ షిప్ సాధించిన "గుంటూరు బ్లూస్" జట్టులో వున్నారు. 1953 లో ఆలిండియా రషీద్ మెమోరియల్ (వరంగల్లు) పోటీలలో పాల్గొన్న ఎమెచూర్ ఎథ్లెట్స్ ఎసోసియేషన్ జట్టు నాయకులు. 1953, 1955, 1956 లలో ఆంధ్రరాష్ట్ర పోటీలలో పాల్గొన్నారు.

శ్రీ కటకంసెట్టి మల్లిఖార్జునరావు :— గుంటూరు వాస్తవ్యులు. వయస్సు 18 సంవత్సరములు. 1953, 54 లలో గుంటూరు ఎమ్. జి. స్కూలు బాస్కెట్ బాల్ జట్టు కెప్టెన్. ఈ టీము జిల్లా ఆటల పోటీలలో విజయమొందింది. 1954 లో గుంటూరుజిల్లా (నార్త్) హైస్కూల్ బాస్కెట్ బాల్ జట్టుకు నాయకత్వం వహించి గుంటూరులో జరిగిన ప్రాంతీయ బాస్కెట్ బాల్ పోటీలలో విజయమొందారు. తదనంతరం ఆంధ్రరాష్ట్ర, మద్రాసు లయోలాకాలేజీ, ఆంధ్ర విశ్వవిద్యాలయ అంతర్కళాశాలల బాస్కెట్ బాల్ పోటీలలో పాల్గొని పేరొందారు. ఎమచూర్ ఎథ్లెట్స్ ఎసోసియేషన్ జట్టు సభ్యులు. ప్రఖ్యాత అమెరికన్ కోచ్ ఫ్రాంక్ కాఫ్మన్ వద్ద హైదరాబాద్ లో శిక్షణ పొందారు.

శ్రీ ఇనుగంటి భావన్నారావు :— పిఠాపురం వాస్తవ్యులు. వయస్సు 27 సంవత్సరములు. 1948 లో గ్రిగ్. మెడలు సంపాదించారు. 1950-51 లో మద్రాసులో వై. యమ్. సి. ఏ. వ్యాయామ కళాశాలలో శిక్షణ పొందినారు. వీరు బాస్కెట్ బాల్ ఆటయేగాక క్రికెట్, సాఫ్ట్ బాల్, ఫుట్ బాల్, వాలీబాల్, హాకీ, కబడీ, బాడ్ మింటన్ ఆటలలోకూడా ప్రావీణ్యం గడించారు. వీరు బీహార్, ఒరిస్సా, మద్రాసు, హైదరాబాద్ మున్నగు రాష్ట్రములలో జరిగిన అనేక ఆటల పోటీలలో పాల్గొన్నారు. రెండు సంవత్సరములు ఆంధ్రరాష్ట్ర బాస్కెట్ బాల్ పోటీలలో పాల్గొన్నారు. అప్పుడు పిఠాపురం జట్టుకు నాయకులు. ఆంధ్రరాష్ట్ర ఎథ్లెటిక్ పోటీలలో



రెండుపర్యాయములు జావలిన్ విసురుటలో బహుమతిని పొందినారు. 1955 లో హైదరాబాద్‌లో ప్రఖ్యాత అమెరికా కోచ్ శ్రీ కాఫ్మన్ వద్ద శిక్షణపొందారు. వీరు ప్రస్తుతం పిఠాపురం హైస్కూలులో వ్యాయామ బోధకులుగా పనిచేయుచూ అనేకమంది యువకులను క్రీడా రంగంలో ప్రోత్సహిస్తున్నారు. ఇండియా బాస్కెట్ బాల్ జట్టులో ఎన్నికయిన శ్రీ వీరరాజువంటివారు వీరివద్ద శిక్షణ పొందివున్నారు.

శ్రీ దారపనేని వెంకటేశ్వర్లు :— గుంటూరు నివాసి. 17 సంవత్సరముల యువకుడు. 1954లో గుంటూరు ఎమ్.జి. హైస్కూలు




జట్టులో పాల్గొని జిల్లా బాస్కెట్ బాల్ ఛాంపియన్ షిప్ గెలుచుకొన్నారు. గుంటూరు (నార్త్) జట్టులో కూడా ఎన్నికై ప్రాంతీయ బాస్కెట్‌బాల్ పోటీలలో విజయమొందారు. 1955 లో హైస్కూలు బాస్కెట్‌బాల్‌జట్టుకు నాయకత్వం వహించి జిల్లా పోటీలలో విజయము గాంచారు. ఆ సంవత్సరము గుంటూరు (నార్త్) జట్టుకు నాయకత్వం వహించి తిరుపతిలో జరిగిన ప్రాంతీయ బాస్కెట్‌బాల్ పోటీలలో పాల్గొని విజయం చేబట్టారు. వీరు ఆంధ్ర రాష్ట్ర పాఠశాలల బాస్కెట్‌బాల్ జట్టులో ఎన్నికై హైదరాబాద్‌లో జరిగిన జాతీయ పోటీలలో పాల్గొన్నారు. ఆంధ్ర జట్టులో అమోఘమైన నేర్పును ప్రదర్శించి ఆంధ్ర యువకులకు ఉజ్వల భవిష్యత్తు కలదని ఋజువు పరిచారు. వీరు ఆంధ్రజట్టుకు వైస్ కెప్టెన్‌గా కూడా వ్యవహరించారు.

శ్రీ బొక్కా సూర్యనారాయణ :— నివాసం ముక్తేశ్వరం. శ్రీ జయంతి రామయ్యపంతులు బోర్డు హైస్కూలులో ఆరవ ఫారం చదువుచున్నారు (1956). వీరు ఆంధ్రరాష్ట్ర పాఠశాలల బాస్కెట్

బాల్ జట్టులో ఎన్నికయి 1955 లో హైదరాబాద్‌లో జరిగిన జాతీయ పోటీలలో పాల్గొన్నారు.

* బాస్కెట్‌బాల్ ఆటగాళ్ళగానేమి, శిక్షకులుగానేమి క్రింది వారు ఆంధ్రదేశంలో పేరుగడించి వున్నారు.

శ్రీ వి. సూర్యనారాయణమూర్తి :- ఇండియా బాస్కెట్ బాల్ ఫెడరేషన్ 'ఎ' తరగతి శిక్షకులు. 1955 డిశంబరులో హైదరాబాదులో జాతీయ పోటీలలో పాల్గొన్న ఆంధ్రజట్టు శిక్షకులు. 1956 అక్టోబరులో విజయవాడలో నిర్వహించబడిన బాస్కెట్‌బాల్ కోచింగ్ క్యాంప్‌లో శిక్షకులుకూడా.

శ్రీ వి. రాములు :— భారతప్రభుత్వ విద్యాశాఖ శిక్షణ ప్రణాళిక ననుసరించి ఉన్నత శిక్షణను వీరు పొందివున్నారు. 1956 లో విజయవాడ శిక్షణ కేంద్రంలో శిక్షకులు.

. ఆటగాళ్లు :— శ్రీయుతులు ఎమ్. సూర్యనారాణరాజు (అమలాపురం), కె. సిమన్‌జాన్ (నరసాపురం), కె. వి. రమణరావు (కాకినాడ), కె. నాగరాజు (కాకినాడ), బి. హెచ్. యం. దక్షిణామూర్తి (పామర్రు), డి. ప్రభాకరదేవర (మార్టేరు), వి. వి. లక్ష్మీనారాయణ (పామర్రు), జి. గణేశ్వరరావు (సీతానగరం), ఎ. సి. హెచ్. వెంకన్న (అమలాపురం), బి. యస్. రామకృష్ణరాజు (పాలకొల్లు), ఎమ్. తిమ్మేశ్వరరావు (కాకినాడ), యస్. భాస్కరరావు (కాకినాడ), ఎమ్. డి. నాగేశ్వరరావు, డి. రామచంద్రమూర్తి, పి. వెంగళ్ రావు, ఎమ్. తిరుపతిరాజు, ఎమ్. అప్పల నరసింహరాజు, పి. శేషగిరిరావు, ఆర్. ఆర్. యస్. శాస్త్రి, యన్. మంజునాథ్, ఎన్. రాజారామన్, జి. నారాయణరావు, ఓ. నరసింహరావు, డి. చింతయ్య, ఎ. వి. రాంరెడ్డి ఆర్. చంద్రశేఖర్, కె. ఆర్. కృష్ణమూర్తి, ఐ. ఆర్. కృష్ణంరాజు, యన్. యస్. వి. వి. నాయకర్, వి. అప్పల నరసింహరాజు, కె. కోటీశ్వరరావు, పి. పద్మనాభరాజు, మన్మథరావు (వీరందరూ విజయవాడకు చెందినవారు). ఆర్. సత్యనారాయణ, పి. శ్రీహరిరావు, కె. రామకృష్ణ, ఎస్. గోవిందరావు, సి. యం. భూపయ్య (వీరందరు విజయ

నగరమునకు చెందినవారు), వై. శ్రీమన్నారాయణ (ఆముదాలవలస), డి. నరసింహరాజు (భీమవరం), జి. పాండురంగరావు (అప్పికట్ల), బి. రాజారావు (ఆచంట), పి. అన్నాజీ (నరసాపురం), ఎల్. నరసింహారావు (కొవ్వూరు), జి. యస్. రామయ్య (మోదుకూరు), యర్. రామబ్రహ్మం (గుంటూరు), ఎల్. నరసింహారావు (తణుకు), వి. అప్పలరాజు (రాజమండ్రి), ఎస్. వెంకటస్వామి (కొత్తపేట), డి. యస్. రామరాజు (అమలాపురం), టి. వి. నాగభూషణం (తుని), కె. సత్యానందం (పెద్దాపురం), ఎ. వి. నీలాచలం (మచిలీపట్నం), ఎస్. వి. ఆర్. కె. యస్. యస్. నారాయణ (గుంటూరు), కె. ఆర్. బ్రహ్మానందం, పి. వి. రమణమూర్తి, వై. ప్రసాదరావు, ఆర్. వెంకటపతిరాజు (అమలాపురం).

ఆంధ్ర బాస్కెట్‌బాల్ కార్యకర్తలు (1956 లో) :

శ్రీయుతులు పసల సూర్యచంద్రరావు, నల్లా రెడ్డినాయుడు, పి. రామచంద్రరావు (అమలాపురం), ఎం. గోపాలస్వామి, నాయుడు (విజయవాడ), ఇ. లక్ష్మీనాథరావు (భీమవరం), ఎస్. ఆంజనేయులు పంతులు (విజయవాడ), వి. ఎస్. నారాయణ (రాజమండ్రి), కె. పార్వతీశం (వాల్తేరు), శ్రీమతి పి. డి. నవమణి (విజయవాడ), ఎమ్. పి. శాస్త్రి (విజయవాడ), జి. పి. బాబురావు (గుంటూరు), జె. నారాయణమూర్తి (భీమవరం), బి. ఆదినారాయణ (కొత్తపేట), ఆర్. యన్. శర్మ (అమలాపురం), పి. కృష్ణమూర్తి (అమలాపురం), హెచ్. బి. వి. శర్మ (అమలాపురం).

విజయవాడ సిరిస్ లిమిటెడ్ మేనేజింగ్ డైరక్టర్ శ్రీ జి. యస్. రాజుగారు ఆంధ్రదేశంలో బాస్కెట్‌బాల్ పురోభివృద్ధికి ఎంతైనా కృషి చేసి వున్నారు. ఇట్టి కృషి సాగిస్తున్న యితర సంస్థల వివర మిది :— డబ్ల్యు. జి. బి. కాలేజి, భీమవరం; బోర్డు హైస్కూలు, రేలంగి; మిల్లర్స్ అసోసియేషన్, భీమవరం; ఎస్. కె. బి. ఆర్. కాలేజి, అమలాపురం; కోనసీమ క్రికెట్ క్లబ్, అమలాపురం; లైట్ ఆఫ్ ఆంధ్రాస్ క్లబ్, అమలాపురం; ఎమెచూర్ ఎథ్లెట్సు ఎసోసియేషన్ గుంటూరు; స్పోర్ట్సు ఎసోసియేషన్, భీమవరం; పిఠాపూర్ క్రికెట్

షన్ క్లబ్, పిఠాపురం; నేషనల్ క్లబ్, కొత్తపేట; ఓల్డు స్టూడెంట్సు ఎసోసియేషన్, కలంగి; స్పోర్ట్సుమెన్ ఎసోసియేషన్, తణుకు; బ్లూ బుల్లెట్సు ఎసోసియేషన్, గుంటూరు; నరసాపూర్ క్లబ్, నరసాపురం; నింబుల్సు క్లబ్, రాజమండ్రి.

శ్రీ రణధీర్ ఛోప్రా :— 1956 అక్టోబరులో విజయవాడలో నిర్వహించబడిన కోచింగ్ కేంద్రంలో వీరు ప్రధాన శిక్షకులు. ఇండియాలో పర్యటించనున్న పాకిస్తాన్ జట్టుతో పోటీచేయవలసివున్న ఇండియా జట్టుకు శిక్షకులుగా నియమితులై వున్నారు. ప్రథమ ఆసియా క్రీడోత్సవంలో పాల్గొన్న ఇండియా బాస్కెట్ బాల్ జట్టు నాయకులు. ఆంధ్రదేశంలో టోర్నమెంటులను హెచ్చుగా నిర్వహించినట్లయితే ఆంధ్ర ఆటగాళ్ల ప్రావీణ్యం హెచ్చుగలదని వీరు సలహా యిచ్చివున్నారు.

శ్రీ హెచ్. పాండురంగారావు:— (మైసూరు). వయస్సు సుమారు 29. హైస్కూలు దశలోనే బాస్కెట్ బాల్ ఆట ప్రారంభించారు. 1950 లో మైసూరు యూనివర్సిటీ జట్టు కెప్టన్. ఆ యేటి నుంచి జాతీయ పోటీలలో మైసూరుజట్టు సభ్యులు. 1953 - 54 లో మైసూరు కెప్టన్. 1954 లో పాకిస్తాన్ లో పర్యటించిన ఇండియాజట్టు సభ్యులు. ఒంటి చేతితో బాస్కెట్ వేయడంలో వీరు దిట్ట. డిఫెన్సు ఆటలో అగ్రగణ్యుడు. విశ్రాంతి తీసుకోకుండా 40 నిమిషాలు ఆడడం వీరి ప్రత్యేకత.

శ్రీ సి. వి. విజయరాఘవన్ :— (మైసూరు). ఈ బెంగుళూరు నివాసి 1954 ఫిబ్రవరిలో పాకిస్తాన్ లో పర్యటించిన ఇండియాజట్టు నాయకులు. ఇండియాజట్టు మొత్తం మూడు టెస్టులలో పాల్గొని 2-1 గేములతో అంతిమ విజయం (రబ్బరు) సాధించింది. 1953-54 లో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజి వీరికి 'ఇన్‌స్టిట్యూట్ బ్లూ' సమర్పించింది. 1941 లో బాస్కెట్ బాల్ ప్రారంభించారు. బెంగుళూరు నేషనల్సు కెప్టెన్‌గా వున్నారు. 1944 లో ఈ జట్టు అనేక ట్రోఫీలను గెలుచుకొన్నది. 1946 నుంచి

జాతీయపోటీలలో మైసూరుజట్టు సభ్యులు. 1952 లో మైసూరుజట్టు నాయకులు.

శ్రీ అప్పయ్య :— (మైసూరు). హాకీకి ధ్యాన్‌చంద్, క్రికెట్‌లో రంజి ఎటువంటివారో ఇండియా బాస్కెట్ బాల్‌కు శ్రీ అప్పయ్యగారు అటువంటివారు. పాండురంగారావువంటి యువకులను శ్రీ అప్పయ్య ఏరి పైకి తీసికొనివచ్చినారు. అమెరికన్ శిక్షకుడు శ్రీ ఫ్రాంక్ కాఫ్మన్ వద్ద అప్పయ్యగారు ఉన్నత శిక్షణ పొంది వున్నారు. 1955 లో శ్రీ కాఫ్మన్ బెంగుళూరు వచ్చినప్పుడు మొదలుగా అప్పయ్యగారిని చూచి శిష్యుని సేవను మిక్కిలి కొనియాడారు. అప్పయ్య, పాండురంగారావు, లక్ష్మీనారాయణ - ఈ మువ్వురూ వున్న జట్టు ఇండియాలో ఓటమి ఎరుగదు. యాభయ్యవపడిలో పడినా శ్రీ అప్పయ్యగారు బాస్కెట్‌బాల్ ఆటను చురుకుగా ఆడగలుగుతున్నారు.

శ్రీ ఫ్రాంక్ కాఫ్మన్ :— (అమెరికా) బాస్కెట్‌బాల్ ఆటలో భారతీయుల ప్రమాణం ఇటీవల వృద్ధిచెందడానికి ప్రధాన కారకులు శ్రీ ఫ్రాంక్ కాఫ్మన్. వీరు 1955 ద్వితీయభాగంలో ఢిల్లీ, అజ్మీరు, కలకత్తా, మద్రాసు, బెంగుళూరు, హైదరాబాద్ నగరాలలో శిక్షణ కేంద్రాలను నిర్వహించి భారతీయ ఆటగాళ్లకు విశిష్ట విధానాలను బోధించివున్నారు. ఆంధ్ర ప్రముఖులు శ్రీ వీర్రాజు, శ్రీ వి. యస్. యన్. మూర్తి, శ్రీ ఆర్. విశ్వేశ్వరరావు, శ్రీ పి. వేణుగోపాల్ ప్రభృతులు వీరివద్ద శిక్షణపొంది వున్నారు. ఇండియాలో ఆటగాళ్లలో చాలామందికి ఆట ప్రాథమిక సూత్రాలు పూర్తిగా తెలియవని "పూర్వ కాలంలో" వినియోగించబడిన తోలుబంతి వినియోగించరాదని, రబ్బరు బంతిని వినియోగించాలని నేలపై గాక చెక్కలపై ఆడినట్లయితే ఆట వేగం రెట్టింపు కాగలదని, ప్రతి నగరంలోనూ ఒక్కొక్క పెద్ద ఇన్‌డోర్ స్టేడియం నిర్మించబడాలని శ్రీ కాఫ్మన్ హితవు చెప్పివున్నారు. 12 వ ఏట నుంచే, బాస్కెట్‌బాల్ ఆట నేర్పడం అత్యవసరమని సూచించివున్నారు. (85 వ పేజీకూడా చూడండి.)

అమెరికాలో ఇంకా శ్రీయుతులు బిల్ రస్సెల్, (శాన్ ఫ్రాన్సిస్కో-ఈయన ఆరడుగుల పది అంగుళాల పొడగరి), డారల్ ఫ్రాయిడ్ (ఫర్మన్), నీల్ జాన్స్టాన్ (ఫిలడల్ఫియా), పాల్ అరిజిన్ (ఫిలడల్ఫియా) బాస్కెట్ బాల్ ఆటలో ప్రపంచఖ్యాతి గడించివున్నారు.

* అమెరికాలో మార్చి నెలలో బాస్కెట్ బాల్ టోర్నమెంట్లు జరుగుతవి. నాలుగువేల టోర్నమెంటులలో 20 వేల సీనియర్ ఆటగాళ్ళు, 30 లక్షలమంది విద్యార్థులు పాల్గొంటూ వుంటారు. వీటిని తిలకించే ప్రేక్షకుల సంఖ్య దాదాపు 2 కోట్లు. ప్రతి రాష్ట్రానికీ, ప్రతి ఏటా ఛాంపియన్‌ను నిర్ణయించి సత్కరిస్తారు.

సోవియట్ రష్యాలో జానిస్ కృమిక్స్ (18), మెయ్గునిస్ వాల్డమనిస్, ఆర్కాడీ, బొచ్కారేవ్, మైఖేల్ సెమినోవ్, కాజీపెట్క్రాయోవికస్, యూరీబజెరోవ్, స్తానిస్ స్తోన్కుస్ గారలు ప్రపంచఖ్యాతి గడించివున్నారు. వీరి సగటు ఎత్తు ఆరడుగులు.

# అధ్యాయము 17

## బాడ్మింటన్

బాల్ బాడ్మింటన్ పుట్టుక ఇండియాలో. దక్షిణ భారతంలోని తంజావూరులో ఈ ఆట మొదట ఆడబడేదని తెలుస్తున్నది. తంజావూరుకు వచ్చిన ఉత్తర భారతీయ వర్తకులు పూనాలో ఈ ఆటను ప్రవేశపెట్టినారట.

షటిల్ కాక్ బాడ్మింటన్ కూడా ప్రాచ్యఖండ క్రీడే. ఫ్రెంచి వారు కూడా షటిల్ కాక్‌ను ఒక సెట్టుపైనుంచి వేసి ఆడేవారని, బెన్‌ఫోర్టు డ్యూక్ తన భవనం ఆవరణలో బాడ్మింటన్ ఆడడానికి పూర్వం నుంచి ఫ్రాన్సులో ఈ ఆట ప్రచారంలో వున్నదని కూడా తెలుస్తున్నది. బెన్‌ఫోర్టు డ్యూక్ భవనం పేరు 'బాడ్మింటన్' అని, ఆ ఆట జన్మస్థలం అక్కడే గాబట్టి షటిల్ కాక్ ఆటకు బాడ్మింటన్ అన్న పేరు వచ్చిందని కూడా అంటారు.



17 వ శతాబ్దంలో ఇంగ్లండులో షటిల్ కాక్ ఆట కొద్దిగా ప్రచారంలో వున్నది. షటిల్ కాక్ ఇంగ్లండునుంచి ఇండియాకు "దిగుమతి" అయినదని బ్రిటిష్‌వారు వాదిస్తున్నారు. తొలిసారి 1874 లో కరాచీలో ఇండియా షటిల్ కాక్ ఆటకు నియమ నిబంధనలు రూపొందించ బడినవి. 1901 లో బాడ్మింటన్ కోర్టు హద్దుల నిర్ణయం తొలిసారి జరిగింది. ఇండియానుంచి తిరిగివచ్చిన బ్రిటిష్‌వారు 1893 లో ఇంగ్లండులో బాడ్మింటన్ ఎసోసియేషన్ స్థాపించారు. తొలిసారి 1899 లో ఆల్ ఇంగ్లండు బాడ్మింటన్ ఛాంపియన్‌షిప్ పోటీలు ప్రారంభమైనవి.

1903 లో మొట్టమొదటి అంతర్జాతీయ పోటీ ఇంగ్లండు, ఐర్లండులమ జరిగింది. బ్రిటిష్ మిషనరీల కృషివల్ల ఈ ఆట ప్రపంచవ్యాప్తి చెందింది. మలయా, డెన్మార్క్, అమెరికాలు ఆరంభంలో బాడ్మింటన్ ఆటలో ప్రపంచంలో ప్రముఖస్థానం వహిస్తూ వచ్చినవి. ప్రస్తుత ప్రపంచ ఛాంపి యన్లు మలయన్లు. 1949 లోనూ, 1952-56 వరకు మలయా ప్రపంచ బాడ్మింటన్ ఛాంపియన్ షిప్‌ను తద్వారా థామస్ కప్పును గెలుచు కొన్నది.

ఊంగ్ పా లిమ్, ఇస్మాయిల్ బిన్ మర్జన్ వంటి మలయన్ ఆట గాళ్ళు ఇండియాలో పర్యటించి వున్నారు. ఎడ్డిమాంగ్ అనే మలయన్ ఆటగాడు అనధికారరీత్యా ప్రపంచ ఛాంపియన్.

శ్రీ టాంజోహాక్ ఇండోనీసియాలో బాడ్మింటన్ ఆటలో అద్వితీయుడు.

విదేశాలలో షటిల్ బాడ్మింటన్ మాత్రమే అమలులో వున్నది. ఇండియాలో ఉత్తర భారతంలో షటిల్‌కాక్ మాత్రమే ప్రచారంలో వున్నది. దక్షిణ భారతంలో ముఖ్యంగా ఆంధ్రదేశంలో బాల్ బాడ్మింటన్ విశేషంగా ప్రచారంలో వున్నది. కొద్దికాలంనుంచే యూనివర్సిటీ విద్యార్థులు షటిల్ బాడ్మింటన్ ఆడుతున్నారు. ఆంధ్రలో అనాదిగా షటిల్‌కాక్ ఆట ప్రచారంలో లేనందున ఆంధ్రలో అంతర్జాతీయ ఖ్యాతి గడించిన బాడ్మింటన్ ఆటగాళ్లు లేకపోయినారు.

బాల్ బాడ్మింటన్ ఊలుబంతి ఆట. షటిల్ బాడ్మింటన్ ఆట తురాయిబంతి ఆట.

ఇండియా తొలిసారి 1950 లో థామస్‌కప్పు (ప్రపంచ) షటిల్ బాడ్మింటన్ పోటీలలో పాల్గొన్నది.

ఆంధ్ర బాడ్మింటన్ ఆటగాళ్లు దక్షిణ భారతమంతటికి ఛాంపి యన్లుగా నిలిచిన రోజు లున్నాయి. 1925 నుంచి 29 వరకు దక్షిణ భారతంలో ఏజట్టుచేత ఓడించబడని, బాల్ బాడ్మింటన్ జట్టు కాశీ బ్రదర్స్ (రామచంద్రపురం). ఈ జట్టులో క్రింది ప్రముఖు లుండేవారు

(స్వర్గీయ) కాశీ విశ్వనాథం (సెంటర్ ఆడేవారు), శ్రీ ఎస్. రామలింగం మొదలియార్ (లెఫ్ట్ ఫ్రంట్, ప్రస్తుతనివాసం రాజమండ్రి), (స్వర్గీయ) ఎస్. శంకరం (రైట్ బ్యాక్, "ఛాంపియన్ ఆఫ్ ది బ్యాక్స్"గా వీరు కీర్తి గడించారు), శ్రీ ఎస్. నారాయణరావు (రైట్ ఫ్రంట్, వీరు అఖిలభారత ఖ్యాతి నొందిన టెన్నిస్ ఆటగాడుకూడా), శ్రీ బళ్ళా అప్పారావు (లెఫ్ట్‌బ్యాక్, వీరి ప్రస్తుత నివాసం కాకినాడ).

శ్రీ కాశీ విశ్వనాథంగారి అస్తమయానంతరం శ్రీ ఎస్. నాదముని మొదలియార్‌గారు వారి స్థానములో "కాశీబ్రదర్స్"లో ఆడేవారు. వీరుకూడా స్వర్గస్థులైనారు.

పూర్వపు ఆటగాళ్లలో శ్రీయుతులు టి. రామలింగస్వామి (రాజమండ్రి); సున్న రామారావు, సున్న రాఘవులు, అప్పారావు (వీరందరూ తూర్పుగోదావరి జిల్లా శివకోడు టీముకు చెందినవారు). శ్రీయుతులు యం. బాలచంద్రరావు- "బాచీ" (లెఫ్ట్‌బ్యాక్), (స్వర్గీయ) బి. గోవిందరావు (సెంటర్), సత్యం (రైట్ ఫ్రంట్), స్వర్గీయ శ్రీనివాసరావు (లెఫ్ట్‌ఫ్రంట్) డి. నారాయణరావు (రైట్ బ్యాక్)— వీరందరు బందరు "జాలీ బ్రదర్స్" జట్టు సభ్యులు. శ్రీయుతులు రాజారావ్ (రైట్ బ్యాక్), గజపతి (ఫ్రంట్), (స్వర్గీయ) ఏ. వి. సుబ్బారావు, (స్వర్గీయ) పార్థసారధి, బాపనయ్య— వీరందరూ "చిన్నా టీం" సభ్యులు. శ్రీయుతులు అన్నాబత్తుల సత్యనారాయణ, (నరసాపురం), ప్రసంగి నాగేశ్వరరావు (బందరు) కట్టూరి హనుమంతరావు (రాజమండ్రి), దక్షిణ భారతంలోకెల్ల ఘనకీర్తి గడించారు.

శ్రీ "బాచి" (ఎమ్. బాలచంద్రరావు) ప్రముఖ టెన్నిస్ ఆటగాడు కూడా.

ఆంధ్రరాష్ట్రి అవతరణ పిమ్మట 1954 జనవరిలో ఆంధ్రరాష్ట్రి బాల్ బాడ్మింటన్ సంఘం స్థాపించబడింది. శ్రీ ప్రభల సీతారామ శాస్త్రి, శ్రీ ఎమ్. అప్పారావు ప్రభృతులు ఈ సంఘావతరణకు కృషి చేసి వున్నారు. సంఘం ప్రారంభ దినములలో శ్రీయుతులు పి. వెంకట రత్నం, వి. వి. చిన్నారావు, డాక్టర్ సి. సత్యనారాయణరావు,

సి. హెచ్. బుల్లిసుబ్బారావు, కె. డి. సింగ్ (విజయవాడ వ్యాయామ కళాశాల అప్పటి ప్రిన్సిపాల్), ఎ. రామమోహనరావు, పి. నాగేశ్వర రావు గారలు చేసిన కృషి ప్రశంసనీయం.

ఇప్పుడు మద్రాసు-కాకినాడల "జయశ్రీ" జట్టు, వరంగల్లు పిచ్చయ్య జట్టు దక్షిణ భారతంలో ప్రముఖస్థానం వహిస్తున్నవి.

## బాల్ బాడ్మింటన్ ఆటగాళ్ళ పరిచయం

శ్రీ జె. పిచ్చయ్య:— జననం 1918, మచిలీపట్నం. 1938 వరకు బందరులో విద్యాభ్యాసం చేశారు. హైస్కూలు విద్యార్థిగా వున్నప్పుడే ఫుట్‌బాల్, బాస్కెట్‌బాల్, వాలీబాల్, బాడ్మింటన్, చెడుగుడు టోర్నమెంటులలో పాల్గొనేవారు. చదువు చాలించిన అనంతరం బాడ్‌మింటన్ ఆటపై దృష్టిని కేంద్రీకరించి జూనియర్ టోర్నమెంట్లలో విజయం సాధించారు. ఈత ద్వారా, వ్యాయామముద్వారా ఆరోగ్యాన్ని పెంపొందించుకొన్నారు. 1939 లో దక్షిణ భారతంలో ప్రఖ్యాతి చెందిన శ్రీ దక్షిణామూర్తి జట్టుతో పోటీ చేశారు, ఆ సమయంలో శ్రీ దక్షిణామూర్తిగారు పిచ్చయ్యగారి ఆటను పొగడి, తనకు వచ్చిన ప్రత్యేక బహుమతిని పిచ్చయ్యగారికిచ్చి మిక్కిలి ప్రోత్సహించారు.

ఆ తరువాత శ్రీ పిచ్చయ్యగారు, తమ జట్టుతో కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాలలో అనేక పోటీలలో విజయం సాధించారు. తెనాలిలో కోపరేటివ్ డిపార్టుమెంటులో ఉద్యోగం చేస్తూ, అచ్చటి యువకులకు ఆరేళ్ళు తర్ఫీదు యిచ్చారు. ఆ సమయంలో తెనాలికి, ప్రఖ్యాత డబుల్స్ ఆటగాడు శ్రీ రాజగోపాల్ వచ్చారు. అప్పటికి శ్రీ రాజగోపాల్ డబుల్స్‌లో అజేయుడు. వీరికి "డబుల్స్ మాస్టర్" అనే బిరుదుకూడా వుండేది. అంతవరకూ "ఫైవ్స్" లో పేరు సంపాదించిన శ్రీ పిచ్చయ్యగారు డబుల్స్ జట్టుకూడా ఏర్పాటుచేయ సంకల్పించారు. శ్రీ చెట్టియార్‌ను పార్ట్నర్‌గా చేర్చుకొన్నారు. దక్షిణాది పోటీలలో పాల్గొన్నప్పుడు మొదటి రెండు పర్యాయాలు పరాజయం పొందారు.

కాని మరుసటిసారి పుదుచ్చేరి, సేలం మొదలగు టోర్నమెంట్లలో విజయం సాధించారు.

1944-45 ప్రాంతాలలో జూనియర్ ఆటగాళ్ళలో వృద్ధిలోనికి వస్తున్న, ఎడమచేతి ఆటగాడు శ్రీ కరీంను పార్ట్నర్‌గా ఎన్నుకొన్నారు. అప్పటినుంచి 11 సంవత్సరాలు డబుల్స్ టోర్నమెంటులలో అనేక విజయాలు సాధించారు.

1951 లో మొదటి మద్రాసు రాష్ట్ర ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొన్నారు. 1955 డిశంబరులో హైదరాబాదులో జరిగిన జాతీయ ఛాంపియన్‌షిప్‌ను సాధించారు.

వీరు ప్రస్తుతం వరంగల్లు (హైదరాబాద్)లో "పిచ్చయస్పోర్ట్సు" అనే క్రీడా పరికరాల విక్రయశాలను నిర్వహిస్తున్నారు.

శ్రీ ఆర్. వి. అప్పారావు :— జననం 1934 జనవరి 15 కాకినాడతాలూకా కొవ్వాడలో. సామర్లకోట హైస్కూలులో చదివే



కాలంలో బాడ్మింటన్ ప్రారంభించారు. 1952 - 53 లో ఇంటర్ కలేజియెట్ బాడ్మింటన్ పోటీలలో పాల్గొన్నారు. ఇదే సంవత్సరంలో మండపేటలో జరుపబడిన ఆల్ ఇండియా బాడ్మింటన్ పోటీలో కాకినాడజట్టు ప్రతినిధిగా వుండి శ్రీ పిచ్చయ్యగారిచే ప్రత్యేక కప్పు బహూకృతిని పొందారు. 1954-55 లో సామర్లకోటలో ప్యారీ కంపెనీవారు నిర్వహించిన టోర్నమెంటులో పై జట్టు ప్రథమస్థానం వహించింది. దుమ్ముగూడెం టోర్నమెంటులో బంగారుపతకాలు పొందారు. 1955, 56 లలో మద్రాసు లయోలా కాలేజి బాడ్మింటన్ ఛాంపియన్‌షిప్‌ను వీరి కాలేజిజట్టు గెలుచుకొన్నది.

1956 ఆగష్టులో వీరి జట్టు "జయశ్రీక్లబ్" మద్రాసు యస్.ఐ.ఎ. టోర్నమెంటులో డబుల్స్, ఫైవ్స్ ఛాంపియన్‌షిప్ సాధించింది. రాజగోపాల్ జట్టును అప్పుడు ఓడించి వేసింది. ఈ విజయం ఆంధ్రరాష్ట్ర బాడ్మింటన్ చరిత్రలో నూతన అధ్యాయమని చెప్పవచ్చు. వీరు కాకినాడ పి. ఆర్. కాలేజి బాడ్మింటన్ జట్టు కెప్టెన్‌గాకూడా వున్నారు. వీరి "జయశ్రీ" టీము తమిళనాడులోని పెద్ద టోర్నమెంటులలో విజయాలు సాధించి వున్నది.

శ్రీ ప్రఖల సీతారామశాస్త్రి :— జననం 1910 అక్టోబరు 1 తణుకులో. 1929 నుంచి బాడ్మింటన్ పోటీలలో పాల్గొన్నారు. 1955 లో భీమవరంలో జరిగిన బాడ్మింటన్ పోటీలలో వీరిజట్టు, రాజగోపాల్ జట్టును (రాజగోపాల్, పిఠాపురం సుబ్బారావు, రంగాచారి, వేలాయుధము, శాస్త్రి); పిచ్చయ్య జట్టును (పిచ్చయ్య, కరీం, వాహబ్, బుచ్చి, యం. రామారావు) ఓడించి వేసింది. శ్రీ శాస్త్రిగారు పేరొందిన టెన్నిస్ ఆటగాడుకూడా. 1933-36 లలో వీరు శ్రీ దుగ్గిరాల పూర్ణచంద్రరావు గారికి పార్ట్నర్‌గా వుండి



ఆంధ్రలో పెక్కు టెన్నిస్ డబుల్స్ పోటీలను గెలుచుకొన్నారు.

క్యారమ్స్, టేబుల్ టెన్నిస్ ఆటలలోకూడ వీరు ప్రావీణ్యం గడించినారు. ప్రస్తుత నివాసం రేపల్లె.

శ్రీ నల్లంరెడ్డి వెంకటేశ్వరరావు :— ("ఎన్నాయ్".) వయస్సు 33 సంవత్సరాలు. వీరు పిచ్చయ్య జట్టులో లెఫ్ట్‌బ్యాక్‌గా ఆడి, ఎన్నో పెద్ద పోటీలలో పాల్గొని విజయాలు సాధించి వున్నారు. చక్కని డిఫెన్స్ ఆటగాడు. వాలీబాల్ ఆటలోకూడా మిక్కిలి పేర్పరులు.

శ్రీ అబ్దుల్ వాహబ్ :—జననం 1930 నవంబరు గుంటూరులో. హైస్కూలు దశలో వాలీబాల్, ఫుట్‌బాల్ ఆడేవారు. 16 వ ఏట మధురలో బాడ్మింటన్ ఆట ప్రారంభించారు. రెండేండ్లు తీవ్రంగా అభ్యసించి రాజారాం మెమోరియల్ డిస్ట్రిక్ట్ టోర్నమెంటువంటి పెద్ద పోటీలలో పాల్గొని సెమిఫైనల్సువరకు వచ్చేవారు. మధురలో టి. వి. డి. శివస్వామి మెమోరియల్ టోర్నమెంటులో పాల్గొని ప్రత్యేక వెండి కప్పు బహుమతి పొందారు. మద్రాసు నివాసి శ్రీ దక్షిణామూర్తిగారి ప్రోత్సాహంతో వీరు మరింత తీవ్రంగా కృషిచేసి వారితో కలిసి డబుల్స్ పోటీలలో పాల్గొని అనేక సీనియర్ టోర్నమెంటులను గెలుచుకొన్నారు. ఇప్పుడు దక్షిణభారత అగ్రఆటగాళ్ళలో ఒకరు. మద్రాసు ఉబ్రాయ్ లిమిటెడ్‌లో పనిచేస్తున్నారు. 'జయశ్రీ' జట్టులో కూడా వీరు పాల్గొని అనేక విజయాలు చేబట్టి వున్నారు.

శ్రీ పిఠాపురం సుబ్బారావు :— వయస్సు 36. వీరు ఆంధ్రరాష్ట్ర జట్టులో సెంటర్ ఆడినారు. వీరు అంతకుముందు బందరులోని కె. వి. పి. యం. జట్టులో ఆడేవారు. ఈ జట్టు ప్రసిద్ధిచెందిన దక్షిణాది ఆటగాళ్ళయిన రాజగోపాల్ జట్టును ఓడించి వున్నది. ఎడమచేతితో ఆడే శ్రీ సుబ్బారావుగారు అతిశక్తిమంతమైన స్ట్రోక్స్ కొట్టడంలో పేరుగడించారు. నెట్టువద్ద బంతులు తీయడంలో మిక్కిలి నేర్పరి.

శ్రీ పసంగి నాగేశ్వరరావు ("పెద్దన్న"):—వయస్సు 50. వీరు బందరు కె. వి. యం. జట్టుకు నాయకత్వం వహించి ఘనవిజయాలు సాధించి వున్నారు. వీరు ఆంధ్రరాష్ట్ర జట్టులో రైట్ ఫ్రంట్‌గా ఆడి వున్నారు. నెట్టుముందు నిలిచి, ప్రత్యర్థులకు వేసే బంతుల విచిత్రరీతులు కొనియాడదగినవి. నిశ్చలంగా, దృఢచిత్తంతో ఆడే వీరు వీరి జట్టుకు జీవగర్ర.

శ్రీ నండూరి నరసింహారావు :— ఆంధ్ర జట్టులో లెఫ్ట్ ఫ్రంట్ స్థానంలో ఆడారు. పొట్టిగా వున్నా వీరు పెట్టని కోటలా (డిఫెన్స్‌లో) ఆడగలరు. శక్తిమంతంగా, ఠీవిగా బంతులను కొట్టగలరు. ప్రస్తుతం తణుకు బోర్డుహైస్కూలులో ఫిజికల్ ఇన్‌స్ట్రక్టర్‌గా వున్నారు.

శ్రీ అన్నాబత్తుల సత్యం :— వయస్సు సుమారు 45. రైట్ బ్యాక్ ఆటగాడు. సర్వీస్‌లో వీరి మేధస్సు సునిశితమైనది. పరంపరగా గట్టి దెబ్బలు కొట్టడంలో దిట్ట. రాష్ట్ర ఆటగాడు.

శ్రీ పల్లి రామకృష్ణారావు :— వయస్సు సుమారు 47. రైట్ ఫ్రంట్. రబ్బరుబంతిలా చురుకుగా ఆడుతారు. ఎంతటి కష్టమైన బంతి అయినా తీయగలరు. బలంకంటె మేధస్సు ఎక్కువగా ఉపయోగించి ఆడగల వ్యక్తి. ప్రస్తుత నివాసం కాకినాడ. రాష్ట్ర ఆటగాడు.

శ్రీ వై. రంగాచారి :— వయస్సు సుమారు 30. లెఫ్ట్ బ్యాక్ ఆటగాడు. వీరింతకుముందు శ్రీ పిచ్చయ్య జట్టులో ఆడి అనేక విజయాలను సాధించి వున్నారు. క్రమంతంగా బంతుల్ని కొట్టడంలోను, రక్షణశ్రేణిని కాపాడుకొనడంలోను దిట్ట. రైట్ బ్యాక్ గాను, లెఫ్ట్ బ్యాక్ గాను సమాన ప్రతిభతో ఆడగలరు. రాష్ట్ర ప్రతినిధి.

శ్రీ ఎమ్. రామారావు :— వయస్సు సుమారు 45. లెఫ్ట్‌బ్యాక్ ఆటగాడు. వీరు పిచ్చయ్య జట్టులో వుండి అనేక పోటీలలో పాల్గొని వున్నారు. చక్కటి డిఫెన్సు ఆటగాడు. తేలికగా లైను అంచులకు బంతి కొట్టడంలో నేర్పరి. ప్రత్యర్థుల మధ్య సందులలో బంతులు సులువుగా వేస్తారు. అనకాపల్లిలో 'ఎమ్. ఆర్. స్పోర్ట్స్ వర్క్స్' నిర్వహిస్తున్నారు. రాష్ట్ర ప్రతినిధి.

శ్రీ డి. భావనారాయణ :— వయస్సు 25. ఆంధ్ర రాష్ట్ర జట్టులో స్టాండ్ బై. యువకుడైన శ్రీ భావనారాయణగారు బాడ్మింటన్ ఆటలోని మెలుకువలు గ్రహించి, అఫెన్స్, డిఫెన్స్ రెండింటిలోను ప్రావీణ్యం గడించారు.

శ్రీ సిహెచ్. సుబ్రహ్మణ్యం :— వయస్సు సుమారు 40. ఆంధ్రరాష్ట్ర జట్టులో స్టాండ్ బై. తన ఎత్తును అదునుగా చూచుకొని పాయింట్లు సంపాదించడంలో వీరి విజ్ఞత కొనియాడతగినది. పటిష్ఠంగా బంతిని కొట్టగలరు. ఫ్రంటుగా పైకి వస్తున్నారు.

ఆంధ్రదేశంలో ఇంకా క్రింది ఆటగాళ్లు పేరు గడించి వున్నారు :—

శ్రీయుతులు బి. జనార్దనరావు, సి హెచ్. నరసింహులు, బి. ఎస్. రెడ్డి, ఆర్. పాండురంగ, చలంచర్ల గున్నేశ్వరరావు (వీరందరు తాడేపల్లిగూడెం ప్రాంతాలవారు); రంజిత్ రామారావు, రామ మోహనరావు (వెంట్రప్రగడ); శేషగిరిరావు (ఈడ్పుగల్లు); పి. బాబు రావు, పి. సత్యనారాయణరావు, టి. శ్రీహరి, ఎన్. శ్రీరామచంద్ర మూర్తి, వి. బాబుసూరి (రేపల్లె); ఎస్. శ్రీరాములు, కె. కేశవ రావు, టి. కృష్ణమూర్తి, వి. శ్రీపతి (ఆంధ్ర సెక్రటేరియట్), పైడివర్తి దాసు, రాయుడు సూర్యారావు, ప్రభాకరరావు, పిళ్ళై, కృష్ణ (జగ్గారావు మెమోరియల్ టీమ్, రాజోలు); అల్లూరి శ్రీరామ చంద్రరాజు, కనుమూరి సుబ్బరాజు, చెరుకూరి సుబ్బరాజు, పాగి గణపతివర్మ, వీరభద్రరాజు (రాజోలు); డి. సూర్యనారాయణస్వామి, శేషాద్రి, కె. కేశవరావు, ఇ. సత్యనారాయణమూర్తి, ఎమ్. వెంకటే శ్వరరావు, ఎమ్. సూర్యనారాయణ మూర్తి, టి. వెంకటరత్నం, సి హెచ్. రామకృష్ణమూర్తి, ఎస్. సత్యనారాయణ, పి. పూర్ణయ్య శాస్త్రి (ఆంధ్ర సెక్రటేరియట్); బి. ఎస్. మూర్తి (కొత్తపట్నం); ఎన్. యల్. నారాయణ (తెనాలి); రాములు (బాపట్ల); హుస్సేన్ (కొలకలూరు); టి. వరహాలయ్య, ఎస్. నాదముని, టి. రామ మోహనరావు, ఎస్. వేణుగోపాల్ రావు అనే ఎస్. కృష్ణ, ఎమ్. వి. కృష్ణారావు, సి హెచ్. చెన్నారావు (కాకినాడ), కరీం, రంగాచారి, సంతానస్వామి, జోసఫ్ (వీరందరూ "జయశ్రీ" జట్టు ప్రతినిధులు. మద్రాసు, మధురలలో జరిగిన అనేక పోటీలలో గెలుపొంది వున్నారు).

శ్రీయుతులు మహమ్మదు, మజీద్, దస్తగిరి, రజా, మీర్జా, ఆలీ మహమ్మద్, హామీద్ పాషా, హామీద్ హుస్సేన్, అహమ్మద్ హొస్సేన్, వెంకటేశ్వరరావు, ఆలీ మహమ్మద్ (వీరిలో చివరి ఐదుగురు హైదరాబాద్ వై. యమ్. సి. ఎ. ప్రతినిధులు); ఖుదీర్, లాయిక్, సబీర్, హాబీబ్, రహమ్మన్ (వీరంతా ఇల్వోసీన్ క్లబ్ ప్రతినిధులు);

జహింగీర్ ఆలీ, మోయిన్, ఇక్బల్ అఫసార్, యావర్ ఆలీ (వీరందరు ఆగా యూనియన్‌కు చెందినవారు) హైదరాబాద్‌లో బాల్ బాడ్మింటన్‌లో ప్రసిద్ధి చెందినారు.

1956 డిశంబరులో బెంగుళూరులో జరిగిన నేషనల్ బాల్ బాడ్మింటన్ ఛాంపియన్‌షిప్ పోటీలలో హైదరాబాద్ ప్రథమ స్థానాన్ని, మైసూరు ద్వితీయ స్థానాన్ని సంపాదించినవి. హైదరాబాదు జట్టులో క్రిందివారు కలరు: శ్రీయుతులు జె. పిచ్చయ్య, వెంకటేశ్వర రావు, ముజాబిద్, ప్రకాశరావు (మేనేజరు), అహమ్మద్ హుస్సేన్, హబీబ్, మోయిన్, దస్తగిరి.

1956 డిశంబరులో ఢిల్లీలో జరిగిన జాతీయ షటిల్ బాడ్మింటన్ ఛాంపియన్‌షిప్ పోటీలలో శ్రీ టి. యన్. సేథ్ (యు. పి.) తిరిగి ప్రథమస్థానాన్ని, శ్రీ నందూ నటేకర్ (బొంబాయి) ద్వితీయస్థానాన్ని సాధించారు. స్త్రీల ఛాంపియన్‌షిప్‌ను శ్రీమతి తారా డేండిగే గెలుచుకొన్నారు. ఫరిదాబేగ్ ద్వితీయస్థానం సంపాదించారు. డి. ఘోష్, ఆయన తమ్ముడు జి. ఘోష్, జూనియర్లలో ప్రథమ, ద్వితీయ స్థానాలను సంపాదించారు.

1954 లో శ్రీ నందూ నటేకర్, 1955 లో శ్రీ టి. యన్. సేథ్ గార్లు నేషనల్ (షటిల్) ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొని వున్నారు. ఇండియాలో ఇంకా శ్రీయుతులు ఆర్. ఎ. డొంగ్రే, శ్రీ డి. యన్. డొంగాడీ (బొంబాయి), జి. హెమ్మాడీ (బెంగాలు), పి. యస్. చావ్లా (ఢిల్లీ), దేవేంద్ర మోహన్, ఎ. యల్. దివాన్ గార్లు షటిల్ బాడ్మింటన్‌లో ప్రఖ్యాతిగాంచి వున్నారు.

## షటిల్ బాడ్మింటన్ ఆటగాళ్ళ పరిచయం

శ్రీ త్రిలోక్ నాథ్ సేథ్ :— జననం 1929, అలహాబాద్‌లో. బాల్యంలో షటిల్ కాక్ ఆడడం ప్రారంభించారు. 1942 నుంచి 46 వరకు జూనియర్ షటిల్ కాక్ ఛాంపియన్. 1947 నుంచి 52 వరకు యు. పి. సీనియర్ ఛాంపియన్. 1951 లో శ్రీ అమృతలాల్

దివాన్‌ను ఓడించి నేషనల్ ఛాంపియన్ షిప్‌ను సాధించారు. థామస్ కప్పు పోటీలలో ఇండియా ప్రతినిధి. డ్రాప్ షాట్లలో వీరిది పెట్టింది పేరు. వాలీబాల్, క్రికెట్, ఫుట్‌బాల్ కూడా ఆడుతారు.

శ్రీ దస్తగిరి (హైదరాబాద్) :— జననం 1927 అక్టోబరు 28. బాల్ బాడ్మింటన్ ఆటలో దక్షిణభారత ఖ్యాతినొందిన వీరు షటిల్ కాక్ కూడా బాగా ఆడగలరు. శ్రీ కాశీం హుస్సేన్ వద్ద వీరు షటిల్ కాక్‌లో శిక్షణపొంది వున్నారు. 1952 లో మద్రాసు షటిల్ ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొని వున్నారు. డ్రాప్‌షాట్సులో నేర్పరి. టెన్నిస్, క్రికెట్, హాకీకూడా ఆడుతారు. వీరిసోదరులు శ్రీ జి. మహమ్మద్, జి. గౌసు గారలుకూడా పేరొందిన బాడ్మింటన్ ఆటగాళ్ళు.

హైదరాబాద్‌లో ఇంకా ఈక్రింది ప్రముఖులు షటిల్ బాడ్మింటన్‌లో పేరు గడించి వున్నారు :

శ్రీయుతులు రషీద్ ఫరూకీ (రాష్ట్రికెప్టెన్), అహమ్మద్ హుస్సేన్ (రాష్ట్ర జట్టు మేనేజర్), బండే అలీఖాన్, పాట్రిక్ బ్రాగాంజా, హమీద్ హుస్సేన్; శ్రీమతులు ఫరీదాబేగ్, సరోజగోపాలన్, కుమారి ఇందిర లక్ష్మీనరసు, కుమారి రమా రామచంద్రారెడ్డి, మాష్టర్ మపూర్ టూర్కీ, మాష్టర్ ఆనందత్రివేది, శ్రీయుతులు గోవిందరాజులు, ఆర్. ఎస్. నారాయణ, ఎఫ్. విన్సెంట్, హర్భజన్‌సింగ్, ఎమ్. ఎస్. సి. నాయుడు, ఏ. ఆర్. మోహన్ రాజ్ గౌడ్, బి. వెంకటరాజ్, విజకంత్‌గిర్, ఎమ్. నరసయ్యగారలు.

## అధ్యాయము 18

# కబడి - చెడుగుడు

చెడుగుడును ఆంధ్ర జాతీయ క్రీడగా చెప్పవచ్చు. గ్రామాల నుంచి మహానగరాలవరకు వాడవాడలా ఈ ఆట ప్రచారంలో వున్నది. వెన్నెల రాత్రులలో పల్లె సీమల్లో యువకులు ఈ ఆట ఆడుతూ వుంటే కన్నులపండుగా వుంటుంది.



చెడుగుడు చాలా పురాతనమైన ఆట. దాదాపు 35 సంవత్సరాల క్రితంవరకు ఈ ఆట "కప్పల చెడుగుడు"గా వ్యవహరించబడుతూ వచ్చింది. కొన్నిచోట్ల మట్టికప్పలు పెట్టి ఆడేవారు. అందుచేత కాబోలు "కప్పల చెడుగుడు" అనే పేరు వ్యవహారంలోకి వచ్చింది. ఇందులో జట్టుసభ్యుల సంఖ్యకుకాని, ఆటకాలానికి కాని ఇదమిత్థమైన పరిమితులు లేవు. 'ఔట్' అయిన ఆటగాళ్లు కూర్చోవాలి. ఎదుటి పక్షపు ఆటగాళ్లు ఔట్ అయినప్పుడు వరుస క్రమంగా "బ్రతుకు"తారు. దీనినే "చావుబ్రతుకుల ఆట"గా కూడా వ్యవహరిస్తారు. ఈ ఆటకు ఇదమిత్థమైన కాలనియమంకూడా లేదు. తర్వాత కొంతకాలానికి హైస్కూళ్ళలోను, ప్రయివేటు టోర్నమెంటులలోను "బక్ రూల్స్" అనుసరించి ఆడేవారు. కోర్టు 14 × 11 గజములు ఉండడం, టీమునకు తొమ్మిది మంది వుండడం, ఒక గంటలో ఏ పక్షమునకు ఎక్కువ పాయింట్లువస్తే ఆ టీము విజయమొందినట్లు పరిగణించడం ఈ చెడుగుడు ఆట నియమాలలోని ముఖ్యాంశాలు. ఈ రకపు ఆటకు ఎదుటిపక్షపు కోర్టులోనికి చొచ్చుకొనిపోయి పాయింట్లు తెచ్చే ఆటగాళ్ళు ఉండాలి. కోర్టు పెద్దది అవుటవల్ల పోటీలు "డ్రా" అయ్యేవి. పోటీఫలితాల్ని అమీతుమీ తేల్చివేయగల ఆటగాళ్లు చాలా తక్కువగా ఉండేవారు

అందుచేత క్రమేపీ కోర్టును తగ్గించుతూ ఆట నిబంధనలు సవరించుతూ వచ్చారు. 13 × 9 గజాలు, 12 × 8 గజాలు, 11 × 7 గజాలకు కోర్టు విస్తీర్ణం తగ్గిస్తూ వచ్చారు. ఆటగాళ్ళ సంఖ్యనుకూడా తొమ్మిదినుంచి ఆరుకు తగ్గించారు. ఆ పోటీకాలంకూడా గంటనుంచి 40 నిమిషాలకు తగ్గించబడింది. కోర్టు మధ్యగీతనుంచి అటూ యిటూ ఆరు అడుగుల దూరములో 'డెడ్ లైన్స్'' ఏర్పరచి, కూతకువచ్చే ప్రతి ఆటగాడు ఆ గీతను దాటాలనే నియమం ఏర్పరిచారు. నియమితకాలంలో ఎక్కువ పాయింట్లు సాధించిన టీము గెలుపొందినట్లు.

కొద్ది సంవత్సరాలనుంచి చెడుగుడు అఖిలభారత పోటీలలోకాని, హైస్కూలు, కాలేజీలలోకాని గుర్తించబడిన ఆటగా ఆడబడడంలేదు. ప్రయివేటు టోర్నమెంటులలోను, పల్లెలలోను మాత్రమే యిప్పుడు చెడుగుడు ప్రచారంలో వున్నది. చెడుగుడు ఆట నియమాలలో అనేక మార్పులుచేసి 'కబడి' అనే పేరుతో ఆడుతున్నారు. ఈ ఆట భారతదేశ మంతటా గుర్తించబడింది. జాతీయపోటీలు, అధికారపోటీలు 'కబడి'లోనే జరుగుతున్నవి. విదేశాలలో 'కబడి' ప్రచారంలో లేదు. ప్రపంచ యువజనోత్సవాలలో దీనికి స్థానమివ్వడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. ఉత్తర భారతదేశంలో ఈ ఆటల రీతులు గురించి 68 వ పేజీలో ప్రస్తావించాను. (62 వ పేజీకూడా చూడండి).

చెడుగుడు, కబడి ఆటలలో కొన్ని అతిముఖ్యమైన భేదాలు గమనార్హం.

చెడుగుడు ఇసుక కోర్టులలో ఆడుతారు. ఆటగాళ్లు స్వేచ్ఛగా విహరించడానికి, కాళ్ళతో క్రింద కొట్టడానికి, హార్డిల్సు కొట్టడానికి, రింగ్సు తిరగడానికి ఈ విధముగా ఎంతో చురుకును, వేగమును, ప్రజ్ఞను ప్రదర్శించడానికి అవకాశం వుంది. కబడి గట్టి నేలమీద ఆడాలి. స్వేచ్ఛగా ఆడితే గట్టి దెబ్బలు తగులుతవి. ఆంధ్ర ఆటగాళ్ళకు సంబంధించినంతవరకు వారి స్వేచ్ఛ తగ్గిపోయింది. తద్వారా ప్రమాణం తగ్గిపోవచ్చు.

కబడీలో "ఔటు" అయినవారు కూర్చోవాలి. అంతేకాక ఎదుటిపక్షంవారికి పాయింటు వస్తుంది. చెడుగుడులో ఔటు అయినవారు కూర్చోనవలసిన అవసరం లేదు. కబడీలో ఎదుటిపక్షంవారిచే పట్టుకో బడిన ఆటగాడు కూతతో మధ్యగీతను ముట్టుకుంటే అయనను పట్టుకున్నవా రందరూ ఔటు అవుతారు. చెడుగుడులో మొదట పట్టుకొన్నవారే ఔట్ అవుతారు.

కూత విషయంలో ఆలిండియా కబడీ ఎసోసియేషన్ వారు 'కబడీ', 'కబడీ' అనే కూత పెట్టాలని నిర్ణయించారు. ఇది కొన్ని ఇతర రాష్ట్రములవారికి ముఖ్యంగా ఆంధ్రులకు చాలా కష్టంగా వున్నది. తెలుగువారికి "చెడుగుడు–గుడు–గుడు" అని అపకుండా కూతపెట్టే అలవాటు వున్నది. "కబడీ, కబడీ" అని అనేటప్పుడు దొంగచాటుగా ఊపిరి తీసుకొనేందుకు అవకాశం వుంటుంది.

ఆంధ్రదేశంలో చెడుగుడువ్యాప్తికి గోగినేని సోదరులు, ముఖ్యంగా శ్రీ గోగినేని వెంకటేశ్వరరావుగారు ('చిన్నబ్బాయి') చేసిన ఆర్థికాది సహాయం మిక్కిలి ప్రశంసనీయం.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడకముందు కూడా– 1952 వరకూ– ఆంధ్రులు చెడుగుడు, కబడీలలో ఇండియాలోకెల్ల ప్రథమస్థానం వహిస్తూ వచ్చారు. ఆంధ్రరాష్ట్రం అవతరించినమీదట ఆంధ్రరాష్ట్ర కబడీ సంఘం నెలకొన్నది. 1954 నుంచి ఆంధ్రరాష్ట్ర జట్టు జాతీయ కబడీ పోటీలలో పాల్గొంటున్నది.

(యూనివర్సిటీ, ఒలింపిక్ పోటీలలో ఆంధ్రుల విజయాలను ఆటగాళ్ళ జీవిత చరిత్రలో ప్రస్తావిస్తున్నాను.)

మొదటి రెండు జాతీయ పోటీలలోనూ, మన పద్ధతులకు అనుగుణంగా రిఫరీల నిర్ణయం లేనందువల్ల ఆంధ్రులు చాలా నిరుత్సాహం పడినారు. ఆంధ్రరాష్ట్ర కబడీసంఘం దీనినిగురించి పరిశీలన జరిపి ఆదిలోనే మేల్కొనివుంటే ఆంధ్రులు తరువాతి జాతీయ పోటీలలో ప్రథమస్థానం వహించి వుండేవారు. కబడీలో ప్రభుత్వంవారు ఉన్నత

శిక్షణ తరగతులు నిర్వహించితే వాటిని ఆంధ్రసంఘం సక్రమంగా వినియోగించుకోలేక పోయింది.

ఆంధ్రరాష్ట్రం రాకముందు జాతీయ ఛాంపియన్లయిన ఆంధ్రులు ఆంధ్రరాష్ట్రం వచ్చినపిమ్మట, ఆంధ్రరాష్ట్ర కబడి సంఘం ఏర్పడిన మీదట వెనుకపడిపోవడం అత్యంత శోచనీయం. భారత ప్రభుత్వంవారు ఈ దేశీయ క్రీడను గుర్తించి దేశమంతటా శిక్షణ కేంద్రాలు నిర్వహించ బోతున్నారు. ఇకనైనా ఆంధ్ర శ్రద్ధగా వీటి సత్ఫలితాలను పొందితే అనతికాలంలోనే తిరిగి అగ్రస్థానం వహించగలుగుతుంది.

ఆంధ్రదేశంలో మొట్టమొదట చెడుగుడు వ్యాప్తికి విశేషంగా కృషిచేసిన వారిలో ముఖ్యులు "చెడుగుడు పితామహ" బిరుదాంకితులు శ్రీ సూర్యదేవర అంకినీడుగారు. ఆ కాలపు ఆటగాళ్ళలో ఆంధ్రదేశ మంతటా ఖ్యాతి గడించినవారు శ్రీయుతులు (స్వర్గీయ) దాసరి శ్రీరాములు, (స్వర్గీయ) దాసరి సీతారామయ్య, హబీబ్, తిలక్, రాములు, సాలే ఖాన్, కరీం ప్రభృతులు. వీరి తరువాత శ్రీయుతులు అవధాని, పుచ్చా కృష్ణమూర్తి, చెంచయ్య, గరికిపాటి నాగేశ్వరరావు, సుబ్బులు, ధనంజయ రావ్, జయరామయ్య, నార్ల రామారావు ఖ్యాతిలోనికి వచ్చారు. •

ఇప్పటివారిలో కనుమూరి సత్యం, రామమోహనరావు ప్రభృతులు ప్రథమ శ్రేణిలో వున్నారు.

1956 డిశంబరు మాసాంతంలో జాతీయ కబడి ఛాంపియన్‌షిప్ పోటీలలో పురుషుల, స్త్రీల ఛాంపియన్‌షిప్‌ను బొంబాయి గెలుచు కొన్నది.

## చెడుగుడు, కబడి ఆటగాళ్ళ పరిచయం

శ్రీ సూర్యదేవర అంకినీడు :— వయసు షుమారు 48 సంవత్సరములు. ప్రస్తుత నివాసం గుంటూరుజిల్లా కొల్లూరు గ్రామం.

ఆంధ్ర చెడుగుడు పితామహులు. వీరి జీవితములో ఎక్కువభాగం చెడుగుడు ఆటలోను, ఆ ఆట ప్రచారంలోను, అభివృద్ధిలోను గడిచింది. దురదృష్టవశాత్తు 10, 11 సంవత్సరాల క్రితం వీరి రెండు నేత్రములు చెడి దృష్టి తప్పిపోయింది.



కబడి ఆటలోని లోపాలు వీరిని అమితంగా ఆందోళన పరుస్తున్నవి. కబడి స్థానే చెడుగుడును పునరుద్ధరించవలెనని వీరు కోరుకొంటున్నారు. కబడిలోని లోపములను ఇతర రాష్ట్రాలవారికి చెప్పి వారిని ఒప్పించి, చెడుగుడులో అవసరమైతే కొన్ని మార్పులు చేసికొని తిరిగి జాతీయ క్రీడగా పరిగణించి ఆలిండియా టోర్నమెంటులలో ఆడించుట సమంజసమని చెబుతున్నారు.

అవధాని, ధనంజయ వంటి ఆటగాళ్ళకు, శ్రీయుతులు ఓ. వి. సుబ్బారావు (కొల్లూరు), ఎమ్. ఖాదరఖాన్ (బాపట్ల), సంపతాచారి (పొన్నూరు), రామిరెడ్డి (ఇంటూరు), గడిపాటి ఆంజయ్య (తెనాలి), ముదిగొండ లింగమూర్తి (తెనాలి, ఇప్పుడు సినిమా యాక్టరు), ఆలూరి నరసింహారావు, వీరభద్రరావు (నరసరావుపేట), జొన్నకంటి సూర్యనారాయణ (పెరవలి) వంటి వారలకు శిక్షణయిచ్చి యున్నారు.

శ్రీ అంకినీడుగారు మొదటినుంచి "ఫ్రెండ్ ఆఫ్ వరల్డు" కొల్లూరు జట్టులో పాల్గొనుచూ ఆంధ్రదేశములోనూ, మదరాసులోనూ అనేక పోటీలలో పాల్గొనినారు. వీరు గుంటూరు జిల్లాలోని గుంటూరు, నర్సరావుపేట, జాగర్లమూడి, దుగ్గిరాల, తెనాలి, రేపల్లె, ఇంటూరు, అమృతలూరు, వేమూరు, కొల్లూరు; కృష్ణాజిల్లాలోని కోలవెన్ను, ఈడుపుగల్లు, మంచెళ్ళ, ముదినేపల్లి, మిదిసె, పెదముత్తేవి, తమిరిశ; పశ్చిమగోదావరి జిల్లాలోని ఏలూరు, తదితర పట్టణాలలో అనేక పెద్ద చెడుగుడు పోటీలను నిర్వహించి యున్నారు. వీరి

జట్టులో శ్రీయుతులు పి. మల్లయ్య (కొల్లూరు). కె. ధనంజయ (కూచిపూడి), కె. రామచంద్రరావు (కొల్లూరు), జి. సీతారామయ్య (కొల్లూరు), పి. లక్ష్మణరావు (వెల్లటూరు), కె. నాగేశ్వరరావు (కొల్లూరు), జి. బాలాజీసింగ్ (కొల్లూరు), జి. డి. రామారావు (చాకలి) ప్రభృతు లుండేవారు. అంధులైనప్పటికీ వీరు నేటికీ యువకులకు చెడుగుడులో విశిష్టరీతులు బోధిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ "చెడుగుడు పితామహు"లకు గ్రాంటు మంజూరుచేయడం మంచిది.

(శ్రీ) పడమటి చెంచయ్య :— జననం మార్చి 1926, గుంటూరుజిల్లా పొన్నూరు గ్రామంలో. ప్రాథమిక పాఠశాల విద్యార్థిగా



వున్నపుడే ఆటలలో ముఖ్యముగా చెడుగుడులో వీరికి ప్రీతి మెండు. చెడుగుడు ఆటకు ప్రసిద్ధి గాంచిన బాపట్ల పురములో సాలెఖాక్, కరీం ప్రభృతుల ఆధ్వర్యములో వున్న, "సిక్స్ హంటర్స్", హబీబ్, తిలక్, శ్రీరాములు ఆధ్వర్యమున వున్న "టెర్రిబిల్ టైగర్స్" జట్ల విజయాలు చెంచయ్యవంటి పిన్నలలో ఉత్సాహం స్పందింప జేసినవి.

1940 నుంచి 1953 వరకూ వీరు కృష్ణా, గుంటూరు, నెల్లూరు, గోదావరి జిల్లాలలో జరిగిన చెడుగుడు పోటీలలో పాల్గొని ప్రత్యేక బహుమతులుకూడా పొందారు. 1951 లో మద్రాసులో జరిగిన స్టేటు ఒలింపిక్స్‌లో పాల్గొని విజయమొంది వై. యం. సి. ఏ. అధ్యాపకుల మన్ననలు పొందారు. వీరు వై. యం. సి. ఏ. వ్యాయామ కళాశాలలో విద్యార్థిగాచేరి 1952 లో మద్రాసు రాష్ట్ర జట్టుకు నాయకత్వము వహించి అఖిలభారత కబడి పోటీలలో విజయము గాంచారు. శిక్షణానంతరము నిడుబ్రోలులోని పి. బి. యన్. కళాశాలలో వ్యాయామాధ్యాపకునిగా నియమించబడ్డారు.

వీరు నాలుగు సంవత్సరములు ఆంధ్ర విశ్వవిద్యాలయ కబడి జట్టులకు శిక్షకులు. 1953 నుంచి పెద్ద పోటీలనుంచి విరమించి యువక్రీడాకారులకు శిక్షణ నిస్తున్నారు. ఆటలో నిజాయితీకి వీరిని మించినవారు లేరు. నూటికి నూరుపాళ్ళు స్పోర్ట్సుమన్.

శ్రీ నార్ల రామారావు :— జననం 1924 సెప్టెంబరు. పునాదిపాడు హైస్కూలులో చదువుచుండగా ఆటలయందు అభిమానము ఎక్కువగా ఉండెడిది. తర్వాత బందరు హిందూ కళాశాలలో చదువుచుండగా వాలీబాల్, బాస్కెట్ బాల్ కాలేజీజట్ల సభ్యునిగా ఆంధ్ర విశ్వవిద్యాలయ అంతర్ కళాశాల పోటీలలో పాల్గొనుచుండెడివారు. 1944 లో ఆంధ్ర విశ్వవిద్యాలయ ఎథ్లెటిక్ ఛాంపియన్ షిప్ సాధించారు.



అన్నిటిలోకీ చెడుగుడు ఆటలో వీరు విశేషప్రావీణ్యం గడించారు. కాలేజీ విద్యానంతరం ఆంధ్ర దేశంలో అనేక చెడుగుడు పోటీలలో పాల్గొని ప్రత్యేక బహుమతులు సంపాదించారు. ఆంధ్ర దేశములో అగ్ర జట్లయిన 'చలసాని బ్రదర్స్' ఉప్పలూరు టీము సభ్యులుగా వుంటూ అనేకమైన పోటీలలో విజయమొంది ప్రత్యేక బహుమతులు పొందారు. క్రమశిక్షణకు ఈ టీములు పేరుగడించి వున్నవి. 1950 లో మద్రాసు ఒలింపిక్స్‌లో వీరిజట్టు ప్రథమస్థానం వహించింది. బొంబాయిలో జరిగిన అఖిలభారత

ఒలింపిక్స్‌లో కబడ్ పోటీలలో పాల్గొన్నారు. 1954 లో ఆంధ్రరాష్ట్ర పోటీలలో వీరి టీము అంతిమవిజయం సాధించింది. అదే సంవత్సరములో ఢిల్లీలో జరిగిన ఇండియా ఒలింపిక్స్‌లో తొలిసారి పాల్గొన్న ఆంధ్రరాష్ట్ర కబడిజట్టు నాయకులు. 1954 లో విజయవాడలో జరిగిన ఒలింపిక్ పోటీలలో స్టేడియంలో ఒలింపిక్ జ్యోతిని వెలిగించెడి గౌరవం వీరి కివ్వబడింది. ప్రస్తుత నివాసం విజయవాడ.

శ్రీ టి. అవధాని :— జననం 1931. తెనాలిలో పెరిగి పెద్దవారైనారు. చెడుగుడు ఆటను 1942 నుంచి ప్రారంభించారు. 1949 వరకూ గుంటూరు జిల్లా పోటీలలో హైస్కూలు చెడుగుడు జట్టు సభ్యునిగా పాలుగొంటూ వచ్చారు. 1947 నుంచి పెద్ద పోటీలలో పాల్గొన్నారు. "ఆంధ్ర చెడుగుడు పితామహులు" శ్రీ అంకినీడుగారు 1949 లో వుయ్యూరులో జరిగిన పెద్ద చెడుగుడు పోటీలకు ఒక జట్టును ఏర్పరచినప్పుడు వీరిని ఎన్నుకొన్నారు. అప్పటినుంచి వీరు మంచి అనుభవము గడించారు. అదే సంవత్సరము బెజవాడలో జరిగిన ఒలింపిక్ పోటీలలో తెనాలి జట్టులో పాల్గొన్నారు. 1950 లో మద్రాసు రాష్ట్ర జట్టులో ఎన్నుకోబడి, బొంబాయిలో జరిగిన అఖిలభారత కబడి పోటీలలో పాల్గొన్నారు.




1951-52 వ సంవత్సరము మద్రాసు వై. యమ్. సి. ఏ. కాలేజీలో శిక్షణ పొందుచూ మద్రాసు రాష్ట్ర జట్టులో ఎన్నుకోబడి, మద్రాసులోనే జరిగిన అఖిల భారత ఒలంపిక్స్ పోటీలలో పాలుగొన్నారు. వై. యమ్. సి. ఏ. శిక్షణానంతరం తెనాలి హైస్కూలులో వ్యాయామోపాధ్యాయునిగా ప్రవేశించారు. మధ్యప్రదేశ్ 'క్రీడామండలి' వారిచే ఆహ్వా

నింపబడిన మద్రాసురాష్ట్ర జట్టుకు నాయకత్వం వహించి నాగపూర్‌లో వార్షికోత్సవ పోటీలలో పాల్గొన్నారు. 1953 లో నూజివీడులో జరిగిన అఖిల భారత చెడుగుడు పోటీలలో పాల్గొనిన వీరి జట్టు అంతిమ విజయం సాధించింది. 1954, 55 లలో ఆంధ్రరాష్ట్ర జట్టు సభ్యునిగా ఢిల్లీ, హైదరాబాద్‌లలో జరిగిన నేషనల్ కబడ్డీ ఛాంపియన్ షిప్ పోటీలలో పాల్గొన్నారు. ఆంధ్రలో జరిగిన ఇంకా అనేక పోటీలలో ఘనవిజయాలు సాధించి వున్నారు.

శ్రీ యార్లగడ్డ సత్యనారాయణ (కెనుమూరు సత్యం):— జననం 1932 కృష్ణాజిల్లా కనుమూరు గ్రామంలో. 1941 లో ఆటలలో ఆసక్తి కలిగింది. హైస్కూలు విద్యార్థిగా ఉన్నప్పుడు స్కూలులోను, పల్లెలలోను జరిగే అన్ని ఆటల పందెములలోను పాల్గొన్నారు. 1952 లో మద్రాసులో జరిగిన అఖిలభారత పోటీలలో ఆంధ్ర నుంచి పాల్గొన్న కబడ్డీజట్టు సభ్యులు. ఈ పోటీలలో ఫైనల్సులో బెంగాలును ఈ జట్టు ఓడించింది. పోటీ చివరి ఐదు నిమిషాలలో తొమ్మిది పాయింట్లను వీరు తెచ్చినందువల్లనే ఆంధ్రజట్టు విజయ మొందింది.



1954 ఒలింపిక్సులో ఆంధ్రరాష్ట్ర కబడి, ఎథ్లెటిక్ జట్ల సభ్యులు. 1955 లో ఆంధ్ర విశ్వవిద్యాలయ కబడి జట్టుకు నాయకత్వం వహించి ధార్వార్‌లో జరిగిన అఖిలభారత అంతర్ విశ్వవిద్యాలయ పోటీలలో విజయ మొందారు. ఫైనల్సులో నాగపూర్‌ను ఓడించారు. 1956 లో ఆంధ్రరాష్ట్ర కబడి జట్టు కెప్టెన్. కాలేజీ విద్య నభ్యసించిన నాలుగు సంవత్సరములూ కాలేజీ ఎథ్లెటిక్ ఛాంపియన్. వీరు 28

ఆంధ్రరాష్ట్ర పోటీలలో పాల్గొని 18 లో ప్రథమస్థానం, రెండింటిలో ద్వితీయస్థానం సంపాదించారు. వ్యక్తిగత ఛాంపియన్‌షిప్‌లు 12 సాధించారు. వరంగల్‌లో జరిగిన ఆల్ ఇండియా చెడుగుడు పోటీలలో పాల్గొని విజయము సంపాదించారు.

శ్రీ పుచ్చా వెంకటకృష్ణమూర్తి ("దంతలూరు కృష్ణ"):— వీరి స్వగ్రామం గుంటూరుజిల్లా దంతలూరు గ్రామం. వీరు తెనాలి తాలూకా హైస్కూలులో విద్యాభ్యాసము చేయుచుండగానే ఆటలలో, ముఖ్యంగా చెడుగుడులో ఆసక్తి చూపారు. జిల్లా క్రీడోత్సవంలో చెడుగుడుట్రోఫీ సాధించారు. ఒక సంవత్సరము ఆంధ్రలో పెద్ద టోర్నమెంటులో ఒకటైన "వలివేరు చెడుగుడు పోటీలలో" వీరు పాల్గొని తలవని తలంపుగా అగ్రజట్లను ఓడించి ఒక్కసారిగా చెడుగుడు రంగంలో అగ్రశ్రేణిని అందుకొన్నారు. అప్పటినుంచి ఆంధ్రదేశంలో జరిగిన అనేక పోటీలలో పాల్గొని అనేక ప్రత్యేక రజత పాత్రలను, సువర్ణ పతకములనూ బహుమతిగా పొందారు.

1943 లో మద్రాసు రాష్ట్ర ఒలింపిక్స్‌లో తొలిసారి పాల్గొన్న ఆంధ్ర చెడుగుడు జట్టుకు శ్రీ కృష్ణమూర్తి గారు కెప్టెను. శ్రీ "సుబ్బులు" (తాడేపల్లి వెంకట సుబ్రహ్మణ్యశర్మ) కూడా గల ఈ జట్టు మద్రాసులో విశేషమైన మన్ననలు పొందింది. 1946 లో మద్రాసు రాష్ట్ర జట్టుకు నాయకత్వం వహించి బెంగుళూరులో జరిగిన అఖిల భారత ఒలింపిక్స్‌లో పాల్గొని ఛాంపియన్‌షిప్ సాధించారు. వీరు తర్వాత గుంటూరు, కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాలలో అనేక పోటీలలో పాల్గొని పేరు ప్రఖ్యాతులు గడించారు.

1955 లో జబల్పూరులో నిర్వహించబడిన ప్రథమ అఖిలభారత కబడీ కోచింగ్ క్యాంప్‌లో ఆంధ్రరాష్ట్రం నుంచి ఎన్నికయి శిక్షణ పొందారు. ఆంధ్రలో శిక్షకునిహోదా పొందినవారిలో వీరే మొదటివారు. ప్రస్తుతం తెనాలితాలూకా హైస్కూలులో వ్యాయామ విద్యా బోధకులు.

శ్రీ వై. రాధాకృష్ణమూర్తి :— జననం 1931, కృష్ణాజిల్లా కనుమూరు గ్రామంలో. హైస్కూలులో చదువుతున్నంత కాలము వీరు ఫుట్ బాల్, వాలీబాల్, ఎథ్లెటిక్స్ మొదలగు వాటిలో ఆసక్తి చూపుచుండెడివారు. అన్ని ఆటలలోకీ వీరు చెడుగుడు ఆటలో ప్రావీణ్యం గడించారు. వీరికి కోలవెన్ను వాస్తవ్యులు శ్రీ తుమ్మల మధుసూధనరావు గారు ఆటను నేర్పుతూ, ఇతర విధాలుగా కూడా తోడ్పడినారు. గుడ్లవల్లేరు చెడుగుడు టోర్నమెంటులో మెంఖాసా కల్వపూడి అంత పెద్ద టీమును ఓడించి చెడుగుడు వర్గాలలో సంచలనం కలిగించారు.



ఆంధ్రలో పెద్ద పేరుగడించిన శ్రీ ధనంజయ జట్టును మొట్ట మొదటిసారిగా అవుటపల్లి రాష్ట్ర పోటీలలో ఓడించడంతో వీరి ఖ్యాతి ఇనుమడించింది. తర్వాత వీరు గుడ్లవల్లేరు, బుచ్చిరెడ్డిపాలెం, వేమూరు, కొల్లూరు, రాజమండ్రి, ఏలూరు, బెజవాడ, అవుటపల్లి, ఇందుపల్లి, మాదికొండ, ప్రొద్దుటూరు, గొల్లపల్లి, కొవ్వలి మొదలగుచోట్ల జరిగిన చెడుగుడు పోటీలలో పాల్గొని విజయాలు సాధించారు. 1952 లో ఆంధ్రకు భారత్ కబడి ఛాంపియన్ షిప్ సాధించిన జట్టులో వీరు సభ్యులు. 1954 లో జాతీయ పోటీలలో ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి. ప్రస్తుత నివాసం సైదాపురం.

శ్రీ కె. రామమోహనరావు :— జననం అక్టోబరు 10 1935 తిప్పనగుంట గ్రామంలో (కృష్ణాజిల్లా). స్కూలు విద్యార్థిగా వున్నప్పుడే అన్ని ఆటలలోను ముఖ్యంగా చెడుగుడులోను ఆసక్తి కలిగింది.

1953 ప్రాంతాల నూజివీడు, వేమూరు, ఇందుపల్లిలలో జరిగిన చెడుగుడు పోటీలలో పాల్గొని ప్రత్యేక బహుమతులు పొందారు. 1953 లో



బెజవాడలో జరిగిన ఆంధ్రరాష్ట్ర చెడుగుడు పోటీలలో విజయమొందిన జట్టు సభ్యులు. మరుసటి సంవత్సరము జాతీయ పోటీలకు ఆంధ్ర రాష్ట్ర జట్టులో ఎన్నికయినారు. 1954 లో బెజవాడ కాలేజీ చెడుగుడు జట్టు సభ్యులుగా ఎన్నికయి అంతర్ కళాశాలల పోటీలలో విజయమొందినారు. అదే సంవత్సరము ఆంధ్ర విశ్వ విద్యాలయ జట్టుకు వైస్ కాప్టెన్ గా ఎన్నికయి అఖిలభారత అంతర్ విశ్వవిద్యాలయ పోటీలలో విజయము గాంచారు. 1956 లో ఆంధ్ర విశ్వవిద్యాలయ జట్టుకు నాయకులుగా ఎన్నికై బెనారెస్ లో జరిగిన అఖిలభారత విశ్వవిద్యాలయ పోటీలలో పాల్గొని సెమిఫైనల్సులో నాగపూర్ చే ఓడించబడినారు, 1953 లో వరంగల్ లో జరిగిన అఖిలభారత చెడుగుడు పోటీలలో విజయముగాంచిన జట్టు సభ్యులు. ప్రస్తుత నివాసం సైదాపురం.

శ్రీ యార్లగడ్డ లక్ష్మీనారాయణ :— జననం 1935, కృష్ణాజిల్లా కనుమూరు గ్రామంలో. 1950-51 లో తాడంకి స్కూలులో



చదువుతూ గ్రిగ్ ఛాంపియన్ షిప్ ను సాధించారు. అన్నగారైన శ్రీ సత్యనారాయణగారి వద్ద చెడుగుడులో శిక్షణ పొందారు. ఆంధ్రలో జరిగిన దాదాపు 20 పెద్ద చెడుగుడు టోర్నమెంటులలో సోదరునితో పాటు పాల్గొని పెక్కింటిలో విజయం సాధించారు. హైదరాబాద్ సంస్థానంలో కూడా పెక్కు పోటీలలో పాల్గొన్నారు. వరంగల్లులో శ్రీ జె. పిచ్చయ్యగారు నిర్వహించిన చెడుగుడు టోర్నమెంటులో ప్రథమ స్థానం వహించారు. గోగినేని పిచ్చయ్య చౌదరి మెమోరియల్ (మానికొండ)

టీమ్ సభ్యులు. ఈ టీము ఫైనల్స్‌లో హైదరాబాద్ జట్టును 50—20 పాయింట్లతో ఓడించింది. 1954, 55, 56 లలో జాతీయ కబడీ పోటీలలో ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి. ప్రస్తుత నివాసం సైదాపురం.

ఇంకా క్రింది ఆటగాళ్లు చెడుగుడు - కబడీ ఆటలలో ఆంధ్రదేశంలో ఖ్యాతిగడించి వున్నారు :—

శ్రీయుతులు తుమ్మల సాంబశివరావు (క్రింది చిత్రం); శంకరరావు ఏ. శేషగిరిరావు (స్వర్గీయ) అన్నం వెంకటేశ్వర్లు (బాపట్ల), వై. సత్యనారాయణ (గూడవల్లి, గుంటూరు జిల్లా) కె. మల్లారెడ్డి (పొట్టిపాళెం, నెల్లూరు జిల్లా), గుళ్ళపల్లి రాజారావ్, కోసూరి మాధవరావు, గాద వెంకటేశ్వరరెడ్డి, అరమండ్ల చక్రధరరావు. హైదరాబాదులో శ్రీయుతులు చలపతిరావు, చెన్నయ్య, విఠల్‌రావు, రాధాకృష్ణ, కె. వెంకటరెడ్డి, శ్రీనివాస్, యం. వెంకట్రావు, బాబా మొహిద్దీన్, జానీమియ్యా (వీరందరూ సికింద్రాబాద్ డివిజన్ సెంట్రల్ రైల్వేజట్టు సభ్యులు) మున్నగువారు పేరుగడించి వున్నారు.

(26 వ పేజీ రెండవపేరాకూడా చూడండి).

# బిలియార్డ్స్, స్నూకర్

గృహాంతర క్రీడలలో అగ్రగణ్యమైనదిగా (కింగ్ ఆఫ్ ది ఇన్ డోర్ గేమ్సు) పరిగణించబడుతున్న బలియార్డ్స్ అతి ప్రాచీన క్రీడలలో ఒకటి. షేక్స్పియర్ రచించిన నాటకం "ఆంటోని అండ్ క్లియోపాట్రా" రెండవ అంకం ఐదవ రంగంలో క్లియోపాట్రా తన పరిచారిక నుద్దేశించి, "బిలియార్డ్స్ ఆటకు వెళ్లుదాము రా" అని పిలిచినట్లున్నది. దీనినిబట్టి క్లియోపాట్రా కాలంనుంచి కూడా బిలియార్డ్స్ ఆట ప్రచారంలో వున్నట్లు భావించవచ్చు.



గ్రీకులు క్రీస్తు పూర్వం నాలుగువందల సంవత్సరములలోనూ, అంతకుముందు ఈజిప్షియన్లు బిలియార్డ్స్ వంటి ఆట ఆడేవారు. అంతకు అనేక శతాబ్దాలక్రితమే ఐరిష్‌రాజు. క్యాట్ క్రైర్ మూర్ బిలియార్డ్స్ వంటి ఆట ఆడేవారని, అయన 50 ఇత్తడి బంతులు, ఇత్తడి చువ్వలు (బిలియార్డ్స్ బంతిని కొట్టే సాధనం) వుపయోగించేవారని ఐరిష్‌వారు వాదిస్తున్నారు.

క్రీస్తుశకం 1452 లో ఫ్రెంచివారు బిలియార్డ్స్ ఆటను టేబుల్ ఆటగా ఆడేవారు. 16 వ శతాబ్దంలో ఈ ఆట బాగా ప్రచారంలోనికి వచ్చింది. ఫ్రాన్సునుంచి క్రమేణా యూరప్‌కు ఆట వ్యాప్తి చెందింది. స్పెయిన్ దేశస్థులు అమెరికాలో బిలియార్డ్స్ ఆటను ప్రవేశపెట్టారు. అనంతరం అమెరికాలో ఈ ఆటపద్ధతి చాలా మార్చబడింది. 19 వ శతాబ్దంలో మొట్టమొదటిసారి 'బిలియార్డ్స్ రూం' నిర్మించబడింది.

1885 లో బిలియార్డ్స్ ఎసోసియేషన్ స్థాపించబడి నియమనిబంధనలు కాపీరైటు చేయబడినవి.

19 వ శతాబ్దాంతంలో బిలియార్డ్స్ ఆటకు అభివృద్ధిగా స్నూకర్ ఆట కనుగొనబడి క్రమక్రమేణా యూరపులో ప్రచారమయ్యేసరికి, బిలియార్డ్స్ ఆటకు ఆదరణ తగ్గిపోయింది. 1934 వరకు ప్రపంచ బిలియార్డ్స్ ఛాంపియన్‌షిప్ పోటీలు జరిగేవికాని స్నూకర్ పోటీని తట్టుకోలేక పోయినందున 1934 నుంచి 1951 వరకు ప్రపంచ బిలియార్డ్స్ ఛాంపియన్‌షిప్ పోటీలేలేవు. 1934 సంవత్సరపు ప్రపంచ ఛాంపియన్‌షిప్‌ను వాల్టర్ లింద్రమ్ అనే ఆస్ట్రేలియన్, 1951 లో ఫ్రెడ్ డేవిస్ అనే ఆస్ట్రేలియన్ గెలుకొలుచుకొని వున్నారు.

ఇండియాలో 1828 నుంచి బిలియార్డ్స్ ఆట ప్రచారంలో వున్నది. ఆ సంవత్సరంలోనే ఇండియాలో మొట్టమొదటి బిలియార్డ్స్ టేబుల్ దిగుమతి చేయబడింది. స్నూకర్ ఆటను కనుగొన్న కీర్తి ఇండియాదే. 1875 లో జబల్‌పూర్‌లో (స్వర్గీయ) సర్ నెవిలీ చాంబర్లిన్ స్నూకర్ ఆటను కనుగొన్నారు.

తొలిరోజులలో బిలియార్డ్స్ నేలపై ఆడేవారు. కొంతకాలానికి ఆటస్థలాన్ని పరిమితం చేయడంకోసం రెయిలింగ్‌లు వుపయోగించారు. క్రమక్రమేణా ఎత్తుబల్లపై ఆట ప్రారంభమైనది.

## స్నూ క ర్

పైన పేర్కొన్నట్లు స్నూకర్ కనుగొన్న దేశం ఇండియా. 1875 లో జబల్‌పూర్‌లోని డెవన్‌షైర్ రెజిమెంటులో చిన్న వుద్యోగిగా వుంటున్నప్పుడు నెవిలీ చాంబర్లీన్ బిలియార్డ్స్‌కు మరొక రంగుబంతి చేర్చి ఆడినట్లయితే కొత్తగా వుంటుందని ప్రతిపాదించారు. కాలం గడచినకొద్దీ మరికొన్ని రంగుల బంతులను చేర్చుతూపోయారు. ఈవిధంగా బిలియార్డ్స్‌నుంచి స్నూకర్ ఉద్భవించింది. స్నూకర్ అంటే ప్రారంభకుడు అని అర్థం. స్నూకర్ ఆటకు ఆపేరు పెట్టబడకముందు

నెవిలీ చాంబర్లీన్ "అదనపు రంగులబంతులతో కొత్తరకం బిలియార్డ్స్" ఆడుతున్నప్పుడు ఆయనబృందంలోని ఒకడు సులభమైన బంతులనైనా వెయ్యలేకపోవడంతో ఆయనను "నీవు పట్టి స్నూకర్" అని ఛలోక్తిగా అన్నారు. కాడెట్‌గా చేరినవారినికూడా స్నూకర్-ప్రారంభకుడు-అని అంటారు. బాగా ఆడని ఆటగాడు మనస్సు నొచ్చుకోకుండా వుండడం కోసం నెవిలీ తోటివారలకేసి చూచి "నిజం చెప్పాలంటే మనమందరం ఈ కొత్త ఆటలో ప్రారంభకులమే" ('స్నూకర్స్') అని అన్నారు. అప్పటినుంచి అదనపు రంగుల కొత్త బిలియార్డ్స్ ఆటకు స్నూకర్ పేరు స్థిరపడిపోయింది.

1880 ప్రాంతాలలో ఇండియాలోని సైనిక కేంద్రాలన్నింటిలోను స్నూకర్ ప్రచారం లోనికి వచ్చింది. ఈ కొత్త ఆట గురించిన వార్తలు వదంతులు బ్రిటన్‌కుకూడా వ్యాపించినవి. 1885 లో జాన్‌రాబర్ట్స్ ఇండియాలో పర్యటించినప్పుడు నెవిలీ చాంబర్లీన్‌ను ఆయనకు పరిచయం చేస్తూ "స్నూకర్సు కనుగొన్న వ్యక్తి ఈయనే" అని అన్నారు. జాన్‌రాబర్ట్స్ అప్పుడు స్నూకర్‌లో ఆసక్తిచూపి ఇంగ్లండుకు తిరిగి వెళ్ళిన మీదట ఆ ఆటను అక్కడ ప్రచారం చేశారు. ఇండియాలో రూపొందించబడిన ఆట నిబంధనలే-ఇంగ్లండులో కూడా ఆమోదించబడినవి. 1930 నుంచి స్నూకర్ బిలియార్డ్స్‌కు తీవ్రమైన పోటీ అయినది.

ఇండియాలో శ్రీయుతులు విల్సన్‌జోన్సు (బొంబాయి), చంద్రా హిర్జి (బెంగాల్), టి. ఏ. సెల్వరాజ్ (మైసూరు), టి. జి. కృష్ణ (ఆంధ్ర) గారలు బిలియార్డ్స్, స్నూకర్ ఆటలలో పేరుగడించి వున్నారు. శ్రీ ములుకుట్ల శివరామశాస్త్రిగారు ప్రపంచ పోటీలలో ఇండియా ప్రతినిధి (1954-55).

జాతీయ ఛాంపియన్లు :— ఇండియాలో 1931 నుంచి జాతీయ బిలియార్డ్స్ ఛాంపియన్‌షిప్ పోటీలు జరుగుతున్నవి. జాతీయ ఛాంపియన్ల పేర్లు దిగువ తెల్పబడినవి:

**1941, 42 - వి. ఆర్. ఫ్రియర్ (మధుర); 1943, 45 - పోటీలు లేవు; 1946, 47 - సి. హిర్జీ (కలకత్తా), 48 - ఫ్రియర్; 49 - టి. ఎ.**

సెల్వరాజ్ (బెంగుళూరు), 50 - 52 విల్సన్ జోన్స్ (బొంబాయి); 53 - ఎ. డ్రిఫీల్డు (బ్రిటన్); 54 - విల్సన్ జోన్స్; 55 - హిర్జి (కలకత్తా); 56 - జోన్స్. (ప్రక్క చిత్రం ఫ్రీయర్, సెల్వరాజ్)



ఆంధ్రలో ప్రజాదరణ పొందిన గృహాంతర క్రీడ బిలియార్డ్స్. టేబుల్ టెన్నిస్ ప్రచారంలోకి రాకముందు కూడా ఈ ఆట ఆదరణ పొందింది. ఆంధ్ర రాష్ట్రావతరణ పిమ్మట ఆంధ్ర రాష్ట్ర బిలియార్డ్స్ సంఘం ఏర్పడి ఆంధ్రరాష్ట్రంలో బిలియార్డ్స్ అభివృద్ధికి కృషి చేస్తున్నది. ఈ సంఘం సంస్థాపకులలో శ్రీయుతులు టి. ఏస్. సూరి, వి. సీతారామారావు, తెన్నేటి విశ్వనాథం గారలు ముఖ్యులు. 1954 ఏప్రిల్‌లో శ్రీయుతులు పి. వి. జి. రాజు (అధ్యక్షుడు), కొమ్మారెడ్డి సూర్యనారాయణ (ఉపాధ్యక్షుడు), యం. వి. శివరామశాస్త్రి (గౌరవ కార్యదర్శి, కోశాధికారి) సంఘ కార్యకర్తలుగా ఎన్నుకోబడినారు.

ఇంకా క్రింది ప్రముఖులు ఆంధ్రలో బిలియార్డ్స్ ఆట వ్యాప్తికి కృషి చేస్తున్నారు: శ్రీయుతులు పి. పద్మనాభరావు (ఏలూరు), డి. మాణిక్యాలరావు (ఏలూరు), పి. వెంకటరామన్ (శ్రీకాకుళం), టి. హయగ్రీవరావు (బందరు).

బిలియార్డ్స్‌లో ప్రావీణ్యాభివృద్ధికి పాటుపడుతున్న సంస్థల పేర్లివి:—

ఐ. బి. పి. సెంచరీ క్లబ్, వాల్తేర్ క్లబ్, వైజాగ్ క్లబ్ (ఇవి మూడు విశాఖపట్నంలోనివి), లిటరరీ అసోసియేషన్ (కాకినాడ), హిందూ సమాజ్ (రాజమండ్రి), ఏలూరు క్లబ్ (ఏలూరు), ఆంధ్రా జింఖానా (విజయవాడ), కృష్ణా క్లబ్ (బందరు), కాస్మాపాలిటన్

క్లబ్ (బందరు), ఎల్. వి. ఆర్. అండ్ సన్స్ క్లబ్ (గుంటూరు), సి. వి. యన్. రీడింగ్ రూం (ఒంగోలు).

## ఆటగాళ్ళ పరిచయం

శ్రీ టి. ఏ. సూరి :— జననం 1904—అమలాపురంలో. నాజివీడు స్కూలులో ఆరవఏట ప్రవేశించిననాటినుంచే ఆటలందు



ఆసక్తి చూపేవారు. 11 వ ఏట మద్రాసులో చదువు ప్రారంభించిన మీదట బాడ్మింటన్, హాకీ, ఫుట్‌బాల్, పింగ్‌పాంగ్, క్రికెట్ ఆడేవారు. జిమ్నాస్టిక్స్‌లో పాల్గొనేవారు. 1922 లో మద్రాసు మ్యూజియం థియేటర్‌లో ఆసనాలు ప్రదర్శించారు. కాలేజిలో చదివే కాలంలో క్రికెట్‌లో ఎక్కువ కృషి చేశారు.

మొట్టమొదటసారి 1926 లో గుంటూరు యల్. వి. ఆర్ అండ్ సన్స్ క్లబ్‌లో బిలియార్డ్స్ అభ్యసించారు. 1929, 30 లలో విజయ నగరం మహారాజాగారు కోరుకొండలో (విశాఖపట్నం జిల్లా) ఏర్పాటు చేసిన క్రికెట్ టోర్నమెంటులో వీరు స్థాపించిన క్లబ్ జట్టు పాల్గొన్నది. శ్రీ సూరిగారు ఆ టీము మేనేజర్, వైస్ కెప్టెన్.

వీరు ఆంధ్ర టేబుల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో కూడా పాల్గొని ద్వితీయస్థానం పొందివున్నారు. 1931 - 38 మధ్య బిలియార్డ్స్ లో వీరు ఆంధ్రదేశమంతటా ఖ్యాతి గడించారు. ఈ కాలంలోనే వీరు ఈస్టు కోస్టు బిలియార్డ్స్ ఛాంపియన్‌షిప్ పోటీలలో ఏడుసార్లు ద్వితీయ స్థానం, రెండుసార్లు విజయం సాధించారు. గుంటూరులో జరిగిన ఆంధ్ర ఛాంపియన్‌షిప్ పోటీలలో రెండుసార్లు అగ్రస్థానం సాధించారు.

1946 లో ఉద్యోగరీత్యా వీరు మద్రాసులో వున్నప్పుడు చెన్న రాష్ట్ర బిలియార్డ్స్ అసోసియేషన్ స్థాపించి, 1953 వరకు గౌరవ

సంయుక్త కార్యదర్శిగా వున్నారు. అనేక టోర్నమెంటులు కొత్తగా ప్రారంభించి నిర్వహించడం ద్వారా బిలియార్డ్స్‌కు గొప్ప సేవ చేశారు. చెన్నరాష్ట్రంలో విదేశ బిలియార్డ్స్, స్నూకర్ ఆటగాళ్ళ పర్యటనను, ఎగ్జిబిషన్ పోటీలను ఏర్పాటుచేశారు. బాబ్ మార్షల్, టామ్ క్లియరీ, హొరెస్ లింద్రమ్ వంటి ప్రపంచ ఛాంపియనులు దక్షిణ భారతంలో వీరితో కలసి పర్యటించారు. చెన్నరాష్ట్రం చెస్ అసోసియేషన్ స్థాపించి 1950 నుంచి 53 వరకు ఆ సంస్థ గౌరవ కార్యదర్శిగా వ్యవహరించారు. 1949 లో మద్రాసులో మొట్టమొదటసారి స్త్రీలకు చతురంగ పోటీలను నిర్వహించారు. నింకు ఆరోగ్యంలో వృద్ధిపైకు ఆంధ్ర ప్రభుత్వ సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారుగా పని చేస్తున్నారు.

(శ్రీ) ములుకుట్ల శివరామశాస్త్రి :— జననం 1912 ఏప్రిల్ 12. ఏలూరు. వీరి తండ్రిగారు స్వర్గీయ సూర్యప్రకాశరావు గారు ప్రముఖ బిలియార్డ్స్ ఆటగాడు. కుమారుడు తన ఏడవ ఏటినుండి తండ్రితోపాటు క్లబ్‌కు వెళ్ళి, అక్కడ బిలియార్డ్స్ ఆటను శ్రద్ధగా తిలకిస్తుండేవారు. 1929-30 లో ఏలూరుక్లబ్ సభ్యునిగాచేరి రోజుకు వెయ్యిపాయింట్లు వేసేవరకు బిలియార్డ్స్ ఆడుతుండేవారు. 1931 లో విజయవాడ ఆంధ్ర జింఖానా టోర్నమెంటులో మొట్టమొదటిసారిగా పాల్గొన్నారు. వీరు సాధించిన విజయాల వివరమిది :

1932-విజయవాడ ఈస్ట్ ఇండియా ఛాంపియన్‌షిప్ ఫైనల్సులో మద్రాసు ఆటగాడు శ్రీ వి. డి. రామస్వామిగారిచే ఓడించబడినారు. ఇంతకుముందు నాలుగు సంవత్సరాలు ఛాంపియన్ శ్రీ పి. వి. శాస్త్రి గారిని సెమిఫైనల్సులో ఓడించేశారు. 1933 ఏలూరులో నిర్వహించబడిన ములుకుట్ల సూర్యప్రకాశరావు మెమోరియల్ ట్రోఫీ విజేత. 1935 లో వైజాగ్ క్లబ్ ట్రోఫీ విజేత. ఫైనల్స్‌లో విశాఖ ఛాంపియన్ శ్రీ త్యాగరాజశాస్త్రిగారిని ఓడించారు. 1942 ఆంధ్ర జింఖానా (విజయవాడ) జటప్రోల్ కప్పు విజేత. ఫైనల్స్‌లో గుంటూరు ఆటగాడు శ్రీ వి. యస్. చారిగారిని ఓడించారు. మరుసటి సంవత్సరంలో ఇదే టోర్నమెంటులో శ్రీ చారిగారు, శ్రీ శాస్త్రిగారు ప్రథమ, ద్వితీయ

స్థానాలు సంపాదించారు. 1949-51 లో ఏలూరు క్లబ్ నిర్వహించిన ముళ్ళపూడి నూర్యప్రకాశరావు మెమోరియల్ టోర్నమెంటులో ద్వితీయ స్థానం వహించారు. 1954 రాజమండ్రి హిందూసమాజ్ ట్రోఫీ విజేత. ఫైనల్స్‌లో శ్రీ వి. యస్. చారిగారిని ఓడించారు. వీరు అధికార పోటీలో ఒకసారి వరుసగా 74 పాయింట్లు, అనధికార పోటీలో వరుసగా 99 పాయింట్లు (బిలియార్డ్స్) సాధించారు.

1955, 56 సంవత్సరాలలో ఏలూరులో ఆంధ్రరాష్ట్ర బిలియార్డ్స్ స్నూకర్ ఛాంపియన్ షిప్ పోటీలను నిర్వహించారు. 1954 - 55 సంవత్సరంలో జరిగిన ప్రపంచ బిలియార్డ్స్ ఛాంపియన్‌షిప్ పోటీలలో ఇండియా ప్రతినిధి. 1955 సంవత్సరాంతంలో ప్రపంచ ఎమచూర్ బిలియార్డ్స్ ఛాంపియన్ శ్రీ బాబ్ మార్షల్ (ఆస్ట్రేలియా) ఇండియా సందర్శించినప్పుడు శ్రీ శాస్త్రిగారు వారిచేత విశాఖపట్నం, కాకినాడ, ఏలూరు, విజయవాడ, గుంటూరులలో ఎగ్జిబిషన్ పోటీలు జరిపించారు.

శ్రీ బాబ్ మార్షల్ విజయవాడలో ఒకేసారి 641 పాయింట్లు సాధించి, ఇండియా రికార్డును అధిగమించారు. 35 నిమషాలలో వీరు ఇన్ని పాయింట్లు సాధించారు. ఇప్పటికీ క్లబ్ పోటీలలో శ్రీ శాస్త్రిగారు పాల్గొంటున్నారు.

(శ్రీ) టి. జి. కృష్ణ :— జననం 1933 ప్రాంతం. ప్రస్తుత నివాసం విశాఖపట్నం. 1950 లో ఏలూరు కాలేజి విద్యార్థిగా వున్నప్పుడు బిలియార్డ్స్ ఆట ప్రారంభించారు. శ్రీ కృష్ణగారి తండ్రి శ్రీ టి. వి. రమణరావునాయుడు గారు బిలియార్డ్స్ ఆటలో ప్రసిద్ధిచెందినవారు. వారే కుమారుని బిలియార్డ్స్ ఆటలో ప్రోత్సహించారు. 1951 లో హిందూసమాజ్ ఓపెన్ బిలియార్డ్స్ ఛాంపియన్ షిప్ ఫైనల్సు వరకు వచ్చారు. అప్పుడే వీరి శక్తి తొలిసారి గుర్తించబడింది. 1952 లో వీరు విశాఖపట్నంలో



ఆంధ్ర మెడికల్ కాలేజిలో విద్యార్థిగా చేరారు. 1953 లో 'ఆంధ్ర

ఇంటర్ క్లబ్ బిలియార్డ్స్ లీగ్ ఛాంపియన్ షిప్' పోటీలలో వైజాగ్ క్లబ్ తరఫున పాల్గొని, ఒక్క ఓటమి అయినా పొందకుండా అగ్రస్థానం సాధించారు. 1955 లో తొలిసారి ఆంధ్రరాష్ట్ర బిలియార్డ్స్, స్నూకర్ ఛాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొని శ్రీ వి. ఆర్. ఫ్రీయిర్ (మధుర) వంటి అగ్ర ఆటగాళ్ళపై విజయం సాధించారు. స్నూకర్ ఫైనల్సులో శ్రీ సెల్వరాజ్ (బెంగుళూరు) చే ఓడించబడ్డారు. కృష్ణగారిని ఆంధ్రరాష్ట్ర బిలియార్డ్స్ సంఘం అద్వితీయ ఆటగానిగా గుర్తించింది. ఇదే సంవత్సరంలో శ్రీ కృష్ణగారు రాజమండ్రిలో హిందూసమాజ్ ఓపెన్ బిలియార్డ్స్ ఛాంపియన్ షిప్ సాధించారు.

1955 డిశంబరులో కలకత్తాలో జరిగిన ఆలిండియా బిలియార్డ్స్, స్నూకర్ ఛాంపియన్ షిప్ పోటీలలో పాల్గొన్నారు. జాతీయ పోటీలలో ప్రప్రథమ ఆంధ్ర ప్రతినిధి వీరే. అదే పోటీలలో వీరు స్నూకర్ క్వార్టర్ ఫైనల్సులో అప్పటి ఛాంపియన్ శ్రీ సెల్వరాజ్‌ను ఓడించి వేశారు. వీరి ఆటను ప్రపంచ ఆటగాడు శ్రీ బాబ్ మార్షల్ శ్లాఘించారు.

1956 లో వీరిని సింహళం నేషనల్ బిలియార్డ్స్, స్నూకర్ పోటీల నిర్వాహక సంఘంవారు కొలంబోకు ఆహ్వానించారు. రెండింటిలోను ఫైనల్సులో శ్రీ సెల్వరాజ్ చే ఓడించబడినారు.

(శ్రీ) వి. యస్. చారి :— వీరిని 1951, 52, 53 సంవత్సరాలలో మద్రాసురాష్ట్ర బిలియార్డ్స్ ఆటగాళ్లలో ప్రావీణ్యంబట్టి ఐదవ వారిగా నిర్ణయించారు. అనేక టోర్నమెంట్లలో పాల్గొని 50 వెండికప్పులు, షీల్డులు బహుమతిగా పొందారు.



1956 లో ఏలూరులో ఆంధ్ర రాష్ట్ర బిలియార్డ్స్ టోర్నమెంటులో క్వాలిఫయింగ్ పోటీలను గెలుచుకొన్నారు. ప్రస్తుత నివాసం గుంటూరు.

శ్రీ వింజమూరి శ్రీనివాసాచారి గారు వేణుగాన విద్వాంసులు కూడా.

శ్రీ ధర్మరాజ్ :— (విజయవాడ) వీరు వివిధ క్రీడలలో ప్రావీణ్యం గడించి వున్నారు. ముఖ్యంగా ఫుట్ బాల్, టెన్నిస్, క్రికెట్ పోటీలలో 1948 వరకు పాల్గొంటూ వచ్చారు. 1948 నుంచి వారు బిలియార్డ్స్ ఆటను వారి మిత్రుడు ప్రముఖ బిలియార్డ్స్ ఆటగాడు అయిన శ్రీ యం. రామకృష్ణారావు గారి ప్రోద్బల ప్రోత్సాహాలతో ఆడ ప్రారంభించారు. క్రమ క్రమంగా ఆట అభివృద్ధి చేసుకొని, 1951, 1954 సంవత్సరాలలో విజయవాడలోని ఆంధ్ర జింఖానా క్లబ్ ఆధ్వర్యాన జరుపబడిన ఈస్టు ఇండియా బిలియార్డ్స్ ఛాంపియన్ షిప్ ను సాధించారు.



శ్రీ టి. వాసుదేవగుప్త :— వయస్సు 21 సంవత్సరాలు. వీరు 1954 నుంచే బిలియార్డ్స్, స్నూకర్ ఆట ప్రారంభించారు. 1956 లో చెన్నపురి స్నూకర్ లీగ్ పోటీలలో చెన్నపురి ఆంధ్రమహాసభ విజయ మొందడానికి ప్రధాన కారకులు వీరే. విజయవాడ, మద్రాసులలో జరిగిన అనేక పెద్ద టోర్నమెంటులలో పాల్గొని కనీసం ద్వితీయ స్థానమైనా వహిస్తూ వచ్చారు. వీరు పేరొందిన క్రికెట్ ఆటగాడు కూడా. కాలేజీ, లీగ్ పోటీలలో 13 సెంచరీలు సాధించి వున్నారు. 1954 లో మద్రాసు యూనివర్సిటీ క్రికెట్ జట్టు సభ్యులు. 1955 లో మద్రాసు సిటీ సెంట్రల్ లీగ్ క్రికెట్ జట్టు కెప్టన్. ప్రస్తుతం దక్షిణ భారతంలో ప్రముఖ బిలియార్డ్స్, స్నూకర్ ఆటగాడు. నివాసం మద్రాసు.

* ఆంధ్రదేశంలో ఇంకా క్రింది ఆటగాళ్ళు బిలియార్డ్స్, స్నూకర్ పోటీలలో పేరుగడించి వున్నారు. శ్రీయుతులు సి. యన్. శ్రీనివాసరావు (కాకినాడ), వి. సీతారామారావు (బందరు), రామకృష్ణారావు (విజయవాడ), ఎల్లాప్రగడ నరసింహారావు (విశాఖపట్నం) ఆర్. వి. శ్రీహరరావు (ఏలూరు) ప్రభృతులు. పూర్వపు ఆటగాళ్ళ పేర్లు పై జీవిత చరిత్రలలో ఉదహరించబడినవి.

(శ్రీ) విల్సన్ జోన్సు :— (బొంబాయి) వయసు షుమారు 35 సంవత్సరాలు. తొలిసారి 17 వ ఏట బిలియార్డ్సు, స్నూకర్ ఆడినారు. ప్రారంభంలో పెద్దల ఆటను పరీక్షగా చూచేవారు. తొలిసారి 1945 లో “ఈవినింగ్ న్యూస్ ఆఫ్ ఇండియా” స్నూకర్ టోర్నమెంటులో పాల్గొని గెలుపొందారు. అంతిమ పోటీలో శ్రీ టహరాశీ కంట్రాక్టర్‌ను ఓడించి వున్నారు. 1948 లో క్రిస్టిన్ సాడ్లర్‌ను 4 - 2 ఫ్రేములతో ఓడించి జాతీయ స్నూకర్ ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొన్నారు. 1950 లో శ్రీ ఫ్రాంక్ ఎడ్వర్డ్స్ అనే క్రికెట్ ఆటగానిని ఓడించి జాతీయ బిలియార్డ్సు ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొన్నారు. వీరితో మద్రాసులో ఎగ్జిబిషన్ పోటీచేస్తూ ఏకధాటిగా 309 పాయింట్లు సాధించారు. 1951 లో తిరిగి జాతీయ బిలియార్డ్సు ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్నారు. సెమిఫైనల్‌లో ఆస్ట్రేలియా ఛాంపియన్ శ్రీ టామ్ క్లియరీని ఆరువందల పాయింట్ల తేడాతో ఓడించి వున్నారు. 1951 లో ఇంగ్లండులో జరిగిన ప్రపంచ ఛాంపియన్‌షిప్ పోటీలలో ఇండియా ప్రతినిధి. ప్రపంచ బిలియార్డ్సు పోటీలలో బర్మా ఆటగాడు శ్రీ యూసిస్‌తో ఆడినప్పుడు 2200 పాయింట్లుకు పైగా సంపాదించి వున్నారు. ఒకసారి 253 పాయింట్లు, మరొకసారి 247 పాయింట్లు ఏకధాటిగా సాధించారు.

ప్రపంచ పోటీల సందర్భంలోనే లండన్‌లో శ్రీ హారేస్ లింద్రమ్ (ఆస్ట్రేలియా) వద్ద ఉన్నత శిక్షణ పొందివున్నారు. 1953 లో ఇండియా ప్రతినిధిగా హాంగ్‌కాంగ్‌లో పర్యటించారు. హాంకాంగ్‌లో ఒకసారి $8\frac{1}{2}$ నిమిషాలలో నూటఅరవైతొమ్మిది పాయింట్లు (బిలియార్డ్సు) సాధించి వున్నారు. ఇందులో నూరుపాయింట్లు సాధించడానికి $4\frac{1}{2}$ నిమిషాలు మాత్రమే పట్టింది. హాంకాంగ్ ఛాంపియన్ శ్రీ యస్. పాంగ్‌ను వీరు ఓడించి వున్నారు. 1953 లో బొంబాయిలో ఒకసారి ఏకధాటిగా 434 పాయింట్లు (బిలియార్డ్సు) సాధించి వున్నారు.

(శ్రీ) చంద్రా హిర్జి (బెంగాల్) :— వయసు సుమారు 32. 1946, 47 సంవత్సరాలలో జాతీయ బిలియార్డ్సు ఛాంపియన్. 1952 లో కలకత్తాలో జరిగిన ప్రపంచ ఛాంపియన్‌షిప్ పోటీలలో ఇండియా ప్రతినిధి. అప్పుడు శ్రీ బాబ్ మార్షల్‌ను ఓడించారు. పోటీలలో తృతీయస్థానం వహించారు. 1952 లో జాతీయ స్నూకర్ ఛాంపియన్‌షిప్ పోటీలలో విల్సన్ జోన్సుచే ఓడించబడి, ద్వితీయస్థానం వహించారు.

శ్రీ ఫ్రెడ్ డేవిస్ (ఆస్ట్రేలియా) :— అనేక సంవత్సరాలు ప్రపంచ బిలియార్డ్స్ ఛాంపియన్ అయిన శ్రీ జో డేవిస్ సోదరుడు. "స్నూకర్ మార్వెల్" గా ప్రపంచ ఖ్యాతి గడించిన వీరు తన క్రీడా జీవితంలో 135 స్నూకర్ సెంచరీలు కొట్టి వున్నారు. 1952 అక్టోబరులో పెద్ద పోటీలనుంచి విరమించారు. అప్పటికి వీరి వయస్సు 39 ఏళ్లు.

శ్రీ రాబర్ట్ మార్షల్ (బాబ్ మార్షల్):—వయస్సు 47. 1952 లో వీరు ప్రపంచ ఎమెచూర్ బిలియార్డ్స్ ఛాంపియన్. 1936 నుంచి 1939 వరకు, 1946, 48, 49, 51 లలో ఆస్ట్రేలియా బిలియార్డ్స్ ఎమెచూర్ ఛాంపియన్. వీరు ఏకధాటిగా 883, 589, 553, 540, 500 పాయింట్లు (బిలియార్డ్స్) సాధించివున్నారు. 1955 నవంబరులో ఇండియాలో (ఆంధ్రదేశంలోకూడా) పర్యటించి వున్నారు.

శ్రీ హారేస్ లింద్రమ్ (ఆస్ట్రేలియా) :— జననం 1912 జనవరి 15–సిడ్నీలో. వీరి కుటుంబంలో బిలియార్డ్స్, స్నూకర్ ఆట వంశపారంపర్యంగా వస్తున్నది. 13 వ ఏటనుంచి శ్రీ లింద్రమ్ బిలియార్డ్స్, స్నూకర్‌లను శ్రద్ధతో అభ్యసించారు. 16 వ ఏట స్నూకర్‌లో మొట్ట మొదటిసారి సెంచరీ సాధించారు. 19 ఏట శ్రీ ఫ్రాంక్ స్మిత్ (జూనియర్)ను ఓడించి ఆస్ట్రేలియా స్నూకర్ ఛాంపియన్‌షిప్‌ను సాధించి వున్నారు. అప్పటి నుంచి అనేక సంవత్సరాలు ఆస్ట్రేలియా స్నూకర్ ఛాంపియన్. 1937 లోనూ, 1952 లోనూ శ్రీ లింద్రమ్ ఇండియాలో పర్యటించారు. దాదాపు తొమ్మిది ప్రపంచ స్నూకర్ ఛాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొని వున్నారు. బిలియార్డ్స్‌లోకూడా అందెవేసిన చెయ్యి. 18 వ ఏటనే ఒకపోటీలో 1000 కి పైగా పాయింట్లు సాధించి వున్నారు.



# అధ్యాయము 20

# చతురంగం

చతురంగం పుట్టుక భారతదేశంలో వేదకాలంనుంచి ప్రస్న అక్షక్రీడ (పగడాల ఆట, దాయాలు ఆట, పులిజూదం) చతురంగానికి ప్రాతిపదికగా చెప్పవచ్చు.



చతురంగం కనుగొన్న కీర్తి హిందువులకు లేకుండా చేయడం నిమిత్తం పాశ్చాత్యులు ఈ క్రీడను బౌద్ధులు కనిపెట్టి అభివృద్ధి పరచినారని చెబుతారు. బౌద్ధులు అహింసావాదులు, శాంతివాదులు, నిర్యుద్ధవాదులు కావడంచేత యుద్ధానికి మారుగా చతురంగమనే "అహింసాయుద్ధ క్రీడ"ను అవలంబించినారని ఒక వాదం వున్నది.

ప్రాచీన కాలంలో చైనీయులు, గ్రీకులు, ఈజిప్షియనులు. రష్యనులు, బాబిలోనియన్లు, ఐరిష్‌వారు, పర్షియన్లు, వేల్స్ ప్రజలు, అరబ్బులు, చతురంగం ఆడెడివారు. అరబ్బులు యూరప్‌లో చతురంగాన్ని ప్రవేశపెట్టారు. మొదట వీరు స్పెయిన్‌లో ఈ ఆటను ప్రచారం చేశారు. 1618-1648 మధ్య యుద్ధకాలంలో యూరప్‌లో ఈ ఆటకు ఆదరణ తగ్గిపోయింది. కాని 18 వ శతాబ్ద మధ్యంలో యిది పునరుజ్జీవింప చేయబడింది. మొదట జర్మనీ, రష్యా, ఇంగ్లాండులలో ఇది బాగా ప్రచారం చేయబడింది. ఆ రోజులలో ఈ దేశాలలోనే అగ్ర చతురంగ క్రీడావేత్తలు వుండేవారు. అటు అమెరికా ఖండంలో కూడా ఇదే కాలంలో చతురంగం బాగా వ్యాప్తిలోనికి వచ్చింది. శ్రీ పాల్ మార్ఫి అనే అమెరికన్ గొప్ప క్రీడా ప్రవీణుడుగా ఎంచబడినారు.

కాలం మారుతున్న కొద్దీ చతురంగం ఆట పద్ధతికూడా మారుతూ వచ్చింది. 19వ శతాబ్దంలో ఆటగాళ్ళు సాహసించి ఎత్తులువేసి అకస్మాత్తుగా ఓడించివేసే పద్ధతి అనుసరించేవారు. 1920 ప్రాంతాలలో మెలకువతో, జాగ్రత్తగా, నెమ్మదిగా పోటీ కొనసాగించి అంత్యదశలో అకస్మాత్తుగా ఓడించే పద్ధతి అమలులో వుండేది. ఇప్పుడు అటు సాహసించి పురోగమించడం, ఇటు తన పావులకు నష్టం వాటిల్లకుండా జాగ్రత్తపడడం రెండూకూడా చేస్తూ వున్నారు.

భారతదేశాన్ని గత శతాబ్దాలలో పాలించిన ప్రభువులు చతురంగ క్రీడకు గౌరవస్థానాన్ని ఇచ్చారు. అనేక ఆస్థానాలలో కూడా చతురంగ క్రీడ పోషించబడింది. నేటికీ పల్లెలలో సైతం ఈ క్రీడ అమలులో వున్నప్పటికీ దేశస్వాతంత్ర్యానికి ముందు దీని ప్రాముఖ్యం తగ్గింది. దేశస్వాతంత్ర్యంతోపాటు ఈ ఆటకు తిరిగి ప్రాధాన్యం వచ్చింది. 1948లో ఆల్ ఇండియా కరస్పాండెన్స్ చెస్ అసోసియేషన్ ఉద్భవించింది. మరుసటి సంవత్సరం ఆలిండియా చెస్ ఫెడరేషన్ అవతరించింది. దరిమిలా రాష్ట్రీయ సంఘాలు కూడా ఏర్పడినవి; ఏర్పడుతున్నవి.

ప్రస్తుతం "చెస్" అనే ఇంగ్లీషులో పిలువబడేది అంతర్జాతీయ విధానంలో ఆడే చతురంగం. మస్తు, నిర్మస్తు రూపాలలో ఆంధ్రప్రాంతములోనూ, ఉత్తరాదిని జోరీ, అజోరీ, అనే రూపాలలోను చతురంగం అమలులో వున్నది. ప్రపంచ మంతటా వ్యాప్తిలోవున్న అంతర్జాతీయ విధానం ముందు జాతీయ విధానం క్రమంగా క్షీణిస్తున్నది. ప్రపంచమంతా పూర్తిగా ఒకే విధానం అమలులోనికి రావడం మంచిది కూడా. గత నాలుగు శతాబ్దాలలోనూ పాశ్చాత్యులు చతురంగం పోటీలను రికార్డు చేయడం, ప్రారంభదశలకు పేర్లు పెట్టి వాటిని శాస్త్రీయ పద్ధతిలో పుస్తకబద్ధం చేయడం జరిగింది.



బొట్వినిక్

భారత జాతీయ, అంతర్జాతీయ చతురంగ క్రీడా విధానాలలో క్రింది తేడాలు ముఖ్యమైనవి.

(1) జాతీయ విధానాలలో 'యుద్ధం' ప్రారంభమయ్యేటప్పటికి 15-20 ఎత్తులదాకా పట్టుతుంది. అంతర్జాతీయ విధానాలలో తొలి ఎత్తునుంచి రమారమి రణరంగమే అవుతుంది.

(2) అంతర్జాతీయ విధానాలలో ఆటకీలులో 'రకాలు' ఎక్కువగా కనబడుతాయి.

(3) ఎక్కువ దూరం ఆలోచించటానికి అంతర్జాతీయ విధానంలో అధికావకాశం వుంది.

విద్యార్థి దశలో చతురంగం ఆటను ఒలవరుచుటకు పాశ్చాత్య దేశాలలో కృషి జరుగుతున్నది. రష్యాలో ఇట్టి కృషిని గురించి 79, 80 పేజీలలో ప్రస్తావించివున్నాను. రష్యాలో అంతటిశ్రద్ధ వహించబడుతూండడంచేతనే ప్రపంచ ఛాంపియన్లు రష్యాయను లై వున్నారు. 1956 లో ప్రపంచ ఛాంపియన్ రష్యన్ ఇంజనీర్ శ్రీ బొట్వినిక్ (ప్రక్క పేజీలో చిత్రం) ప్రపంచ స్త్రీల ఛాంపియన్ ఓల్గా రెబ్‌ట్సోవా (ప్రక్క చిత్రం. రష్యా). 1955 లో స్త్రీల ఛాంపియన్ ఎలిజ్‌వెటా బైడోవా (రష్యా). 1956 సంవత్సరాంతంలో మాస్కోలో



జరిగిన 12 వ ప్రపంచ చెస్ ఓలింపియాడ్‌లో టీమ్ ఛాంపియన్‌షిప్‌ను కూడా రష్యా గెలుచుకొన్నది. రష్యాజట్టులో క్రింది ఆటగాళ్ళు కలరు. శ్రీయుతులు ఎ. కొటోవ్ (కాప్టెన్), ఎమ్. బొట్వినిక్, వి. స్మయిస్లావ్, ఎమ్. తైమనోవ్, పి. కెరెస్; ఇ. సెల్లర్, డి. బ్రాన్‌స్టీన్.

1956 లో ప్రపంచం కరస్పాండెన్సు చెస్ ఛాంపియన్ షిప్‌ను శ్రీ సి. జె. యస్. పర్డీ అనే ఆస్ట్రేలియన్ గెలుచుకొన్నాడు. 1956 మార్చిలో 26 దేశాలకు జరిగిన (కరస్పాండెన్సు) చెస్ పోటీలలో 70 మంది ఆటగాళ్ళు పాల్గొన్నారు. ఇండియా తరఫున ఈ పోటీలలో ఆంధ్ర ఆటగాడు శ్రీ జి. యస్. దీక్షిత్ గారు పాల్గొన్నారు. ఈ తరగతి పోటీలలో ఇంకా డాక్టర్ యం. నపోలిటానో (ఇటలీ), వి. రాగోజిన్ (రష్యా), డాక్టర్ జె. బలోగ్ (హంగరీ), హెచ్. ఎఫ్. బాటిక్, జె. జజక్ (వీరుభయులు చెకోస్లావాకియా నివాసస్తులు) ప్రపంచ ప్రసిద్ధి గాంచినారు

రష్యా తరువాత స్థానాన్ని యుగోస్లావియా వహిస్తున్నది.

హాలెండ్ దేశంలో ఆలోచనాశక్తిని పెంపొందించడానికి చతురంగాన్ని పాఠశాలలలో ప్రత్యేకంగా ప్రవేశపెట్టారు.

ఇండొనీషియాలో చతురంగం ఆట ప్రాచీనకాలంనుంచీ, ప్రచారంలో వున్నప్పటికీ స్వాతంత్ర్యానికిముందు అది క్షీణించింది. డచ్ పాలకులు వైదొలగినమీదట తిరిగి ఇది వ్యాప్తి చెందుతున్నది. 1956 లో ఇండొనీసియా ఛాంపియన్ శ్రీ బి. హూటగాలుంగ్.

చెస్‌లో అమెరికా అగ్రస్థానం వహించనప్పటికీ అంతర్జాతీయ ఖ్యాతిని గడించిన ఆటగాళ్ళు అక్కడ గలరు. 1956 లో అమెరికా ఛాంపియన్ శ్రీ ఆర్థర్ బి. బిస్‌గ్వయర్. ఈయన అంతర్జాతీయ పోటీలలో పాల్గొని వున్నారు.

1956 ఆగస్టులో మాస్కోలో జరిగిన ప్రపంచ చతురంగం పోటీలలో ఇండియాతరఫున శ్రీయుతులు రామదాసుగుప్త (యు. పి.), బి. పి. మహేస్కర్ (సాంగ్లి), ఆర్. బి. సప్రే (బొంబాయి), ఎస్. వెంకట్రామన్ (మద్రాసు) గారలు పాల్గొన్నారు. ఇండియా జట్టులో సభ్యునిగా ఎన్నుకోబడిన శ్రీ దర్భా వెంకయ్యగారు, స్టాండ్‌బై ఆటగానిగా ఎన్నుకోబడిన శ్రీ జి. యస్. దీక్షిత్ గారు ఇండియా, ఆంధ్ర దౌర్భాగ్యంకొద్ది మాస్కో వెళ్ళలేదు.

1955 లో ఏలూరులో జరిగిన ప్రథమ అఖిలభారత చతురంగ ఛాంపియన్ షిప్ పోటీలలో ఛాంపియన్ షిప్‌ను శ్రీ దర్భా వెంకయ్య, శ్రీ ఆర్. బి. సప్రే గారలు పంచుకొన్నారు.

## ప్రపంచ ఛాంపియన్‌షిప్‌ల వివరం

1928 నుంచి ప్రపంచ చతురంగం ఛాంపియన్ షిప్ పోటీలు రెండేసేళ్ళకు ఒక్కసారి జరుగుతున్నవి. వీటిలో గెలుపొందిన దేశాల పేర్లివి:

1928 హంగరీ, 1930 పోలెండు, 1931 అమెరికా, 33 అమెరికా, 35 అమెరికా, 37 అమెరికా, 39 జర్మనీ; యుద్ధం మూలాన 1950 వరకు పోటీలు లేవు. 1950 యుగోస్లావియా, 52 రష్యా, రష్యా పాల్గొనడం ఇదే మొదటిసారి., 54 రష్యా, 56 రష్యా. (116 వ పేజీ మూడవ పేరాకూడా చూడండి.)

1956 ప్రపంచటీమ్ పోటీలలో వివిధదేశాల స్థానా లివి:

1. సోవియెట్ యూనియన్ 2. యుగోస్లావియా 3. హంగరీ 4. అర్జంటీనా 5. పశ్చిమ జర్మనీ 6. బల్గేరియా 7. చెకోస్లొవాకియా 8. ఇంగ్లండు 9. స్విట్జర్‌లాండు 10. డెన్మార్క్ 11. రుమేనియా 12. ఇజ్రాయల్ 13. ఆస్ట్రియా 14 ఐస్‌లాండ్ 15. బెల్జియం 16. ఫిన్‌లెండ్ 17. కొలంబియా 18. హాలెండ్ 19. తూర్పు జర్మనీ 20. ఫ్రాన్సు 21. చిలీ 22. పోలెండ్ 23. నార్వే 24. ఫిలిప్పైన్స్.

చివరి వర్గంలో ఈ క్రింది దేశాలు కలవు. సార్, ఇండియా, పోర్టోరికో, మంగోలియా, స్కాట్లెండ్, గ్రీస్, ఐర్లెండ్, లగ్జెంబర్గు.

ఇండియా ప్రపంచ పోటీలలో పాల్గొనడం 1956 లో మొదలు. ఈ పోటీలో ఇండియాతరఫున పాల్గొన్నవారికి ముందు (భారతీయులైన) శ్రీ మీర్ సుల్తాన్‌ఖాన్, శ్రీ వి. కె. ఖడీల్కర్ గారలు అంతర్జాతీయ ఖ్యాతి గడించి వున్నారు. శ్రీ సుల్తాన్‌ఖాన్ 1932 లో లండన్‌లో జరిగిన బ్రిటిష్ చతురంగపు పోటీలలోనూ, శ్రీ ఖడీల్కర్ 1924 లో సౌతు పోర్టులో జరిగిన బ్రిటిష్ చతురంగపు ఛాంపియన్‌షిప్

పోటీలలోను పాల్గొని వున్నారు. శ్రీ సుల్తాన్ ఖాన్ ప్రస్తుతం పాకిస్తాన్‌లో స్థిరపడినారు. ఈయన వయస్సు 52 సంవత్సరాలు. యువకుడుగా వున్నప్పుడే చతురంగం అగ్రపోటీలనుంచి విరమించారు. బ్రిటిష్ ఎంపైర్ ఛాంపియన్ షిప్‌ను ఈయన గెలుచుకొనివున్నారు కూడా.

ఆంధ్రదేశంలో గత 7-8 సంవత్సరాలలోనే గాక, అంతకు పూర్వంగూడా, చతురంగానికి ఏలూరు ప్రధాన కేంద్రం. శ్రీ శరభం, శ్రీ లంక సీతాపతిరావు గారలు ఆంధ్రలో చతురంగ క్రీడా వ్యాప్తికి కృషిచేసిన వారిలో ముఖ్యులు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణం పిమ్మట, 1953 లో అఖిలాంధ్ర చతురంగ పరిషత్తు ఏర్పడింది. 1954 నుంచి రాష్ట్ర పోటీలు జరుపబడుతున్నవి. ప్రస్తుతం ఆంధ్రదేశంలో ఈ క్రీడా వ్యాప్తికి అభివృద్ధికి కృషిచేస్తున్నవారిలో శ్రీ డి. భాస్కరరావు (కాకినాడ), శ్రీ యస్. భాస్కరరావు (అనంతపురం) ప్రభృతులు ముఖ్యులు.

## ఆటగాళ్ళ పరిచయం

**శ్రీ దర్భా వెంకయ్య :—** జననం 1916, ఆగస్టు 24, తుని. తునిలోని శ్రీ రాజాగారి హైస్కూలులో చదివేకాలంలో సోకర్, హాకీ, బాడ్మింటన్ ఆటలు ఆడేవారు. 12వ ఏట చతురంగం ఆట నేర్చుకొన్నారు. కాలేజీ దశలో 16వ ఏట నుంచి ఈ ఆటలో ప్రత్యేక శ్రద్ధ చూపారు. రాజమండ్రి ఆర్ట్సు కాలేజిలో చదివేకాలంలో (1932) పెద్ద ఆటగాళ్ళతో ఆడి ఆటను అభివృద్ధి పరుచుకొని, రెండు, మూడు ఓపెన్ టోర్నమెంటులలో పాల్గొన్నారు. ఆ కాలంలోనే అంతర్జాతీయ చతురంగ



రీతులను నేర్చుకొన్నారు. 1937 లో సైన్సులో (కెమిస్ట్రి) పట్టభద్రులైనారు. 1948 లో కాకినాడ లిటరరీ అసోసియేషన్ సభ్యులుగా వుండి, కరెస్పాండెన్సు చతురంగంలో ప్రావీణ్యం సంపాదించుకొన్నారు.

1952 లో ఏలూరులో జరిగిన చెస్ టోర్నమెంటులో ద్వితీయస్థానం సాధించారు; చెన్నరాష్ట్ర చెస్ ఛాంపియన్ షిప్ టోర్నమెంటు (మద్రాసు) లోనూ ద్వితీయులుగా వచ్చారు. 1954 లో ఏలూరులో జరిగిన ద్వితీయ ఆంధ్రరాష్ట్ర చెస్ ఛాంపియన్ షిప్ పోటీలలోను, 1955 లో బందరులో జరిగిన తృతీయ ఆంధ్రరాష్ట్ర చెస్ ఛాంపియన్ షిప్ పోటీలలోను రెండవస్థానం వహించారు.

1955 లో ఏలూరులో జరిగిన ప్రథమ అఖిలభారత చెస్ ఛాంపియన్ షిప్ పోటీలలో పాల్గొని ఛాంపియన్ షిప్ సాధించారు. 1955 లో నే కాకినాడలో జరిగిన చతుర్థ ఆంధ్రరాష్ట్ర చెస్ ఛాంపియన్ షిప్ పోటీలలో రెండవస్థానం వహించారు.

విద్యార్థులలో క్రమశిక్షణ పెంపొందడానికి సంగీతం, చిత్రరచన వలె చతురంగానికి విద్యావిధానంలో స్థానమివ్వాలని ఈ అఖిలభారత ఛాంపియన్ కోరుకుంటున్నారు. 1956 లో మాస్కోలో జరిగిన ప్రపంచ చెస్ పోటీలకు వీరు భారత ప్రతినిధిగా ఎన్నుకోబడినారు. వీరు 1946 నుంచి కాకినాడ ఎమ్. ఎస్. ఎన్. సి. హైస్కూలులో సీనియర్ సైన్స్ అసిస్టెంటు.

శ్రీ గొల్లకోట సుబ్రహ్మణ్య దీక్షిత్ (జి. ఎస్. దీక్షిత్) :— జననం 1916 మార్చి 26 కపిలేశ్వరపురంలో. ప్రస్తుతం పిఠాపురం నివాసి. వీరి తండ్రిగారైన శ్రీ వెంకట్రామయ్యగారు, వారి పూర్వీకులు కూడా చతురంగపు ఆటగాళ్ళు. శ్రీ వెంకట్రామయ్య గారు 75 వ ఏటకూడా పట్టుదలతో చతురంగం ఆడుతున్నారు. వీరి అన్నగారు శ్రీ కృష్ణశాస్త్రి గారు ఆంధ్రదేశ మంతటా ఖ్యాతి గడించారు. తండ్రిగారిచ్చిన ప్రోత్సాహంతో నే శ్రీ దీక్షిత్ గారు 11 వ ఏట చెస్ నేర్చుకొని క్రమంగా



ఆటను అభివృద్ధి చేసికొన్నారు. చిన్నతనంలో నే తండ్రిగారిని 30 ఎత్తులలో ఓడించారు.

1939 లో తూర్పుగోదావరి జిల్లాలో జాతీయవిధానంలో జరిగిన దాదాపు పది చతురంగం టోర్నమెంటులలో ప్రథమబహుమతి పొందారు. 1939 లోనే అంతర్జాతీయ పద్ధతిలో మద్రాసు వై. యమ్. సి. ఎ. వారు జరిపిన పోటీలో ఛాంపియన్‌షిప్ సాధించారు.

1940 లో ఆర్రా (బీహార్) - (ఇండియన్ స్టయిల్) ఛాంపియన్‌షిప్‌ను, మద్రాసు (ఇంటర్నేషనల్ పద్ధతి) కస్తూరి క్లబ్ టోర్నమెంటును గెలుచుకొన్నారు. 1940 నుంచి 50 వరకు ఆంధ్రదేశంలో జరిగిన అనేక చతురంగం పోటీలలో ప్రథమస్థానం వహించారు. 1950 లోను, 1953 లోను ఇంటర్నేషనల్ పద్ధతిలో పూనాలో జరిగిన కెప్టెన్ రనడే టోర్నమెంటులో ప్రథమ బహుమతి పొందారు. 1952, 53 లలో చెన్నరాష్ట్ర ఛాంపియన్. 1953లో ఏలూరులో కాస్మోపాలిటన్ క్లబ్ నిర్వహించిన టోర్నమెంటులో ప్రథమస్థానం వహించారు.

1954, 55, 56 సంవత్సరాలలో ఆంధ్రరాష్ట్ర ఛాంపియన్.

"ఇండియన్ చెస్ మ్యాగజైన్" వంటి పత్రికలు శ్రీ దీక్షిత్ గారి ఆటను శ్లాఘించి, వారు 20 ముందుఎత్తులవరకు ఆలోచించి ఆడగల రని, వారిని మోసగించడం సాధ్యంకాదని పేర్కొన్నవి.

1956 లో మాస్కో చెస్ ఒలింపియాడ్‌కు ఎన్నుకోబడిన భారతీయ బృందంలో స్టాండ్ బైగా శ్రీ దీక్షిత్ గారు ఎన్నుకోబడినారు.

భారత ప్రభుత్వంవారు చతురంగాన్ని జాతీయక్రీడగా పరిగణించి ప్రోత్సహించవలెనని వీరు కోరుతున్నారు.

శ్రీ కె. భీమశంకరరావు (శంకర్) :— జననం 1933 ఏప్రిల్. ప్రస్తుత నివాసం బందరు. వీరికి చతురంగం ఆట వంశపారంపర్యంగా వచ్చినట్టిది. 12 వ ఏట చతురంగం నేర్చుకొన్నారు. 1952 నుంచి టోర్నమెంటులలో పాల్గొంటున్నారు. బందరులో కృష్ణా క్లబ్ వారు ఏర్పాటుచేసిన చెస్ టోర్నమెంటులలో విజయం సాధించారు. రెండవ ఆంధ్రరాష్ట్ర చెస్ ఛాంపియన్ షిప్ పోటీలలో తృతీయస్థానం వహించి ప్రత్యేక బహుమతి పొందారు. ప్రథమ అఖిలభారత చతురంగం పోటీ లలో ఆంధ్రరాష్ట్ర జట్టు సభ్యులు.

1953-54, 55-56 లలో మద్రాసు లా కాలేజి, మద్రాసు యూనివర్శిటీ హాస్టల్ చెస్ ఛాంపియన్. కెథడ్రల్ (మద్రాసు) లోని స్పోర్ట్స్‌మన్ క్లబ్‌లో చెన్నరాష్ట్ర చతురంగ సంఘంవారు నిర్వహించిన గ్రేడెడ్ పోటీలలో తృతీయస్థానం పొందారు. ఈ పోటీలలోనే శ్రీ వెంకట్రామన్ అంతటి రాష్ట్ర ప్రముఖ ఆటగానితో ఆడి సమవుజ్జీ అయినారు. చెన్నరాష్ట్రం వై. ఎమ్. సి. ఏ. పోటీలలో పాల్గొని గణుతికెక్కారు.

ఆంధ్ర రాష్ట్రంలో ఇంకా క్రింది ఆటగాళ్లు ప్రముఖ స్థానం వహించి వున్నారు :— శ్రీ యుతులు ఆర్. సుబ్రహ్మణ్యం (1956 లో ఆంధ్రరాష్ట్ర చతురంగం పోటీలలో వీరు తృతీయ స్థానం వహించారు), కృష్ణమూర్తి, కుటుంబరావు, సీతాపతిరావు, (వీరు 1956 రాష్ట్రపోటీలలో చతుర్థ స్థానంవహించారు.) రంగారావు (వీరు 18 వ ఏటనే విద్యార్థిగా వున్నప్పుడే 1956 రాష్ట్రపోటీలలో ఆర్. సుబ్రహ్మణ్యం, కృష్ణమూర్తి గారలను ఓడించి ప్రత్యేక బహుమతి పొందారు.), శ్రీ తురగా వెంకట్రావు (బందరులో న్యాయవాది.)

* ఇంకా శ్రీయుతులు పి. తిలక్, ఎన్. ఎల్. ప్రసాద్, టి. సీతారామయ్య, జి. సూర్యనారాయణరావు గారలు స్టేట్ ప్లేయర్లుగా గణుతికెక్కారు.

హైదరాబాద్ రాష్ట్రంలో క్రింది ఆటగాళ్లు ప్రముఖ స్థానం వహించి వున్నారు :— మహమ్మద్ హాసన్. ఫరూక్ ఆలి, తురబ్ ఆలి. వీరు రాష్ట్ర ఆటగాళ్లు.

(శ్రీ) టి. ఎ. కృష్ణమాచారి :—భారతదేశంలో చతురంగ క్రీడను ఆధునిక పద్ధతిలో వ్యాప్తిచేసినవారు శ్రీ టి. ఏ. కృష్ణమాచారి గారు. వీరు న్యాయవాది. బాల్యంనుంచి చతురంగంలో ఆసక్తి చూపారు. ఈ ఆటకు సంబంధించిన సమస్త విషయములలో గొప్ప విద్వత్తు సంపాదించారు. 1951 లో మాస్కోలో బాట్వినిక్, బ్రాన్‌స్టీన్లకు ప్రపంచ ఛాంపియన్‌షిప్ పోటీ జరిగినప్పుడు ఆ పోటీకి ఆహ్వా

నించబడినారు. వీరు చెన్నరాష్ట్రం చతురంగసంఘం అధ్యక్షులుగాను, అఖిలభారత చతురంగసమాఖ్య ఉపాధ్యక్షులుగాను పనిచేసి వున్నారు. వీరు 1956 మే 27 వ తేదీన పరమపదించారు.

బొంబాయికి చెందిన శ్రీ వి. కృష్ణమాచారిగారు అంతర్జాతీయ టోర్నమెంటులో (1955) జడ్జిగా వ్యవహరించిన మొట్టమొదటి భారతీయుడు.

చెన్నరాష్ట్రంలో యింకా మాన్యువల్ ఆరన్ (25 సంవత్సరాల వయసు కల ఇంజనీరింగు విద్యార్థి), టి. ఆర్. జయరామ్, ఆర్. బాలకృష్ణన్ , వినాయకమూర్తి చతురంగములో ప్రముఖస్థానం వహించారు.

# అధ్యాయము 21



# ఇతర ఆటలు

## క్యారమ్స్

భారతదేశంలో క్యారమ్స్ ఆటలో ఆంధ్ర అగ్రస్థానం వహించడం ముదావహం.



విజయవాడ నివాసి పెమ్మాజీ అప్పారావుగారు 1956 లో రెండు సార్లు అఖిల భారత క్యారమ్స్ సింగిల్స్ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొన్నారు. (క్రింది చిత్రం)



నాగపూరులో ఆలిండియా క్యారమ్ ఫెడరేషన్ (మద్రాసు)వారు నిర్వహించిన అఖిలభారత పోటీలలోను, క్యారమ్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా (బొంబాయి) నిర్వహించిన భారత పోటీలలోను శ్రీ పి. అప్పారావుగారు ప్రథమస్థానం వహించారు.

విజయవాడ నివాసులు శ్రీ ఎమ్. శేషగిరిరావు, శ్రీ పి. కృష్ణగారలు 1956 అక్టోబరులో నాగపూరులో జరిగిన జాతీయ పోటీలలో డబుల్స్ ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకొని వున్నారు.

నాగపూరు జాతీయ పోటీలలో ఇంకా శ్రీయుతులు ఎమ్. దశరథరామయ్య (బిట్రగుంట), అబ్దుల్ రహమాన్ (తాడేపల్లి),

ఎ. వెంకటేశ్వరరావు (విజయవాడ), ఎస్. సత్యనారాయణ (గుంటూరు-మేనేజరు)గారలు పాల్గొని వున్నారు.

ఈ పోటీలలో సింగిల్స్‌లో శ్రీ ఎస్. వి. రామచంద్ర రావుగారు అనే మద్రాసు ఆటగాడు ద్వితీయ స్థానాన్ని వహించారు.

(శ్రీ) పి. ఎస్. ఆర్. ఆంజనేయులు :— 1941 — 43 ప్రాంతాల విజయవాడలో వెండి బంగారు పతకాలు సాధించిన



క్యారమ్స్ ఆటగాడు శ్రీ పాటిబండ్ల సీతా రామాంజనేయులు. వీరి స్వగ్రామం విజయ వాడ. వయస్సు షుమారు 34 సంవత్సరాలు. అఖిల భారత తంతి, తపాలాశాఖ పనివారల ప్రతినిధిగా వీరు 1954 లో జినీవాలో జరిగిన అంతర్జాతీయ కార్మికసంస్థ సమావేశంలో పాల్గొన్నారు. అదే సందర్భంలో బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ, పశ్చిమ జర్మనీలలో కూడా పర్యటించారు. ప్రస్తుత నివాసం ఢిల్లీ.

* ఇంకా శ్రీ వంకాయల సత్యం, శ్రీ ఎస్. సుదర్శనరావు, శ్రీ డి. కోటేశ్వరరావుగారలు ఆంధ్రలో క్యారమ్స్ ఆటలో గణుతికెక్కారు.

## సైక్లింగ్

ఆంధ్రరాష్ట్రంలో సైక్లింగ్ ఒక క్రీడగా ఇంకా అభివృద్ధ పరచ బడకపోవడం శోచనీయం.. పట్టణాలలో చెదురుగా అనధికార రీత్యా సైక్లింగ్ పోటీలు జరుగుతున్నవే గాని అధికారరీత్యా జరగడంలేదు. వైశ్య వ్యాయామ సంఘం (గుంటూరు) వంటి సంస్థలు తరచు సైక్లింగ్ పోటీలు జరుపుతున్నవి. వైశ్యసంఘం సైక్లింగ్ పోటీలలో పేరెన్నికగన్న ప్రముఖులు శ్రీయుతులు టి. రామారావుగుప్త, బి. సుబ్బారావు, ఎక్కల సాంబశివరావు, కె. కృష్ణరంగరావు ప్రభృతులు.

ఆంధ్రరాష్ట్రంలో దీర్ఘకాలపు సైకిల్ స్వారీ ఆదరించబడు తున్నది. ఆంధ్ర యువకులు దీనిలో అధికాసక్తి చూపుతున్నారు కూడా.

చోడవరం వాస్తవ్యుడు శ్రీ కామధేనువుల సత్యారావు అనే 16 సంవత్సరముల యువకుడు 1956 ఆగస్టులో యలమంచిలిలో 58 గంటలసేపు, తిరుపతి యువకుడు శ్రీ పి. గోవిందస్వామి 1956 జూలైలో తిరుపతిలో 52 గంటలసేపు, విజయవాడ వాస్తవ్యులు శ్రీ జి. అప్పిరెడ్డి అనే యువకుడు 1956 ఏప్రిల్‌లో సత్తెనపల్లి తాలూకా సిరిపురం గ్రామంలో 50 గంటలసేపు, గుంటూరు వాస్తవ్యులు శ్రీ మెరికపూడి రామారావు అనే యువకుడు, 1956 ఆగస్టులో సత్తెనపల్లిలో 36 గంటలసేపు, నగరిలో 1956 ఆగస్టులో అక్బర్ అనే యువకుడు 30 గంటలసేపు ఏకధాటిగా సైకిల్ స్వారి ప్రజ్ఞా ప్రదర్శనం చేసి మన్ననలు పొంది వున్నారు.

హైదరాబాద్ రాష్ట్రంలో సైకిల్ పోలో ఆట మిక్కిలి ప్రోత్స హించబడుతున్నది.

హైదరాబాద్ రాష్ట్రంలో సైక్లింగ్ క్రీడ చక్కగా ప్రోత్స హించబడుతున్నది. క్రమపద్ధతిలో రాష్ట్ర పోటీలు జరుపబడుతున్నవి. హైదరాబాద్ సైక్లింగ్ ప్రవీణులు జాతీయ పోటీలలో విడవక పాల్గొం టున్నారు. పురుషుల సీనియర్ల రాష్ట్ర ఛాంపియన్‌షిప్‌ను 1956లో శ్రీ కె. రామస్వామి, బాలుర ఛాంపియన్‌షిప్‌ను శ్రీ ఆర్. జగన్నాథం సాధించివున్నారు. సీనియర్లలో ఇంకా శ్రీ బాలయ్య, శ్రీ అబ్దుల్ ముత్తే, బాలురలో దశరథ్, బాబూరావు, సత్యనారాయణ్, మునీర్ అహమ్మద్ హైదరాబాదులో ప్రముఖస్థానం వహించి వున్నారు. రాష్ట్రంలో బాలికలకు, యువకులకు కూడా క్రమపద్ధతిని పోటీలు జరుగుతున్నవి. హైదరాబాదు రాష్ట్రంలోని గుల్బర్గా జిల్లా నివాసి శ్రీ యస్. ఎ. ఖయ్యూంజాన్‌బాజ్ (25 సంవత్సరాలు) అనే యువకుడు బొంబాయి, శ్రీనగర్, ఢిల్లీ, రాజస్థాన్, మంగుళూర్, కాలికట్, కొచ్చిన్, తిరువేంద్రం, కన్యాకుమారి ఆగ్రం, మద్రాసు, ఆంధ్ర మున్నగు ప్రాంతాలను సైకిల్‌పై చుట్టివచ్చారు. దాదాపు 17,000 మైళ్ళను ఈయన సైకిల్‌తో ప్రదక్షిణం చేశారు.

వేగంగా సైకిల్ త్రొక్కడంలో ప్రపంచం రికార్డు గంటకు 28.681 మైళ్ళు.

ఫ్రెంచి సైక్లింగ్ ఛాంపియన్ శ్రీ ఆంక్వేటిల్ 1956 జూలైలో గంటలో అంతదూరం త్రొక్కి ప్రపంచం రికార్డును నెలకొల్పాడు.

## ఈత

•ఆంధ్రరాష్ట్రంలో గజ ఈతగాళ్ళు వేల లక్షల సంఖ్యలో వున్నప్పటికీ జాతీయ అంతర్జాతీయ నియమ నిబంధనల ప్రకారం పోటీలు జరుగకపోవడంవల్ల ఆంధ్రరాష్ట్రం ఈతలో ఛాంపియన్లను సృష్టించి వుండలేదు. ఆంధ్రరాష్ట్రంలో మచ్చుకు ఒక్క సిమ్మింగ్ పూల్ (ఆధునిక ఈతకొలను) లేదు. వైశ్య వ్యాయామసంఘం (గుంటూరు) వంటి సంస్థలు దేశీయ పద్ధతులలో ఈతపోటీలను నిర్వహించడం ప్రశంసనీయమే. వీరి పోటీలలో శ్రీ వేముల శివన్నారాయణ (తెనాలి) శ్రీ బి. సుబ్బారావు గణుతికెక్కారు.

తెనాలి వాస్తవ్యుడు, ప్రస్తుతం సర్వీసస్ ప్రతినిధి అయిన శ్రీ షంషేర్ ఖాన్ ఈత పోటీలలో జాతీయ అంతర్జాతీయ ఖ్యాతి గడించి వుండడం ఆంధ్రులు గర్వించదగిన విషయం. వీరు 22 సంవత్సరముల యువకులు. 5 అడుగుల 5 అంగుళాల ఎత్తు వున్నారు. సర్వీసెస్ స్విమ్మింగ్ ఛాంపియన్‌షిప్ పోటీలలో అద్వితీయులుగా బహుమతి పొందారు. 200 మీటర్ల బారయీతలో వీరు భారతీయ రికార్డు హోల్డరు. వీరి రికార్డు 3 నిమిషాల 0.4 సెకండ్లు.

1956 లో బెంగుళూరులో జరిగిన జాతీయ పోటీలలో వీరే రికార్డును నెలకొల్పి వున్నారు. 1956 నవంబరులో మెల్బోర్న్‌లో జరిగిన ఒలింపిక్ క్రీడోత్సవంలో వీరు ఇండియా ప్రతినిధి.

హైదరాబాదు రాష్ట్రంలో రాష్ట్ర ఈత పోటీలు క్రమం విడవక జరుపబడుతున్నవి. జాతీయ పోటీలలో హైదరాబాద్ శ్రద్ధగా పాల్గొం

టున్నది. 1956 లో జాతీయ పోటీలలో పాల్గొన్న హైదరాబాద్ ప్రతినిధుల పేర్లివి :—

శ్రీయుతులు కె. నరసింగరావు, ఎన్. పాండురావు, వెంకట్రావు, కైజిమ్ హుస్సేన్, అస్గర్ ఆలీ, బడియుద్దీన్, నూరుద్దీన్, యస్. ఫెర్డినాండ్స్, యం. ఫెర్డినాండ్స్.

వీరి శిక్షకుడు శ్రీ సయ్యద్ మహమ్మద్ జీలాని.

వాటర్‌పోలో ఆటలో కూడా హైదరాబాదు భారతదేశంలో పేరు ప్రఖ్యాతులు గడించి వున్నది. హంగరీ ప్రపంచ ఒలింపిక్ ఛాంపియన్.

ఈత పోటీలలో ఆసియాలో జపాన్, ప్రపంచంలో అమెరికా, ఆస్ట్రేలియా, హంగరీలు ప్రముఖస్థానం వహించి వున్నవి.

## విచిత్ర బలప్రదర్శనం

తాడిచెట్లను చేతులతోను, ఇతర విధములుగాను ఊపి బలం చూపడంలో ఆంధ్రదేశ మంతటా శ్రీ అంపోలు అప్పలస్వామి నాయుడు గారు ప్రసిద్ధిగాంచారు. వీరు ఆంధ్రదేశంలో అనేకచోట్ల ఇట్టి బలప్రదర్శనలు చేసివున్నారు. ఈ "ఆంధ్రభీమ" ఇటీవలనే లంకల కోడేరు గ్రామంలో ఆరు గజముల ఎత్తుకల తాడిచెటును పెకలించివేశారు. వీరి స్వగ్రామం ధనుకోట (శ్రీకాకుళం తాలూకా).

## పోలో

వెంకటగిరి సంస్థానం, బొబ్బిలి, విజయనగరం మహారాజాలు పోలో ఆట ప్రచారానికి విశేషంగా కృషిచేసి వున్నారు.

వెంకటగిరి మహారాజ కుమార్ శ్రీ వెలుగోటి వెంకట రాజగోపాల కృష్ణయాచేంద్రగారు పోలో ఆటగానిగా భారత దేశమంతా ప్రఖ్యాతి

చెందారు. వీరు గొప్ప షికారి కూడా. వీరు 1956 జులై 16 వ తేదిన పరమపదించారు. అప్పటికి వీరి వయస్సు 54 సంవత్సరాలు.

ఇండియా పోలో జట్టు, ముఖ్యంగా సర్వీసెస్ జటు అనేక అంతర్జాతీయ పోటీలలో పాల్గొన్నది. పోలోలో ఇండియా ప్రపంచ ప్రమాణాన్ని అందుకొన్నది. జయపూర్ మహారాజా, కెప్టెన్ కిషన్ సింగ్, కన్వార్ బిజాయ్‌సింగ్ ఇండియాలో అగ్ర ఆటగాళ్ళు. ఇండియా, అర్జెంటీనా, అమెరికా, బ్రిటన్, మెక్సికో, స్పెయిన్, ఫ్రాన్సు ప్రపంచ పోలో పటంలో ప్రముఖస్థానం వహించి వున్నవి.

## ధనుర్విద్య

షూటింగ్ గుర్తించబడిన క్రీడ అయ్యేసరికి ధనుర్విద్యకు ప్రాముఖ్యం, ఆదరణ తగ్గిపోయింది. ఈనాటికీ బోయిలు, భిల్లులు, ఆదిమవాసులు, విలువిద్యలో అపార ప్రావీణ్యాన్ని ప్రదర్శిస్తున్నారు. వారి కది నేటికీ జీవికకు తోడ్పడుచున్నది.

విలువిద్యలో అఖిలభారత ఖ్యాతినొందిన ఆంధ్ర ప్రముఖుడు శ్రీ గుండవరపు అప్పారావుగారు. వీరు ముప్పాళ్ళ గ్రామస్థులు. 'కలియుగార్జున' బిరుదాంకితులు.

వీరు బాల్యంలో హిమాలయ పర్వతాలకు వెళ్ళి అక్కడ యోగ, వ్యాయామ, ధనుర్విద్యలను అభ్యసించి వచ్చినారు. ఒక వ్యక్తి దవడకు సున్నం పూసి దాదాపు ముప్ఫై గజాల దూరంనుంచి, సున్నంమాత్రం చెదరిపోయేటట్లుగా బాణం వెయ్యడం; ఒక వ్యక్తి రెండు కళ్ళకు రెండు వెదురుబద్దలను కోడిగుడ్డు ఆకారంలోకి వంపుగా పెట్టి దాదాపు ముప్ఫై గజాల దూరాన నిలబడి, ఆ వంపులగుండా బాణం పోయేటటు కొట్టడం; వడివిడమలలో ఏడు చిన్న మొక్కలను నాటి దూరంనుంచి ఏడింటిని ఒకే ఒక బాణంతో ఛేదించడం; నేలమీద పరుండి కాలితో విలు నెక్కుపెట్టి ఉత్తర దక్షిణ దిశలలోని రెండు మామిడిపండ్లను ఒకేసారి రెండు బాణాలతో కొట్టడంవంటి అద్భుత మానవాతీత విద్యలను ఈ ఆంధ్రవీరుడు ప్రదర్శించి వున్నారు.

# అనుబంధము – 1

## క్రీడా పారిభాషిక పదాల సూచన

‘అన్నప్రాసననాడే ఆవకాయ’ వలదనే ఉద్దేశంతో ఈ గ్రంథంలో ఆంగ్ల క్రీడా పదాలకు పెక్కుచోట్ల ఆ భాషాపదాలనే ఉపయోగించి వున్నాను. క్రమ క్రమేణా అమలులోనికి రావడానికి, ముఖ్యమైన పదాలకు క్రింది అనువాదాలు సూచిస్తున్నాను :

Running = ధావనం.

Running Race = ధావన స్పర్థ, పరుగుపోటీ.

Throwing = క్షేపణం, ఉపక్షేపణం, నిక్షేపణం, నిపాతనం, ప్రపాతనం, ప్రక్షేపణం.

Jumping = ప్లుతి, ప్లవనం, ఉత్పతనం, వల్గనం (లంఘనం).

High jump = ఉచ్చప్లుతి, ఉత్ప్లుతి.

Long jump = దీర్ఘప్లుతి.

Hurdles = కాష్ఠావరోధం.

Javelin throw = శూలప్రక్షేపణం, భల్లప్రక్షేపణం, శూల నిపాతనం, శూల ప్రపాతనం.

Hammer throw = ముద్గర ప్రపాతనం, అయోఘన ప్రపాతనం.

Shot put = సీసగోలపాతనం.

Discus throw = చక్రప్రక్షేపణం.

Pole vault = కాష్ఠసహాయ ప్లుతి, కాష్ఠాధారోత్పతనం.

Walking = గమనం, పరిక్రమణం.

Endurance = సహనం, స్థాయిత్వం, సహిష్ణుత.

Gymnasium = వ్యాయామభూమి, తాలింఖానా.

Drill = వ్యాయామాభ్యాసం, అభ్యాసం. దేహాభ్యాసం.

Mass drill = సమూహాభ్యాసం.

March past = అభిక్రమణం, క్రమణం, అభిముఖప్రయాణం.

Stadium = క్రీడాంగణం.

Arena = రంగభూమి, రంగాంగణం, మల్లభూమి, మల్లాంగణం.

Weight Lifting = భారోత్థాపనం, భారోద్వహనం, భారోద్ధరణం.

Indoor game = అభ్యంతరక్రీడ, గృహాభ్యంతరక్రీడ.

Outdoor game = బాహ్యక్రీడ, గృహబాహ్యక్రీడ.

Relay Race = విశ్రామదాయి స్పర్థ.

Athletes = వ్యాయామికులు, సన్నద్ధశరీరులు, వ్యాయామికలు, సన్నద్ధశరీరలు.

Athletics = వ్యాయామవిద్య.

Wrestling = మల్లయుద్ధం, బాహుయుద్ధం.

Wrestler = మల్లుడు, బాహుయోధుడు.

Diving = నిమజ్జనం, నిగాహనం.

Diver = నిమజ్జక, నిగాహక.

Rowing = నౌకాక్షేపణం, నౌకాచోదనం.

Canoeing = లఘునౌకాచోదనం, ఉడుపచోదనం.

Yachting = క్రీడానౌకాచోదనం, ప్రమోదనౌకాచోదనం.

Final = అంతిమ, చరమ.

Final test = అంతిమసమన్వీక్షా.

Semi final = అర్ధాంతిమ.

Quarter final = పాదాంతిమ.

Victory Stand = విజయవేదిక.

# అనుబంధము - 2

## 1957 సంఘటనలు

[ నవంబర్ 15-వ తేదీ వరకు చేర్చబడినవి ]

ఇంతవరకు సాగిన రచనలో 1956 వ సంవత్సరం వరకు జరిగిన పోటీల, తదితరములైన వాటి ఫలితాలు మాత్రమే ప్రస్తావించ వీలైనది. 1957 లో జరిగిన అతి ముఖ్యమైన సంఘటనల, పోటీల ఫలితాలను దిగువ ఉదహరిస్తున్నాను :

* మద్రాసులో ఫిబ్రవరిలో జరిగిన అఖిలభారత పోలీస్ ఎత్లెటిక్ పోటీలలో ఆంధ్రప్రదేశ్ ప్రతినిధి శ్రీ జోసఫ్ హామర్‌ను 138 అడుగుల నాలుగు అంగుళాల దూరం విసిరి ప్రథమస్థానం వహించారు; టామ్‌కర్ట్రిన్ అనే అమెరికన్ ప్రముఖుడు మే లో లాస్ ఏంజెల్స్‌లో 880 గజాల దూరాన్ని 1 నిమిషం 46.8 సెకండులలో పరుగిడి కొత్త ప్రపంచ ప్రమాణాన్ని స్థాపించారు; అల్బర్ట్ ఇవనోవ్ అనే రష్యను ప్రముఖుడు మే లో లెనిన్‌గ్రాడ్‌లో 30 వేల మీటర్ల దూరాన్ని (18 మైళ్ళ 1128 గజాలు) 1 గంట 33 నిమిషాల 33 సెకండులలో పరుగిడి కొత్త ప్రపంచం రికార్డు స్థాపించారు. శ్రీ ఊరిస్టెపనోవ్ 7 అడుగుల 1 అంగుళం ఎత్తు దూకి ప్రపంచం ప్రమాణాన్ని అధిగమించాడు; కౌలాలంపూర్‌లో సెప్టెంబరులో శ్రీ మెసాలవీరా కూరో అనే ఫీజీద్వీపవాసి 167 అడుగుల 1 అంగుళం దూరానికి డిస్కస్, సీసపుగోళాన్ని 48 అడుగుల 1 అంగుళం దూరానికి విసిరి ఆసియా గేమ్స్ రికార్డును అధిగమించారు; మద్రాసులో అక్టోబరులో సదరన్ రైల్వే ఇంటర్ రీజియనల్ ఎత్లెటిక్ పోటీలలో తిరుచీరపల్లి ప్రతినిధి వి. మార్టిన్ 100 మీటర్ల దూరాన్ని 10.5 సెకండులలో పరుగిడి కొత్త భారత ప్రమాణం నెలకొల్పారు. అక్టోబర్‌లో శ్రీ ఎర్రయ్య ఆంధ్ర స్పెషల్ ఆర్మ్‌డ్ పోలీస్ ఎత్లెటిక్ ఛాంపియన్ షిప్‌ను తిరిగి గెలుచుకొన్నారు.

* భారత నౌకాదళానికి చెందిన శ్రీ ఏ. ఎన్. ఘోష్ (లైట్ వెయిట్) మార్చిలో ఇంటర్ సర్వీసెస్ వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో స్నాచ్ రీతిలో $212\frac{1}{2}$ పౌనుల బరువు ఎత్తి కొత్త అఖిలభారత ప్రమాణం సాధించారు; చైనీస్ రిపబ్లిక్ బాంటమ్ వెయిట్ ప్రతినిధి శ్రీ చెంగ్ చింగ్ కై ఆగష్టులో మాస్కోలో ప్రపంచ యువజన క్రీడోత్సవంలో జెర్క్ రీతిలో $307\frac{1}{2}$ పౌనులు ఎత్తి నవప్రపంచ ప్రమాణం స్థాపించారు. ఈ పోటీలలోనే రష్యను లైట్ వెయిట్ ప్రతినిధి శ్రీ విక్టర్ బుషుయిన్ మూడు రీతులలోను కలిపి 385 కిలోగ్రాములు ఎత్తి పృథ్వికి కొత్త రికార్డు యిచ్చారు. నవంబర్‌లో టెహరాన్‌లో ప్రపంచ వెయిట్ లిఫ్టింగ్ పోటీలలో క్రింది ప్రపంచం రికార్డులు నెలకొల్పబడినవి: స్టోగోవ్ (రష్యా, బాంటమ్ వెయిట్) - మొత్తం $760\frac{1}{2}$ పౌనులు, మినేవ్ (రష్యా, ఫెదర్ వెయిట్) - ప్రెస్ - $257\frac{3}{4}$ పౌనులు, మొత్తం - 799 పౌనులు.

* బెంగాల్ ప్రతినిధి శ్రీ కమల్ భండారీ మార్చిలో బొంబాయిలో 1957 వ సంవత్సరపు "భారత్ శ్రీ" దేహసౌందర్య బిరుదును సాధించారు.

* 1957 లో ఫ్రాన్సులోని డొవిల్లిలో ఇండియా ప్రపంచం పోలో ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొన్నది. ఈ జట్టునాయకుడు జయపూర్ మహారాజు.

* మద్రాసులో ఫిబ్రవరిలో అఖిలభారత పోలీసు క్రీడోత్సవం సందర్భంగా జరిగిన కుస్తీ పోటీలలో బాంటమ్ వెయిట్ తరగతిలో శ్రీ శంకరలాల్, వెల్టర్ వెయిట్‌కు చెందిన శ్రీ శివాజి ప్రథమస్థానం, ఫ్లయివెయిట్ ప్రతినిధి శ్రీ అత్మరామ్, లైట్ వెయిట్ వస్తాదు శ్రీ సీతల్ సింగ్ ద్వితీయస్థానము సంపాదించారు. వీరు నలుగురు ఆంధ్రప్రదేశ్ వస్తాదులు.

* 1957 రంజీట్రోఫీని బొంబాయి గెలుచుకొన్నది. మార్చిలో న్యూఢిల్లీలో అంతిమ పోటీలో బొంబాయి సర్వీసెస్‌ను ఇన్నింగ్స్ 38 పరుగుల తేడాతో ఓడించింది; నవంబరునుంచి తొలిసారి రంజీట్రోఫీ

పోటీలు లీగ్ పద్ధతిని నిర్వహించబడుతున్నవి. అంతర్మండలం పోటీలు మాత్రం నాక్ ఔట్ పద్ధతిలో జరుగుతవి; జనవరిలో బరోడాలో ఢిల్లీ - బొంబాయి అంతర్విశ్వవిద్యాలయా ఫైనల్ క్రికెట్ పోటీ ఎనిమిది రోజులు సాగిన పిమ్మట బొంబాయి గెలుపొందింది. ఎనిమిది రోజులు క్రికెట్ పోటీ జరగడమనేది క్రికెట్ చరిత్రలో బహుశా ఇదే మొదటిసారి.

* జనవరిలో జాతీయ లాన్ టెన్నిస్ ఛాంపియన్ షిప్‌ను శ్రీ రామనాథన్ కృష్ణన్, స్త్రీల ఛాంపియన్ షిప్‌ను శ్రీమతి కె. సింగ్ గెలుచుకొన్నారు; ఫిబ్రవరిలో కొలంబోలో ఆసియా టెన్నిస్ ఛాంపియన్ షిప్‌ను శ్రీ జారోస్లావ్ డ్రాబ్నీ, స్త్రీల ఛాంపియన్ షిప్‌ను తిరిగి శ్రీమతి ఆలి గిబ్సన్ గెలుచుకొన్నారు; వింబుల్డన్ పురుషుల ఛాంపియన్ షిప్‌ను శ్రీ ఎల్. హోడ్ (ఆస్ట్రేలియా) సాధించగా స్త్రీల ఛాంపియన్ షిప్‌ను నీగ్రో కన్య గిబ్సన్ గెలుచుకొన్నది; మొట్టమొదటి సారి డేవిస్ కప్ పోటీలు ఇండియాలో (మద్రాసులో) మార్చిలో జరిగినవి. అప్పుడు మలయాను ఓడించిన ఇండియా రెండవ రౌండ్ లో మనిలాలో ఫిలిప్పీన్స్‌చే ఓడించబడింది.

* ప్రపంచ టేబుల్ టెన్నిస్ పోటీలలో స్వేద్లింగ్, కార్బిలన్ కప్పులు రెండింటిని జపాన్ గెలుచుకొన్నది. 21 సంవత్సరాల వయసు కల శ్రీ టనాకా పురుషుల ఛాంపియన్ షిప్‌ను, శ్రీమతి ఎఫ్. ఆగుచీ స్త్రీల ఛాంపియన్ షిప్‌ను సాధించారు.

* జాతీయ హాకీ ఛాంపియన్ షిప్‌ను ఏప్రిల్ లో ఇండియన్ రైల్వేస్ సాధించింది. అంతిమ పోటీలో ఈ జట్టు బొంబాయిని 2 - 1 గోలులతో ఓడించింది. జాతీయ స్త్రీల హాకీ ఛాంపియన్ షిప్‌ను బొంబాయి సాధించింది.

* మద్రాసు ఆంధ్ర ఆటగాడు శ్రీ టి. వాసుదేవ గుప్త ఆగష్టులో మైసూర్ రాష్ట్ర బిలియార్డ్స్, స్నూకర్ ఛాంపియన్ షిప్‌ను సాధించారు.

* అక్టోబర్ లో ఆంధ్రరాష్ట్ర ఫుట్ బాల్ ఛాంపియన్ షిప్‌ను గెలుచుకొన్న విశాఖపట్నం జట్టు పోలార్ స్టార్ ఎథ్లెటిక్ క్లబ్బు పెట్టెం

బర్, అక్టోబర్‌లలో మద్రాసులో ప్రెసిడెన్సీ, ఎమ్. యు. సి. పోటీలలో పాల్గొని గణుతి కెక్కింది. ఈ జట్టులో శ్రీయుతులు కాంతారావు, కుప్పుస్వామి (కెప్టెన్), కె. వి. రమణమూర్తి (అధికారి), అప్పలరాజు, మొహిద్దీన్, తాతారావు, శ్రీరామమూర్తి, కాంతయ్య, దుర్గారావు, పోతారెడ్డి, జగన్నాధరావు, గంగాధర్ గారలు కలరు.

* మే లో కలకత్తాలో సర్వీసెస్, ఉత్తర ప్రదేశ్‌ను 15-8, 4-15, 15-12, 10-15, 15-12 పాయింట్లలో ఓడించి జాతీయ వాలీ బాల్ ఛాంపియన్‌షిప్ సాధించింది.

* అక్టోబర్‌లో బొంబాయిలో ఒక ఎగ్జిబిషన్ మటీల్ బాడ్మింటన్ పోటీలో భారతీయ ఆటగాడు శ్రీ నందూనటేకర్ ప్రపంచం ఛాంపియన్ శ్రీ ఎడ్డీచుంగ్‌పై 21-9 పాయింట్లతో విజయమొందారు.

* 1957 ప్రపంచ చతురంగం ఛాంపియన్ షిప్‌ను రష్యను ప్రముఖుడు శ్రీ స్మయిస్లోవ్ ఏప్రిల్ ప్రాంతాల గెలుచుకొన్నారు. వీరు, శ్రీ బొట్వినిక్ అనే మరొక రష్యను ప్రముఖుని (వీరు అప్పటివరకు ప్రపంచం ఛాంపియన్) ఓడించివేశారు. నవంబరులో జాతీయ చతురంగం పోటీలలో శ్రీ రామదాసుగుప్త (యు. పి.), శ్రీ మాన్యువల్ ఆరన్ (మద్రాసు) శ్రీ జి. ఎస్. దీక్షిత్ (ఆంధ్ర) గారలు వరుసగా ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలు వహించారు.

* వెయిట్ లిఫ్టింగ్‌లో మరికొన్ని ప్రపంచం రికార్డులు, అవి సాధించబడిన తేదీలు: నవంబర్ 11 - శ్రీ ట్రూఫింలో మకిన్ (లైట్ హెవివెయిట్) మొత్తం - 991$\frac{3}{4}$ పౌనులు; నవంబర్ 12 - ఆర్కాడి వొరొబ్యేవ్ (మిడిల్ హెవి) మొత్తం - 1036 పౌనులు; నవంబర్ 18 - రఫేల్ చిమిష్కియిన్ (ఫెదర్) స్నాచ్ - 243$\frac{1}{2}$, జెర్క్ - 316$\frac{1}{4}$ పౌనులు, వీరందరూ రష్యనులే. "1957 ప్రపంచ శ్రీ" - టామీ కోనో (అమెరికా), "1957 ఆసియా శ్రీ" - సిరన్ (పర్షియా).

* నవంబర్ 15 - శ్రీ అజిత్ సింగ్ - హైజంప్ - ఆరు అడుగుల విద్యుద్ఘాతీక అంగుళం (కొత్త భారత ప్రమాణం).